# నివేదన

సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్గీతామృతం దదౌ ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ॥

శ్రీమద్భగవద్గీత వేదకాననమును సౌరభామోదితమొనర్చే సిద్ధాంత - కుసుమాల సంగ్రథితమైన వనమాల; రసప్లుతమై, ఛందో మాధుర్యంతో అపూర్వమై దీపిల్లే ఆధ్యాత్మిక కావ్యగానం. ఏతత్తుల్యమైన గ్రంథం విశ్వ సాహిత్యంలో మృగ్యం. ఆచంద్రతారార్కం అమ్లానమై కాలచక్రధరుని గళసీమలో ఈ మాలా-మంత్రం అలంకరించే ఉండగలదు. ప్రస్థాన త్రయాంతర్గతమైన స్మృతి ప్రస్థానం అవడం వల్ల, భారతీయులకు ఇది పరమపూజ్యమూ, ప్రమాణమూ అవుతోంది. బృందావనంలో వేణుగానం కేవలం గోపికలకే ఆహ్వాన సంకేతం; కాని గీతానాదం అమృతమయ స్వరాలతో జగద్వాసులనందరినీ సర్వస్వాన్నీ త్యజించి, భగవచ్చరణ పద్మాలను ఆశ్రయించండని ఉద్బోధిస్తోంది. సాధకావస్థను, సిద్ధస్థితిని గీత అత్యంత విశదంగా అభివర్ణిస్తోంది. కనుక, మర్త్యసీమలను అతిక్రమించి భూమాసంప్రసాదాన్ని పొందగోరేవారికి ఇది అత్యంత ఉపాదేయము. ఈ అనువాదాన్ని కూర్చి సౌభాగ్యాన్ని బడసి నేనూ, నా లేఖినీ ధన్యులమైయ్యాము.

ఇందు నవీన భాష్య ప్రవచనాడంబరంలేదు. మూల శ్లోకం, ప్రతిపదార్థం, ధారాళమైన అనువాదం, శ్రీధరీయ టీకానువాదం, అనువాదాన్ని విశదపరిచే పాద టీకలు (foot notes), సానువాద గీతా పారక్రమ-మాహాత్మ్యములు, టీకా తాత్పర్యయుత గీతా ధ్యానం, వేదాంత సూత్ర విషయకమైన గీతావాక్యాల సూచిక, శ్రుతి మూలమైన గీతాశ్లోక నిర్దేశం, తదితర శాస్త్ర వాక్యనిర్దేశం, విస్తృత విషయ సూచిక, దర్శన శాస్త్రాంశాలను విశదీకరించే 'గీతాతత్త్వ'మనే భూమిక, సంగ్రహ శబ్దానుక్రమణికలు ప్రదత్తములైయ్యాయి. పండితులకు సాధకులకు మాత్రమే కాక, కళాశాల పాఠశాలలో చదువుకునే విద్యార్థి బృందానికి కూడా ఉపయోగకరమైయ్యే విధంగా యథాసాధ్యం ప్రయత్నమొనర్చాము.

ప్రస్తుతం మనకు లభించే భాష్య టీకా వ్యాఖ్యానాలలో శ్రీశంకరాచార్యుల వారి గీతాభాష్యమే ప్రాచీనతమం. ప్రతి పదార్థం ప్రాయికంగా శాంకరభాష్యానుసారం కూర్చబడింది. క్రమానువాదం ఇస్తూ సాధక శిరోమణి, శ్రీమద్భాగవత విష్ణుపురాణ

టీకాకారుడూ అయిన శ్రీధరస్వామి వారి సుబోధినీ వ్యాఖ్యాంశాలు తృతీయ బంధనిలో, చేర్చబడ్డాయి. శ్లోక భావాన్ని హృదయంగమం చేయడానికి ఇది విశేషంగా తోడ్పడ గలదు. ప్రత్యేకాధ్యాయారంభంలోనూ, శేషంలోనూ ఆయా అధ్యాయాల సంగ్రహార్థాన్ని సూచించే శ్లోకాలు అనువాద సహితంగా చేర్చబడ్డాయి; ఇవి కూడా శ్రీధర కృతాలే. అన్య ఆచార్యుల వ్యాఖ్యానం గ్రహింపబడిన తావుల వారి నామాలు ఉల్లిఖితములైయ్యాయి.

గీతాశ్లోకాలు బహుళంగా పరస్పరం అర్థసాదృశ్యంతో ఒప్పుతున్నాయి. దీనిని ప్రదర్శించడానికి సమభావాత్మకములైన శ్లోకాల సంఖ్య తాత్పర్యంతో పాటుగానో, లేక పాదటీకలోనో పేర్కొనబడింది. గీతాతత్త్వాన్ని హృత్కర్ణ రసాయన మొనర్చుకో గోరితే గీతకు జన్మ భూమికలు అనదగిన ఉపనిషత్తులకు గీతకు గల సంబంధాన్ని దిఙ్మాత్రంగానైన గ్రహించాలి. ఇలాగే గీతా ప్రామాణ్యాన్ని అంగీకరించే వేదాంతసూత్రాలను కూడా నరయవలెను. ఏతత్సంబంధాన్ని సూచించడానికి ఉపనిషద్వాక్యాలు వేదాంత సూత్రాలు కూడా చేర్చబడ్డాయి. తుల్యార్థకాలైన తదితర శాస్త్ర వాక్యాలు కూడా పేర్కొనబడ్డాయి. గ్రంథవిస్తరభీతితో సర్వత్రా మూలాన్ని తాత్పర్యాలనూ ఒసగజాలకపోయాము. అయినా, ఈ సాదృశ్యమును గమనింప పాఠకుల దృష్టిని ఆకర్షిస్తున్నాము. ఈ పరిశీలన గీతార్థాన్ని విస్పష్టమొనర్చగలదు.

మూలంలో ఊహ్యాంశాలు అన్వయమధ్యంలో తృతీయకుండలిలో వ్రాయబడ్డాయి. సుబోధకంగా ఉండడానికి కొన్ని చోట్ల, అన్వయంలోని సంస్కృత శబ్దం యొక్క విభక్త్యర్థాన్ని పరివర్తితం చేసి ప్రథమ కుండలిలో అన్వయార్థాన్ని వరుసగా చదివితే సంపూర్ణ వాక్యమయ్యే విధంగా చేశాము. శైలీసౌష్ఠవంపై దృష్టిని ఉంచక, అనువాదం యథాసంభవంగా సరళము, మూలానుగతము అయినట్లొనర్చబడింది. సంస్కృతం తెలియని వారికి ఇది మూలాన్ని యథాతథంగా గ్రహించడానికి తోడ్పడ గలదు. అనువాదాన్ని సువ్యక్తమొనర్చడానికి గాను, శాస్త్ర గ్రంథాల నుండి పెక్కు విషయాలను సంగ్రహించి పాదటీకాలో చేర్చాము. మూలాన్ని, అన్వయాన్ని, పాదటీకను చదువని వారు కేవలం అనువాదాన్ని చదివినా గీతార్థాన్ని తెలుసుకోగలరని ఆశిస్తున్నాం.

పారాయణకు వీలుగా పెద్దపెద్ద అక్షరాలలో, మూలం ముద్రింపబడింది. గీత శ్లోక సంఖ్య, ఎవరెన్ని శ్లోకాల నుడివినదీ వేరుగా తెల్పబడింది. ఛందో విషయాలు కూడా నిరూపించబడ్డాయి. ముఖ్య పాఠాంతరాలు చూపబడ్డాయి.

అత్యంత విస్తృతమూ సంగ్రహమూ కాని మధ్య పంథనవలంబించి, గీతాంగాలను ప్రధాన దర్శన - తత్త్వాలను సూచింప ప్రయత్నించాము. ఇక ఈ గీతా సంస్కరణం వల్ల ఏ ఒక్కరికైనా యథార్థోపకృతి చేకూరితే, మా శ్రమ సఫలమని తలుస్తాము.

పరిశేషవక్తవ్యం : ముద్రితమైన సంస్కృత భాష్య టీకావ్యాఖ్యానాలన్నీ ఈ సంస్కరణను కూర్చడానికి చాలా తోడ్పడ్డాయి. మాచే వంగభాషలో వెలువరింపబడిన గీతా గ్రంథాన్నే ముఖ్యంగా ఈ ఆంధ్ర సంస్కరణ అనుసరిస్తోంది.

'యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః,
బ్రహ్మ రాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయచారణాయ'

ఇట్లు
**అనువాదకుడు**



# శ్రీమద్ స్వామి రామకృష్ణానంద వారి కరకమలాలకు ఈ గీతా గ్రంథం అర్పితం

స్వామీ!

నీవు ఆ నాడు శ్రీరామకృష్ణుల చిత్రాన్ని, వరాహనగర జీర్ణప్రాసాదంలో ఉంచి పూజాదికాన్ని ఆరంభించి వుండనిచో, నేడు జగత్తులో శ్రీరామకృష్ణ మఠాలు వెలిసేవి కావు.

శ్రీ గురుదేవునిచే ప్రజ్జ్వలితమైన త్యాగహోమానలమున నీ ప్రాణాలనే పూర్ణాహుతి ఒనర్చావు. తత్ఫలితంగా నేడు దక్షిణ భారతంలో శ్రీరామకృష్ణ మఠాలు వెలసి, సంసారాధ్వశ్ర మార్తులకు ఉపవనాల వలే విశ్రాంతిస్థానాలు అవుతున్నాయి. సంఘ కేంద్రాలు బహువిధాలుగా నర-నారాయణ సేవ ఒనర్చుతున్నాయి.

నీకు నమోవాకాలు !

ఈ గ్రంథ కుసుమాన్ని వాత్సల్యంతో గ్రహించి నీ ఆశీర్వాదాలను మాపై అభివర్షించు. నీ అడుగుజాడలలో నడవగలిగే శక్తిని మాకు అనుగ్రహించు - ఇదే ప్రార్థన.

- అనువాదకుడు



# అభిప్రాయాలు

దర్శనాలను ఉపనిషత్తులను పొందుపరుస్తూ విశేష వివరణలను ఇస్తూన్న ఈ ముద్రణ కడుసుందరమై విశేషార్థమందరమై ఉన్నది. – ఆంధ్రపత్రిక

ఆమూలాగ్రంగా ఒక నూతన ఫక్కిలో నడచింది. –భారతి

....విద్యార్థులకు ఉపయుక్తమే – సందేహం లేదు. – కృష్ణాపత్రిక

ధారాళమైన ఈ అనువాదం స్వతంత్రమైన రచన వలే అతి చురుకుగా నడుస్తూ, పాఠకుని, తరువాత శ్లోకానువాదం, తరువాత శ్లోకానువాదం అంటూ వేగిరపరుస్తుంది.
– ప్రజాబంధు

రచన గ్రాంథికమే అయినప్పటికీ, ఇంతటి ధారాశుద్ధితో తెలుగు గద్యను రచించగల వ్యక్తులు నేడు చాలా అరుదు. – ప్రజా మిత్ర

అనువాదశైలి మృదుమధురమై, పండిత పామర రంజకమై, సర్వార్థసాధకాలైన గీతామహోపదేశాలను బాలబాలికలకు కూడా సుగ్రాహ్యాలుగా చేస్తోంది.
– ఆంధ్రప్రభ

గీతాసర్వస్వం అనదగిన దీనిని ఆంధ్రులెల్లరు పఠించి జీవిత వికాసాన్ని పొందుతారు గాక! – భక్తి ప్రబోధిని

పూర్వ సంచితాభిప్రాయ ముక్తులై గీతను గీతనిమిత్తమే పఠించగోరే వారికి ఈ సంస్కరణం తోడ్పడగలదు. – హిందూ

గీతార్థాన్ని చక్కగా తెలియజెప్పడానికి ఆంధ్రంలో ముద్రితమైన ఈ గ్రంథం విశేషంగా ప్రయత్నిస్తోంది. - తిరుపతి ఓరియంటల్ జర్నల్

గీతమీద పూర్వులు వ్రాసినవన్నీ క్రోడీకరించి కూర్చిన ఈ టిప్పణి పరమోపకారమనడం స్వభావోక్తి. - శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

దీని పాదటీకలన్నీ అమృత బిందువులు. - శతావధాని వేలూరి శివరామశాస్త్రి

ఈ గ్రంథానికి సంతరింపబడిన పీఠిక శిరోరత్నంగా ఉంది.
- కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

గీతార్థసారాన్ని ఎఱుగగోరే వారికి లాభకారి. - వేటూరి ప్రభాకరశాస్త్రి

గీతాచార్య సందేశాన్ని లోకానికి అందజేయడానికి ఈ రచన సమర్థం.
- జమ్మలమడక మాధవరామశర్మ

మూలాన్ని సంస్కృత భాష్యాలను చక్కగా గ్రహించి వ్రాసి ఉన్నారు. ఇటువంటి అనువాదాలు చాలా దుర్లభం. - స్వామి చిద్ఘనానేంద్ర సరస్వతీ



# విషయ సూచిక



16; బ్రహ్మకు దివారాత్రాలు : సృష్టి ప్రళయాలు 17-19; పరమాత్మయే పరమగతి 20-21; దేవయాన పితృయానాలు - మొదటిది మోక్షాన్ని, రెండవది పునర్జన్మను ఇస్తాయి 22-27.

## 9. రాజ యోగం (పు. 210-231)

ఇది సుఖసాధ్యమైన శ్రేష్ఠయోగం 1-2; శ్రద్ధారహితుడు అనధికారి 3; భగవంతుని యోగైశ్వర్యం 4-6; సృష్టి సంహార కార్యాలలో కూడా ఈశ్వరుడు నిర్లిప్తుడు 7-10; అవతార విశ్వాసం కలగడం కష్టం 11; భక్తుల ప్రకృతి దైవి, ఇతరులది ఆసురి 12-13; సర్వం సర్వత్రా ఈశ్వరుడే 14-19; యజ్ఞాదుల ఫలాలు అనిత్యాలు 20-21; ఆశ్రిత భక్తుల యోగ క్షేమాలను భగవంతుడే వహిస్తాడు 22; అన్యదేవతా పూజ అజ్ఞానపూర్వకంగా ఈశ్వరారాధన 23-25; భగవంతుడు భక్తుల భక్తి - అర్ఘ్యాన్ని పరిగ్రహిస్తాడు 26-29; భక్తి వల్లే మహాపాపాత్ములు కూడా ముక్తి పొందుతారు 30-34.

## 10. విభూతి యోగం (పు. 232-256)

ఈశ్వరుని అనాదిస్వరూప జ్ఞానం ముక్తిదాయకం 1-3; భగవంతుని విభూతి, యోగం 4-7; భక్తి వల్ల అజ్ఞానం తొలగి, జ్ఞానం కలుగుతుంది 8-11; విభూతులను, యోగాన్ని వినడానికి అర్జునుడు ఉత్సాహం చూపించడం 12-18; భగవద్విభూతి సంక్షేపవర్ణన 19-40; విశ్వమంతా ఈశ్వరుని ఏకాంశంతో ఆవృతం 41-42.

## 11. విశ్వ రూపదర్శన యోగం (పు. 257-293)

విశ్వరూప దర్శనార్థం అర్జునుని ప్రార్థన 1-4; అర్జునుడు దివ్య చక్షువులను పొందడం 5-8; సంజయ కృత విశ్వరూపవర్ణనం 9-14; విశ్వరూప దర్శనం 15-31; భగవంతుడే సంహార కర్త అయిన కాలుడు 32; నిమిత్తమాత్రంగా ఉండి యుద్ధం చేయమని అర్జునునికి ఉపదేశించడం 33-34; అర్జునుని స్తవం, చతుర్భుజ స్వరూపదర్శన ప్రార్థన 35-46; సౌమ్య రూప గ్రహణం, విశ్వరూపదర్శనం అత్యంత దుర్లభం 47-53; అనన్య భక్తియే ఏతద్దర్శనోపాయం - భక్తి పథంలో భగవత్ప్రాప్తి 54-55.

## 12. భక్తి యోగం (పు. 294-305)

అర్జునుని ప్రశ్న - సగుణనిర్గుణోపాసనలలో ఏది శ్రేష్ఠం 1; భగవంతుని ప్రత్యుత్తరం - సగుణోపాసనే శ్రేష్ఠం, దేహాభిమానికి నిర్గుణోపాసన అసాధ్యం 2-8; భక్తి, నిష్కామ కర్మ 9-12; భక్తుని లక్షణాలు 13-20.

## 13. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగం (పు. 306-330)

క్షేత్రక్షేత్రజ్ఞవర్ణన 1-6; జ్ఞానసాధనాలు 7-11; బ్రహ్మజ్ఞాన లక్షణం 12-17; భక్తి వల్లే ఇది లభిస్తుంది 18; ప్రకృతి పురుష వివేకం, దీని వల్ల పునర్జన్మ తొలగుతుంది 19-23;

# ఉదాహృత గ్రంథ సూచి

**(సాంకేతిక వివరణ సహితము)**

అత్రి. - అత్రిస్మృతిః
అశ్వ - అశ్వమేధ పర్వ
ఆది. - ఆది పర్వ
ఈశ. ఉ. - ఈశోపనిషత్
ఐ.బ్రా. - ఐతరేయ బ్రాహ్మణమ్
ఋక్. సం. - ఋగ్వేద సంహితా
కఠ. ఉ. - కఠోపనిషత్
కర్ణ. - కర్ణ పర్వ
కుమార. - కుమార సంభవమ్
గీ. - శ్రీమద్భగవద్గీతా
గౌ.కా. - గౌడపాద కారికా
గౌ.ధ. - గౌతమ ధర్మసూత్రమ్
ఛాం. ఉ. - ఛాందోగ్యోపనిషత్
తై. ఉ. - తైత్తిరీయోపనిషత్
తై. సం. - తైత్తిరీయ సంహితాస
ధర్మ. - ధర్మ వైభవ ఖండమ్
దేవీ. - దేవీసప్తశతి
నాగర. - నాగర ఖండన
నారద. - నారద స్మృతి
నై.సి. - నైష్కర్మ్య సిద్ధిః
ప్ర.గీ. - ప్రసన్న గీతా
బృహ. ఉ. - బృహదారణ్యకోపనిషత్
బృహ. ఉ.మ. -
బృహదారణ్యకోపనిషత్, మధ్యందినపాఠః
బృహ. పు. - బృహద్ధర్మపురాణమ్
బ్ర బిం. ఉ. - బ్రహ్మ బిందూపనిషత్
భ.ర. సి. - భక్తి రసామృత సింధుః
భా. - శ్రీమద్భాగవతమ్
భార. - మహాభారతమ్
మను. - మను స్మృతి
మై.ఉ. - మైత్రాయిణీ -ఉపనిషత్
ముం. ఉ. - ముండకోపనిషత్
మత్స్య. - మత్స్య పురాణమ్
మహా. నా. - మహానారాయణోపనిషత్
యో. వా. - యోగవాసిష్ఠమ్
యో. సూ. - యోగసూత్రమ్
రామా. - రామాయణమ్
రఘు. - రఘువంశమ్
వన. - వన పర్వ
వాయు. - వాయు పురాణమ్
విరాట - విరాట పర్వమ్
వి.పు. - విష్ణు పురాణమ్
వే. సూ. - వేదాంత సూత్రమ్
వై.సూ. - వైశేషిక సూత్రమ్
శాంతి. - శాంతిపర్వ
శివ.పు. - శివపురాణమ్
శ్వే. ఉ. - శ్వేతాశ్వతరోపనిషత్
సన. - సనత్సుజాతీయమ్
సామ. సం. - సామవేద సంహితా
సాం. కా. - సాంఖ్య కారికా

స్కం. పు. - స్కాంద పురాణమ్
హరి. - హరివంశమ్
హరి. వి. - హరిభక్తి విలాసమ్
ఇమిటేషన్ ఆఫ్ క్రైస్టు
కూర్మ పురాణమ్
దృగ్ దృశ్యవివేకః
ధర్మపదమ్
బార్హస్పత్య సూత్రమ్
బోధసారః
భక్తి రసాయనమ్
భారతి (తెలుగు మాసపత్రిక)
భాష్యోత్కర్ష దీపికా
వ్యాస స్మృతిః
శివ సంహితా
శుద్ధి తత్త్వమ్

# ఉదాహృత గ్రంథకర్తలు

శ్రీశంకరులు
శ్రీరామానుజులు
శ్రీమధ్వాచార్యులు
శ్రీధరస్వామి
శ్రీమధుసూదన సరస్వతి
శ్రీబ్రహ్మానంద గిరి
శ్రీరఘునందనుడు
మేధాతిథి
శ్రీరామకృష్ణ-వివేకానందులు

# గీతాతత్త్వం

అనుభవజ్ఞానరహితమైన శాస్త్ర పఠనం శుకపికాలాప తుల్యం. శాస్త్రం పఠితలకు వస్తు విషయమైన పరోక్ష జ్ఞానాన్ని, సాధనావిధానాన్ని ప్రసాదిస్తోంది. నిర్దిష్ట విధానాన్ని అనుసరించి, శాస్త్రజ్ఞానాన్ని అనుభవ వేద్యం చేసుకోనివాడు 'వట్టిపోయిన ఆవును మేపే వాడ'ని భగవద్వచనం.[1] కనుక, ఈ విషయాన్నే దృష్టిలో ఉంచుకుని, పాండిత్య లోభాన్ని త్యజించి, శాస్త్ర విషయాన్ని మననం చేయాలి. ఇలా అనడం వల్ల 'ధర్మ రాజ్యం' నుండి యుక్తి, తర్కాలు బహిష్కృతాలని తలచరాదు. ఆప్తవాక్యం, సదాచారం, యుక్తి – ఈ మూడింటికీ ఐకమత్యం ఘటిల్లిన సిద్ధాంతమే ధర్మ సిద్ధాంతమని మహాభారతకారుడు అంటున్నాడు. శాస్త్రానుకూలమైన తర్కం శాస్త్రవిషయాలను గ్రహించడానికి సహాయమవుతుందని శ్రీ శంకరుల అభిప్రాయం కూడా.

ఏ గోపీ మోహనుడు బృందావనంలో గోపికలకు ప్రేమభక్తిని ప్రబోధించి, వారి మనో–నదులను సమాధి–సాగరంలో నామరూపాలను వీడి ఏకీకృతమైయ్యేటట్లు చేశాడో,[2] ఏ జ్ఞానగురుడు ఉద్ధవునికి సర్వ త్యాగోపదేశం చేసాడో, ఆ పార్థసారథియే అర్జునుణ్ణి కర్తవ్య కర్మానుష్ఠాన నిష్ఠునిగా చేశాడు.

## గీత ఏలా ఉపదేశించబడింది?

గీతోపదేశానంతరం శ్రీ భగవానుడు అర్జునుణ్ణి అడిగిన ప్రశ్న : 'కచ్చిదజ్ఞాన – సమ్మోహః ప్రణష్టస్తే?' నీ అజ్ఞాన–సమ్మోహం తొలగినదా? అని. ఈ ప్రశ్న వల్లే ఏ ఉద్దేశ్యంతో గీతోపదేశం ఆరంభించబడిందో, తేటతెల్లమవుతోంది. అజ్ఞాన –

---

1. శబ్దబ్రహ్మణి నిష్ణాతో న నిష్ణాయాత్పరే యది ।
శ్రమస్తస్య శ్రమఫలో హి హ్యా ధేనుమివ రక్షతః ॥ – శ్రీమద్భాగవతమ్. 11-11-18.

2. 'తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినామ్'
'న నిర్విణ్ణః నాతిసక్తః భక్తియోగః అస్యసిద్ధిదః'
'నిర్విణ్ణానాం జ్ఞానయోగః న్యాసి నామిహ కర్మసు'.
కర్మల యందు ఆసక్తి గలవారికి కర్మయోగమూ, అంతగా ఆసక్తి, వైరాగ్యం లేనివారికి భక్తియోగమూ, వైరాగ్య యుక్తులకు జ్ఞానయోగమూ సిద్ధ ప్రదాలు. – శ్రీమద్భాగవతమ్. 11.10.7.8

సమ్మోహం అంటే అవివేకాన్ని నిరాకరించడమే శ్రీకృష్ణుని అభిప్రాయం. శ్రోత పలికిన ప్రత్యుత్తరం కూడా ఈ విషయాన్నే దృఢపరుస్తోంది. అర్జునుని ప్రత్యుత్తరం : 'నష్టః మోహః' - నా మోహం తొలగింది. ఏతత్ఫలంగా 'స్మృతిర్లబ్ధా' నాకు ఆత్మ విషయమైన స్మృతి లభించింది. - ఆత్మవిస్మృతియే సర్వానర్థాలకు మూలమై, శోకమోహాలకు హేతువవుతోంది.

అర్జునుణ్ణి యుద్ధ ప్రవణునిగా చేసే నిమిత్తం గీతోపదేశం ఉపక్రమింపబడ లేదు. అర్జునుడు యుద్ధం చేయడానికే కదా రణభూమికి వచ్చి ఉన్నాడు. శోకమోహాకులితుడై కర్తవ్య భ్రష్టుడయ్యే సందర్భంలో, కర్తవ్యనిష్ఠను భగవంతుడు ఉపదేశించాడు. ఏలయన, కర్మ నైష్కర్మ్యాంగం. కర్మనియతుడైన వానికి నైష్కర్మ్యం స్వయంగానే సిద్ధిస్తుంది. 'యోగ యుక్తః మునిః బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి'. సామాన్యాధికారులకు నైష్కర్మవిషయాన్ని అవలంబించడం కష్టకరమవడం వల్ల 'న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోశ్నుతే' అని చెప్పబడింది. మరొక విశేషం ఏమంటే : 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం... ద్వివిధా నిష్ఠా'. అర్జునుడు రాజ్యాన్ని అపేక్షించే క్షత్రియుడు, యుద్ధ నియుక్తుడు. ఈ పరిస్థితులలో కర్మోపదేశమే సముచితం. ధర్మ శాస్త్రం కూడా 'సంగ్రామే ష్వనివర్తిత్వం ప్రజానాంచైవ పాలనం' అని క్షత్రియుని కర్తవ్యాన్ని ఘోషిస్తోంది. అర్జునుణ్ణి నిమిత్తంగా చేసుకుని సకామ పురుషులందరికీ వర్ణాశ్రమోచితమైన కర్మను ఈశ్వరోపాసనా దృష్టితో ఆచరించాలనే విషయాన్ని భగవంతుడు ఉద్బోధిస్తున్నాడు : 'స్వకర్మణాతమభ్యర్చ్యసిద్ధిం విందతి మానవః' పెక్కు యుక్తులతో ఈ సిద్ధాంతాన్నే గీతాగ్రంథం సమర్థిస్తోంది.[1]

## నామ నిరుక్తి

ఈ గ్రంథం భగవంతునిచే గీతమైనందు చేత భగవద్గీత అనీ, సంసారాన్ని భంగించేదవడం చేత ఉపనిషత్తు అనీ, బ్రహ్మ ప్రాపకమవడం చేత బ్రహ్మవిద్య అనీ, ఉపాయసూచకాలైన యోగాలను నిర్దేశిస్తుండడం చేత యోగశాస్త్రం అనీ పేర్కొబడుతోంది. 'ఈ శాస్త్రంలో పద్దెనిమిది అధ్యాయాలూ మోక్ష సౌధానికి చేర్చే సోపానాలు' - అని గీతా మహాత్మ్యం. 'తత్త్వమసి' అనే సామవేదీయ మహావాక్యాన్నే గీత విశదపరుస్తోందని ఆనందగిరి అభిప్రాయం. ఈ యభిప్రాయాన్నే అద్వైతాచార్యులందరూ ప్రమాణంగా గ్రహించారు. 'తత్' శబ్దానికి అర్థం పరమాత్మ;

---

1. 'తస్మాద్యుధ్యస్వ' ఇతి అనువాదమాత్రమ్, న విధిః - శ్రీధరస్వామి

'త్వమ్' శబ్దం జీవవాచకం. 'అసి' శబ్దం ఐక్య పరం. ఈ ఐక్యం చిరసిద్ధం. సాధనా సాధ్యం కాదు. సాధన కేవలం భేదదృష్టిని తొలగిస్తోంది. మొదటి ఆరు అధ్యాయాలు ఆత్మను (జీవుని) గురించి చెబుతున్నాయి. తరువాతి ఆరు అధ్యాయాలు ఉపాస్యుడైన పరమాత్మను (ఈశ్వరుణ్ణి) వర్ణిస్తున్నాయి. తుది అధ్యాయాలలో ఐక్య జ్ఞానం మోక్షోపాయంగా అభివర్ణించబడింది. ఈ అధ్యాయాలు కర్మషట్కం, భక్తి (ఉపాసనా) షట్కం, జ్ఞానషట్కం అని కూడా పేర్కొనబడతాయి.

## అధ్యాయార్థ సంగ్రహం

ప్రథమాధ్యాయం అర్జున విషాదంలో సంసారి, శోక మోహనా వ్యాకులితుడూ అయిన జీవాత్మను వర్ణిస్తోంది. ఈ శోకం దేహాత్మ వివేకం లేకపోవడం చేత సంభవించింది. కనుక, ద్వితీయాధ్యాయంలో దేహాత్మ వివేక విజ్ఞానం ప్రదర్శించ బడింది. దేహానికి ఉత్పత్తి వినాశాలు ఉన్నాయి. కాని ఆత్మకు లేవు. కాని, ఈ ఆత్మ విషయమైన జ్ఞానం, దుర్లభం, చిత్తశుద్ధి లేకపోతే చేకూరదు. చిత్తశుద్ధి నిమిత్తం కర్మయోగాన్ని ఆశ్రయించాలి. ఈ కర్మ అవశ్యకర్తవ్యమనే తృతీయాధ్యాయం నిరూపిస్తోంది. చతుర్థాధ్యాయంలో బ్రహ్మనిష్ఠకు అనుకూలములైన కర్మ, జ్ఞానములనే ద్వివిధ నిష్ఠలు అధికార భేదాన్ని అనుసరించి ఏ రీతిగా ప్రయుజ్యములవుతాయో నిరూపించబడింది. పంచమాధ్యాయంలో అశుద్ధ చిత్తునికి కర్మాచరణాన్ని, తత్ఫల త్యాగాన్ని ఉపకారకములనీ, శుద్ధచిత్తునికి సన్న్యాసం గ్రాహ్యమనీ తెలుపబడ్డాయి. ఈ సన్న్యాసంలో దృఢత్వాన్ని అందజేయడానికి షష్ఠాధ్యాయంలో ధ్యానం విధింపబడింది. సప్తమాధ్యాయంలో ధ్యేయవస్తువైన ఈశ్వరుని శక్తిద్వయం అభివర్ణింపబడి, తన్మాహాత్మ్యం పై శ్రద్ధ ఉద్దీపింపజేయబడింది. అష్టమాధ్యాయం మార్గ వర్ణన చేసి ధ్యానయోగ బలంతో శరీరాన్ని ఎలా త్యజించాలో తెలుపుతోంది; ఈ విధంగా మరణ సమయంలో దేహాన్ని త్యజించే శక్తి దీర్ఘకాల సాధనా సాపేక్షం. కనుక, నవమాధ్యాయంలో భగవద్భజన, భక్తి మహిమ విశదీకరించబడ్డాయి. భజన ధ్యానాలకు అనుకూలమైన ధ్యేయ వస్తువులుగా భగవద్విభూతులు దశమాధ్యాయంలో వర్ణించబడ్డాయి. ఏకాదశాధ్యాయంలో విశ్వమంతా భగవద్రూపంగా చెప్పబడింది. ద్వాదశాధ్యాయంలో భక్తి లాభానికి అనువైన ఉపాయాలు నిర్దేశించబడ్డాయి. త్రయోదశ అధ్యాయం చతుర్వింశతి భేదాలతో ఒప్పారే జడ ప్రకృతిని, తదితరిక్తుడైన చిత్పురుషుని (జీవుని) తెలుపుతోంది. చతుర్దశాధ్యాయం ప్రకృతి గుణత్రయంగా పరిణామం చెంది, జీవుణ్ణి సంసారంలో బంధించే రీతిని అభివర్ణిస్తోంది. పంచదశాధ్యాయం జడప్రకృతి,

జీవుల - కంటే ఉత్తముడైన పరమాత్మను ప్రదర్శిస్తోంది. షోడశ, సప్తదశాలు బద్ధ,ముముక్షు జీవుల ఆచారవ్యవహారాలను, వారికి ఉండే శ్రద్ధలను వర్ణిస్తున్నాయి. అష్టాదశాధ్యయంలో సమస్త గీతార్థం ఉపసంహారం ఒనర్చబడింది.

స్వోచితమైన వర్ణాశ్రమ కర్మలో భగవదర్చన ద్వారా సత్త్వశుద్ధి క్రమంలో నైష్కర్మ్యం (పారమహంసచర్య) పొంది, పరభక్తి సంపన్నుడై మోక్షాన్ని (జ్ఞానాన్ని) పొందడమే గీతాసారం. రెండు నుండి ఐదవ అధ్యాయం వరకు గల గ్రంథం కర్మజ్ఞానాల గురించి విశదంగా ప్రసంగిస్తోంది. జ్ఞానం ఉపేయం, కర్మ ఉపాయం (కర్మ ఫల) త్యాగం సన్న్యాసంతో పరిపక్వత పొందుతోంది. షష్ఠాష్టమాధ్యాయాలు చిత్తైకాగ్రతా ఉపాయాన్ని అభివర్ణిస్తున్నాయి. సప్తమ, నవమాధ్యాయాలు ఈశ్వరశక్తిని అసంగత్వ గుణభూషితమయ్యీ జగదుత్పత్తిస్థితి లయ హేతువని నిరూపిస్తున్నాయి. దశమ, ఏకాదశ, ద్వాదశాలు భక్తిని ప్రశంసిస్తున్నాయి. దశమం విభూతి ధ్యానాన్ని, ఏకాదశం విశ్వరూప ఉపాసనను, ద్వాదశం సాధనాంగాలను తెలియ జెప్తుతున్నాయి. త్రయోదశ, చతుర్దశ, పంచదశాధ్యాయాలలో బ్రహ్మానికి, జీవునికి, ప్రకృతికి గల పరస్పర బంధం వివరించబడింది. షోడశ, సప్తదశాలు అధికారి నిర్ణాయకములు. అష్టాదశాధ్యాయం మోక్షోపాయాన్ని ఉపదేశిస్తోంది.

## కర్మయోగం అంటే ఏమిటి?

గీత కర్మయోగాన్ని ప్రధానంగా ఉపదేశిస్తోంది. యోగం అంటే ఉపాయం. కర్మ యోగం అంటే కర్మ అనే ఉపాయాన్ని అవలంబించి ఈశ్వర దర్శనం పొందడం. ఇక కర్మ అంటే ఏమిటో గ్రహించవలసి ఉంది; ఈ కర్మలో ప్రవర్తిల్లేలా చేసేవి ఏవియో కూడా తెలుసుకోవాలి. ప్రవృత్తి, శాస్త్రం కర్మాచరణకు ముఖ్యకారణాలు. స్వాభావికమైన ఆహారనిద్రాదులలో మనుష్యుని నియతుణ్ణి చేయడానికి శాస్త్రం అనావశ్యకం. శాస్త్రవిధి లేకున్నా మనుష్యుడు ఈ కర్మలలో సహజంగానే ప్రవృత్తుడు అవుతాడు. అయినా, జీవవ్యవహారాన్ని సంయమితమొనర్చడానికి శాస్త్రం భక్ష్యాభక్ష్యాలను, వివాహం, బ్రహ్మచర్యం మొదలైన విషయాలను విధితంత్ర మొనర్చు తున్నది. జీవుణ్ణి ప్రవృత్తి మార్గం నుండి నివృత్తి మార్గానికి గొనిపోవడమే శాస్త్రోద్దేశ్యం. మనుష్యుడు స్వాభావికంగా ఉపక్రమించని కర్మలను ఆచరింపజేయడానికి శాస్త్రం విశేషంగా ప్రయత్నిస్తోంది. పంచమహాయజ్ఞాదికమైన కర్మలు ఈ ప్రయత్నాంతర్గతాలే. ఈ కర్మలు వైధకర్మలు. మనుష్యుని శారీరక, సామాజిక, పారమార్థిక శ్రేయాన్ని అభిలషించి శాస్త్రం వర్ణాశ్రమ ధర్మాన్ని నిర్దేశిస్తోంది. గుణభేదాన్ని అనుసరించి బ్రాహ్మణ

క్షత్రియ శూద్ర విభాగమూ; సంస్కార వైచిత్ర్యాన్ని అనుసరించి శమాది కర్మవిభాగమూ ఉపదిష్టములు. గీతలో అష్టాదశాధ్యాయంలో వర్ణించబడిన కర్మశ్రేణికను చూస్తే ప్రవృత్త్యనుసారం ఉపలభ్యములైన కర్మలనే శాస్త్రం సంస్కరించినట్లు తెలుసుకోవచ్చు. కనుక, ప్రవృత్తి గంధమున్నా కర్మ అంటే శాస్త్రానుమోదితమైన కర్మ అనే గ్రహించాలి. 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే' (16-24) 'కర్మణోహ్యపి బోద్ధవ్యం' (4-17) అనే గీతా వాక్యాలు కూడా ఈ విషయాన్నే తెలియజేస్తున్నాయి. వైధకర్మలో ప్రవర్తింప చేయడానికి, నిషిద్ధకర్మ నుండి నివర్తిల్లజేయడానికి శాస్త్రం ఫలశ్రుతిని కూడా నిర్వచిస్తోంది.

ఈ కర్మ ఎలా ఈశ్వర లాభానికి తోడ్పడుతుందో చూద్దాం- (1) అహంకార రహితుడవై, (2) ఫలాసక్తిని త్యజించి, (3) ఈశ్వరార్పణ బుద్ధితో కర్మను ఆచరించు అని భగవదాజ్ఞ. 'అధ్యాత్మ చేతసా' అనే సూక్తి అంతర్యామి వల్ల ప్రేరితుడవై, అహంకార పరిత్యాగ పూర్వకంగా కర్మను ఆచరించవచ్చు అని తెలుపబడుతోంది. ఇందులో ఫలాభిసంధి ఉండకూడదని 'సంగం త్యక్త్వా' అనునిర్దేశం సూచిస్తోంది. 'యత్కరోషి' అనే శ్లోకం నీవు ప్రవృత్తికి లోనై ఆచరించే కర్మలను, శాస్త్రోక్త విధులను అనుసరించి ఆచరించే కర్మలను, తదితరాలను, నీవు తినే దాన్ని, వ్రేల్చే దాన్ని, ఇతరులకు ఇచ్చే విషయాలను, తపస్సును కూడా భగవదర్పితం చేయమని తెలుపుతోంది. ఇదే కర్మయోగక్రమం. ఈ మూడూ కర్మయోగాంగాలు.

## కర్త ఎవరు? కర్మయోగి ఎవరు?

'ఒకానొక కర్మను ఆచరిస్తే శ్రేయం లభించగలదు' అనే జ్ఞానాన్ని (జ్ఞానమ్) ఆ కర్మను (జ్ఞేయమ్) ఈ రెంటిని గ్రహించేవాడు (పరిజ్ఞాతా) కర్మ ప్రవర్తకములు. ఈ మూడూ కూడా మనోవ్యాపారాలే. కర్మాచరణకు ఆధారభూతమైనది (కరణమ్), కర్మ నిర్వహణను (కర్మ), ఆ క్రియను ఒనర్చేవాడూ (కర్తా) కర్మకు ఆశ్రయం అవుతున్నారు. ఈ మూడూ శరీర వ్యాపారాలు కనుక, కర్మమంతా మనశ్శరీర సంబంధమే అని తేలుతోంది. ఆత్మ మనస్సుకు శరీరానికి కూడా అతీతమై ప్రకాశిస్తోంది. కర్మతో ఆత్మకు అటువంటి సంబంధం లేదు. అందువల్లే 'ప్రకృతేః క్రియ మాణాని గుణైః కర్మాణి సర్వశః' (3-27) అని చెప్పబడింది. శరీరేంద్రియ మనఃప్రాణ బుద్ధ్య హంకారాలు ప్రకృతి. ఇదే కర్త. 'నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్' (5-8). ఈ విధమైన జ్ఞానాన్ని ఆశ్రయించి కర్మను ఆచరిస్తే

కర్తృత్వాభిమానం కలుగదు. అహంకార రాహిత్య స్థితిని పొందవచ్చు. కర్మయోగి కర్మను అనుష్ఠించాలి గాని, కర్మఫలాన్ని అపేక్షించరాదు. ఫలత్యాగాన్నీ, సన్న్యాసాన్నీ ఆశ్రయించి కర్మను ఆచరించాలి (6-1). మరొక విశేషం : 'సిద్ధ్యసిద్ధ్యోః సమః భూత్వా' (2-48) కర్మ ఫలమైన చిత్తశుద్ధి లభించినా లభించకపోయినా, కలత చెందకుండా సమత్వంలోనే సంప్రతిష్ఠితుడై ఉండగలడు. ఏలయన, 'సమత్వంయోగ ఉచ్యతే' (2-48) ఇలా నిరహంకార పూర్వకంగా ఫలసన్న్యాసం చేస్తే మానసిక సమత్వాన్ని అవలంబించి ఈశ్వరార్పణ బుద్ధితో కర్మను ఆచరిస్తే ఈశ్వరుణ్ణి పొందవచ్చు. 'స్వకర్మణా తమ భ్యర్చ్యసిద్ధిం విందతి మానవః' (18-46) (work is worship) కనుక, జగద్రంగంలోనే నిలిచి సన్న్యాసి అంటే అనాసక్తుడు, జ్ఞాని అంటే నిరహంకారి, యోగి అంటే నిర్వికారుడు, భక్తుడు అంటే ఈశ్వరార్పిత చిత్తుడు అయిన వాడే కర్మయోగి.

కర్మమార్గానికి విరోధులు ఇరువురు - అజ్ఞులైన సోమరులు, సాంఖ్యాచార్యులు. మొదటి తెగకు చెందినవారిని ఉద్దేశించి శ్రీభగవానుడు పలికెను : "మీరు మిథ్యాచారులు, మీరు కర్మేంద్రియాలతో విషయాలను గ్రహించకున్నా మనస్సు నుండి త్యజించలేకున్నారు, కనుక మీ కర్మ త్యాగ ప్రయత్నము మిథ్య" (3-6). ఇక సాంఖ్యాచార్యుల ప్రధానయుక్తి. కర్మ పుణ్యజనకమైనట్లు పాపదాయకం కూడా కనుక, త్యజించవలెను (18-3). ఈ యుక్తిని భగవంతుడు కర్మలో దోషాంశాన్ని త్యజించి గుణాంశాన్నే స్వీకరించవలసిందిగా చెప్పి ఖండించాడు (18-48). సాంఖ్యాచార్యుల ద్వితీయయుక్తి కర్మను ఆచరిస్తే ఇష్టానిష్టమిశ్ర ఫలాలలో[1] ఏదో ఒకటి అనివార్య మవుతుంది. స్వర్గం, నరకం లేక మనుష్య లోకం ఏదో ఒకటి పొందవలసి ఉంటుంది. ఇవి ముక్తి కారకాలు కావు, బంధ కారణాలు. శ్రీ భగవానుడు "అలా కాదు. కర్మ ఫలాసక్తితో ఆచరిస్తేనే బంధం; ఫలాసక్తి లేని యెడల కర్మ మోక్షప్రదమవుతుంది. కర్మాంగాలలో బ్రహ్మాన్నే అనుస్యూతంగా[2] దర్శిస్తే బంధం ఎన్నటికీ కలుగదు" అని నిరూపించాడు.

ఇంకొక మాట : నీవు ముక్తపురుషుడవే అయినా, నీకు ఏ కర్మ ప్రయోజనము[3] లేకున్నా, 'బహుజన హితాయ' లోకసంగ్రహార్థం కర్మను ఆచరించు.[4] నీవే కర్మను

1. అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్. (గీత. 18-1.)

2. గీత. 4-24.

3. తస్యకార్యం న విద్యతే - గీత. 3-17.

4. లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ 3-20.

ఆచరించకపోతే నిన్ను చూసి అజ్ఞులు చెడిపోతారు.[1] కనుక, నీవు ముముక్షువు అయినా లేక ముక్త పురుషుడవే అయినా కర్మను త్యజించవద్దు. ముముక్షువు సత్త్వశుద్ధి నిమిత్తం, ముక్తుడు లోకశిక్షణ నిమిత్తం కర్మను ఆచరించాలి. ముముక్షువు ఈశ్వరారాధనార్థం చేసే కర్మ అకర్మ అవుతుంది.[2] ముక్త పురుషుని కర్మ కూడా సమగ్రంగా ప్రవిలీనత మవుతుంది (నశిస్తుంది).[3]

## సృష్టి

త్రయోదశ సప్తదశాలలో ప్రకృతిని గురించిన విశేష ప్రసంగం మనకు లభిస్తోంది. ఈ ప్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకం. మహత్తత్త్వం, అహంకారం, పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచమహాభూతాలు, మనస్సును కలిపి ప్రకృతి అని అనబడుతోంది. అవ్యక్తంగా ఉండే ఈ ప్రకృతి అవస్థయే మన ఊహకు అందే జగన్మూలం. ఈ మూల ప్రకృతి త్రిగుణాత్మిక సత్త్వరజస్తమం అనబడే గుణత్రయం సామ్యావస్థలో ఉండడం వల్ల అవ్యక్తావస్థ. ఈ సామ్యావస్థ విచ్యుతమైతే ప్రకృతి వికృతి అవుతుంది. అంటే సృష్టి ఆరంభించబడుతుంది. సృష్ట్యారంభంలో సత్త్వగుణం ప్రవృద్ధమైనప్పుడు జ్ఞానాత్మకమూ సుఖాత్మకమూ అయిన మహత్తత్త్వం (బుద్ధి) ఉత్పన్నమవుతోంది. పిదప రజస్తమోగుణాలు వివృద్ధాలైనప్పుడు అభిమానాత్మకమైన అహంకారం ఉత్పన్నమవుతోంది. అహంకారం నుండి పంచ తన్మాత్రలు కలుగుతున్నాయి. కేవలం 'అదియే అయ్యేది' తన్మాత్ర. ఈ తన్మాత్రలు ఐదు. అవి పృథ్వి-ఆకాశం-నీరు-అగ్ని-వాయువులు. ఆకాశతన్మాత్ర కేవలం ఆకాశమయంగానే ఉంటుంది. ఇలాగే తదితర తన్మాత్రలు కూడా.

అహంకారంలో సాత్త్వికాంశం ప్రవృద్ధమై, ఏకాదశేంద్రియాలను కలిగిస్తోంది. జ్ఞానేంద్రియ పంచకం, కర్మేంద్రియ పంచక, మనస్సు అనేవి ఏకాదశేంద్రియాలు. సూక్ష్మశరీరం (లింగశరీరం) సప్త దశావయవాత్మకం. ఏకాదశేంద్రియాలు, బుద్ధి, పంచప్రాణాలు కలిసి సప్తదశావయవాలు. ప్రాణ-అపాన- వ్యాన-ఉదాన-సమానములు పంచప్రాణాలు. మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారంలను కలిపి అంతఃకరణమని వ్యవహారం. కరణం అంటే ఇంద్రియం. జ్ఞానేంద్రియాలు బాహ్య కరణాలు (బహిరింద్రియాలు); మనోబుద్ధులు అంతఃకరణాలు (అంతరింద్రియాలు).

---

1. ఉపహన్యామిమాః ప్రజాః - గీత. 3-24
2. కర్మణ్యభిప్రవృత్తోపి నైవ కించిత్కరోతి సః - గీత. 4-20.
3. సమగ్రం ప్రవిలీయతే. - గీత. 4-23.

పంచతన్మాత్రల నుండి స్థూలవిషయాలు ఉత్పన్నములైయ్యాయి. ఇవే ఆకాశాది పంచభూతాలు. పంచతన్మాత్రలు పంచీకృతాలైతే పంచభూత సృష్టి. ఏ భూతం కల్పించబడుతోందో ఆ భూతాంశంలో సగపాలు, మరియూ మిగిలిన సూక్ష్మతన్మాత్రల యొక్క అష్టమాంశాలను కలిపితే పంచీకృత స్థూల మహాభూతాలు సృష్టించ బడుతున్నాయి. కనుక పృథివ్యాది వాటిలో కేవలం మాయాభూతాలే కాకుండా, తదితర అంశాలు కూడా ఉన్నాయి. అయినా, దేని అంశ ఎక్కువగా ఉంటుందో, ఆ పేరిట వ్యవహారం.[1] తన్మాత్రలు ఇంద్రియ గోచరాలు కావు. పంచీకృతమైన తరువాత, భూత సంజ్ఞను పొంది ఇంద్రియగోచరాలు అవుతున్నాయి. ఈ స్థూల విషయాల నుండి చతుర్దశ భువనాత్మకమైన బ్రహ్మాండమూ, జరాయుజ-అండజ-స్వేదజ-ఉద్భిజాత్మకాలైన చతుర్విధ స్థూల శరీరాలను, ఆ శరీరాల భోగోపయుక్తములైన అన్నపానాదులు సృష్టించబడుతున్నాయి.

## కర్మ నిర్వాహకాలు

ఇచ్ఛ, సుఖం, దుఃఖం, చేతన, ధైర్యం మొదలైనవన్నీ ప్రకృతి (మనస్సు) ధర్మాలు, ఆత్మ ధర్మాలు కావు. జగత్తులో యావత్ వహారాలను ప్రకృతియే నిర్వహిస్తోంది. వీటికి ఆత్మతో ఎటువంటి సంబంధమూ లేదు.[2] అష్టాదశాధ్యాయంలో కర్మకు ఐదు విషయాలు కారణాలుగా నిరుక్తములు అయ్యాయి.[3] అధిష్ఠానం (శరీరం), కర్త (చిజ్జడగ్రంథియైన అహంకారం), కరణం (ద్వాదశేంద్రియాలు), చేష్ట (పంచ ప్రాణాలు), దైవం (ఇంద్రియానుగ్రాహకాలైన దేవతలు) -కలిస్తే కర్మ నిర్వహించ బడుతోంది.

శ్రోత్ర-త్వక్, చక్షుః-జిహ్వా-ఘ్రాణం అనే జ్ఞానేంద్రియ పంచకం శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలను గ్రహిస్తోంది. వాక్-పాణి-పాద-పాయు-ఉపస్థ అనే కర్మేంద్రియ పంచకం కథన-గ్రహణ-గమన-త్యాగానందాలను నిర్వహిస్తోంది. ప్రాణాపానవ్యానోదాన సమానములనే వాయు పంచకం బహిర్గమన- అధోగమన-అకుంచన-సమీకరణ-ఉర్ధ్వోన్నయనములు అనే కర్మలను ఒనర్చుతోంది. అంతః కరణం మనోబుద్ధ్యహంకార చిత్తాలుగా విభక్తమై సంకల్పవికల్పాలను, నిశ్చయాన్ని, అభిమానాన్ని అనుసంధానం చేస్తోంది.

---

1. వైశేష్యాత్తు తద్వాద స్తద్వాదః - వేదాంత సూత్రమ్. 2-4-22.
2. గీత. 5-8; 3-27
3. గీత. 18-13.15

ఆయా ఇంద్రియాలను అధిష్ఠానదేవతలు కార్యోన్ముఖం చేస్తున్నారు. దిక్-వాయు-అర్క-వరుణ-అశ్వినీ దేవతలు జ్ఞానేంద్రియ ప్రేరకులు. అగ్ని-ఇంద్ర-ఉపేంద్ర-యమ-ప్రజాపతులు కర్మేంద్రియ ప్రేరకులు. మనోబుద్ధ్యహంకార చిత్తాలకు చంద్ర-బ్రహ్మ-శంకర-విష్ణు దేవతలు నియంతలు. దేవతా ప్రేరితాలైన ఇంద్రియాలే విషయ భోగం ఒనర్చుతున్నాయి.

గుణత్రయాభివ్యక్తియే సుఖదుఃఖమోహాలకు కారణం. జ్ఞానం, సుఖం సత్త్వగుణ కార్యాలు. రజోగుణం ప్రవృత్త్యాదులకు హేతుభూతం. తమోగుణం వివేక భ్రంశాది[1] వాటికి కారణం. ఇలా ఈ రీతిగా కర్మమంతా ప్రకృత్యంతర్గతమే అవుతోంది.[2] ఈ సృష్టి క్రమంలో ప్రకృతి-ఆత్మ, జడం-అజడం జోడింప బడుతున్నాయి. జడకార్యం దేహాది రూపాల పరిణతి.[3] ఆత్మ (జీవాత్మ) కార్యం, భోక్తృత్వం.[4]

## ఆత్మ స్వరూపం

ఈ జగత్తులో కొందరికి జడం కాకుండా ఇతరమేమీ స్ఫురించదు. వారికి శరీరం ఒక్కటే నిక్కం, శరీర నాశంతో సమస్తమూ సరి. ఆత్మయనే వస్తువే లేదు. ఇంద్రియ చరితార్థతయే పరమావధి - ఇటువంటి అభిప్రాయాలతో సంతుష్టి చెందేవారు దేహాత్మవాదులని, లోకాయతకులని, చార్వాకులని పేర్కొనబడుతున్నారు.[5] దేహాతిరిక్తమైన ఆత్మ ఒకటి ఉందనీ, దానికి కర్తృత్వ భోక్తృత్వాలు, కర్మాచరణం, సుఖదుఃఖ భోగాలు కలవని విశ్వసించేవారు న్యాయవైశేషికులు.[6] కర్తృత్వం శరీర (ప్రకృతి) స్థితమేయైనా, ఆత్మ నిష్క్రియమైనా సుఖదుఃఖాల భోక్తయని తలచేవారు సాంఖ్య, పాతంజలులు. కర్తృత్వం, భోక్తృత్వం - ఈ రెండూ శరీరానికే గాని ఆత్మకు కావు. ఆత్మ నిష్క్రియం, సుఖదుఃఖాతీతం, ద్రష్ట, నిర్వికారి అని నిరూపించేవారు వేదాంతులు. గీత కూడ ఈ విషయాన్నే సమర్థిస్తోంది.[7]

---

1. *గీత* : 14-9
2. *గీత* : 18-15.
3. కార్య - కారణ - కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే - *గీత*. 13-20.
4. పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే - *గీత*. 13-20.
5. *గీత* : 16-8, 9
6. *గీత* : 13-6
7. న కరోతి న లిప్యతే - *గీత*: 13-31.

## ఆత్మబహుత్వం : ఏకత్వం

చార్వాకులు ఆత్మవస్తువునే స్వీకరింపరని తెలుసుకున్నాం. న్యాయవైశేషికులు కర్త, భోక్త అయిన ఆత్మను; సాంఖ్య, పాతంజలులు కేవలం భోక్తయైన ఆత్మను, వేదాంతులు నిర్గుణమైన ఆత్మను గ్రహిస్తున్నారని పర్యవసానం. ఇక ఆత్మ ఏకమా? అనేకమా? అనే విషయంలో మతభేదం ఉంది. వేదాంత మతమొక్కటే ఏకాత్మవాది. తదితరులు నానాత్మవాదులు. 'ఆత్మ బహుత్వం లేనియెడల ఒకనికి సుఖమో, దుఃఖమో సంభవిస్తే తదితరులందరికి కూడా అవి అనుభవంలోకి రావలసి ఉంటుంది; కాని అలా జరుగడం లేదు. కనుక ఆత్మ నానాత్వం గ్రాహ్యం' -ఇదే నానాత్వవాదుల ముఖ్యయుక్తి. కాని, వాస్తవానికి సుఖ దుఃఖాదులు ఆత్మ ధర్మాలు కావు, మనోధర్మాలు. మరియు శ్రుతి లభ్యమైన అనంతత్వమనే విశేషణం కూడా ఏకాత్మవాదాన్నే దృఢపరుస్తోంది. అనంతమైంది ఒక్కటే ఉంటుంది. రెండవది ఉంటే మొదటిదాని అనంతత్వం బాధితమవుతుంది. ఈ ఆత్మయే పరమాత్మ.[1]

ఇక గీతాచార్యుడు కూడా ఆత్మ, దేహేంద్రియాతిరిక్తమని, ఉత్పత్తి వినాశ రహితమని, వికార రహితమని, కర్తృత్వ భోక్తృత్వ రహితమని అంటే లోకంలో మనకు కర్మాచరణ ఫలభోగాల ప్రతీతి ఎందుకు కలుగుతోంది? - అని అంటే : తాదాత్మ్యాధ్యాసే ఇందుకు కారణం.[2] అధ్యాస అంటే ఆరోపం, మిథ్యాప్రత్యయం. (ఇంద్రియాలు, మనస్సు అనే) ప్రకృతికి ధర్మాలైన కర్తృత్వాన్నీ, సుఖదుఃఖాలనూ ఆత్మ యందు ఆరోపితాలవుతున్నాయి. వాస్తవానికి ప్రకృతి గుణాలే కర్తృత్వానికి కారణాలు; సుఖదుఃఖాదులను అనుభవించేది మనస్సు. వీటి సంసర్గం కలిగిన వెంటనే జీవుడు కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతిలో చిక్కుకుంటున్నాడు.[3] యథార్థానికి ఆత్మ అవికార్యం.[4] అవివేకమే ఈ తాదాత్మ్య ధ్యాసకు మూలం. అవివేకం చేతనే అసంగము, ఉదాసీనము అయిన ఆత్మ, సంసారియై అహంకారవశంతో (అంటే బుద్ధితో కూడి) కర్తృత్వాభిమానం పొంది సుఖదుఃఖాలను అనుభవిస్తోంది. ప్రకృతి నుండి ఆత్మను వివేకింపగల వ్యక్తి ఆత్మను ద్రష్టగా, సాక్షిగా గ్రహించగలడు.[5]

---

1. *గీత* : 13-22.
2. క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్తద్విద్ధి భరతర్షభ - *గీత*: 13-27.
3. *గీత* : 14-15
4. 'పురుషః ప్రకృతిస్థోఽపి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్'
5. *గీత* : 14-19

## బ్రహ్మం

ఈ ఆత్మయే బ్రహ్మం. నిరతిశయమైనది బ్రహ్మం. ఉపనిషత్తులు ఈ బ్రహ్మాన్ని ద్వివిధములుగా వర్ణిస్తున్నాయి. అవే స్వరూపతటస్థ లక్షణాలు. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' (తైత్తరీయోపనిషత్తు. 2.1) అనేది స్వరూపలక్షణం. సత్యజ్ఞానానంత స్వరూప మైనది బ్రహ్మం. అంటే, మిథ్యాత్వ జడత్వ పరిచ్ఛిన్నత్వములు బ్రహ్మానికి లేవు. జన్మస్థేమ భంగాలకు బ్రహ్మం కారణం - 'యతో వా ఇమాని భూతాని జాయంతే' (తైత్తిరీయ ఉపనిషత్తు. 3.1) మొదలైన వాక్యాలు బ్రహ్మ తాటస్థ్య ప్రతిపాదకాలు.

గీతలో త్రయోదశాధ్యాయంలో బ్రహ్మవిచారణ ఉంది. బ్రహ్మం అనాది అంటే అసృష్టం. అదే అన్నింటికీ ఆది(మూలం) అయిన నిరతిశయ వస్తువు. అది ప్రమాణ విషయం కాదు, నిషేధ విషయం కూడా కాదు. 'న సత్తన్నాసదుచ్యతే'[1] అది అచింత్యశక్తి వల్ల సర్వాత్మకం. సర్వత్ర దాని పాణిపాదాలు. అది సమస్తం వ్యాపించి వెలయుచున్నది. సృష్టి కాలంలో జీవసృష్టి చేసి, స్థితికాలంలో పోషించి, ప్రళయ సమయంలో గ్రసిస్తోంది. అది భూతాలన్నిటి లోపలా వెలుపలా కూడా వెలయుచున్నది.[2]

## ఈశ్వరుడే సృష్టికర్త

సాంఖ్య మతంలో ప్రకృతియే విశ్వరచయిత్రి, ప్రకృతికి స్వయంగా కలిగే పరిణామ ఫలమే ఈ జగత్తు. జీవ సాన్నిధ్యంలో ప్రకృతి యందు ఈ పరిణామం ఘటిల్లుతోంది. గీతలో ఈ ప్రకృతి-పురుష సంయోగం ఈశ్వరేచ్ఛ లేకుంటే కలుగ జాలదని చెప్పబడింది. ప్రకృతియందు ఈశ్వరుడు సృష్టి బీజాలను ఉంచుతున్నాడు.[3] ఈశ్వరుని ఈక్షణ (సంకల్పం) చేతనే ప్రకృతి చరాచరమైన విశ్వాన్ని ప్రసవించుతోంది. ఈశ్వరాధ్యక్షత వల్లే ప్రకృతి సృష్టి చేస్తోంది. ఈశ్వరుడు ఆకాశం వలే నిర్వికారి : యోగమాయా వైభవంతో సృష్టి స్థితి ప్రళయాలు సాధితములవు తున్నాయి.[4]

ఇలా ఈశ్వరుడు సృష్ట్యాదికాలను ఒనర్చుతున్నప్పటికీ ఆప్త కాముడవడం వల్ల నిరహంకారి.[5] ఎటువంటి ప్రయాస లేకుండానే, లీలామాత్రంగా, ఉచ్ఛ్వాసనిశ్వాస కార్యం వలే, ఈసృష్టి నిరూఢం, సృష్టిలో ఉత్తమాధమాది భేదాలు ఉన్నప్పటికీ

---

1. *గీత :* 13-12
2. *గీత :* 13-13, 16; 9-10.
3. *గీత :* 14-3.
4. పశ్యమే యోగ మైశ్వరమ్.
5. న మే కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా.

ఈశ్వరునికి ఏ విధమైన వైషమ్యమూ లేదు.[1] జీవకర్మానుసారమే ఈ సృష్టివైచిత్ర్యం ఏర్పడుతోంది. ఈశ్వరునికి ప్రియ-అప్రియులు లేరు. కాని, ఆయనను సేవించేవారు ఆయననే పొందుతారు. ఇది భక్తి మహిమ.[2] ఈశ్వరుని కరుణావృష్టి అంతటా సమంగానే ఉంది; ఇందులో తడవని వారిదే తప్పు.

ఈశ్వరుడే అధియజ్ఞం; కర్మఫలదాత.[3] జీవుడు కర్మాధికారి, ఈశ్వరుడు ఫలదానం చేస్తాడు. ఆయన కల్పతరువు. ఎవడేది కోరితే దానిని పొందుతాడు. ఆయన ఆర్తుడి ఆర్తిని హరిస్తాడు; ప్రార్థించేవాడి ప్రార్థనను పూరిస్తాడు; ముముక్షువులకు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.[4] ఆయన అంతర్యామియై[5] నిఖిలహృదయాలలో ప్రకాశిస్తూ నియమన మొనర్చుతున్నాడు. ఆయన జడాతీతుడు కాబట్టి ఆత్మ. జీవ-నియంత అవడం వల్ల పరమశబ్దవాచ్యుడు. జడవర్గానికి అంటే ప్రకృతికి కూడా అతీతుడవడం వల్ల, చేతన వర్గం కంటే ఉత్తముడవడం చేత పురుషోత్తముడు.[6] సంసారబుద్ధి సంపూర్ణంగా తొలగితే ఆబ్రహ్మ స్తంబపర్యంతం అన్నింటా అంతటా పరమాత్మయే వెలయుచున్నాడనే జ్ఞానం లభిస్తుంది.[7]

## సృష్టికర్తృత్వం : దర్శన సిద్ధాంతాలు

సాంఖ్యమతంలో ప్రకృతియే జగత్కారణంగా గ్రహింపబడుతోందని పైన తెలిపే ఉన్నాం. ఇక తార్కిక మతాలు (న్యాయ వైశేషికాలు) ప్రకృతిని ఉపాదాన కారణంగాను, ఈశ్వరుణ్ణి నిమిత్త కారణంగాను పేర్కొంటాయి. పృథ్వి, జలం, తేజం, వాయువు - అనే చతుర్విధ పరమాణువులు ఉన్నాయి. ఇవి నిత్యాలు. పరమాణు సంయోగంతో ద్వ్యణుకము, ద్వ్యణుక సంయోగంతో జగత్తు ప్రభవిస్తున్నాయి. పరమాణువులు జగదుపాదాన కారణాలు, మృత్తిక ఘటానికి వలే. కుంభకారుడు మృత్తికాసంయోగంతో ఘటనిర్మాణం ఒనరించే విధంగా, ఈశ్వరుడు ఈ పరమాణు సంయోగంతో జగత్తును సృష్టించడం చేత, నిమిత్త కారణం. ఈ విధంగా తార్కికులు ఈశ్వరుని పరమాణువులను జగత్తుకు కారణాలని అంగీకరిస్తున్నారు.

'ఈశ్వరుడు జగత్తుకు నిమిత్త ఉపాదానాలు రెండూ కూడా' అని వేదాంతుల

---

1. *గీత* : 9-29.
2. *గీత* : 9-29.
3. *గీత* : 8-4.
4. *గీత* : 7-16.
5. *గీత* : 18-61.
6. *గీత* : 15-18.
7. *గీత* : 15-19

నిర్వచనం. ఆయన సంకల్పం చేతనే ఈ సృష్టి. 'నేను పెక్కు విధాలుగా అవుతాను' అని ఆయన తలచిన వెంటనే ఈ బ్రహ్మాండభాండం ప్రస్ఫుటితమైనది. ఆయన నుండే ఉపాదానం; ఆయన ఆలోచనయే సృష్టి; ఇలా బ్రహ్మమొక్కటే నిమిత్తోపాదానాలు రెండు కూడా.

## ద్వైత - అద్వైత - విశిష్టాద్వైతాలు

సాంఖ్య, తార్కిక ఆచార్యులు ద్వైతులు. వారు జీవ బహుత్వాన్ని అంగీకరిస్తూ, ఈ జీవగణం పరమాత్మ (ఈశ్వరు) నుండి వేరని జగత్తు సత్యమని చెబుతున్నారు.

విశిష్టాద్వైతి అయిన శ్రీరామానుజులు సర్వజ్ఞత్వాది గుణశోభితము, నిఖిల కల్యాణగుణ నిలయము అయిన బ్రహ్మపదార్థాన్ని ప్రతిపాదిస్తూ, జీవులను బ్రహ్మాంశలుగా, తదధీనులుగా చెబుతున్నారు. జగత్తు బ్రహ్మ పరిణామమవడం చేత, సత్యం. జీవుడు, జగత్తు బ్రహ్మం నుండి భిన్నులయ్యి కూడా భిన్నులు కారు. బ్రహ్మం ఏకమూ అనేకమూ కూడా. వృక్షం వృక్ష రూపంలో ఏకమయ్యే శాఖాభేదంను అనుసరించి బహుత్వాన్ని వరిస్తున్నట్లు, బ్రహ్మ రూపంలో ఏకత్వం, జగద్రూపంలో నానాత్వం బ్రహ్మంలో సిద్ధిస్తున్నాయి. బ్రహ్మం శరీరి అయినా శరీరగత దోషాలు అంటే నానాత్వ పరిణామ దోషాలు లేవు. బ్రహ్మానికి ఏకత్వం, అవికారిత్వ, నష్టాలు కావు. లౌకిక దృష్టాంతాలతో బ్రహ్మాన్ని పోల్చలేము. అచింత్యశక్తి చేత బ్రహ్మం ప్రపంచాకారంలో పరిణతి పొందినప్పటికీ ప్రపంచాతీతం.

అద్వైత మతం నానాత్వం ఏ విధంగానూ అంగీకరించదు. భేద-అభేదాలు పరస్పర విరుద్ధాలు. బ్రహ్మం నిర్విశేషం. స్వగత, సజాతీయ, విజాతీయ భేద రహితం. 'ఏకమేవాద్వితీయమ్' అనే శ్రుతి ఈ భేదాన్నే నిరాకిరిస్తోంది. ఆత్మ పరమాత్మలకు ఎటువంటి భేదమూ లేదు. ప్రతీయమానమైన భేదం ఔపాధికము, కల్పితము. జగత్తు దృష్టి గోచరమవడం చేత, ఆకాశకుసుమాల వలే అలీకం కాదు; ఆత్మ వలే సత్పదార్థమూ కాదు. నామ రూపాత్మకమైన జగత్తు, ఘటాదుల వలె, వికార పదార్థం. దీని స్వరూప నిర్ణయం దుస్సాధ్యం. జగత్తు ఇలా సత్తు, అసత్తు కాకపోవడం చేత అనిర్వచనీయం, మిథ్య. ఇంద్రజాలికుడు అజ్ఞాతమైన ఒకానొక శక్తి చేత చూపే ఇంద్రజాలం అసత్తు అయినట్లు, మాయాశక్తి చేత తోచే ఈ జగదింద్రజాలం కూడా అసత్తే. బ్రహ్మమే ఈ జగత్తుకు మూలం. కనుక, బ్రహ్మం సత్యం, జగత్తు మిథ్య అని అద్వైతులు అంటున్నారు.

## త్రిమత సమన్వయం

వాస్తవంగా ఈ ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలు తార్కికవాద విషయాలుగా కాకుండా ఉపాసనా ప్రకారాలుగా పరిగ్రహించబడ దగినవని శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానంద ఘోషించి ఉన్నారు. అభేదదృష్టి (ఏకత్వేన), భేదదృష్టి (పృథక్త్వేన), ద్వైతదృష్టి (బహుధా) – అనే త్రివిధోపాసనలు గీతలో కూడా పేర్కొనబడ్డాయి. అత్యంత దేహాభిమానవశులైన వారికి ద్వైత దృష్టి (దాస్య భావం), ఒకించుక చిత్త నైర్మల్యం పొందినవారికి భేద దృష్టి (అంశ భావన), చిత్త పరిపక్వత పొందినవారికి అభేదదృష్టి[1](ఏకత్వ భావన) సుకరములు. శ్రీరామకృష్ణ పరమహంస ఒక్కొక్కప్పుడు తాను జగన్మాత బిడ్డగా భావించి పూజించేవారు. అత్యంతాశ్చర్యమైన తదీయమూర్తి నేత్రపర్వమైనప్పుడు 'జగదంబా!' అంటూ ఆనందాశ్రువులను స్రవిస్తుండేవారు (ఇది ద్వైత భావన). ఒక్కొక్కప్పుడు ఈశ్వరుడే జీవజగత్తులైనట్లు స్పష్టంగా చూస్తుండేవారు (ఇది విశిష్టాద్వైత భావన). అప్పుడాయన 'ఇదంతా భగవంతుడే అయినట్లుగా చూస్తున్నాను' అని పలికేవారు. అన్యసమయాలలో చైతన్యజ్యోతి ఒక్కటే ప్రకాశించగా మనోబుద్ధులు, నామరూపాలు లయమయ్యేవి. అప్పుడు ఆయన సచ్చిదానంద స్వరూపమైన పరమాత్మమతో ఐక్యం చెందేవారు (ఇది అద్వైత భావన). ఈ స్థితిని గురించి నోటితో ఏమీ పలకడానికి ఆయనకు సాధ్యం అయ్యేది కాదు. 'అన్నీ ఉచ్ఛిష్టాలు అయ్యాయి. బ్రహ్మం ఒక్కటే ఉచ్ఛిష్టం కాలేదు' అని చెప్పేవారు.

ఈ విషయాలను పరీక్షిస్తే త్రిమతాలూ సత్యాలే అని, అవి పరస్పర విసంవాదాలు కాకుండా, ప్రత్యుత పరస్పర సహకారాలే అవుతున్నాయని, అధికారి తారతమ్యాన్ని అనుసరించి ఆయా భావాలను గ్రహించి ఈశ్వరోపాసన ఒనర్చవచ్చని తెలుస్తోంది. ఇదే విధంగా కర్మ–జ్ఞాన–భక్తి యోగాల విషయాన్ని కూడా గ్రహించాలి. శ్రీ భగవానుడు కర్మ ఏ విధంగా శ్రేయోభూతమో గీతలో నిరూపించాడు. శ్రీశంకరాచార్యులవారు కూడా ఈ విషయాన్ని అంగీకరించారు. ఇక 'శుద్ధ భక్తి,

---

1. (అ) దేహబుద్ధ్యాస్మి దాసస్తే జీవబుద్ధ్యాత్వదంశకః ।
ఆత్మ బుద్ధ్యా త్వ మేవాహం ఇతిమే నిశ్చితా మతిః ॥

(ఆ) దాసస్తేఽహం దేహదృష్ట్యాస్మి శంభో జాతస్తేఽంశో జీవదృష్ట్యా 'త్రిదృష్టే!' ।
సర్వస్యాత్మన్ ఆత్మదృష్ట్యా త్వమేవేత్త్యేవ్యం ధీర్మే నిశ్చితా సర్వశాస్త్రైః ॥

(ఇ) దాసస్తేహం దేహబుద్ధ్యావిశిష్టః అంశత్వం తే జీవదృష్ట్యా ప్రభోమే ।
నష్టే మోహే ఆత్మ సంస్థాయదాపం పశ్యామ్యేకం త్వాం త్వహం వా ప్రసిద్ధమ్ ॥

శుద్ధ జ్ఞానమూ వాస్తవానికి ఒక్కటే' అని శ్రీరామకృష్ణ పరమహంస పరశ్శతంగా బోధించారు. ఈ జ్ఞాన భక్తులను కైవసమొనర్చుకోవడమే విధేయం. త్రివిధ దృష్టులలో ఏ దృష్టిని అవలంభించినా ఇవి లభించగలవు.

## స్థితి ప్రళయాలు

సృష్టిని గురించి ఒకించుక తెలిపియే ఉన్నాం. ఇక ప్రళయం నిత్య-నైమిత్తిక-ప్రాకృత-ఆత్యంతికాలని చతుర్విధం. జీవ సుషుప్తి నిత్యప్రళయం. చతుర్యుగ సహస్ర పరిమితమైన కాలం (చతుర్ముఖ) బ్రహ్మకు ఒక రోజు అవుతుంది.[1] దివావసానంలో సంభవించే ప్రళయం నైమిత్తిక ప్రళయం; మళ్ళీ, బ్రహ్మకు దినమైనప్పుడు సృష్టి జరుగుతుంది.[2] చతుర్యుగ సహస్రం (ద్విపరార్ధ పరిమితం) బ్రహ్మ ఆయుష్కాలం. ఇదే కల్పం. ఈ కల్పానంతరం జరిగే ప్రళయం ప్రాకృత ప్రళయం.[3] సర్వజీవులును క్రమంగా ముక్తి పొందగా, కలిగే ప్రళయం ఆత్యంతిక ప్రళయం. సృష్టి క్రమానికి విపరీతంగా మొదటి మూడు ప్రళయాలలోను, సృష్టి ఉపసంహృతమవుతుంది. అనులోమ క్రమంలో సృష్టి. ప్రళయం విలోమం. అంటే, పృథ్వి జలంలోనూ, జలం తేజంలోనూ, తేజస్సు వాయువులోనూ, వాయువు ఆకాశంలోనూ, ఆకాశం అహంకారంలోనూ, అహంకారం అజ్ఞానంలోనూ (అవిద్యలో) లయమవుతున్నాయి. ఈ ప్రళయాలలో అవిద్య నష్టమవడం లేదు. కేవలం ఆత్యంతిక ప్రళయంలోనే వినష్టమవుతుంది. తరువాత మరి సృష్టి ఉండదు.

స్థితి అంటే అవస్థితి కాదు, అవిరామ గతి; జగత్తు యొక్క స్థితి అంటే ఉన్మజ్జన నిమజ్జములు. దీనికి కారణం కర్మ. కర్మవశులై జీవులు బ్రహ్మాదిస్థావరాంత యోనులను అధిరోహణ, పతనములను పొందుతున్నారు. ఇహలోకంలో అవిరామమైన గతి ఉన్నట్లే దేహాంతంలో కూడా. ఈ గతికి విచ్ఛేదం లేదు.

మరణానంతరం కరణాలు కర్మాక్షమములవుతాయి. ఈ స్థితిలో జీవుడొక తావు నుండి మరొక తావుకు కదల లేకుండా ఉంటాడు. 'అతివాహిక దేవతలు' అతనికి సాయపడి, స్థానాంతరాలకు తీసికొని పోతారు. భగవదుపాసకులు ఉత్తమ మార్గంలో బ్రహ్మలోకానికి ఏగుతారు.[4] ఈ బ్రహ్మలోకం కూడా అనిత్యం, పునరావృత్తిశీలమై ఉంది. ఇది కాలపరిచ్ఛిన్నం. బ్రహ్మ ఆయుష్కాలం ముగిసిన వెంటనే భగ్నమౌతుంది.

---

1. *గీత* : 8-17.
2. *గీత* : 8-19.
3. *గీత* : 8-18.
4. *గీత* : 8-24.

కాని, బ్రహ్మ లోకంలో జ్ఞాన ప్రసాదాన్ని బడసినవారు కల్పాంతంలో బ్రహ్మతో పాటు ముక్తి పొందుతారు; అలా కానివారు తిరిగి మర్త్యలోకానికి వస్తారు. ఇక సకామ కర్మపరులు దక్షిణ మార్గంలో చంద్రలోకానికి (స్వర్గం) చేరతారు.[1] అక్కడ భోగార్థం జలమయ దేహాలను పొందుతారు. ఈ దేహాలు భోగ ప్రారబ్ధం ముగిసిన వెంటనే విగళితములవుతాయి. వారు మళ్ళీ భూలోకంలో జన్మిస్తారు. పాపకర్ములు యమాలయంలో దండితులై ఇహంలో హీనయోనులలో జన్మిస్తారు.[2] విద్యా కర్మ శూన్యములైన కీటపతంగాదులు ఇక్కడే పౌనఃపున్యంగా జనన మరణాలను పొందుతుంటాయి.[3]

ఇలా స్వర్గాది లోకాలకు పోయే గతిని, అవరోహప్రణాలి అంటారు. అవరోహం అంటే ఈ లోకానికి దిగే రీతి. ఇది జీవుడు స్వర్గం నుండి పతనాన్ని పొంది, క్రమంగా ఆకాశవాయు ధూమాభ్రమేఘాలను చేరుకుంటారు. పిదప, వర్షం నుండి ఓషధులను అంటే మనుష్యులకు ఆహారయోగ్యములైన ధ్యానంలో చేరి, పురుషునిలో ప్రవేశించి తద్వారా స్త్రీ గర్భంలో ప్రవిష్టుడై మళ్ళీ భూపతనాన్ని పొందుతాడు. ఈ క్రమం బహుకష్ట సంకులం. ఇలా అవిరామగతితో జగత్తులో ఆరోహావరోహణాలు, ఉన్మజ్జన నిమజ్జనములు నడుస్తున్నాయి. ఇదే జగత్తు యొక్క స్థితి.

ఈ సృష్టి స్థితి ప్రళయాలను పర్యాలోచిస్తే వీటిలో దుఃఖకష్టాలు బోధపడ గలవు. కనుకనే, పూర్వాచార్యులు ఈ పర్యాలోచనాన్ని వైరాగ్యోపాయంగా గ్రహించారు. వైరాగ్యానంతరం మనుష్యుడు నిత్యవస్తువు నిమిత్తం సహజంగానే అన్వేషిస్తాడు.

గీతా గ్రంథం ఈ దర్శన శాస్త్రాంశాల నన్నింటిని ప్రస్తావించింది. ఈ దార్శనిక -పటభూమి మీదనే గీతా చిత్రం చిత్రితం. ఈ అంశాలను జ్ఞప్తిలో ఉంచుకొనే గీతా శాస్త్రాన్ని పఠించాలి.



1. గీత : 8-25
2. వేదాంత సూత్రమ్. 3-1-13,16,
3. ఛాందోగ్యోపనిషత్తు. 5-10-8.

# వేదాంతసూత్ర విషయాలైన గీతావాక్యాలు

| వేదాంత సూత్రాలు | గీతా వాక్యాలు |
| --- | --- |
| స్మృతేశ్చ (1. 2.6.) | ఈశ్వరః సర్వభూతానామ్ (28.61) |
| అపిచస్మర్యతే (1.3.23.) | న తద్భాసయతే సూర్యః (15-6) |
| ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ (2.1.6.) | న రూపమస్యేహ (15-3) |
| అపిచ స్మర్యతే (2.3.45.) | మమైవాంశో (15-7) |
| దర్శయతి చాథ అపి స్మర్యతే (3.2.17.) | జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి (13-12) |
| అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్ (3.3.31) | శుక్లకృష్ణేగతీహ్యేతే (8-26) |
| స్మరంతి చ (4. 1.10.) | శుచౌ దేశే (6-11) |
| యోగినః ప్రతి చ స్మర్యతే స్మార్తే చైతే (4.2.21) | యత్రకాలేత్వనావృత్తిం (8-23). |



# శ్రుతి మూలమైన గీతా వాక్యాలు

| గీత | శ్రుతి మూలం |
|---|---|
| 2.19. య ఏనం వేత్తిహంతారమ్ | హంతా చేన్మన్యతే. కఠ. 2.19. |
| 2.20. న జాయతే మ్రియతే | నజాయతే మ్రియతే. కఠ. 2.28. |
| 2.21. ఆశ్చర్యవత్పశ్యతి | ఆశ్చర్యవత్పశ్యతి. కఠ. 2.29. |
| 2.31. స్వధర్మమపి చావేక్ష్య | క్షత్రస్య క్షత్రం యద్ధర్మ. బృ.ఉ. 1.4.14-15 . |
| 2.48.52. యోగస్థః; యదాతే | యదా పంచావతిష్ఠతే. కఠ.ఉ.6.10.11. |
| 2.49. దూరేణ హ్యవరం...కృపణాః; ఫలహేతవః | యో వా ఏతదక్షరమనిదిత్వా... ప్రైతి సకృపణః. బృ.ఉ. 3. 8.10. |
| 2.50. బుద్ధియుక్తో జహాతీహా | నైనం కృతాకృతో తపతః. బృ. ఉ. 4.4.22 |
| 3.4. న కర్మణామనారంభాత్ | కుర్వన్నే వేహ కర్మాణి. ఈ.ఉ. 2. ఏవమేవ ప్రవ్రాజినో... ప్రప్రజంతి. బృ. ఉ. 4.4.22. |
| 3.13. యజ్ఞశిష్టాశినః | మోహమన్నం విందతే అప్రచేతాః. తై.బ్రా. 2.8.8.3. |
| 3.42. ఇంద్రియాణి పరాణ్యాహుః | ఇంద్రియేభ్యః పరాహ్యర్థా. కఠ.ఉ.3.10. |
| 4.8. పరిత్రాణాయ సాధూనాం | స సేతుర్విధరణ మే షాలోకానామ సంభే దాయ. ఛా. ఉ. 8.4.1; బృ.ఉ.4.4.22. |

| | |
|---|---|
| 4.6. ప్రకృతిం స్వామధిష్టాయ | అస్మాన్మాయీ సృజతే. శ్వే. ఉ. 4.9. |
| 4.21. నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః | తేనత్యక్తేన భుంజీథాః. ఈ.ఉ.1. |
| 4.9. శ్రద్ధావాన్లభతే జ్ఞానం | యస్య దేవే పరాభక్తి. శ్వే. ఉ. .23. |
| 4.34. తద్విద్ధి ప్రణిపాతేన | తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్. ముం. ఉ. 1.2.12. |
| 4.37. జ్ఞానాగ్నిః సర్వకర్మాణి | క్షీయంతే చాస్య కర్మాణి, ముం. ఉ. 2.2.7. ఇషీకాతుల వత్సర్వాణి కర్మాణి ప్రదూయంతే. ఛా. ఉ. 5.24.3. |
| 5. 13. నవద్వారే పురే | నవద్వారే పురే. శ్వే. ఉ. 3, 18. |
| 6. 11.13. శుచౌ దేశే; తత్రైకాగ్రం; సమం కాయశిరోగ్రీవం | త్రిరున్నతం స్థాప్య సమం శరీరం. శ్వే ఉ. 2.8. |
| 6.29. సర్వభూతస్థమాత్మానం | యస్మిన్సర్వాణి భూతాని. ఈ. ఉ. 7. |
| 6.31. సర్వభూతస్థితం | యస్తుసర్వానిభూతాని ఆత్మన్యేవ. ఈ.ఉ.6. |
| 7-14. దైవీ హ్యేషా...మాయా | ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే. బృహ.ఉ. 2.5.19. |
| 7-14 మాయా మేతాంతరంతి తే | భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః. శ్వే ఉ. 1.10. |
| 7-26 వేదాహం సమతీతాని | నిచాయ్య తం మృత్యుముఖాత్ప్ర ముచ్యతే స వేత్తి వేద్యమ్. శ్వే.ఉ. 3.19. కఠ. ఉ. 3.1.15. |

| | |
|---|---|
| 7-28 యేషాం త్వతంగతం పాపమ్ | నైనం పాప్మా తరతి. బృ.ఉ. 4. 4. 23 |
| 8-11, యదక్షరం వేదవిదోవదంతి | సర్వే వేదా యత్పదమామనంతి. కఠ. ఉ. 1.2.15. |
| 9-10. మయాధ్యక్షేణ ప్రకృతిః | మాయినం తు మహేశ్వరం. శ్వే ఉ. 4.10. |
| 10-20. అహమాత్మా.. సర్వ భూతాశయస్థితః | జ్ఞానం నిహితం గుహాయామ్. ముం.ఉ. 3.1.7. |
| 10.4. క్షమాసత్యం దమఃశమః | ఏషాదైవీవాగనువదతి...దామ్యత దత్త దయధ్వమితి. బృ.అ. 6.2.3. |
| 13.13. సర్వతఃపాణిపాదమ్ | సర్వతః పాణిపాదంతత్. శ్వే. ఉ.3.16 |
| 13.14.సర్వేంద్రియగుణాభాసమ్ | సర్వేంద్రియగుణాభాసమ్. శ్వే. ఉ.3.17. |
| 13.15. బహిరంతశ్చ భూతానామ్ | బృహచ్చతద్దివ్యమచింత్యరూపమ్. ముం. ఉ. 3.1.7.న చక్షుషాగృహ్యతే ముం. ఉ. 3. 1.8. |
| 13. 17. జ్యోతిషామపి తజ్జ్యోతిః | తం దేవా జ్యోతిషాం జ్యోతిః. తై.ఉ. 2.4. |
| 15.-1. ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థమ్ | ఊర్ధ్వమూలో అవాక్శాఖ ఏషో ఉ శ్వత్థః కఠ. ఉ. 3.2.1. |
| 15.6. నతద్భాసయతే సూర్యో | న తత్రసూర్యోభాతి. ముం. ఉ.2.2.10. |
| 15.12. యదాదిత్యగతం తేజో | |

| | |
|---|---|
| 15.14. అహం వైశ్వానరోభూత్వా | అయమగ్ని ర్వైశ్వానరో.. యే వేదమన్నం పచ్యతే. బృ.ఉ. 7.9.1. |
| 15.15. వేదైశ్చసర్వైరహమేవ వేద్యః | సర్వే వేదా యత్పదమామనంతి. కఠ.ఉ. 1.2.15. |
| 16. 6. ద్వౌ భూతసర్గౌ | ద్వయా హ ప్రాజాపత్యా. బృహ. ఉ.1.3.1. |
| 17-28. అశ్రద్ధయా హుతమ్ | శ్రద్ధయాదేయమ్, అశ్రద్ధయాఽదేయమ్. తై.ఉ.1.11 |
| 18.49.నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి | ఏతం వై తమాత్మానం విదిత్వా..... వ్యుత్థాయ భిక్షాచర్యం చరంతి. బృ.ఉ. 3.5.1. |
| 18.66. ఇదం తే నాతపస్కాయ | నావిరతో దుశ్చరితాత్. కఠ. ఉ. 1.2.24. |



# ఛందో నిరూపణం

అనుష్టుప్, ఇంద్రవజ్రం, ఉపేంద్రవజ్రం, ఉపజాతి, విపరీత పూర్వములనే వృత్తపంచకంలో గీతాశ్లోక సప్తశతి గ్రథితమైంది. అందులో 645 శ్లోకాలు అనుష్టుప్ ఛందంలో రచించబడ్డాయి. మిగిలిన 55 శ్లోకాలను ఏయే వృత్తాలల కూర్చబడ్డాయో ప్రదర్శించబడుతోంది.

ఇంద్రవజ్రం : 2-7,29; 8-28; 9-10; 11-20, 22,27,30.

ఉపేంద్రవజ్రం : 11-18, 28, 29, 45.

ఉపజాతి : 2-5, 6,8, 20,22,70; 8-9, 10,11; 9-21; 11-15, 17, 19,21,23,26,31,34,36,38,40,43,46,50.

విపరీత పూర్వం : 11-35,37, 39,44; 15-2, 4.

గీతలో ఛందోవ్యాకరణ సంబంధమైన ఆర్ష ప్రయోగాలు బహుళంగా ఉన్నాయి. గ్రంథవిస్తృతి భీతితో వాటిని ఇక్కడ నిరూపింపజాలకున్నాం.

# శ్లోకసంఖ్యా నిరూపణం

(ఇందులో చూపిస్తోంది మొత్తం శ్లోక సంఖ్య అని గమనించాలి)

సంజయుడు : 1-25; 2-3; 11-8; 18-5 = **41.**

అర్జునుడు : 1-21; 2-6;3-3; 4-1; 5-1; 6-5; 8-2; 10-7; 11-33; 12-1; 14-1; 17-1;18-2 =**84.**

శ్రీకృష్ణుడు : 2-63; 3-40;4-40; 5-28; 6-27; 7-30; 8-36; 9-34; 10-35; 11-14; 12-19; 13-34; 14-16; 15-20; 16-24; 17-27; 18-71 = **574.**

ధృతరాష్ట్రుడు : 1-1 = **1**

అధ్యాయాల సంఖ్య : 1-47; 2-72; 3-43; 4-43;4-42; 5-29; 6-47; 7-30; 8-28; 9-34; 10-42; 11-55; 12-20; 13-34; 14-27; 15-20; 16-24; 17-28; 18-78 = **700.**

# గీతాపాఠవిధి

పవిత్రభావంతో, స్థిరచిత్తంతో ఆసనంపై కూర్చొని, గీతా శాస్త్రాన్ని పూజించాలి. పిదప, క్రింద చూపబడినట్లు, యథా క్రమంగా అంగన్యాస, కరన్యాసాలను చేయాలి.

ఓం అస్య (ఈ) శ్రీమద్భగవదీతా-మాలా-మంత్రస్య (శ్రీమద్భగవద్గీత అనే మంత్రమాలకు) శ్రీభగవాన్ వేదవ్యాసఃఋషిః (భగవంతుడైన వేదవ్యాసుడు ఋషి) అనుష్టుప్ ఛందః (అనుష్టుప్ ఛందస్సు) శ్రీకృష్ణపరమాత్మా దేవతా (దేవత పరమాత్మయైన శ్రీకృష్ణుడు) "అశోచ్యాన్ అన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" (గీత : 2.11. శ్లోక ప్రథమార్థం) ఇతి బీజం (ఈ మంత్రం గీతకు బీజం). "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" (గీత : 18-66. శ్లోక ప్రథమార్థం) ఇతి శక్తిః (ఈ మంత్రం గీతకు శక్తి). "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (గీత : 18-66. శ్లోక-అపరార్థం) ఇతి కీలకమ్ ( ఈ మంత్రం గీతకు ఆశ్రయం).

**కర్మన్యాసః -** "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" (2-23 శ్లోక ప్రథమార్థం) ఇతి (ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తూ) అంగుష్ఠాభ్యాం నమః (తర్జనీద్వయంతో అంగుష్ఠద్వయాన్ని స్పృశించాలి) "న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః" (2.23 శ్లోక ద్వితీయార్థం) ఇతి (ఈ మంత్రంతో) తర్జనీభ్యాం నమః (అంగుష్ఠ ద్వయంతో తర్జనీద్వయాన్ని స్పృశించాలి) "అచ్ఛేద్యో యం అదాహ్యోయం అక్లేద్యో శోష్య ఏవ చ " (2-24 శ్లోక ప్రథమార్థం) ఇతి (ఈ మంత్రంతో) మధ్యమాభ్యాం నమః (అంగుష్ఠద్వయంతో మధ్యమంగులీద్వయాన్ని తాకాలి.) "నిత్యః సర్వగతః స్థాణురచలో యం సనాతనః" (2-24 శ్లోక శేషార్థం) ఇతి (ఈ మంత్రంతో) అనామికాభ్యాం నమః (అంగుష్ఠద్వయంతో అనామికాద్వయాన్ని తాకాలి. "పశ్య మే పార్థ రూపాణి శతశో థ సహస్రశః" (11-5 శ్లోక ప్రథమార్థం) ఇతి (ఈ మంత్రంతో) కనిష్ఠికాభ్యాంనమః (అంగుష్ఠద్వయంతో కనిష్ఠికాద్వయాన్ని స్పృశించాలి) "నానా విధాని దివ్యాని నానావర్ణాకృతీని చ" (11-5 శ్లోక శేషార్థం) ఇతి కరతల - పృష్ఠాభ్యాం నమః (దక్షిణకరతలంతో వామకరతలాన్ని కప్పుతూ ఈ మంత్రాన్ని పఠించాలి; పిదప వామకరతలాన్ని దక్షిణ కరతలంతో నెమ్మదిగా కొట్టాలి.) ఇతి కరన్యాసః.

**అంగన్యాసః -** "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" ఇతి హృదయాయ నమః (ఈ మంత్రాన్ని పఠించే దక్షిణ హస్తాంగులీ పంచకంతో

హృదయాన్ని తాకాలి) "న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః" ఇతి శిరసే స్వాహా (ఈ మంత్రాన్ని పఠిస్తూ అంగుళీ పంచకంతో శిరస్సును తాకాలి.) "అచ్ఛేద్యో యం అదాహ్యో యం అక్లేద్యో శోష్య ఏవ చ'' ఇతి శికాయై వౌషట్ (ఈ మంత్రాన్ని పఠిస్తూ అంగుళీపంచకంతో శిఖలు స్పృశించాలి) "నిత్యః సర్వగతః స్థాణురచలో యంసనాతనః" ఇతి కచాయహుం (ఈ మంత్రాన్ని పఠిస్తూ, మొదట దక్షిణ హస్తంతో వామబాహు మూలాన్ని, పిదప వామహస్తంతో దక్షిణ బాహుమూలాన్ని తాకాలి) "పశ్యమే పార్థ రూపాణి శతశోథ సహస్రశః" ఇతి నేత్ర త్రయాయ వౌషట్ (ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తూ దక్షిణ హస్తాంగుళీపంచకంతో వామదక్షిణ నేత్రాలను, భ్రూమధ్యాన్ని స్పృశించాలి.)"నానా విధాని దివ్యాని నానావర్ణాకృతీని చ" ఇతి అస్త్రాయఫట్ ( ఈ మంత్రాన్ని పఠిస్తూ, దక్షిణ హస్త - తర్జనీమధ్య మాంగుళులతో వామహస్త తలాన్ని మూడుమార్లు తాకాలి.) ఇతి అంగన్యాసః.

శ్రీకృష్ణ ప్రీత్యర్థం పాఠే వినియోగః (శ్రీకృష్ణభగవానుని ప్రీతి కొరకు గీతాపాఠం చేస్తున్నాను - అని సంకల్పం చేయాలి.) పిదప, గీతాధ్యానం చదవాలి. తరువాత, గీతను పఠించి మహాత్మ్యాన్ని చదవాలి.

ఉపనిషత్ శ్లోకాల వలే గీతా శ్లోకాలు కూడా మంత్రాలు - గంభీరమైన ఆధ్యాత్మిక భావం కలిగినవి. ఒక శ్లోకాన్ని తీసికొని, అన్వయాన్ని, ప్రతిపదార్థాన్ని, తాత్పర్యాన్ని క్రమంగా చదివిన పిదప, భావార్థం తీసుకుని కొంచెం ధ్యానం చేయాలి; అప్పుడు సహజంగానే హృదయంలో శ్లోకం యొక్క భావార్థం ఉద్భాసిస్తుంది.

ఈ రీతిగా అధమపక్షం రోజుకి ఒక్క శ్లోకాన్నైనా పఠించాలి. స్వాధ్యాయం కూడా ఆధ్యాత్మిక సాధనాంగంగా పరిగ్రహించబడింది కదా! మరియు యాస్కుడు నిరుక్తమున (1-18) సంహితోప నిషద్ - బ్రాహ్మణ వచనాలను ఉదాహరించి అర్థం ఎరుగని వాటిని పరిహసించాడు. అర్థజ్ఞునికి శుభం లభించగలదు.[1] విష్ణుపురాణం కూడా ఈ విషయాన్నే తెలుపుతోంది.[2]



1. స్థాణురయం భారహారః కిలాభూ దధీత్య వేదం న విజానీతి యోఽర్థమ్,
యోఽర్థజ్ఞః స సకలం భద్రమశ్నుతే స నాకమేతి జ్ఞానవిధూతపాప్మా - సం.బ్రా.3.

2. శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి - విష్ణు పురాణమ్. 6.7.64.

# గీతా ధ్యానమ్

**ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్**
**వ్యాసేన గ్రథితాం పురాణ మునినా మధ్యే మహాభారతమ్ ।**
**అద్వైతామృత వర్షిణీం భగవతీం అష్టాదశాధ్యాయినీమ్**
**అంబ త్వామనుసన్దధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥ 1**

| | |
|---|---|
| అంబ | = జననీ; |
| భగవద్గీతే | = భగవద్గీతా; |
| భగవాతా | = భగవంతుడైన; |
| నారాయణేన | = నారాయణునిచే; |
| స్వయమ్ | = స్వయంగా; |
| పార్థాయ | = అర్జునునికి; |
| ప్రతిబోధితామ్ | = ఉపదేశింపబడ్డావు; |
| పురాణ మునినా | = పురాణ ఋషియైన |
| వ్యాసేన | = వ్యాసునిచే; |
| మధ్యే మహాభారతమ్ | = మహాభారత మధ్య భాగమున; |
| గ్రథితామ్ | = కూర్చబడ్డావు; |
| అద్వైత అమృత | = అద్వైతమనే అమృతాన్ని; |
| వర్షిణీమ్ | = వర్షించేటటువంటి; |
| భవ ద్వేషిణీమ్ | = భవసాగరాన్ని తొలగించేటటువంటి; |
| అష్టాదశ అధ్యాయినీమ్ | = పద్దెనిమిది అధ్యాయాలుగా విభజింపబడి ఉన్న; |
| భగవతీమ్ | = ఈశ్వరివైన; |
| త్వామ్ | = నిన్ను; |
| అనుసందధామి | = ధ్యానిస్తున్నాను. |

**తా॥** జననీ భగవద్గీతా! స్వయంగా శ్రీకృష్ణభగవానునిచే నీవు పార్థునికి ఉపదేశింపబడ్డావు. పురాణఋషియైన వ్యాసమహర్షిచే మహాభారతంలో (భీష్మపర్వం 25 నుండి 42వ అధ్యాయం వరకు ఏడువందల శ్లోకాలుగా) కూర్చబడ్డావు. అష్టాదశాధ్యాయాత్మికమైన రూపాన్ని ధరించి, నీవు అద్వైతామృతాన్ని వర్షిస్తున్నావు. భవసాగరాన్ని తొలగించే తల్లివైన నిన్ను ధ్యానిస్తున్నాను. 1

**నమోఽస్తుతే వ్యాస విశాల బుద్ధే ఫుల్లారవిన్దాయత పత్రనేత్ర ।**
**యేనత్వయా భారత తైల పూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥ 2**

| | |
|---|---|
| విశాల బుద్ధే = మహామతీ; | భారత తైల పూర్ణః = మహాభారతమనే తైలంతో నింపబడిన; |
| ఫుల్ల అరవింద | జ్ఞానమయః = జ్ఞానాన్ని ఉపదేశించే; |
| ఆయతపత్ర నేత్ర = వికసించిన పద్మ పత్రాల వంటి కన్నులు గల | ప్రదీపః = దీపం; |
| వ్యాస = వ్యాస దేవా; | ప్రజ్వాలితః = వెలిగింపబడిందో; |
| యేన = ఏవిధంగా; | తే = (అటువంటి)నీకు; |
| త్వయా = నీ చేత; | నమః = నమస్కారము; |
| | అస్తు = అగుగాక (చేస్తున్నాను). |

**తా॥** వికసించిన పద్మపత్రాల వంటి కన్నులుగల మహామతి అయిన ఓ వ్యాసదేవా! మహాభారతమనే తైలంతో నింపబడిన జ్ఞానదీపం వెలిగించినటువంటి నీకు నమస్కారం చేస్తున్నాను. 2

**ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైక పాణయే ।**
**జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహేనమః ॥ 3**

| | |
|---|---|
| ప్రపన్న పారిజాతాయ = శరణాగతులకు కల్పవృక్ష సదృశుడు; | గీతాఅమృతదుహే = గీతా అనే అమృతాన్ని పితుకువాడు; |
| తోత్ర వేత్ర | జ్ఞాన ముద్రాయ = జ్ఞానముద్రను ధరించినవాడు అగు; |
| ఏక పాణయే = ఒక చేత పశువులను కాచే కఱ్ఱను ధరించినవాడు; | కృష్ణాయ = శ్రీకృష్ణునికి; |
| | నమః = నమస్కారం. |

**తా॥** శరణాగతులకు కల్పవృక్షసదృశుడూ, ఒక చేత ఆవులను తోలడానికి కఱ్ఱను ధరించేవాడూ, గీతా అనే అమృతాన్ని పితికేవాడూ, జ్ఞానముద్రాధరుడూ[1] అయిన శ్రీకృష్ణ భగవానునికి నమస్కారం. 3

1. తర్జనీ (చూపుడు వేలు) అంగుష్ఠాల (బొటనవేలు) అగ్రభాగాన్ని సంయుక్తం చేస్తే జ్ఞానముద్ర అవుతుంది.

**సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।**
**పార్థో వత్సః సుధీర్భోక్తాదుగ్ధం గీతామృతం మహత్ ॥ 4**

| | | | |
|---|---|---|---|
| సర్వ ఉపనిషదః | = ఉపనిషత్తులన్నీ; | వత్సః | = దూడ; |
| గావః | = ఆవులు; | సుధీః | = వివేకవంతులు; |
| గోపాల నన్దనః | = శ్రీకృష్ణుడు; | భోక్తా | = త్రాగేవారు; |
| దోగ్ధా | = పితికేవాడు; | గీతా అమృతమ్ | = గీతా అనే అమృతం; |
| పార్థః | = అర్జునుడు; | మహతా దుగ్ధమ్ | = మేలైన పాలు. |

**తా॥** ఉపనిషత్తులన్నింటినీ ఆవులుగా, అర్జునుణ్ణి గోవత్సంగా (దూడ) చేసి శ్రీకృష్ణుడు గీతామృతమనే మేలైన పాలు పితికి అందించగా, వివేకవంతులు వాటిని త్రాగుతారు. 4

**వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనమ్ ।**
**దేవకీ పరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 5**

| | | | |
|---|---|---|---|
| వసుదేవ సుతమ్ | = వసుదేవ పుత్రుడు; | జగద్గురుమ్ | = జగద్గురువు; |
| కంస చాణూర మర్దనమ్ | = కంస చాణూర సంహారకుడు; | దేవమ్ | = భగవంతుడైన; |
| దేవకీ పరమ ఆనన్దమ్ | = దేవకీ దేవికి పరమానందదాయకుడు; | కృష్ణమ్ | = శ్రీకృష్ణునికి; |
| | | వన్దే | = నమస్కరించెదను. |

**తా॥** వసుదేవ పుత్రుడూ, కంస చాణూరలను సంహరించినవాడూ, దేవకీ దేవికి పరమానందాన్ని కలిగించేవాడూ, జగద్గురువూ అయిన శ్రీకృష్ణునికి నమస్కరిస్తాను. 5

**భీష్మద్రోణతటా జయద్రథజలా గాన్ధార నీలోత్పలా**
**శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ।**
**అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనా వర్తినీ**
**సోత్తీర్ణా ఖలు పాణ్డవై రణనదీ కైవర్తకః కేశవః ॥ 6**

| | | | |
|---|---|---|---|
| భీష్మద్రోణ | = భీష్మద్రోణులు; | అశ్వత్థామ | = అశ్వత్థామ; |
| తటా | = తీరములు; | వికర్ణ | = వికర్ణులు; |
| జయద్రథ | = జయద్రథుడు; | ఘోర మకరా | = భయంకర మొసళ్ళు; |
| జలా | = నీరు; | దుర్యోధన | = దుర్యోధనుడు; |
| గాంధార | = గాంధారరాజు; | ఆవర్తినీ | = సుడిగుండం; |
| నీల ఉత్పలా | = నల్ల కలువ; | సా | = ఆ; |
| శల్య | = శల్యుడు; | రణ నదీ | = యుద్ధ నది; |
| గ్రాహవతీ | = సొరచేప; | ఖలు | = వాస్తవంగా |
| కృపేణ | = కృపుడు; | పాండవైః | = పాండవులచే; |
| వహనీ | = ప్రవాహము; | ఉత్తీర్ణా | = దాటబడినది; |
| కర్ణేన | = కర్ణుడు; | కేశవః | = కృష్ణుడు; |
| వేలా అకులా | = తరంగాలు; | కైవర్తకః | = కర్ణధారుడు; |

**తా॥** భీష్మద్రోణులనే తీరాలు, జయద్రథుడనే నీరు, గాంధారరాజనే నల్ల కలువ, శల్యుడనే సొరచేప, కృపుడనే ప్రవాహం, కర్ణుడనే తరంగాలు అశ్వత్థామ వికర్ణులనే భయంకర మొసళ్ళు, దుర్యోధనుడనే సుడిగుండం గల కురుక్షేత్ర యుద్ధమనే నదిని పాండవులు వాస్తవంగా శ్రీకృష్ణుడు కర్ణధారుడై ఉండుట చేత దాటగలిగారు. 6

**పారాశర్యవచః సరోజమమలం గీతార్థగన్ధోత్కటం**
**నానాఖ్యానక కేసరం హరికథా సమ్బోధనా బోధితమ్ ।**
**లోకే సజ్జన షట్పదైరహరహః పేపీయమానం ముదా**
**భూయాద్భారత పఙ్కజం కలిమల ప్రధ్వంసినః శ్రేయసే ॥ 7**

పారాశర్య = పరాశరపుత్రుడగు వ్యాసుని;
వచః సరోజమ్ = వాక్కులనే సరస్సులో ఉద్భవించినది;
నానా ఆఖ్యానక కేసరమ్ = అనేక విధాలైన ఉపాఖ్యానాలను మకరందంగా గల;
హరికథా సంబోధన ఆబోధితమ్ = హరికథా ప్రసంగాలతో వికసించి;
(మరియు, దేనియందు)
లోకే = జగత్తులో;
సత్-జన-షట్పదైః = సజ్జనులనే భ్రమరాలచే;

| | |
|---|---|
| అహరహః | = ప్రతిదినం; |
| ముదా | = సంతోషంతో; |
| పేపీయమానమ్ | = మళ్ళీ మళ్ళీ ఆస్వాదించబడుతున్న; |
| కలిమల ప్రధ్వంసి | = కలిదోషాలను నాశనమొనర్చే; |
| గీతా అర్థ గంధ ఉత్కటమ్ | = గీతా అనే సుగంధం కలిగిన; |
| అమలమ్ | = నిర్మలమైన; |
| భారత పంకజమ్ | = భారతమనే పద్మం; |
| నః | = మాకు; |
| శ్రేయసే | = శ్రేయోదాయకం; |
| భూయాత్ | = అగు గాక. |

**తా॥** పరాశర పుత్రుడైన వ్యాసుని వాక్కులనే సరోవరంలో ఉద్భవించినదీ, హరికథా ప్రసంగాలతో వికసించినదీ, అనేక విధాలైన ఉపాఖ్యానాలను మకరందంగా కలిగి, జగత్తులో సజ్జనులనే భ్రమరాలు నిత్యం పానమొనర్చే మధువు కలదీ, కలిదోషాలను నాశనమొనర్చే గీతా అనే సుగంధంతో ఒప్పారుతున్న మహాభారతం అనే పద్మం మాకు శ్రేయోదాయకం అగుగాక! 7

**మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్ ।**
**యత్కృపా తమహం వన్దే పరమానన్ద మాధవమ్ ॥ 8**

| | |
|---|---|
| యత్కృపా | = ఎవరి కృప; |
| మూకమ్ | = మూగ వాణ్ణి; |
| వాచాలమ్ | = వక్తగా; |
| కరోతి | = చేస్తున్నదో; |
| పంగుమ్ | = కుంటి వానిని; |
| గిరిమ్ | = పర్వతాన్ని; |
| లంఘయతే | = దాటింపజేస్తున్నదో; |
| తమ్ | = ఆ (అటువంటి); |
| పరమానంద మాధవమ్ | = పరమానంద స్వరూపుడైన మాధవునికి; |
| అహమ్ | = నేను; |
| వందే | = నమస్కరిస్తాను. |

**తా॥** ఎవరి కృప మూగవాణ్ణి వక్తగా చేస్తున్నదో, కుంటి వాణ్ణి పర్వతం దాటింపజేస్తున్నదో, అటువంటి పరమానంద స్వరూపుడైన మాధవునికి నమస్కరిస్తాను. 8

**యం బ్రహ్మా వరుణేన్ద్ర రుద్రమరుతః స్తున్వన్తి దివ్యైఃస్తవైః**
**వేదైః సాఙ్గ పదక్రమోపనిషదైర్గాయన్తి యం సామగాః ।**

ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదుః సురాసురగణాదేవాయ తస్మైనమః ॥ 9

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మః | = బ్రహ్మ; | యమ్ | = ఎవరిని; |
| వరుణ | =వరుణుడు; | గాయంతి | = పాడుతున్నారో; |
| ఇంద్రః | =ఇంద్రుడు; | యోగినః | = యోగులు; |
| రుద్రః | = రుద్రుడు; | ధ్యాన అవస్థిత తద్గతేన | = ధ్యాన నిష్ఠ గల; |
| మరుతః | = మరుత్తులు; | మనసా | = మనస్సుతో; |
| దివ్యైః | = దివ్యములైన; | యమ్ | = ఎవరిని; |
| స్తవైః | = స్తవాలతో; | పశ్యంతి | = దర్శిస్తున్నారో; |
| యమ్ | = ఎవరిని; | సుర అసుర గణాః | = దేవ, రాక్షస గణాలు; |
| స్తున్వంతి | = స్తుతిస్తున్నారో; | యస్య | = ఎవరి; |
| సామగాః | = సామ గాయకులు; | అంతమ్ | = అంతాన్ని; |
| స అంగ పద క్రమ ఉపనిషద్భిః | = అంగ పద క్రమోపనిషత్తులతో కూడిన; | న విదుః | = ఎరుగరో; |
| | | తస్మై దేవాయ | = ఆ పరమాత్మకు; |
| వేదైః | = వేదాల చేత; | నమః | = నమస్కారము. |

**తా॥** బ్రహ్మ, వరుణుడు, ఇంద్రుడు, రుద్రుడు, మరుత్తు మొదలైన దేవతలు ఎవరిని దివ్యమైన స్తోత్రాలతో స్తుతిస్తున్నారో; సామగాయకులు ఎవరికి అంగ, పద, క్రమ, ఉపనిషత్తులతో ఉన్న వేదాలచే గానం చేస్తున్నారో; యోగులు ధ్యాన నిష్ఠతో మనస్సును ఏకాగ్ర పరచి ఎవరిని దర్శిస్తున్నారో; దేవ, రాక్షస గణాలు ఎవరి అంతాన్ని ఎరుగకున్నారో అట్టి పరమాత్మకు నమస్కారము.
9



‘భవభయమపహంతుం జ్ఞానవిజ్ఞానసారంనిగమకృదుపజహ్నే భృంగవద్వేదసారమ్ ।
అమృతముదధితశ్చాపాయయద్భృత్యవర్గాన్పురుషమృషభమాద్యం కృష్ణసంజ్ఞం నతోస్మి ॥’

‘య ఏతదానందసముద్రసంభృతం జ్ఞానామృతం భాగవతాయ భాషితమ్ ।
కృష్ణేన యోగేశ్వరసేవితాంఘ్రిణా సచ్ఛ్రద్ధయాఽఽసేవ్య జగద్విముచ్యతే ॥’



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## ప్రథమో ఽ ధ్యాయః - అర్జున విషాద యోగః

## (ప్రథమాధ్యాయం - అర్జున విషాద యోగం)

ధృతరాష్ట్ర ఉవాచ :

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।**

**మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1**

*ధర్మక్షేత్రే, కురుక్షేత్రే, సమవేతాః, యుయుత్సవః,*

*మామకాః, పాండవాః, చ, ఏవ, కిమ్, అకుర్వత, సంజయ*

| | | | |
|---|---|---|---|
| ధృతరాష్ట్రః | = ధృతరాష్ట్రుడు; | యుయుత్సవః | = యుద్ధాభిలాషులైన; |
| ఉవాచ | = పలికెను; | మామకాః | = నా వారు; |
| సంజయ | = సంజయా; | పాణ్డవాః చ ఏవ | = పాండు పుత్రులు; |
| ధర్మక్షేత్రే | = దేవతల యజ్ఞస్థలమైన పుణ్యభూమిలో; | సమవేతాః | = కలసి; |
| | | కిమ్ అకుర్వత | = ఏం చేసారు? |
| కురుక్షేత్రే | = కురుక్షేత్రంలో; | | |

**తా॥** ధృతరాష్ట్రుడు పలికెను : సంజయా! పుణ్యభూమియైన కురుక్షేత్రంలో[1] యుద్ధకాంక్షతో నా పుత్రులైన దుర్యోధనాదులు, పాండు పుత్రులైన యుధిష్ఠిరాదులు కలసి ఏం చేసారు? 1

1. కౌరవపాండవుల పూర్వపురుషుడు 'కురు' అనే రాజు ఉండేవాడు. ఆయన పేరును బట్టి ఈ ధర్మక్షేత్రం 'కురుక్షేత్రం' అని పిలువబడింది.

*సంజయ ఉవాచ :*

**దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా ।**
**ఆచార్య ముపసఙ్గమ్య రాజా వచన మబ్రవీత్ ॥ 2**

దృష్ట్వా, తు, పాండవానీకమ్, వ్యూఢమ్, దుర్యోధనః, తదా,
ఆచార్యమ్, ఉపసంగమ్య, రాజా, వచనమ్, అబ్రవీత్

| | | | |
|---|---|---|---|
| సంజయః | = సంజయుడు; | రాజాదుర్యోధనః | = రాజగు దుర్యోధనుడు; |
| ఉవాచ | = పల్కెను; | ఆచార్యమ్ | = ద్రోణాచార్యుని; |
| తదా తు | = అప్పుడు; | ఉపసఙ్గమ్య | = సమీపించి; |
| వ్యూఢం | = వ్యూహబద్ధమైన; | వచనమ్ | = ఈ మాటను; |
| పాణ్డవానీకం | = పాండవుల సైన్యాన్ని; | అబ్రవీత్ | = పలికెను. |
| దృష్ట్వా | = చూసి; | | |

**తా॥** *సంజయుడు పలికెను :* అప్పుడు రాజైన దుర్యోధనుడు వ్యూహాకారంలో ఉన్న పాండవ సైన్యాన్ని చూసి, ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి ఇలా పలికాడు. 2

**పశ్యైతాం పాణ్డుపుత్త్రాణాం ఆచార్య మహతీం చమూమ్ ।** [1]
**వ్యూఢాం ద్రుపదపుత్త్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3**

పశ్య, ఏతామ్, పాండుపుత్త్రాణామ్, ఆచార్య, మహతీమ్, చమూమ్,
వ్యూఢామ్, ద్రుపదపుత్త్రేణ, తవ, శిష్యేణ, ధీమతా

| | | | |
|---|---|---|---|
| ఆచార్య | = గురుదేవా; | పాణ్డు పుత్త్రాణామ్ | = పాండవుల; |
| తవ | = మీ; | ఏతామ్ | = ఈ; |
| శిష్యేణ | = శిష్యుడు; | మహతీమ్ | = గొప్ప; |
| ధీమతా | = బుద్ధిమంతుడైన; | చమూమ్ | = సేనను; |
| ద్రుపదపుత్త్రేణ | = ద్రుపదరాజు తనయునిచే; | పశ్య | = చూడండి. |
| వ్యూఢామ్ | = వ్యూహాకృతిలో నిలుపబడిన; | | |

1. 3 నుండి 11 వరకు గల శ్లోకాలు దుర్యోధనుని పలుకులు.

**తా॥** గురుదేవా! బుద్ధిమంతుడూ, మీ శిష్యుడూ, ద్రుపదపుత్రుడూ అయిన ధృష్టద్యుమ్నుడు[1] ఈ వ్యూహాన్ని విరచించాడు, పాండవుల ఈ విపులసైన్య సమావేశాన్ని చూడండి! 3

**అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4**

*అత్ర, శూరాః, మహేష్వాసాః, భీమార్జునసమాః, యుధి,*
*యుయుధానః, విరాటః, చ, ద్రుపదః, చ, మహారథః*

**ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।**
**పురుజిత్ కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ 5**

*ధృష్టకేతుః, శ్చేకితానః, కాశీరాజః, చ, వీర్యవాన్,*
*పురుజిత్, కుంతిభోజః, చ, శైబ్యః, చ, నరపుంగవః*

**యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6**

*యుధామన్యుః, చ, విక్రాంతః, ఉత్తమౌజాః, చ, వీర్యవాన్,*
*సౌభద్రః, ద్రౌపదేయాః, చ, సర్వే, ఏవ, మహారథాః*

| | | | |
|---|---|---|---|
| అత్ర | = అక్కడ | సంతి | = ఉన్నారు; |
| యుధి | = యుద్ధంలో; | ధృష్టకేతుః | = శిశుపాలుని పుత్రుడు; |
| భీమార్జున సమాః | = భీమార్జునతుల్యులైన; | చేకితానః చ | = యదువంశీయ వీరుడును; |
| మహా ఇష్వాసాః | = మహాధనుర్ధనులు; | వీర్యవాన్ | = శక్తిశాలియగు; |
| శూరాః | = వీరులు; | కాశీరాజః | = కాశీరాజు; |
| యుయుధానః | = సాత్యకి; | పురుజిత్ | = పురుజిత్తు; |
| విరాటః చ | = మత్స్యరాజు; | కున్తిభోజః చ | = కుంతిభోజుడును; |
| మహారథః | = మహారథుడైన; | నరపుఙ్గవః | = నరశ్రేష్ఠుడైన; |
| ద్రుపదః చ | = ద్రుపదుడు; | శైబ్యః చ | = శైబ్యుడూ; |

1. ధృష్టద్యుమ్నుడు ద్రౌపది సోదరుడు.

| | | | |
|---|---|---|---|
| విక్రాన్తః | = పరాక్రమశాలైన | ద్రౌపదేయాః చ | = ఉపపాండవులూ; |
| యుధామన్యుః చ | = యుధామన్యుడూ; | సన్తి | = ఉన్నారు; |
| వీర్యవాన్ | = మహాశక్తిశాలైన; | సర్వే | = వీరందరూ; |
| ఉత్తమౌజాః చ | = ఉత్తమౌజుడూ; | ఏవ | = కూడ; |
| సౌభద్రః | = అభిమన్యుడును; | మహారథాః | = మహారథులు. |

**తా॥** ఈ పాండవసేనలో యుద్ధంలో భీమార్జునులతో సరితూగగల సాత్యకి, విరాటరాజు, మహారథుడైన ద్రుపదుడు, శిశుపాలుని పుత్రుడైన ధృష్టకేతువు, యదువంశీయవీరుడైన చేకితానుడు, శక్తిశాలియైన కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడైన శైబ్యుడు, పరాక్రమశాలియైన యుధామన్యుడు, మహాశక్తిశాలియైన ఉత్తమౌజుడు, సుభద్రాసుతుడైన అభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులైన ఉపపాండవులు[1] మొదలైన మహాధనుర్ధరులైన వీరులు ఉన్నారు. వీరందరూ మహారథులు.[2] 4-6

**అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।**
**నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7**

అస్మాకమ్, తు, విశిష్టాః, యే, తాన్, నిబోధ, ద్విజోత్తమ,
నాయకాః, మమ, సైన్యస్య, సంజ్ఞార్థమ్, తాన్, బ్రవీమి, తే

| | | | |
|---|---|---|---|
| ద్విజోత్తమ | = విప్రవర్యా; | నాయకాః | = అధ్యక్షులో; |
| తు | = కాని; | తాన్ | = వారిని; |
| అస్మాకమ్ | = మనలో; | నిబోధ | = తెలుసుకోండి; |
| యే | = ఎవరు; | తే | = మీ; |
| విశిష్టాః | = ప్రధానులో; | సంజ్ఞార్థమ్ | = ఎరుక కొరకు; |
| మమ | = నా; | తాన్ | = వారి పేర్లను; |
| సైన్యస్య | = సేనకు; | బ్రవీమి | = తెలియజేస్తున్నాను. |

1. ఉపపాండవులు : ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు.
2. మహారథుడు : పదివేలమంది ధనుర్ధరులతో ఒంటరిగా యుద్ధం చేయగల సమర్థుడై, అస్త్రశస్త్ర ప్రయోగంలో నేర్పుగలవాడు.

**తా॥** విప్రవర్యా! మన పక్షాన ఉన్న ప్రసిద్ధ యోధులను సేనాపతులను తెలుసుకోండి. మీకు తెలియజేడనికై వారి పేర్లను చెపుతున్నాను. 7

**భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ ॥[1]** **8**

*భవాన్, భీష్మః, చ, కర్ణః, చ, కృపః, చ, సమితింజయః,*
*అశ్వత్థామా, వికర్ణః, చ, సౌమదత్తిః, తథా, ఏవ, చ*

| | | | |
|---|---|---|---|
| భవాన్ | = మీరు; | తథా, ఏవ | = అలాగే; |
| భీష్మః చ | = భీష్ముడూ; | అశ్వత్థామా చ | = అశ్వత్థామ; |
| కర్ణః | = కర్ణుడు; | వికర్ణః చ | = వికర్ణుడూ; |
| సమితింజయః | = సంగ్రామ విజయుడైన; | సౌమదత్తిః | = సోమదత్తుని పుత్రుడైన భూరిశ్రవుడు. |
| కృపః చ | = కృపాచార్యుడూ; | | |

**తా॥** మనపక్షాన మీరు, భీష్ముడు, కర్ణుడు, సంగ్రామ విజయుడైన కృపాచార్యుడూ, అలాగే అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని పుత్రుడైన భూరిశ్రవుడు మొదలైన ప్రముఖులు ఉన్నారు. 8

**అన్యే చ బహవ శ్శూరాః మదర్థే త్యక్తజీవితాః ।**
**నానా శస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥** **9**

*అన్యే, చ, బహవః, శూరాః, మదర్థే, త్యక్తజీవితాః,*
*నానా శస్త్ర ప్రహరణాః, సర్వే, యుద్ధవిశారదాః*

| | | | |
|---|---|---|---|
| అన్యే చ | = తదితరులు; | సర్వే | = వీరందరూ; |
| బహవః | = పెక్కుమంది; | నానాశస్త్ర ప్రహరణాః | = వివిధ శస్త్రాయుధులు; |
| శూరాః | = వీరులు; | యుద్ధవిశారదాః | = యుద్ధ నిపుణులు. |
| మదర్థే | = నా కొరకు; | | |
| త్యక్తజీవితాః | = ప్రాణత్యాగ సంసిద్ధులు; | | |

1. 'సౌమదత్తి ర్జయద్రథ' – పాఠాంతరం.

**తా॥** నా నిమిత్తం ప్రాణాన్ని సైతం త్యజించడానికి సంసిద్ధులైనవారు ఇంకా అనేకమంది ఉన్నారు. వీరందరూ వివిధశస్త్ర ధరులైన సంపన్నులు, యుద్ధ నిపుణులును. 9

**అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।**
**పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10**

అపర్యాప్తమ్, తత్, అస్మాకమ్, బలమ్, భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తమ్, తు, ఇదమ్, ఏతేషామ్, బలమ్, భీమాభిరక్షితమ్.

| | | | |
|---|---|---|---|
| అస్మాకం | = మన (కౌరవుల); | తు | = కాని; |
| భీష్మాభిరక్షితమ్ | = భీష్మునిచే రక్షించబడుతున్న; | ఏతేషాం | = వీరి (పాండవుల); |
| తత్ | = అట్టి; | భీమ అభిరక్షితమ్ | = భీమునిచే రక్షించబడుతున్న; |
| బలమ్ | = సైన్యం; | ఇదం | = ఈ సేన; |
| అపర్యాప్తమ్ | = పరిమితమైనది; | పర్యాప్తమ్ | = అపరిమితమైనది. |

**తా॥** భీష్మపితామహునిచే రక్షించబడుతున్న మన సైన్యబలం పరిమితం, భీమునిచే రక్షింపబడుతున్న పాండవసైన్యం అపరిమితమైనది. 10

(కౌరవుల సైన్యసంఖ్య పాండవుల సైన్యసంఖ్య కన్నా అధికమైనా, తద్వ్యతిరిక్తంగా చెప్పబడింది. ఎందుకంటే భీష్మపితామహుడు ఉభయపక్షపాతి, భీముడు ఏకపక్షపాతి. కనుక బలం పాండవుల వైపుకే మ్రొగ్గుతోంది.)

**అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః ।**
**భీష్మ మేవాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి ॥ 11**

*అయనేషు, చ, సర్వేషు, యథాభాగమ్, అవస్థితాః,*
*భీష్మమ్, ఏవ, అభిరక్షంతు, భవంతః, సర్వే, ఏవ, హి.*

| | | | |
|---|---|---|---|
| సర్వేషు | = సమస్త; | యథాభాగమ్ | = యథాస్థానంలో; |
| అయనేషు | = వ్యూహద్వారాలలో; | అవస్థితాః | = ఉండి; |

| | | | |
|---|---|---|---|
| భవన్తః | = మీరు; | భీష్మమ్ ఏవ | = భీష్ముణ్ణే; |
| సర్వే ఏవ హి | = అందరూ; | అభిరక్షన్తు | = రక్షిస్తారుగాక! |

**తా॥** (అందువల్ల మీరీవిధంగా చేయండి) కనుక మీరందరూ సైన్య సమూహాల వ్యూహద్వారాలలో యథా స్థానంలో ఉండి, భీష్మపితామహుణ్ణి రక్షించండి. (భీష్ముని బలమే మన ప్రాణాలను కాపాడుతుంది.) 11

**తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।**
**సింహనాదం వినద్యోచ్చైఃశఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12**

*తస్య, సంజనయన్, హర్షమ్, కురువృద్ధః, పితామహః,*
*సింహనాదమ్, వినద్య, ఉచ్చైః, శంఖమ్, దధ్మౌ, ప్రతాపవాన్.*

| | | | |
|---|---|---|---|
| ప్రతాపవాన్ | = ప్రతాపవంతుడూ; | ఉచ్చైః | = పెద్దగా; |
| కురువృద్ధః | = కురువృద్ధుడూ అయిన; | సింహనాదమ్ | = సింహగర్జన; |
| పితామహః | = పితామహుడు(భీష్ముడు); | వినద్య | = చేసి; |
| అస్య | = ఆ దుర్యోధనునికి; | శఙ్ఖమ్ | = శంఖాన్ని; |
| హర్షమ్ | = ఉత్సాహాన్ని; | దధ్మౌ | = పూరించాడు. |
| సంజనయన్ | = కలుగజేస్తూ; | | |

**తా॥** (సమ్మానపూర్వకమైన దుర్యోధనుని వాక్కులను విని) కురుకుల వృద్ధుడు, ప్రతాపశాలి, పితామహుడు అయిన భీష్ముడు పెద్దగా సింహగర్జన చేసి, శంఖాన్ని పూరించాడు. దుర్యోధనుని హృదయం హర్షపూర్ణమయ్యింది. 12

**తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।**
**సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్ ॥ 13**

*తతః, శంఖాః, చ, భేర్యః, చ, పణవానక గోముఖాః,*
*సహసా, ఏవ, అభ్యహన్యంత, సః, శబ్దః, తుములః, అభవత్.*

| | | | |
|---|---|---|---|
| తతః | = పిమ్మట; | పణవ ఆనక గోముఖాః | = డోళ్ళు, మృదంగాలు, రణశృంగాలు; |
| శంఖాః చ | = శంఖాలు; | | |
| భేర్యః చ | = భేరులు; | సహసా ఏవ | = ఒకేసారిగా; |

| | | | |
|---|---|---|---|
| అభ్యహన్యంత | = వాయింపబడ్డాయి; | తుములః | = సంకులము; |
| సః శబ్దః | = ఆ ధ్వని; | అభవత్ | = అయ్యెను. |

**తా॥** (భీష్ముని యుద్ధోత్సాహం సర్వత్రా యుద్ధోత్సాహాన్ని పురికొల్పింది.) శంఖాలు, భేరులు, డోళ్ళు, మృదంగాలు, రణశృంగాలు ఒక్కసారిగా మ్రోగసాగాయి. ఆ ధ్వనులు కలిసిపోయినవి. 13

**తతః శ్వేతైర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ ।**
**మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥ 14**

*తతః, శ్వేతైః, హయైః, యుక్తే, మహతి, స్యందనే, స్థితౌ,*
*మాధవః, పాండవః, చ, ఏవ, దివ్యౌ, శంఖౌ, ప్రదధ్మతుః.*

| | | | |
|---|---|---|---|
| తతః | = పిదప; | మాధవః[1] | = శ్రీకృష్ణుడు; |
| శ్వేతైః | = తెల్లని | పాండవః ఏవ చ | = అర్జునుడు; |
| హయైః | = గుఱ్ఱాలతో; | దివ్యౌ | = దివ్యాలైన; |
| యుక్తే | = జోడింపబడిన; | శంఖౌ | = శంఖాలను; |
| మహతి స్యందనే | = ఉత్తమ రథంలో; | ప్రదధ్మతుః | = పూరించారు. |
| స్థితౌ | = కూర్చున్న; | | |

**తా॥** పిదప తెల్లని గుఱ్ఱాలు పూన్చిన ఉత్తమరథంలో కూర్చున్న శ్రీకృష్ణుడు, పాండుకుమారుడైన అర్జునుడు తమ దివ్య శంఖాలను పూరించారు. 14

**పాఞ్చజన్యం హృషీకేశః దేవదత్తం ధనఞ్జయః ।**
**పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః ॥ 15**

*పాంచజన్యమ్, హృషీకేశః, దేవదత్తమ్, ధనంజయః,*
*పౌండ్రమ్, దధ్మౌ, మహాశంఖమ్, భీమకర్మా, వృకోదరః.*

---

1. *మా విద్యా చ హరేః ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్,*
*తస్మాత్ మాధవ నామాసి ధవః స్వామీతి శబ్దితః.*

'మా' అంటే శ్రీహరివిద్య (శక్తి); ఆమెకు అధిపతి అవడంచేత నీవు మాధవుడవు. 'ధవుడు' అంటే భర్త అని అర్థం.

| | | | |
|---|---|---|---|
| హృషీకేశః | = శ్రీకృష్ణుడు; | దధ్మౌ | = పూరించాడు; |
| పాఞ్చజన్యమ్ | = పాంచజన్యం అనే పేరుగల శంఖాన్ని; | భీమకర్మా | = భయాన్ని కలిగించే పనులు చేసే; |
| దధ్మౌ | = పూరించాడు; | వృకోదరః | = భీముడు; |
| ధనఞ్జయః | = అర్జునుడు; | మహాశంఖం పౌణ్డ్రం | = పౌండ్రం అనే గొప్ప శంఖాన్ని; |
| దేవదత్తమ్ | = దేవదత్తం అనే పేరుగల శంఖాన్ని; | దధ్మౌ | = పూరించాడు. |

**తా॥** హృషీకేశుడు[1] పాంచజన్యం అనే శంఖాన్ని, ధనంజయుడు[2] దేవదత్తమనే శంఖాన్ని, ఘోరకర్ముడైన భీముడు పౌండ్రమనే శంఖాన్ని పూరించారు.

**అనంతవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ ॥ 16**

*అనంతవిజయమ్, రాజా, కుంతీపుత్రః, యుధిష్ఠిరః,*
*నకులః, సహదేవః, చ, సుఘోష మణిపుష్పకౌ.*

| | | | |
|---|---|---|---|
| కుంతీపుత్రః | = కుంతీపుత్రుడైన; | సహదేవః చ | = సహదేవుడు; |
| రాజా యుధిష్ఠిరః | = ధర్మరాజు; | సుఘోష మణిపుష్పకౌ | = సుఘోష మణి పుష్పకములనే శంఖాలను, (పూరించారు). |
| అనంత విజయమ్ | = అనంత విజయమనే శంఖమును; | | |
| నకులః | = నకులుడు; | | |

**తా॥** (ఆ శంఖాల వివరాలు) కుంతీతనయుడైన ధర్మరాజు అనంతవిజయమనే శంఖాన్ని, నకుల-సహదేవులు సుఘోష-మణిపుష్పకాలనే శంఖాలను పూరించారు. 16

**కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః ।**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః ॥ 17**

---

1. హృషీక (ఇంద్రియాలకు) + ఈశః (భర్త) = ఇంద్రియగణాల పరిపాలకుడైన పరమాత్మ.
2. దిగ్విజయంగా కుబేరాదుల ధనాన్ని గైకొన్నవాడు 'ధనంజయుడు'.

కాశ్యః, చ, పరమేష్వాసః, శిఖండీ, చ, మహారథః,
ధృష్టద్యుమ్నః, విరాటః, చ, సాత్యకిః, చ, అపరాజితః.

**ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,**
**సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్దధ్ముః పృథక్ పృథక్ ॥ 18**

ద్రుపదః, ద్రౌపదేయాః, చ, సర్వశః, పృథివీపతే,
సౌభద్రః, చ, మహాబాహుః, శంఖాన్, దధ్ముః, పృథక్, పృథక్.

| | | | |
|---|---|---|---|
| పృథివీ పతే | = ధృతరాష్ట్ర భూపతీ; | ద్రుపదః | = ద్రుపదుడు, |
| పరమ ఇష్వాసః | = మహా ధనుర్ధరుడగు; | ద్రౌపదేయాః | = ద్రౌపదీ పుత్రులు; |
| కాశ్యః చ | = కాశీరాజూ; | మహాబాహుః | = మహాభుజుడైన; |
| మహారథః | = మహారథుడైన | సౌభద్రః చ | = అభిమన్యుడూ; |
| శిఖండీ చ | = శిఖండీ | సర్వశః | = నలువైపుల నుండి; |
| ధృష్టద్యుమ్నః చ | = ధృష్టద్యుమ్నుడూ; | పృథక్ పృథక్ | = వేఱు వేఱుగా; |
| విరాటః చ | = విరాటరాజూ; | శంఖాన్ | = శంఖాలను; |
| అపరాజితః | = అజేయుడైన; | దధ్ముః | = పూరించారు. |
| సాత్యకిః చ | = సాత్యకీ; | | |

**తా॥** ఓ ధృతరాష్ట్ర భూపతీ! మహాధనుర్ధరుడైన కాశీరాజు, మహారథుడైన శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, అజేయుడైన సాత్యకి, ద్రుపదరాజు, ద్రౌపదీ తనయ పంచకము, మహాభుజుడైన అభిమన్యుడు మొదలైనవారు నలువైపుల నుండి తమతమ శంఖాలను విడివిడిగా పూరించారు. 17-18

**స ఘోషో ధార్త రాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।**
**నభశ్చ పృథివీం చైవ తుములోఽభ్యనునాదయన్ ॥[1] 19**

సః, ఘోషః, ధార్త రాష్ట్రాణామ్, హృదయాని, వ్యదారయత్,
నభః, చ, పృథివీమ్, చ, ఏవ, తుములః, అభ్యనునాదయన్.

---

1. 'తుములో వ్యనునాదయన్' – పాఠాంతరం.

| | | | |
|---|---|---|---|
| సః | = ఆ; | అభ్యనునాదయన్ | = ప్రతిధ్వనింప చేసి; |
| తుములః | = సంకులమైన; | ధార్తరాష్ట్రాణాం | = దుర్యోధనాదుల; |
| ఘోషః | = శంఖధ్వని; | హృదయాని | = హృదయాలను; |
| నభః | = ఆకాశాన్ని; | వ్యదారయత్ | = అదరగొట్టెను. |
| పృథివీం చ | = భూమిని; | | |

**తా॥** ఆ భీకర శంఖధ్వనులు భూనభోంతరాలలో ప్రతిధ్వనించి దుర్యోధనాదుల హృదయాలను అదరగొట్టాయి. 19

**అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।**
**ప్రవృత్తే శస్త్ర సమ్పాతే ధను రుద్యమ్య పాణ్డవః ॥** **20**

**హృషీకేశం తదా వాక్యం ఇద మాహ మహీపతే ।**

అథ, వ్యవస్థితాన్, దృష్ట్వా, ధార్తరాష్ట్రాన్, కపిధ్వజః,
ప్రవృత్తే, శస్త్రసంపాతే, ధనుః, ఉద్యమ్య, పాండవః.
హృషీకేశమ్, తదా, వాక్యమ్, ఇదమ్, ఆహ, మహీపతే,

| | | | |
|---|---|---|---|
| మహీపతే | = ఓ రాజా; | ప్రవృత్తే | = రాగా; |
| అథ | = అనంతరము; | ధనుః | = విల్లును; |
| కపిధ్వజః | = కపిధ్వజుడైన; | ఉద్యమ్య | = లేవనెత్తి; |
| పాండవః | = అర్జునుడు; | తదా | = అప్పుడు; |
| వ్యవస్థితాన్ | = యుద్ధసంసిద్ధులైయున్న; | హృషీకేశం | = శ్రీకృష్ణునితో; |
| ధార్తరాష్ట్రాన్ | = దుర్యోధనాదులను; | ఇదం | = ఈ; |
| దృష్ట్వా | = కాంచి; | వాక్యమ్ | = వాక్యమును; |
| శస్త్రసమ్పాతే | = బాణప్రయోగసమయము; | ఆహ | = పలికాడు. |

(21-వ శ్లోక ప్రథమార్థం ఈ శ్లోకంతో అన్వయించబడింది)

**తా॥** ఓ మహీపతీ! అప్పుడు కపిధ్వజుడైన (ధ్వజంపై హనుమంతుని గుర్తు కలిగిన) అర్జునుడు యుద్ధసంసిద్ధులైన ధృతరాష్ట్ర పుత్రులను చూసి, విల్లునెత్తి శ్రీకృష్ణునితో ఇలా పలికాడు. 20–21

అర్జున ఉవాచ :

**సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయమేఽచ్యుత ॥ 21**

సేనయోః, ఉభయోః, మధ్యే, రథమ్, స్థాపయ, మే, అచ్యుత

**యావదేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ।**
**కైర్మయా సహ యోద్ధవ్యం అస్మిన్ రణసముద్యమే ॥ 22**

యావత్, ఏతాన్, నిరీక్షే, అహమ్, యోద్ధుకామాన్, అవస్థితాన్, కైః, మయా, సహ, యోద్ధవ్యమ్, అస్మిన్, రణసముద్యమే.

**యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23**

యోత్స్యమానాన్, అవేక్షే, అహమ్, యే, ఏతే, అత్ర, సమాగతాః, ధార్తరాష్ట్రస్య, దుర్బుద్ధేః, యుద్ధే, ప్రియచికీర్షవః.

| | |
|---|---|
| అర్జునః | = అర్జునుడు; |
| ఉవాచ | = పలికెను; |
| అహమ్ | = నేను; |
| యోద్ధుకామాన్ | = యుద్ధం చేయగోరి; |
| అవస్థితాన్ | = ఉన్న; |
| ఏతాన్ | = వీరిని; |
| యావత్ నిరీక్షే | = చూస్తాను; |
| అస్మిన్ | = ఈ; |
| రణసముద్య మే | = మహాయుద్ధ భూమిలో; |
| కైః సహ | = ఎవరితో; |
| మయా | = నా చేత; |
| యోద్ధవ్యమ్ | = యుద్ధం చేయవలసి ఉందో; |
| అత్ర | = ఇక్కడ; |
| యుద్ధే | = యుద్ధంలో; |
| దుర్బుద్ధేః | = దుష్టబుద్ధియైన; |
| ధార్తరాష్ట్రస్య | = దుర్యోధనునికి; |
| యుద్ధే | = యుద్ధంలో; |
| ప్రియచికీర్షవః | = ప్రియాన్ని చేకూర్చ దలచినవారు; |
| యేఏతే | = ఏ వీరులు; |
| సమాగతాః | = అరుదెంచిరో; |
| యోత్స్యమానాన్ | = యుద్ధాభిలాషులైన; |
| ఏతాన్ | = అట్టి వీరిని; |
| అహమ్ | = నేను; |
| యావత్ అవేక్షే | = చూస్తాను; |
| అచ్యుత | = కృష్ణా; |
| ఉభయోః | = రెండు; |
| సేనయోః మధ్యే | = సేనల నడుమ; |
| మే | = నా; |
| రథమ్ | = రథాన్ని; |
| స్థాపయ | = నిలుపు. |

**తా॥** అర్జునుడు పలికెను: నేను యుద్ధం చేయగోరి వచ్చిన వీరందరినీ చూస్తాను. ఈ మహాయుద్ధంలో ఎవరెవరితో పోరాడవలసి ఉందో గ్రహించి, దుర్బుద్ధి అయిన దుర్యోధనుని ప్రియకాములైన ఏ వీరపురుషులు యుద్ధం చేయడానికి ఈ కురుక్షేత్రానికి అరుదెంచారో వారిని చూడాలి. కాబట్టి, శ్రీకృష్ణా! ఉభయ సైన్యానికి మధ్యలో నా రథాన్ని నిలుపు. 21-23

*సంజయ ఉవాచ :*

**ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24**

*ఏవమ్, ఉక్తః, హృషీకేశః, గుడాకేశేన, భారత,*
*సేనయోః, ఉభయోః, మధ్యే, స్థాపయిత్వా, రథోత్తమమ్.*

**భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।**
**ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25**

*భీష్మద్రోణప్రముఖతః, సర్వేషామ్, చ, మహీక్షితామ్,*
*ఉవాచ, పార్థ, పశ్య, ఏతాన్, సమవేతాన్, కురూన్, ఇతి.*

| | | | |
|---|---|---|---|
| సంజయః | = సంజయుడు; | సర్వేషామ్ చ | = సకల; |
| ఉవాచ | = పలికెను: | మహీక్షితామ్ | = రాజుల ముందర; |
| భారత | = ధృతరాష్ట్రా; | రథోత్తమమ్ | = శ్రేష్ఠమైన రథాన్ని; |
| గుడాకేశేన | = అర్జునుని చేత; | స్థాపయిత్వా | = నిల్పి; |
| ఏవమ్ | = ఇట్లు; | పార్థ | = అర్జునా; |
| ఉక్తః | = చెప్పబడి; | ఏతాన్ సమవేతాన్ | = ఈ కూడిన; |
| హృషీకేశః | = శ్రీకృష్ణుడు; | కురూన్ | = కౌరవులను; |
| ఉభయోః | = రెండు; | పశ్య | = చూడు; |
| సేనయోః మధ్యే | = సేనల మధ్యన; | ఇతి | = అని; |
| భీష్మద్రోణప్రముఖతః | = భీష్మద్రోణుల ఎదుటను; | ఉవాచ | = పలికెను. |

**తా॥** సంజయుడు పలికెను : ఓ ధృతరాష్ట్రా! గుడాకేశుడైన[1] అర్జునుడు శ్రీకృష్ణునితో ఈ విధంగా చెప్పగా, శ్రీకృష్ణుడు రెండు సేనల మధ్య, భీష్మద్రోణులు తదితరులైన మహీపతుల సమ్ముఖాన రథోత్తమాన్ని నిలిపి, "పార్థా! యుద్ధం చేయడానికి సమావేశమైన ఈ కౌరవులను చూడు!" అని పలికెను. 24-25

**తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ॥ 26**

*తత్ర, అపశ్యత్, స్థితాన్, పార్థః, పితౄన్, అథ, పితామహాన్, ఆచార్యాన్, మాతులాన్, భ్రాతౄన్, పుత్రాన్, పౌత్రాన్, సఖీన్, తథా.*

**శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి ।**

*శ్వశురాన్, సుహృదః, చ, ఏవ, సేనయోః, ఉభయోః, అపి.*

| | | | |
|---|---|---|---|
| పార్థః | = అర్జునుడు; | భ్రాతౄన్ | = సోదరులను; |
| తత్ర | = అక్కడ; | పుత్రాన్ | = పుత్రులను; |
| ఉభయోః | = రెండు; | పౌత్రాన్ | = మనుమలను; |
| సేనయోః అపి | = సేనలలోను; | తథా | = అలాగే; |
| స్థితాన్ | = ఉన్న; | సఖీన్ | = స్నేహితులను; |
| పితౄన్ | = పితృ సములను; | శ్వశురాన్ | = మామలను; |
| అథ | = మఱియు; | సుహృదః చ ఏవ | = మొదలైన ఆత్మీయులందరినీ; |
| పితామహాన్ | = తాతలను; | | |
| ఆచార్యాన్ | = గురువులను; | అపశ్యత్ | = చూసాడు. |
| మాతులాన్ | = మేనమామలను; | | |

**తా॥** అప్పుడు పార్థుడు రెండుసేనలలో ఉన్న భూరిశ్రవాది పితృసములను, భీష్ముడు మొదలుగాగల పితామహులను, ద్రోణుడు మున్నగు ఆచార్యులను, శల్యాదులైన మేనమామలను, దుర్యోధనాదులైన సోదరులను, లక్ష్మణాదులైన పుత్రస్థానీయులను, పౌత్రులను, అశ్వత్థామాది మిత్రగణాన్ని, కృతవర్మాదులైన ఆత్మీయులను గాంచాడు. 26-27

1. గుడాకా (నిద్ర) + ఈశ (జేత) = నిద్రను జయించినవాడు గుడాకేశుడు.

**తాన్ సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్ బన్ధూనవస్థితాన్ ॥ 27**
**కృపయా పరయావిష్టో విషీదన్నిద మబ్రవీత్ ।**

*తాన్, సమీక్ష్య, సః, కౌంతేయః, సర్వాన్, బంధూన్, అవస్థితాన్*
*కృపయా, పరయా, ఆవిష్టః, విషీదన్, ఇదమ్, అబ్రవీత్*

| | | | |
|---|---|---|---|
| సః | = ఆ; | పరయా | = మిక్కిలి; |
| కౌన్తేయః | = అర్జునుడు; | కృపయా | = దయతో; |
| అవస్థితాన్ | = ఉండిన; | ఆవిష్టః | = ఆవేశింపబడి; |
| తాన్ | = ఆయా; | విషీదన్ | = దుఃఖిస్తూ; |
| బన్ధూన్ సర్వాన్ | = బంధువులనందరిని; | ఇదమ్ | = ఈ విధంగా; |
| సమీక్ష్య | = చూసి; | అబ్రవీత్ | = పలికెను. |

**తా॥** అర్జునుడు అచటనున్న బంధువుల నందరిని గాంచి, అత్యంత దయార్ద్రచిత్తుడై దుఃఖిస్తూ ఈ విధంగా పలికాడు. 27 -28

అర్జున ఉవాచ :

**దృష్ట్వేమాన్ స్వజనాన్ కృష్ణ యుయుత్సూన్ సముపస్థితాన్ ॥ 28**
**సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।**

*దృష్ట్వా, ఇమాన్, స్వజనాన్, కృష్ణ, యుయుత్సూన్, సముపస్థితాన్*
*సీదంతి, మమ, గాత్రాణి, ముఖమ్, చ, పరిశుష్యతి*

**వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29**
**గాణ్డీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।**

*వేపథుః, చ, శరీరే, మే, రోమహర్షః, చ, జాయతే,*
*గాండీవమ్, స్రంసతే, హస్తాత్, త్వక్, చ, ఏవ, పరిదహ్యతే*

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | యుయుత్సూన్ | = యుద్ధాభిలాషులైన; |
| ఉవాచ | = పలికెను; | ఇమాన్ | = ఈ; |
| కృష్ణ | = శ్రీకృష్ణా; | స్వజనాన్ | = బంధువులను; |
| సముపస్థితాన్ | = చేరి ఉన్న; | దృష్ట్వా | = చూసి; |

| | | | |
|---|---|---|---|
| మమ | = నా; | రోమహర్షః చ | = గుగుర్పాటును; |
| గాత్రాణి | = సర్వాంగాలు; | జాయతే | =కలుగుతున్నాయి; |
| సీదంతి | = పట్టు తప్పిపోతున్నాయి; | హస్తాత్ | = చేతి నుండి; |
| ముఖం చ | = నోరు కూడా; | గాండీవః | = గాండీవ ధనువు; |
| పరిశుష్యతి | = ఎండిపోతున్నది; | స్రంసతే | = జారిపోతున్నది; |
| మేశరీరే | = నా దేహంలో; | త్వక్ చ | = చర్మం కూడా; |
| వేపథుః చ | = కంపనును; | పరిదహ్యతే ఏవ | = మండుతున్నది. |

**తా॥** అర్జునుడు పలికెను : ఓ కృష్ణా![1] యుద్ధార్థమై అరుదెంచిన బంధువులను చూసి, నా అవయవాలన్నీ పట్టు తప్పిపోతున్నాయి, నోరు ఎండుతోంది. నా శరీరం వణకుతోంది, రోమాలు నిక్కపొడుచుకున్నాయి, చేతి నుండి గాండీవం జారిపోతోంది, చర్మం దగ్ధమవుతున్నట్లుగా ఉంది. 28-29

**న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ 30**
**నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।**

న, చ, శక్నోమి, అవస్థాతుమ్, భ్రమతి, ఇవ, చ, మే, మనః
నిమిత్తాని, చ, పశ్యామి, విపరీతాని, కేశవ

| | | | |
|---|---|---|---|
| కేశవ | = కృష్ణా; | భ్రమతి ఇవ | = భ్రమకులోనవుతోంది; |
| అవస్థాతుమ్ | = స్థిరంగా ఉండడానికి; | విపరీతాని | = అశుభ సూచకములైన; |
| న శక్నోమి | = సమర్థుడను కాకున్నాను; | నిమిత్తాని | = శకునములు; |
| మే | = నా; | పశ్యామి | = చూస్తున్నాను. |
| మనః చ | = మనస్సూ; | | |

---

1. అ) భక్తదుఃఖకర్షిత్వాత్ కృష్ణః – భక్తుల దుఃఖాన్ని నాశనం చేసేవాడు కృష్ణుడు. లేక భక్తులను ఆకర్షించేవాడు కృష్ణుడు.

ఆ) కృషామి పృథివీం పార్థ భూత్వా కార్ష్ణాయసోహలః ।
కృష్ణోవర్ణశ్చ మే యస్మాత్తస్మాత్కృష్ణోహమర్జున ॥
అర్జునా! నల్ల ఇనుముతో చేయబడిన నాగలినై భూమిని దున్నడం చేతా, నా రంగు నలుపవడంచేతా నేను కృష్ణుడను.

**తా॥** కేశవా![1] నేనింక స్థిరంగా ఉండజాలకున్నాను. నా మనస్సు చంచలమగుచున్నట్లుగా ఉంది, అమంగళ సూచకాలైన అపశకునాలను నేను చూస్తున్నాను. 30-31

**న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే ॥ 31**
**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।**

*న, చ, శ్రేయః, అనుపశ్యామి, హత్వా, స్వజనమ్, ఆహవే*
*న, కాంక్షే, విజయమ్, కృష్ణ, న, చ, రాజ్యమ్, సుఖాని, చ*

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = శ్రీకృష్ణా; | న అనుపశ్యామి | = చూడజాలకున్నాను, |
| ఆహవే | = యుద్ధమున; | విజయం | = యుద్ధజయమును; |
| స్వజనమ్ | = బంధువులను; | రాజ్యం చ | = రాజ్యలాభమును; |
| హత్వా | = చంపి; | సుఖాని చ | = సుఖములను; |
| శ్రేయః | = శుభమును; | న కాంక్షే | = కోరను. |

**తా॥** కృష్ణా! యుద్ధంలో బంధువులను చంపడం వల్ల ఒరిగే శుభాన్ని గ్రహించలేకున్నాను. యుద్ధంలో జయాన్ని గాని; రాజ్య-సుఖభోగాలు గాని నేను కోరడం లేదు. 31-32

**కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా ॥ 32**

*కిమ్, నః, రాజ్యేన, గోవింద, కిమ్, భోగైః, జీవితేన, వా.*

**యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ ।**
**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ ॥ 33**

*యేషామ్, అర్థే, కాంక్షితమ్, నః, రాజ్యమ్, భోగాః, సుఖాని, చ,*
*తే, ఇమే, అవస్థితాః, యుద్ధే, ప్రాణాన్, త్యక్త్వా, ధనాని, చ.*

---

1. యస్మాత్త్వయైష దుష్టాత్మా హతః కేశీ జనార్దన
తస్మాత్ కేశవనామ్నాత్వం లోకే గోపో భవిష్యసి
నీ వల్ల దుష్టుడైన ఈ 'కేశి' చంపబడడం చేత నీవు జగత్తులో 'కేశవ' అనే నామంతో పేర్కొనబడతావు. (విష్ణుపురాణం)

**ఆచార్యాః పితరః పుత్త్రాః తథైవ చ పితామహాః ।**
**మాతులాః శ్వశురాః పౌత్త్రాః శ్యాలా స్సంబన్ధిన స్తథా ॥ 34**

ఆచార్యాః, పితరః, పుత్రాః, తథా, ఏవ, చ, పితామహాః,
మాతులాః, శ్వశురాః, పౌత్రాః, శ్యాలాః, సంబంధినః, తథా.

| | | | |
|---|---|---|---|
| గోవింద | = కృష్ణా; | పితరః | = తండ్రులు; |
| నః | = మనకు; | పుత్త్రాః | = పుత్రులు; |
| రాజ్యేన | = రాజ్యంతో; | తథా చ | = అదే విధంగా, |
| కిం | = ఏం ప్రయోజనం; | పితామహాః ఏవ | = పితామహులు; |
| భోగైః | = భోగాలతో; | మాతులాః | = మేనమామలు; |
| జీవితేన వా | = జీవితాలతోను; | శ్వశురాః | = మామలు; |
| కిం | = ఏం ప్రయోజనం; | పౌత్త్రాః | = మనుమలు; |
| యేషామ్ అర్థే | = ఎవరి కొరకు; | శ్యాలాః | = బావమరుదులు; |
| నః | = మనకు; | తథా | = మఱియు; |
| రాజ్యమ్ | = రాజ్యాన్ని; | సంబంధినః | = బంధువులు; |
| భోగాః | = భోగాలను; | ప్రాణాన్ | = ప్రాణాలను; |
| సుఖాని చ | = సుఖాలను; | ధనాని చ | = సంపదలను; |
| కాంక్షితం | = కోరబడినదో; | త్యక్త్వా | = వదలి; |
| తే ఇమే | = ఆ ఈ; | యుద్ధే | = రణభూమిలో; |
| ఆచార్యాః | = ఆచార్యులు; | అవస్థితాః | = నిలిచి ఉన్నారు. |

**తా॥** గోవిందా![1] మనకు రాజ్యంతోగాని, సుఖభోగాలతో గాని, జీవితంతో గాని ప్రయోజనమేముంది? ఎందుకంటే, ఎవరి కోసం మనం రాజ్యాన్ని, భోగాలను

---

1. అ) *నష్టాం వై ధరణీం పూర్వమవిందం యద్గుహాగతాం ।*
*గోవింద ఇతి తేనాహం దైవైర్వాగ్భిరభిష్టుతః ॥*
పూర్వం రసాతలంపై పడి నాశనమవబోయిన పృథ్విని ఉద్ధరించడం వల్ల నన్ను దేవతలు గోవిందుడని స్తుతించిరి. *(మహాభారతం)*

ఆ) *అహంకిలేంద్రో దేవానాం త్వం గవామింద్రతాం గతః ।*
*గోవింద ఇతి లోకాస్త్వాం స్తోష్యంతి భువి శాశ్వతమ్ ॥*
నేను దేవతలకు ఇంద్రుడను, నీవు గోవులకు ఇంద్రుడవు కనుక నిన్ను జనులు గోవిందుడవని స్తుతిస్తారు.

సుఖాలను ఆకాంక్షిస్తున్నామో; ఆ గురువులు, తండ్రులు, పుత్రులు, పితామహులు, మేనమామలు, మామలు, మనుమలు, బావలు, ఇతర బంధువులు ధనప్రాణాలపై ఆశను వదలి ఈ యుద్ధానికి అరుదెంచారు. 32-34

**ఏతాన్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।**
**అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ 35**

ఏతాన్, న, హంతుమ్, ఇచ్ఛామి, ఘ్నతః, అపి, మధుసూదన,
అపి, త్రైలోక్యరాజ్యస్య, హేతోః, కిమ్, ను, మహీకృతే.

| | | | |
|---|---|---|---|
| మధుసూదన | = కృష్ణా; | హేతోః అపి | = నిమిత్తమైనా; |
| ఘ్నతః అపి | = (నన్ను) చంపుచున్న వారి నైనను; | హన్తుమ్ | = వధింప; |
| | | న ఇచ్ఛామి | = కోరను; |
| ఏతాన్ | = వీరిని; | మహీకృతే | = భూలోక రాజ్యం కొరకు; |
| త్రైలోక్యరాజ్యస్య | = త్రిలోకాధిపత్యపు; | కిం ను | = ఇక చెప్పవలెనా? |

**తా॥** (నీవు వీరిని చంపకపోయినా, వీరు నిన్ను వధిస్తారు, కనుక వీరిని వధించి రాజ్యాన్ని భోగించమని అంటావా :) ఓ మధుసూదనా![1] నన్ను వీరు వధించినా, నాకు వీరిని చంప ఇష్టం లేదు. పృథ్వీ మాటేమి, త్రిలోకరాజ్యాన్ని పొందడానికైనా కూడా వీరిని చంపను. 35

**నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యా జ్జనార్దన ।**
**పాపామేవాశ్రయే దస్మాన్ హత్వైతానాతతాయినః ॥ 36**

నిహత్య, ధార్తరాష్ట్రాన్, నః, కా, ప్రీతిః, స్యాత్, జనార్దన,
పాపమ్, ఏవ, ఆశ్రయేత్, అస్మాన్, హత్వా, ఏతాన్, ఆతతాయినః.

---

1. *కర్ణమిశ్రాద్భవం చాపి మధుం నామ మహాసురమ్ ।*
*బ్రహ్మణోపచితం కుర్వన్ జఘాన పురుషోత్తమః ॥*
*తస్య తాత వధా దేవ దేవదానవమానవాః ।*
*మధుసూదన ఇత్యాహుః ఋషయశ్చ జనార్దనమ్ ॥*

బ్రహ్మకు ఉపకారం చేయడానికి 'మధు'వనే రాక్షసుణ్ణి పురుషోత్తముడు వధించాడు. కాబట్టి జనులు జనార్దనుణ్ణి మధుసూదనుడు అని పేర్కొంటారు. *(మహాభారతం)*

| | | | |
|---|---|---|---|
| జనార్దన | = కృష్ణా; | ఏతాన్ | = ఈ; |
| ధార్తరాష్ట్రాన్ | = దుర్యోధనాదులను; | ఆతతాయినః | = హననోద్యుక్తులను; |
| నిహత్య | = చంపి; | హత్వా | = చంపితే; |
| నః | = మనకు; | అస్మాన్ | = మనకు; |
| కా | = ఏమి; | పాపమ్ ఏవ | = పాపమే |
| ప్రీతి | = సంతోషం; | ఆశ్రయేత్ | = చుట్టుకుంటుంది. |
| స్యాత్ | = లభిస్తుంది; | | |

**తా॥** జనార్దనా! దుర్యోధనాదులను చంపడం వల్ల మనకు కలిగే సంతోషం ఏమిటి? ఈ ఆతతాయుల[1] నందరిని చంపడం[2] వల్ల మనకు లభించేది పాపమే![3] 36

**తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్ ।**
**స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ॥ 37**

*తస్మాత్, న, అర్హాః, వయమ్, హంతుమ్, ధార్తరాష్ట్రాన్, స్వబాంధవాన్, స్వజనమ్, హి, కథమ్, హత్వా, సుఖినః, స్యామ, మాధవ*

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన; | మాధవ | = కృష్ణా; |
| స్వబాంధవాన్ | = మన బంధువులైన; | హి | = కనుక; |
| ధార్తరాష్ట్రాన్ | = ధార్తరాష్ట్రులను; | స్వజనమ్ | = స్వజనులను; |
| హంతుమ్ | = వధించుటకు; | హత్వా | = చంపి; |
| వయమ్ | = మనము; | కథం | = ఎలా; |
| న అర్హాః | = అర్హులం కాము; | సుఖినః స్యామ | =సుఖులం కాగలం? |

1. *అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః ।*
*క్షేత్రదారాపహారీ చ షడేతే ఆతతాయినః ॥*
ఇంటికి నిప్పంటించేవాడు, విషాన్ని పెట్టేవాడు, చంపడానికి అస్త్రం పట్టినవాడు, ధనాపహారి, భూమిని అపహరించినవాడు, దారాపహారి – ఈ ఆరుగురూ ఆతతాయులు.

2. అర్థ (నీతి) శాస్త్రానుసారం ఆతతాయిని వధించడం దోషం కాకపోయినా, ధర్మశాస్త్రానుసారం ఆచార్యాదులను ఆతతాయులైనా కూడా వధించడం నిషిద్ధం – అని అర్జునుని అభిప్రాయం.

3. కాబట్టి ఇటువంటి వధ వల్ల పరలోకంలో గాని, ఇహలోకంలో గాని ఎట్టి ప్రయోజనమూ సిద్ధించదు.

**తా॥** కాబట్టి, దుర్యోధనాదులను, వారి బంధువులను చంపడం మనకు తగదు. మాధవా! స్వజనులను చంపి మనమెలా సుఖించగలం? 37

**యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ 38**

*యద్యపి, ఏతే, న, పశ్యంతి, లోభ ఉపహత, చేతసః, కులక్షయకృతమ్, దోషమ్, మిత్రద్రోహే, చ, పాతకమ్.*

**కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివర్తితుమ్ ।**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥ 39**

*కథమ్, న, జ్ఞేయమ్, అస్మాభిః, పాపాత్, అస్మాత్, నివర్తితుమ్, కులక్షయకృతమ్, దోషమ్, ప్రపశ్యద్భిః; జనార్దన.*

| | | | |
|---|---|---|---|
| ఏతే | = ఈ దుర్యోధనాదులు; | కులక్షయకృతమ్ | =వంశనాశనం వల్ల కలిగే; |
| లోభ ఉపహత | = లోభదూషిక; | దోషమ్ | = దోషాన్ని; |
| చేతసః | = చిత్తులై; | ప్రపశ్యద్భిః | = బాగా చూస్తున్న; |
| కులక్షయకృతమ్ | = వంశనాశనం వల్ల కలిగే; | అస్మాభిః | = మనచేత; |
| దోషమ్ | = దోషాన్ని; | అస్మాత్ | = ఈ; |
| మిత్రద్రోహే | = మిత్రద్రోహ కారణంగా; | పాపాత్ | = పాపం నుండి; |
| పాతకమ్ చ | = పాపాన్ని కూడా; | నివర్తితుమ్ | = నివర్తిల్లడానికి; |
| యద్యపి న పశ్యన్తి | =గుర్తించలేక పోయినా; | కథం | = ఎలా; |
| జనార్దన | = కృష్ణా; | నజ్ఞేయమ్ | = తెలియదగినది కాదు? |

**తా॥** (బంధువధ వల్లకలిగే పాపాన్ని లెక్కచేయకుండా వీరు యుద్ధ ప్రవృత్తులైనట్లు, నీవు కూడా యుద్ధం చేసి రాజ్యాన్ని భోగింపకూడదా? అని అంటావా – ) వీరు రాజ్యలోభం కారణంగా వివేకాన్ని త్యజించి, కులక్షయం వల్ల కలిగే దోషాన్ని, మిత్రదోహం వల్ల కలిగే పాపాన్ని గ్రహించలేకున్నారు. జనార్దనా! వంశనాశం వల్ల కలిగే దోషాన్ని గుర్తిస్తున్న మనం ఈ పాపం నుండి నివర్తిల్లడానికి తెలియని వారం ఏలా కాగలుగుతాం ? 38–39

**కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః ।**
**ధర్మే నష్టే కులంకృత్స్నం అధర్మోఽభి భవత్యుత ॥** **40**

కులక్షయే, ప్రణశ్యంతి, కులధర్మాః, స్సనాతనాః,
ధర్మే, నష్టే, కులమ్, కృత్స్నమ్, అధర్మః, అభిభవతి, ఉత.

| | | | |
|---|---|---|---|
| కులక్షయే | = కులనాశనం వల్ల; | నష్టే | = నశించగా; |
| సనాతనాః | = శాశ్వతములైన; | అధర్మః | = అధర్మం; |
| కుల ధర్మాః | = కుల ధర్మాలు; | కులమ్ | = వంశం; |
| ప్రణశ్యంతి | = నశిస్తాయి; | కృత్స్నమ్ | = అంతటిని; |
| ఉత | = మరియు; | అభిభవతి | = వశ మొనర్చుకొనును. |
| ధర్మే | = ధర్మము; | | |

**తా॥** కులనాశనం వల్ల సనాతనమైన కులధర్మాలు వినష్టమవుతాయి; ధర్మం నశిస్తే, కులమంతా అనాచార మయమయ్యే అధర్మంతో కప్పబడిపోతుంది. 40

**అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః ॥** **41**

అధర్మాభిభవాత్, కృష్ణ, ప్రదుష్యంతి, కులస్త్రియః,
స్త్రీషు, దుష్టాసు, వార్ష్ణేయ, జాయతే, వర్ణసంకరః.

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = కృష్ణా; | దుష్టాసు | = చెడిపోవ; |
| అధర్మ అభిభవాత్ | = అధర్మాక్రమణం వల్ల; | వార్ష్ణేయే | = కృష్ణా; |
| కులస్త్రియః | = కుల స్త్రీలు; | వర్ణసంకరః | = వర్ణ సంకరం; |
| ప్రదుష్యంతి | = చెడిపోవుదురు; | జాయతే | = కలుగుతుంది. |
| స్త్రీషు | = ఆడవారు; | | |

**తా॥** కృష్ణా! అధర్మాక్రమణం వల్ల కులస్త్రీలు వినష్టలవుతారు; ఓ వృష్ణికుల సంభవా! కులస్త్రీలు చెడిపోతే వర్ణసంకరం[1] అవుతుంది. 41

1. వర్ణ సంకర లక్షణాలు : వ్యభిచారేణ వర్ణానామ్ అవేద్యా వేదనేన చ ।
స్వకర్మాణాం చ త్యాగేన జాయతే వర్ణసంకరః ॥



**సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।**
**పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదక క్రియాః ॥** **42**

*సంకరః, నరకాయ, ఏవ, కులఘ్నానామ్, కులస్య, చ,*
*పతంతి, పితరః, హి, ఏషామ్, లుప్త పింద ఉదక క్రియాః.*

| | | | |
|---|---|---|---|
| సఙ్కరః | = సంకరం; | ఏషాం చ | = వీరి; |
| కులఘ్నానాం | = కుల ఘాతకులకు; | పితరః | = పితృపురుషులు కూడా; |
| కులస్యచ | = కులమంతటికి; | లుప్త పిణ్డ ఉదక క్రియాః | = పిండదాన, తర్పణక్రియలు లేనివారై; |
| నరకాయ ఏవ | = నరకకారణమే అగును; | | |
| హి | = ఏలనగా; | పతన్తి | = నరకంలో పడతారు. |

**తా॥** వర్ణసంకరమైతే కులఘాతకులు, కుల జనులంతా కూడా నరకంలో పడవేయబడుతున్నారు; శ్రాద్ధతర్పణ క్రియలు (పిండదానమొనర్చే అధికారులు లేక పోవడం చేత) లోపించడం వల్ల వారి పితృపురుషులు కూడా నరకంలో పడుతున్నారు. 42

**దోషై రేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః ।**
**ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥** **43**

*దోషైః, ఏతైః, కులఘ్నానామ్, వర్ణసంకరకారకైః,*
*ఉత్సాద్యంతే, జాతిధర్మాః, కులధర్మాః, చ, శాశ్వతాః.*

---

→
వర్ణవ్యభిచారం - అధమవర్ణానికి చెందిన పురుషులతో ఉత్తమవర్ణాలకు చెందిన కన్యల వివాహం,
అవేద్యా వేదనం - మాతృసపిండులు, పితృసమానప్రవర, సగోత్రానికి చెందిన కన్యలతో వివాహం,
స్వకర్మ త్యాగం - స్వవర్ణ విహితాలైన కర్మలను త్యజించడం
- ఈ మూడింటి వల్ల వర్ణసంకరం ఉత్పన్నమవుతుంది. *(మనుస్మృతి 10 . 24)*

*ప్రతిలోమ్యేన యత్ జన్మ సజ్ఞేయో వర్ణసంకరః ।*
ప్రతిలోమక్రమంలో (ఉత్తమ వర్ణానికి చెందిన స్త్రీలకు అధమ వర్ణానికి చెందిన పురుషులకు) సంతానం జన్మిస్తే వర్ణసంకరం అనబడుతుంది. *(నారద స్మృతి 12 . 102)*

| | | | |
|---|---|---|---|
| ఏతైః | = ఈ; | జాతి ధర్మాః | = వర్ణధర్మాలు; |
| వర్ణసంకర కారకైః | = వర్ణ సంకర కారకాలైన; | కులధర్మాః చ | = కుల ధర్మాలను; |
| దోషైః | = దోషాల చేత; | ఉత్సాద్యంతే | = ఉత్సన్నములు, |
| కులఘ్నానామ్ | = కులఘాతకుల; | | సమూలముగ నశించినవి అవుతున్నాయి. |
| శాశ్వతాః | = సనాతనములైన; | | |

**తా॥** వర్ణసంకర కారణాలైన ఈ దోషాల వల్ల, కులఘాతకుల వల్ల సనాతన వర్ణధర్మాలు,[1] కులధర్మాలు[2], ఆశ్రమధర్మాలు,[3] ఉత్సన్నమవుతున్నాయి. (సమూలంగా నశించినవి అవుతున్నాయి) 43

**ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।**
**నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥ 44**

ఉత్సన్న కులధర్మాణామ్, మనుష్యాణామ్, జనార్దన,
నరకే, నియతమ్, వాసః, భవతి, ఇతి, అనుశుశ్రుమ

| | | | |
|---|---|---|---|
| జనార్దన | = కృష్ణా; | వాసః | = వాసం; |
| ఉత్సన్న కులధర్మాణామ్ | = వినష్ట కులధర్ములైన; | భవతి | = కలుగుతుంది; |
| మనుష్యాణామ్ | = మానవులకు, | ఇతి | = అని; |
| నియతమ్ | = తప్పనిదై; | అనుశుశ్రుమ | = గురుశిష్య పరంపరగా వింటున్నాము. |
| నరకే | = నరకంలో; | | |

**తా॥** జనార్దనా! 'కులధర్మ[4] భ్రష్టులు తప్పక[5] నరకంలో నివసిస్తారు' - ఇది మనం ఆచార్య పరంపరా క్రమంలో విన్న విషయం. 44

---

1. వర్ణధర్మాలు : *గీత* 18 . 42, 44 లో చూడండి.
2. కులధర్మాలు : ఆయా వంశాలకు విశిష్టంగా ఉండే సదాచారాలు.
3. ఆశ్రమధర్మాలు : బ్రహ్మచర్యం, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసం అని శాస్త్రవిహితం.
4. ఇక్కడ కులధర్మ శబ్దం జాతిధర్మాలనూ, ఆశ్రమధర్మాలను కూడా సూచిస్తుంది.
5. తప్పని నరక వాసానికి - కారణం : మనిషి మరణించిన వెంటనే 'అతివాహికం' అనే దేహం అతనికి లభిస్తుంది. ప్రేతపిండ దానం వల్ల అతివాహికకు బదులుగా 'భోగదేహం' అనే శరీరం లభిస్తుంది. సంవత్సరాంతంలో సపిండీకరణ శ్రాద్ధం పెట్టగా మరొక దేహం లభిస్తుంది. అప్పుడు స్వకర్మానుసారం స్వర్గ నరకాలు కలుగుతాయి. (శుద్ధి తత్త్వం లో శ్రీరఘునందనుడు)

**అహో! బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।**
**యద్రాజ్య సుఖలోభేన హన్తుంస్వజన ముద్యతాః ॥ 45**

*అహో, బత, మహత్, పాపమ్, కర్తుమ్, వ్యవసితా, వయమ్, యత్, రాజ్యసుఖలోభేన, హంతుమ్, స్వజనమ్, ఉద్యతాః.*

| | | | |
|---|---|---|---|
| అహో బత | = అయ్యో; | యత్ | = ఏమంటే; |
| వయమ్ | = మనం; | రాజ్యసుఖ లోభేన | = రాజ్యసుఖ లోభంతో; |
| మహత్ | = గొప్ప; | స్వజనమ్ | = బంధువులను; |
| పాపమ్ | = పాపాన్ని; | హన్తుమ్ ఉద్యతాః | = వధించ పూనిన వారమైయ్యాం. |
| కర్తుమ్ | = చేయడానికి; | | |
| వ్యవసితాః | = పూనుకున్నాం; | | |

**తా॥** అయ్యో! మనమెంత మహాపాపాన్ని చేయ పూనుకున్నాం! ఎందుకంటే రాజ్యం వల్ల కలిగే సుఖాశచేత బంధువులను చంప ఒడిగట్టామే! 45

**యది మామప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః ।**
**ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్ ॥ 46**

*యది, మామ్, అప్రతీకారమ్, అశస్త్రమ్, శస్త్రపాణయః, ధార్తరాష్ట్రాః, రణే, హన్యుః, తత్, మే, క్షేమతరమ్, భవేత్.*

| | | | |
|---|---|---|---|
| అప్రతీకారమ్ | = ప్రతిఘటింపనట్టి; | రణే | = యుద్ధంలో; |
| అశస్త్రం | = నిరాయుధుడనైన; | యది హన్యుః | = చంపినా కూడా; |
| మాం | = నన్ను; | తత్ | = అది; |
| శస్త్రపాణయః | = శస్త్రధారులైన; | మే | = నాకు; |
| ధార్తరాష్ట్రాః | = ధార్తరాష్ట్రులు; | క్షేమతరం | = ఇంతకన్నా మేలే; |
| | | భవేత్ | = అవుతుంది. |

**తా॥** ప్రతిఘటించకుండా, నిరాయుధుడనై ఉన్న నన్ను శస్త్రధారులైన దుర్యోధనాదులు యుద్ధంలో చంపినా చంపుతారు గాక! – ఆ చావు ఇంతకంటే మేలే అవుతుంది. 46

*సంజయ ఉవాచ :*

**ఏవ ముక్త్వాఽ ర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47**

*ఏవమ్, ఉక్త్వా, అర్జునః, సంఖ్యే, రథోపస్థే, ఉపావిశత్, విసృజ్య, సశరమ్, చాపమ్, శోకసంవిగ్నమానసః.*

| | | | |
|---|---|---|---|
| సంజయః | = సంజయుడు; | చాపమ్ | = వింటిని; |
| ఉవాచ | = పలికెను; | విసృజ్య | = విడిచి; |
| అర్జునః | = అర్జునుడు; | శోకసంవిగ్నమానసః | = దుఃఖ విదీర్ణ చిత్తుడై; |
| ఏవమ్ ఉక్త్వా | = ఇట్లు పలికి; | రథోపస్థే | = రథ మధ్యంలో; |
| సంఖ్యే | = యుద్ధమున; | ఉపావిశత్ | = కూలబడ్డాడు. |
| సశరమ్ | = బాణంతో ఉన్న; | | |

తా॥ *సంజయుడు పలికెను :* అర్జునుడు ఇలా పలికి, ఎక్కుపెట్టిన విల్లును వీడి, శోకతప్తచిత్తుడై రథమధ్యంలో కూలబడ్డాడు. 47

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాదయోగోనామః**
**ప్రథమోఽ ధ్యాయః**

శ్లోకాల సంఖ్య – 47.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## ద్వితీయో ఽ ధ్యాయః - సాంఖ్య యోగః

## (ద్వితీయాధ్యాయం - సాంఖ్య యోగం)

ద్వితీయే శోకసంతప్త మర్జునం బ్రహ్మవిద్యయా
ప్రతిబోధ్య హరిశ్చక్రే స్థితప్రజ్ఞస్య లక్షణమ్.[1]

*సఞ్జయ ఉవాచ :*

**తం తథా కృపయావిష్టం అశ్రుపూర్ణాకులేక్షణమ్ ।**
**విషీదంతమిదం వాక్యం ఉవాచ మధుసూదనః ॥** 1

*తమ్, తథా, కృపయా, ఆవిష్టమ్, అశ్రుపూర్ణ ఆకుల ఈక్షణమ్, విషీదంతమ్, ఇదమ్, వాక్యమ్, ఉవాచ, మధుసూదనః.*

సఞ్జయః = సంజయుడు;
ఉవాచ = పలికెను:
మధుసూదనః = శ్రీకృష్ణుడు;
తథా = ఆ విధంగా;
కృపయావిష్టం = దయావిష్టుడూ;
అశ్రుపూర్ణ ఆకుల ఈక్షణమ్ = నీరునిండి కలతపడిన కన్నులు గలవాడు;
విషీదంతమ్ = శోకిస్తున్నవాడైన;
తమ్ = ఆ అర్జునుని గూర్చి;
ఇదమ్ = ఈ,
వాక్యమ్ = మాటను;
ఉవాచ = పలికెను.

1. ద్వితీయాధ్యాయంలో శ్రీహరి శోకసంతప్తుడైన అర్జునుణ్ణి బ్రహ్మవిద్యచేత ప్రబోధించి, స్థితప్రజ్ఞుని లక్షణాలను ఉపదేశించాడు.

**తా॥** *సంజయుడు పలికెను :* ఈ రీతిగా అర్జునుడు దయావిష్ట చిత్తుడూ, శోకిస్తున్నవాడూ అయ్యి; అతని కన్నులు నీటితో నిండి కలతపడసాగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అతనితో ఈ విధంగా అన్నాడు. 1

*శ్రీ భగవానువాచ :*

**కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।**
**అనార్యజుష్టమస్వర్గ్యం అకీర్తికరమర్జున ॥** **2**

కుతః, త్వా, కశ్మలమ్, ఇదమ్, విషమే, సముపస్థితమ్, అనార్యజుష్టమ్, అస్వర్గ్యమ్, అకీర్తకరమ్, అర్జున.

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | అస్వర్గ్యమ్ | = స్వర్గ గతిరోధకము; |
| ఉవాచ | = పలికెను; | అకీర్తికరమ్ | = అపకీర్తిదాయకమైన; |
| అర్జున | = అర్జునా; | ఇదమ్ | = ఈ; |
| విషమే | = సంకటసమయంలో; | కశ్మలమ్ | = మోహము; |
| కుతః | = ఎక్కడ నుండి; | త్వా | = నీకు; |
| అనార్యజుష్టమ్ | = ఆర్యులు కాని వారు పొందునదీ; | సముపస్థితమ్ | = దాపురించినది? |

**తా॥** *శ్రీభగవానుడు[1] పలికెను :* అర్జునా! ఈ సంకట సమయంలో, ఆర్యులకు తగనిదీ, స్వర్గగతికి ప్రతిబంధకమూ, అపకీర్తిదాయకమూ అయిన ఈ మోహం నీకు ఎలా దాపురించింది? 2

---

1. (అ) ఐశ్వరస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః ।
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా ॥
వసంతి యత్రభూతాని భూతాత్మన్యఖిలాత్మని ।
సర్వభూతే ష్వ శేషేషు వకారార్థ స్తతోఽ వ్యయః ॥

జ్ఞానైశ్వర్య యశోవీర్య వైరాగ్య లక్ష్ములకు 'భగ' అని సంజ్ఞ; వీటితో ఒప్పారుతూ, భూతాల నన్నింటినీ తనయందు గలవాడు – భగవానుడు. – విష్ణుపురాణం. *6-5-74, 75*

(ఆ) ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతిం గతిమ్ ।
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవా నితి ॥

ప్రాణుల ఉత్పత్తివినాశాలను, రాకపోకలను, విద్యావిద్యలను ఎరిగినవాడు భగవత్ పదవాచ్యుడు. – విష్ణుపురాణం. *6-5-78*

**క్లైబ్యం మా స్మ గమః[1] పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప ॥ 3**

క్లైబ్యమ్, మా, స్మ, గమః, పార్థ, న, ఏతత్, త్వయి, ఉపపద్యతే, క్షుద్రమ్, హృదయదౌర్బల్యమ్, త్యక్త్వా, ఉత్తిష్ఠ, పరంతప.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | పరంతప | = శత్రుతాపనా; |
| క్లైబ్యం | = కాతరత; | క్షుద్రమ్ | = తుచ్ఛమైన; |
| మాస్మగమః | = పొందకు; | హృదయ దౌర్బల్యమ్ | = మనస్సులో అధైర్యాన్ని; |
| ఏతత్ | = ఇది; | | |
| త్వయి | = నీకు; | త్యక్త్వా | = విడిచి; |
| న ఉపపద్యతే | = తగదు; | ఉత్తిష్ఠ | = లెమ్ము. |

**తా॥** అర్జునా! కాతరతను పొందకు. ఇది నీకు తగదు. శత్రుతాపనా, తుచ్ఛమైన ఈ హృదయదౌర్బల్యాన్ని త్యజించి, యుద్ధం చేయడానికి సంసిద్ధుడవు కమ్ము, లెమ్ము! 3

అర్జున ఉవాచ :

**కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।**
**ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥ 4**

కథమ్, భీష్మమ్, అహమ్, సంఖ్యే, ద్రోణమ్, చ, మధుసూదన, ఇషుభిః, ప్రతియోత్స్యామి, పూజార్హౌ, అరిసూదన

| | | | |
|---|---|---|---|
| అరిసూదన | = శత్రుమర్దనా; | చ | = మరియు; |
| మధుసూదన | = శ్రీకృష్ణా; | ద్రోణమ్ | = ద్రోణుణ్ణి; |
| అహం | = నేను; | ప్రతి | = ఎదిరించి; |
| సంఖ్యే | = యుద్ధంలో; | ఇషుభిః | = బాణాలతో; |
| పూజార్హౌ | = పూజ్యులైన; | కథమ్ | = ఏ విధంగా; |
| భీష్మమ్ | = భీష్ముణ్ణి; | యోత్స్యామి | = యుద్ధం చేస్తాను? |

1. మాగచ్ఛ ఇతి - పాఠాంతరం.

**తా॥** అర్జునుడు పలికెను : శత్రుమర్దనా మధుసూదనా! (భయపడి యుద్ధం చేయనని నేను అనడం లేదు. ఇది అధర్మం, అన్యాయం) భీష్మద్రోణాదులు పూజ్యులు. (వాగ్యుద్ధమే తగని వారి పట్ల) వారిపై బాణాలను ఎలా వేస్తాను? 4

**గురూనహత్వా హి మహానుభావాన్**[1]
**శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే ।**
**హత్వాఽర్థ కామాంస్తు గురూనిహైవ**
**భుంజీయభోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥** **5**

*గురూన్, అహత్వా, హి, మహానుభావాన్,*
*శ్రేయః, భోక్తుమ్, భైక్ష్యమ్, అపి, ఇహ, లోకే,*
*హత్వా, అర్థకామాన్, తు, గురూన్, ఇహ, ఏవ*
*భుంజీయ, భోగాన్, రుధిరప్రదిగ్ధాన్*

| | | | |
|---|---|---|---|
| హి | = ఎందుకంటే; | గురూన్ | = గురుజనులను; |
| మహానుభావాన్ | = మహానుభావులైన; | హత్వాతు | = చంపితే; |
| గురూన్ | = గురుజనులను; | రుధిరప్రధిగ్ధాన్ | = రక్తసిక్తములైన; |
| అహత్వా | = వధింపకుండా; | అర్థ కామాన్ | = ధనసంపదలను, కామ్యవస్తువులను; |
| ఇహలోకే | = ఈ లోకంలో; | | |
| భైక్ష్యమపి | = భిక్షాన్నమైనా; | భోగాన్ | = భోగ్యవిషయాలను; |
| భోక్తుం | = తినడం; | ఇహ ఏవ | = ఈ జగత్తులోనే; |
| శ్రేయః | = మేలు; | భుంజీయ | = అనుభవిస్తాను. |

**తా॥** (వారిని వధించకపోతే, నీ బ్రతుకుతెరువేమిటి? అంటావా:) మహానుభావులైన గురుజనులను వధించకుండా, భిక్షాన్న గ్రహణమొనర్చి జీవించినా, నాకు మేలే అవుతుంది కాని, వారిని చంపితే, వారి నెత్తురుతో తడిసిన ధనసంపదలను, కామ్యభోగాలను కదా అనుభవిస్తాను. 5

1. మహానుభవాన్. – పాఠాంతరం

**నచైతద్విద్మః కతరన్నో గరీయో**
**యద్వా జయేమ యది వా నో జయేయుః ।**
**యా నేవ హత్వా న జిజీవిషామః**
**తే௨వస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥** **6**

*న, చ, ఏతత్, విద్మః, కతరత్, నః, గరీయః,*
*యత్, వా, జయేమ, యది, వా, నః, జయేయుః,*
*యాన్, ఏవ, హత్వా, న, జిజీవిషామః,*
*తే, అవస్థితాః, ప్రముఖే, ధార్తరాష్ట్రాః*

| | | | |
|---|---|---|---|
| యద్వాజయేమ | = మనం జయంపొందినా; | న విద్మః | = ఎరుగము; |
| యది వా | = లేక; | యాన్ | = ఎవరిని; |
| నః | = మనలను (వీరు); | హత్వా | = చంపి; |
| జయేయుః | = జయించినా; | న జిజీవిషామః | = జీవింపగోరమో; |
| నః | = మనకు; | తే | = ఆ; |
| కతరత్ | = ఏది; | ధార్తరాష్ట్రాః ఏవ | = దుర్యోధనాదులే; |
| గరీయః | = శ్రేయస్కరమో; | ప్రముఖే | = ఎట్టయెదుట; |
| ఏతత్ చ | = దీనిని; | అవస్థితాః | = ఉన్నారు. |

**తా॥** (అధర్మదోషాన్ని అంగీకరించి యుద్ధంచేసినా) మనం వారిని జయించడమా? లేక వారు మనల్ని జయించడమా? –ఈ రెంటిలో ఏది శ్రేయమో తెలియజాలకున్నాను. (మరియు, మన జయించినా అది పరాజయంతోనే సమమౌతుంది.) ఎవరిని వధించి మనం జీవింపగోరమో, ఆ దుర్యోధనాదులే మన ఎదుట ఉన్నారు. 6

**కార్పణ్యదోషోపహత స్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।**
**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్యస్తే௨హం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥** **7**

కార్పణ్య దోష ఉపహత స్వభావః,
పృచ్ఛామి, త్వామ్, ధర్మసమ్మూఢచేతాః,
యత్, శ్రేయః, స్యాత్, నిశ్చితమ్, బ్రూహి, తత్, మే,
శిష్యః, తే, అహమ్, శాధి, మామ్, త్వామ్, ప్రపన్నమ్.

| | | | |
|---|---|---|---|
| [1]కార్పణ్య దోష ఉపహత స్వభావః | = దైన్యదోషాభి భూతస్వభావుడను; | తత్ | = అది; |
| | | నిశ్చితమ్ | = నిశ్చయపూర్వకంగా; |
| ధర్మసమ్మూఢచేతాః | = ధర్మాధర్మ వివేక రహిత మనస్కుడనై; | బ్రూహి | = చెప్పు; |
| | | అహమ్ | = నేను; |
| త్వామ్ | = నిన్ను; | తే | = నీ; |
| పృచ్ఛామి | = అడుగుతున్నాను; | శిష్యః | = శిష్యుణ్ణి; |
| మే | = నాకు; | త్వామ్ | = నిన్ను; |
| యత్ | = ఏది; | ప్రపన్నమ్ | = శరణుజొచ్చినవాణ్ణైన; |
| శ్రేయః | = మేలు; | మామ్ | = నన్ను; |
| స్యాత్ | = అగునో; | శాధి | = శాసించు. |

**తా॥** (కులక్షయ భయంతో వీరిని చంపి ఎలా జీవించగలను అనే) దీనతాదోషంతో నా శౌర్యస్వభావం సన్నగిల్లింది; నా చిత్తం ధర్మసందేహంలో[2] చిక్కుకుంది. నేను నిన్ను ప్రార్థిస్తున్నాను, నా కేది శుభమో నిశ్చయించి చెప్పు. నేను నీ శిష్యుణ్ణి, శరణాగతుణ్ణి, నన్ను శాసించు. 7

**న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్**
**యచ్ఛోక ముచ్ఛోషణమింద్రియాణామ్ ।**
**అవాప్య భూమా వసపత్నమృద్ధమ్**
**రాజ్యంసురాణామపి చాధిపత్యమ్ ॥** 8

---

1. యో నా ఏతదక్షరం గార్గి అవిదిత్వా అస్మాత్ లోకాత్ ప్రైతిసకృపణః
ఎవరు ఈ అక్షరబ్రహ్మాన్ని తెలుసుకోకుండా ఇహలోకం నుండి నిష్క్రమిస్తాడో అతడు కృపణుడు.
– బృహదారణ్యకోపనిషత్తు *3-8-10*

2. యుద్ధత్యాగం చేసి భిక్షావృత్తిని గ్రహించడం క్షత్రియధర్మం అవుతుందో కాదో నిశ్చయించజాలకున్నాను.

న, హి, ప్రపశ్యామి, మమ, అపనుద్యాత్,
యత్, శోకమ్, ఉచ్ఛోషణమ్, ఇంద్రియాణామ్,
అవాప్య, భూమౌ, అసపత్నమ్, ఋద్ధమ్,
రాజ్యమ్, సురాణామ్, అపి, చ, ఆధిపత్యమ్.

| | | | |
|---|---|---|---|
| భూమౌ | = పృథ్విపై; | యత్ | = ఏది; |
| అసపత్నమ్ | = శత్రుశూన్యాన్ని; | మమ | = నా; |
| ఋద్ధమ్ | = సమృద్ధమైన; | ఇంద్రియాణామ్ | = ఇంద్రియాల; |
| రాజ్యమ్ | = రాజ్యాన్ని; | ఉత్ శోషణమ్ | = ఎండించివేస్తున్న; |
| సురాణామపి ఆధిపత్యం చ | =దేవతలపై అధికారం, స్వర్గరాజ్యాన్ని; | శోకమ్ | = శోకాన్ని; |
| | | అపనుద్యాత్ | = నివారించగలదో; |
| అవాప్య | = పొందినా; | నహి ప్రపశ్యామి | = కనుగొనలేకున్నాను. |

**తా॥** (నన్నే ఆలోచించి ఒనర్చమంటావా–) శత్రువిహీనమైన, సమృద్ధమైన భూలోకరాజ్యాన్నే కాదు స్వర్గాధిపత్యాన్ని పొందినా కూడా, ఇంద్రియ సంతాప కరమైన ఈ శోకాన్ని నివారించే ఉపాయాన్ని కనుగొనలేకున్నాను. 8

సఞ్జయ ఉవాచ :

**ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః[1] ।**
**న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9**

ఏవమ్, ఉక్త్వా, హృషీకేశమ్, గుడాకేశః, పరన్తపః,
న, యోత్స్య, ఇతి, గోవిందమ్, ఉక్త్వా, తూష్ణీమ్, బభూవ, హ.

| | | | |
|---|---|---|---|
| సఞ్జయః | = సంజయుడు; | ఉక్త్వా | = పలికి; |
| ఉవాచ | = పలికెను; | న యోత్స్య | = యుద్ధం చేయను; |
| పరన్తపః | = శత్రుతాపకుడైన; | ఇతి | = ఇలా; (అని) |
| గుడాకేశః | = అర్జునుడు; | గోవిందమ్ | = కృష్ణునితో; |
| హృషీకేశమ్ | = శ్రీకృష్ణునితో; | ఉక్త్వా | = పలికి; |
| ఏవమ్ | = ఇలా; | తూష్ణీం బభూవ హ | = మౌనం వహించాడు. |

1. పరన్తప' – పాఠాంతరం.

**తా॥** సంజయుడు పలికెను : శత్రుతాపనుడు, జితనిద్రుడు అయిన అర్జునుడు శ్రీకృష్ణునితో ఇలా పలికి 'నేను యుద్ధం చేయను' అని వచించి మౌనం వహించాడు. 9

**తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।**
**సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః ॥ 10**

*తమ్, ఉవాచ, హృషీకేశః, ప్రహసన్, ఇవ, భారత,*
*సేనయోః, ఉభయోః, మధ్యే, విషీదన్తమ్, ఇదమ్, వచః*

| | | | |
|---|---|---|---|
| భారత | = ధృతరాష్ట్రా; | తమ్ | = అతనిని; |
| హృషీకేశః | = శ్రీకృష్ణుడు; | ప్రహసన్ ఇవ | = మందహాసంతో; |
| ఉభయోః | = రెండు; | ఇదమ్ | = ఈ; |
| సేనయోః మధ్యే | = సేనల నడుమ; | వచః | = వాక్కును; |
| విషీదంతమ్ | = విషణ్ణుడైన; | ఉవాచ | = పలికెను. |

**తా॥** ఓ ధృతరాష్ట్రా! శ్రీకృష్ణుడు రెండుసేనల నడుమ (నిలిచి) విషాదగ్రస్తుడైన అర్జునుణ్ణి ఉపహసిస్తూ ఇలా పలికెను. 10

*శ్రీ భగవానువాచ :*

**అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥ 11**

*అశోచ్యాన్, అన్వశోచః, త్వమ్, ప్రజ్ఞావాదాన్, చ, భాషసే,*
*గతాసూన్, అగతాసూన్, చ, న, అనుశోచంతి, పండితాః*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | భాషసే | = పలుకుతున్నావు; |
| ఉవాచ | = పలికెను; | పండితాః | = జ్ఞానులు; |
| త్వమ్ | = నీవు; | గత అసూన్ | = మృతులను గురించి గాని; |
| అశోచ్యాన్ | = శోకింపదగని వారికొఱకు; | అగత్ అసూన్ చ | = జీవించివున్న వారిని గురించి గాని; |
| అను అశోచః | = దుఃఖిస్తున్నావు; | న అనుశోచంతి | = దుఃఖించరు. |
| ప్రజ్ఞావాదాన్ చ | = జ్ఞానులకు తగిన పలుకులను; | | |

*(దేహ-ఆత్మ భేదం తెలియకపోవడం వల్ల, అర్జునునికి ఈ శోకం వాటిల్లింది; దేహాత్మ భేద నిరూపణ కొరకు)*

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* శోకింపదగని వారి గూర్చి నీవు [యుద్ధార్థం అరుదెంచిన బంధువులను చూస్తే నోరు ఎండిపోతోంది *(గీత. 1.29)* అని] దుఃఖిస్తున్నావు. [ఈ మోహం నీకు ఎలా దాపురించింది? *(గీ. 2.2)* అని నిన్ను ప్రబోధించి ఉన్నాను.] అయినప్పటికీ, జ్ఞాని వలె భాషిస్తున్నావు. *(యథార్థ)* జ్ఞానులు మరణించిన వారిని గురించి గాని, జీవించి ఉన్న వారిని గురించి గాని (నేను లేకపోతే వీరెలా జీవిస్తారని) దుఃఖించరు. 11

**న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।**
**న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ॥ 12**

*న, తు, ఏవ, అహమ్, జాతు, న, ఆసమ్, న, త్వమ్, న, ఇమే, జనాధిపాః, న, చ, ఏవ, న, భవిష్యామః, సర్వే, వయమ్, అతః, పరమ్.*

| | | | |
|---|---|---|---|
| జాతు | = ఒకప్పుడు; | న | = లేదు; |
| అహమ్ | = నేను; | అతః పరమ్ | = ఇక మీదట; |
| న తు ఆసమ్ | = లేను అని అనుట; | వయమ్ | = మనం; |
| న త్వమ్ | = నీవు; | సర్వే | = అందరము; |
| ఇమే | = ఈ; | న చ భవిష్యామః | = ఉండబోవమనడం; |
| జనాధిపాః | = రాజులు; | న ఏవ | = లేనే లేదు. |
| న | = లేరు అనేది; | | |

**తా॥** (దుఃఖించవలసిన అగత్యం లేదు; పరమేశ్వరుడనైన) నేను, నీవు, ఈ రాజులు పూర్వం ఒకప్పుడు లేకున్నామనడం సత్యం కాదు. ఈ శరీరధారణకు పూర్వం మనమందరమూ నిత్యాత్మ స్వరూపంలో ఉన్నాం. ఈ దేహ త్యాగానంతరం, మనమెవ్వరం నశించం. వర్తమాన కాలంలో కూడా మనం నిత్యఆత్మ స్వరూపంలో ఉన్నాం. భవిష్యత్తులో కూడా ఉంటాం. (నీవు, రాజులు జీవులు కాబట్టి నా అంశలై నిత్యులవుతున్నారు.)[1] 12

1. జీవుడు పరమాత్మ రూపంలో నిత్యుడు, అమరుడు అని శంకరులు వివరిస్తారు.

**దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా[1] ।**
**తథా దేహాంతర ప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి ॥ 13**

*దేహినః, అస్మిన్, యథా, దేహే, కౌమారమ్, యౌవనమ్, జరా, తథా, దేహాంతర ప్రాప్తిః, ధీరః, తత్ర, న, ముహ్యతి.*

| | | | |
|---|---|---|---|
| దేహినః | = దేహాభిమానియైన జీవునికి; | తథా | = అలాగే; |
| అస్మిన్ | = ఈ; | దేహాంతరప్రాప్తిః | = మృత్యువు, అన్యదేహ ధారణం కలుగుతున్నాయి; |
| దేహే | = స్థూల శరీరానికి; | తత్ర | = ఆ విషయమై; |
| కౌమారమ్ | = బాల్యం; | ధీరః | = జ్ఞాని; |
| యౌవనమ్ | = యౌవనం; | న ముహ్యతి | = మోహగ్రస్తుడు కాడు, శోకించడు. |
| జరా | = వార్ధక్యం; | | |
| యథా | = ఎలాగైతే; | | |

**తా॥** (ఈశ్వరుడవైన నీకు జననమరణాలు లేకపోవడం సత్యమే, జీవునికి ఇవి ఉండడం సాధారణమే అని అంటే) దేహాభిమానియైన జీవునికి ఈ దేహంలో బాల్య, యౌవన, వార్ధక్యాలు క్రమంగా కలుగుతున్నా జీవునికి ఎటువంటి మార్పూ కలగడం లేదు. అదే విధంగా దేహాంతరప్రాప్తియైనా జీవునికి ఎటువంటి మార్పూ కలుగదు. కనుక, జ్ఞానులు ఈ విషయంలో శోకించరు. 13

**మాత్రా స్పర్శాస్తు[2] కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత ॥ 14**

*మాత్రా స్పర్శాః, తు, కౌంతేయ, శీతోష్ణ సుఖదుఃఖదాః, ఆగమాపాయినః, అనిత్యాః, తాన్, తితిక్షస్వ, భారత.*

---

1. విసర్గాద్యాః శ్మశానాంతా భావాదేహస్య నాత్మనః – శ్రీమద్భాగవతం . 11,7,48.
2. మీయంతే జాయంతే ఆభిః శబ్దాదివిషయాః ఇతిమాత్రాః = ఇంద్రియాలు.
అవి – త్వక్ చక్షుః కర్ణ జిహ్వా ఘ్రాణములు.
స్పృశ్యంతే ఇతి స్పర్శాః = ఇంద్రియవిషయములు,
అవి – శబ్ద స్పర్శ రూప రస గంధములు.

| | |
|---|---|
| కౌంతేయ = అర్జునా; | ఆగమాపాయినః= ఉత్పత్తివినాశశీలములు; |
| మాత్రాస్పర్శాః తు = ఇంద్రియాలు, తద్విషయాలు; | అనిత్యాః = అనిత్యమైనవి; |
| | భారత = అర్జునా; |
| శీత ఉష్ణ సుఖ దుఃఖదాః = శీతోష్ణాలను, సుఖదుఃఖాలను కలిగించేవి; | తాన్ = ఈ మాత్రాస్పర్శలను; |
| | తితిక్షస్వ = సహించు. |

**తా॥** ('నేను దుఃఖిస్తోంది వారి కోసం కాదు. వారి వియోగంతో నాకే దుఃఖం కలుగుతుందని భయపడుతున్నాను' అని అంటావా:) ఓ కౌంతేయా! విషయేంద్రియ సంయోగం వల్లనే శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, అనుభూతమౌతు న్నాయి. (అదేవిధంగా, ప్రియజన సంయోగ వియోగాలు కూడా సుఖదుఃఖాలను కలిగిస్తున్నాయి.) కాని, ఇవన్నీ అనిత్యమైనవి, ఉత్పత్తి వినాశ శీలములై ఉన్నాయి. వీటినన్నింటిని (ధీరుడవైన) నీవు సహించు. 14

**యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమ దుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15**

*యమ్, హి, న, వ్యథయంతి, ఏతే, పురుషమ్, పురుష ఋషభ,*
*సమ దుఃఖసుఖమ్, ధీరమ్, సః, అమృతత్వాయ, కల్పతే.*

| | |
|---|---|
| పురుష ఋషభ = పురుష శ్రేష్ఠా; | ధీరమ్ పురుషమ్ = ధీర వ్యక్తిని; |
| ఏతే = ఈ శీతోష్ణాదులు; | న వ్యథయన్తి = బాధ పెట్టవో; |
| సమ దుఃఖసుఖమ్ = సుఖదుఃఖాల పట్ల సమభావాన్ని పొందిన, చలింపని; | సః హి = అతడే కదా; |
| | అమృతత్వాయకల్పతే = అమృతత్వాన్ని, మోక్షాన్ని ప్రాప్తించుకుంటాడు. |
| యమ్ = ఏ; | |

**తా॥** (దుఃఖప్రతీకార ప్రయత్నం కంటె, తత్సహనమే మహాఫలప్రదం.) ఏందుకంటే, పురుష శ్రేష్ఠా! సుఖదుఃఖాలను సమానంగా స్వీకరిస్తూ, చలించని ఏ ధీరునికి శీతోష్ణాది ద్వంద్వాలు వ్యథను కలిగించవో, అతడే అమృతత్వాన్ని (మోక్షం) పొందడానికి అర్హత గలవాడు. 15

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।**
**ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ 16**

న, అసతః, విద్యతే, భావః, న, అభావః, విద్యతే, సతః,
ఉభయోః, అపి, దృష్టః, అంతః, తు, అనయోః, తత్త్వదర్శిభిః.

| | | | |
|---|---|---|---|
| అసతః | = అసద్వస్తువుకు; | తత్త్వదర్శిభిః | = తత్వవేత్తలచే; |
| భావః | = అస్తిత్వం, ఉనికి; | అనయోః | = ఈ; |
| న విద్యతే | = లేదు; | ఉభయోః అపి | = రెంటియొక్క; |
| సతః | = సద్వస్తువుకు; | అన్తః | = తుది స్వరూపం; |
| అభావః | = వినాశం; | దృష్టః | = చూడబడింది. (ఉపలబ్ధము) |
| న విద్యతే | = లేదు; | | |
| తు | = కాని; | | |

**తా॥** ('శీతోష్ణాదులు అత్యంత దుస్సహములు, వీటిని ఎలా సహించగలను, సహించినప్పటికీ ఆత్మవినాశమే చేకూరగలదు'- అనే శంక అసంగతం. ఎందుకంటే, తత్త్వవిచారంతో వీటినన్నింటిని సహించగలం.) అసత్తకు (అనాత్మ వస్తువులైన శీతోష్ణాదులకు ఆత్మయందు) ఉనికి లేదు; సద్వస్తువుకు (ఆత్మకు) వినాశం లేదు. తత్త్వవేత్తలు సత్-అసత్[1] వస్తువుల యథార్థ స్వరూపాన్ని సాక్షాత్కరించుకున్నారు. (ఇలా విచారణ చేసి సహించాలి.)

(గీత: 13-34, 14-19, 15-16, 17-18 చూ:) 16

**అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।**
**వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి ॥ 17**

అవినాశి, తు, తత్, విద్ధి, యేన, సర్వమ్, ఇదమ్, తతమ్,
వినాశమ్, అవ్యయస్య, అస్య, న, కశ్చిత్, కర్తుమ్, అర్హతి.

| | | | |
|---|---|---|---|
| యేన | = దేని చేత; | తత్ తు | = దానినే; |
| ఇదమ్ సర్వమ్ | = ఈ జగత్తంతా; | అవినాశి | = వినాశ రహితంగా; |
| తతమ్ | = పరివ్యాప్తమో; | విద్ధి | = గ్రహించు; |

1. సత్ - భూత, భవిష్యత్, వర్తమాన కాలాల్లో ఉండేది,
అసత్ - మూడు కాలాలలోనూ లేనిది, మరియు 'వంధ్యాపుత్రుని' వలె ఏమాత్రం ఉనికి లేనిది.
మిథ్య - అస్తిత్వం లేకపోయినా 'రజ్జు-సర్పం' న్యాయంగా ఉన్నట్లుగా భ్రమింపజేస్తోంది. జగత్తు ఈ విధంగా మిథ్య, అసత్తు కాదు. సద్వస్తువైన ఆత్మకు ఎన్నడూ వినాశం లేదు. ఆత్మ సత్త మూడు కాలాలలోనూ ఉంది, ఇది అబాధితము. ఆత్మేతరమైనవి ఎన్నడూ 'సత్త' కాజాలవు.

| | | | |
|---|---|---|---|
| కశ్చిత్ | = ఎవరు; | వినాశమ్ | = వినాశం; |
| అస్య | = ఈ; | కర్తుమ్ | = చేకూర్చడానికి; |
| అవ్యయస్య | = అవ్యయాత్మకు; | న అర్హతి | = సమర్థుడు కాడు. |

**తా॥** (సద్వస్తువుకు పూర్వశ్లోకంలో సామాన్యంగా చెప్పబడిన అవినాశిత్వమే వివరింపబడుతోంది :) ఏది ఈ (ఆగమాపాయి ధర్మాత్మకమైన దేహాది) సర్వ జగత్తును (సాక్షిస్వరూపంలో) వ్యాపించి ఉన్నదో, ఆ ఆత్మవస్తువు (స్వరూపం) అవినాశి అని గ్రహించు. ఎందువలన అంటే, ఈ అవ్యయాత్మను వినష్టమొనర్చగల వారు లేరు. 17

**అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత ॥ 18**

*అన్తవన్తః, ఇమే, దేహాః, నిత్యస్య, ఉక్తాః, శరీరిణః,*
*అనాశినః, అప్రమేయస్య, తస్మాత్, యుధ్యస్వ, భారత.*

| | | | |
|---|---|---|---|
| నిత్యస్య | = నిత్యము; | అన్తవన్తః | = వినాశశీలములు, |
| అనాశినః | = అవినాశియు; | | నశ్వరాలు; |
| అప్రమేయస్య | = ప్రమాణాతీతమైన; | ఉక్తాః | = అని చెప్పబడినవి; |
| శరీరిణః | = ఆత్మ ధరించే; | భారత | = అర్జునా; |
| ఇమే | = ఈ; | తస్మాత్ | = కనుక; |
| దేహాః | = శరీరాలు; | యుధ్యస్వ | = యుద్ధం చెయ్యి. |

**తా॥** ఆత్మ ప్రత్యక్షాది ప్రమాణాలకు అతీతం, అవినాశి, నిత్యం; కాని, ఈ ఆత్మదాల్చే దేహాలను నశ్వరాలని (తత్త్వవేత్తలు) చెబుతారు. కాబట్టి యుద్ధం ఒనర్చు (క్షాత్ర ధర్మాన్ని పరిత్యజించకు). 18

**య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే ॥ 19**

*యః, ఏనమ్, వేత్తి, హన్తారమ్, యః, చ, ఏనమ్, మన్యతే, హతమ్,*
*ఉభౌ, తౌ, న, విజానీతః, న, అయమ్, హన్తి, న, హన్యతే.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | తౌ ఉభౌ | = ఆ ఇరువురూ; |
| ఏనమ్ | = ఈ ఆత్మను; | (తత్త్వాన్ని); | |
| హన్తారమ్ = చంపు దానిగా; | | న విజానీతః | = ఎరుగని వారు; |
| వేత్తి | = తలుస్తాడో; | (ఏలనన) | |
| యః చ | = మఱియు ఎవడు; | అయం | = ఈ ఆత్మ; |
| ఏనమ్ | = దీనిని; | న హన్తి | = చంపదు; |
| హతమ్ | = చంపబడే దానిగా; | న హన్యతే | = చంపబడదు. |
| మన్యతే | = ఎంచుతాడో; | | |

**తా॥** [ముందు చెప్పబడిన శ్లోకాల ద్వారా భీష్మాదుల మృతిని గూర్చి శోకం నివారించబడింది, ఇక ఆత్మను హన్తగా తలచి 'వీరిని చంపగోరను' (అ.1 శ్లో.34) అనే దుఃఖవైఖరి కూడా అయుక్తమే!] ఎవరు ఈ ఆత్మను హన్తగా తలచుచున్నారో, మఱియు ఎవరు ఈ ఆత్మను నిహతంగా తలచుచున్నారో, ఆ ఉభయులు కూడా ఆత్మస్వరూపాన్ని ఎరుగరు. ఈ ఆత్మ దేనినీ చంపడం లేదు; దేని చేతా కూడా చంపబడడం లేదు. ఈ ఆత్మ, అవికారి.

(గీత. 13 - 31; 18 -17 చూ.) 19

**న జాయతే మ్రియతే వా కదాచిత్**
**నాయం భూత్వా ఽభవితా వా న భూయః ।**
**అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥** 20

*న, జాయతే, మ్రియతే, వా, కదాచిత్,*
*న, అయమ్, భూత్వా, అభవితా, వా, న, భూయః,*
*అజః, నిత్యః, శాశ్వతః, అయమ్, పురాణః,*
*న, హన్యతే, హన్యమానే, శరీరే.*

| | | | |
|---|---|---|---|
| అయమ్ | = ఈ ఆత్మ; | భూత్వా | = ఒకప్పుడుండి; |
| కదాచిత్ | = ఒకప్పుడు; | భూయః | = మళ్ళీ; |
| న జాయతే | = జన్మించడం లేదు; | అభవితా | = ఉండనిది; |
| న వా మ్రియతే = మరణించడం లేదు; | | న | = కాదు; |

| | | | |
|---|---|---|---|
| (కనుక ఆత్మకు మృత్యువు లేదు) | | అజః | = జన్మరహితమైనది; |
| న భూత్వా | = ఒకప్పుడుండక; | శరీరే | = దేహం; |
| భూయః | = మరల; | హన్యమానే | = హతమౌతున్నా; |
| భవితావా | = కలుగునది; | న హన్యతే | = చంపబడదు; |
| న | = కాదు; | నిత్య | = మృత్యువు లేనిది; |
| (కనుక ఆత్మకు జన్మ లేదు) | | శాశ్వతః | = నాశం లేనిది; |
| అయమ్ | = ఈ ఆత్మ; | పురాణః | = వృద్ధి లేనిది. |

**తా॥** ఈ ఆత్మ ఎన్నడూ జన్మించడం లేదు, మరణించడం లేదు. ఏలనన, పూర్వం ఉండకుండా తరువాత ఉండడమే జన్మ; పూర్వం ఉండి తరువాత ఉండకపోవడమే మృత్యువు. ఆత్మకు ఈ రెండిటిలో ఏ ఒక్కటీ లేదు. అంటే, ఆత్మకు జనన మరణాలు, వృద్ధి క్షయాలు లేవు. శరీరం నశించినప్పటికీ ఈ ఆత్మ వినష్టం కాదు.[1] 20

**వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।**
**కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥ 21**

వేద, అవినాశినమ్, నిత్యమ్, యః, ఏనమ్, అజమ్, అవ్యయమ్, కథమ్, సః, పురుషః, పార్థ, కమ్, ఘాతయతి, హన్తి, కమ్.

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | సః | = ఆ; |
| ఏనమ్ | = ఈ ఆత్మను; | పురుషః | = వ్యక్తి; |
| అవినాశినమ్ | = నాశం లేనిది; | కథం | = ఎలా; |
| నిత్యమ్ | = వృద్ధిరహితం; | కమ్ | = దేనిని; |
| అజమ్ | = జన్మరహితం; | ఘాతయతి | = చంపించును; |
| అవ్యయమ్ | = క్షయం లేనిదని; | కమ్ | = దేనిని; |
| వేద | = గ్రహిస్తాడో; | హంతి | = చంపును? |
| పార్థ | = అర్జునా; | | |

1. అ) జన్మ, అస్తిత్వం (ఉనికి), వృద్ధి, పరిణామం (మార్పు), అపక్షయం (తరుగు), వినాశం – అనే వికారాలు జడానికి ఉంటాయి. చైతన్యమయమైన ఆత్మకు ఈ షడ్విధ (ఆరు రకాల) భావవికారాలు లేవు.

ఆ) వేదాంత సూత్రమ్. 2-3-16, 17; కఠోపనిషత్. 1-2-19, 20. చూ.

**తా॥** పార్థా! ఈ ఆత్మను అవినాశి, నిత్యం, అజం, అవ్యయం - అని గ్రహించిన వ్యక్తి, ఎవరిని ఎలా చంపిస్తాడు? ఎవరిని ఎలా చంపుతాడు? 21

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా-**
**న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22**

*వాసాంసి, జీర్ణాని, యథా, విహాయ, నవాని, గృహ్ణాతి, నరః, అపరాణి, తథా, శరీరాణి, విహాయ, జీర్ణాని, అన్యాని, సంయాతి, నవాని, దేహీ.*

| | | | |
|---|---|---|---|
| నరః | = మనుష్యుడు; | తథా | = అదే విధంగా; |
| యథా | = ఏ విధంగా; | దేహీ | = ఆత్మ; |
| జీర్ణాని | = జీర్ణమైన; | జీర్ణాని | = జీర్ణమైన; |
| వాసాంసి | = వస్త్రాలను; | శరీరాణి | = దేహాలను; |
| విహాయ | = వదిలి; | విహాయ | = త్యజించి; |
| అపరాణి | = అన్యమైన; | అన్యాని | = ఇతరమైన; |
| నవాని | = నూతన (వస్త్రాలను); | నవాని | = నూతన (దేహాలను); |
| గృహ్ణాతి | = గ్రహిస్తాడో; | సంయాతి | = పొందుతుంది. |

**తా॥** (ఆత్మ అవినాశియే కాని, తత్-శరీర నాశం గురించే దుఃఖిస్తున్నాను, అని అంటావా:) మనుజుడు జీర్ణమైన వస్త్రాలను పరిత్యజించి ఇతర నూతన వస్త్రాలను ధరించే విధంగా, జీవాత్మ కూడా జీర్ణించిన దేహాలను వీడి, నూతన దేహాలను పొందుతోంది. (కర్మ భోగార్థం ఈ నూతన దేహాల ప్రయోజనం ఉంది కాబట్టి, దుఃఖింప పని లేదు.) 22

**నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥ 23**

*న, ఏనమ్, ఛిందంతి, శస్త్రాణి, న, ఏనమ్, దహతి, పావకః, న, చ, ఏనమ్, క్లేదయన్తి, ఆపః, న, శోషయతి, మారుతః.*

| | | | |
|---|---|---|---|
| ఏనమ్ | = ఈ ఆత్మను; | ఏనమ్ | = దీనిని; |
| శస్త్రాణి | = శస్త్రాలు; | అపః చ | = నీళ్లు; |
| న ఛిన్దన్తి | = ఛేదించ లేదు; | న క్లేదయంతి | = తడుప లేవు; |
| పావకః | = అగ్ని; | మారుతః | = వాయువు; |
| ఏనం | = దీనిని; | న శోషయతి | = ఎండింపజాలదు. |
| న దహతి | = దహించ లేదు; | | |

**తా॥** (ఆత్మ అవినాశి అని దృఢపరచడానికి ఆత్మ హనన సాధన భావం ప్రదర్శించ బడుతోంది :) ఎటువంటి శస్త్రమైనా ఈ ఆత్మను ఛేదించ లేదు, అగ్ని దహించ లేదు, నీరు తడుప లేదు, గాలి ఎండింపజాలదు. 23

**అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్య ఏవ చ ।**
**నిత్యః సర్వగతః స్థాణురచలోఽ యం సనాతనః ॥ 24**

*అచ్ఛేద్యః, అయమ్, అదాహ్యః, అయమ్, అక్లేద్యః, అశోష్యః, ఏవ, చ, నిత్యః, స్సర్వగతః, స్థాణుః, అచలః, అయమ్, సనాతనః.*

| | | | |
|---|---|---|---|
| అయమ్ | = ఈ ఆత్మ; | అయమ్ | = ఈ ఆత్మ; |
| అచ్ఛేద్యః | = ఛేధించబడనిది; | నిత్యః | = నిత్యం; |
| అదాహ్యః | = దహింపబడనిది; | సర్వగతః | = సర్వవ్యాపి; |
| అయమ్ | = ఇది; | స్థాణుః | = స్థిరమైనది; |
| అక్లేద్యః | = తడుపబడనిది; | అచలః | = మార్పు లేనిది; |
| అశోష్యః చ ఏవ | = ఎండింపరానిది; | సనాతనః | = సనాతనమైంది. |

**తా॥** ఈ ఆత్మ (నిరవయవి అవడం వల్ల) అచ్ఛేద్యం -ఛేదింప శక్యం కానిది; అక్లేద్యం -తడపడానికి సాధ్యం కానిది; (అమూర్తమగుట జేసి) అదాహ్యం; (అద్రవ్యమవడం వల్ల) అశోష్యం; మరియు, నిత్యం, సర్వవ్యాపి, స్థిరం, అచలం, సనాతనం. 24

**అవ్యక్తోఽ యమచిన్త్యోఽ యం అవికార్యోఽ యముచ్యతే ।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ 25**

*అవ్యక్తః, అయమ్, అచిన్త్యః, అయమ్, అవికార్యః, అయమ్, ఉచ్యతే, తస్మాత్, ఏవమ్, విదిత్వా, ఏనమ్, న, అనుశోచితుమ్, అర్హసి.*

| | | | |
|---|---|---|---|
| అయమ్ | = ఈ ఆత్మ; | తస్మాత్ | = అందువల్ల; |
| అవ్యక్తః | = ఇంద్రియాదులకు గోచరం కానిది; | ఏనమ్ | = ఈ ఆత్మను; |
| | | ఏవమ్ | = ఈ రీతిగా; |
| అయమ్ | = ఇది; | విదిత్వా | = గ్రహించి; |
| అచిన్త్యః | = మనస్సుకు అందనిది; | అనుశోచితుమ్ | = దుఃఖించడానికి; |
| అయమ్ | = ఇది; | న అర్హసి | = తగవు (దుఃఖించడం అనుచితం) |
| అవికార్యః | = మార్పు లేనిది; | | |
| ఉచ్యతే | = (అని) చెప్పబడుచున్నది; | | |

**తా॥** ఈ ఆత్మ అవ్యక్తం, అచింత్యం, అవికారి అని శాస్త్రాలు చెబుతున్నాయి; అందువల్ల నీవు ఈ ఆత్మ స్వరూపాన్ని గ్రహించి దుఃఖాన్ని పరిత్యజించు. 25

**అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।**
**తథాపి త్వం మహాబాహో నైవం[1] శోచితుమర్హసి ॥ 26**

అథ, చ, ఏనమ్, నిత్యజాతమ్, నిత్యమ్, వా, మన్యసే, మృతమ్, తథాపి, త్వమ్, మహాబాహో, న, ఏవమ్, శోచితుమ్, అర్హసి.

| | | | |
|---|---|---|---|
| అథ చ | = కాకున్న; | తథాపి | = ఆవిధంగా కూడా; |
| ఏనమ్ | = దీనిని; | మహాబాహో | = వీరశ్రేష్ఠా; |
| నిత్యజాతమ్ | = శరీరంతో పాటు ఉత్పన్నం అయ్యేదిగా; | త్వమ్ | = నీవు; |
| | | ఏవమ్ | = ఈ విధంగా; |
| నిత్యమృతం వా | = శరీరంతో పాటు నశించేదిగా; | శోచితుమ్ | = దుఃఖించడానికి; |
| | | న అర్హసి | = తగవు. |
| మన్యసే | = భావిస్తే; | | |

**తా॥** కాకున్న, నీవు ఈ ఆత్మను ప్రతిశరీరం పుట్టినప్పుడు పుట్టేదిగా, ప్రతిశరీరం నశించేటప్పుడు మృతిచెందేదిగా భావిస్తావా - అప్పుడు కూడా, ఓ అర్జునా! దీని కొరకు దుఃఖించడం నీకు తగదు. 26

**జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।**
**తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27**

1. నైనం. - పాఠాంతరం

జాతస్య, హి, ధ్రువః, మృత్యుః, ధ్రువమ్, జన్మ, మృతస్య, చ,
తస్మాత్, అపరిహార్యే, అర్థే, న, త్వమ్, శోచితుమ్, అర్హసి.

| | | | |
|---|---|---|---|
| హి | = ఏలనన; | తస్మాత్ | = కాబట్టి; |
| జాతస్య | = పుట్టిన వారికి; | అపరిహార్యే | = తప్పింప శక్యం కాని; |
| మృత్యుః | = మరణం; | అర్థే | = విషయం గూర్చి; |
| ధ్రువః | = నిశ్చయం; | త్వమ్ | = నీవు; |
| మృతస్య | = మరణించిన వారికి; | శోచితుమ్ | = దుఃఖించడానికి; |
| జన్మ చ | = జన్మ; | న అర్హసి | = తగవు. |
| ధ్రువమ్ | = నిశ్చయం; | | |

**తా॥** ఎందుకంటే, పుట్టిన వారికి మృత్యువు నిశ్చితం, మృతి చెందిన వారికి స్వకర్మానుసారం పునర్జన్మ నిశ్చితం[1]; కాబట్టి తప్పింప శక్యం కాని ఈ విషయాన్ని గూర్చి దుఃఖించడం నీకు తగదు. 27

**అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28**

అవ్యక్త ఆదీని, భూతాని, వ్యక్తమధ్యాని, భారత,
అవ్యక్తనిధనాని, ఏవ, తత్ర, కా, పరిదేవనా.

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | అవ్యక్తనిధనాని ఏవ | = వినాశనమైన తరువాత వ్యక్తమై ఉండనివి; |
| భూతాని | = ప్రాణులశరీరాలు; | తత్ర | = ఈ స్థితియందు; |
| అవ్యక్త ఆదీని | = ఉత్పత్తికి పూర్వం అవ్యక్తమైనవి; | కా పరి దేవనా | = దుఃఖమేల? |
| వ్యక్తమధ్యాని | = స్థితి కాలంలో (మధ్యావస్థలో వ్యక్తమైయ్యేవి); | | |

**తా॥** (కర్మజన్యములైన దేహాదుల జనన మరణాలను చూసి, నిరుపాధికమైన ఆత్మ గురించి దుఃఖించవద్దు.) భారతా! జీవుల శరీరాలు ఉత్పత్తికి పూర్వం అవ్యక్తాలు, స్థితి కాలంలో (మధ్యకాలంలో) మాత్రమే వ్యక్తములు, వినాశమైన

1. బ్రహ్మజ్ఞానం కలుగకపోతే పునర్జన్మ తప్పదు. *(గీత : 15-4 చూ.)*

తరువాత తిరిగి అవ్యక్తాలు.[1] దీనికి దుఃఖించడం దేనికి? (జ్ఞానికి జగద్వ్యాపారం స్వప్నదృష్ట వస్తు తుల్యంగా, అశోచ్యం)[2] 28

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం**
**ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।**
**ఆశ్చర్య వచ్చైన మన్యఃశృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29**

*ఆశ్చర్యవత్, పశ్యతి, కశ్చిత్, ఏనమ్, ఆశ్చర్యవత్, వదతి, తథా, ఏవ, చ, అన్యః, ఆశ్చర్యవత్, చ, ఏనమ్, అన్యః, శృణోతి, శ్రుత్వా, అపి, ఏనమ్, వేద, న, చ, ఏవ, కశ్చిత్.*

| | | | |
|---|---|---|---|
| కశ్చిత్ | = ఒకడు; | అన్యః చ | = ఇంకొకడు; |
| ఏనమ్ | = ఈ ఆత్మను; | ఏనమ్ | = దీనిని; |
| ఆశ్చర్యవత్ | = అద్భుతరూపంగా; | ఆశ్చర్యవత్ | = అద్భుతరూపంగా; |
| పశ్యతి | = దర్శిస్తాడు; | శృణోతి | = వింటాడు; |
| తథా ఏవచ | = అట్లే; | కశ్చిత్ ఏవ చ | = మరొకడెవడో; |
| అన్యః | = మరొకడు; | శ్రుత్వాపి | = విని కూడా; |
| ఆశ్చర్యవత్ | = అద్భుతరూపంగా; | ఏనమ్ | = దీనిని; |
| వదతి | = వర్ణిస్తాడు; | న వేద | = తెలుకోలేకున్నాడు. |

**తా॥** (అలా అయినా లోకంలో పండితులు కూడా దుఃఖించడం మనం చూస్తుంటాం కదా! అని అంటావా?; దీనికి కారణం ఆత్మజ్ఞానం లేకపోవడమే! ఈ ఆత్మజ్ఞానం దుర్లభమైనది.) ఒకడు ఈ ఆత్మను ఆశ్చర్యమైనదానిగా చూస్తాడు, మరొకడు ఈ ఆత్మను విస్మయంతో వర్ణిస్తాడు, ఇంకొకడు ఈ ఆత్మ గురించి సవిస్మయంగా వింటాడు. మరొకడెవడో దానిని చూసి, చెప్పి, విని కూడా తెలుసుకోలేకున్నాడు.

(ద్వితీయవ్యాఖ్య:) ఈ ఆత్మను దర్శించేవాడే ఒక ఆశ్చర్యం – దుర్లభుడు. ఈ ఆత్మను గురించి చెప్పేవాడు, వినేవాడు కూడా దుర్లభులు. ఆత్మతత్త్వాన్ని గురించి

---

1. ఆదావంతే చ యన్నాస్తివర్తమానేఽపి తత్తథా. – గౌడపాద కారికా *2-6.*

2. *గీత* 15–3; *శ్రీమద్భాగవతం* 11–19–15, 16 చూ.

విన్నా కూడా, అందరికీ ఈ జ్ఞానం లభించదు, ఆత్మజ్ఞానం అత్యంత దుర్లభం.[1]
29

**దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।**
**తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥ 30**

దేహీ, నిత్యమ్, అవధ్యః, అయమ్, దేహే, సర్వస్య, భారత,
తస్మాత్, సర్వాణి, భూతాని, న, త్వమ్, శోచితుమ్, అర్హసి.

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | తస్మాత్ | = కనుక; |
| సర్వస్య | = ప్రతి ఒక్కరి; | త్వం | = నీవు; |
| దేహే | = శరీరమందున్న; | సర్వాణి భూతాని | = సకల జీవులకొరకు; |
| అయమ్ దేహీ | = ఈ ఆత్మ; | శోచితుమ్ | = శోకించడానికి; |
| నిత్యమ్ | = ఎల్లప్పుడూ; | న అర్హసి | = తగవు. |
| అవధ్యః | = చంపశక్యం కానిది; | | |

**తా॥** ఓ భారతా! సమస్తప్రాణుల దేహాలలో ప్రకాశిస్తున్న ఆత్మ సదా అవధ్యం. కనుక, ఏ ప్రాణికి కలిగే దేహనాశాన్ని గురించి దుఃఖించడం నీకు తగదు.
30

**స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।**
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥ 31**

స్వధర్మమ్, అపి, చ, అవేక్ష్య, న, వికంపితుమ్, అర్హసి,
ధర్మ్యాత్, హి, యుద్ధాత్, శ్రేయః, అన్యత్, క్షత్రియస్య, న, విద్యతే.

| | | | |
|---|---|---|---|
| స్వధర్మం అపి చ | = మరియు స్వధర్మాన్ని కూడా; | హి | = ఏలనన; |
| | | ధర్మ్యాత్ యుద్ధాత్ | = ధర్మయుద్ధం కంటే; |
| అవేక్ష్య | = చూచి; | క్షత్రియస్య | = క్షత్రియునికి; |
| వికమ్పితుమ్ | = చలించడానికి; | అన్యత్ | = మరొక; |
| న అర్హసి | = తగవు; | శ్రేయః | = మేలైనది; |
| | | న విద్యతే | = లేదు. |

---

1. శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః - కఠోపనిషత్ 1-2-7.
- చాలామందికి దీని గురించి వినడం కూడా ఘటిల్లదని భావం.

**తా॥** మరియు (నీకు రోమాంచితమవడం అయుక్తం.) స్వధర్మాన్ని బట్టి చూస్తే, నీకు చలించడం తగదు. (ఆత్మ అవినాశి, యుద్ధం క్షాత్రధర్మం) ఏలనన, ధర్మయుద్ధం కంటే (ఈ యద్ధంలో నీకు ఏ శ్రేయం లేదని అన్నావు) క్షత్రియునికి మేలైనది వేరొకటి లేదు. 31

**యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।**
**సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధమీదృశమ్॥ 32**

*యదృచ్ఛయా, చ, ఉపపన్నమ్, స్వర్గద్వారమ్, అపావృతమ్, సుఖినః, క్షత్రియాః, పార్థ, లభంతే, యుద్ధమ్, ఈదృశమ్.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | అపావృతమ్ | = తెరవబడిన; |
| సుఖినః | = అదృష్టవంతులైన; | స్వర్గద్వారమ్ | = స్వర్గద్వారమూ అయిన; |
| క్షత్రియాః | = క్షత్రియులు; | ఈదృశమ్ | = ఇటువంటి; |
| యదృచ్ఛయా | = తనంతట; | యుద్ధమ్ | = యుద్ధాన్ని; |
| ఉపపన్నమ్ చ | = లబ్ధమూ; | లభన్తే | = పొందుతారు. |

**తా॥** పార్థా! (శ్రేయోదాయకమైంది నీ ఎదుటే ఉండగా చలిస్తావెందుకు?) అనాయాస ప్రాప్తమూ, ఉన్ముక్త స్వర్గ ద్వార సదృశమూ[1] అయిన ఇటువంటి యుద్ధం అదృష్టవంతులైన క్షత్రియులకే లభిస్తుంది! 32

**అథచేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।**
**తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥ 33**

*అథ, చేత్, త్వమ్, ఇమమ్, ధర్మ్యమ్, సంగ్రామమ్, న, కరిష్యసి, తతః, స్వధర్మమ్, కీర్తిమ్, చ, హిత్వా, పాపమ్, అవాప్స్యసి.*

| | | | |
|---|---|---|---|
| అథ | = ఇంకా; | ఇమమ్ | = ఈ; |
| త్వమ్ | = నీవు; | ధర్మ్యమ్ సంగ్రామమ్ | = ధర్మయుద్ధాన్ని; |

1. (అ) ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ,
ఆధ్యాత్మయోగయుక్తాత్మా రణేచాభిముఖోహతః.
(ఆ) యత్ర యత్ర హతః శూరః శత్రుభిః పరివారితః,
అక్షయాన్ లభతే లోకాన్ యది క్లైబ్యం న గచ్ఛతి.

| | | | |
|---|---|---|---|
| న కరిష్యసి చేత్ | = చేయక పోతే; | హిత్వా | = పోగొట్టుకొని; |
| తతః | = దాన; | పాపమ్ | = విహితధర్మ అనాచరణ ఫలమైన ప్రత్యవాయమును; |
| స్వధర్మమ్ | = క్షత్రియధర్మాన్ని; | | |
| కీర్తిం చ | = కీర్తిని కూడా; | అవాప్స్యసి | = పొందుతావు. |

**తా॥** అయినా కూడా నీవు ఈ యుద్ధం చేయడానికి తిరస్కరిస్తే, స్వధర్మ ఫలాన్ని, (ఇంతకుపూర్వం సంపాదించిన) కీర్తిని పోగొట్టుకొని (స్వధర్మ త్యాగ ఫలితమైన పాపాన్ని) ప్రత్యవాయమును పొందుతావు. 33

**అకీర్తిఞ్చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।**
**సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥ 34**

*అకీర్తమ్, చ, అపి, భూతాని, కథయిష్యంతి, తే, అవ్యయామ్, సంభావితస్య, చ, అకీర్తిః, మరణాత్, అతిరిచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| అపి చ | = మరియు; | కథయిష్యంతి | = చెప్పుకుంటారు; |
| భూతాని | = జనులు; | సంభావితస్య | = సమ్మానింపబడిన వానికి; |
| తే | = నీ; | అకీర్తిః | = అపకీర్తి; |
| అవ్యయామ్ | = తరగని; | మరణాత్ చ | = మరణం కంటే; |
| అకీర్తిమ్ | = అపయశాన్ని; | అతిరిచ్యతే | = ఎక్కువే అవుతుంది. |

**తా॥** అదీగాక, జనులందరూ చిరకాలం నీ అపయశాన్ని ఘోషిస్తారు; లోకమాన్యుడైన వానికి అపయశం మృత్యువు కంటే కూడా దుఃఖదాయకం. 34

**భయా ద్రణా దుపరతం మన్యంతే త్వాం మహారథాః ।**
**యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35**

*భయాత్, రణాత్, ఉపరతమ్, మన్యంతే, త్వామ్, మహారథాః, యేషామ్, చ, త్వమ్, బహుమతః, భూత్వా, యాస్యసి, లాఘవమ్.*

| | | | |
|---|---|---|---|
| మహారథాః | = మహారథులు కూడా; | ఉపరతమ్ | = తప్పుకొన్న వానిగా; |
| త్వామ్ | = నిన్ను; | మన్యన్తే | = భావిస్తారు; |
| భయాత్ | = భయం వల్ల; | చ | = మరియు; |
| రణాత్ | = యుద్ధం నుండి; | త్వమ్ | = నీవు; |

| | | | |
|---|---|---|---|
| యేషామ్ | = ఎవరికడ; | లాఘవమ్ | = లఘుత్వం (చులకన); |
| బహుమతః | = సమ్మానితుడవుగా; | యాస్యసి | = అయ్యెదవు. |
| భూత్వా = పూర్వం ఉండి ఇప్పుడు; | | | |

**తా॥** మహారథులైన కర్ణాదులు నీవు భయపడి యుద్ధం నుండి తప్పుకున్నావని తలుస్తారు; అంతేకాక నిన్ను ఇంతవరకు సమ్మానించిన వారిచేతనే చులకన చేయబడతావు. 35

**అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః ।**
**నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36**

*అవాచ్యవాదాన్, చ, బహూన్, వదిష్యన్తి, తవ, అహితాః,*
*నిందంతస్తవ, సామర్థ్యమ్, తతః, దుఃఖతరమ్, ను, కిమ్.*

| | | | |
|---|---|---|---|
| తవ చ | = మరియు, నీ; | అవాచ్యవాదాన్ | = అనరాని మాటలను; |
| అహితాః | = శత్రువులు; | వదిష్యన్తి | = పలుకుతారు; |
| తవ | = నీ; | తతః | = దాని కంటే; |
| సామర్థ్యమ్ | = శక్తిని; | దుఃఖతరమ్ | = ఎక్కువ దుఃఖం; |
| నిన్దన్తః | = నిందిస్తూ; | కిమ్ ను | = ఇంకేం ఉంటుంది? |
| బహూన్ | = పెక్కు; | | |

**తా॥** అంతేకాక నీ శత్రువులు కూడా నీ సామర్థ్యాన్ని నిందిస్తూ, ఎన్నో అనరాని మాటలను అంటారు; దీని కంటే దుఃఖకరమైంది ఇంకేం ఉంటుంది? 36

**హతో వా ప్రాప్స్యసి[1] స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।**
**తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37**

*హతః, వా, ప్రాప్స్యసి, స్వర్గమ్, జిత్వా, వా, భోక్ష్యసే, మహీమ్,*
*తస్మాత్, ఉత్తిష్ఠ, కౌంతేయ, యుద్ధాయ, కృతనిశ్చయః.*

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = కుంతీపుత్రా; | ప్రాప్స్యసి | = పొందుతావు; |
| హతః | = (నీవు)చంపబడితే; | జిత్వా | = జయిస్తే; |
| స్వర్గమ్ వా | = స్వర్గాన్నైనా; | మహీమ్ వా | = భూమినైనా; |

1. ప్రాప్స్యసే – పాఠాంతరం

| | | | |
|---|---|---|---|
| భోక్ష్యసే | = భోగిస్తావు; | కృతనిశ్చయః | = నిశ్చయించుకుని; |
| తస్మాత్ | = అందువల్ల; | ఉత్తిష్ఠ | = లెమ్ము! |
| యుద్ధాయ | = యుద్ధం చేయడానికి; | | |

**తా॥** ఓ కౌంతేయా! (ఈ రెంటిలో ఏది శ్రేష్ఠమో, తెలియదన్నావు (గీత.2-6) కాబట్టి విను) యుద్ధంలో హతుడవైతే స్వర్గాన్ని పొందుతావు; జయిస్తే పృథివిని (రాజ్యాన్ని) భోగిస్తావు. (ఎట్లైనా శ్రేయమే!) కనుక, యుద్ధం చేయడానికి నిశ్చయించుకుని లెమ్ము! 37

**సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ॥ 38**

సుఖదుఃఖే, సమే, కృత్వా, లాభాలాభౌ, జయాజయౌ,
తతః, యుద్ధాయ, యుజ్యస్వ, న, ఏవమ్, పాపమ్, అవాప్స్యసి.

| | | | |
|---|---|---|---|
| సుఖేదుఃఖే | = సుఖాన్ని దుఃఖాన్ని; | యుద్ధాత్ | = యుద్ధం చేయడానికి; |
| లాభాలాభౌ | = లాభాన్ని నష్టాన్ని; | యుజ్యస్వ | = సంసిద్ధుడవవ్వు; |
| జయాజయౌ చ | = జయాన్ని పరాజయాన్ని; | ఏవమ్ | = ఇలా చేస్తే; |
| | | పాపమ్ | = పాపాన్ని; |
| సమే కృత్వా | = సమంగా భావించి; | న అవాప్స్యసి | = పొందవు. |
| తతః | = అనంతరం; | | |

**తా॥** (వీరిని చంపితే మనకు లభించేది పాపమే! (గీత.1-35) అన్నావు) యుద్ధం క్షత్రియ ధర్మమని స్థిరపరచుకుని, సుఖదుఃఖాలను (వాటికి కారణమైన) లాభనష్టాలను, జయపరాజయాలను సమంగా గ్రహించి యుద్ధం చేయడానికి సంసిద్ధుడవు కమ్ము! ఇలా చేస్తే పాపాన్ని పొందవు. 38

**ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।**
**బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥ 39**

ఏషా, తే, అభిహితా, సాంఖ్యే, బుద్ధిః, యోగే, తు, ఇమామ్, శృణు,
బుద్ధ్యా, యుక్తః, యయా, పార్థ, కర్మబంధమ్, ప్రహాస్యసి.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | బుద్ధ్యా | = జ్ఞానంతో; |
| సాంఖ్యే | = ఆత్మతత్త్వ విషయంలో; | యుక్తః | = కూడుకొన్నవాడవై; |
| ఏషా | = ఈ; | కర్మబంధమ్ | = కర్మ బంధాన్ని; |
| బుద్ధిః | = జ్ఞానం; | ప్రహాస్యసి | = త్యజిస్తావో; (అట్టి) |
| తే | = నీకు; | యోగే | = కర్మ యోగవిషయంలో; |
| అభిహితా | = చెప్పబడినది; | ఇమామ్ | = ఈ చెప్పబోవు దానిని; |
| తు | = కాని; | శృణు | = విను. |
| యయా | = ఏ; | | |

**తా॥** (జ్ఞానయోగోపదేశం ఉపసంహరింపబడి, తత్సాధనమైన కర్మయోగం ప్రస్తావింపబడుతోంది) పార్థా! నీకు సాంఖ్యమనే ఆత్మతత్త్వం ఉపదేశించబడింది. (11-30 శ్లోకాలు) (నీకు ఆత్మతత్త్వాన్ని గూర్చి 'అపరోక్ష జ్ఞానం' కలుగకపోతే, చిత్తశుద్ధి ద్వారా దానిని పొందడానికి) ఇక కర్మయోగాన్ని చెబుతున్నాను, విను. నిష్కామకర్మ యోగ విషయమైన ఈ జ్ఞానం[1] లభిస్తే నీవు కర్మబంధనం నుండి విముక్తుడవవుతావు. 39

**నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40**

*న, ఇహ, అభిక్రమనాశః, అస్తి, ప్రత్యవాయః, న, విద్యతే*
*స్వల్పమ్, అపి, అస్య, ధర్మస్య, త్రాయతే, మహతః, భయాత్*

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఈ నిష్కామకర్మయోగంలో; | అస్య | = ఈ; |
| అభిక్రమనాశః | = అరంభింపబడిన కర్మలు, నిష్ఫలమవడం; | ధర్మస్య | = నిష్కామకర్మ యోగం; |
| న అస్తి | = లేదు; | స్వల్పమ్ అపి | = కొంచెమైనా; |
| ప్రత్యవాయః | = దోషం కూడా; | మహతః | = గొప్పదైన; |
| న విద్యతే | = లేదు; | భయాత్ | = భయం నుండి; |
| | | త్రాయతే | = రక్షిస్తుంది. |

1. సమ్యక్ ఖ్యాయతే ప్రకాశ్యతే పరమార్థతత్త్వమ్ అనయాఇతి సంఖ్యా
పరమార్థ తత్త్వం చక్కగా తెలుపబడుతుంది కాబట్టి సంఖ్యా('సమ్యక్ జ్ఞానం'). దీనితో ప్రకాశింపజేసే ఆత్మతత్త్వాన్ని సాంఖ్యమంటారు.

**తా॥** (విఘ్నాలు ఎక్కువగా ఉంటే కృషి మరియు దాని ఫలమూ వ్యర్థం అవుతోంది, మంత్రాదుల అంగహానియైన కీడు కలుగుతోంది. అయితే, కర్మ యోగంతో కర్మబంధం ఎలా విడివడగలదు? అనే సంశయం వద్దు) మోక్షమార్గమైన ఈ నిష్కామ కర్మయోగంలో,[1] ఎటువంటి ప్రయత్నమైనా విఫలం కాదు. ఇది ఈశ్వరుణ్ణి ఉద్దేశించి చేయబడుతుండటం వల్ల, వైగుణ్యజనితమైన ప్రత్యావాయ దోషం (త్రిగుణాల కారణంగా కలిగే పాపం) కలుగదు. ఈ నిష్కామ కర్మయోగం ఒకింత ఆచరింపబడినా కూడా, జనన-మరణ రూపకమైన సంసారమనే మహాభయం నుండి రక్షిస్తుంది. 40

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునన్దన ।**
**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41**

*వ్యవసాయాత్మికా, బుద్ధిః, ఏకా, ఇహ, కురునన్దన,*
*బహుశాఖా, హి, అనంతాః, చ, బుద్ధయః, అవ్యవసాయినామ్*

| | | | |
|---|---|---|---|
| కురునన్దన | = అర్జునా; | అవ్యవసాయినామ్ | = చంచలచిత్తుల, సకాములగువారి; |
| ఇహ | = ఈ కర్మయోగంలో; | బుద్ధయః | = బుద్ధులు, |
| వ్యవసాయాత్మికా | = నిశ్చయాత్మికమైన; | బహుశాఖాః | = బహుశాఖలుగ విభక్తములు; |
| బుద్ధిః | = జ్ఞానం; | అనన్తాః చ | = అనంతముఖములును. |
| ఏకా ఇహ | = ఏకనిష్ఠ అవుతుంది; | | |
| హి | = ఏమన; | | |

**తా॥** (ఎలా రక్షిస్తుంది? అనే ప్రశ్నకు సమాధానంగా నిష్కామ సకామ కర్మల భేదం నిరూపించబడుతోంది) కురునందనా! ఈ (ఈశ్వరారాధనా రూపమైన) నిష్కామ కర్మయోగంలో నిశ్చయరూపమైన బుద్ధి[2] ఏక నిష్ఠ అవుతుంది. కాని, చంచలచిత్తుల[3] బుద్ధులు అనంతాలూ, బహువిధాలును. (ఈశ్వర ఆరాధనార్థం ఒనర్చే నిత్యనైమిత్తిక కర్మలలో ఒకింత అంగహానియైనా కూడా అవి వినష్టం కావు, వాటిని యథాసాధ్యంగా ఒనర్చవలెననియే విధి. దీనిలో ఎట్టి వైగుణ్యశంక లేనే లేదు. దీనిలో వైగుణ్యం ఉపశమిస్తుంది. కామ్యకర్మల రీతి ఇటువంటిది కాదు, కనుక ఈ రెంటికి గల భేదం చాల గొప్పది.) 41

1. ఫలాకాంక్షాపరిత్యాగ పూర్వకంగా, ఈశ్వరారాధనార్థం ఒనర్చబడే కర్మానుష్ఠానం – కర్మయోగం.
2. పరమేశ్వరభక్తి వల్ల నేను తప్పక రక్షించబడతాననే నిశ్చయం.
3. ఈశ్వరారాధన నుండి బహిర్ముఖులైన సకాములు.

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥ 42**

యామ్, ఇమామ్, పుష్పితామ్, వాచమ్, ప్రవదంతి, అవిపశ్చితః,
వేదవాదరతాః, పార్థ, న, అన్యత్, అస్తి, ఇతి, వాదినః

**కామాత్మాన స్స్వర్గపరాః జన్మ కర్మ ఫలప్రదామ్ ।**
**క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43**

కామాత్మానః, స్వర్గపరాః, జన్మ కర్మ ఫలప్రదామ్,
క్రియావిశేష బహులామ్, భోగైశ్వర్య గతిమ్, ప్రతి

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥ 44**

భోగైశ్వర్య ప్రసక్తానామ్, తయా, అపహృత చేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధిః, సమాధౌ, న, విధీయతే

పార్థ = అర్జునా;
అవిపశ్చితః = అవివేకులూ;
వేదవాదరతాః = వేదోక్త కర్మల అనురక్తులూ;
అన్యత్ = స్వర్గాన్ని పొందజేయు కర్మ గాక మరొకటి;
న అస్తి = లేదు;
ఇతి వాదినః = అని చెప్పువారూ;
కామాత్మానః = వాంఛాపరులూ;
స్వర్గపరాః = స్వర్గలాభమే ప్రధానోద్దేశ్యంగా కలవారూ;
జన్మ కర్మ ఫల ప్రదామ్ = జన్మను కర్మఫలాలను ఒసగేదీ;
భోగైశ్వర్య గతిమ్ ప్రతి = భోగైశ్వర్యాలకు ఉపాయమూ అయిన;
క్రియావిశేషబహులామ్ = వివిధ కర్మ కలాపాలతో కూడిన;
యామ్ = ఏ;
ఇమామ్ = ఈ;
పుష్పితామ్ = ఆపాతమనోహరమైన;
వాచమ్ = వాక్యాన్ని;
ప్రవదంతి = పలుకుతారో;
తయా = ఆ వాక్యం వల్ల;
అపహృతచేతసామ్ = వంచింపబడిన చిత్తం గలవారూ; (అయిన)
భోగైశ్వర్య ప్రసక్తానామ్ = భోగైశ్వర్యాసక్తులైన వారి;
వ్యవసాయాత్మికా బుద్ధిః = నిశ్చయబుద్ధి;
సమాధౌ = చిత్తైకాగ్రతయందు;
న విధీయతే = కలిగింపబడలేదు.

**తా॥** ('జనులు కష్టసాధ్యాలైన కామ్యకర్మలను పరిత్యజించి, ఈశ్వరునిపై నిశ్చయాత్మికమైన బుద్ధిని నిలిపి, నిష్కామ కర్మానుష్ఠానం ఒనర్చడం లేదేమిటి' అని అంటావా?–) పార్థా! అవివేకులైనవారు వేదోక్తకర్మలను ప్రశంసించడంలో అనురక్తులై ఉన్నారు. స్వర్గాది ఫలజనకమైన కర్మ కాకుండా (ఈశ్వర తత్త్వమనేది) వేరే ఏమీ లేదని వారి తలపు. వారు వాంఛాయుక్తులు, స్వర్గకాములు, జన్మమనే ఫలాన్ని ఇచ్చేవీ, భోగైశ్వర్య లాభోపయోగకరాలూ అయిన బహు క్రియా కలాపాలను వారు ప్రశంసిస్తారు. ఎవ్వరి చిత్తం ఈ అపాత–మనోహర వాక్యాల విముగ్ధమో, భోగైశ్వర్యాల ఆసక్తితో కూడుకొని ఉంటాయో, వారి అంతఃకరణంలో (పూర్వ శ్లోకోక్తమైన) నిశ్చయాత్మక బుద్ధి (ఈశ్వర పరంగా) స్థిరమవడం లేదు. (గీత. 9–20, 21 చూ:) 42–44

**త్రైగుణ్య విషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థోః నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45**

*త్రైగుణ్య విషయాః, వేదాః, నిస్త్రైగుణ్యః, భవ, అర్జున,*
*నిర్ద్వంద్వ, నిత్యసత్త్వస్థః, నిర్యోగక్షేమః, ఆత్మవాన్*

అర్జున = పార్థా;
వేదాః = వేదాల కర్మకాండ సమూహాల;
త్రైగుణ్యవిషయాః[1] = కామనా మూలకాలు, సంసార కారణాలు;
(నీవు) నిస్త్రైగుణ్యః = నిష్కాముడవూ;
నిర్ద్వంద్వః = సుఖదుఃఖాది ద్వంద్వ రహితుడవూ;
నిత్యసత్త్వస్థః = సదా సత్త్వ గుణాశ్రితుడవూ;
నిర్యోగక్షేమః = యోగ క్షేమరహితుడవూ;
ఆత్మవాన్ = ఆత్మజ్ఞుడవూ;
భవ = అవుతావు గాక.

**తా॥** (స్వర్గాదులు పరమ పురుషార్థం కాకపోతే, వేదాలు కర్మను సాధనగా ఉపాదింపడమెందుకు? అంటావా–) అర్జునా! కర్మకాండాత్మకమైన వేదం

1. సత్త్వరజస్తమములనబడు త్రిగుణముల కార్యము త్రైగుణ్యము, అనగా కామనామూలకమగు సంసారము, కర్మకాండాత్మకమగు వేదము దానిని ప్రకాశమొనర్చుచున్నది. కర్మఫలకాములకు వేదము ఫలప్రకాశమగుచున్నది; వారు ఫలకాములై కర్మానుష్ఠానమొనర్చి సంసారమున బద్ధులగుచున్నారు. ఫలకామనను త్యజించి కర్మ మొనర్చిన, బద్ధులుకారు. – శ్రీ మధుసూదన సరస్వతి.

త్రిగుణాత్మకం, సకామ విషయకం. నీవు నిష్కాముడవై కర్మను ఆచరించు. ద్వంద్వ రహితుడవూ, సత్త్వ గుణాశ్రితుడవూ కమ్ము. యోగ-క్షేమాలను[1] పరిత్యజించి, ఆత్మజ్ఞుడవు కమ్ము. (*శ్రీమద్భాగవతం:* 11-21-23, 27,35 చూ:) 45

**యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।**
**తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥** **46**

*యావాన్, అర్థః, ఉదపానే, సర్వతః, సంప్లుతోదకే,*
*తావాన్, సర్వేషు, వేదేషు, బ్రాహ్మణస్య, విజానతః*

| | | | |
|---|---|---|---|
| సర్వతః | = సర్వత్ర; | విజానతః | = జ్ఞానియైన; |
| సంప్లుతోదకే | = వెల్లువగా నీరుండగా; | బ్రాహ్మణస్య | = బ్రహ్మనిష్ఠునికి; |
| ఉదపానే | = కూపాదులైన అల్పజలాశయాలు; | సర్వేషు వేదేషు | = సమస్త వేదాలు; |
| | | తావాన్ | = అంతే; |
| యావాన్ | = ఎంత; | అర్థః | = ప్రయోజనం. |
| అర్థః | = ప్రయోజనమో; | | |

**తా॥** అంతటా నీటివెల్లువతో నిండినప్పుడు, నూతులు చెఱువులు మొదలైన చిన్నచిన్న నీటిపట్లు ఆ వెల్లువలోనే చేరిపోయే విధంగా; మరియు, ఆ అల్ప జలాశయాలతో చేకూరే స్నాన పానాది ప్రయోజనం కూడా ప్లావనజలంతో సిద్ధించే రీతిగా - బ్రహ్మజ్ఞ పురుషుని (ప్లావనస్థానీయమైన) బ్రహ్మజ్ఞాన ఫలంలోనే (అల్పజలాశయ స్థానీయాలు) వేదోక్తాలైన కామ్యకర్మల ఫలాలన్నీ అంతర్గతాలవుతున్నాయి[2]. (*గీత:* 4-33 చూ:) 46

**కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతుర్భూః మా తే సఙ్గోఽస్త్వకర్మణి ॥** **47**

*కర్మణి, ఏవ, అధికారః, తే, మా, ఫలేషు, కదాచన*
*మా, కర్మఫల హేతుః, భూః, మా, తే, సఙ్గః, అస్తు, అకర్మణి*

---

1. యోగం అంటే అప్రాప్య వస్తు-ప్రాప్తి; క్షేమం అంటే ప్రాప్త-రక్షణం.
2. ఏషోఽస్య పరమ ఆనన్ద ఏతస్యైవానన్దస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవంతి.
 - బృహదారణ్యకోపనిషత్తు 4-3-32.

| | | | |
|---|---|---|---|
| కర్మణి ఏవ | = కర్మాచరణలోనే; | కర్మఫలహేతుః | = కర్మఫలాల కారణం; |
| తే | = నీకు; | మా భూః | = కావద్దు; |
| అధికారః | = అధికారం; | అకర్మణి | = కర్మత్యాగంలో; |
| కదాచన | = ఎన్నడూ; | తే | = నీకు; |
| ఫలేషు | = కర్మ ఫలాల; | సఙ్గః | = ఆసక్తి; |
| అధికారః | = కోరిక; | మా అస్తు | = కలుగకుండు గాక. |
| మా | = కలుగకుండు గాక; | | |

**తా॥** (ఈశ్వరారాధన వల్లే కర్మఫలసిద్ధి లభిస్తుండగా, కర్మలను త్యజించి ఈశ్వరారాధన మాత్రమే ఎందుకు చేయకూడదు? అని అంటావా: తత్త్వజ్ఞానార్థివైన) నీకు కర్మాచరణలోనే అధికారముంది. ఎన్నడూ కూడా నీకు కర్మఫలాలపై ఆసక్తి కలుగకుండా ఉండుగాక. కర్మఫల తృష్ణయే కర్మఫలాలను ఉత్పన్నం చేస్తోంది. కనుక కర్మఫలప్రాప్తికి కారణం కావద్దు. అంటే, కర్మలను సకాముడవై ఆచరించ వద్దు. కర్మత్యాగంపై కూడా నీకు ఆసక్తి కలుగకుండు గాక. (గీత: 18-7,9) 47

**యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।**
**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48**

*యోగస్థః, కురు, కర్మాణి, సఙ్గం, త్యక్త్వా, ధనఞ్జయ,*
*సిద్ధ్యసిద్ధ్యోః, సమః, భూత్వా, సమత్వమ్, యోగః, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| ధనఞ్జయ | = అర్జునా; | భూత్వా | = ఉండి; |
| యోగస్థః | = యోగంలో స్థితమై; | కర్మాణి | = కర్మలను; |
| సఙ్గమ్ | = ఆసక్తిని; | కురు | = ఆచరించు; |
| త్యక్త్వా | = వీడి; | సమత్వమ్ | = సమభావం; |
| సిద్ధ్యసిద్ధ్యోః | = ప్రాప్తి, అప్రాప్తుల; | యోగః | = యోగం (అని); |
| సమః | = సమభావం కలవాడవై; | ఉచ్యతే | = చెప్పబడుతోంది. |

**తా॥** ధనంజయా! కర్మఫలాలపై ఆసక్తిని పరిత్యజించి, (జ్ఞానకర్మల) సిద్ధి-అసిద్ధులలో సమభావాన్ని వహించి, యోగస్థుడవై (ఈశ్వరుణ్ణి ఆశ్రయించి) కర్మలను ఆచరించు. సిద్ధి-అసిద్ధులలో సమభావాన్ని వహించడాన్నే యోగం అని అంటారు. 48

**దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనఞ్జయ ।**
**బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥** **49**

*దూరేణ, హి, అవరమ్, కర్మ, బుద్ధియోగాత్, ధనంజయ,*
*బుద్ధౌ, శరణమ్, అన్విచ్ఛ, కృపణాః, ఫలహేతవః.*

| | | | |
|---|---|---|---|
| ధనఞ్జయ | = అర్జునా; | అవరమ్ | = అధమం; |
| హి | = ఏలనన; | బుద్ధౌ | = సమత్వబుద్ధిలో; |
| కర్మ | = కామ్యకర్మ; | శరణమ్ | = ఆశ్రయాన్ని; |
| బుద్ధియోగాత్ | = సమత్వబుద్ధియుక్తమైన నిష్కామకర్మ కంటే; | అన్విచ్ఛ | = అన్వేషించు; |
| | | ఫలహేతవః | = ఫలాలను గోరువారు; |
| దూరేణ | = అత్యంత; | కృపణాః | = హీనులు. |

**తా॥** అర్జునా! నిష్కామ కర్మ కంటే కామ్యకర్మ అత్యంత అధమమైనది. కనుక, నీవు కామనాశూన్యుడవై సమత్వబుద్ధిని ఆశ్రయించు. ఫలాకాంక్షులై కర్మలను ఆచరించేవారు హీనమైనవారు. 49

**బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే ।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥** **50**

*బుద్ధియుక్తః, జహాతి, ఇహ, ఉభే, సుకృత దుష్కృతే,*
*తస్మాత్, యోగాయ, యుజ్యస్వ, యోగః, కర్మసు, కౌశలమ్.*

| | | | |
|---|---|---|---|
| బుద్ధియుక్తః | = నిష్కామ కర్మయోగి; | యోగాయ | = నిష్కామ కర్మ యోగానికై; |
| ఇహ | = ఈ లోకంలోనే; | యుజ్యస్వ | = సిద్ధపడు; |
| సుకృత దుష్కృతే | = పుణ్యాపాపాలను; | కర్మసు | = కర్మల; |
| ఉభే | = రెంటిని; | కౌశలమ్ | = నేర్పు (నైపుణ్యం); |
| జహాతి | = త్యజించును; | యోగః | = యోగం. |
| తస్మాత్ | = కనుక; | | |

**తా॥** నిష్కామ కర్మయోగి ఇహలోక జీవితంలోనే (స్వర్గనరక కారణాలైన) పుణ్య పాపాలను రెండింటి నుండి కూడా (ఈశ్వర ప్రసాదంగా) ముక్తుడౌతాడు.

కనుక, నీవు నిష్కామ కర్మయోగాన్ని అనుష్ఠించు. కర్మల (మోక్ష పరమైనర్థే) కౌశలమే యోగం.[1] 50

**కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ॥ 51**

*కర్మజమ్, బుద్ధియుక్తాః, హి, ఫలమ్, త్యక్త్వా, మనీషిణః,*
*జన్మబంధ వినిర్ముక్తాః, పదమ్, గచ్ఛంతి, అనామయమ్.*

| | | | |
|---|---|---|---|
| బుద్ధియుక్తాః | = సమత్వబుద్ధియుక్తులైన (నిష్కామ కర్మయోగులైన); | అనామయమ్ | = సర్వోపద్రవ రహితమైన; |
| మనీషిణః | = ప్రాజ్ఞులు; | పదమ్ | = బ్రహ్మపదాన్ని; |
| కర్మజమ్ | = కర్మవల్ల కలిగే; | హి | = నిశ్చయంగా; |
| ఫలమ్ | = ఫలాన్ని; | గచ్ఛంతి | = పొందుతున్నారు. |
| త్యక్త్వా | = త్యజించి; | | |
| జన్మ బంధ వినిర్ముక్తాః | = జన్మమనే బంధం నుండి విడివడి; | | |

**తా॥** నిష్కామ కర్మయోగులైన ప్రాజ్ఞులు కర్మల వల్ల కలిగే ఫలాలను త్యజించి, జన్మబంధాల నుండి విడివడి, సర్వోపద్రవ శూన్యమైన బ్రహ్మపదాన్ని పొందుతారు. 51

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52**

*యదా, తే, మోహకలిలమ్, బుద్ధిః, వ్యతి తరిష్యతి,*
*తదా, గంతాసి, నిర్వేదమ్, శ్రోతవ్యస్య, శ్రుతస్య, చ.*

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడైతే; | మోహకలిలమ్ | = అవివేక కాలుష్యాన్ని; |
| తే | = నీ; | వ్యతితరిష్యతి | = అతిక్రమిస్తుందో; |
| బుద్ధిః | = బుద్ధి; | తదా | = అప్పుడు; |

1. కర్మస్వభావం బంధనం. సమత్వబుద్ధి అనే కౌశలాన్ని అవలంబించి, ఫలాలను ఈశ్వరార్పణం ఒనర్చినయెడల వారిని బంధించే శక్తి వినష్టమౌతుంది.

| | | | |
|---|---|---|---|
| శ్రోతవ్యస్య | = వినదగినట్టిదీ; | నిర్వేదమ్ | = వైరాగ్యాన్ని; |
| శ్రుతస్య చ | = విన్నదీ అయిన కర్మఫల విషయంలో; | గంతాసి | = పొందుతావు. |

**తా॥** నీ బుద్ధి మోహకాలుష్యాన్ని[1] అతిక్రమించినప్పుడు నీవు వినదగినవీ, వినినవీ అయిన కర్మల ఫల విషయంలో వైరాగ్యాన్ని పొందుతావు. ఈ రెండూ కూడా నీ వద్ద నిష్ఫలాలవుతాయి. 52

**శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।**
**సమాధావచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి ॥ 53**

*శ్రుతి విప్రతిపన్నా, తే, యదా, స్థాస్యతి, నిశ్చలా,*
*సమాధౌ, అచలా, బుద్ధిః, తదా, యోగమ్, అవాప్స్యసి*

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడైతే; | నిశ్చలా | = నిశ్చలంగా; |
| శ్రుతివిప్రతిపన్నా | = ఫలశ్రుతివల్ల చెదరిపోయిన; | అచలా | = స్థిరంగా; |
| | | స్థాస్యతి | = నిలుస్తుందో; |
| తే | = నీ; | తదా | = అప్పుడు; |
| బుద్ధిః | = చిత్తం; | యోగమ్ | = తత్త్వజ్ఞానాన్ని; |
| సమాధౌ[2] | = సమాధియందు; | అవాప్స్యతి | = పొందుతావు. |

**తా॥** నానావిధాలైన కర్మఫలాల గూర్చి వినడం వల్ల నీ చిత్తం విక్షిప్తం అయ్యింది. అది పరమాత్మయందు నిశ్చలమూ, స్థిరమూ అయినప్పుడు నీవు తత్త్వజ్ఞానాన్ని పొందుతావు. 53

*అర్జున ఉవాచ :*

**స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।**
**స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54**

*స్థితప్రజ్ఞస్య, కా, భాషా, సమాధిస్థస్య, కేశవ,*
*స్థితధీః, కిమ్, ప్రభాషేత, కిమ్, ఆసీత, వ్రజేత, కిమ్.*

---

1. *'కలిలం గహనం విదుః'* – ఇచ్చట 'కలిలం' అనే పదానికి 'దేహాభిమానమనే మోహమయ దుర్గము' అని శ్రీధరుల వ్యాఖ్య.

2. దేనియందు చిత్తం సమాహితమవుతుందో అది సమాధి; పరమాత్మ, ఈశ్వరుడు.

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | స్థితధీః | = స్థిరబుద్ధియైన పురుషుడు; |
| ఉవాచ | = పలికెను; | కిమ్ | = ఏమి, ఏ రీతిగా; |
| కేశవ | = కృష్ణా; | ప్రభాషేత | = భాషిస్తాడు, |
| సమాధిస్థస్య | = సమాధియందుండే; | కిమ్ | = ఎలా; |
| స్థితప్రజ్ఞస్య | = స్థితప్రజ్ఞుని; | ఆసీత | = కూర్చుంటాడు; |
| భాషా[1] | = లక్షణాలు; | కిమ్ | = ఏ తీరుగా; |
| కా | = ఏమి?; | వ్రజేత | = నడుస్తాడు. |

**తా॥** అర్జునుడు పలికెను : కేశవా! సమాధిస్థుడైన స్థితప్రజ్ఞుని (1) లక్షణాలు ఏమిటి? (2) అతడే విధంగా పలుకుతాడు? (3) ఎలా ఉంటాడు? (4) ఏ రీతిగా వ్యవహరిస్తాడు? 54

*శ్రీ భగవానువాచ :*

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితః ప్రజ్ఞ స్తదోచ్యతే ॥ 55**

*ప్రజహాతి, యదా, కామాన్, సర్వాన్, పార్థ, మనోగతాన్,*
*ఆత్మని, ఏవ, ఆత్మనా, తుష్టః, స్థితః ప్రజ్ఞః, తదా, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | మనోగతాన్ | = మనస్సులోని; |
| ఉవాచ | = పలికెను; | కామాన్ | = కోర్కెలను; |
| పార్థ | = అర్జునా; | సర్వాన్ | = అన్నింటిని; |
| ఆత్మని ఏవ | = ఆత్మయందే; | ప్రజహాతి | = విడుచునో; |
| ఆత్మనా | = ఆత్మచేత; | తదా | = అప్పుడు; (యోగి) |
| తుష్టః | = తృప్తుడై; | స్థితప్రజ్ఞః | = స్థితప్రజ్ఞుడని; |
| యదా | = ఎప్పుడైతే; | ఉచ్యతే | = చెప్పబడును. |

**తా॥** శ్రీకృష్ణుడు పలికెను: పార్థా! ఆత్మచేత ఆత్మయందే తృప్తుడై మనస్సులోని[2] కోర్కెలనన్నింటినీ సంపూర్ణంగా త్యజించిన యోగి స్థితప్రజ్ఞుడనబడును.[3] 55

1. భాష అంటే వచనం; ఇతరులు ఇతనిని గూర్చి ఎలా వచిస్తారు అని అర్థం.
2. కోర్కెలుండేది మనస్సులోనే, ఆత్మలో కాదు.
3. ఇక్కడ నుండి అధ్యాయం తుదివరకు స్థితప్రజ్ఞుని లక్షణాలు చెప్పబడ్డాయి. ఏలనన, అధ్యాత్మ శాస్త్రం సిద్ధపురుషుని (జ్ఞాని) లక్షణాలను సాధకునికి సాధనగా ఉపదేశిస్తోంది. సాధనకాలంలో ప్రయత్నంచే సాధ్యమవుతుంది; సిద్ధావస్థలో స్వాభావికమైన లక్షణం.

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగ భయ క్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56**

*దుఃఖేషు, అనుద్విగ్నమనాః, సుఖేషు, విగతస్పృహః,*
*వీతరాగ భయ క్రోధః, స్థితధీః, మునిః, ఉచ్యతే*

| | | | |
|---|---|---|---|
| దుఃఖేషు | = దుఃఖాలలో; | వీతరాగ భయ క్రోధః | = ఆసక్తి, భయం, క్రోధం లేనివాడూ అయిన; |
| అనుద్విగ్నమనాః | = క్షోభచెందని మనసు గలవాడూ; | మునిః | = యోగి; |
| సుఖేషు | = సుఖాలలో; | స్థితధీః | = స్థితప్రజ్ఞుడు అని; |
| విగతస్పృహః | = తృష్ణారహితుడూ; | ఉచ్యతే | = చెప్పబడును. |

**తా॥** దుఃఖాలలో ఉద్వేగం పొందనివాడూ, సుఖాలలో నిఃస్పృహతను వహించేవాడూ; అనురాగ, భయ, క్రోధాలు లేనివాడూ అయిన ముని స్థితప్రజ్ఞుడని చెప్పబడును.[1] 56

**యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్**
**నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57**

*యః, సర్వత్ర, అనభిస్నేహః, తత్, తత్, ప్రాప్య, శుభాశుభమ్,*
*న, అభినన్దతి, న, ద్వేష్టి, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.*

| | | | |
|---|---|---|---|
| తత్ తత్ | = ఆయా; | న ద్వేష్టి | = ద్వేషించకుండునో; |
| శుభాశుభమ్ | = ప్రియాప్రియములైన విషయాలను; | తస్య | = అతని; |
| ప్రాప్య | = పొంది; | ప్రజ్ఞా | = ఆత్మజ్ఞానం; |
| న అభినన్దతి | = ఆనందించకుండా; | ప్రతిష్ఠితా | = స్థిరమైనది. |

**తా॥** ఎవరైతే సర్వవిషయాలలో మమతాశూన్యుడై, ప్రియ, అప్రియ విషయాలు లభిస్తే ఆనందాన్ని గాని, దుఃఖాన్ని గాని పొందడో అతడు స్థితప్రజ్ఞుడు. 57

1. శిష్యుణ్ణి శిక్షించవలసినా కూడా (తన బ్రహ్మైక్యస్థితిని ప్రకటిస్తూ) స్థితప్రజ్ఞుడు అనుద్వేగాన్ని నిఃస్పృహత్వాన్ని ప్రకటించే మాటలనే పలుకుతాడు. – శ్రీ మధుసూదన సరస్వతి.

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గా నీవ సర్వశః ।**
**ఇన్ద్రియాణీంన్ద్రి యార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58**

*యదా, సంహరతే, చ, అయమ్, కూర్మః, అఙ్గాని, ఇవ, సర్వశః, ఇంద్రియాణి, ఇంద్రియార్థేభ్యః, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.*

| | | | |
|---|---|---|---|
| కూర్మః | = తాబేలు; | ఇంన్ద్రియార్థేభ్యః సర్వశః | = ఇంద్రియ విషయాలన్నింటి నుండీ; |
| అఙ్గాని ఇవ | = అవయవాలన్నిటిని లోనికి లాగుకొనేటట్లు; | సంహరతే | = ఉపసంహరిస్తాడో; |
| యదా | = ఎప్పుడైతే; | (అప్పుడు) తస్య | = వాని; |
| అయామ్ | = ఈ యోగి; | ప్రజ్ఞా | = ఆత్మజ్ఞానం; |
| ఇన్ద్రియాణి | = ఇంద్రియాలను; | ప్రతిష్ఠితా | = సుప్రతిష్ఠితమైనది. |

**తా॥** వెలుపుగొన్న తాబేలు తల, కాళ్లు, మొదలైన అవయవాలను లోపలకు ముడుచుకొనే విధంగా, శబ్దాదివిషయాల నుండి ఇంద్రియాలను మరలించుకొనే జ్ఞాననిష్ఠుడైన యోగి స్థితప్రజ్ఞుడని చెప్పబడతాడు. 58

**విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।**
**రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే[1] ॥ 59**

*విషయాః, వినివర్తన్తే, నిరాహారస్య, దేహినః, రసవర్జమ్, రసః, అపి, అస్య, పరమ్, దృష్ట్వా, నివర్తతే.*

| | | | |
|---|---|---|---|
| నిరాహారస్య దేహినః | = విషయాలను గ్రహించడానికి ప్రవృత్తుడుకాని వ్యక్తికి; | (కాని) పరమ్ | = బ్రహ్మమును; |
| | | దృష్ట్వా | = దర్శించిన; |
| విషయాః | = శబ్దాది ఇంద్రియ విషయాలు; | అస్య | = అతని; |
| రసవర్జం | = విషయ తృష్ణను మిగిల్చి; | రసః అపి[2] | =విషయాసక్తి కూడా; |
| వినివర్తంతే | = నివర్తిల్లును; | నివర్తతే | = నివర్తిల్లుతుంది. |

**తా॥** ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహించని కఠోర తపస్వి నుండి విషయాలు నివర్తిల్లుతాయి. కాని, అతని విషయతృష్ణ ఉపశమించదు. మరి, ఆత్మసాక్షాత్కారమైతే విషయతృష్ణ కూడా విలీనమైపోతుంది. 59

1. భాగవతం : 11-8-20, 21 చూ.
2. సరాగ విషయ నివృత్తిః స్థితప్రజ్ఞస్య లక్షణమ్ – విషయతృష్ణ మరియూ విషయాలూ ఉపశమించిన వాడే స్థితప్రజ్ఞుడు. –శ్రీమధుసూదన సరస్వతి.

**యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥** **60**

*యతతః, హి, అపి, కౌన్తేయ, పురుషస్య, విపశ్చితః,*
*ఇన్ద్రియాణి, ప్రమాథీని, హరన్తి, ప్రసభమ్, మనః.*

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = కుంతీపుత్రా; | పురుషస్య అపి | = పురుషునినైనప్పటికీ; |
| హి | = ఏమన; | మనః | = మనస్సును; |
| ప్రమాథీని | = బలీయాలైన; | ప్రసభమ్ | = బలాత్కారంగా; |
| ఇన్ద్రియాణి | = ఇంద్రియాలు; | హరంతి | = హరిస్తున్నది. |
| యతతః | = యత్నశీలుణ్ణి; | | (ఆకర్షిస్తున్నవి, వికృతమొనరుస్తున్నవి) |
| విపశ్చితః | = వివేకి అయిన; | | |

**తా॥** కౌన్తేయా! విక్షేపకరములైన ఇన్ద్రియగణాలు అత్యంత యత్న శీలుణ్ణి, వివేకి అయిన (శాస్త్రజ్ఞుడు) పురుషుని మనస్సును కూడా బలాత్కరించి ఆకర్షిస్తున్నవి.

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** **61**

*తాని, సర్వాణి, సంయమ్య, యుక్త, ఆసీత, మత్పరః,*
*వశే, హి, యస్య, ఇంద్రియాణి, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.*

| | | | |
|---|---|---|---|
| (కనుక) తాని | = ఆ; | యస్య | = ఎవరికి; |
| సర్వాణి | = ఇంద్రియాలన్నిటినీ; | ఇన్ద్రియాణి | = ఇంద్రియాలు; |
| సంయమ్య | = నిగ్రహించి; | వశే | = స్వాధీనంలో; |
| మత్పరః = మత్పరాయణుడై, ఆత్మస్థుడై; | | తస్య | = అతని; |
| యుక్తః | = సమాహితుడై; | ప్రజ్ఞా | = ఆత్మజ్ఞానం; |
| ఆసీత | = ఉండునది; | ప్రతిష్ఠితా | = స్థిరమగును. |
| హి | = ఏమన; | | |

**తా॥** కనుక, యోగి ఆ ఇంద్రియాలనన్నింటినీ నియమించి, సమాహితుడై ఆత్మస్థుడై ఉంటాడు. ఏ, ఎవరికి ఇంద్రియాలు వశమౌతాయో అతని ప్రజ్ఞయే ప్రతిష్ఠితం. అతడే స్థితప్రజ్ఞుడు.[1] 61

1. మొదటి మూడుప్రశ్నలకు సమాధానం క్రమంగా 56, 58 శ్లోకాలలోను, నాల్గవప్రశ్నకు 59, 61 శ్లోకాలలోను చెప్పబడింది.

**ధ్యాయతో విషయాన్పుంసః సఙ్గస్తేషూపజాయతే ।**
**సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥ 62**

*ధ్యాయతః, విషయాన్, పుంసః, సంఙ్గః, తేషు, ఉపజాయతే,*
*సఙ్గాత్, సంజాయతే, కామః, కామాత్, క్రోధః, అభిజాయతే.*

| | | | |
|---|---|---|---|
| విషయాన్ | = విషయాలను; | సంగాత్ | = ఆసక్తి నుండి; |
| ధ్యాయతః | = చింతిస్తున్న; | కామః | = తృష్ణ, కోరిక; |
| పుంసః | = పురుషునికి; | సంజాయతే | = కలుగుతుంది; |
| తేషు | = వాటిపై; | కామాత్ | = కామం నుండి; |
| సఙ్గః | = ఆసక్తి; | క్రోధః | = కోపం; |
| ఉపజాయతే | = కలుగుతోంది; | అభిజాయతే | = కలుగుతుంది. |

**తా॥** (బహిరింద్రియ సంయమం గురించి చెప్పబడింది; ఇప్పుడు అంతరింద్రియ నిగ్రహం ఉపదేశించబడుతోంది:) విషయాలను చింతిస్తుండటం వల్ల మనుష్యునికి వాటిపై ఆసక్తి కలుగుతోంది, ఆసక్తి నుండి కామము, కామం నుండి కోపము కలుగుతున్నాయి. 62

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63**

*క్రోధాత్, భవతి, సమ్మోహః, సమ్మోహాత్, స్మృతివిభ్రమః,*
*స్మృతిభ్రంశాత్, బుద్ధినాశః, బుద్ధినాశాత్, ప్రణశ్యతి.*

| | | | |
|---|---|---|---|
| క్రోధాత్ | = కోపం నుండి; | స్మృతి భ్రంశాత్ | = ఆ మరుపు నుండి; |
| సమ్మోహః | = అవివేకం; | బుద్ధినాశః | = సదసద్విచార యుక్తాయుక్త వివేకనాశము; (కలుగుతోంది); |
| భవతి | = కలుగుతుంది; | | |
| సమ్మోహాత్ | = అవివేకం నుండి; | బుద్ధినాశాత్ | = వివేకం నశిస్తే; |
| స్మృతివిభ్రమః | = శాస్త్ర ఆచార్య ఉపదేశ విస్మృతి, మరుపు; | ప్రణశ్యతి | = పురుషార్థానికి అయోగ్యుడు అవుతాడు, చెడిపోవును. |

(భవతి = కలుగుచున్నది)

**తా॥** క్రోధం నుండి అవివేకమూ, అవివేకం నుండి స్మృతి విలోపమూ కలుగుతున్నాయి. స్మృతి భ్రంశమైతే సత్–అసత్ విచారణ వినష్టమౌతుంది. ఈ

వివేకమే నశించిన మనుజుడు సంపూర్ణంగా చెడిపోతున్నాడు. అంటే పురుషార్థం నుండి వంచింపబడుతున్నాడు. (భాగవతం.11-21-19, 21) 63

**రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్ ।**
**ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥ 64**

*రాగద్వేష వియుక్తైః, తు, విషయాన్, ఇన్ద్రియైః, చరన్,*
*ఆత్మవశ్యైః, విధేయాత్మా, ప్రసాదమ్, అధిగచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | విషయాన్ | = విషయాలను; |
| రాగద్వేషవియుక్తైః | = కోరిక, ఏవగింపు లేనివీ; | చరన్ | = భోగించువాడైనా; |
| | | విధేయాత్మా | = సంయుత చిత్తుడైన వ్యక్తి; |
| ఆత్మవశ్యైః | = తనకు లోబడినవీ అయిన; | ప్రసాదమ్ | = నిర్మలత్వాన్ని; |
| ఇన్ద్రియైః | = ఇంద్రియాలతో; | అధిగచ్ఛతి | = పొందుతాడు. |

**తా॥** కాని, సంయతచితుడైన పురుషుడు ప్రియవస్తువుల ఆసక్తి నుండీ, అప్రియ విషయాల ద్వేషం నుండీ విడివడతాడు. స్వాధీనమైన ఇంద్రియాల చేత జీవించడానికి అనివార్యాలైన విషయాలను గ్రహిస్తూ నిర్మలుడవుతున్నాడు. (పరమమైన శాంతిని పొందుతాడు). 64

**ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే ।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65**

*ప్రసాదే, సర్వదుఃఖానామ్, హానిః, అస్య, ఉపజాయతే,*
*ప్రసన్న చేతసః, హి, ఆశు, బుద్ధిః, పర్యవతిష్ఠతే.*

| | | | |
|---|---|---|---|
| ప్రసాదే | = చిత్తనైర్మల్యంతో; | ప్రసన్న చేతసః | = శుద్ధచిత్తుడైన వాని; |
| అస్య | = ఇతనికి; | బుద్ధిః | = ప్రజ్ఞ; |
| సర్వదుఃఖానామ్ | = త్రివిధ దుఃఖాలు; | ఆశు | = శీఘ్రంగానే; |
| హానిః | = ఉపశమం; | పర్యవతిష్ఠతే | = బ్రహ్మస్వరూపంపై నిశ్చలమౌతోంది. |
| ఉపజాయతే | = కలుగుతాయి; | | |
| హి | = ఏమన; | | |

**తా॥** చిత్తం నిర్మలమైన ఎడల దుఃఖాలన్నీ నశిస్తాయి[1]. ఎందుకంటే, నిర్మలచిత్తుని బుద్ధి శీఘ్రంగానే ఆత్మస్వరూపంలో నిశ్చలతను పొందుతుంది. 65

**నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చా భావయతశ్శాన్తిః అశాంతస్య కుతః సుఖమ్ ॥ 66**

*న, అస్తి, బుద్ధిః, అయుక్తస్య, న, చ, అయుక్తస్య, భావనా,*
*న, చ, అభావయతః, శాన్తిః, అశాంతస్య, కుతః, సుఖమ్.*

| | |
|---|---|
| అయుక్తస్య = ఇంద్రియజయం లేనివారికి; | అభావయతః చ = మరి, పరమార్థ చింత లేనివానికి; |
| బుద్ధిః = వివేకం; | శాన్తిః = శాంతి, ఉపశమం; |
| నాస్తి = కలుగుట లేదు; | న = కలుగదు; |
| అయుక్తస్య = చిత్త ఏకాగ్రత లేనివారికి; | అశాన్తస్య = అశాంతచిత్తునికి; |
| భావనా = పరమార్థవిషయాల అభినివేశం; | సుఖమ్ = సుఖం; |
| న = కలుగదు; | కుతః = ఎక్కడ? |

**తా॥** ఇంద్రియ నిగ్రహం లేని వారికి వివేకం కలగడం లేదు. అవివేకి అయిన వానికి పరమార్థ విషయాల అభిరుచి కలుగదు. పరమార్థ చింతనా శూన్యునికి శాంతి లభించదు. అశాంత చిత్తుడైన వారికి సుఖమెక్కడిది[2]? 66

**ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే ।**
**తదస్య హరతిప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥ 67**

*ఇంద్రియాణామ్, హి, చరతామ్, యత్, మనః, అను, విధీయతే,*
*తత్, అస్య, హరతి, ప్రజ్ఞామ్, వాయుః, నావమ్, ఇవ, అమ్భసి.*

---

1. మనిషి జీవితంలోఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికాలని మూడు విధాలైన దుఃఖాలు కలుగుతున్నాయి. శోక మోహాల వల్ల కలిగే మానసిక దుఃఖాన్ని, వ్యాధి వల్ల కలిగే శారీరక దుఃఖాలు ఆధ్యాత్మిక దుఃఖం. సర్ప వృశ్చికాదుల వల్ల కలిగే దుఃఖం అధిభౌతికం. అగ్ని, వర్షం మున్నగువాని వల్ల సంభవించే దుఃఖం ఆధిదైవికం.

2. విషయసేవ నుండి ఇంద్రియాలు నివృత్తమవడమే సుఖం, విషయతృష్ణయే దుఃఖం, కనుక, విషయతృష్ణ ఉన్నట్లయితే సుఖం ఒకింత కూడా కలుగనే కలుగదు.

| | | | |
|---|---|---|---|
| హి | = ఏమన; | వాయుః | = గాలి |
| చరతామ్ | = విషయముల ప్రవర్తిల్లు; | అంభసి | = నీటిపై తేలుతున్న; |
| ఇన్ద్రియాణామ్ | = ఇంద్రియాలలో; | నావమ్ ఇవ | = నౌకను ప్రతికూల మార్గానికి త్రిప్పే విధంగా; |
| యత్ | = ఏ ఇంద్రియాన్ని; | అస్య | = ఈ ఇంద్రియనిగ్రహ రహితుని; |
| మనః | = మనస్సు; | ప్రజ్ఞామ్ | = వివేకాన్ని; |
| అను విధీయతే | = అనుసరించునో; | హరతి | = ఆకర్షిస్తోంది, విషయాభిముఖం ఒనరుస్తున్నది. |
| తత్ | = ఆ ఇంద్రియం; | | |

**తా॥** వాయువు నీటిపై తేలే నౌకను పెడత్రోవ పట్టేటట్లు, ఆయా విషయాల వెంట పరిగెత్తే ఇంద్రియాలలో దేనిని మనస్సు అనుసరిస్తుందో, నిగ్రహహీనుడైన పురుషుని వివేకాన్ని ఆ ఇంద్రియమే హరిస్తోంది. (అంటే విషయాభిముఖం ఒనర్చుతోంది) 67

**తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68**

*తస్మాత్, యస్య, మహాబాహో, నిగృహీతాని, సర్వశః,*
*ఇన్ద్రియాణి, ఇన్ద్రియార్థేభ్యః, తస్య, ప్రజ్ఞా, ప్రతిష్ఠితా.*

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = వీరశ్రేష్ఠా; | సర్వశః | = సంపూర్ణంగా; |
| తస్మాత్ | = కనుక; | నిగృహీతాని | = నిగ్రహింపబడ్డాయో; |
| యస్య | = ఎవరి; | తస్య | = అతని; |
| ఇన్ద్రియాణి | = ఇంద్రియాలను; | ప్రజ్ఞా | = బుద్ధి; |
| ఇన్ద్రియార్థేభ్యః | = శబ్దాది ఇంద్రియ విషయాల నుండి; | ప్రతిష్ఠితా | = స్థిరమైనది. |

**తా॥** మహాబాహో! కనుక, ఎవరి ఇంద్రియాలు శబ్దాది విషయాల నుండి సర్వవిధాల నిగ్రహింపబడుతున్నాయో, అతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమవుతోంది. అంటే, అతడే స్థితప్రజ్ఞుడు. 68

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69**

*యా, నిశా, సర్వభూతానామ్, తస్యామ్, జాగర్తి, సంయమీ,*
*యస్యామ్, జాగ్రతి, భూతాని, సా, నిశా, పశ్యతః, మునేః.*

| | |
|---|---|
| సర్వభూతానామ్ = ప్రాణులందరికీ; | భూతాని = జీవులు; |
| యా = ఏది; | జాగ్రతి = మేల్కొని ఉంటారో; |
| నిశా = రాత్రియో, అంధకారమయమో; | సంసారానుభవం పొందుతుంటారో; |
| తస్యామ్ = అప్పుడు, పరమార్థవిషయంగా; | పశ్యతః = తత్త్వదర్శియైన; |
| సంయమీ = జితేంద్రియుడు; | మునేః = మునికి; |
| జాగర్తి = మేల్కొని ఉంటాడు; | సా = ఆ సంసారం; |
| సర్వదా దర్శనమొనర్చుచుండును; | నిశా = రాత్రి వంటిది. |
| యస్యామ్ = ఏ అజ్ఞాన రాత్రిలో; | |

**తా॥** జీవులందరికీ తెలియకపోవడం వల్ల ఏది రాత్రివలె తోచునో, ఆ బ్రహ్మమున స్థితప్రజ్ఞుడు మేల్కొని ఉంటాడు (బ్రహ్మదర్శనం చేస్తూ ఉంటాడు). ఏ అజ్ఞాన రాత్రిలో జీవులందరూ మేల్కొని ఉంటారో సంసారానుభూతిని పొందుతుంటారో (అది స్థితప్రజ్ఞునికి రాత్రి. అతడు సంసారాన్ని చూడడు[1]). 69

మరో విధంగా : ఇతరులందరూ నిద్రించే రాత్రిలో సంయమి అయిన వాడు మేల్కొని ఉండి, ధ్యానాదికము ఒనర్చుతాడు. అందరూ మేల్కొని ఉండే పగటియందు ముని అయినవాడు నిద్రిస్తాడు. 69

**ఆపూర్యమాణమచల ప్రతిష్ఠం**
**సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।**
**తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే**
**స శాన్తిమాప్నోతి న కామకామీ ॥ 70**

*ఆపూర్యమాణమ్, అచల ప్రతిష్ఠమ్, సముద్రమ్, ఆపః, ప్రవిశన్తి, యద్వత్, తద్వత్, కామాః, యమ్, ప్రవిశన్తి, సర్వే, సః, శాన్తిమ్, ఆప్నోతి, న, కామకామీ.*

1. దృష్టి దోషమున్న గుడ్లగూబకు పగలు రాత్రిగా, రాత్రి పగలుగా కనబడుతుంది; దృష్టిదోషం లేని మనుష్యులకు పగలు పగలుగా, రాత్రి రాత్రిగా చూస్తారు. వివేకులు పరమార్థ విషయాలలో జాగరూకులై, సంసార విషయంలో నిద్రితులై ఉంటారు. మూఢులైనవారు పరమార్థ విషయాలలో నిద్రితులై, ఐహిక విషయాల తత్పరులై ఉంటారు.

| | | | |
|---|---|---|---|
| ఆపః | = నీరు, నదులు; | సర్వే | = అన్ని; |
| ఆపూర్యమాణమ్ | = నింపబడుతున్నది; | కామాః | = కోర్కెలు, విషయాలు; |
| అచలప్రతిష్ఠమ్ | = నిర్వికారం, | యమ్ | = ఏ పురుషునిలో; |
| (చెలియలికట్ట నతిక్రమింపనిదియునగు); | | ప్రవిశన్తి | = విలీనమవుతాయో; |
| సముద్రమ్ | = సముద్రంలో; | సః | = అతడు; |
| యద్వత్ | = ఏ విధంగా; | శాన్తిమ్ | = శాంతిని; |
| ప్రవిశన్తి | = ప్రవేశిస్తున్నాయో, | ఆప్నోతి | = పొందుతాడు; |
| (అయ్యు దానిని కలచుటలేదో); | | కామకామీ | = విషయాలను కోరేవాడు; |
| తద్వత్ | = అదే విధంగా; | న | = శాంతిని పొందడు. |

**తా॥** పరిపూర్ణమై ఉన్న సముద్రంలో నదీప్రవాహాలు ప్రవేశించినా అది పొంగి చెలియలికట్టను దాటక స్థిరంగా ఉండే విధంగా, ప్రారబ్ధవశాన అనివార్యాలైన విషయాలు ఎవరియందు ప్రవేశించి విలీనం అవుతున్నాయో, అంటే ఎవరిని కలతపెట్టలేవో అతడే శాంతిని పొందుతున్నాడు. కాని, విషయాలను కోరేవాడికి ఎన్నడూ శాంతి లభించదు. (భాగవతం. 11-8-5, 6 చూ:) 70

**విహాయ కామాన్యః సర్వాన్పుమాంశ్చరతి నిఃస్పృహః ।**
**నిర్మమో నిరంహంకారః స శాన్తిమధిగచ్ఛతి ॥ 71**

*విహాయ, కామాన్, యః, సర్వాన్, పుమాన్, చరతి, నిఃస్పృహః, నిర్మమః, నిరంహంకారః, సః, శాంతిమ్, అధిగచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఏ; | నిఃస్పృహః | = కాంక్షా రహితుడూ అయ్యి; |
| పుమాన్ | = పురుషుడు; | చరతి | = సంచరిస్తుంటాడో; |
| సర్వాన్ | = అన్ని; | సః | = అతడు; |
| కామాన్ | = కోర్కెలను; | శాన్తిమ్ | = సకల దుఃఖ నివృత్తియైన మోక్షాన్ని; |
| విహాయ | = విడిచి; | | |
| నిర్మమః | = మమత్వశూన్యుడూ; | అధిగచ్ఛతి | = పొందుతాడు. |
| నిరహంకారః | = అహంకార రహితుడూ; | | |

**తా॥** ఎవరైతే కోర్కెలనన్నిటినీ విడిచి, 'నేను, నాది' అనే భావం త్యజించి, శారీరక జీవితం కూడా స్పృహాశూన్యుడై సంచరిస్తాడో అతడు సంసార దుఃఖ నివృత్తియైన పరమశాంతిని పొందుతాడు. 71

**ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి**
**స్థిత్వా స్యామన్త కాలేఽపి[1] బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72**

ఏషా, బ్రాహ్మీ, స్థితిః, పార్థ, న, ఏనామ్, ప్రాప్య, విముహ్యతి, స్థిత్వా, అస్యామ్, అన్త కాలే, అపి, బ్రహ్మనిర్వాణమ్, ఋచ్ఛతి.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | అన్తకాలే అపి[3] | = మరణ సమయంలోనైనా; |
| ఏషా | = ఇది; | అస్యామ్ | = ఈ స్థితిలో; |
| బ్రాహ్మీస్థితిః | = బ్రహ్మస్వరూపమున స్థితమవడం; | స్థిత్వా | = ఉంటే; |
| ఏనామ్ | = దీనిని; | బ్రహ్మనిర్వాణమ్[4] | = మోక్షాన్ని; |
| ప్రాప్య | = పొందినవాడు; | ఋచ్ఛతి | = పొందుతాడు. |
| న విముహ్యతి[2] | = మోహాన్ని పొందుడు; | | |

**తా॥** పార్థా! ఇదే బ్రాహ్మీస్థితి, దీనిని పొందినవారెవ్వరూ కూడా మోహగ్రస్తులు కారు, మరణ సమయంలోనైనా దీనిని పొందినవాడు మోక్షాన్ని పొందుతాడు. 72

**శోకపంకనిమగ్నం యం సాంఖ్యయోగోపదేశతః ।**
**ఉజ్జహా రార్జునం భక్తం స కృష్ణః శరణం మమ ॥**

స్వభక్తుడు, శోకపంకనిమగ్నుడు అయిన అర్జునుణ్ణి సాంఖ్యయోగం[5] ఉపదేశించి ఉద్ధరించిన శ్రీకృష్ణుడే నాకు శరణం.

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యా యోగోనామః**
**ద్వితీయోఽధ్యాయః**

శ్లోకాల సంఖ్య- 72. మొదటినుండి (47+72) 119

1. అంత్యకాలేపి. - పాఠాంతరం





2. ఇక్కడ సిద్ధపురుషునియందు వెలయు రమణీయగుణాలు పదునైదు పేర్కొనబడినవి. ఇవి జీవన్ముక్తునియందు సహజములు, సాధకునకు సాధ్యములు.

3. బ్రహ్మచర్యం నుండే సన్న్యసించి బ్రహ్మమున జీవితకాలమంతా ఉండేవారికి మోక్షం కలుగుతుందని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు.

4. బ్రహ్మమను నిర్వృతి = బ్రహ్మానందం, మోక్షం.

5. ఈ అధ్యాయంలో 39వ శ్లోకానికి వ్యాఖ్యానం చేస్తూ శ్రీమన్మధ్వాచార్యులవారు 'శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాంఖ్య మిత్యభిదీయతే' అను వ్యాసస్మృతి వాక్యాన్ని ఉదాహరించారు. కనుక సాంఖ్యమంటే ఆత్మజ్ఞానమని తెలుస్తోంది. తదితర యోగాలన్నీ కూడా దీనికి సాధనలు. 'సాంఖ్యయోగాధిగమ్యమ్' (శ్వేతాశ్వతరోపనిషత్తు 6-13) అనే శ్రుతినికూడా ఇట్లే గ్రహించాలి. సాంఖ్యమంటే జ్ఞానం; యోగ మంటే తదనుకూలమైన కర్మ లేక సాధన. ఈ విషయమే ఇక మీదట వివరింపబడుతుంది.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## తృతీయో౽ధ్యాయః - కర్మయోగః

## (తృతీయాధ్యాయం - కర్మయోగం)

అత్రోపాయః కర్మయోగః ప్రాధాన్యే నోపసంహృతః.
హరిణా జ్ఞానయోగ శ్చ తద్గుణత్వేన కీర్తితః.[1]

---

అర్జున ఉవాచ :

**జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।**
**తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥** 1

జ్యాయసీ, చేత్, కర్మణః, తే, మతా, బుద్ధిః, జనార్దన,
తత్, కిమ్, కర్మణి, ఘోరే, మామ్, నియోజయసి, కేశవ

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | మతా చేత్ | = అభిమతమైన; |
| ఉవాచ | = పలికెను; | కేశవ | = కృష్ణ; |
| జనార్దన | = కృష్ణా; | తత్ కిమ్ | = అప్పుడు ఎందుకు; |
| కర్మణః | = కర్మ కంటె; | మాం | = నన్ను; |
| బుద్ధిః | = జ్ఞానం; | ఘోరే | = హింసాత్మకమైన; |
| జ్యాయసీ | = శ్రేష్ఠమని; | కర్మణి | = కర్మలో; |
| తే | = నీకు; | నియోజయసి | =ప్రవర్తింపజేస్తున్నావు? |

**తా॥** [ద్వితీయాధ్యాయంలో భగవానుడు నివృత్తిమూలమైన జ్ఞాననిష్ఠను ప్రవృత్తిమూలమైన కర్మనిష్ఠను నిర్దేశించి ఉన్నాడు. 'ప్రజహాతి యదా కామాన్'

---

1. ఈ అధ్యాయంలో ముఖ్యంగా మోక్షోపాయమైన కర్మయోగం ఉపసంహరింపబడి, జ్ఞానయోగం కొంచెం చెప్పబడుతోంది.

(గీత. 2-55) అని ఆరంభించి 'ఏషా బ్రాహ్మీ స్థితిః' (గీత. 2-72) అనే శ్లోకం వరకు జ్ఞాననిష్ఠులకు జ్ఞానయోగం వల్లే పరమ పురుషార్థం లభిస్తుందని ఉపదేశించాడు. అయినప్పటికీ 'కర్మాచరణంలోనే నీకు అధికారం, నీకు 'అకర్మ'లో ఆసక్తి కలుగకుండా ఉండు గాక' (గీత. 2-47) అని అర్జునునికి కర్మనే కర్తవ్యంగా ఉపదేశించాడు, కాని కర్మ వల్ల శ్రేయ ప్రాప్తి కలుగుతుందని చెప్పలేదు. కాబట్టి కర్మ కంటే జ్ఞానమే శ్రేష్ఠం అని తలచి] *అర్జునుడు ఇలా పలికెను :* జనార్దనా! కర్మ కంటే జ్ఞానమే శ్రేష్ఠమని నీ అభిప్రాయమైతే, నన్ను హింసాత్మకమైన ఈ కర్మను ఒనర్చడానికి నియోగిస్తున్నావు ఏమిటి? 1

**వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥ 2**

*వ్యామిశ్రేణ, ఇవ, వాక్యేన, బుద్ధిమ్, మోహయసి, ఇవ, మే*
*తత్, ఏకమ్, వద, నిశ్చిత్య, యేన, శ్రేయః, అహమ్, ఆప్నుయామ్*

| | | | |
|---|---|---|---|
| వ్యామిశ్రేణ ఇవ | = సందేహ కారణం వలే ఉన్న; | యేన | = దేని చేత; |
| వాక్యేన | = వాక్యంతో; | అహమ్ | = నేను; |
| మే | = నా; | శ్రేయః | = శుభాన్ని; |
| బుద్ధిమ్ | = బుద్ధిని; | ఆప్నుయామ్ | = పొందుతానో, |
| మోహయసి ఇవ | = భ్రమింపజేస్తున్నట్లు ఉన్నావు; | తత్ ఏకమ్ | = దానినొక్క దానినే; |
| | | నిశ్చిత్య | = నిశ్చయించి; |
| | | వద | = చెప్పు. |

**తా॥** నీవు సందేహ కారణం వలే[1] అనిపిస్తున్న వాక్యాలతో నా మనస్సును భ్రాంతిలో తగుల్కొనజేస్తున్నట్లుగా ఉన్నావు. ఈ రెంటిలో దేనిచేత నేను శ్రేయాన్ని పొందగలనో నిశ్చయించి చెప్పు. 2

*శ్రీ భగవానువాచ :*

**లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ ।**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3**

1. శ్రీభగవానుడు స్పష్టంగానే చెప్పిన సంగతి అర్జునునికి తెలిసే ఉండడం వల్ల 'ఇవ' ('వలె') అంటున్నాడు.

*లోకే, అస్మిన్, ద్వివిధా, నిష్ఠా, పురా, ప్రోక్తా, మయా, అనఘ,*
*జ్ఞానయోగేన, సాంఖ్యానామ్, కర్మయోగేన, యోగినామ్*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | సాంఖ్యానామ్ | = సాంఖ్యులకు, జ్ఞానాధికారులకు; |
| ఉవాచ | = పలికెను; | కర్మయోగేన | = కర్మయోగం చేత; |
| అనఘ | = పాపరహితా; | యోగినామ్ | = నిష్కామకర్మయోగులకు; |
| అస్మిన్ | = ఈ; | ద్వివిధా | = రెండు విధాలైన; |
| లోకే | = జగత్తులో; | నిష్ఠా | = అనుష్ఠానాలు; |
| మయా | = వేదరూపుడైన నా చే; | ప్రోక్తా | = చెప్పబడినవి. |
| పురా | = పూర్వం, కల్పాదియందు; | | |
| జ్ఞానయోగేన | = జ్ఞానయోగం చేత; | | |

**తా॥** *శ్రీ భగవానుడు పలికెను :* అనఘా! సృష్ట్యాదియందు నేనీ జగత్తులో జ్ఞానాధికారులైన వారికి జ్ఞానయోగం, నిష్కామకర్మయోగులైన వారికి కర్మయోగం అనే ద్వివిధ నిష్ఠలను వేదాలలో చెప్పి ఉన్నాను. (ఈ రెండూ పరస్పర సాపేక్షాలు; వేరు వేరు కావు. చిత్తశుద్ధి పొందనివారికి కర్మయోగం, చిత్తశుద్ధి పొంది జ్ఞానభూమికలను ఆరోహింప గోరువారికి జ్ఞానయోగం. కనుక ఈ రెంటిలో ఏది శ్రేష్ఠం అనే ప్రశ్నకు తావులేదు.) (*గీత.* 2-39 చూ:) 3

**న కర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధి గచ్ఛతి ॥ 4**

*న, కర్మణామ్, అనారంభాత్, నైష్కర్మ్యమ్, పురుషః, అశ్నుతే,*
*న, చ, సన్న్యసనాత్, ఏవ, సిద్ధిమ్, సమధి గచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| కర్మణామ్ | = కర్మలను; | న అశ్నుతే | = పొందడు; |
| అనారంభాత్ | = ఒనర్చకపోవడం వల్ల; | సన్న్యసనాత్ చ ఏవ | = కేవలం కర్మలను త్యజించడం చేతనే; |
| పురుషః | = మనుజుడు; | | |
| నైష్కర్మ్యమ్ | = నిష్క్రియమైన ఆత్మ స్వరూప స్థితిని; | సిద్ధిం | = నైష్కర్మ్యాన్ని; |
| | | న సమధి గచ్ఛతి | = పొందజాలడు. |

**తా॥** (కనుక చిత్తశుద్ధి వల్ల జ్ఞానం కలిగేంత వరకు వర్ణాశ్రమోచితాలైన కర్మలను ఆచరించడమే మేలు, లేనిచో జ్ఞానం కలుగదు.) పురుషుడు కర్మలను

ఆచరించకుండా[1] నైష్కర్మ్యాన్ని (జ్ఞానాన్ని) పొందలేడు. (చిత్త శుద్ధీ, జ్ఞానం లేని) కర్మత్యాగంలో సిద్ధి అంటే మోక్షం కలుగజాలదు. (గీ:18-45, 46, 49 చూ:)4

**న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5**

*న, హి, కశ్చిత్, క్షణమ్, అపి, జాతు, తిష్ఠతి, అకర్మకృత్,*
*కార్యతే, హి, అవశః, కర్మ, సర్వః, ప్రకృతిజైః, గుణైః*

| | | | |
|---|---|---|---|
| కశ్చిత్ | = ఏ మనుజుడూ; | గుణైః | = గుణాలచే; |
| క్షణమపి | = క్షణమైనా కూడా; | అవశః | = అస్వాధీనుడై; |
| అకర్మకృత్ | = ఏ పనిని చేయకుండా; | సర్వః | = ప్రతీవాడూ; |
| జాతు | = ఎన్నడునూ; | కర్మ | = కర్మను; |
| నహి తిష్ఠతి | = ఉండజాలడు; | కార్యతే | = చేయువాడుగా ఒనర్చబడుతున్నాడు. |
| హి | = ఏమన; | | |
| ప్రకృతిజైః | = ప్రకృతి నుండి కలిగిన; | | |

**తా॥** (కర్మత్యాగం అంటే అనాసక్తి, ఫలత్యాగం. కర్మలనే త్యజించడం అసాధ్యం.) కర్మ ఒనర్చకుండా ఎవ్వరూ ఎన్నడూ ఒక క్షణమైన కూడా ఉండలేరు. అందరూ మాయాజాతాలైన సత్వ-రజః-తమో గుణాలకు లోబడి కర్మలను చేసేవారుగా బాధ్యులవుతున్నారు. (గీత : 3-8; 18-11చూ:) 5

**కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6**

*కర్మేన్ద్రియాణి, సంయమ్య, యః, ఆస్తే, మనసా, స్మరన్,*
*ఇంన్ద్రియార్థాన్, విమూఢాత్మా, మిథ్యాచారః, సః, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఏ; | సంయమ్య | = నిగ్రహించి; |
| విమూఢాత్మా | = మూఢచిత్తుడు; | ఇంద్రియార్థాన్ | = శబ్దాది ఇంద్రియ విషయాలను ; |
| కర్మేంద్రియాణి | = కర్మేంద్రియ పంచకాన్ని; | | |

1.వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా అనాశకేన -బృహదారణ్యకోపనిషత్తు 4-4-22.

| | | | |
|---|---|---|---|
| మనసా | = మనస్సుతో; | మిథ్యాచారః | = కపటాచరణం కలవాడు; |
| స్మరన్ ఆస్తే | = స్మరిస్తుంటాడో; | (అని) ఉచ్యతే | = చెప్పబడును. |
| సః | = అతడు; | | |

**తా॥** ఏ మూఢుడు కేవలం కర్మేంద్రియాలను[1] నిగ్రహించి మనస్సుతో ఇంద్రియ విషయాలను[2] స్మరిస్తుంటాడో, అతడు కపటి అని చెప్పబడతాడు. (గీత: 6-5 చూ:) 6

**యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।**
**కర్మేన్ద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే ॥ 7**

*యః, తు, ఇంద్రియాణి, మనసా, నియమ్య, ఆరభతే, అర్జున కర్మేంద్రియైః, కర్మయోగమ్, అసక్తః, సః, విశిష్యతే.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | అసక్తః | = అనాసక్తుడై; |
| అర్జున | = అర్జునా; | కర్మేంద్రియైః | = హస్తపాదాది కర్మేంద్రియాలతో; |
| యః | = ఎవడు; | కర్మయోగమ్ | = కర్మయోగాన్ని; |
| ఇంద్రియాణి | = చక్షురాది జ్ఞానేంద్రియాలను; | ఆరభతే | = ఆరంభిస్తాడో; |
| మనసా | = వివేకయుక్తమైన మనస్సుతో; | సః | = అతడు; |
| నియమ్య | = నిగ్రహించి; | విశిష్యతే | = శ్రేష్ఠుడు. |

**తా॥** కాని ఎవరైతే వివేకయుక్తమైన మనస్సుతో జ్ఞానేంద్రియాలను[3] నియమించి, అనాసక్తుడై కర్మేంద్రియాలతో కర్మానుష్ఠానం ఒనర్చుతున్నాడో, అతడు చిత్తశుద్ధిని పొంది జ్ఞానాన్ని పొందుతున్నాడు. (లేక, పైన చెప్పిన డాంభికుని కన్నా శ్రేష్ఠుడు). 7

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీర యాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8**

---

1. కర్మేంద్రియాలు - వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు.
2. ఇంద్రియ విషయాలు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు.
3. జ్ఞానేంద్రియములు - త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు.

*నియతమ్, కురు, కర్మ, త్వమ్, కర్మ, జ్యాయః, హి, అకర్మణః*
*శరీర యాత్రా, అపి, చ, తే, న, ప్రసిద్ధ్యేత్, అకర్మణః.*

| | | | |
|---|---|---|---|
| త్వమ్ | = నీవు; | కర్మ | = కర్మ చేయడం; |
| నియతమ్ కర్మ | = శాస్త్రవిహిత నిత్యకర్మను; | జ్యాయః | = శ్రేష్ఠం; |
| | | అకర్మణః | = కర్మహీనుడవైన; |
| కురు | = ఒనర్చు; | తే | = నీకు; |
| హి | = ఏలయన; | శరీరయాత్రా అపి | = దైనందిన జీవనం కూడా; |
| అకర్మణః | = కర్మ చేయకుండా ఉండడం కంటే; | న ప్రసిద్ధ్యేత్ | = నడవదు. |

**తా॥** నీవు శాస్త్రోపదిష్టమైన నిత్యకర్మను ఒనర్చు. కర్మను ఒనర్చకుండా ఉండటం కంటే కర్మ ఒనర్చడమే శ్రేష్ఠం. కర్మహీనుడవైనట్లయితే దైనందిన జీవితం కూడా నీకు గడవదు. (*గీత:* 18-5 చూ:) 8

**యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః ।**
**తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గః సమాచర ॥ 9**

*యజ్ఞార్థాత్, కర్మణః, అన్యత్ర, లోకః, అయమ్, కర్మబన్ధనః,*
*తదర్థమ్, కర్మ, కౌన్తేయ, ముక్తసఙ్గః, సమాచర.*

| | | | |
|---|---|---|---|
| యజ్ఞార్థాత్ | = ఈశ్వరుని కొరకు అనుష్ఠించబడే; | కర్మబంధనః | = కర్మచే బంధించ బడుతున్నాడు; |
| కర్మణః | = కర్మ కంటే; | కౌన్తేయ | = కుంతీపుత్రా; |
| అన్యత్ర | = అన్యమైన కర్మ వల్ల; | ముక్తసఙ్గః | = ఆసక్తి శూన్యుడవై; |
| అయమ్ | = ఈ; | తదర్థమ్ | = యజ్ఞార్థం, ఈశ్వరుని కొరకు; |
| లోకః | = కర్మాధికారి అయినవాడు; | కర్మ | = కర్మను; |
| | | సమాచర | = ఒనర్చు. |

**తా॥** ఈశ్వర ప్రీత్యర్థం[1] అనుష్ఠించబడ్డ కర్మ కాకుండా, ఇతరమైన కర్మల చేత ఈ లోకం బంధించబడుతోంది. కనుక నీవు, భగవంతుణ్ణి ఉద్దేశించి అనాసక్తుడవై కర్మలను ఆచరించు. 9

1. యజ్ఞో వై విష్ణుః (తైత్తిరీయ బ్రాహ్మణమ్ 1. 7. 4) అంటే యజ్ఞమే విష్ణువు, (ఈశ్వరుడు).

**సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽస్త్విష్ట కామధుక్ ॥ 10**

సహ యజ్ఞాః, ప్రజాః, సృష్ట్వా, పురా, ఉవాచ, ప్రజాపతిః,
అనేన, ప్రసవిష్యధ్వమ్, ఏషః, వః, అస్తు, ఇష్ట కామధుక్.

| | | | |
|---|---|---|---|
| పురా | = పూర్వం, సృష్టికి మొదట; | అనేన | = ఈ యజ్ఞం చేత; |
| ప్రజాపతిః | = బ్రహ్మ; | ప్రసవిష్యధ్వమ్ | = ప్రజలను కనుడు; |
| సహయజ్ఞాః | = యజ్ఞాలతో కూడా; | ఏషః | = ఈ యజ్ఞం; |
| ప్రజాః | = జీవులను; | వః | = మీకు; |
| సృష్ట్వా | = సృష్టించి; | ఇష్టకామధుక్ | = అభీష్టాలను ఇచ్చేది; |
| ఉవాచ | = పలికెను; | అస్తు | = అగుగాక. |

**తా॥** సృష్టి ప్రారంభంలో బ్రహ్మ యజ్ఞాలతో పాటు జీవులను[1] సృష్టించి ఇలా పలికెను – "ఈ యజ్ఞాల చేత మీరు సదా సమృద్ధిని పొందుతారు; ఈ యజ్ఞం మీ అభీష్టాలను ఒసగే కామధేనువు అవుగాక[2]! 10

**దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః ।**
**పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ 11**

దేవాన్, భావయత, అనేన, తే, దేవాః, భావయంతు, వః,
పరస్పరమ్, భావయంతః, శ్రేయః, పరమ్, అవాప్స్యథ.

| | | | |
|---|---|---|---|
| అనేన | = ఈ యజ్ఞం చేత; | భావయంతు | = వర్షాదులను ఒసగి సంతోషపరుస్తారు గాక; |
| (మీరు) దేవాన్ | = దేవతలను; | | |
| భావయత | = ప్రీతినొందించండి; | పరస్పరమ్ | = పరస్పరం; |
| తే | = ఆ; | భావయంతః | = ప్రేమించుకొంటూ; |
| దేవాః | = దేవతలు; | (మీరు) పరంశ్రేయః | = స్వర్గాన్ని, మోక్షాన్ని; |
| వః | = మిమ్మల్ని; | అవాప్స్యథ | = పొందగలరు. |

1. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులని శంకరులు.

2. ఈ శ్లోకంలో యజ్ఞశబ్దం ఆవశ్యక కర్మసూచకం; కామ్యకర్మ ప్రశంస అసంగతమైనా, ఆకర్మ కంటే కర్మమే శ్రేష్ఠమని తెల్పబడుతోంది. – శ్రీధరస్వామి

తా॥ "ఈ యజ్ఞాలలో హవిరాదికాలను ఒసగి మీరు దేవతలను తృప్తి పరచండి; వారు మిమ్మల్ని వర్షాదాలతో అనుగ్రహిస్తారు గాక! ఇలా మీరు పరస్పర ప్రేమచే పరమ శ్రేయస్సు అయిన మోక్షాన్ని పొందగలరు.[1] 11

**ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః ।**
**తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥ 12**

*ఇష్టాన్భోగాన్, హి, వః, దేవాః, దాస్యన్తే, యజ్ఞ భావితాః,*
*తైః, దత్తాన్, అప్రదాయ, ఏభ్యః, యః, భుంక్తే, స్తేన, ఏవ, సః.*

| | | | |
|---|---|---|---|
| దేవాః | = దేవతలు; | దత్తాన్ | = ఒసగబడిన భోగ్యవస్తువులను; |
| యజ్ఞభావితాః | = యజ్ఞాలచే సంతుష్టులై; | ఏభ్యః | = వీరికి (దేవతలకు); |
| ఇష్టాన్ | = వాంఛితాలైన; | అప్రదాయ | = నివేదించకుండా; |
| భోగాన్ | = భోగ్యవస్తువులను; | యః | = ఎవడు; |
| వః | = మీకు; | భుఙ్క్తే | = భోగిస్తాడో; |
| దాస్యంతే | = ఒసగెదరు; | సః | = అతడు; |
| హి | = ఏమన; | స్తేన ఏవ | = దొంగయే. |
| తైః | = వారిచే; | | |

తా॥ "యజ్ఞాలతో దేవతలు ఆరాధితులై మీకు వాంఛిత భోగాలను ప్రసాదిస్తారు. కనుక, దేవతాప్రదత్తాలైన వస్తువులను దేవతలకు నివేదించకుండా భోగించేవాడు పాపియే!" 12

**యజ్ఞశిష్టాశినః సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।**
**భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్[2] ॥ 13**

*యజ్ఞశిష్టాశినః, సంతః, ముచ్యంతే, సర్వకిల్బిషైః,*
*భుంజతే, తే, తు, అఘమ్, పాపాః, యే, పచంతి, ఆత్మకారణాత్.*

| | | | |
|---|---|---|---|
| యజ్ఞశిష్టాశినః | = యజ్ఞశేషాన్ని భుజించే; | సర్వకిల్బిషైః | = పాపాలన్నిటి నుండి; |
| సన్తః | = సత్పురుషులు; | ముచ్యంతే | = విడివడుతున్నారు; |

1. కామ భోగానంతరం పరంపరాక్రమంలో జ్ఞానాన్ని ప్రతివారూ కూడా పొందుతారు.

2. అఘం స కేవలం భుఙ్క్తే యః పచత్యాత్మకారణాత్,
యజ్ఞశిష్టాశనం హ్యేతత్ సత్యమన్నం విధీయతే. – మను స్మృతి 3-119.

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | తే పాపాః | = ఆ పాపులు; |
| యే | = ఎవరు; | అఘమ్ | = పాపాన్ని; |
| ఆత్మకారణాత్ | = తమ కొరకే; | భుంజతే | = భుజిస్తున్నారు (పొందుతున్నారు). |
| పచంతి | = వండుకుంటున్నారో; | | |

**తా॥** ఏ సజ్జనులు యజ్ఞ శేషాన్ని భుజిస్తారో, వారు సర్వవిధ పాపాల నుండీ విముక్తులవుతున్నారు. కేవలం తమ కొరకే (వైశ్వ దేవాదుల కొరకు గాక) వండుకునే వారు పాపాన్ని[1] భుజిస్తున్నారు. 13

**అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్న సమ్భవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః ॥** **14**

*అన్నాత్, భవంతి, భూతాని, పర్జన్యాత్, అన్న సంభవః,*
*యజ్ఞాత్, భవతి, పర్జన్యః, యజ్ఞః, కర్మ, సముద్భవః.*

| | | | |
|---|---|---|---|
| అన్నాత్ | = అన్నం నుండి; | పర్జన్యః | = వర్షం; |
| భూతాని | = ప్రాణులశరీరాలు; | భవతి | = ఉత్పన్నమవుతోంది; |
| భవన్తి | = ఉత్పన్నమవుతున్నాయి; | యజ్ఞః | = అపూర్వమైన ఈ కర్మఫలం; |
| పర్జన్యాత్ | = వర్షం నుండి; | కర్మసముద్భవః | = వైదికహోమాది క్రియల నుండి ఉత్పన్నమవుతోంది. |
| అన్నసంభవః | = అన్న సృష్టి; | | |
| యజ్ఞాత్ | = యజ్ఞం వల్ల కలిగే అపూర్వమనబడే అదృష్టఫలం నుండి; | | |

**తా॥** అన్నం నుండి ప్రాణుల శరీరం ఉత్పన్నమవుతోంది. అన్నం మేఘం నుండి కలుగుతోంది. మేఘం[2] యజ్ఞం నుండి కలుగుతోంది, యజ్ఞం హోమాది కర్మల వల్ల ఉత్పన్నమవుతోంది. 14

---

1. దేవ, ఋషి, పితృ, మనుష్య, భూత యజ్ఞాలు అనే పంచయజ్ఞాలు గృహస్థునికి నిత్యం అనుష్ఠేయమైనవి. దేవతలను హవిర్దానం చేత, ఋషులను స్వశాఖా వేద అధ్యయనం చేతా, పితృ దేవతలను తర్పణాదికాల చేతా, మనుష్యులను ఆతిథేయసత్కారం చేతా భూతాలను బలినొసగి తృప్తి పరచడమే పంచయజ్ఞాలు. ఖండిని (కత్తి), పేషిణి (సన్నికల్లు), చుల్లి (పొయ్యి), ఉదకుంభి (నీటికుండ), మార్జని(చీపురు) అనువాటిని ఉపయోగించడం వల్ల కలిగే పాపం ఈ యజ్ఞాల వల్ల తొలగుతుంది. – మను స్మృతి 3-68, 71.

2. *అగ్నౌ ప్రస్తాహుతిః సమ్యక్ ఆదిత్యముపతిష్ఠతే,*
*ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః.*

అగ్నియందు విధిపూర్వకంగా ఒసగబడిన అహుతులు ఆదిత్యుని చేరుతున్నాయి. ఆదిత్యుని నుండి వర్షమూ, వర్షం నుండి అన్నమూ, అన్నం నుండి ప్రాణులూ కలుగుతున్నాయి. – మను స్మృతి *3-76.*

**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।**
**తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15**

కర్మ, బ్రహ్మోద్భవమ్, విద్ధి, బ్రహ్మ, అక్షర సముద్భవమ్,
తస్మాత్, సర్వగతమ్, బ్రహ్మ, నిత్యమ్, యజ్ఞే, ప్రతిష్ఠితమ్.

| | | | |
|---|---|---|---|
| కర్మ | = కర్మను; | తస్మాత్ | = కనుక; |
| బ్రహ్మోద్భవమ్ | = వేదం నుండి పుట్టినదిగా, వేద ప్రతిపాదితంగా; | సర్వగతమ్ | = సర్వప్రకాశకం; సర్వవ్యాపియైన; |
| విద్ధి | = గ్రహించు; | బ్రహ్మ | = వేదం; |
| బ్రహ్మ | = వేదం; | నిత్యమ్ | = సదా; |
| అక్షరసముద్భవమ్ | = పరమాత్మ నుండి పుట్టినది; | యజ్ఞే | = యజ్ఞంలో; |
| | | ప్రతిష్ఠితమ్ | = ప్రతిష్ఠితమైనది. |

**తా॥** కర్మ వేదాల నుండి కలుగుతోందని గ్రహించు. వేదం పరమాత్మ నుండి[1] సముద్భూతము. కనుక, సర్వప్రకాశమూ (సర్వవ్యాపి) అయిన వేదం సర్వదా యజ్ఞంనందు ప్రతిష్ఠితమై ఉంది.[2] 15

**ఏవం ప్రవర్తితం చక్రం నాను వర్తయతీహ యః ।**
**అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ 16**

ఏవమ్, ప్రవర్తితమ్, చక్రమ్, న, అను వర్తయతి, ఇహ, యః,
అఘాయుః, ఇంద్రియారామః, మోఘమ్, పార్థ, సః, జీవతి.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | ఇహ | = ఈ జగత్తున; |
| యః | = ఏవడు; | ఏవమ్ | = ఈ రీతిగా; |

1. దోషరహిత పరమాత్మ నుండి పురుషనిఃశ్వసితం వలె అనాయాసంగా వేదాలు వెలువడ్డాయి. కనుక, దోషశూన్యమైన వేదాలు సర్వార్థప్రకాశాలూ, అతీంద్రియ విషయాల ప్రమాణాలూ అవుతున్నాయి.

"అస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతత్ యత్ ఋగ్వేదో యజుర్వేదః సామవేదః"

(బృహదారణ్యకోపనిషత్తు 2 - 4- 10)

సాక్షాత్తూ పరమాత్మయే వేదానికి కారణమవడం వల్ల అది సర్వగతం, సర్వప్రకాశకం.

(వేదాంత సూత్రమ్ 1-1-3 చూ.)

2. వేదం యజ్ఞవిధి ప్రధానమవడం వల్ల, యజ్ఞప్రతిష్ఠితం అని చెప్పబడింది.

| | | | |
|---|---|---|---|
| ప్రవర్తితమ్ | = ప్రవర్తింపబడిన; | అఘాయుః | = పాపజీవి అయిన; |
| చక్రమ్ | = కర్మ చక్రాన్ని; | సః | = ఆ పురుషుడు; |
| న అనువర్తయతి | = అనుసరించడో; | మోఘమ్ | = వ్యర్థంగా; |
| ఇంద్రియారామః | = ఇంద్రియాసక్తుడూ; | జీవతి | = జీవిస్తున్నాడు. |

**తా॥** పార్థా! ఎవడు, ఈశ్వరునిచే ఈ విధంగా ప్రవర్తితమైన కర్మచక్రాన్ని అనుసరించడో, ఇంద్రియాసక్తుడూ పాపియూ అయిన అతని జీవితం వ్యర్థం. 16

**యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సన్తుష్టః తస్య కార్యం న విద్యతే ॥ 17**

*యః, తు, ఆత్మరతిః, ఏవ, స్యాత్, ఆత్మతృప్తః, చ, మానవః, ఆత్మని, ఏవ, చ, సంతుష్టః, తస్య, కార్యమ్, న, విద్యతే.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | ఆత్మని ఏవ చ | = ఆత్మయందే; |
| యః మానవః | = ఏ మనుష్యుడు; | సంతుష్టః | = సంతుష్టుడూ; |
| ఆత్మరతిః | = ఆత్మయందు ప్రీతిగలవాడూ; | స్యాత్ | = అవుతాడో; |
| | | తస్య | = అట్టి వానికి; |
| ఆత్మతృప్తః ఏవ చ | = ఆత్మయందే తృప్తి గలవాడూ; | కార్యమ్ | = కర్తవ్యం; |
| | | న విద్యతే | = లేదు. |

**తా॥** (ఈ కర్మలు అజ్ఞాని యొక్క చిత్తశుద్ధి కొరకే చెప్పబడ్డాయి.) కాని, ఏ మనుజుడు ఆత్మయందే ప్రీతిని, ఆత్మయందే తృప్తిని, ఆత్మయందే సంతుష్టిని పొందుతున్నాడో అతనికి ఏ విధమైన కర్తవ్యమూ లేదు. 17

**నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।**
**న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ 18**

*న, ఏవ, తస్య, కృతేన, అర్థః, న, అకృతేన, ఇహ, కశ్చన, న, చ, అస్య, సర్వభూతేషు, కశ్చిత్, అర్థవ్యపాశ్రయః.*

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఈ జగత్తున; | అర్థః | = ప్రయోజనం; |
| కృతేన | = కర్మానుష్ఠానం వల్ల; | న ఏవ | = లేనే లేదు; |
| తస్య | = ఆత్మజ్ఞునికి; | అకృతేన | = కర్మ చేయకపోవటంతో కూడా; |

| | | | |
|---|---|---|---|
| కశ్చన | = ఎట్టి (ప్రత్యవాయము); | కశ్చిత్ | = ఎట్టి; |
| న | = కలుగదు; | అర్థవ్యపాశ్రయః | = ప్రయోజన నిమిత్తమైన సంబంధం; |
| సర్వభూతేషు చ | = ఏ ప్రాణితోడను; | న | = లేదు. |
| అస్య | = ఇతనికి; | | |

**తా॥** ఈ జగత్తులో ఆత్మజ్ఞానికి కర్మానుష్ఠానం వల్ల ఏ ప్రయోజనమూ (పుణ్యం) లేదు. కర్మ ఒనర్చకపోవడం వల్ల అతనికి ఎట్టి ప్రత్యవాయమూ (పాపం) కలుగదు. ఆబ్రహ్మస్తంబ పర్యంతం గల ఏ ప్రాణితోనూ అతనికి ప్రయోజన సంబంధం (ఆశ్రయించవలసిన పని) లేదు. 18

**తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 19**

*తస్మాత్, అసక్తః, సతతమ్, కార్యమ్, కర్మ, సమాచర,*
*అసక్తః, హి, ఆచరన్, కర్మ, పరమ్, ఆప్నోతి, పూరుషః.*

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = కనుక; | పూరుషః | = మనుష్యుడు; |
| అసక్తః | = అనాసక్తుడవై; | అసక్తః | = నిష్కాముడై; |
| సతతమ్ | = సర్వదా; | కర్మ ఆచరన్ | = కర్మ ఆచరిస్తే; |
| కార్యమ్‌కర్మ | = కర్తవ్యకర్మను; | పరమ్ | = మోక్షాన్ని; |
| సమాచర | = అనుష్ఠించు; | ఆప్నోతి | = పొందుతాడు. |
| హి | = ఏమన; | | |

**తా॥** (ఆత్మరతియైన జ్ఞాని ఒక్కనికే కర్మల ప్రయోజనం లేదు. తదితరులకు ప్రయోజనం ఉంది. నీవు జ్ఞానివి కావు) కనుక, నీవు అనాసక్తుడవై సదా కర్తవ్య కర్మను ఆచరించు. కామనాశూన్యుడై కర్మ ఒనర్చే మనుష్యుడు నిశ్చయంగా ముక్తిని పొందగలడు. (గీత: 6-1 చూ:) 19

**కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః ।**
**లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20**

*కర్మణా, ఏవ, హి, సంసిద్ధిమ్, ఆస్థితాః, జనకాదయః,*
*లోకసంగ్రహమ్, ఏవ, అపి, సంపశ్యన్, కర్తుమ్, అర్హసి.*

| | | | |
|---|---|---|---|
| జనకాదయః | = జనక అశ్వపతాది రాజర్షులు; | ఆస్థితాః | = పొందారు; |
| కర్మణా ఏవ హి | = నిష్కామంగా అనుష్ఠితమైన కర్మచేతనే; | లోకసంగ్రహమేవాపి | = లోకాన్ని నడపవలసిన క్రమంలోనైనా; |
| సంసిద్ధిమ్ | = చిత్తశుద్ధి ద్వారా మోక్షాన్ని; | సంపశ్యన్ | = గుర్తిస్తూ; (నీవు) |
| | | కర్తుమర్హసి | = కర్మను చేయ అర్హుడవు. |

**తా॥** జనకుడు మొదలైనవారు కర్మ చేతనే (చిత్తశుద్ధిని పొంది) ఆత్మజ్ఞానాన్ని పొందారు. (లేక నీకు చిత్తశుద్ధి నిమిత్తం కర్మలతో పని లేకపోయినా, అంటే నీవు ఆత్మజ్ఞుడవే అయినా కూడా) లోకసంగ్రహార్థం[1] (జనులను స్వధర్మ నిరతులుగా చేయడానికి; లేదా జనులు జ్ఞానిని చూసి కర్మ త్యాగం చేస్తారనే విషయాన్ని దృష్టిలో ఉంచుకుని) నీకు కర్మలను ఆచరించడం ఉచితం. 20

**యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ 21**

యత్, యత్, ఆచరతి, శ్రేష్ఠః, తత్, తత్, ఏవ, ఇతరః, జనః, సః, యత్, ప్రమాణమ్, కురుతే, లోకః, తత్, అనువర్తతే.

| | | | |
|---|---|---|---|
| శ్రేష్ఠ | = శ్రేష్ఠుడు; | సః | = అతడు; |
| యత్ యత్ | = ఏమేమి; | యత్ | = దేనిని; |
| ఆచరతి | = ఒనర్చునో; | ప్రమాణమ్ కురుతే | = ప్రమాణీకరిస్తాడో; |
| ఇతరః జన | = సాధారణజనులు; | లోకః | = లోకము; |
| తత్ తత్ ఏవ | = ఆయా దానినే; (అనుకరించును) | తత్ | = దానినే; |
| | | అనువర్తతే | = అనుసరిస్తుంది. |

**తా॥** శ్రేష్ఠులైన వ్యక్తుల ఆచరణననే జనసామాన్యం అనుకరిస్తుంది. వారు దేనిని ప్రామాణిక బుద్ధితో అనుష్ఠిస్తారో, సాధారణ జనులు కూడా దానినే అనుసరిస్తారు. 21

**న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన ।**
**నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ 22**

1. మనుష్యుని అసత్ పథం నుండి నివారించడానికి, స్వధర్మంలో ప్రవర్తిల్లజేయడం అనేది 'లోకసంగ్రహం'.

న, మే, పార్థ, అస్తి, కర్తవ్యమ్, త్రిషు, లోకేషు, కించన,
న, అనవాప్తమ్, అవాప్తవ్యమ్, వర్తే, ఏవ, చ, కర్మణి.[1]

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | అనవాప్తమ్ | = పొందబడనిది; |
| త్రిషు | = మూడు; | చ | = మరియు |
| లోకేషు | = లోకాలలో; | అవాప్తవ్యమ్ | = పొందదగినది కూడా; |
| మే | = నాకు; | న | = లేదు; (అయినా) |
| కించన | = కొంచెమైన, ఎట్టి; | కర్మణి ఏవ | = కర్మమందే; |
| కర్తవ్యమ్ | = కర్తవ్యం; | వర్తే | = ప్రవర్తిల్లుతున్నాను. |
| నాస్తి | = లేదు; | | |

**తా॥** (ఈ విషయానికి దృష్టాంతం నేనే.) పార్థా! ముల్లోకాలలో నాకు ఏ విధమైన కర్తవ్యమూ లేదు. నేను పొందనిది గాని, పొందవలసినది గాని లేదు. అయిననూ, లోకానికి ఒక ఆదర్శాన్ని నెలకొల్పే నిమిత్తం నేను సర్వదా కర్మ ఒనర్చుతున్నాను. 22

**యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 23**

యది, హి, అహమ్, న, వర్తేయమ్, జాతు, కర్మణి, అతంద్రితః,
మమ, వర్త్మ, అనువర్తంతే, మనుష్యాః, పార్థ, సర్వశః.

| | | | |
|---|---|---|---|
| పార్థః | = అర్జునా; | మనుష్యాః | = మానవులు; |
| అహమ్ | = నేను; | సర్వశః | = సర్వవిధాల; |
| జాతు | = ఎన్నడైనా ; | మమ | = నా; |
| అతన్ద్రితః | = అప్రమత్తుడనై; | వర్త్మ హి | = మార్గాన్నే; |
| కర్మణి | = కర్మలో; | అనువర్తంతే | = అనుసరిస్తారు. |
| న వర్తేయం య | = ప్రవృత్తుడనై లేకుంటే; | | |

**తా॥** నేనెన్నడైనా, అప్రమత్తుడనై కర్మలను ఒనర్చకుండా ఉంటే, జనులు సర్వవిధాల నా మార్గాన్నే అనుసరిస్తారు. 23

1. అనవాప్త మవాప్తవ్యం న తే కిం చన విద్యతే,
లోకానుగ్రహ ఏ వైకో హేతు స్తే జన్మకర్మణోః. – రఘువంశమ్ 10-31.

**ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।**
**సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥ 24**

ఉత్సీదేయుః, ఇమే, లోకాః, న, కుర్యామ్, కర్మ, చేత్, అహమ్,
సంకరస్య, చ, కర్తా, స్యామ్, ఉపహన్యామ్, ఇమాః, ప్రజాః.

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను; | కర్తా | = కర్తను; |
| కర్మ | = కర్మను; | స్యామ్ | = అవుతాను; |
| న కుర్యామ్ చేత్ | = ఒనర్పకుంటే; | ఇమాః | = ఈ; |
| ఇమే లోకాః | = ఈ జనులు; | ప్రజాః | = జీవులను; |
| ఉత్సీదేయుః | = చెడిపోయెదరు; | ఉపహన్యామ్ | = చెడగొట్టిన వాడినవుతాను. |
| సంకరస్య చ | = వర్ణసంకరానికి కూడా; | | |

**తా॥** నేను కర్మలను ఒనర్పకుంటే, లోకస్థితికి అనుకూలమైన కర్మల అభావంలో ఈ జనులందరూ చెడిపోతారు. నేను వర్ణసంకర కారకుడనవుతూ, ప్రజల వినాశానికి కారణమైనవాణ్ణవుతాను. 25

**సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యాద్విద్వాం స్తథాసక్తః చికీర్షుర్లోక సంగ్రహమ్ ॥ 25**

సక్తాః, కర్మణి, అవిద్వాంసః, యథా, కుర్వన్తి, భారత,
కుర్యాత్, విద్వాన్, తథా, అసక్తః, చికీర్షుః, లోక సంగ్రహమ్.

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | అసక్తః | = అనాసక్తుడై; |
| అవిద్వాంసః | = అజ్ఞానులు; | లోకసంగ్రహమ్ | = లోకానికొక ఆదర్శ కల్పనాన్ని; |
| కర్మణి | = కర్మలో; | | |
| సక్తాః | = ఆసక్తులై; | చికీర్షుః | = ఒనర్పగోరి; |
| యథా | = ఎలా అయితే; | తథా | = అలా; |
| కుర్వంతి | = ఒనర్చుతున్నారో; | కుర్యాత్ | = కర్మ ఒనరుస్తాడు. |
| విద్వాన్ | = జ్ఞాని; | | |

**తా॥** భారతా! అజ్ఞులు ఎలా అయితే ఆసక్తులై కర్మలను ఆచరిస్తారో, అలా జ్ఞానులు అనాసక్తులై లోకశిక్షణార్థం కర్మను ఒనరుస్తారు. (కర్మను చేయాలి)25

**న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసఙ్గినామ్ ।**
**యోజయేత్[1] సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్ ॥ 26**

*న, బుద్ధిభేదమ్, జనయేత్, అజ్ఞానామ్, కర్మసంగినామ్,*
*యోజయేత్, సర్వకర్మాణి, విద్వాన్, యుక్తః, సమాచరన్.*

| | | | |
|---|---|---|---|
| కర్మసంగినామ్ | = కర్మలో ఆసక్తులైన; | యుక్తః | = అవహితుడై; |
| అజ్ఞానామ్ | = అవివేకులకు; | సర్వకర్మాణి | = కర్మలన్నింటినీ; |
| బుద్ధిభేదమ్ | = బుద్ధి చపలాన్ని; | సమాచరన్ | = అనుష్ఠిస్తూ; (వారిని) |
| న జనయేత్ | = కలిగించనిది; | యోజయేత్ | = కర్మలలో జొన్పనగును, (కర్మలను ఒనర్చునట్లు చేయునది). |
| విద్వాన్ | = జ్ఞాని; | | |

**తా॥** ('ఆత్మ అకర్త' మొదలైన వాక్యాలను చెప్పి) అవివేకులైన కర్మాసక్తుల బుద్ధిని చలింప[2] జేయకూడదు. తాను అప్రమత్తుడై కర్మలను ఆచరిస్తూ, వారిని కూడా కర్మలను ఒనర్చేటట్లు చేయాలి. (లేకుంటే, వారి బుద్ధి చంచలమై కర్మలను ఒనర్చకూండా ఉంటారు. కాబట్టి చిత్తశుద్ధి కలుగదు, జ్ఞానం కూడా లభించదు. ఉభయ భ్రష్టులవుతారు.) 26

**ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।**
**అహఙ్కార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥ 27**

*ప్రకృతేః, క్రియమాణాని, గుణైః, కర్మాణి, సర్వశః,*
*అహంకార విమూఢాత్మా, కర్తా, అహమ్, ఇతి, మన్యతే.*

| | | | |
|---|---|---|---|
| ప్రకృతేః | = ప్రకృతికి అంటే బ్రహ్మశక్తియైన మాయకు చెందినవైన; | కర్తా | = చేస్తున్న వాణ్ణి; |
| గుణైః | = త్రిగుణాలతో; | అహమ్ | = నేను; |
| సర్వశః | = అన్ని విధాల; | ఇతి | = అని; |
| క్రియమాణాని | = చేయబడుతోన్నవైన; | అహంకారవిమూఢాత్మా | = అహంకారంతో చెడిన మనస్సు గలవాడు; |
| కర్మాణి | = కర్మలు; | మన్యతే | = తలుస్తాడు. |

1. జోషయేత్. - పాఠాంతరం
2. 'ఇది శుభకర్మ, దీనిని ఒనర్చితే ఈ ఫలం లభించు' నను భావాన్ని చెఱపకూడదు.

**తా॥** ('జ్ఞానికి కూడా కర్మ కర్తవ్యమైతే మరి భేదమేమిటి' అని అంటావా?) ప్రకృతికి చెందిన గుణత్రయము శరీరేంద్రియాది సంఘాతంగా పరిణమించి, లౌకిక వైదిక[1] కర్మలను నిర్వహిస్తోంది. కాని అహంకార-విమూఢ-చిత్తుడు[2] 'కర్తను నేనే' అని భావిస్తాడు. 27

**తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।**
**గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥ 28**

*తత్త్వవిత్, తు, మహాబాహో, గుణకర్మ విభాగయోః,*
*గుణాః, గుణేషు, వర్తంతే, ఇతి, మత్వా, న, సజ్జతే.*

మహాబాహో = అర్జునా;
తు = కాని;
గుణకర్మ విభాగయోః = గుణరకర్మ విభాగాల;
తత్త్వవిత్ = తత్త్వాన్ని తెలిసికొన్న వాడు;
గుణాః = సత్త్వగుణ పరిణామాలైన ఇంద్రియాలు;
గుణేషు = తమోగుణ పరిణామాలైన శబ్దస్పర్శరసాది విషయాలలో;
వర్తంతే = ప్రవర్తిల్లుతున్నాయి;
ఇతి మత్వా = అని ఎంచి;
న సజ్జతే = ఆసక్తుడు కాడు; కర్తృత్వాభిమానాన్ని వహించడు.

**తా॥** అర్జునా! గుణకర్మల రీతిని ఎరిగిన తత్త్వజ్ఞుడు సత్త్వగుణ పరిణామాలైన[3] చక్షురాది ఇంద్రియాలు, తమోగుణ పరిణామాలైన రూపరసాది విషయాలలో ప్రవర్తిల్లుతున్నాయి; కాని 'ఆత్మ అసంగము' అని గ్రహించి కర్తృత్వ అభిమానాన్ని త్యజిస్తాడు. (గీత. 5-8, 9 చూ:) 28

**ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు ।**
**తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥ 29**

---

1. వైదిక కర్మలు విహితాలు, నిషిద్ధాలు అని రెండు తెఱగులు. లౌకిక కర్మలు అనిషిద్ధాలు, అవిహితాలు అని రెండు విధాలు.
2. శరీరం, ఇంద్రియాలు మొదలైన వాటిపట్ల 'నేను','నాది' అనే బోధ.
 – శ్రీమద్భాగవతమ్ 11-11-9, 10 చూ.
3. కర్మేంద్రియ పంచకం రజోగుణ పరిణామము. సత్త్వరజస్తమములనబడే త్రిగుణాలు కలిసే ఉంటాయి కాని వేరుగా ఉండవు. ఏ గుణపు పాలు ఎక్కువగా ఉంటే, ఆ గుణమని చెప్పబడుతుంది.

*ప్రకృతేః, గుణ సమ్మూఢాః, సజ్జంతే, గుణకర్మసు,*

*తాన్, అకృత్స్నవిదః, మందాన్, కృత్స్నవిత్, న, విచాలయేత్.*

| | |
|---|---|
| ప్రకృతేః = ప్రకృతి యొక్క; | కృత్స్నవిత్ = అంతా తెలిసినవాడు, ఆత్మజ్ఞుడు; |
| గుణసంమూఢాః = సత్త్వాది గుణాలతో భ్రాంతి చెందేవారు; | అకృత్స్నవిదః = అల్పజ్ఞులైన; |
| గుణకర్మసు = దేహేంద్రియాంతఃకరణాది వ్యాపారాలలో; | తాన్ (ఆ) మందాన్ = మందబుద్ధులను; |
| సజ్జంతే = ఆసక్తులవుతున్నారు; | న విచాలయేత్ = కదలింప కూడదు. |

**తా॥** ప్రకృతిగుణాల[1] చేత భ్రాంతులైనవారు ఇన్ద్రియాలలోనూ ఇన్ద్రియ వ్యాపారాలలోనూ ఆసక్తులవుతున్నారు. సర్వజ్ఞుడైన ఆత్మవేత్త, కించిత్ అజ్ఞులయిన ఆ మందబుద్ధులను కలవరపెట్టకూడదు.[2] 29

**మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా ।**

**నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30**

*మయి, సర్వాణి, కర్మాణి, సన్న్యస్య, అధ్యాత్మ చేతసా,*

*నిరాశీః, నిర్మమః, భూత్వా, యుధ్యస్వ, విగతజ్వరః.*

| | |
|---|---|
| సర్వాణి కర్మాణి = సమస్త కర్మలను; | నిరాశీః = నిష్కాముడవూ; |
| మయి = నా యందు (ఈశ్వరునికి); | నిర్మమః = మమతా రహితుడవూ; |
| సన్న్యస్య = సమర్పించి; | విగతజ్వరః = శోక శూన్యుడవూ; |
| అధ్యాత్మచేతసా = నేను అకర్తను అనే వివేకబుద్ధితో; | భూత్వా = అయి; |
| | యుధ్యస్వ = యుద్ధం చెయ్యి. |

**తా॥** (ఈ విధంగా తత్త్వవేత్త కూడ కర్మ ఒనర్చుతున్నాడు. నీవు ఇంకా తత్త్వజ్ఞుడవు కాలేదు కాబట్టి–) నీవు వివేకబుద్ధితో నాకు సమస్త కర్మలను అర్పించి, నిష్కాముడవూ, ఆసక్తిరహితుడవూ, శోకశూన్యుడవూ అయి యుద్ధం చెయ్యి. 30

---

1. త్రిగుణ పరిణామాలైన దేహేంద్రియాదులలో 'నేను'–'నాది' అనే బుద్ధి; దేహేంద్రియాది వ్యాపారాలను 'నాది' అనుకోవడం భ్రాంతి.

2. శ్రీమద్భగవద్గీతా. 3–27; 13–29 చూ:

**యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః ।**
**శ్రద్ధావంతోఽనసూయంన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ 31**

*యే, మే, మతమ్, ఇదం, నిత్యమ్, అనుతిష్ఠంతి, మానవాః, శ్రద్ధావంతః, అనసూయంతః, ముచ్యంతే, తే, అపి, కర్మభిః.*

| | | | |
|---|---|---|---|
| యే | = ఏ; | నిత్యమ్ | = సర్వదా; |
| మానవాః | = మనుష్యులు; | అనుతిష్ఠంతి | = ఆచరిస్తారో; |
| శ్రద్ధావన్తః | = శ్రద్ధాయుక్తులూ; | తే అపి | = వారు కూడా; |
| అనసూయన్తః | = అసూయ లేనివారై; | కర్మభిః | = కర్మల చేత; |
| మే ఇదమ్ | = నా ఈ; | ముచ్యంతే | = విడుపడుతున్నారు. |
| మతమ్ | = సిద్ధాంతాన్ని; | | |

**తా॥** ఏ మానవులు శ్రద్ధావంతులూ, అసూయా[1]రహితులూ అయి నా ఈ మతాన్ని సర్వదా అనుష్ఠిస్తారో, అట్టివారు కూడా (ధర్మాధర్మ రూప కర్మలలో ఉండే) కర్తృత్వబుద్ధి అనే బంధం నుండి ముక్తులవుతారు. (గీత.18-5, 7 చూ:)

**యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।**
**సర్వజ్ఞాన విమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః ॥ 32**

*యే, తు, ఏతత్, అభ్యసూయంతః, న, అనుతిష్ఠంతి, మే, మతమ్, సర్వజ్ఞాన విమూఢాన్, తాన్, విద్ధి, నష్టాన్, అచేతసః.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | సర్వజ్ఞానవిమూఢాన్ | = ఏ విధమైన జ్ఞానం లేని వారైన; |
| యే | = ఎవరు; | | |
| ఏతత్ మే | = ఈ నా; | తాన్ అచేతసః | = ఆ అవివేకులను; |
| మతమ్ | = మతాన్ని; | నష్టాన్ | = పరమార్థభ్రష్టులు అని; |
| అభ్యసూయన్తః | = నిందిస్తూ; | విద్ధి | = తెలుసుకో. |
| న అనుతిష్ఠంతి | = అనుష్ఠించరో; | | |

1. 'అసూయ' అంటే గుణాలలో దోషావిష్కారము. కష్టకరమైన దానిని ఒనర్చ ఆదేశిస్తున్నాడు కాబట్టి భగవంతుడు కరుణాహీనుడని దోషం పట్టడం.

తా॥ నా మతాన్ని నిందిస్తూ అనుష్ఠించని వివేకహీనులు ఏ విధమైన జ్ఞానం లేనివారు, మూఢులు. అట్టివారిని పరమార్థభ్రష్టులని గ్రహించు. 32

**సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి ।**
**ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33**

*సదృశమ్, చేష్టతే, స్వస్యాః, ప్రకృతేః, జ్ఞానవాన్, అపి,*
*ప్రకృతిమ్, యాంతి, భూతాని, నిగ్రహః, కిమ్, కరిష్యతి.*

| | | | |
|---|---|---|---|
| జ్ఞానవాన్ అపి | = జ్ఞాని కూడా; | భూతాని | = జనులు; |
| స్వస్యాః | = తన; | ప్రకృతిమ్ | = స్వభావాన్ని; |
| ప్రకృతేః | = స్వభావానికి, (జన్మాంతర సంస్కారానికి); | యాన్తి | = అనుసరిస్తారు; |
| | | నిగ్రహః | = శాసనం, నిషేధం; |
| సదృశమ్ | = తగినట్లుగా; | కిం కరిష్యతి | = ఏమి చేయగలదు. |
| చేష్టతే | = ప్రవర్తిస్తాడు; | | |

తా॥ (అలా అయితే, మహాఫల లాభార్థం అందరూ ఇంద్రియాలను నిగ్రహించి, నిష్కాములై స్వధర్మాన్ని అనుష్ఠించట్లేదు ఎందుకు? అని అంటావా:) జ్ఞాని కూడా తన ప్రకృతిని[1] అనుసరించే ప్రవర్తిస్తున్నాడు. ఇక అజ్ఞుల మాట ఏమంటాను? జనులు ప్రకృతిని అనుసరించే కార్యాలను ఒనర్చుతున్నారు. (ఇంద్రియనిగ్రహం ఏం చేయగలదు? ప్రకృతియే బలీయం.) నేను గాని, మరెవరైనా గాని శాసించినా లేక నిషేధించినా కూడా ఫలమేమి ఉంటుంది?[2] 33

**ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 34**

*ఇంద్రియస్య, ఇంద్రియస్య, అర్థే, రాగద్వేషౌ, వ్యవస్థితౌ,*
*తయోః, న, వశమ్, ఆగచ్ఛేత్, తౌ, హి, అస్య, పరిపంథినౌ.*

---

1. పూర్వజన్మలలో ఒనర్చిన ధర్మాధర్మాల సంస్కారం; ఇది వర్తమాన జన్మారంభంలో ప్రకాశితమవుతుంది. అదే ఇక్కడ ప్రకృతి అని చెప్పబడింది.

2. శ్రీమద్భగవద్గీతా : 18-59, 61 చూ:

| | | | |
|---|---|---|---|
| ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య | = ప్రతి ఇంద్రియం యొక్క; | వశమ్ | = అధీనమవడం; |
| | | న ఆగచ్ఛేత్ | = పొందకూడదు; |
| అర్థే | = విషయంలో; | హి | = ఏమన; |
| రాగద్వేషౌ | = ఆసక్తి, ద్వేషాలు; | తౌ | = ఆ రెండూ; |
| వ్యవస్థితౌ | = ఏర్పడి ఉన్నాయి; | అస్య | = ముముక్షువుకి; |
| తయోః | = ఆ రెండింటికీ; | పరిపంథినౌ | = ప్రతికూలాలు. |

**తా॥** (పురుషుని ప్రవృత్తి ప్రకృతి ఆధీనమే అయితే, ఇక విధి నిషేధ పరమైన శాస్త్రప్రయోజనమేమిటి? అంటే–) ఇంద్రియాలన్నింటికీ అనుకూల విషయంలో ఆసక్తి, అట్లే ప్రతికూల విషయంలో ద్వేషమూ ఉండనే ఉన్నాయి. (అట్లే ప్రవృత్తి కూడా కలుగుతోంది) కనుక, వాటికి వశం కాకూడదు. (అని శాస్త్రం నియమిస్తోంది.) ఈ రెండూ శ్రేయోమార్గానికి ప్రతికూలమైనవి.[1] (గీత: 2–62,64)

**శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35**

*శ్రేయాన్, స్వధర్మః, విగుణః, పరధర్మాత్, స్వనుష్ఠితాత్,*
*స్వధర్మే, నిధనమ్, శ్రేయః, పరధర్మః, భయావహః.*

| | | | |
|---|---|---|---|
| స్వనుష్ఠితాత్ | = చక్కగా అనుష్ఠింపబడిన; | స్వధర్మే | = తన వర్ణానికి, ఆశ్రమానికి విహితమైన కర్మలో; |
| పరధర్మాత్ | = పరధర్మం కంటే; | | |
| విగుణః | = అపూర్ణమైన; | నిధనమ్ | = మరణం; |
| స్వధర్మః | = స్వధర్మం; | శ్రేయః | = కల్యాణకరం; |
| శ్రేయాన్ | = శ్రేష్ఠం; | పరధర్మః | = ఇతరుల ధర్మం; |
| | | భయావహః | = భయదాయకం. |

**తా॥** దోషంతో కూడినదైనా స్వధర్మానుష్ఠానం చక్కగా నిర్వహింపబడిన పరధర్మం కంటే ఉత్కృష్టతరమైనది. వర్ణాశ్రమ విహితమైన స్వధర్మసాధనంలో కలిగిన మృతి కూడా కల్యాణకరం. కాని, పరధర్మానుష్ఠానం విపజ్జనకమైనది. (గీత. 18–45, 48 చూ:)

---

1. 33వ శ్లోకంలో సంస్కారాన్ని గురించి, 34వ శ్లోకంలో పురుషకారాన్ని, శాస్త్రనిర్దేశాన్ని గురించి చెప్పబడింది. పురుషకారంతో రాగద్వేష సంస్కారాలను నియమిస్తే మనుష్యునికి శాస్త్రదృష్టి లభిస్తుంది. ప్రకృతి ఆధీనత నుండి అతడు తప్పించుకుంటాడు. అప్పుడు శ్రేయోమార్గానికి ప్రతికూలమైన రాగద్వేషాలు కలుగవు.

అర్జున ఉవాచ :

**అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36**

అథ, కేన, ప్రయుక్తః, అయమ్, పాపమ్, చరతి, పూరుషః,
అనిచ్ఛన్, అపి, వార్ష్ణేయ, బలాత్, ఇవ, నియోజితః.

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు, | అయం | = ఈ; |
| ఉవాచ | = పలికెను; | పూరుషః | = మనుష్యుడు; |
| వార్ష్ణేయ | = కృష్ణా; | అనిచ్ఛన్ అపి | = తనకు ఇష్టం లేకున్నా; |
| అథ | = అయితే; | బలాత్ | = బలాత్కారముగ; |
| కేన | = ఎవరిచేత; | నియోజిత ఇవ | = నిర్బంధింపబడ్డ వాడిలా; |
| ప్రయుక్తః | = ప్రేరేపింపబడి; | పాపమ్ చరతి | = పాపం చేస్తున్నాడు. |

**తా॥** అర్జునుడు పలికెను : కృష్ణా! మనుష్యుడు తనకు ఇష్టం లేకున్నా కూడా ఎవరిచేతనో ప్రేరేపించబడి బలాత్కారపూర్వకంగా పాపాచరణలో నియుక్తుడవుతున్నట్లు ఉన్నాడు.– ఇతనిని ఇలా ప్రేరేపించేదేది?
(శ్రీమద్భాగవతం 11-13-8, 11 చూ:) 36

శ్రీ భగవానువాచ :

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ 37**

కామః, ఏషః, క్రోధః, ఏషః, రజోగుణ సముద్భవః,
మహాశనః, మహాపాప్మా, విద్ధి, ఏనమ్, ఇహ, వైరిణమ్.

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | మహాపాప్మః | = మిక్కిలి ఉగ్రమైనదీ; |
| ఉవాచ | = పలికెను; | (అయిన) ఏషః | = ఈ; |
| రజోగుణ సముద్భవః | = రజోగుణం వల్ల ఉద్భవించినదీ; | కామః | = కామం; |
| | | ఏషః | = ఇదే; |
| మహాశనః | = నింపబడరానిదీ; | క్రోధః | = కోపంగా; (పరిణమిస్తుంది) |

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఈ జగత్తులో; | వైరిణమ్ | = శత్రువని; |
| ఏనమ్ | = దీనినే; | విద్ధి | = గ్రహించు. |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* (నీవు అడిగే కారణం–) ఇది రజోగుణం నుండి కలిగి, తృప్తి పరచరాని, అత్యుగ్రమైన కామం. (ఏ కారణం వల్లనైనా ప్రతిహతమై పరిణమించే) క్రోధం కూడా ఇదే. ఈ జగత్తులో దీనిని శత్రువని గ్రహించు. 37

**ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ ।**
**యథోల్బే నావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥ 38**

*ధూమేన, ఆవ్రియతే, వహ్నిః, యథా, ఆదర్శః, మలేన, చ,*
*యథా, ఉల్బేన, ఆవృతః, గర్భః, తథా, తేన, ఇదమ్, ఆవృతమ్.*

| | | | |
|---|---|---|---|
| ధూమేన | = పొగచే; | ఉల్బేన | = మావి చేత; |
| వహ్నిః | = నిప్పు; | గర్భః | = గర్భస్థ పిండం; |
| యథా | = ఏ విధంగా; | యథా | = ఏ విధంగా; |
| ఆవ్రియతే | = కప్పబడుతోందో; | ఆవృతః | = కప్పబడుతోందో; |
| మలేన చ | = మాలిన్యం చేత; | తథా | = అదే విధంగా; |
| ఆదర్శః | = అద్దం; | తేన | = కామం చేత; |
| యథా | = ఏవిధంగా అయితే; | ఇదమ్ | = ఈ జ్ఞానం, వివేక బుద్ధి; |
| ఆవ్రియతే | = కప్పబడుతోందో; | ఆవృతమ్ | = కప్పబడి ఉంది. |

**తా॥** పొగచేత నిప్పు, మురికిచేత అద్దం, మావిచేత గర్భస్థ పిండం కప్పబడే విధంగా, కామంచేత ఈ వివేకబుద్ధి ఆవృతమవుతోంది. 38

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥ 39**

*ఆవృతమ్, జ్ఞానమ్, ఏతేన, జ్ఞానినః, నిత్యవైరిణా,*
*కామరూపేణ, కౌంతేయ, దుష్పూరేణ, అనలేన, చ.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | నిత్యవైరిణా | = నిత్య శత్రువైన; |
| జ్ఞానినః | = జ్ఞానికి; | ఏతేన | = ఈ; |

| | | | |
|---|---|---|---|
| కామరూపేణ | = తృష్ణా రూపాన్ని; | జ్ఞానమ్ | = వివేక బుద్ధి; |
| దుష్పూరేణ చ | = అ-పూరణీయమైన; | ఆవృతమ్ | = మరుగుపడుతోంది. |
| అనలేన | = అగ్ని చేత; | | |

**తా॥** కౌంతేయా! ఈ కామం జ్ఞానికి నిత్యశత్రువు ఇది అగ్నివలే నిండింపరానిది.[1] తృష్ణారూపమైన ఈ కామం చేత వివేకబుద్ధి ఆవృతమవుతోంది.

**ఇన్ద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।**
**ఏతైర్విమోహయ త్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ 40**

ఇంద్రియాణి, మనః, బుద్ధిః, అస్య, అధిష్ఠానమ్, ఉచ్యతే,
ఏతైః, విమోహయతి, ఏషః, జ్ఞానమ్, ఆవృత్య, దేహినమ్.

| | | | |
|---|---|---|---|
| ఇంద్రియాణి | = ఇంద్రియాలు; | ఏషః | = ఈ కామం; |
| మనః | = మనస్సు; | ఏతైః | = ఇంద్రియాలతో; |
| బుద్ధిః | = బుద్ధి; | జ్ఞానమ్ | = వివేకాన్ని; |
| అస్య | = ఈ కామానికి; | ఆవృత్య | = ఆవరించి; |
| అధిష్ఠానమ్ | = ఆశ్రయమని; | దేహినమ్ | = దేహాభిమానియైన జీవుణ్ణి; |
| ఉచ్యతే | = చెప్పబడుతున్నాయి; | విమోహయతి | = మోహింపజేస్తోంది. |

**తా॥** ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి కామానికి ఆశ్రయాలని చెప్పబడుతున్నాయి. వీటిచేత వివేకజ్ఞానాన్ని ఆవృతం చేసి కామం దేహాభిమానియైన జీవుణ్ణి విభ్రాంతుణ్ణి చేస్తోంది. (గీత. 5-15 చూ:) 40

**తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41**

తస్మాత్, త్వమ్, ఇంద్రియాణి, ఆదౌ, నియమ్య, భరతర్షభ,
పాప్మానమ్, ప్రజహి, హి, ఏనమ్, జ్ఞాన విజ్ఞాన నాశనమ్.

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ | = అర్జునా; | త్వమ్ | = నీవు; |
| తస్మాత్ | = కనుక; | ఆదౌ | = మొదట; |

1. న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏ వాభివర్ధతే ॥ – మనుస్మృతి 2-94.

| | | | |
|---|---|---|---|
| ఇంద్రియాణి | = ఇంద్రియ సమూహాన్ని; | పాప్మానమ్ | = పాప భూయిష్ఠమైన; |
| నియమ్య | = నిగ్రహించి; | ఏనమ్ హి | = ఈ కామాన్ని; |
| జ్ఞానవిజ్ఞాననాశనమ్ | = జ్ఞాన, విజ్ఞానాలను నశింపజేసే; | ప్రజహి | = విడువు. |

**తా॥** కనుక, అర్జునా! నీవు మొదట ఇంద్రియాలను వశం చేసుకొని, జ్ఞాన విజ్ఞానాలను[1] పాడుచేసే పాపరూపియైన ఈ కామాన్ని పరిత్యజించు. 41

**ఇన్ద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42**

*ఇంద్రియాణి, పరాణి, ఆహుః, ఇంద్రియేభ్యః, పరమ్, మనః, మనసః, తు, పరా, బుద్ధిః, యః, బుద్ధేః, పరతః, తు, సః.*

| | | | |
|---|---|---|---|
| ఇన్ద్రియాణి | = ఇంద్రియాలను; | బుద్ధిః | = బుద్ధి; |
| పరాణి | = దేహం కంటే శ్రేష్ఠాలని; | పరా | = శ్రేష్ఠం; |
| ఆహుః | = చెప్పుదురు; | తు | = కాని; |
| ఇంద్రియేభ్యః | = ఇంద్రియాల కంటే; | యః | = ఏది; |
| మనః | = మనస్సు; | బుద్ధేః | = బుద్ధి కంటే; |
| పరమ్ | = శ్రేష్ఠం; | పరతః | = వ్యతిరిక్తమై సాక్షిగా ఉందో; |
| మనసః తు | = మనస్సు కంటే; | సః | = అది, ఆత్మ. |

**తా॥** స్థూలదేహం కంటే (సూక్ష్మమైనవి కాబట్టి) ఇంద్రియాలు శ్రేష్ఠమైనవి. ఇంద్రియాల కంటే (వీటిని ప్రవర్తింపచేసే) మనస్సు శ్రేష్ఠం. (సంకల్ప వికల్పాత్మకమైన) మనస్సు కంటే (నిశ్చయాత్మకమైన) బుద్ధి శ్రేష్ఠం. బుద్ధి కంటే వేరుగా ఉంటూ ద్రష్టయైనదే ఆత్మ. (కఠ ఉపనిషత్తు 2-3-6, 7 చూ:) 42

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ 43**

*ఏవమ్, బుద్ధేః, పరమ్, బుద్ధ్వా, సంస్తభ్య, ఆత్మానమ్, ఆత్మనా, జహి, శత్రుమ్, మహాబాహో, కామరూపమ్, దురాసదమ్.*

---

1. జ్ఞానం అంటే శాస్త్ర, ఆచార్య ఉపదేశాలతో తెలియబడే తత్త్వం. విజ్ఞానం అంటే ఈ జ్ఞానం యొక్క విశేషోపలబ్ధి. ఈ రెండూ కూడా శ్రేయః ప్రాప్తికి కారణాలు.

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా; | బుద్ధ్వా | = తెలిసికొని; |
| ఏవమ్ | = ఈ విధంగా; | దురాసదమ్ | = దుర్విజ్ఞేయగతి, దుర్జయమైన; |
| ఆత్మనా | = పవిత్రం చేయబడిన బుద్ధితో; | కామరూపమ్ | = కామం అనే; |
| ఆత్మానమ్ | = మనస్సును; | శత్రుమ్ | = శత్రువును; |
| సంస్తభ్య | = స్థిరమొనర్చి; | జహి | = వినాశమొనర్చు, జయించు. |
| బుద్ధేః | = బుద్ధికి; | | |
| పరమ్ | = సాక్షియైన ఆత్మను; | | |

**తా॥** అర్జునా! ఈ విధంగా నిశ్చయాత్మికమైన బుద్ధితో మనస్సును సమాహితమొనర్చి, బుద్ధి కంటే వేరుగా ఉండే ద్రష్టయైన ఆత్మను తెలుసుకుని, దుర్జయమైన కామం అనే శత్రువును జయించు. 43

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ**
**తృతీయోఽధ్యాయః**

*శ్లోకాల సంఖ్య-43. మొదటి నుండి (119+43) 162.*

**స్వధర్మేణ య మారాధ్య ముక్తి మితా బుధాః ।**
**తం కృష్ణం పరమానందం తోషయే త్సర్వకర్మభిః ॥**

భక్తితో స్వధర్మానుష్ఠానంతో ఎవరిని ఆరాధించి జ్ఞానులు ముక్తిని పొందారో, పరమానంద స్వరూపుడైన ఆ కృష్ణుణ్ణి సర్వవిధాలైన కర్మలతో, సంతుష్టుని గావించు గాక.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## చతుర్థో౽ధ్యాయః - జ్ఞాన యోగః

## (చతుర్థాధ్యాయం - జ్ఞాన యోగం)

ఆవిర్భావతిరోభావా వావిష్కర్తుం స్వయం హరిః ।
తత్త్వం పదవివేకార్థం కర్మయోగం ప్రశంసతి ॥[1]

*శ్రీ భగవానువాచ :*

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవే౽బ్రవీత్ ॥ 1**

ఇమమ్, వివస్వతే, యోగమ్, ప్రోక్తవాన్, అహమ్, అవ్యయమ్, వివస్వాన్, మనవే, ప్రాహ, మనుః, ఇక్ష్వాకవే, అబ్రవీత్.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | వివస్వాన్ | = సూర్యుడు; |
| వివస్వతే | = సూర్యునికి; | మనవే | = తనపుత్రుడైన మనువుకు; |
| ఇమమ్ | = ఈ; | ప్రాహ | = చెప్పాడు; |
| అవ్యయమ్ | = అక్షయఫలమైన; | మనుః | = మనువు; |
| యోగమ్ | = కర్మ యోగాన్ని; | ఇక్ష్వాకవే | = స్వపుత్రుడైన ఇక్ష్వాకునికి; |
| ప్రోక్తవాన్ | = చెప్పి ఉన్నాను; | అబ్రవీత్ | = చెప్పాడు. |

1. తన ఆవిర్భావాన్ని అంతర్ధానాన్ని తెలుపడానికి, 'తత్', 'త్వం' పదాల వివేచన కొరకు భగవంతుడు కర్మయోగాన్ని ప్రశంసిస్తున్నాడు.

**తా॥** శ్రీభగవానుడు పలికెను - నేను అవ్యయమైన[1] ఈ యోగాన్ని సూర్యునికి చెప్పి ఉన్నాను. సూర్యుడు తన పుత్రుడైన మనువుకూ, మనువు స్వపుత్రుడైన ఇక్ష్వాకునికి దీనిని ఉపదేశించారు. 1

**ఏవం పరంపరా ప్రాప్తం ఇమం రాజర్షయో విదుః ।**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥ 2**

*ఏవమ్, పరంపరా ప్రాప్తమ్, ఇమమ్, రాజర్షయః, విదుః,*
*సః, కాలేన, ఇహ, మహతా, యోగః, నష్టః, పరంతప.*

| | | | |
|---|---|---|---|
| పరన్తప | = శత్రుతాపకుడవైన అర్జునా; | ఇహ | = ఈ జగత్తులో; |
| ఏవమ్ | = ఈ విధంగా; | సః | = ఆ; |
| పరంపరా ప్రాప్తమ్ | = పరంపరాక్రమంలో లభించిన; | యోగః | = యోగం; |
| | | మహతా | = దీర్ఘమైన; |
| ఇమమ్ | = ఈ కర్మయోగాన్ని; | కాలేన | = కాలక్రమంలో; |
| రాజర్షయః | = రాజఋషులు; | నష్టః | = ఖిలమయ్యింది. |
| విదుః | = ఎరుగుదురు; | | |

**తా॥** పరంతపా! పరంపరా ప్రాప్తమైన ఈ యోగం రాజర్షులు ఎరుగుదురు. ఈ లోకంలో కాలక్రమంలో ఈ యోగం వినష్ట (సంప్రదాయ) మయ్యింది. 2

**స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ 3**

*సః, ఏవ, అయమ్, మయా, తే, అద్య, యోగః, ప్రోక్తః, పురాతనః,*
*భక్తః, అసి, మే, సఖా, చ, ఇతి, రహస్యమ్, హి, ఏతత్, ఉత్తమమ్.*

| | | | |
|---|---|---|---|
| (నీవు) మే | = నా; | అయమ్ | = ఈ; |
| భక్తః | = భక్తుడవు; | సః | = ఆ; |
| సఖా చ | = సఖుడవు; | పురాతనః | = ప్రాచీనమైన; |
| అసి | = అయి ఉన్నావు; | యోగః ఏవ | = యోగమే; |
| ఇతి | = అని; | అద్య | = నేడు; |

1. ఈ యోగంతో లభించే మోక్షం అవ్యయం; కనుక ఉపాయం కూడా అవ్యయం అనబడుతుంది.

| | | | |
|---|---|---|---|
| మయా | = నా చేత; | ఏతత్ | = ఇది; |
| తే | = నీకు; | ఉత్తమమ్ | = శ్రేష్ఠమైన; |
| ప్రోక్తః | = చెప్పబడింది; | రహస్యమ్ | = రహస్యం. |
| హి | = ఏమన; | | |

**తా॥** నీవు నా భక్తుడవు, సఖుడవు; కాబట్టే ఉత్తమమూ, రహస్యమూ అయిన ఈ ప్రాచీనయోగాన్ని నీకు నేడు తెలిపాను.[1] 3

*అర్జున ఉవాచ :*

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।**
**కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4**

అపరమ్, భవతః, జన్మ, పరమ్, జన్మ, వివస్వతః,
కథమ్, ఏతత్, విజానీయామ్, త్వమ్, ఆదౌ, ప్రోక్తవాన్, ఇతి.

| | | | |
|---|---|---|---|
| భవతః | = నీ; | ఆదౌ | = మొదట (సృష్టి ప్రారంభంలో); |
| జన్మ | = పుట్టుక; | ప్రోక్తవాన్ | = చెప్పి ఉన్నావు; |
| అపరమ్ | = తరువాతిది; | ఇతి | = అనే; |
| వివస్వతః | = సూర్యుని; | ఏతత్ | = ఈ విషయం; |
| జన్మ | = పుట్టుక; | కథమ్ | = ఎలా; |
| పరమ్ | = మునుపటిది; | విజానీయామ్ | = గ్రహించ గలను? |
| త్వమ్ | = నీవు; | | |

**తా॥** అర్జునుడు పలికెను : నీ జన్మ ఇటీవలిది, సూర్యుని జన్మ బహుపూర్వ కాలంలోనిది. నీవు సృష్టి ప్రారంభంలో సూర్యునికి ఈ యోగాన్ని ఉపదేశించావని ఎలా గ్రహించమంటావు? 4

*శ్రీ భగవానువాచ :*

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥ 5**

---

1. కనుక అధ్యాత్మ విద్యను గురుశిష్య పరంపరాక్రమంగా గ్రహించాలే కాని, స్వతంత్రంగా అధికరింపకూడదు అని సూచన.

బహూని, మే, వ్యతీతాని, జన్మాని, తవ, చ, అర్జున
తాని, అహమ్, వేద, సర్వాణి, న, త్వమ్, వేత్థ, పరంతప.

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | వ్యతీతాని | = గడిచాయి; |
| ఉవాచ | = పలికెను; | పరన్తప | = అర్జునా; |
| అర్జున | = అర్జునా; | అహమ్ | = నేను; |
| మే | = నాకూ; | తాని సర్వాణి | = వాటినన్నింటినీ; |
| తవ చ | = నీకు కూడా; | వేద | = ఎరుగుదును; |
| బహూని | = పెక్కు; | త్వమ్ | = నీవు; |
| జన్మాని | = జన్మలు; | న వేత్థ | = ఎరుగవు. |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* అర్జునా! నాకూ, నీకూ పెక్కుజన్మలు గడచాయి. నేను వాటినన్నింటినీ ఎరుగుదును. కాని నీవు ఎరుగవు (మరిచావు). (ఏమన, ధర్మ-అధర్మాది సంస్కారాలతో నీ జ్ఞానశక్తి ఆవృతమైంది, నీవు మాయకు అధీనుడవు. కాని, నేను నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావుడను. అలుప్త-విద్యాశక్తిని, మాయాధీశుణ్ణి అవడం చేత నా జ్ఞానశక్తి సర్వదా అనావృతం. 5

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా ॥ 6**

అజః, అపి, సన్, అవ్యయాత్మా, భూతానామ్, ఈశ్వరః, అపి, సన్,
ప్రకృతిమ్, స్వామ్, అధిష్ఠాయ, సంభవామి, ఆత్మమాయయా.

| | | | |
|---|---|---|---|
| అజః | = జన్మరహితుడను; | ఈశ్వరః | = నియామకుడను; |
| అవ్యయాత్మా | = ఎన్నడూ తరగని | సన్ అపి | = అయ్యు; |
| | జ్ఞానశక్తులతో ప్రకాశించే | స్వామ్ | = స్వకీయమైన |
| | స్వభావం కలవాడూ; | ప్రకృతిమ్ | = ప్రకృతిని; |
| సన్ అపి | = అయ్యు; | అధిష్ఠాయ | = వశమొనర్చుకొని; |
| భూతానామ్ | = ఆ బ్రహ్మస్తంబ | ఆత్మమాయయా | = నా మాయచేత; |
| | పర్యంతం గల ప్రాణులకు; | సంభవామి | = అవతరిస్తున్నాను. |

**తా॥** (ధర్మాధర్మసంస్కార రహితుడూ, నిత్యుడూ అయిన ఈశ్వరునికి జన్మ ఎలా కలుగుతోంది? అని అంటే-) నేను జన్మరహితుణ్ణి, అలుప్త-జ్ఞానశక్తి

స్వభావుణ్ణి, సర్వభూతేశ్వరుణ్ణి అయినా; దేని వశంలో ఈ జగత్తు ఉందో, అటువంటి నా త్రిగుణాత్మికమైన ప్రకృతిని వశమొనర్చుకుని నా మాయ చేతనే శరీరాన్ని[1] ధరిస్తున్నాను.[2] 6

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 7**

*యదా, యదా, హి, ధర్మస్య, గ్లానిః, భవతి, భారత,*
*అభ్యుత్థానమ్, అధర్మస్య, తదా, ఆత్మానమ్, సృజామి, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | భవతి | = కలుగుతాయో; |
| యదా యదా హి | = ఎప్పుడెప్పుడయితే; | తదా | = అప్పుడు; |
| ధర్మస్య | = వర్ణాశ్రమ ధర్మానికి; | అహమ్ | = నేను; |
| గ్లానిః | = పీడ; | ఆత్మానమ్ | = నన్ను; |
| అధర్మస్య | = అధర్మానికి; | సృజామి | = వ్యక్తీకరించుకుంటాను. |
| అభ్యుత్థానమ్ | = అభివృద్ధి; | | |

**తా॥** భారతా! ఎప్పుడేప్పుడైతే ప్రాణుల అభ్యుదయ నిఃశ్రేయస కారణమైన వర్ణాశ్రమధర్మం పతనం చెంది, అధర్మం అభివృద్ధి చెందుతుందో, అప్పుడు నేను నా మాయచేత శరీరాన్ని గ్రహిస్తున్నాను. 7

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ 8**

*పరిత్రాణాయ, సాధూనామ్, వినాశాయ, చ, దుష్కృతామ్,*
*ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి, యుగే, యుగే.*

| | | | |
|---|---|---|---|
| సాధూనామ్ | = సాధుపురుషుల; | దుష్కృతామ్ | = దుష్టుల; |
| పరిత్రాణాయ | = రక్షణార్థమూ; | వినాశాయ | = వినాశనార్థమూ; |

1. అవతారం దేహాన్ని గ్రహించినట్లు, పుట్టినట్లు కనిపిస్తుంది. శరీరాన్ని గ్రహించినప్పటికీ పుట్టుక నుండీ దివ్యభావం అలుప్తంగానే ఉంటుంది.
2. శ్రీమద్భగవద్గీతా : 7-24-25; 9-11 చూ.

| | | | |
|---|---|---|---|
| చ | = మరియూ; | యుగే యుగే | = ప్రతియుగంలో; |
| ధర్మసంస్థాపనార్థాయ | = ధర్మసంస్థాపన కొరకూ; | సంభవామి | = అవతరిస్తాను. |

**తా॥** సాధురక్షణ, దుష్టశిక్షణల[1] నిమిత్తమూ, ధర్మ సంస్థాపన కొరకూ నేను ప్రతియుగంలోనూ అవతరిస్తుంటాను.[2] 8

**జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥ 9**

జన్మ, కర్మ, చ, మే, దివ్యమ్, ఏవమ్, యః, వేత్తి, తత్త్వతః, త్యక్త్వా, దేహమ్, పునర్జన్మ, న, ఏతి, మామ్, ఏతి, సః, అర్జున.

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా; | వేత్తి | = తెలిసికుంటాడో; |
| యః | = ఎవడు; | సః | = అతడు; |
| మే | = నా; | దేహమ్ | = శరీరాన్ని; |
| దివ్యమ్ | = అప్రాకృతమైన; అలౌకికమైన; | త్యక్త్వా | = విడిచి; |
| జన్మ | = శరీరధారణా; | పునర్జన్మ | = మళ్ళీ జన్మను; |
| కర్మ చ | = సాధురక్షణాది లీలలను; | న ఏతి | = పొందడు; |
| ఏవమ్ | = ఇట్లు; | మామ్ | = నన్ను; |
| తత్త్వతః | = యథార్థంగా; | ఏతి | = పొందుతాడు. |

**తా॥** అర్జునా! ఎవడు ఈ తీరుగా అలౌకికమైన నా జన్మనూ, సాధు పరిత్రాణమూ మొదలైన అప్రాకృత కర్మల తత్త్వాన్ని (ఇవి పరోపకారార్థమే ఒనర్చబడినవని) గ్రహిస్తాడో అతడు పునర్జన్మను పొందడు, నన్నే పొందుతాడు. 9

**వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః ॥ 10**

1. దుష్టనిగ్రహ విషయంలో భగవంతుణ్ణి నిర్దయుడని తలపకూడదు. బాలుని శాసించే తండ్రిని దయావిహీనుడని అనలేం. అదే విధంగా గుణదోష నియంతయైన పరమేశ్వరుడు దుష్టనిగ్రహం చేస్తే, కరుణ లేనివాడు కాడు.

2. శ్రీమద్భాగవతము 'మర్త్యావతారస్త్విహ మర్త్యశిక్షణమ్' (5-19-5) అనీ, 'అనుగ్రహాయ భక్తానాం మానుషం దేహమాశ్రితః, భజతే తాదృశే క్రీడా యాః శ్రుత్వా తత్పరో భవేత్'. (10-33-36) అనీ అవతార ప్రయోజనాలను మరో రెండింటిని పేర్కొంటోంది. ఈ తత్పరత్వం లభిస్తే, మనుష్యుడు తరిస్తాడు. (11-6-24)

*వీతరాగ భయక్రోధాః, మన్మయాః, మామ్, ఉపాశ్రితాః,*

*బహవః, జ్ఞాన తపసా, పూతాః, మద్భావమ్, ఆగతాః.*

| | | | |
|---|---|---|---|
| వీత రాగ భయ క్రోధాః | = ఆసక్తి, భయం, కోపం లేనివారూ; | జ్ఞానతపసా | = పరమాత్మ జ్ఞానమనే తపస్సు చేత; |
| మన్మయాః | = నన్నే భావించేవారూ; | పూతాః | = శుద్ధులై; |
| మామ్ | = నన్ను; | మద్భావమ్ | = నా స్వరూపాన్ని; |
| ఉపాశ్రితాః | = ఆశ్రయించినవారూ; | ఆగతాః | = పొందారు. |
| బహవః | = పెక్కుమంది; | | |

**తా॥** (జన్మకర్మలను ఎరిగితే ఈశ్వరుణ్ణి పొందుతారు అని చెప్పబడింది. దాని క్రమం చెప్పబడుతోంది - నేను శుద్ధ సత్త్వావతారాలను దాల్చి, ధర్మపాలన చేస్తానని గ్రహించి నా పరమకారుణ్యాన్ని ఎరిగి) ఆసక్తిని, భయాన్ని, కోపాన్ని వీడి; నాయందు సమాహిత చిత్తులై, నన్ను శరణుజొచ్చిన వ్యక్తులు పెక్కుమంది ఆత్మ జ్ఞానమనే తపస్సు చేత శుద్ధులై నా స్వరూపాన్ని పొందారు. (ఒక్క చైతన్యమే ఉపాధిభేదంతో ఈశ్వరుడూ, జీవుడూ కూడా. ఈశ్వరప్రసాదంతో జీవుని అజ్ఞానం తొలగితే శుద్ధ చైతన్యమే అవుతాడు.) 10

**యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11**

*యే, యథా, మామ్, ప్రపద్యంతే, తాన్, తథా, ఏవ, భజామి, అహమ్,*

*మమ, వర్త్మ, అనువర్తంతే, మనుష్యాః, పార్థ, సర్వశః.*

| | | | |
|---|---|---|---|
| యే | = ఎవరు; | భజామి | = అనుగ్రహిస్తున్నాను; |
| యథా | = ఏ భావంతో; | పార్థ | = అర్జునా; |
| మాం | = నన్ను; | మనుష్యాః | = మనుష్యులు; |
| ప్రపద్యన్తే | = ఉపాసిస్తున్నారో; | సర్వశః | = సర్వవిధాల; |
| అహమ్ | = నేను; | మమ | = నా; |
| తాన్ | = వారిని; | వర్త్మ | = మార్గాన్ని; |
| తథా ఏవ | = అట్లే; | అనువర్తన్తే | = అనుసరిస్తున్నారు. |

**తా॥** (శరణాగతులకు మాత్రమే ఆత్మభావాన్ని ప్రసాదిస్తూ, సకాములను అనుగ్రహించని నీకు పక్షపాతం ఉన్నట్లున్నదే? అంటావా-) ఎవరు ఏ రీతిగా

(సకాములై గాని, నిష్కాములై గాని) నన్ను ఉపాసిస్తున్నారో వారిని ఆ రీతిగానే అనుగ్రహిస్తున్నాను. (సకాములకు కామ్య ఫలాన్ని, నిష్కాములకు ముక్తిని ఒసగుతున్నాను.) పార్థా! మనుష్యులు సర్వవిధాలా నా మార్గాన్నే అనుసరిస్తున్నారు. (ఇంద్రాది దేవతలను ఉపాసించే వారు కూడా, నన్నే ఆయా రూపాలలో సేవిస్తున్నారు. నేను కూడా వారిని ఆయా రూపాలలో అనుగ్రహిస్తున్నాను.)
(గీత. 8-21, 9-23 చూ:) 11

**కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ 12**

*కాంక్షంతః, కర్మణామ్, సిద్ధిమ్, యజంతే, ఇహ, దేవతాః,*
*క్షిప్రమ్, హి, మానుషే, లోకే, సిద్ధిః, భవతి, కర్మజా.*

| | | | |
|---|---|---|---|
| కర్మణామ్ | = శ్రౌత స్మార్త కర్మల; | హి | = కనుక; |
| సిద్ధిమ్ | = సిద్ధిని; | మానుషే లోకే | = మర్త్యలోకంలో; |
| కాంక్షన్తః | = కోరుతూ; | క్షిప్రమ్ | = శీఘ్రంగా; |
| ఇహ | = ఈ లోకంలో; | కర్మజా | = కర్మ జనితమైన; |
| దేవతాః | = దేవతలను; | సిద్ధిః | = సిద్ధి, ఫలం; |
| యజన్తే | = సేవిస్తున్నారు; | భవతి | = కలుగుతుంది. |

**తా॥** (అయితే, మోక్షార్థం అందరూ నిన్ను భజించరేమిటి? అంటే-) కర్మఫలకాంక్షులైన వారు పెక్కుమంది ఈ లోకంలో ఇతర దేవతలను పూజిస్తున్నారు, నా శరణును పొందడంలేదు. ఎందుకంటే, కర్మల ఫలం మనుష్యలోకంలో శీఘ్రంగానే లభిస్తోంది. (కాని జ్ఞానఫలమైన కైవల్యం దుష్ప్రాప్యం, శీఘ్రంగా లభించదు.) 12

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13**

*చాతుర్వర్ణ్యమ్, మయా, సృష్టమ్, గుణ కర్మ విభాగశః*
*తస్య, కర్తారమ్, అపి, మామ్, విద్ధి, అకర్తారమ్, అవ్యయమ్.*

| | | | |
|---|---|---|---|
| మయా | = నాచేత; | కర్తారమ్ అపి | = కర్తను అయినా; |
| గుణ కర్మ విభాగశః | = సత్త్వాదిగుణాల, శమాది కర్మల విభాగాన్ని అనుసరించి; | మామ్ | = నన్ను; |
| | | అవ్యయమ్ | = శ్రమరహితునిగా; |
| చాతుర్వర్ణ్యమ్ | = వర్ణచతుష్టయం; | అకర్తారమ్ | = అకర్తగా; |
| సృష్టమ్ | = సృష్టించబడింది; | విద్ధి | = తెలుసుకో. |
| తస్య | = దీనికి; | | |

**తా॥** (సకామ, నిష్కామ కర్మలకు భేదముంది; బ్రాహ్మణాది అధికార భేదాలను, ఉత్తమ-మధ్యమాది గుణాలను అనుసరించి కర్మవైచిత్ర్యం ఉంది. వీటికి కారకుడవైన నీకు పక్షపాతం లేకుండడం ఎలా? అంటావా-) సత్త్వాది గుణాలను, శమ దమాది కర్మలను అనుసరించి నాలుగు వర్ణాలను సృష్టించాను, (మాయా వ్యవహారాన్ని అనుసరించి నేను) కర్తనైనా కూడా (ఆసక్తి రహితుడనవడం చేత శ్రమవిహీనునిగా) అవ్యయునిగా, అకర్తగా నన్ను తెలుసుకో.

(*గీత:* 18-41, 44 చూ:) 13

**న మాం కర్మాణి లింపన్తి న మే కర్మఫలే స్పృహా ।**
**ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14**

*న, మామ్, కర్మాణి, లింపంతి, న, మే, కర్మఫలే, స్పృహా,*
*ఇతి, మామ్, యః, అభిజానాతి, కర్మభిః, న, సః, బధ్యతే.*

| | | | |
|---|---|---|---|
| కర్మాణి | = కర్మలు; | యః | = ఎవడు; |
| మామ్ | = నన్ను; | మామ్ | = నన్ను ఆత్మరూపంగా; |
| న లింపన్తి | = స్పృశించవు; | అభిజానాతి | = తెలుసుకుంటాడో; |
| మే | = నాకు; | సః | = అతడు; |
| కర్మఫలే | = కర్మ ఫలంపై; | కర్మభిః | = కర్మల చేత; |
| స్పృహా న | = ఆసక్తి లేదు; | న బధ్యతే | = బంధింపబడడు. |
| ఇతి | = ఈ విధంగా; | | |

**తా॥** దేహేంద్రియాదుల పట్ల నాకు అహంకారం లేనందువల్ల నేను కర్మలయందు లిప్తుడనవడం లేదు. ఆప్తకాముడనవడం చేత కర్మఫల తృష్ణ కూడా లేదు - ఈ విధంగా ఎవరు నన్ను అకర్త, అభోక్త అయిన ఆత్మరూపంగా

గ్రహిస్తాడో[1], అతడు కర్మల చేత ఎన్నడూ బంధించబడడు. కర్మ అతనికి జన్మాంతరారంభకం కాజాలదు. 14

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।**
**కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ 15**

ఏవమ్, జ్ఞాత్వా, కృతమ్, కర్మ, పూర్వైః, అపి, ముముక్షుభిః,
కురు, కర్మ, ఏవ, తస్మాత్, త్వమ్, పూర్వైః, పూర్వతరమ్, కృతమ్.

| | | | |
|---|---|---|---|
| ఏవమ్ | = ఈ విధంగా; | త్వమ్ | = నీవు; |
| జ్ఞాత్వా | = గ్రహించి; | పూర్వైః | = ప్రాచీనులచే; |
| పూర్వైః | = పూర్వులైన; | పూర్వతరమ్ | = పూర్వమే; |
| ముముక్షుభిః అపి | = మోక్షార్థులచే కూడా; | కృతమ్ | = ఒనర్చబడిన; |
| కర్మ | = కర్మ; | కర్మ ఏవ | = కర్మనే; |
| కృతమ్ | = అనుష్ఠింపబడింది; | కురు | = ఆచరించు. |
| తస్మాత్ | = కనుక; | | |

**తా॥** కర్మ ఈ విధంగా అహంకార రహితంగా ఒనర్చబడితే, అది బంధంగా పరిణమించదని గ్రహించి పూర్వులైన ముముక్షువులు కూడా కర్మను (చిత్తశుద్ధి కొరకు) ఆచరించి ఉన్నారు. 15

**కిం కర్మ కిమ కర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ 16**

కిమ్, కర్మ, కిమ్, అకర్మ, ఇతి, కవయః, అపి, అత్ర, మోహితాః,
తత్, తే, కర్మ, ప్రవక్ష్యామి, యత్, జ్ఞాత్వా, మోక్ష్యసే, అశుభాత్.

| | | | |
|---|---|---|---|
| కర్మ | = ఆచరింపదగినది; | కవయః అపి | = మేధావులు కూడా; |
| కిమ్ | = ఏది; | మోహితాః | = భ్రాంతులైరి; |
| అకర్మ | = ఆచరింపదగనిది; | (కనుక) యత్ | = దేనిని; |
| కిమ్ | = ఏది; | జ్ఞాత్వా | = తెలిసికుంటే; |
| ఇతి అత్ర | = ఈ విషయంలో; | అశుభాత్ | = సంసారమనే అశుభంనుండి; |

1. ఈశ్వరత్వం, ఈశ్వరుని సృష్టి రెండూ మాయికములు; బ్రహ్మమొక్కటే పారమార్థిక సత్యం.

| | | | |
|---|---|---|---|
| మోక్ష్యసే | = ముక్తుడవుతావో; | తే | = నీకు; |
| తత్ | = ఆ; | ప్రవక్ష్యామి | = చెబుతాను. |
| కర్మ | = కర్మను, అకర్మను; | | |

**తా॥** కర్తవ్య అకర్తవ్య విషయంలో పండితులు కూడా భ్రాంతులవుతున్నారు. కనుక దేనిని గ్రహిస్తే (జన్మమృత్యు రూపమూ, కర్తృత్వభోక్తృత్వాది రూపమూ అయిన) సంసారం అనే అశుభం నుండి ముక్తి పొందుతావో, ఆ కర్మ తత్త్వాన్ని నీకు చెబుతాను. 16

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17**

*కర్మణః, హి, అపి, బోద్ధవ్యమ్, బోద్ధవ్యమ్, చ, వికర్మణః,*
*అకర్మణః, చ, బోద్ధవ్యమ్, గహనా, కర్మణః, గతిః.*

| | | | |
|---|---|---|---|
| కర్మణః అపి | = శాస్త్రవిహితమైన కర్మల తత్త్వాన్ని; | అకర్మణః చ అపి | = నైష్కర్మ్య తత్త్వాన్ని; |
| బోద్ధవ్యమ్ | = తెలిసికోదగినది; | బోద్ధవ్యమ్ | = తెలుసుకోవాలి; |
| వికర్మణః అపి చ | = నిషిద్ధకర్మల విషయం కూడా; | హి | = ఏమన; |
| | | కర్మణః | = కర్మ అకర్మ వికర్మలు; |
| | | గతిః | = తత్త్వం (యాథార్థ్యం); |
| బోద్ధవ్యమ్ | = తెలియనగును; | గహనా | = తెలియుట కష్టం. |

**తా॥** శాస్త్రం విధించిన కర్మలను, నిషేధించిన కర్మలను, కర్మత్యాగాన్ని గురించి తెలుసుకోవాలి – కర్మతత్త్వం దుర్విజ్ఞేయమైనది.
(*శ్రీమద్భాగవతం:* 11-7-8 చూ.) 17

**కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్ ॥ 18**

*కర్మణి, అకర్మ, యః, పశ్యేత్, అకర్మణి, చ, కర్మ, యః,*
*సః, బుద్ధిమాన్, మనుష్యేషు, సః, యుక్తః, కృత్స్న కర్మకృత్.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | యః | = ఎవడు; |
| కర్మణి | = కర్మలో; | అకర్మణి చ | = కర్మాభావంలో; |
| అకర్మ | = కర్మాభావాని; అకర్తృత్వాన్ని; | కర్మ | = బ్రహ్మసాక్షాత్కార సిద్ధిని; |

| | |
|---|---|
| పశ్యేత్ = చూస్తాడో; | సః = అతడు; |
| సః = అతడు; | యుక్తః = యోగి;(మరియు) |
| మనుష్యేషు = మనుష్యులలో; | కృత్స్నకర్మకృత్ = సర్వకర్మలను |
| బుద్ధిమాన్ = జ్ఞాని; | ఆచరించినవాడు, కృతకృత్యుడు. |

**తా॥** కర్మలో తన అకర్తృత్వాన్ని, నైష్కర్మ్యాన్ని, కర్మను అంటే సర్వకర్మల ఆశయమైన బ్రహ్మాన్ని చూసేవాడు మనుష్యులందరిలోను బుద్ధిమంతుడు, (జ్ఞాని)[1] యోగయుక్తుడు, సర్వకర్మలకు కర్త[2] (కృతకృత్యుడు) అవుతున్నాడు. 18

**యస్య సర్వే సమారంభాః కామసఙ్కల్ప వర్జితాః ।**
**జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పణ్డితం బుధాః ॥ 19**

*యస్య, సర్వే, సమారంభాః, కామసంకల్ప వర్జితాః,*
*జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణమ్, తమ్, ఆహుః, పండితమ్, బుధాః.*

| | |
|---|---|
| యస్య = ఎవరి; | జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణమ్ = జ్ఞానమనే అగ్నిచే |
| సర్వే = సమస్త; | దహింపబడిన కర్మలు గల; |
| సమారంభాః = కర్మలు; | తమ్ = ఆ పురుషుణ్ణి; |
| కామసఙ్కల్పవర్జితాః =ఫలతృష్ణారహితమో, | పణ్డితమ్ = పండితుడు అని; |
| కర్తృత్వాభిమాన రహితాలో; | ఆహుః = అంటారు. |
| బుధాః = జ్ఞానులు; | |

**తా॥** ఎవరి కర్మాచరణ ఫలతృష్ణారహితంగా ఉంటోందో, ఎవరి (శుభ అశుభ కర్మల పట్ల) కర్తృత్వ బుద్ధి జ్ఞానాగ్ని చేత దగ్ధమైనదో, అతణ్ణి బ్రహ్మవేత్తలు పండితుడు అని అంటారు. 19

**త్యక్త్వా కర్మఫలా సఙ్గం నిత్య తృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్ కరోతి సః ॥ 20**

---

1. తాను ప్రవృత్తినివృత్తులకు కర్త కాదు – అని గ్రహించిన వాడే జ్ఞాని. గీత. 3-28; 5-8, 9, 13, 29
2. ఈ సమ్యక్ దర్శనం 'సర్వతః సంప్లుతోదకము'ను పోలునది. ఈ దర్శనంలో సర్వకర్మల ఫలం అంతర్భుక్తము. కనుక అతడు ఎటువంటి కర్మ ఒనర్చకపోయినా, సమస్త కర్మల ఫలాన్ని పొందుతాడు. కాబట్టి అతడు కృత్స్నకర్మకృత్.

త్యక్త్వా, కర్మఫలాసంగమ్, నిత్య తృప్తః, నిరాశ్రయః,
కర్మణి, అభి ప్రవృత్తః, అపి, న, ఏవ, కించిత్, కరోతి, సః.

| | | | |
|---|---|---|---|
| సః | = అతడు; | కర్మణి | = కర్మల; |
| కర్మఫలాసఙ్గమ్ | = కర్మఫలాసక్తిని; | అభిప్రవృత్తోపి | = ప్రవృత్తుడైనా; |
| త్యక్త్వా | = వీడి | కిఞ్చిత్ | = కొంచెం కూడా; |
| నిత్యతృప్తః | = సదాతృప్తుడు; | న కరోతి ఏవ | = ఒనర్చనివాడే. |
| నిరాశ్రయః | = నిరవలంబడూ అవుతూ; | | |

**తా॥** కర్మఫలాసక్తిని పరిత్యజించి సర్వదా పరితృప్తుడై, దేనినీ ఆశ్రయించకుండా, కర్మలను ఒనర్చేవాడు ఏమీ ఒనర్చని వాడే అవుతాడు. ఎందుకంటే, అతని కర్తృత్వ బుద్ధి జ్ఞానాగ్నిలో దగ్ధమైంది. 20

**నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వ పరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21**

నిరాశీః, యత చిత్తాత్మా, త్యక్త సర్వ పరిగ్రహః,
శారీరమ్, కేవలమ్, కర్మ, కుర్వన్, న, ఆప్నోతి, కిల్బిషమ్.

| | | | |
|---|---|---|---|
| నిరాశీః | = కామనాశూన్యుడూ; | శారీరమ్ | = శరీర రక్షణార్థం (కర్తృత్వాభిమానరహితమై శారీరకంగా చేసే); |
| యతచిత్తాత్మా | = అంతఃకరణాన్ని, దేహేంద్రియాలను వశపరచుకున్నవాడూ; | కర్మ | = కర్మను; |
| త్యక్తసర్వపరిగ్రహః | = ఏ వస్తువునూ గ్రహించనివాడూ; (అయిన పురుషుడు) | కుర్వన్ | = ఒనర్చినప్పటికీ; |
| | | కిల్బిషమ్ | = అనిష్టం, పుణ్యాపాపాలను; |
| కేవలమ్ | = అభిమాన రహితమైన; | న ఆప్నోతి | = పొందడు. |

**తా॥** నిష్కాముడూ, పరిగ్రహత్యాగీ, సంయత దేహేంద్రియ మనస్కుడూ అయిన వాడు శారీరకమైన కర్మను (శరీరధారణ నిమిత్తం, శరీరంతో కర్మాచరణ) ఆచరించినప్పటికీ పుణ్యపాప రూపమైన బంధం కలుగదు. 21

**యదృచ్ఛా లాభ సన్తుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।**
**సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥ 22**

*యదృచ్ఛా లాభ సంతుష్టః, ద్వంద్వాతీతః, విమత్సరః,*
*సమః, సిద్ధౌ, అసిద్ధౌ, చ, కృత్వా, అపి, న, నిబధ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యదృచ్ఛాలాభసంతుష్టః | = అప్రార్థితములూ, అనాయాసలబ్ధములూ అయిన వానిచే సంతుష్టుడూ; | సిద్ధౌ | = లాభంలో; |
| ద్వంద్వాతీతః | = సుఖదుఃఖాదులను అతిక్రమించినవాడు; | అసిద్ధౌ చ | = అలాభంలో; |
| విమత్సరః | = అసూయారహితుడూ, నిర్వైరుడు; | సమః | = సమబుద్ధి కలవాడు; |
| | | కృత్వాపి | = కర్మను ఆచరించినా; |
| | | న నిబధ్యతే | = బద్ధుడు కాడు. |

**తా॥** యదృచ్ఛాలాభ సంతుష్టుడూ, శీతోష్ణాది ద్వంద్వరహితుడూ, మాత్సర్యహీనుడూ, లాభాలాభాలలో సమబుద్ధి గలవాడూ అయిన పురుషుడు విహితమైన కర్మలను గాని లేక స్వాభావికములైన శరీర రక్షణాదిక కర్మలను గాని ఆచరించినప్పటికీ కూడా బద్ధుడు కాడు. 22

**గత సఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।**
**యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23**

*గతసంగస్య, ముక్తస్య, జ్ఞానావస్థిత చేతసః,*
*యజ్ఞాయ, ఆచరతః, కర్మ, సమగ్రమ్, ప్రవిలీయతే.*

| | | | |
|---|---|---|---|
| గతసంఙ్గస్య | = ఆసక్తిరహితుడూ; | యజ్ఞాయ | = ఈశ్వరారాధననిమిత్తం, లోకసంగ్రహార్థం; |
| ముక్తస్య | = ముక్తుడూ; | ఆచరతః | = ఒనర్చువాని; |
| జ్ఞానావస్థితచేతసః | = జ్ఞానస్థితిలో నెలకొన్న మనస్సుగలవాడూ; | సమగ్రమ్ కర్మ | = కర్మమంతా; |
| | | ప్రవిలీయతే | = నశిస్తోంది. |

**తా॥** ఆసక్తిశూన్యుడూ, విముక్తుడూ, జ్ఞాననిష్ఠుడూ అయిన వ్యక్తి యజ్ఞార్థం (లోకసంగ్రహార్థం కాని ఈశ్వర ప్రీత్యర్థం కాని) కర్మను ఆచరిస్తే, ఆ కర్మ తత్ఫలాలను ఇచ్చి బంధాన్ని కల్పించదు. అది సమగ్రంగా[1] వినష్టమైపోతుంది. కర్మ గాని కర్మసంస్కారం గాని ఉండదు. (గీత: 4-23, 18-12 చూ:) 23

1. అగ్రము అంటే ఫలం. సమగ్రంగా అంటే ఫలసహితంగా అని అర్థం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే జ్ఞానం అతనికి కలిగింది కనుక అతని 'కర్మ సమగ్రం ప్రవిలీయతే'.

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥ 24**

బహ్మ, అర్పణమ్, బ్రహ్మ, హవిః, బ్రహ్మాగ్నౌ, బ్రహ్మణా, హుతమ్, బ్రహ్మ, ఏవ, తేన, గంతవ్యమ్, బ్రహ్మకర్మ సమాధినా.

అర్పణమ్ = ఆహుతిసాధనాలైన స్రుక్స్రువాదులు; బ్రహ్మ = బ్రహ్మ స్వరూపం; హవిః = ఘృతము; బ్రహ్మ = బ్రహ్మమే; బ్రహ్మాగ్నౌ = బ్రహ్మ రూపమైన అగ్నిలో; బ్రహ్మణా = బ్రహ్మరూపమైన హోతచేత; హుతమ్ = హోమం ఒనర్చబడింది; బ్రహ్మ = బ్రహ్మమే; బ్రహ్మకర్మసమాధినా = కర్మలో బ్రహ్మ భావం గల; తేన = ఆ పురుషునిచే; గంతవ్యమ్ = పొందబడదగినఫలం; బ్రహ్మ ఏవ = బ్రహ్మమే.

**తా॥** ఆహుతి సాధనవస్తువులు బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోత బ్రహ్మము. హవనక్రియ బ్రహ్మము. కర్మలో బ్రహ్మబుద్ధితో ఉండే పురుషుడు పొందదగిన ఫలం కూడా బ్రహ్మమే[2]. (ప్రథమ విధమైన యజ్ఞం) 24

**దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25**

దైవమ్, ఏవ, అపరే, యజ్ఞమ్, యోగినః, పర్యుపాసతే, బ్రహ్మాగ్నౌ, అపరే, యజ్ఞమ్, యజ్ఞేన, ఏవ, ఉపజుహ్వతి.

అపరే = ఇతరులైన; యోగినః = యోగులు; దైవమ్ = దేవతా సంబంధమైన; యజ్ఞమ్ ఏవ = యజ్ఞమునే; పర్యుపాసతే = అనుష్ఠిస్తున్నారు; అపరే = మరి కొందరు; బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమనే అగ్నిలో; యజ్ఞేన ఏవ = జీవాత్మచేతనే; యజ్ఞమ్ = జీవాత్మను; ఉపజుహ్వతి = ఆహుతిని ఇస్తున్నారు.

2. పరమేశ్వర ఆరాధనారూపమైన కర్మ జ్ఞానహేతువవడం చేత బంధకారణం కాదు. ఫలాన్నిబట్టి అకర్మమే. సిద్ధపురుషుడు ఆచరించే కర్మలో కర్తృత్వభావం లేకపోవడం చేత అది కూడా అకర్మయే అని చెప్పబడింది. కర్మలో, కర్మాంగముల బ్రహ్మానుస్మృత్యమును ప్రదర్శిస్తూ, కర్మ ప్రవిలయం చెప్పబడింది. – శ్రీధరస్వామి

**తా॥** కొందరు యోగులు (జ్యోతిష్టోమాది యాగాలను చేసి) దేవతా సంబంధమైన యజ్ఞాన్ని అనుష్ఠిస్తున్నారు. (ఇది కర్మయజ్ఞం) మరికొందరు, బ్రహ్మం అనే అగ్నిలో జీవాత్మ చేత జీవాత్మనే అహుతి ఇస్తున్నారు - అంటే, సోపాధికమైన జీవాత్మను నిరుపాధికమైన పరమాత్మగా దర్శిస్తున్నారు.[1] (ఇది జ్ఞానయజ్ఞం) (ద్వితీయ, తృతీయ విధాలైన యజ్ఞములు.) 25

**శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।**
**శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26**

*శ్రోత్రాదీని, ఇంద్రియాణి, అన్యే, సంయమాగ్నిషు, జుహ్వతి,*
*శబ్దాదీన్, విషయాన్, అన్యే, ఇంద్రియాగ్నిషు, జుహ్వతి.*

అన్యే = మరికొందరు;
శ్రోత్రాదీని = కర్ణాదులైన;
ఇంద్రియాణి = ఇంద్రియాలను;
సంయమాగ్నిషు = నిగ్రహమనే అగ్నిలో;
జుహ్వతి = ఆహుతిని ఇస్తున్నారు;
అన్యే = మరికొందరు;
శబ్దాదీన్ = శబ్దాదులైన;
విషయాన్ = విషయ సమూహాలను;
ఇంద్రియాగ్నిషు = ఇంద్రియ రూపమైన అగ్నిలో;
జుహ్వతి = ఆహుతిని ఇస్తున్నారు.

**తా॥** ఇతరయోగులు (నైష్ఠిక బ్రహ్మచారులు, సన్న్యాసులు) కర్ణాదులైన ఇంద్రియాలను సంయమమనే అగ్నిలో ఆహుతిని ఇస్తున్నారు. (ఇంద్రియనిగ్రహం పాటిస్తున్నారు.) మరికొందరు యోగులు (గృహస్థులు) శబ్దాది విషయ సమూహాలను ఇంద్రియాగ్నిలో ఆహుతిని ఇస్తున్నారు. (ఇంద్రియాలచేత ధర్మవిరుద్ధాలు కాని విషయాలను గ్రహించి, హోమబుద్ధితో, భోగిస్తున్నారు.) (చతుర్థ, పంచమ విధాలైన యజ్ఞాలు.) 26

**సర్వాణీన్ద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।**
**ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27**

*సర్వాణి, ఇంద్రియ కర్మాణి, ప్రాణకర్మాణి, చ, అపరే,*
*ఆత్మ సంయమ యోగాగ్నౌ, జుహ్వతి, జ్ఞానదీపితే.*

1. 25వ శ్లోకం నుండి 32వ శ్లోకం వరకు జ్ఞానప్రశంసార్థం, తత్ప్రాప్తికి ఉపాయములైన యజ్ఞాలు ప్రశంసించబడుతున్నవి.

| | |
|---|---|
| అపరే = మరికొందరు; | ఇంద్రియకర్మాణి = ఇంద్రియకర్మలను; |
| జ్ఞానదీపితే = జ్ఞానప్రదీప్తమైన; | ప్రాణకర్మాణి చ = ప్రాణాదివాయువుల కర్మలను; |
| ఆత్మ సంయమయోగాగ్నౌ = ఆత్మ నిగ్రహమనే యోగాగ్నిలో; | జుహ్వతి = ఆహుతినిస్తారు. |
| సర్వాణి = సమస్త; | |

**తా॥** మరికొందరు యోగులు (ధ్యానయోగులు) జ్ఞానప్రదీప్తమైన ఆత్మనిగ్రహం అనే యోగాగ్నిలో ఇంద్రియ కర్మలను, ప్రాణాది పంచవాయు కర్మలను ఆహుతి ఒనర్చుతున్నారు. (లయం చేస్తున్నారు) (షష్ఠ, సప్తమ విధ యజ్ఞాలు.) 27

**ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞాః యోగయజ్ఞా స్తథాఽపరే ।**
**స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥ 28**

*ద్రవ్యయజ్ఞాః, తపోయజ్ఞాః, యోగయజ్ఞాః, తథా, అపరే,*
*స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాః, చ, యతయః, సంశితవ్రతాః.*

| | |
|---|---|
| అపరే = మరికొందరు; | తథా = మరియు; |
| ద్రవ్యయజ్ఞాః = ద్రవ్య దానయజ్ఞ నిష్ఠులు; | సంశితవ్రతాః = దృఢవ్రతులు; |
| తపోయజ్ఞాః = చాంద్రాయణాది వ్రతపరాయణులు; | యతయః = ప్రయత్నశీలురూ; |
| యోగయజ్ఞాః = ప్రాణాయామాదిరూప యజ్ఞపరాయణులు; | స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాః చ =వేదాభ్యాసమనే యజ్ఞమును, వేదార్థ జ్ఞానమనే యజ్ఞమును (అనుష్ఠించేవారు). |

**తా॥** కొందరు ద్రవ్యదానం అనే యజ్ఞమొనరుస్తున్నారు. మరికొందరు చాంద్రాయణాదిరూపమైన తపోయజ్ఞం ఒనర్చుతున్నారు. ఇంకొందరు ప్రాణాయామ ప్రత్యాహారంతో కూడిన యోగయజ్ఞం ఒనర్చుతున్నారు. ఇతరులైన యతులు దృఢవ్రతులై వేదాభ్యాసమనే స్వాధ్యాయ యజ్ఞాన్ని, వేదార్థనిశ్చయమనే జ్ఞానయజ్ఞాన్ని ఒనర్చుతున్నారు. (అష్టమ, నవమ, దశమ, ఏకాదశ విధ యజ్ఞాలు). 28

**అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే ।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥ 29**

*అపానే, జుహ్వతి, ప్రాణమ్, ప్రాణే, అపానమ్, తథా, అపరే,*
*ప్రాణాపానగతీ, రుద్ధ్వా, ప్రాణాయామ పరాయణాః.*

| | | | |
|---|---|---|---|
| తథా | = మరి; | జుహ్వతి | = ఆహుతినిస్తున్నారు; |
| అపరే | = ఇతర యోగులు; | ప్రాణాపానగతీ | = ప్రాణ అపాన వాయువుల గతిని; |
| అపానే | = అపానవాయువులో; | | |
| ప్రాణమ్ | = ప్రాణవాయువును; | రుద్ధ్వా | = నిరోధించి; |
| ప్రాణే | = ప్రాణవాయువులో; | ప్రాణాయామపరాయణాః | = ప్రాణాయామ పరాయణులు. (అవుతారు). |
| అపానమ్ | = అపానవాయువును; | | |

**తా॥** యోగులైన మరికొందరు అపానవాయువులో ప్రాణవాయువును హోమమొనర్చుతున్నారు. (పూరక ప్రాణాయామం.) మరియు, ప్రాణవాయువులో అపాన వాయువును హోమమొనర్చుతున్నారు. (రేచక ప్రాణాయామం.) వీరే, ప్రాణ అపాన వాయువుల గతిని నిరోధించి ప్రాణాయామం ఒనర్చుతున్నారు. (కుంభకం) (ద్వాదశ విధ యజ్ఞం).(సనత్సుజాతీయమ్ : 5–11 చూ.) 29

**అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి ।**
**సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞ క్షపిత కల్మషాః[1] ॥ 30**

*అపరే, నియతాహారాః, ప్రాణాన్, ప్రాణేషు, జుహ్వతి,*
*సర్వే, అపి, ఏతే, యజ్ఞవిదః, యజ్ఞ క్షపిత కల్మషాః.*

| | | | |
|---|---|---|---|
| అపరే | = మరి కొందరు; | యజ్ఞవిదః | = యజ్ఞవేత్తలైన; |
| నియతాహారాః | = సంయతాహారులై; | ఏతే సర్వే అపి | = వీరందరూ; |
| ప్రాణాన్ | = వాయుసమూహాన్ని; | యజ్ఞ క్షపిత కల్మషాః | = యజ్ఞం చేత పాపాన్ని పోగొట్టుకున్నారు. |
| ప్రాణేషు | = వాయువులలో; | | |
| జుహ్వతి | = హోమమొనర్చుతున్నారు; | | |

**తా॥** మరికొందరు, ఆహారసంయమమొనర్చి వాయువులను ఇతర వాయువులలో ఆహుతి ఇస్తున్నారు. అంటే, ఏ ఏ వాయువును జయిస్తున్నారో ఆ వాయువును ఇతర వాయువులలో హోమమొనర్చుతున్నారు. ఈ యజ్ఞాలను ఎరుగువారూ, ఆచరించువారూ పాపముక్తులవుతున్నారు.(మను స్మృతి : 4–22,24)

---

1. క్షయిత కల్మషాః.

**యజ్ఞ శిష్టామృత భుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయం లోకోఽ_స్త్యయజ్ఞస్య కుతోఽ_న్యః కురుసత్తమ ॥ 31**

*యజ్ఞ శిష్టామృత భుజః, యాంతి, బ్రహ్మ, సనాతనమ్,*
*న, అయమ్, లోకః, అస్తి, అయజ్ఞస్య, కుతః, అన్యః, కురుసత్తమ.*

| | | | |
|---|---|---|---|
| కురుసత్తమ | = కురుశ్రేష్ఠా; | అయజ్ఞస్య | = యజ్ఞరహితునికి; |
| యజ్ఞ శిష్ట | | అయమ్ | = ఈ; |
| అమృత భుజః | = యజ్ఞానంతరం మిగులు అమృతాన్ని భుజించేవారు; | లోకః | = లోకం; |
| సనాతనమ్ | = శాశ్వతమైన; | నాస్తి | = లేదు; |
| బ్రహ్మ | = బ్రహ్మాన్ని; | అన్యః | = పరలోకం; |
| యాన్తి | = పొందుతారు; | కుతః | = ఎక్కడిది? |

**తా॥** యజ్ఞానంతరం మిగిలే అమృతాన్ని భుజించేవారు నిత్యమైన బ్రహ్మాన్ని పొందుతున్నారు. కురుశ్రేష్ఠా! యజ్ఞం చేయనివారికి అల్పసుఖయుక్తమైన ఈ లోకమే లేదు. పెక్కు సుఖాలతో కూడిన పరలోకమెక్కడ?[1] 31

**ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।**
**కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32**

*ఏవమ్, బహువిధాః, యజ్ఞాః, వితతాః, బ్రహ్మణః, ముఖే,*
*కర్మజాన్, విద్ధి, తాన్, సర్వాన్, ఏవమ్, జ్ఞాత్వా, విమోక్ష్యసే.*

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మణః ముఖే | = వేదంలో; | కర్మజాన్ | = కర్మల నుండి కలిగిన వాటిగా; |
| ఏవమ్ | = ఈ విధంగా; | విద్ధి | = గ్రహించు; |
| బహువిధాః | = పలువిధాలైన; | ఏవమ్ | = ఇట్లు; |
| యజ్ఞాః | = యజ్ఞాలు; | జ్ఞాత్వా | = తెలుసుకుంటే; |
| వితతాః | = వ్యాఖ్యాతములు; | విమోక్ష్యసే | = ముక్తుడవవుతావు. |
| తాన్ సర్వాన్ | = వాటినన్నిటినీ; | | |

**తా॥** వేదంలో బహువిధాలైన యజ్ఞాలు ఇలా వ్యాఖ్యానించబడ్డాయి. ఇవన్నీ మనోవాక్కాయకర్మలకు సంబంధించినవి, ఆత్మ నుండి కలుగలేదు. ఆత్మ

1. యజ్ఞానుష్ఠాన విహీనుడు సర్వజన నిందితుడై ఇహలోకంలో అనాయాసాలభ్యమైన సుఖాన్నే పొందడం లేదు; విశిష్టసాధనా సాధ్యమైన పారలౌకిక సుఖం ఎలా పొందగలడు?

నిర్వ్యాపారి అని గ్రహిస్తే (జ్ఞాననిష్ఠుడవైతే) ముక్తి పొందగలవు. (*గీత:*18-13, 18 చూ.) 32

**శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప ।**
**సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33**

*శ్రేయాన్, ద్రవ్యమయాత్, యజ్ఞాత్, జ్ఞానయజ్ఞః, పరంతప,*
*సర్వం, కర్మ, అఖిలమ్, పార్థ, జ్ఞానే, పరిసమాప్యతే.*

| | | | |
|---|---|---|---|
| పరన్తప | = అర్జునా; | సర్వం కర్మ | = సమస్త కర్మ; |
| ద్రవ్యమయాత్ | = ద్రవ్యసాధ్యమైన; | అఖిలమ్ | = ఫల సమేతంగా; |
| యజ్ఞాత్ | = యజ్ఞం కంటే; | జ్ఞానే | = బ్రహ్మజ్ఞానంలో; |
| జ్ఞానయజ్ఞః | = జ్ఞానరూపమైన యజ్ఞం; | (తత్సాధనంగా) | |
| శ్రేయాన్ | = శ్రేయస్కరం; | పరిసమాప్యతే | = అంతర్గతమవుతోంది. |
| పార్థ | = అర్జునా; | | |

**తా॥** పరంతపా! ఫలారంభకాలూ, అనాత్మ వ్యాపార జన్యాలూ అయిన ద్రవ్యయజ్ఞాల కంటే, జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమైనది. (జ్ఞానం మనో వ్యాపారాధీనమే అయినప్పటికీ మనస్సు నుండి పుట్టడం లేదు, మనః పరిపక్వతను బట్టి అభివ్యక్తమవుతోంది.) పార్థా! ఫలసమేతంగా కర్మలు అన్నీ కూడా ఆత్మ జ్ఞానంలోనే అంతర్గతాలు అవుతున్నాయి.[1] (*గీత:* 2-46 చూ.) 33

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34**

*తత్, విద్ధి, ప్రణిపాతేన, పరిప్రశ్నేన, సేవయా,*
*ఉపదేక్ష్యంతి, తే, జ్ఞానమ్, జ్ఞానినః, తత్త్వదర్శినః*

| | | | |
|---|---|---|---|
| ప్రణిపాతేన | = ప్రణామం చేతా; | తత్ | = ఆ బ్రహ్మజ్ఞానాన్ని; |
| పరిప్రశ్నేన | = ప్రశ్నించుటచేతా; | విద్ధి | = తెలుసుకో; |
| సేవయా | = శుశ్రూష చేతా; | తత్త్వదర్శినః | = తత్త్వవేత్తలైన; |

1. సర్వం త దభిసమేతి యత్కించి త్ప్రజాః సాధు కుర్వంతి (ఛాందోగ్యోపనిషత్తు : 4-1-4)

| | | | |
|---|---|---|---|
| జ్ఞానినః | = జ్ఞానులు; | జ్ఞానమ్ | = జ్ఞానాన్ని; |
| తే | = నీకు; | ఉపదేక్ష్యంతి | = ఉపదేశిస్తారు. |

**తా॥** ప్రణామం చేసి, ప్రశ్నించి, పరిచర్య చేసి బ్రహ్మజ్ఞానాన్ని అర్థించు. తత్త్వద్రష్టలైన జ్ఞానులు నీకు ఆ బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించగలరు.

(ముండకోపనిషత్తు: 2-2-7 చూ.) 34

**యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాణ్డవ ।**
**యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35**

*యత్, జ్ఞాత్వా, న, పునః, మోహమ్, ఏవమ్, యాస్యసి, పాండవ,*
*యేన, భూతాని, అశేషేణ, ద్రక్ష్యసి, ఆత్మని, అథో, మయి.*

| | | | |
|---|---|---|---|
| పాణ్డవ | = అర్జునా; | అశేషేణ | = నిరవశేషంగా; |
| యత్ | = దేనిని; | | బ్రహ్మాదిస్థావర పర్యంతం; |
| జ్ఞాత్వా | = గ్రహించి; | భూతాని | = ప్రాణులను; |
| పునః | = మళ్ళీ; | ఆత్మని | = నీ యందు; |
| ఏవమ్ | = ఇటువంటి; | అథ | = మరియు; |
| మోహమ్ | = మోహాన్ని; | మయి | = నా యందూ; |
| న యాస్యసి | = పొందవో; | ద్రక్ష్యసి | = చూడగలవో; |
| యేన | = దేనిచేత; | (తద్విద్ధి | =దానిని తెలుసుకో) |

**తా॥** అర్జునా! ఈ బ్రహ్మజ్ఞానాన్ని పొందితే మళ్ళీ నీకు ఇటువంటి మోహం కలుగదు. ఆ జ్ఞానం చేత నీవు, బ్రహ్మ (చతుర్ముఖ బ్రహ్మ) నుండి స్థావరం వరకూ గల ప్రాణులన్నింటినీ నీలోనూ, నాయందూ చూడగలవు[1].

(గీత: 6-29, 30 చూ.) 35

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥ 36**

అపి, చేత్, అసి, పాపేభ్యః, సర్వేభ్యః, పాపకృత్తమః,
సర్వమ్, జ్ఞాన ప్లవేన, ఏవ, వృజినమ్, సంతరిష్యసి.

1. ఈ శ్లోకం జీవబ్రహ్మముల ఏకత్వ ప్రతిపాదనపరము.

| | | | |
|---|---|---|---|
| పాపేభ్యః సర్వేభ్యః | = పాపులందరి కంటే; | వృజినం సర్వమ్ | = సమస్త పాపాన్నీ, ధర్మాధర్మాలను; |
| పాపకృత్తమః | = పాపిష్ఠుడవు; | జ్ఞానప్లవేన ఏవ | = జ్ఞానమనే తెప్పతోనే; |
| అపిచేత్ అసి | = అయినా కూడా; | సన్తరిష్యసి | = ఉత్తీర్ణుడవు కాగలవు. |

**తా॥** పాపులందరిలోను నీవు పాపిష్ఠుడవే అయినా కూడా, ఈ బ్రహ్మ జ్ఞానమనే తెప్పచేత ధర్మాధర్మాలను అన్నింటిని అతిక్రమించగలవు; బ్రహ్మజ్ఞాన మాహాత్మ్యం ఇటువంటిది[1]. 36

**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్ కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా[2] ॥ 37**

*యథా, ఏధాంసి, సమిద్ధః, అగ్నిః, భస్మసాత్, కురుతే, అర్జున,*
*జ్ఞానాగ్నిః, సర్వకర్మాణి, భస్మసాత్, కురుతే, తథా.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా; | కురుతే | = చేస్తుందో; |
| సమిద్ధః | = ప్రజ్వలితమైన; | తథా | = ఆ విధంగా; |
| అగ్నిః | = అగ్ని; | జ్ఞానాగ్నిః | = జ్ఞానమనే అగ్ని; |
| ఏధాంసి | = కట్టెలను; | సర్వకర్మాణి | = సమస్తకర్మలను; |
| యథా | = ఏ విధంగా; | భస్మసాత్ కురుతే | = భస్మం చేస్తోంది. |
| భస్మసాత్ | = భస్మం; | | |

**తా॥** అర్జునా! ప్రజ్వలితాగ్ని కాష్ఠరాశిని భస్మీభూతం చేస్తునట్లు జ్ఞానాగ్ని శుభాశుభకర్మలను అన్నింటినీ భస్మం చేస్తోంది.[3] 37

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥ 38**

1. యథాగ్నిః సుసమృద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్,
తథామద్విషయాభక్తి రుద్ధవైనాంసి కృత్స్నశః — శ్రీమద్భాగవతమ్. 11-14-19.

2. భీజాన్యగ్న్యుపదగ్ధాని న రోహంతి యథా పునః,
జ్ఞానదగ్ధైస్తథా క్లేశైర్నాత్మా సంపద్య తే పునః — వన పర్వ. 200-110.

3. బ్రహ్మజ్ఞానంలో ప్రారబ్ధకర్మ తప్ప తదితరకర్మలన్ని కూడా నశిస్తాయి.
— వేదాంత సూత్రమ్. 4-1-13, 14, 19

న, హి, జ్ఞానేన, సదృశమ్, పవిత్రమ్, ఇహ, విద్యతే,
తత్, స్వయమ్, యోగ సంసిద్ధః, కాలేన, ఆత్మని, విందతి

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఈ జగత్తులో; | యోగసంసిద్ధః | = కర్మయోగంతో శుద్ధచిత్తుడైన; |
| జ్ఞానేన | = జ్ఞానంతో; | (ముముక్షువు) స్వయమ్ | = తాను; |
| సదృశమ్ | = సమానమైన; | ఆత్మని | = తన యందు; |
| పవిత్రమ్ | = పవిత్రమైనది; | తత్ | = ఆ బ్రహ్మ జ్ఞానాన్ని; |
| న విద్యతే హి | = లేదు కదా; | విన్దతి | = పొందుతాడు. |
| కాలేన | = కాలక్రమంలో; | | |

**తా॥** ఈలోకంలో (తపోయోగాదుల) జ్ఞానతుల్యమైన శుద్ధ వస్తువు మరొకటి లేదు. కర్మయోగ సిద్ధుడై (యోగ్యతను పొందిన) ముముక్షువు తనయందు ఆ బ్రహ్మజ్ఞానాన్ని కాలక్రమంలో పొందుతున్నాడు. (గీత. 18-45 చూ:) 38

**శ్రద్ధావాన్లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధి గచ్ఛతి ॥ 39**

*శ్రద్ధావాన్, లభతే, జ్ఞానమ్, తత్పరః, సంయతేంద్రియః,*
*జ్ఞానమ్, లబ్ధ్వా, పరామ్, శాంతిమ్, అచిరేణా, అధి గచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| శ్రద్ధావాన్ | = శ్రద్ధావంతుడూ; | జ్ఞానమ్ | = ఆత్మజ్ఞానాన్ని; |
| తత్పరః | = గురుసేవానియుక్తుడూ; | లబ్ధ్వా | = పొంది; |
| సంయతేంద్రియః | = జితేంద్రియుడూ; | అచిరేణ | = వెంటనే; |
| (అగువాడు) జ్ఞానమ్ | = బ్రహ్మజ్ఞానాన్ని; | పరాంశాంతిమ్ | = మోక్షాన్ని; |
| లభతే | = పొందుతాడు; | అధిగచ్ఛతి | = పొందుతాడు. |

**తా॥** శ్రద్ధాళువూ, గురుసేవారతుడూ, జితేంద్రియుడూ అయిన ముముక్షువు తత్త్వజ్ఞానాన్ని పొందగలడు. (జ్ఞానలాభ పర్యంతం చిత్తశుద్ధి కొరకు కర్మయోగం అవశ్యం అనుష్ఠేయమైనది. జ్ఞానలాభానంతరం ఇక ఏ కర్తవ్యమూ లేదు.) అతడు జ్ఞానాన్ని పొంది అతిశీఘ్రంగానే పరమ శాంతిని (మోక్షాన్ని) పొందుతాడు. 39

**అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40**

*అజ్ఞః, చ, అశ్రద్దధానః, చ, సంశయాత్మా, వినశ్యతి,*
*న, అయమ్, లోకః, అస్తి, న, పరః, న, సుఖమ్, సంశయాత్మనః.*

| | | | |
|---|---|---|---|
| అజ్ఞః చ | = జ్ఞానహీనుడూ; | సంశయాత్మనః | = సందేహచిత్తునికి; |
| అశ్రద్దధానః చ | = శ్రద్ధాహీనుడూ; | అయం లోకః | = ఈ లోకం; |
| సంశయాత్మా | = సందిగ్ధచిత్తుడూ అయిన వ్యక్తి; | న అస్తి | = లేదు; |
| | | న పరః | = పరలోకం కూడా లేదు; |
| వినశ్యతి | = భ్రష్టుడవుతాడు; | న సుఖమ్ | = సుఖం లేదు. |

**తా॥** (గురూపదిష్టార్థ) జ్ఞానహీనుడు, (కొంచెం జ్ఞానం కలిగినా కూడా) శ్రద్ధలేనివాడూ, (శ్రద్ధ ఉన్నా కూడా, ఇది సిద్ధిస్తుందో సిద్ధించదో అని) సందేహపడే వాడూ (స్వార్థం కారణంగా) భ్రష్టులవుతారు. సందిగ్ధ చిత్తునికి (ధనార్జన, వివాహాదులు లేక పోవడం చేత) ఈ లోకం లేదు. (ధర్మం లేకపోవడం చేత) పరలోకం కూడా లేదు. సుఖం కూడా కలుగదు. సర్వథా వినష్టుడవుతాడు. 40

**యోగసంన్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్ ।**
**ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ॥ 41**

*యోగసంన్యస్త కర్మాణమ్, జ్ఞాన సంఛిన్న సంశయమ్,*
*ఆత్మవంతమ్, న, కర్మాణి, నిబధ్నంతి, ధనంజయ.*

| | | | |
|---|---|---|---|
| ధనఞ్జయ | = అర్జునా; | (అయిన) | |
| యోగసన్న్యస్త కర్మాణమ్ | = బ్రహ్మజ్ఞానం చేత ధర్మాధర్మకర్మలను త్యజించినవాడూ; | ఆత్మవంతమ్ | = అప్రమత్తపురుషుని; |
| | | కర్మాణి | = కర్మలు; |
| | | న నిబధ్నంతి | = బంధించవు. |
| జ్ఞాన సంఛిన్న సంశయమ్ | = బ్రహ్మజ్ఞానం చేత సంశయాలన్నీ తొలిగినవాడూ; | | |

**తా॥** పరమాత్మ దర్శనంతో ధర్మాధర్మాలు త్యజించినవాడూ (లేక పరమేశ్వరారాధనమనే కర్మయోగంలో కర్మలనన్నిటిని భగవంతునికి అర్పించిన వాడూ, తరువాత లభించిన) జ్ఞానం చేత సమస్త సందేహాలు తొలగినవాడూ

అయిన అప్రమత్త పురుషుని కర్మలు (ఇష్టానిష్ట మిశ్ర ఫలోత్పాదకాలై) బంధ కారణాలు కాలేవు. (లేక అతని స్వాభావిక కర్మ గాని, లోకసంగ్రహార్థమైన కర్మ గాని బంధహేతువు కాదు.) (గీత. 18-12చూ:) 41

**తస్మా దజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥** 42

*తస్మాత్, అజ్ఞాన సంభూతమ్, హృత్స్థమ్, జ్ఞానాసినా, ఆత్మనః,*
*ఛిత్త్వా, ఏనమ్, సంశయమ్, యోగమ్, ఆతిష్ఠ, ఉత్తిష్ఠ, భారత.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | సంశయమ్ | = సంశయాన్ని; |
| తస్మాత్ | = కనుక; | జ్ఞానాసినా | = జ్ఞానమనే ఖడ్గంతో; |
| ఆత్మనః | = నీ; | ఛిత్త్వా | = ఛేదించి; |
| అజ్ఞాన సంభూతమ్ | = అజ్ఞానం వల్ల కలిగి; | యోగమ్ | = నిష్కామయోగాన్ని; |
| హృత్ స్థమ్ | = లోనున్న; | ఆతిష్ఠ | = ఆశ్రయించు; |
| ఏనమ్ | = ఈ; | ఉత్తిష్ఠ | = యుద్ధం చేయడానికి లే. |

**తా॥** కనుక భారతా! అజ్ఞానజాతమూ, హృదయస్థితమూ, ఆత్మవిషయమూ అయిన ఈ సంశయాన్ని జ్ఞానఖడ్గంతో ఛేదించి, నిష్కామకర్మయోగాన్ని అవలంబించి, యుద్ధార్థం లెమ్ము! (గీత. 1-47 చూ:) 42

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానయోగో (బ్రహ్మయజ్ఞ ప్రశంసా) నామ**
**చతుర్థోఽధ్యాయః**

శ్లోకాల సంఖ్య - 42. మొదటి నుండి (162+42) 204.

**పుమవస్థదిభేదేన కర్మజ్ఞానమయీ ద్విధా ।**
**నిష్ఠోక్తా యేన తం వన్దే శౌరిం సంశయసంఛిదమ్ ॥**

అధికార భేదాన్ని అనుసరించి, కర్మజ్ఞాననిష్ఠలను ఉపదేశించి, సందేహాన్ని తొలగించిన శౌరికి వందనం.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## పంచమోఽధ్యాయః - సన్న్యాస యోగః

## (పంచమాధ్యాయం - సన్న్యాస యోగం)

నివార్య సంశయం జిష్ణోః కర్మసన్న్యాసయోగయోః ।
జితేంద్రియస్య చ యతేః పంచమే ముక్తిమబ్రవీత్ ॥ [1]

అర్జున ఉవాచ :

**సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।**
**యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1**

*సన్న్యాసమ్, కర్మణామ్, కృష్ణ, పునః, యోగమ్, చ, శంససి, యత్, శ్రేయః, ఏతయోః, ఏకమ్, తత్, మే, బ్రూహి, సునిశ్చితమ్.*

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = కృష్ణా; | యత్ | = ఏది; |
| కర్మణామ్ | = శాస్త్రవిహితాలైన కర్మల; | శ్రేయః | = శ్రేయస్కరమో; |
| సన్న్యాసమ్ | = త్యాగాన్ని; | తత్ | = ఆ; |
| పునః | = మళ్ళీ; | ఏకమ్ | = ఒక్కదానిని; |
| (కర్మణాం) యోగం చ | = కర్మయోగాన్ని; | మే | = నాకు; |
| శంససి | = చెబుతున్నావు; | సునిశ్చితమ్ | = బాగా దృఢపరచి; |
| ఏతయోః | = ఈ రెండింటిలో; | బ్రూహి | = చెప్పు. |

1. యోగం, సన్న్యాసం విషయంగా అర్జునునికి గల సంశయాన్ని పోగొట్టి, జితేంద్రియుడైన యతి ముక్తిని పొందడం చెపుతున్నాడు.

**తా॥** (అజ్ఞాన సంభూతమైన సంశయాన్ని జ్ఞాన ఖడ్గంచే ఛేదించి కర్మయోగం అనుష్ఠించమని చెప్పబడింది; ఇక్కడ పూర్వాపర విరోధం ఉందని తలుస్తూ-) అర్జునుడు పలికెను: కృష్ణా! నీవు కర్మత్యాగాన్ని, కర్మానుష్ఠానాన్ని కూడా మళ్ళీ చెప్తున్నావు. ఈ రెండింటిలో ఏది శ్రేయస్కరమో, చక్కగా నిశ్చయించి నాకు తెలియజెప్పు.

(*గీత.* 3-1, 6, 17; 4-18, 19, 21, 22, 24, 33, 34, 38, 42 చూ:) 1

*శ్రీ భగవానువాచ :*

**సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయ సకరావుభౌ ।**
**తయోస్తు కర్మ సంన్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥** 2

*సంన్యాసః, కర్మయోగః, చ, నిఃశ్రేయసకరౌ, ఉభౌ,*
*తయోః, తు, కర్మ సంన్యాసాత్, కర్మయోగః, విశిష్యతే.*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | తు | = కాని; |
| ఉవాచ | = పలికెను; | తయోః | = రెండింటిలోనూ; |
| సన్న్యాసః | = కర్మ సన్న్యాసం; | కర్మసన్న్యాసాత్ | = కర్మత్యాగం కంటే; |
| కర్మయోగః చ | = నిష్కామకర్మయోగం; | కర్మయోగః | = నిష్కామకర్మానుష్ఠానం; |
| ఉభౌ | = రెండూ కూడా; | విశిష్యతే | = ఉత్కృష్టమైనది, దొడ్డది. |
| నిఃశ్రేయసకరౌ | = ముక్తిదాయకాలు; | | |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* కర్మసన్న్యాసం, నిష్కామకర్మయోగం - ఈ రెండూ కూడా ముక్తిదాయకాలే; ఈ రెండింటిలో కర్మసన్న్యాసం కంటే నిష్కామ కర్మయోగమే (నీవంటి అధికారులకు) శ్రేష్ఠమైనది.[1]

(*గీత.*5-4; 6-3; 18-78 చూ:) 2

**జ్ఞేయ స్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥** 3

1. నిష్కామ కర్మయోగోపదేశం అజ్ఞానులకు; చిత్తశుద్ధిని బడసినవారికి జ్ఞాననిష్ఠాంగమైన సన్న్యాసం. ఈ రెండూ అధికారభేదాన్ని అనుసరించి ముక్తిహేతువులు. కర్మయోగోపదేశం ఆత్మతత్త్వజ్ఞునికి కాదు, అతడు ఆచరించే కర్మ లోకసంగ్రహార్థం మాత్రమే. నీవంటి దేహాత్మాభిమానులకే కర్మయోగం. - శ్రీధరస్వామి.

జ్ఞేయః, సః, నిత్య సన్న్యాసీ, యః, న, ద్వేష్టి, న, కాంక్షతి,
నిర్ద్వంద్వః, హి, మహాబాహో, సుఖమ్, బంధాత్, ప్రముచ్యతే.

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా; | జ్ఞేయః | = అని తెలుసుకో; |
| యః | = ఎవడు; | హి | = ఏమన; |
| న ద్వేష్టి | = ద్వేషించడో; | నిర్ద్వంద్వః | = సుఖదుఃఖాది ద్వంద్వరహితుడు; |
| న కాంక్షతి | =కోరడో; | | |
| సః | = అతడు; | సుఖమ్ | = తేలికగానే; |
| నిత్యసన్న్యాసీ | = కర్మ చేస్తున్నా కూడా సన్న్యాసియే; | బన్ధాత్ | = సంసారబంధం నుండి; |
| | | ప్రముచ్యతే | = ముక్తుడవుతాడు. |

**తా॥** అర్జునా! విద్వేషం ఆసక్తి లేనివారు కర్మలను ఆచరిస్తున్నా కూడా నిత్యసన్న్యాసియే అని గ్రహించు; సుఖఃదుఖాది ద్వంద్వరహితుడైన వాడు అనాయాసంగా ముక్తిని పొందగలడు. 3

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।**
**ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥** 4

సాంఖ్య యోగౌ, పృథక్, బాలాః, ప్రవదంతి, న, పండితాః,
ఏకమ్, అపి, ఆస్థితః, సమ్యక్, ఉభయోః, విందతే, ఫలమ్.

| | | | |
|---|---|---|---|
| బాలాః | = అజ్ఞులు; | ఏకమ్ అపి | = ఏ ఒకటైనా; |
| సాంఖ్య యోగౌ | = కర్మసన్న్యాసమూ, నిష్కామ కర్మయోగమూ; | సమ్యక్ | = చక్కగా; |
| | | ఆస్థితః | = అనుష్ఠిస్తే; |
| పృథక్ | = వేరని; | ఉభయోః ఫలమ్ | = రెంటి ఫలాన్ని; |
| ప్రవదన్తి | = చెబుతారు; | విన్దతే | = పొందుతారు. |
| పండితాః న | = పండితులు అలా చెప్పరు; | | |

**తా॥** అజ్ఞులే కర్మసన్న్యాసం, కర్మయోగం వేరువేరని చెబుతారు. పండితులు అలా చెప్పరు. ఈ రెంటిలో ఏ ఒకటైనా చక్కగా అనుష్ఠింపబడితే రెండింటి ఫలమూ లభిస్తుంది. (ఎలా అంటే – కర్మయోగం పరిపూర్ణంగా ఆచరింపబడితే, శుద్ధచిత్తుడై జ్ఞానం పొంది ఈ రెంటి ఫలమైన కైవల్యాన్ని పొందుతారు – ఈ రెండింటికీ వేరు వేరు ఫలాలు లేవు. 4

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥ 5**

*యత్, సాంఖ్యైః, ప్రాప్యతే, స్థానమ్, తత్, యోగైః, అపి, గమ్యతే,*
*ఏకమ్, సాంఖ్యమ్, చ, యోగమ్, చ, యః, పశ్యతి, సః, పశ్యతి.*

| | | | |
|---|---|---|---|
| సాంఖ్యైః | = జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచే; | యః | = ఎవడు; |
| యత్ | = ఏ; | సాంఖ్యం చ | = జ్ఞానయోగాన్ని; |
| స్థానమ్ | = స్థానం; | యోగం చ | = నిష్కామ కర్మయోగాన్ని; |
| ప్రాప్యతే | = పొందబడుతోందో; | ఏకమ్ | = ఒక్క మోక్షానికే కారణంగా; |
| యోగైః అపి | = నిష్కామ కర్మయోగుల చేత కూడా; | పశ్యతి | = గుర్తిస్తాడో; |
| | | సః | = అతడు; |
| తత్ | = ఆ స్థానం; | పశ్యతి | = యథార్థాన్ని గుర్తిస్తున్నాడు. |
| గమ్యతే | = పొందబడుతోంది; | | |

**తా॥** జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులు ఏ స్థానాన్ని (మోక్షాన్ని) పొందుతున్నారో, నిష్కామకర్మ యోగులు కూడా ఆ స్థానాన్నే పొందుతారు. జ్ఞానయోగ ఫలమూ, కర్మయోగ ఫలమూ ఒకటే – అదే మోక్షం. దీనిని గుర్తించినవాడే యథార్థదర్శి. 5

**సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి ॥ 6**

*సన్న్యాసః, తు, మహాబాహో, దుఃఖమ్, ఆప్తుమ్, అయోగతః,*
*యోగయుక్తః, మునిః, బ్రహ్మ, నచిరేణ, అధి గచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | దుఃఖమ్ | = కష్టతరం, అసంభవం; |
| మహాబాహో | = అర్జునా; | యోగయుక్తః | = నిష్కామ కర్మయోగ నిష్ఠుడైన; |
| అయోగతః | = నిష్కామకర్మ యోగనుష్ఠానం లేకుండా; | మునిః | =మననశీలుడు; |
| సన్న్యాసః | = జ్ఞాననిష్ఠారూపమైన కర్మసన్న్యాసం; | (సన్న్యాసియై) న చిరేణ | = శీఘ్రంగా; |
| | | బ్రహ్మ | = పర బ్రహ్మాన్ని; |
| ఆప్తుమ్ | = పొందడం; | అధిగచ్ఛతి | = పొందుతాడు. |

**తా॥** (కర్మయోగి కూడా చివరకు సన్న్యాసాన్నే ఆశ్రయించాలి కాబట్టి మొదటి నుండీ సన్న్యాసాన్నే గ్రహించకూడదా అని అంటే–) నిష్కామకర్మ యోగానుష్ఠానం లేకుండా[1] కర్మను సన్న్యసించడం అసంభవం. నిష్కామ కర్మయోగ నిష్ఠుడైన ముని (సన్న్యాసియై)[2] శీఘ్రంగానే బ్రహ్మాన్ని పొందగలడు. (కనుక, చిత్తశుద్ధి లభించే వరుకు సన్న్యాసం కంటే కర్మయోగమే మంచిది.)

(గీత. 18–50, 55 చూ:) 6

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।**
**సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7**

*యోగయుక్తః, విశుద్ధాత్మా, విజితాత్మా, జితేంద్రియః,*
*సర్వభూతాత్మ భూతాత్మా, కుర్వన్, అపి, న, లిప్యతే.*

విశుద్ధాత్మా = శుద్ధచిత్తుడూ;
విజితాత్మా = సంయత శరీరుడూ;
జితేన్ద్రియః = ఇంద్రియజేతా;
సర్వభూత ఆత్మభూత ఆత్మా = సమస్త ప్రాణుల ఆత్మ, తన ఆత్మ ఒక్కటే అని గుర్తించేవాడూ అయిన;
యోగయుక్తః = నిష్కామ కర్మయోగి;
కుర్వన్ అపి = కర్మను ఆచరిస్తున్నా;
న లిప్యతే = లిప్తుడుకాడు.

**తా॥** (కర్మయోగ క్రమంలో బ్రహ్మలాభమైన తరువాత ఆచరించే కర్మ బంధమవుతుందా అనే సందేహానికి ప్రత్యుత్తరం–) నిష్కామ కర్మయోగ నిష్ఠుడూ, శుద్ధచిత్తుడూ, సంయతశరీరుడూ, జితేంద్రియుడూ, సర్వభూతాల ఆత్మ తన ఆత్మయే అని గుర్తించేవాడూ అయిన పురుషుడు (లోకసంగ్రహ నిమిత్తం గాని లేక స్వాభావికంగా గాని) కర్మలను ఆచరించినప్పటికీ బంధించబడడు. 7

**నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వ విత్ ।**
**పశ్యఞ్ఛృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్ ॥ 8**

1. కర్మయోగానుష్ఠానం లేకుండా సన్న్యాసం అసంభవం; ఈ జన్మలోనో లేక పూర్వజన్మలోనో ఇది ఆచరింపబడి ఉండాలి.
2. 'సన్న్యాసియై' – ఈ వ్యాఖ్య శ్రీధరస్వామి, మధుసూదన సరస్వతులది; ఇచ్చటి 'బ్రహ్మ' శబ్దానికి 'సన్న్యాసం' అనే అర్థాన్ని శంకరులు చెప్పారు.

*న, ఏవ, కించిత్, కరోమి, ఇతి, యుక్తః, మన్యేత, తత్త్వ విత్,*
*పశ్యన్, శృణ్వన్, స్పృశన్, జిఘ్రన్, అశ్నన్, గచ్ఛన్, స్వపన్, శ్వసన్.*

**ప్రలపన్ విసృజన్గృహ్ణన్ ఉన్మిషన్నిమిషన్నపి ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥** **9**

*ప్రలపన్, విసృజన్, గృహ్ణన్, ఉన్మిషన్, నిమిషన్, అపి,*
*ఇంద్రియాణి, ఇంద్రియార్థేషు, వర్తంతే, ఇతి, ధారయన్.*

| | | | |
|---|---|---|---|
| తత్త్వవిత్ | = పరమార్థద్రష్టయైన; | గృహ్ణన్ | = తీసికుంటూ; |
| యుక్తః | = కర్మయోగి; | ఉన్మిషన్ | = కన్నులు తెరుస్తూ; |
| పశ్యన్ | = చూస్తూ; | నిమిషన్ అపి | = కన్నులు మూస్తూ; |
| శృణ్వన్ | = వింటూ; | ఇన్ద్రియాణి | = ఇంద్రియాలు; |
| స్పృశన్ | = తాకుతూ; | ఇన్ద్రియార్థేషు | = ఇంద్రియవిషయాల; |
| జిఘ్రన్ | = వాసన చూస్తూ; | వర్తంతే | = ప్రవర్తిస్తున్నాయి; |
| అశ్నన్ | = తింటూ; | ఇతి | = అని; |
| గచ్ఛన్ | = నడుస్తూ; | ధారయన్ | = నిశ్చయించుకొని; |
| స్వపన్ | = నిద్రిస్తూ; | కించిత్ ఏవ | = కొంచెమైనా; |
| శ్వసన్ | = గాలిపీల్చుకుంటూ; | న కరోమి | = నేను ఒనర్చింది లేదు; |
| ప్రలపన్ | = పలుకుతూ; | ఇతి | = అని; |
| విసృజన్ | = విడుస్తూ; | మన్యేత | = తలుస్తాడు. |

**తా॥** (కర్మలను ఆచరిస్తున్నా బంధించబడదు అనేది విరుద్ధమే అనే ఈ శంకను, కర్తృత్వాభిమానం లేకపోతే కర్మబంధం కాదు అని చెప్పి నివారిస్తున్నాడు.) తత్త్వవేత్తయైన కర్మయోగి దర్శన, శ్రవణ, స్పర్శ, ఘ్రాణ, భోజన, గమన, నిద్ర, శ్వాసగ్రహణ, కథన, త్యాగ, గ్రహణ, ఉన్మేష, నిమేషాది ఇంద్రియ వ్యాపారాలలో, 'ఇంద్రియాలు తమ తమ విషయాలలో ప్రవృత్తములవుతున్నాయి' అని నిశ్చయించుకుని తాను ఏమీ చేయడం లేదని గ్రహిస్తాడు.[1] 9

1. *తదధిగమే ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్* (వేదాంత సూత్రమ్ 4-1-13). తత్త్వజ్ఞానానంతరం పాపం తత్త్వవేత్తనంటదు, పూర్వపాపం జ్ఞానోత్పత్తితోనే నశిస్తుంది.

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా[1] ॥ 10**

*బ్రహ్మణి, ఆధాయ, కర్మాణి, సంగమ్, త్యక్త్వా, కరోతి, యః,*
*లిప్యతే, న, సః, పాపేన, పద్మపత్రమ్, ఇవ, అంభసా.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవరు; | కరోతి | = ఒనర్చునో; |
| బ్రహ్మణి | = పరమేశ్వరునియందు; | సః | = అతడు; |
| ఆధాయ | = అర్పించి; | అంభసా | = నీటిచే; |
| సఙ్గమ్ | = ఫలాసక్తిని; | పద్మపత్రమ్ ఇవ | = తామరాకువలె; |
| త్యక్త్వా | = విడిచి; | పాపేన | = పుణ్యపాపాలచేత; |
| కర్మాణి | = కర్మలను; | న లిప్యతే | = అంటబడడు. |

**తా॥** ('నేను చేస్తున్నాను' అనే అభిమానం ఉంటే లిప్తుడవుతాడు. అశుద్ధ చిత్తుడవడం వల్ల సన్న్యాసం లేదు. ఈ సంకటం నుండి బయటపడేదెట్లా? అంటే –) ఫలాసక్తిని త్యజించి పరమేశ్వరార్పితంగా కర్మను ఆచరించే వాడికి, నీరు తామరాకుకు అంటని విధంగా, పుణ్యపాపాలు అంటలేవు. 10

**కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి ।**
**యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మ శుద్ధయే ॥ 11**

*కాయేన, మనసా, బుద్ధ్యా, కేవలైః, ఇంద్రియైః, అపి*
*యోగినః, కర్మ, కుర్వంతి, సంగమ్, త్యక్త్వా, ఆత్మ శుద్ధయే.*

| | | | |
|---|---|---|---|
| యోగినః | = నిష్కామ కర్మయోగులు; | మనసా | = మనస్సు చేతా; |
| సంగమ్ | = ఆసక్తిని; | బుద్ధ్యా | = బుద్ధిచేతా; |
| త్యక్త్వా | = వీడి; | ఇంద్రియైః అపి | = ఇంద్రియాల చేత; |
| ఆత్మశుద్ధయే | = చిత్తశుద్ధికొరకు; | కర్మ | = కర్మను; |
| కేవలైః | = మమత్వబుద్ధి రహితులై; | కుర్వంతి | = ఒనర్చుతున్నారు. |
| కాయేన | = శరీరం చేత; | | |

---

1. యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత
ఏవమేవంవిది పాపం కర్మ నశ్లిష్యతి ఇతి – ఛాందోగ్యోపనిషత్తు 4-14-3.

**తా॥** (కర్మ ఇలా ఒనర్చే ఆచారం పూర్వులలో కలదని సదాచారం ప్రదర్శించబడుతోంది:) నిష్కామ కర్మయోగులు ఆసక్తిని త్యజించి, మమత్వాభిమాన శూన్యులై స్నానాదుల ద్వారా శరీరంతోనూ, ధ్యానాదుల ద్వారా మనుస్సుతోనూ తత్త్వనిశ్చయం ద్వారా బుద్ధితోనూ - ఇంద్రియాల సాహాయంతో (శ్రవణ కీర్తనాదులైన) కర్మలను ఆచరిస్తున్నారు. 11

**యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12**

*యుక్తః, కర్మఫలమ్, త్యక్త్వా, శాంతిమ్, ఆప్నోతి, నైష్ఠికీమ్, అయుక్తః, కామకారేణ, ఫలే, సక్తః, నిబధ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యుక్తః | = సమాహితచిత్తుడు; | అయుక్తః | = అసమాహితచిత్తుడు; |
| కర్మఫలమ్ | = కర్మఫలాన్ని; | కామకారేణ | = కామపరవశతచే; |
| త్యక్త్వా | = వీడి; | ఫలే | = కర్మఫలంపై; |
| నైష్ఠికీమ్ | = నిష్ఠాప్రభవమైన; | సక్తః | = ఆసక్తుడై; |
| శాన్తిమ్ | = శాంతిని, ముక్తిని; | నిబధ్యతే | = బద్ధుడవుతాడు. |
| ఆప్నోతి | = పొందుతాడు; | | |

**తా॥** (ఇదేమిటి! ఒకే కర్మనే ఆచరించి కొందరు బద్ధులవుతున్నారు, కొందరు ముక్తులవుతున్నారే అంటావా-) కర్మయోగులు ఫలత్యాగం చేసి ఆత్యంతికమైన శాంతికి అధికారులవుతున్నారు. కాని సకామకర్ములు కర్మఫలాసక్తి చేత సంసారంలో బద్ధులవుతున్నారు. 12

**సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహీ[1] నైవ కుర్వన్ న కారయన్ ॥ 13**

*సర్వకర్మాణి, మనసా, సన్న్యస్య, ఆస్తే, సుఖమ్, వశీ, నవద్వారే, పురే, దేహీ, న, ఏవ, కుర్వన్, న, కారయన్.*

| | | | |
|---|---|---|---|
| వశీ | = జితేంద్రియుడైన; | మనసా | = వివేకబుద్ధి చేత; |
| దేహీ | = పురుషుడు; | సర్వకర్మాణి | = కర్మలనన్నింటినీ; |

1. దేహే - పాఠాంతరం.

| | | | |
|---|---|---|---|
| సన్న్యస్య | = త్యజించి; | పురే | = దేహనగరంలో; |
| సుఖమ్ | = ఆత్మ కంటే వేరుగా బాహ్య విషయాల ప్రయోజనం లేనివాడై, సుఖంగా; | న కుర్వన్ | = ఒనర్చక, కర్తృత్వరహితుడై; |
| నవద్వారే | = తొమ్మిది ద్వారాలు గల; | న కారయన్ ఏవ | = చేయించకుండా, కారయితృత్వరహితుడై; |
| | | ఆస్తే | = ప్రకాశిస్తాడు. |

**తా॥** జితేంద్రియుడైన పురుషుడు వివేకబుద్ధితో, (నిత్య నైమిత్తిక కామ్య నిషిద్ధాలు అనే) కర్మలనన్నిటిని[1] త్యజించి నవద్వారయుక్తమైన దేహనగరంలో తానేమీ ఒనర్చకుండా, ఇతరుల చేత చేయించకుండా నిర్లిప్తుడై ప్రకాశిస్తాడు.[2]
(*గీత.* 13-32 చూ:) 13

**న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ 14**

*న, కర్తృత్వమ్, న, కర్మాణి, లోకస్య, సృజతి, ప్రభుః,*
*న, కర్మ ఫల సంయోగమ్, స్వభావః, తు, ప్రవర్తతే.*

| | | | |
|---|---|---|---|
| ప్రభుః | = ఆత్మ; | కర్మఫల సంయోగమ్ | = కర్మఫల సంబంధాన్ని; |
| లోకస్య | = జనులకు; | (న సృజతి | = సృజింపడు) |
| కర్తృత్వమ్ | = కర్తృత్వాన్ని; | తు | = కాని; |
| న సృజతి | = కలిగించడు; | స్వభావః | = అవిద్యా రూపమైన మాయయే; |
| కర్మాణి | = రథ ప్రాసాదాది ఈప్సిత వస్తువులను; | ప్రవర్తతే | = ఇలా ప్రవర్తిల్లుతోంది. |
| (న సృజతి | = సృష్టింపడు) | | |

1. నిత్యకర్మలు: సంధ్యావందనాది అవశ్యకర్తవ్యాలైన నిత్యకర్మలు.
నైమిత్తికములు : అప్పుడప్పుడూ ఆచరించవలసిన జాతేష్టి మొదలైనవి.
కామ్యములు : ఫలాసక్తితో చేసే కారీర్యాది యాగాలు.
నిషిద్ధములు : సురాపానాది కర్మలు.

2. అశుద్ధచిత్తుడైన వానికి కర్మయోగమే శ్రేష్ఠమని చెప్పబడినది. శుద్ధచిత్తునికి తగు సన్న్యాసతత్త్వం 13 నుండి 28వ శ్లోకం వరకూ వర్ణింపబడుతోంది.

**తా॥** ఆత్మ (ఈశ్వరుడు) మనుష్యుల కర్తృత్వాన్ని గాని, కర్మలను గాని, కర్మఫల ప్రాప్తిని గాని సృష్టించడం లేదు. కాని, అవిద్యారూపమైన మాయయే (ఈ విధంగా ప్రవర్తిల్లుతోంది. అంటే, అవిద్య చేతనే కర్తృత్వాదికాలు ఆత్మలో ఆరోపించబడుతున్నాయి.[1] (గీత: 7-14, 13-22, 31 చూ:) 14

**నాదత్తే కస్య చిత్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ 15**

*న, ఆదత్తే, కస్య చిత్, పాపమ్, న, చ, ఏవ, సుకృతమ్, విభుః,*
*అజ్ఞానేన, ఆవృతమ్, జ్ఞానమ్, తేన, ముహ్యంతి, జంతవః.*

| | | | |
|---|---|---|---|
| విభుః | = ఆత్మ, పరమేశ్వరుడు; | జ్ఞానమ్ | = వివేక జ్ఞానం; |
| కస్యచిత్ | = ఏ ఒకరి; | ఆవృతమ్ | = కప్పబడింది; |
| పాపమ్ | = పాపాన్ని; | తేన | = అందుచేత; |
| సుకృతం చ | = పుణ్యాన్ని; | జంతవః | = జీవులు; |
| న ఆదత్తే ఏవ | = గ్రహించడు; | ముహ్యంతి | = మోహమొందుతున్నారు. |
| అజ్ఞానేన | = అజ్ఞానం చేత; | | |

**తా॥** పరిపూర్ణుడైన పరమేశ్వరుడు ఎవ్వరి పాపాన్ని గాని పుణ్యాన్ని గాని గ్రహించడం లేదు. అజ్ఞానం చేత వివేకజ్ఞానం ఆవృతమవడం వల్ల జీవులు మోహగ్రస్తులవుతున్నారు. [అంటే, అఖండ సచ్చిదానందస్వరూపమైన ఆత్మలో కారయితృత్వ, భోజయితృత్వాలను (ఈశ్వరత్వం) కర్తృత్వ, భోక్తృత్వాలను (జీవత్వం) మోహం చేతనే ఆరోపించబడుతున్నాయి.][2] 15

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్య వజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16**

*జ్ఞానేన, తు, తత్, అజ్ఞానమ్, యేషామ్, నాశితమ్, ఆత్మనః,*
*తేషామ్, ఆదిత్య వత్, జ్ఞానమ్, ప్రకాశయతి, తత్పరమ్.*

1. ఆత్మ కర్తృత్వ భోక్తృత్వ రహితం. కర్తృత్వ భోక్తృత్వాలు ఆత్మకు ఉన్నట్లు తోచడం భ్రమ.
2. శ్రీమద్భగవద్గీతా : 9-29 చూ:

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | తేషామ్ | = వారి; |
| ఆత్మనః జ్ఞానేన | = ఆత్మజ్ఞానం చేత; | తత్ | = ఆ; |
| యేషామ్ | = ఎవరి; | జ్ఞానమ్ | = ఆత్మజ్ఞానం; |
| తత్ | = ఆ; | పరమ్ | = పరబ్రహ్మాన్ని; |
| అజ్ఞానమ్ | = అజ్ఞానం; | ఆదిత్యవత్ | = సూర్యునివలె; |
| నాశితమ్ | = నశించిందో; | ప్రకాశయతి | = ప్రకాశింపజేస్తుంది. |

**తా॥** ఆత్మజ్ఞానం చేత ఎవరి అజ్ఞానం నశించిందో, వారి ఆ ఆత్మజ్ఞానం సూర్యుని వలే పరబ్రహ్మాన్ని ప్రకాశింపజేస్తోంది. 16

**తద్బుద్ధయ స్తదాత్మానస్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।**
**గచ్ఛన్త్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః ॥ 17**

*తద్బుద్ధయః, తదాత్మానః, తన్నిష్ఠాః, తత్పరాయణాః,*
*గచ్ఛంతి, అపునరావృత్తిమ్, జ్ఞాన నిర్ధూత కల్మషాః.*

| | | | |
|---|---|---|---|
| తత్ బుద్ధయః | = బ్రహ్మనిష్ఠులూ; | జ్ఞాన నిర్ధూత కల్మషాః | = జ్ఞానంచే పోగొట్టబడిన పాపం గల పురుషులూ; |
| తత్ ఆత్మానః | = బ్రహ్మాత్మ భావులూ; | అపునరావృత్తిమ్ | = అపునర్జన్మను మోక్షాన్ని; |
| తత్ నిష్ఠాః | = బ్రహ్మస్థితులూ; | గచ్ఛంతి | = పొందుతున్నారు. |
| తత్ పరాయణాః | = బ్రహ్మపరాయణులూ; | | |

**తా॥** బ్రహ్మనిష్ఠులూ, బ్రహ్మాత్మభావులూ, బ్రహ్మస్థితులూ, బ్రహ్మ పరాయణులూ, నిష్కల్మషులూ అయిన వారు మోక్షాన్ని పొందుతున్నారు. 17

**విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥ 18**

*విద్యావినయ సంపన్నే, బ్రాహ్మణే, గవి, హస్తిని,*
*శుని, చ, ఏవ, శ్వపాకే, చ, పండితాః, సమదర్శినః.*

| | | | |
|---|---|---|---|
| విద్యా వినయ సంపన్నే | = విద్వాంసుడూ, వినయసంపన్నుడూ అయిన; | హస్తిని | = ఏనుగునందు; |
| బ్రాహ్మణే | = బ్రాహ్మణుని యందు; | శుని చ ఏవ | = కుక్కయందు; |
| గవి | = ఆవు నందు; | శ్వపాకే చ | = దానిని తినే చండాలునియందు; |

| | | | |
|---|---|---|---|
| పండితాః | = జ్ఞానులు; | సమదర్శినః | = సమదృష్టి కలవారు. |

**తా॥** ఇటువంటి బ్రహ్మవేత్తలే విద్యతోనూ వినయం తోనూ పెంపొందే బ్రాహ్మణునియందు, శునకాన్ని తినే చండాలునియందు (కర్మవైషమ్యం ఉన్నప్పటికీ) ఆవునందు, ఏనుగునందు, (తుదకు) కుక్కయందు (జాతివైషమ్యం ఉన్నప్పటికీ) సమంగా ప్రకాశిస్తున్న బ్రహ్మాన్ని దర్శిస్తున్నారు.[1] 18

**ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19**

ఇహ, ఏవ, తైః, జితః, సర్గః, యేషామ్, సామ్యే, స్థితమ్, మనః,
నిర్దోషమ్, హి, సమమ్, బ్రహ్మ, తస్మాత్, బ్రహ్మణి, తే, స్థితాః.

| | | | |
|---|---|---|---|
| యేషామ్ | = ఎవరి; | హి | = ఏమన; |
| మనః | = చిత్తం; | బ్రహ్మ | = బ్రహ్మం; |
| సామ్యే | = సమభావంలో, సర్వభూతస్థమైన బ్రహ్మంలో; | నిర్దోషమ్ | = గుణదోషాది రహితమైన; |
| | | సమమ్ | = సమస్వరూపం; |
| స్థితమ్ | = నిశ్చలమవుతోందో; | తస్మాత్ | = కనుక; |
| తైః | = వారిచేత; | తే | = వారు; |
| ఇహ ఏవ | = ఈ జీవితంలోనే; | బ్రహ్మణి | = బ్రహ్మంలో; |
| సర్గః | = సృష్టి, సంసారం; | స్థితాః | = స్థితమవుతున్నారు. |
| జితః | = జయింపబడింది; | | |

**తా॥** (విషయాలలో సమదృష్టిని ధర్మశాస్త్రకారులు నిషేధించడం వల్ల, ఇది దోషం కాదా అంటే-) ఎవరి మనస్సు సర్వభూతస్థమైన బ్రహ్మంలో సమానతను దాల్చి నిశ్చలమవుతోందో, వారు ఈ జీవితంలోనే సంసృతిని (జన్మాంతరాన్ని) జయిస్తున్నారు. బ్రహ్మం గుణదోషాది విరహితమైన సమస్వరూపం. కనుక సమదృష్టి కలవారు పునర్జన్మ నిరోధకమైన బ్రహ్మంలో స్థితమై జీవన్ముక్తిని పొందుతున్నారు. (కాబట్టి, ఈ దోషం జ్ఞానోదయపర్యంతమేనని తెలుసుకోవాలి.)

(గీత : 13-28, 32 చూ:) 19

1. సూర్యుడు గంగాజలంలో, మద్యంలో ప్రతిబింబితుడైనను ఆయా గుణదోషము లతనిని స్పృశింపవు. అదే విధంగా, శుద్ధ-అశుద్ధవస్తువులలో వెలయుచున్న బ్రహ్మం నిర్లిప్తం. బ్రాహ్మణుడు సత్త్వగుణాన్ని, ఆవు రజోగుణాన్ని, మిగిలినవి తమోగుణాన్ని సూచిస్తున్నాయి.

**న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।**
**స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మ విద్బ్రహ్మణి స్థితః ॥ 20**

*న, ప్రహృష్యేత్, ప్రియమ్, ప్రాప్య, న, ఉద్విజేత్, ప్రాప్య, చ, అప్రియమ్, స్థిరబుద్ధిః, అసమ్మూఢః, బ్రహ్మ విత్, బ్రహ్మణి, స్థితః.*

| | | | |
|---|---|---|---|
| స్థిరబుద్ధిః | = స్థితప్రజ్ఞుడు; | ప్రాప్య | = పొంది; |
| అసమ్మూఢః | = మోహ వర్జితుడు; | న ప్రహృష్యేత్ | = సంతోషింపడు; |
| బ్రహ్మవిత్ | = బ్రహ్మజ్ఞుడు; | అప్రియం చ | = అప్రియవస్తువును; |
| బ్రహ్మణి స్థితః | = బ్రహ్మమున స్థితమై; | ప్రాప్య | = పొంది; |
| ప్రియమ్ | = ప్రియవస్తువును; | న ఉద్విజేత్ | = విషాదమొందడు. |

**తా॥** బ్రహ్మజ్ఞ పురుషుడు బ్రాహ్మీస్థితిని పొంది, స్థితప్రజ్ఞుడై మోహశూన్యుడు అవుతాడు. అతడు ప్రియవస్తువును పొంది సంతోషించడు. అప్రియవస్తువును పొంది విషాదాన్ని పొందడు. (*గీత* : 2-26 చూ:) 20

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21**

*బాహ్యస్పర్శేషు, అసక్తాత్మా, విందతి, ఆత్మని, యత్, సుఖమ్, సః, బ్రహ్మ యోగయుక్తాత్మా, సుఖమ్, అక్షయమ్, అశ్నుతే.*

| | | | |
|---|---|---|---|
| బాహ్యస్పర్శేషు | = బాహ్యమైన శబ్దాది విషయాల పట్ల; | విన్దతి | = పొందుతాడో; |
| | | సః | = ఆ; |
| అసక్త ఆత్మా | = అనాసక్తచిత్తుడు | బ్రహ్మ యోగ యుక్తాత్మా | = బ్రహ్మ సమాహిత చిత్తుడైన యోగి; |
| ఆత్మని | = అంతఃకరణంలో; | | |
| యత్ | = ఏది; | అక్షయమ్ | = నాశనం లేని; |
| సుఖమ్ | = విషయనిరపేక్షమైన సుఖమో; | సుఖమ్ | = బ్రహ్మానందాన్ని; |
| (తత్ | = దానిని) | అశ్నుతే | = పొందుతాడు. |

**తా॥** బాహ్యాలైన శబ్దాది విషయాలపై అనాసక్త చిత్తులైనవారు అంతఃకరణంలో, బాహ్యవిషయ నిరపేక్షమైన సుఖాన్ని అనుభవిస్తారు; బ్రహ్మసమాహితులై అక్షయమైన బ్రహ్మానందానికి అధికారులు అవుతారు. 21

**యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే ।**
**ఆద్యంతవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥ 22**

*యే, హి, సంస్పర్శజాః, భోగాః, దుఃఖయోనయః, ఏవ, తే,*
*ఆది అంత వంతః, కౌంతేయ, న, తేషు, రమతే, బుధః.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | ఆది అంత వంతః | = సంయోగ, వియోగాత్మకాలు; |
| యేహి | = ఏ; | బుధః | = జ్ఞాని; |
| భోగాః | = సుఖభోగాలు; | తేషు | = వాటిలో (ఆ విషయసుఖాలలో); |
| సంస్పర్శజాః | = విషయజాతంలో; | న రమతే | = ప్రీతి పొందడు. |
| తే | = అవి; | | |
| దుఃఖ యోనయః ఏవ | = దుఃఖకారణాలే; | | |

**తా॥** కౌంతేయా! రూపరసాదులైన విషయాల వల్ల కలిగే సుఖం, దుఃఖ కారణమే అవుతోంది. అది క్షణికం, జ్ఞానులు దానిని ఆస్వాదించరు. 22

**శక్నోతీ హైవ యః సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ 23**

*శక్నోతి, ఇహ, ఏవ, యః, సోఢుమ్, ప్రాక్, శరీర విమోక్షణాత్,*
*కామక్రోధోద్భవమ్, వేగమ్, సః, యుక్తః, సః, సుఖీ, నరః.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవరు; | సోఢుమ్ | = సహింప; |
| శరీర విమోక్షణాత్ ప్రాక్ | = శరీరాన్ని విడవడానికి మునుపే; | శక్నోతి | = సమర్థుడవుతాడో; |
| కామ క్రోధ ఉద్భవమ్ | = కామక్రోధాల నుండి కలిగే; | సః | = అతడు; |
| వేగమ్ | = వేగాన్ని; | యుక్తః | = యోగి; |
| ఇహ ఏవ | = ఈ జీవితంలోనే; | సః | = అతడు; |
| | | సుఖి | = ఆనందమయుడైన; |
| | | నరః | = పురుషుడు. |

**తా॥** ఎవరు ఈ జీవితంలోనే, కామక్రోధోద్భవాలైన వికారాలను మరణ పర్యంతం సహించగలుగుతున్నాడో, అతడే యోగి, అతడే ఆనందమయ పురుషుడు.[1]

---

1. ఇంద్రియగోచరాలైన విషయాలను విన్నా, స్మరించినా, అనుభవించినా కలిగే సుఖంపై తృష్ణయే కామము

**యోఽ న్తస్సుఖోఽ న్తరారామస్తథాన్తర్జ్యోతిరేవ యః ।**
**స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతోఽ ధిగచ్ఛతి ॥ 24**

*యః, అన్తస్సుఖః, అన్తరారామః, తథా, అంతర్జ్యోతిః, ఏవ, యః,*
*సః, యోగీ, బ్రహ్మ నిర్వాణమ్, బ్రహ్మభూతః, అధిగచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | అంతః జ్యోతిః | = అంతఃప్రకాశనంతుడో; |
| అంతః సుఖః | = ఆత్మయందే సుఖించువాడూ; | సః | = ఆ; |
| | | యోగీ | = జ్ఞాని; |
| అంతః ఆరామః | = ఆత్మయందే క్రీడించువాడూ; | బ్రహ్మభూతః | = బ్రహ్మస్వరూపుడై; |
| | | బ్రహ్మ నిర్వాణమ్ | = బ్రహ్మానందాన్ని, ముక్తిని; |
| తథా | = అలాగే; | | |
| యః | = ఎవడు; | అధిగచ్ఛతి | = పొందును. |

**తా॥** (కేవలం కామక్రోధోద్భవ వేగాన్ని సహించడం వల్లనే మోక్షం లభించదు, మరియు-) ఎవరికి 'సుఖం' విషయాలలో గాక ఆత్మలోనే ప్రకాశిస్తోందో, ఎవడు బాహ్యక్రీడాశూన్యుడై ఆత్మక్రీడుడవుతున్నాడో, మరియు నృత్యగీతాదులలో గాక ఎవరి దృష్టి ఆత్మనిష్ఠమవుతోందో, ఆ యోగి బ్రహ్మ స్వరూపుడై ఇహలోకంలోనే బ్రహ్మానందాన్ని పొందుతున్నాడు.[1]
(ముండకోపనిషత్తు: 3-1-4 చూ:) 24

**లభన్తే బ్రహ్మ నిర్వాణం ఋషయః క్షీణకల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూత హితే రతాః ॥ 25**

*లభంతే, బ్రహ్మ నిర్వాణమ్, ఋషయః, క్షీణకల్మషాః,*
*ఛిన్నద్వైధాః, యతాత్మానః, సర్వభూత హితే, రతాః.*


ప్రతికూలములూ దుఃఖహేతువులూ అయిన వానిలో ఉండేది ద్వేషం, క్రోధం.
నేత్రవదన రోమాంచనాది రూపంగా తోచే అతిశయించిన అంతఃకరణ క్షోభయే కామవేగం.
శరీరకంప, స్వేద, రక్తనేత్రాది రూపంగా తోచే అంతఃకరణ క్షోభయే క్రోధవేగం.

1. బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి. - బృహదారణ్యకోపనిషత్తు *4-4-6.*

| | | | |
|---|---|---|---|
| క్షీణ కల్మషాః | = పుణ్యాపాపాలు క్షీణించినవారూ; | సర్వభూత హితేరతాః | = సమస్తజీవుల శ్రేయమందు (ఆసక్తిగలవారూ అయిన); |
| ఛిన్న ద్వైధాః | = ఛేదించబడ్డ సంశయాలు గలవారూ; | ఋషయః | = ఋషులు, సమ్యక్‌దర్శనులైన సన్న్యాసులు; |
| యతాత్మానః | = సంయత చిత్తులూ; | బ్రహ్మ నిర్వాణమ్ | = మోక్షాన్ని; |
| | | లభన్తే | = పొందుతారు. |

**తా॥** పుణ్యపాప విముక్తులూ, సంశయరహితులూ, సంయతచిత్తులూ, సర్వభూత కల్యాణ నిరతులూ అయిన సన్న్యాసులు ఈ జీవితంలోనే బ్రహ్మ నిర్వాణాన్ని పొందుతారు. 25

**కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్[1] ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ 26**

*కామక్రోధ వియుక్తానామ్, యతీనామ్, యతచేతసామ్,*
*అభితః, బ్రహ్మనిర్వాణమ్, వర్తతే, విదితాత్మనామ్.*

| | | | |
|---|---|---|---|
| కామ క్రోధ వియుక్తానామ్ | = కామక్రోధ ముక్తులూ; | అభితః | = సర్వరీతుల; (దేహత్యాగానికి పూర్వమూ, అనంతరమూ) |
| యత చేతసామ్ | = సంయతచిత్తులూ; | బ్రహ్మ నిర్వాణమ్ | = బ్రహ్మానందం, మోక్షం; |
| విదిత ఆత్మనామ్ | = ఆత్మజ్ఞులు అయిన; | | |
| యతీనామ్ | = సన్న్యాసులకు; | వర్తతే | = ఉంది. |

**తా॥** కామక్రోధ విముక్తులు, సంయతచిత్తులు, ఆత్మజ్ఞులు అయిన యతులకు శరీరత్యాగానికి పూర్వమూ, తరువాతా కూడా మోక్షం లభిస్తోంది; మళ్ళీ జన్మ లేదు.[2] 26

**స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥ 27**

*స్పర్శాన్, కృత్వా, బహిః, బాహ్యాన్, చక్షుః, చ, ఏవ, అంతరే, భ్రువోః,*
*ప్రాణ అపానౌ, సమౌ, కృత్వా, నాసా అభ్యంతర చారిణౌ.*

1. విజితాత్మనామ్ – పాఠాంతరం.
2. 19 శ్లోకం నుండి 26వ శ్లోకం వరకు (జీవన్ముక్తి, సద్యోముక్తి) వర్ణింపబడింది.

**యతేన్ద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్ష పరాయణః ।**
**విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥ 28**

*యతేంద్రియ మనోబుద్ధిః, మునిః, మోక్ష పరాయణః,*
*విగత ఇచ్ఛా భయక్రోధః, యః, సదా, ముక్తః, ఏవ, సః.*

బాహ్యాన్ = బాహ్యములైన;
స్పర్శాన్ = విషయసమూహాలను;
బహిః కృత్వా = మనస్సు నుండి వెలువరించి;
చక్షుః చ = దృష్టిని;
భ్రువోః = కనుబొమల;
అంతరే ఏవ = మధ్యనే;
(స్థాపయిత్వా = నిలిపి)
నాసా అభ్యంతర చారిణౌ = నాసికా మధ్యమున సంచరించే;
ప్రాణ అపానౌ = ప్రాణవాయువును, అపానవాయువును;
సమౌకృత్వా = సమానం చేసి, కుంభకంలో ఊర్ధ్వాధోగతి శూన్యములగా చేసి;
యతేన్ద్రియ మనో బుద్ధిః = ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని నియమించినవాడై;
మోక్షపరాయణః = ముముక్షువై;
విగత ఇచ్ఛా భయ క్రోధః = ఇచ్ఛ, భయం, కోపం లేనివాడై;
యః = ఏ;
మునిః = యోగి; (వెలయుచున్నాడో)
సః = అతడు;
సదా = సర్వదా;
ముక్తః ఏవ = బంధం లేనివాడే.

**తా॥** బాహ్యవిషయాల నుండి మనస్సును వెలువరించి, దృష్టిని భ్రూమధ్యమున నిలిపి[1] (అర్ధనిమీలితమొనర్చి) నాసికామధ్యమున సంచరించే ప్రాణాపానవాయువుల ఉర్ధ్వాధోగతిని కుంభకంలో సమానం చేసి; మనస్సును, బుద్ధిని, ఇంద్రియాలను నియమించి, ఇచ్ఛాభయక్రోధాలను వీడి, మోక్షమొక్కటే ప్రాప్యంగా ఎంచే యోగి సర్వదా (జీవద్దశలో ఉండగానే) బంధనిర్ముక్తుడు. 27-28

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ ।**
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ 29**

*భోక్తారమ్, యజ్ఞతపసామ్, సర్వలోక మహేశ్వరమ్,*
*సుహృదమ్, సర్వభూతానామ్, జ్ఞాత్వా, మామ్, శాంతిమ్, ఋచ్ఛతి.*

1. ఈ రెండు శ్లోకాలలో చెప్పబడిన ధ్యానం షష్ఠాధ్యాయంలో వివరించబడింది. (*గీత* : 6-13 పాదటీక)

| | | | |
|---|---|---|---|
| మామ్ | = నన్ను; | సర్వ భూతానామ్ | = సర్వజీవుల; |
| యజ్ఞ తపసామ్ | = యజ్ఞానికి, తపస్సుకు; | సుహృదమ్ | = మిత్రునిగా; |
| భోక్తారమ్ | = భోక్తగా; | జ్ఞాత్వా | = గ్రహించి; (యోగి) |
| సర్వలోక మహేశ్వరమ్ | = సర్వలోకాలకూ సార్వభౌమునిగా; | శాన్తిమ్ | = ముక్తిని; |
| | | ఋచ్ఛతి | = పొందుతున్నాడు. |

**తా॥** నన్ను తపోయజ్ఞాలకు భోక్తగానూ, సర్వలోక మహేశ్వరునిగానూ, జీవులందరికీ మిత్రనిగానూ గ్రహించి, యోగి శాంతిని పొందుతున్నాడు.[1] 29

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే సన్న్యాస యోగో నామః**
**పంచమోఽధ్యాయః[2]**

శ్లోకాల సంఖ్య - 29. మొదటి నుండి (204+29) 233.

**వికల్పశంకాపోహేన యే నైవం సాంఖ్యయోగయోః ।**
**సముచ్చయం క్రమే ణోక్తం సర్వజ్ఞం నౌమి తం గురుమ్ ॥**

**తా॥** ఈ రెండింటిలో ఏది శ్రేష్ఠమనే శంకను నివారించడానికి, యోగ సాంఖ్యాల అధికారభేదాన్ని అనుసరించి క్రమంగా మోక్షసోపానాలను నిర్దేశించిన జగద్గురువుకు నమస్కృతి.



1. ఈ శ్లోకంలో సమాహితచిత్తుడైన యోగికి జ్ఞేయమైన వస్తువు నిర్దేశించబడింది. *గీత* : 9-24 చూ.
2. ఈ అధ్యాయం ప్రకృతిగర్భం, కర్మసన్న్యాస యోగం అని కూడా పేర్కొనబడుతోంది.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## షష్ఠోఽధ్యాయః - ధ్యాన యోగః

## (షష్ఠాధ్యాయం - ధ్యాన యోగం)

చిత్తే శుద్ధే ఽపి న ధ్యానం వినా సన్న్యాసమాత్రతః,
ముక్తిః స్యా దితి షష్ఠే స్మి న్ధ్యానయోగో వితన్యతే.[1]

*శ్రీ భగవానువాచ :*

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।**
**స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥** 1

*అనాశ్రితః, కర్మఫలమ్, కార్యమ్, కర్మ, కరోతి, యః,*
*సః, సన్న్యాసీ, చ, యోగీ, చ, న, నిరగ్నిః, న, చ, అక్రియః.*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | కరోతి | = ఒనర్చునో; |
| ఉవాచ | = పలికెను | సః | = అతడు; |
| కర్మఫలమ్ | = కర్మఫలాన్ని; | సన్న్యాసీ | = సన్న్యాసి; |
| అనాశ్రితః | = ఆశించనివాడై; | యోగీ చ | = యోగియూ; |
| కార్యం కర్మ | = కర్తవ్య కర్మను, నిత్యకర్మలను; | న నిరగ్నిః | = అగ్నిహోత్ర త్యాగి కాదు; |
| యః | = ఎవడు; | న చ అక్రియః | = తపోదానాదికర్మలను త్యజించేవాడు కాదు. |

1. చిత్తం శుద్ధిని పొందినా, ధ్యానం లేకుండా సన్న్యాసం స్వీకరించినా ముక్తి లభించదు. కాబట్టి ధ్యానయోగం వివరించబడుతోంది.

**తా॥** (కర్మలు దుఃఖరూపాలవడం చేత జనులు హఠాత్తుగా వాటిని త్యజించవచ్చు. దీనిని వారించడానికి, సన్న్యాసం కంటే కర్మయోగమే శ్రేష్ఠమని స్తుతిస్తూ –) *శ్రీభగవానుడు పలికెను :* కర్మఫలాలను అపేక్షించకుండా, ఎవడు అవశ్య కర్తవ్యాలుగా విధించబడిన (నిత్య) కర్మలను (ధ్యానయోగాంగంగా) ఆచరిస్తాడో, అతడే సన్న్యాసి, అతడే యోగి. అగ్నిసాధ్యాలైన (ఇష్ట) కర్మలను, అగ్న్యపేక్షలేని (పూర్త) తపోదానాది కర్మలను (మాత్రమే) త్యజించేవాడు సన్న్యాసి కాడు, యోగి కూడా కాడు.[1] 1

**యం సన్న్యాసమితి ప్రాహుః యోగం తం విద్ధి పాణ్డవ ।**
**నహ్య సన్న్యస్త సఙ్కల్పో యోగీ భవతి కశ్చన ॥ 2**

*యమ్, సన్న్యాసమ్, ఇతి, ప్రాహుః, యోగమ్, తమ్, విద్ధి, పాండవ,*
*న, హి, అసన్న్యస్త సంకల్పః, యోగీ, భవతి, కశ్చన.*

| | | | |
|---|---|---|---|
| పాండవ | = అర్జునా; | హి | = ఏమన; |
| (పెద్దలు) యమ్ | = దేనిని; | అసన్న్యస్త సంకల్పః | = సంకల్ప త్యాగి కాని యెడల; |
| సన్న్యాసమ్ ఇతి | = సన్న్యాసమని; | | |
| ప్రాహుః | = చెప్పారో; | కశ్చన | = ఎవ్వరూ కూడా; |
| తమ్ | = దానిని; | యోగీ | = యోగి; |
| యోగమ్ | = యోగమని; | న భవతి | = కాజాలడు. |
| విద్ధి | = గ్రహించు; | | |

**తా॥** పాండవా! పెద్దలు సన్న్యాసమని చెప్పిన దానినే నిష్కామ కర్మానుష్ఠాన యోగంగా గ్రహించు. ఎందుకంటే, ఫలసంకల్ప త్యాగి కానివాడు (కర్మనిష్ఠ యందు గాని లేక జ్ఞాననిష్ఠ యందుగాని) యోగి కాజాలడు. (ఫల సంకల్ప త్యాగం ఈ రెండింటికీ సామాన్యమవడం చేత అతడే సన్న్యాసి. సంకల్పత్యాగం చేత చిత్తవిక్షేపం లేకపోవడం వల్ల అతడే యోగి కూడా అవుతున్నాడు.) 2

1. వైదిక కర్మ ఇష్టా పూర్త దత్తం అని త్రివిధములు –
ఇష్టం అంటే యజ్ఞయాగాదులు;
పూర్తం అంటే తటాక నిర్మాణాదులు;
దత్తం అంటే దానం.

**ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణ ముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥ 3**

*ఆరురుక్షోః, మునేః, యోగమ్, కర్మ, కారణమ్, ఉచ్యతే,*
*యోగారూఢస్య, తస్య, ఏవ, శమః, కారణమ్, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యోగమ్ | = ధ్యానయోగంలో; | యోగ ఆరూఢస్య | = జ్ఞానాన్ని అధిష్ఠించిన; |
| ఆరురుక్షోః | = అధిరోహింపదలచిన; | తస్య | = ఆ ధ్యాననిష్ఠునికి; |
| మునేః | = మునికి; | శమః ఏవ | = సర్వకర్మనివృత్తియే; |
| కర్మ | = నిష్కామకర్మానుష్ఠానం; | కారణమ్ | = సాధనమని; |
| కారణమ్ | = సాధనమని; | ఉచ్యతే | = చెప్పబడుతోంది. |
| ఉచ్యతే | = చెప్పబడుతోంది; | | |

**తా॥** (అయితే, యావజ్జీవితం కర్మను ఒనర్చవలసిందేనా? అని ఆశంకించి కర్మకు మితి చెప్పబడుతోంది–) ధ్యానయోగాన్ని పొందగోరే మునికి కర్మ (చిత్త శుద్ధికి హేతువవడం చేత) ధ్యానలాభ కారణంగా చెప్పబడుతోంది. 3

**యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జ్యతే[1] ।**
**సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ 4**

*యదా, హి, న, ఇంద్రియ అర్థేషు, న, కర్మసు, అనుషజ్జ్యతే,*
*సర్వ సంకల్ప సన్న్యాసీ, యోగ ఆరూఢః, తదా, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడు; | కర్మసు చ | = మరియు, నిత్యనైమిత్తిక కర్మలలో కూడా; |
| సర్వ సంకల్ప సన్న్యాసీ | = సర్వసంకల్ప త్యాగియైనవాడు; | న | = ఆసక్తుడు కాడో; |
| ఇంద్రియ అర్థేషు | = ఇంద్రియ భోగ్య విషయాలలో; | తదా హి | = అప్పుడు కదా; |
| | | యోగ ఆరూఢః | = యోగారూఢుడని; |
| న అనుషజ్జ్యతే | = ఆసక్తుడు కాడో; | ఉచ్యతే | = చెప్పబడతాడు. |

**తా॥** (యోగారుఢుని లక్షణం :) ఇంద్రియవిషయాల పట్ల, తత్సాధనాలైన కర్మలపై ఆసక్తి లేకుండా, సర్వసంకల్ప త్యాగి అయిన వాడు యోగారూఢుడు

1. అనుషజ్జతే – పాఠాంతరం.

అని చెప్పబడుతున్నాడు[1]. 4

**ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥ 5**

*ఉద్ధరేత్, ఆత్మనా, ఆత్మానమ్, న, ఆత్మానమ్, అవసాదయేత్,*
*ఆత్మా, ఏవ, హి, ఆత్మనః, బంధుః, ఆత్మ, ఏవ, రిపుః, ఆత్మనః.*

| | | | |
|---|---|---|---|
| ఆత్మనా | = వివేకయుక్తమైన మనస్సుతో; | ఆత్మా ఏవ | = మనస్సే; |
| ఆత్మానమ్ | = జీవాత్మను; | ఆత్మనః | = జీవునికి; |
| ఉద్ధరేత్ | = (సంసారసాగరం నుండి) ఉద్ధరించుకో; | బంధుః | = ముక్తికి సాహాయం చేసేది, (బంధువు) |
| ఆత్మానమ్ | = మనస్సును; | ఆత్మా ఏవ | = మనస్సే; |
| న అవసాదయేత్ | = అధోగతిని పొందనివ్వకు; | ఆత్మనః | = జీవత్మాకు; |
| హి | = ఏలన; | రిపుః | = శత్రువు. |

**తా॥** మనుష్యుడు వివేకయుక్తమైన మనస్సుతో తనను తాను సంసారం నుండి ఉద్ధరించుకోవాలి (యోగారూఢుడు కావాలి). ఎన్నడూ కూడా విషయాసక్తిని పొందకూడదు. ఎందుకంటే, శుద్ధమైన మనస్సే మనుజునికి యథార్థమైన హితాన్ని చేకూర్చే మిత్రుడు. (ముక్తికి కారణం)[2]. విషయాసక్తమైన మనస్సే మనుజునికి పరమశత్రువు. (బంధకారణం). - మధుసూదన సరస్వతి. 5

**బన్ధురాత్మాత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మై వ శత్రువత్ ॥ 6**

*బంధుః, ఆత్మా, ఆత్మనః, తస్య, యేన, ఆత్మా, ఏవ, ఆత్మనా, జితః,*
*అనాత్మనః, తు, శత్రుత్వే, వర్తేత, ఆత్మా, ఏవ, శత్రువత్.*

1. (అ) శాంతో దాంత ఉపరతస్తితీక్షుః. - బృహదారణ్యకోపనిషత్తు. 4-4-22.
(ఆ) నైతాదృశం బ్రాహ్మణ స్యాస్తివిత్తం యథైకతా సమతా సత్యతా చ శీలం స్థితి ర్దండనిధాన మార్జవం తత స్తత శ్చోపరమః క్రియాభ్యః. - శాంతి పర్వమ్. 175-38.

2. ఇతరులైన మిత్రులు స్నేహప్రీత్యాది బంధాలతో ముక్తికి సహాయపడడానికి బదులుగా ప్రతికూలురు అవుతారు. (శ్రీమద్భాగవతమ్:11-7-20 చూ.)

| | | | |
|---|---|---|---|
| యేన | = ఏ; | బంధుః | = మిత్రుడు; |
| ఆత్మనా ఏవ | = వివేకంతో కూడిన మనస్సు చేతనే; | తు | = కాని; |
| | | అనాత్మనః | = అజితాత్మునికి; |
| ఆత్మా | = దేహేంద్రియాలు; | ఆత్మా ఏవ | = వశీకృతం కాని మనస్సే; |
| జితః | = జయింపబడ్డాయో; | | |
| ఆత్మా | = ఆ మనస్సు; | శత్రువత్ | = శత్రువు వలె; |
| తస్య | = ఆ; | శత్రుత్వే | = అపకృతి యందు; |
| ఆత్మనః | = జీవాత్మకు; | వర్తేత | = ప్రవర్తిస్తుంది. |

**తా॥** వివేకయుక్తమైన ఏ మనస్సు చేత దేహేంద్రియాదులు వశీకృతం అవుతున్నాయో ఆ మనస్సే ఆత్మకు బంధువు. ఏమన స్వేచ్ఛాప్రవృత్తిరహితమై ఆ మనస్సే[1] ముక్తికి సహాయమవుతుంది. కాని, అజితాత్ముని వివేకశూన్యమైన మనస్సు స్వేచ్ఛాప్రవృత్తి చేత శత్రువు వలె అపకృతి చేయడానికి ప్రవృత్తమవుతుంది.

– మధుసూదన సరస్వతి 6

**జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥** **7**

*జితాత్మనః, ప్రశాంతస్య, పరమాత్మా, సమాహితః,*
*శీత ఉష్ణ సుఖదుఃఖేషు, తథా, మాన అవమానయోః.*

| | | | |
|---|---|---|---|
| జితాత్మనః | = జితేంద్రియుడూ; | మాన అవమానయోః | = సమ్మాన తిరస్కారాలను పొందేటప్పుడూ; |
| ప్రశాంతస్య | = ఉపశాంతుడూ అయిన వానికి; | పరమాత్మా | = పరమాత్మ; |
| శీత ఉష్ణ సుఖ దుఃఖేషు | = శీతోష్ణ సుఖదుఃఖాలలోను; | సమాహితః | = సాక్షిగా ఆత్మభావంలో ఉంటాడు. |
| తథా | = మరియు; | | |

**తా॥** జితేంద్రియుడూ, ప్రశాంతుడూ అయిన సన్న్యాసి శీతోష్ణాలను, సుఖఃదుఃఖాలను, సమ్మానతిరస్కారాలను పొందేటప్పుడు కూడా పరమాత్మయందే సమాహితుడై ఉంటాడు. ద్వంద్వాల చేత చలించడు. 7

---

1. యచ్చిత్తస్తన్మయో మర్త్యః. – పంచదశి. 11-133.

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః.
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్. – మైత్రాయిణీ ఉపనిషత్తు

**జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమ లోష్టాశ్మ కాఞ్చనః ॥ 8**

*జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా, కూటస్థః, విజిత ఇంద్రియః,*
*యుక్తః, ఇతి, ఉచ్యతే, యోగీ, సమలోష్ట ఆశ్మ కాంచనః.*

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా = శాస్త్రజ్ఞానం చేతా, ఉపలబ్ధిచేతా చిత్తతృప్తి పొందినవాడూ;
కూటస్థః = నిర్వికారుడూ;
విజిత ఇన్ద్రియః = జితేంద్రియుడూ;
సమ లోష్ట ఆశ్మ కాంచనః = మట్టిని, రాతిని, బంగారాన్ని సమంగా చూసేవాడూ అయిన ;
యోగీ = యోగి;
యుక్తః ఇతి = యోగారూఢుడని;
ఉచ్యతే = చెప్పబడతాడు.

**తా॥** శాస్త్రజ్ఞానాన్ని బడసి పరితృప్తిచెందిన వాడు, నిర్వికారుడు, జితేంద్రియుడు, మట్టి రాయి బంగారాల పట్ల సమబుద్ధి కలవాడూ (హేయోపాదేయ బుద్ధిరహితుడు) అయిన యోగి, యోగారూఢుడనబడతాడు. 8

**సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబన్ధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే[1] ॥ 9**

*సుహృత్ మిత్రా అరి ఉదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు,*
*సాధుషు, అపి, చ, పాపేషు, సమబుద్ధిః, విశిష్యతే.*

సుహృత్ మిత్ర, అరి ఉదాసీన, మధ్యస్థ ద్వేష్య, బంధుషు = సుహృదుడు, మిత్రుడు; శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, విరోధి, బంధువు-వీరియందూ;
సాధుషు = సాధువులందూ (శాస్త్రాన్ని అనుసరించే వారియందూ);
పాపేషు అపి చ = దురాచారుల యందూ కూడా;
సమబుద్ధిః = సమబుద్ధి, రాగద్వేష శూన్యుడైనవాడు;
విశిష్యతే = శ్రేష్ఠుడు, యోగారూఢుడు అవుతున్నాడు.

**తా॥** సుహృదుడు, మిత్రుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, విరోధి, బంధువు, సదాచారి, దురాచారి- వీరందరియందూ కూడా సమబుద్ధి (బ్రహ్మ

1. విముచ్యతే.

బుద్ధి) కలవాడే, (రాగ, ద్వేషాది శూన్యుడే) యోగారూఢుడు అని చెప్పబడతాడు.[1] 9

**యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥ 10**

*యోగీ, యుంజీత, సతతమ్, ఆత్మానమ్, రహసి, స్థితః,*
*ఏకాకీ, యతచిత్తాత్మా, నిరాశీః, అపరిగ్రహః.*

| | | | |
|---|---|---|---|
| యోగీ | = యోగి; | నిరాశీః | = నిశ్చింతుడవై (ఆకాంక్షాహీనుడవై); |
| సతతమ్ | = సదా; | అపరిగ్రహః | = పరిగ్రహశూన్యుడవై; |
| రహసి | = నిర్జన స్థానంలో; | ఆత్మానమ్ | = అంతఃకరణాన్ని; |
| స్థితః | = ఉండి; | యుంజీత | = సమాహితమొనర్చు. |
| ఏకాకీ | = సంగశూన్యుడై; | | |
| యత చిత్త ఆత్మా | = దేహాన్ని, మనస్సును సంయతం చేసుకొని; | | |

**తా॥** [యోగారూఢుని లక్షణం చెప్పబడింది - ఈ శ్లోకం నుండి 'ఆ యోగి శ్రేష్ఠుడని నా అభిప్రాయం' (32వ) అనే శ్లోకం వరకూ సాంగమైన యోగం నిర్వచింపబడుతోంది.] నిర్జనస్థానంలో యోగి ఏకాకిగా ఉండి, ఆకాంక్షా శూన్యుడూ, పరిగ్రహరహితుడూ అయి, దేహమూ మనస్సులను సంయతమొనర్చి అంతఃకరణాన్ని సమాహిత మొనర్చాలి. (శ్వేతాశ్వతర ఉపనిషత్తు 2-8 చూ:)[2]

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం[3] చైలాజినకుశోత్తరమ్ ॥ 11**

*శుచౌ, దేశే, ప్రతిష్ఠాప్య, స్థిరమ్, ఆసనమ్, ఆత్మనః,*
*న, అతి ఉచ్ఛ్రితమ్, న, అతినీచమ్, చైల అజిన కుశ ఉత్తరమ్.*

---

1. సుహృదుడు-స్వభావికంగానే హితాన్ని కోరేవాడు. మిత్రుడు-స్నేహవశాన ఉపకారమొనర్చేవాడు. అరి-ఘాతుకుడు. ఉదాసీనుడు-ఇద్దరు పోరాడుతుండగా ఉపేక్షను వహించేవాడు. మధ్యస్థుడు-పోరాడుతున్న ఇద్దరి మంచిని కోరేవాడు. ద్వేష్యుడు-ద్వేషింపదగినవాడు. బంధువు-చుట్టం.

2. స్మరంతి చ. - వేదాంత సూత్రమ్ 4-1-10 చూ.

3. చైలాజిన - పాఠాంతరమ్.

**తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేన్ద్రియ క్రియః ।**
**ఉపవిశ్యాసనే యుఞ్జ్యాత్ యోగమాత్మ విశుద్ధయే ॥ 12**

*తత్ర, ఏకాగ్రమ్, మనః, కృత్వా, యతచిత్త ఇంద్రియక్రియః,*
*ఉపవిశ్య, ఆసనే, యుంజ్యాత్, యోగమ్, ఆత్మ విశుద్ధయే.*

| | |
|---|---|
| శుచౌ = శుద్ధమైన; | తత్ర ఆసనే = ఆ ఆసనం పై; |
| దేశే = స్థానంలో; | ఉపవిశ్య = కూర్చొని; |
| స్థిరమ్ = నిశ్చలమైనదీ; | యత చిత్త ఇంద్రియ క్రియః = అంతరింద్రియ, బహిరింద్రియ కార్యాలను నిరోధించినవాడు; |
| న అతి ఉచ్ఛ్రితమ్ = మిక్కిలి ఎత్తుకానిదీ; | |
| న అతి నీచమ్ = మిక్కిలి క్రిందు కానిదీ; | |
| చేల అజిన కుశ ఉత్తరమ్ = వస్త్ర, చర్మ, దర్భలతో ఏర్పరిచినదీ అయిన; | మనః = మనస్సును; |
| | ఏకాగ్రమ్ కృత్వా = ఏకాగ్రమొనర్చి; |
| ఆసనమ్ = ఆసనాన్ని; | ఆత్మవిశుద్ధయే = చిత్తశుద్ధి కొరకు; |
| ఆత్మనః = తన కొరకు; | యోగమ్ = యోగాన్ని; |
| ప్రతిష్ఠాప్య = స్థాపించి; | యుంజ్యాత్ = అభ్యసించాలి. |

**తా॥** పవిత్రస్థానంలో అంతగా ఉన్నతమూ నిమ్నమూ కాకుండా కుశాజిన చేలావృతమైన స్థిరాసనంలో ఆసీనుడై బాహ్యేంద్రియ కార్యాలను, అంతరింద్రియ కార్యాలను నిరోధించి, ఏకాగ్ర మనస్కుడై చిత్తశుద్ధి కొరకు యోగాన్ని అభ్యసించాలి. 11-12

**సమం కాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్ ॥ 13**

*సమమ్, కాయ శిర గ్రీవమ్, ధారయన్, అచలమ్, స్థిరః,*
*సంప్రేక్ష్య, నాసికాగ్రమ్, స్వమ్, దిశః, చ, అనవలోకయన్.*

**ప్రశాన్తాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14**

*ప్రశాంతాత్మా, విగతభీః, బ్రహ్మచారివ్రతే, స్థితః,*
*మనః, సంయమ్య, మచ్చిత్తః, యుక్తః, ఆసీత, మత్పరః.*

| | | | |
|---|---|---|---|
| కాయ శిర గ్రీవమ్ | = శరీరాన్ని, తలను, కంఠాన్ని; | ప్రశాంతాత్మా | = ప్రశాంతచిత్తుడూ; |
| సమమ్ | = సమానంగా; | విగతభీః | = నిర్భయుడూ; |
| అచలమ్ | = నిశ్చలంగా; | బ్రహ్మచారివ్రతే స్థితః | = బ్రహ్మచర్య వ్రతుడై; |
| ధారయన్ | = నిలిపి; | మనః | = మనస్సును; |
| స్థిరః | = స్థిరంగా; | సంయమ్య | = నియమించి, |
| స్వమ్ | = తన; | మచ్చిత్తః | = చిత్తాన్ని నాయందు నిలిపి; |
| నాసికాగ్రమ్ | = ముక్కు కొనను; | మత్పరః | = నన్నొక్కణ్ణే భావిస్తూ; |
| సంప్రేక్ష్య | = చూస్తూ; | యుక్తః | = సమాహితుడై; |
| దిశః చ | = దిక్కులను; | ఆసీత | = ఉండాలి. |
| అనవలోకయన్ | = చూడకుండా; | | |

**తా॥** మేరుదండాన్ని, కంఠాన్ని, శిరస్సును సమానంగా స్థిరంగా నిలిపి; కదలక, దిక్కులు చూడకుండా, నాసికాగ్రమున[1] దృష్టిని నిబద్ధమొనర్చి; ప్రశాంత చిత్తుడూ, భయరహితుడూ, బ్రహ్మచర్యవ్రతి[2] అయి, మనస్సును నియమించి నాయందు చిత్తం నిలిపి, నన్ను మాత్రమే భావిస్తూ సమాహితుడై ఉండాలి. 13-14

**యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియత మానసః ।**
**శాన్తిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ॥ 15**

*యుంజన్, ఏవమ్, సదా, ఆత్మానమ్, యోగీ, నియతమానసః, శాంతిమ్, నిర్వాణ పరమామ్, మత్సంస్థామ్, అధిగచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| యోగి | = యోగి; | యుంజన్ | = సమాధానపరుస్తూ; |
| ఏవమ్ | = ఇట్లు; | మత్ సంస్థామ్ | = నా ఆధీనమైన; |
| సదా | = నిరంతరం; | నిర్వాణ పరమామ్ శాంతిమ్ | = నిర్వాణరూపమైన శాంతిని; |
| నియతమానసః | = సంయతచిత్తుడై; | అధిగచ్ఛతి | = పొందుతాడు. |
| ఆత్మానమ్ | = మనస్సును; | | |

1. ఇక్కడ విధింపబడింది నాసికాగ్రదర్శనం కాదు, దృష్టిని నిరుద్ధమొనర్చడమే చెప్పబడింది, నాసికాగ్రంలో మనస్సును స్థిరమొనర్చడం ఉద్దేశ్యం కాదు. ఆత్మ యందే మనస్సును నిలపాలి. (గీ. 6. 25 చూ.) నాసికాగ్రం అంటే ముక్కుకొన లేదా భ్రూమధ్యం అని కూడా అర్థం చెప్పబడుతోంది. (కుమార సంభవమ్: 3-47)

2. గురుశుశ్రూష, భిక్షాన్నగ్రహణం, మైథునవర్జనం, శాస్త్రపఠనం అనే నియమాచరణే 'బ్రహ్మచర్యవ్రతం'.

**తా॥** యోగి ఈ విధంగా నిరంతరమూ సమాహితుడై మనస్సును సమాధానమొనర్చి నా ఆధీనమైన నిర్వాణరూప శాంతిని పొందుతున్నాడు. 15

**నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః**
**న చాతి స్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16**

*న, అతి, అశ్నతః, తు, యోగః, అస్తి, న, చ, ఏకాంతమ్, అనశ్నతః,*
*న, చ, అతి స్వప్నశీలస్య, జాగ్రతః, న, ఏవ, చ, అర్జున.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా; | న | = లేదు; |
| అత్యశ్నతః తు | = ఎక్కువగా భుజించేవానికి; | అతి స్వప్న శీలస్య చ | = ఎక్కువ నిద్రించేవానికి కూడా; |
| యోగః | = ధ్యానం; | న | = లేదు; |
| న అస్తి | = లేదు; | జాగ్రతః ఏవ చ | = ఎక్కువగా మేల్కొని ఉండేవానికి కూడా; |
| చ | = మరియు; | | |
| ఏకాంతమ్ | = ఏమీ కూడా; | న | = లేదు. |
| అనశ్నతః | = భుజింపనివానికి కూడా; | | |

**తా॥** (ధ్యానాభ్యాస నిష్ఠుని ఆహారాది నియమాలు చెప్పబడుతున్నాయి:) అర్జునా! ఎక్కువగా భుజించేవానికి ధ్యానం (సమాధి) కుదరదు. అదే విధంగా ఏమీ తినని వానికి కూడా ఇది లభించదు. ఎక్కువగా నిద్రించేవానికిని, అమితంగా మేల్కొని ఉండేవానికి కూడా ధ్యానం కుదురదు.[1] 16

**యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ 17**

*యుక్త ఆహార విహారస్య, యుక్తచేష్టస్య, కర్మసు,*
*యుక్తస్వప్న అవబోధస్య, యోగః, భవతి, దుఃఖహా.*

---

1. యోగియైనవాడు ఉదర అర్ధభాగాన్ని అన్నవ్యంజనాలతో నింపి, మిగిలిన అర్ధభాగంలో సగం నీటితో నింపి, మిగిలిన దానిని వాయు సంచరణార్థం వదలిపెట్టాలి.

యథా–అర్ధం సవ్యంజనాన్నస్య తృతీయముదకస్య తు,
వాయోః సంచరణార్థం తు చతుర్థమవశేషయేత్. – శివసంహిత.

యుక్త ఆహార విహారస్య = పరిమితమైన ఆహారవిహారాలు గలవాడూ;
కర్మసు = జపతపాది కర్మలలో;
యుక్త చేష్టస్య = నియమిత ప్రయత్నం ఒనర్చువాడూ;
యుక్త స్వప్న అవబోధస్య = పరిమితమైన నిద్రాజాగరణాలు కలవాడూ అయిన పురుషునికి;
దుఃఖహా = సంసారదుఃఖ నాశకమైన;
యోగః = ధ్యానం;
భవతి = అవుతుంది.

**తా॥** పరిమితమైన ఆహారవిహారాలు కలిగి, జపతపాది కర్మలందు పరిమితమైన ప్రయత్నం కలిగి, నియమితమైన (నిర్దిష్టమైన కాల పరిణామాలు కలిగిన) నిద్రాజాగరణాలు కలిగి ఉండేవానికి సంసారదుఃఖాన్ని పోగొట్టే ధ్యానం కుదురుతుంది. 17

**యదా వినియతం చిత్తమాత్మన్యేవావ తిష్ఠతే ।**
**నిఃస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 18**

*యదా, వినియతమ్, చిత్తమ్, ఆత్మని, ఏవ, అవతిష్ఠతే,*
*నిఃస్పృహః, సర్వకామేభ్యః, యుక్తః, ఇతి, ఉచ్యతే, తదా.*

యదా = ఎప్పుడు;
వినియతమ్ = సంయతమైన;
చిత్తమ్ = మనస్సు;
ఆత్మన్యేవ = ఆత్మయందే;
అవతిష్ఠతే = వెలసి ఉంటుందో;
తదా = అప్పుడు
సర్వకామేభ్యః = సమస్తకామాల నుండి; ఇహాముత్ర విషయాల నుండి
నిఃస్పృహః = నివృత్తుడైన వ్యక్తి;
యుక్తః = సమాహితుడు, యోగి;
ఇతి = అని,
ఉచ్యతే = చెప్పబడును.

**తా॥** ఐహికాముష్మిక విషయతృష్ణ నుండి విడివడి, నిస్పృహుడైన యోగి చిత్తం విశేషంగా నిరోధింపబడి ఆత్మయందే వెలయునప్పుడు, అతడు యోగసిద్ధుడని చెప్పబడతాడు. 18

**యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః ॥ 19**

*యథా దీపః, నివాతస్థః నేంగతే, సా ఉపమా స్మృతా*
*యోగినః, యతచిత్తస్య యుఞ్జతః, యోగం ఆత్మనః.*

| | | | |
|---|---|---|---|
| దీపః | = దీపం; | యుంజతః | = అభ్యసించే; |
| నివాతస్థః | = గాలి లేనిచోట; | యోగినః | = యోగి; |
| యథా | = ఏ విధంగా; | యతచిత్తస్య | = సంయత చిత్తానికి; |
| నేంగతే | = కంపించకుండునో; | సా | = ఆ; |
| ఆత్మనః | = ఆత్మయందు; | ఉపమా | = దృష్టాంతం; |
| యోగం | = యోగాన్ని; | స్మృతా | = స్మృతిలో చెప్పబడింది. |

**తా॥** ఆత్మయోగం అభ్యసించేవాని అచంచల చిత్తం గాలిలేని చోట ఉండే దీపశిఖ ఉపమానంగా చెప్పబడింది. (అంటే యోగిచిత్తం నిర్వాతస్థానంలో ఉండే దీపశిఖ వలే నిశ్చలంగా ఉంటుందని భావం.) 19

**యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగ సేవయా ।**
**యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ 20**

*యత్ర, ఉపరమతే, చిత్తమ్, నిరుద్ధమ్, యోగసేవయా,*
*యత్ర, చ, ఏవ, ఆత్మనా, ఆత్మానమ్, పశ్యన్, ఆత్మని, తుష్యతి.*

| | | | |
|---|---|---|---|
| యత్ర | = ఎప్పుడు; | ఆత్మనా | = శుద్ధ మనస్సుతో; |
| యోగసేవయా | = యోగాభ్యాసంతో; | ఆత్మానమ్ | = ఆత్మను; |
| నిరుద్ధమ్ | = ప్రత్యాహృతమొనర్చబడిన; | పశ్యన్ | = చూస్తూ; |
| చిత్తమ్ | = మనస్సు; | ఆత్మని ఏవ | = ఆత్మయందే; |
| ఉపరమతే | = ఉపరతి పొందుతోందో; | తుష్యతి | = ఆనందిస్తోందో. |
| యత్ర చ | = మరియు ఎప్పుడు; | | |

**తా॥** ['శాస్త్రం సన్న్యాసమని చెప్పే దాన్నే నిష్కామకర్మ యోగానుష్ఠానం అని గ్రహించు' (*గీత: 6-2*) అనే శ్లోకంలో 'యోగ' శబ్దానికి అర్థం కర్మ అని చెప్పబడింది. 'ఎక్కువగా భుజించేవానికి ధ్యానం (సమాధి) కుదురదు' (*గీత: 6-16*) అనే శ్లోకంలో 'యోగ' శబ్దానికి అర్థం సమాధి అని చెప్పబడింది. ఈ రెండింటిలో ముఖ్యార్థం ఏది? - చెప్పబడుతోంది.] ఏ స్థితిలో యోగాభ్యాసం చేత నిరోధింపబడిన చిత్తం ఉపరతి పొందుతోందో, మరియు ఏ స్థితిలో యోగి శుద్ధచిత్తంతో ఆత్మచైతన్యాన్ని దర్శిస్తూ పరితుష్టుడవుతుంటాడో,- 20

**సుఖ మాత్యన్తికం యత్తత్ బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।**
**వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ 21**

*సుఖమ్, ఆత్యంతికమ్, యత్, తత్, బుద్ధిగ్రాహ్యమ్, అతీంద్రియమ్,*
*వేత్తి, యత్ర, న, చ, ఏవ, అయమ్, స్థితః, చలతి, తత్త్వతః.*

| | | | |
|---|---|---|---|
| అయమ్ | = ఈ యోగి; | తత్ | = ఆ; |
| యత్ | = ఏ; | సుఖమ్ | = ఆనందాన్ని; |
| బుద్ధి గ్రాహ్యమ్ | = ఇంద్రియ నిరపేక్షమైన బుద్ధితో గ్రహింపదగినదీ; | వేత్తి | = తెలిసికుంటాడో; |
| | | యత్ర చ | =మరియు ఎక్కడైతే; |
| అతీన్ద్రియమ్ | = ఇంద్రియ గోచరం కానిదీ, విషయజనితం కానిదీ; | స్థితః ఏవ | = తత్త్వంలో స్థితమై; |
| | | తత్త్వతః | = ఆత్మస్వరూపం నుండి; |
| ఆత్యంతికమ్ | = అనంతమైన; | న చలతి | = చలించకుంటాడో, |

**తా॥** ఏ స్థితిలో యోగి ఇంద్రియ నిరపేక్షమూ, బుద్ధిగ్రాహ్యమూ, అతీంద్రియమూ అయిన అనంతసుఖాన్ని అనుభవిస్తాడో, మరియు ఏ స్థితిలో ఉంటే యోగి ఆత్మ తత్త్వం నుండి అణుమాత్రమైన చలింపకుంటాడో, 21

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ 22**

*యమ్, లబ్ధ్వా, చ, అపరమ్, లాభమ్, మన్యతే, న, అధికమ్, తతః,*
*యస్మిన్, స్థితః, న, దుఃఖేన, గురుణా, అపి, విచాల్యతే.*

| | | | |
|---|---|---|---|
| యం చ | = మరియు దేనిని; | న మన్యతే | = ఎంచడో; |
| లబ్ధ్వా | = పొందితే; | యస్మిన్ | = ఏ ఆత్మయందు; |
| అపరమ్ | = మరియొక; | స్థితః | = ఉంటే; |
| లాభమ్ | = లాభాన్ని; | గురుణా | = దుస్సహమైన; |
| తతః | = దాని కంటే; | దుఃఖేన అపి | = దుఃఖంచే కూడా; |
| అధికమ్ | = ఎక్కువగా; | న విచాల్యతే | = చలించకుంటాడో. |

**తా॥** ఏ స్థితిని పొందితే యోగి తదితరమైన లాభాలను ఉన్నతమైన వాటిగా భావించడో, దేనిలో స్థితమైతే (శస్త్ర నిపాతం శీతోష్ణాలు మొదలైన) మహాదుఃఖాల చేత కూడా చలించకుండా ఉంటాడో, 22

**తం విద్యాద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్ ।**
**స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణ చేతసా ॥ 23**

*తమ్, విద్యాత్, దుఃఖ సంయోగ వియోగమ్, యోగసంజ్ఞితమ్,*
*సః, నిశ్చయేన, యోక్తవ్యః, యోగః, అనిర్విణ్ణ చేతసా.*

తమ్ = ఆ;
దుఃఖ సంయోగ వియోగమ్ = దుఃఖ సంబంధాన్ని పోగొట్టే స్థితిని;
యోగసంజ్ఞితమ్ = యోగమనబడేదాన్ని;
విద్యాత్ = తెలిసికోవాలి;
అనిర్విణ్ణచేతసా = విసుగులేని చిత్తంతో;
సః = ఆ;
యోగః = యోగం;
నిశ్చయేన = పట్టుదలతో;
యోక్తవ్యః = అభ్యసించాలి.

**తా॥** దుఃఖానికి ఆత్యంతిక నివృత్తి కలుగడం అనే ఆ స్థితిని యోగమని గ్రహించు. విసుగు లేని చిత్తంతో పట్టుదల పూని ఈ యోగాన్ని అభ్యసించాలి. 23

**సఙ్కల్ప ప్రభవాన్కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః ।**
**మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥ 24**

*సంకల్ప ప్రభవాన్, కామాన్, త్యక్త్వా, సర్వాన్, అశేషతః,*
*మనసా, ఏవ, ఇంద్రియగ్రామమ్, వినియమ్య, సమంతతః.*

సంకల్ప ప్రభవాన్ = సంకల్పం వల్ల కలిగే;
సర్వాన్ = సమస్తములైన;
కామాన్ = కామములను;
అశేషతః = సంపూర్ణంగా;
త్యక్త్వా = త్యజించి;
మనసా = మనస్సుచేత;
ఇంద్రియగ్రామమ్ = ఇంద్రియసమూహాన్ని;
సమంతతః = అన్నివైపుల నుండి;
వినియమ్య = నివృత్తం చేసి;

**తా॥** సంకల్పం[1] వల్ల కలిగే కామముల నన్నిటిని సంపూర్ణంగా త్యజించి, మనస్సుచేత ఇంద్రియసమూహాన్ని సమస్త విషయాల నుండి మరలించి 24

**శనైశ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।**
**ఆత్మసంస్థం మనఃకృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ 25**

---

1. శోభనాధ్యస అంటే వస్తువుల మనోరమత్వజ్ఞానం చేత కలిగే సంకల్పం. దీని నుండి, 'ఇది నాది అగుగాక' అనే కోరిక పుడుతుంది.

శనైః, శనైః, ఉపరమేత్, బుద్ధ్యా, ధృతిగృహీతయా,
ఆత్మసంస్థమ్, మనః, కృత్వా, న, కించిత్, అపి, చింతయేత్.

| | | | |
|---|---|---|---|
| ధృతి గృహీతయా | = ధైర్యపుపట్టులోనున్న; | ఆత్మసంస్థమ్ | = ఆత్మయందు స్థితమైయ్యేలా; |
| బుద్ధ్యా | = బుద్ధిచేత; | | |
| శనైః శనైః | = మెల్ల మెల్లగా; | కృత్వా | = చేసి; |
| ఉపరమేత్ | = ఉపరతి యందు; | కించిత్ అపి | = ఏమియును; |
| మనః | = మనస్సును; | న చింతయేత్ | = చింతించకూడదు. |

**తా॥** (పూర్వజన్మ సంస్కారం చేత మనస్సు చలిస్తే) ధైర్యంతో కూడిన బుద్ధితో మనస్సును మెల్లమెల్లగా ఉపరత మొనర్చు; మరియు, ఆత్మయందు మనస్సును నిలిపి, మరి ఇతరమేమి కూడా చింతించకూడదు. (అంటే, 'ఆత్మయే అంతా, ఆత్మ కంటే మరేదీ లేదు' అని తత్త్వనిష్ఠ పొందాలి. ఇదే యోగానికి సంబంధిచిన పరమవిధి.) 25

**యతోయతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్ ॥ 26**

యతః, యతః, నిశ్చరతి, మనః, చంచలమ్, అస్థిరమ్,
తతః, తతః, నియమ్య, ఏతత్, ఆత్మని, ఏవ, వశమ్, నయేత్.

| | | | |
|---|---|---|---|
| చంచలమ్ | = చంచలమూ; | నియమ్య | = నివర్తిల్లజేసి, మరల్చి; |
| అస్థిరమ్ | =అస్థిరమూ అయిన; | ఏతత్ | = ఈ మనస్సును; |
| మనః | = మనస్సు; | ఆత్మని ఏవ | = ఆత్మయందే; |
| యతః యతః | = ఏ ఏ విషయాల వైపు; | వశమ్ | = అధీనం; |
| నిశ్చరతి | = పరుగెడుతుందో; | నయేత్ | = పొందించు. |
| తతః తతః | = ఆయా విషయాల నుండి; | | |

**తా॥** చంచలమూ అస్థిరమూ అయిన మనస్సు ఏ ఏ విషయాల దెసకు పరుగెడుతుందో ఆయా విషయాల నుండి మరల్చి, ఆత్మయందే స్థిరమొనర్చాలి.
(కఠోపనిషత్తు 2-3-10.11.) 26

**ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మ భూత మకల్మషమ్ ॥ 27**

*ప్రశాంత మనసమ్, హి, ఏనమ్, యోగినమ్, సుఖమ్, ఉత్తమమ్,*
*ఉపైతి, శాంతరజసమ్, బ్రహ్మ భూతమ్, అకల్మషమ్.*

| | | | |
|---|---|---|---|
| ప్రశాంత మనసమ్ | = ప్రశాంతచిత్తుడూ; | ఏనమ్ | = ఈ; |
| శాంతరజసమ్ | = రజోగుణ కార్యాలైన విక్షేపాదులు లేనివాడూ; | యోగినం | = యోగిని; |
| | | ఉత్తమమ్ | = పరమమైన; |
| అకల్మషమ్ | = నిష్పాపుడూ; | సుఖమ్ | = శాంతి; |
| బ్రహ్మభూతమ్ | = బ్రహ్మభావాన్ని పొందినవాడూ అయిన; | ఉపైతి హి | = తానే పొందును కదా. |

**తా॥** (ఇలా ప్రత్యాహారాదులతో మనస్సును మళ్ళీ మళ్ళీ వశమొనర్చుకొనే యోగికి రజోగుణం క్షయమైన వెంటనే సమాధిసుఖం లభింస్తుందని బోధిస్తున్నాడు) ప్రశాంతచిత్తుడూ, మోహాదిశూన్యుడూ, నిష్పాపుడూ, బ్రహ్మభావాపన్నుడూ అయిన యోగియే పరమసుఖాన్ని పొందుతాడు. 27

**యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।**
**సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యన్తం సుఖమశ్నుతే ॥ 28**

*యుంజన్, ఏవమ్, సదా, ఆత్మానమ్, యోగీ, విగతకల్మషః,*
*సుఖేన, బ్రహ్మసంస్పర్శమ్, అత్యంతమ్, సుఖమ్, అశ్నుతే.*

| | | | |
|---|---|---|---|
| ఏవమ్ | = ఈ విధంగా; | సుఖేన | = అనాయాసంగా; |
| ఆత్మానమ్ | = మనస్సును; | బ్రహ్మ సంస్పర్శమ్ | = బ్రహ్మాన్ని అనుభూతి చేసుకుని; |
| సదా | = సర్వదా; | | |
| యుంజన్ | = యోగస్థమొనర్చి; | అత్యంతమ్ | = నిరతిశయమైన; |
| విగత కల్మషః | = నిష్పాపుడైన; | సుఖమ్ | = సుఖాన్ని; |
| యోగీ | = యోగి; | అశ్నుతే | = పొందుతాడు. |

**తా॥** ఈ రీతిగా మనస్సును సర్వదా యోగయుక్తమొనర్చి నిష్పాపుడైన యోగియే అనాయాసంగా బ్రహ్మానుభూతి చేత కలిగే అత్యంతిక శాంతిని (మోక్షాన్ని) పొందుతున్నాడు. 28

**సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29**

సర్వభూతస్థమ్, ఆత్మానమ్, సర్వభూతాని, చ, ఆత్మని,
ఈక్షతే, యోగయుక్తాత్మా, సర్వత్ర, సమదర్శనః.

సర్వత్ర = సర్వభూతాలలో;
సమదర్శనః = బ్రహ్మంను దర్శించేవాడూ;
యోగయుక్తాత్మా = సమాహితచిత్తుడూ అయిన పురుషుడు;
ఆత్మానమ్ = ఆత్మను;
సర్వభూతస్థమ్ = ఆ బ్రహ్మస్తంబ పర్యంతం అంతటా ఉన్నట్లుగా;
సర్వభూతాని = బ్రహ్మాది స్థావరాంతాలైన భూతాలనన్నిటిని;
ఆత్మని చ = ఆత్మలో;
ఈక్షతే = దర్శిస్తాడు.

**తా॥** (బ్రహ్మసాక్షాత్కార స్థితి వర్ణించబడుతోంది;) సమాహితచిత్తుడైన పురుషుడు సర్వభూతాలలో బ్రహ్మాన్ని దర్శిస్తూ, తన ఆత్మను బ్రహ్మాదిస్థావరాంతంగా గల సర్వభూతాలలోను; సర్వభూతాలను తన ఆత్మలోనూ దర్శిస్తూ ఉంటాడు.[1] 29

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30**

యః, మామ్, పశ్యతి, సర్వత్ర, సర్వమ్, చ, మయి, పశ్యతి,
తస్య, అహమ్, న, ప్రణశ్యామి, సః, చ, మే, న, ప్రణశ్యతి.

యః = ఎవడు;
సర్వత్ర = సర్వభూతాలలో;
మామ్ = నన్ను;
పశ్యతి = చూస్తాడో;
మయి చ = మరియు, నాలో;
సర్వమ్ = జగత్తునంతా, భూతాలన్నిటిని;
పశ్యతి = చూస్తాడో;
అహమ్ = నేను;
తస్య = వానికి;
న ప్రణశ్యామి = అదృశ్యుణ్ణి కాను;
స చ = మరియు, అతడు;
మే = నాకు;
న ప్రణశ్యతి = పరోక్షుడు కాడు.

**తా॥** సర్వభూతాలలో నన్ను దర్శించేవాడూ, నాలో సర్వభూతాలనూ చూసేవాడూ అయిన పురుషునికి నేను అదృశ్యుడను కాను; అతడు నాకు అదృశ్యుడు కాడు. (ప్రత్యక్షుడునై కృపాదృష్టితో అతనిని అనుగ్రహిస్తాను)[2] 30

1. శ్రీమద్భగవద్గీతా : 7-19; ఈశావాశ్యోపనిషత్తు.6 చూ.
2. శ్రీమద్భగవద్గీతా : 7-17, 18 చూ.

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31**

సర్వభూతస్థితమ్, యః, మామ్, భజతి, ఏకత్వమ్, ఆస్థితః,
సర్వథా, వర్తమానః, అపి, సః, యోగీ, మయి, వర్తతే.

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | సః | = ఆ; |
| సర్వభూతస్థితమ్ | = సర్వభూతాలలో ఉన్న; | యోగీ | = జ్ఞాని; |
| మామ్ | = నన్ను; | సర్వథా | = సర్వవిధావస్థలలో; |
| ఏకత్వమ్ | = బ్రహ్మైకత్వభావంలో; | వర్తమానః అపి | = ప్రవర్తిల్లుతున్నప్పటికీ; |
| ఆస్థితః | = ప్రతిష్ఠితుడై; | మయి | = నాయందే; |
| భజతి | = భజిస్తాడో; | వర్తతే | = వెలయుచుండును. |

**తా॥** (ఈ యోగి వేదం నిర్దేశించే విధినిషేధాలకు దాసుడు కాడు.) బ్రహ్మాత్మైక్య భావంలో ప్రతిష్ఠితుడై సర్వభూతాలలో వెలయు నన్ను భజించే యోగి సర్వవిధావస్థలలో వర్తిస్తున్నప్పటికీ (కర్మ పరిత్యాగం ఒనర్చినా లేక సర్వవిధ కర్మలను ఆచరిస్తున్నా) నాయందే ప్రవర్తిస్తాడు. (అంటే ముక్తుడవుతాడు, భ్రష్టుడు కాడు.) 31

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32**

ఆత్మౌపమ్యేన, సర్వత్ర, సమమ్, పశ్యతి, యః, అర్జున,
సుఖమ్, వా, యది, వా, దుఃఖమ్, సః, యోగీ, పరమః, మతః.

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | సమమ్ | = సమభావంతో; |
| యః | = ఎవడు; | పశ్యతి | = చూస్తాడో; |
| సర్వత్ర | = భూతాలన్నిటిలో; | సః | = ఆ; |
| ఆత్మౌపమ్యేన | = తనతోడ పోల్చుకొంటూ; | యోగీ | = సమదర్శి, ఆత్మజ్ఞాని; |
| యది వా సుఖమ్ | = సుఖం గాని; | పరమః | = శ్రేష్ఠుడని; |
| దుఃఖం వా | = దుఃఖాన్ని గాని; | మతః | = తలంచబడే వాడౌతాడు. |

**తా॥** అర్జునా! ఏ యోగి సర్వభూతాల సుఖాన్ని, దుఃఖాన్ని తన సుఖ దుఃఖాలుగా తలుస్తాడో, అతడే శ్రేష్ఠుడని నా యభిప్రాయం.[1] 32

అర్జున ఉవాచ :

**యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।**
**ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33**

*యః, అయమ్, యోగః, త్వయా, ప్రోక్తః, సామ్యేన, మధుసూదన,*
*ఏతస్య, అహమ్, న, పశ్యామి, చంచలత్వాత్, స్థితిమ్, స్థిరామ్.*

| | | | |
|---|---|---|---|
| మధుసూదన | = కృష్ణా, | ప్రోక్త | = చెప్పబడిందో; |
| త్వయా | = నీచే; | చంచలత్వాత్ | = మనశ్చాంచల్యం వల్ల; |
| సామ్యేన | = మనస్సుయొక్క లయవిక్షేపశూన్య స్థితియైన, సమత్వమైన; | ఏతస్య | = దీనికి; |
| | | స్థిరామ్ | = అచలమైన; |
| అయమ్ | = ఈ; | స్థితిమ్ | = స్థితిని; |
| యః | = ఏ; | అహమ్ | = నేను; |
| యోగః | = సమాధి; | న పశ్యామి | = కనుగొనలేకున్నాను. |

**తా॥** అర్జునుడు పల్కెను : మధుసూదనా! మనస్సు లయవిక్షేపశూన్యమై కేవలాత్మాకారంలో వెలయు సమత్వయోగాన్ని నీవు చెప్పావు; చంచలస్వభావమైన మనస్సుతో ఈ సమత్వభావం ఎలా స్థిరమవుతుందో గ్రహించలేకున్నాను. 33

**చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34**

*చంచలమ్, హి, మనః, కృష్ణ, ప్రమాథి, బలవత్, దృఢమ్,*
*తస్య, అహమ్, నిగ్రహమ్, మన్యే, వాయోః, ఇవ, సుదుష్కరమ్.*

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = కృష్ణా; | చంచలమ్ | = చంచలమూ; |
| హి | = ఏలయన; | ప్రమాథి | = శరీరానికీ, ఇంద్రియాలకూ క్షోభను కలుగజేయునదీ; |
| మనః | = మనస్సు; | | |

1. 'నాకు సుఖం అనుకూలమూ, దుఃఖం ప్రతికూలమూ అయినట్లే ప్రాణులందరికీ కూడా'-అని గ్రహించి అతడు జీవులందరి సుఖాన్ని కోరతాడు; ఏ ప్రాణీ కూడా దుఃఖించడం అతడు సహించలేడు.

| | | | |
|---|---|---|---|
| బలవత్ | = ప్రబలమూ; | నిగ్రహమ్ | = నిరోధమును; |
| దృఢమ్ | = విషయవాసనా పూర్ణమవడంతో దుర్భేద్యమూ అయి ఉన్నది; | వాయోః ఇవ | = గాలిని నిరోధించడంలా; |
| అహమ్ | = నేను; | సుదుష్కరమ్ | = అతిదుష్కరమని; |
| తస్య | = దీని; | మన్యే | = తలస్తున్నాను, ఎంచుతున్నాను. |

**తా॥** కృష్ణా! మనస్సు అతిచంచలమూ, ప్రబలమూ, శరీరేంద్రియాలకు క్షోభను కలిగించేదీ అయి ఉంది. దీనిని విషయవాసనల నుండి నివర్తిల్లజేయడం అత్యంత కఠినం. కనుక, దీనిని నిరోధించడం ఆకాశంలో వాయువును నిరోధించే ప్రయత్నం వలే అసాధ్యమని ఎంచుతున్నాను. 34

*శ్రీ భగవానువాచ :*

**అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35**

*అసంశయమ్, మహాబాహో, మనః, దుర్నిగ్రహమ్, చలమ్*
*అభ్యాసేన, తు, కౌన్తేయ, వైరాగ్యేణ, చ, గృహ్యతే.*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | (ఇందులో) అసంశయమ్ | = సందేహం లేదు; |
| ఉవాచ | = పలికెను; | తు | = కాని; |
| మహాబాహో | = మహావీరా; | కౌన్తేయ | = కుంతీపుత్రా; |
| మనః | = మనస్సు; | అభ్యాసేన | = ధ్యానాభ్యాసంతో; |
| దుర్నిగ్రహమ్ | = దుర్నిరోధం, నిగ్రహింపకష్టం; | వైరాగ్యేణ చ | = భోగ వితృష్ణతో; |
| చలమ్ | = చంచలం; | (ఇది) గృహ్యతే | = నిగ్రహింపబడుతోంది. |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* ఓ మహాబాహూ! మనస్సు దుర్నిరోధమూ, చంచలమూ అనడంలో సందేహం లేదు. కాని, కౌంతేయా! ధ్యానాభ్యాసం చేతను, ఐహిక పారలౌకిక విషయవితృష్ణ చేతను దీనిని నిరోధింపవచ్చు.[1] (వృత్తిశూన్యమైన మనస్సు శుద్ధం, ఇది బ్రహ్మాకారంగా వెలయుటయే నిర్వికల్ప సమాధి.) 35

1. (అ) అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః. -యోగసూత్రమ్. 1-12.
(ఆ) ధర్మపదము, 33 చూ.

**అసంశయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥ 36**

*అసంశయత ఆత్మనా, యోగః, దుష్ప్రాపః, ఇతి, మే, మతిః,*
*వశ్యాత్మనా, తు, యతతా, శక్యః, అవాప్తుమ్, ఉపాయతః.*

| | | | |
|---|---|---|---|
| అసంశయత ఆత్మనా | = స్వాధీనచిత్తుడు కానివానికి; | తు | = కాని; |
| యోగః | = యోగం; | యతతా | = యత్నశీలుడును; |
| దుష్ప్రాపః | = అసంభవం, పొందనశక్యం; | వశ్యాత్మనా | = స్వాధీనచిత్తుడూ అయిన వానిచేత; |
| ఇతి | = అని; | ఉపాయతః | = తగిన ఉపాయంతో; |
| మే | = నా; | (ఇది) అవాప్తుమ్ | = పొంద; |
| మతిః | = అభిప్రాయము; | శక్యః | = శక్యమైనది. |

**తా॥** సంయమం లేనివానికి చిత్తవృత్తి నిరోధం అసంభవం. ఇది నా అభిప్రాయం; కాని, మళ్ళీ మళ్ళీ ప్రయత్నించేవాడూ, జితేంద్రియుడూ అయినవాడు శాస్త్రవిహితాలైన ఉపాయాలను (అభ్యాసవైరాగ్యాలను) అవలంబించి యోగాన్ని పొందగలడు. 36

*అర్జున ఉవాచ :*

**అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః ।**
**అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ 37**

*అయతిః, శ్రద్ధయా, ఉపేతః, యోగాత్, చలిత మానసః,*
*అప్రాప్య, యోగసంసిద్ధిమ్, కామ్, గతిమ్, కృష్ణ, గచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | చలిత మానసః | = భ్రష్టచిత్తుడై |
| ఉవాచ | = పలికెను; | యోగ-సంసిద్ధిమ్ | = యోగసిద్ధిని; |
| కృష్ణ | = కృష్ణా; | అప్రాప్య | = పొందక; |
| శ్రద్ధయా ఉపేతః | = శ్రద్ధా అయుక్తుడూ; | కామ్ | = ఎట్టి; |
| అయతిః | = నియమహీనుడూ అయిన వాడు; | గతిమ్ | = గతిని; |
| యోగాత్ | = యోగం నుండి; | గచ్ఛతి | = పొందును? |

**తా॥** అర్జునుడు పలికెను: కృష్ణా! శ్రద్ధతో యోగసాధనను ఆరంభించినా నియమరాహిత్యం చేత యోగభ్రష్టచిత్తుడు యోగసిద్ధిని (జ్ఞానాన్ని) పొందడు. మరి వాడు ఎట్టి గతిని పొందుతున్నాడు? 37

**కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి ।**
**అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ 38**

*కచ్చిత్, న, ఉభయవిభ్రష్టః, ఛిన్న అభ్రమ్, ఇవ, నశ్యతి, అప్రతిష్ఠః, మహాబాహో, విమూఢః, బ్రహ్మణః, పథి.*

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = కృష్ణా; | ఉభయవిభ్రష్టః | = కర్మ, ధ్యానాలు రెండింటికీ చెడినవాడై; |
| బ్రహ్మణః పథి | = బ్రహ్మలాభమార్గంలో; | ఛిన్న అభ్రం ఇవ | = చెదరిన మేఘం వలె; |
| విమూఢః | = మూఢుడు, కలత చెందినవాడూ; | న నశ్యతి కచ్చిత్ | = చెడడు కదా? |
| అప్రతిష్ఠః | = నిరాశ్రయుడూ; | | |

**తా॥** కృష్ణా! బ్రహ్మప్రాప్తి పథంలో కర్మ ధ్యాన మార్గాల నుండి భ్రష్టుడూ,[1] విమూఢుడూ, నిరాశ్రయుడూ అయిన యోగి చెదరిన మేఘం వలె[2] వినాశాన్ని పొందడు కదా? 38

**ఏతన్మే[3] సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్యశేషతః ।**
**త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే ॥ 39**

ఏతత్, మే, సంశయమ్, కృష్ణ, ఛేత్తుమ్, అర్హసి, అశేషతః, త్వదన్యః, స్సంశయస్య, అస్య, ఛేత్తా, న, హి, ఉపపద్యతే.

---

1. కర్మలను ఈశ్వరార్పణం చేసినా త్యజించినా కూడా స్వర్గం లభించదు; మరి, యోగసిద్ధి పొందకపోవడం చేత మోక్షం లేదు. స్వర్గ మోక్షాలు రెండింటికీ కూడా చెడినవాడవడం చేత 'ఉభయ విభ్రష్టుడు' అని యోగభ్రష్టుణ్ణి పేర్కొనుచున్నాడు.

2. ఛిన్న మేఘం పూర్వమేఘం నుండి తెగినదై, తరువాత దానిని పొందజాలక మధ్యలోనే నశిస్తోంది. ఈ ఉభయ భ్రష్టుడిట్లు మధ్యలోనే నశింపడు కదా అని అర్జునుని భయం. –శ్రీధరస్వామి.

3. ఏతం మే. – పాఠాంతరం.

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = కృష్ణా; | హి | = ఏమన; |
| మే | = నా; | త్వదన్యః | = నీకంటే వేరైన ఋషి, దేవత; |
| ఏతత్ | = ఈ; | అస్య | = ఈ; |
| సంశయమ్ | = సందేహాన్ని; | సంశయస్య | = సందేహానికి; |
| అశేషతః | = సంపూర్ణంగా; | ఛేత్తా | = నివర్తకుడు; |
| ఛేత్తుమ్ | = త్రుంప, నివారింప; | న ఉపపద్యతే | = దొరకడు. |
| (నీవు) అర్హసి | = తగుదువు, యోగ్యుడవు; | | |

**తా॥** కృష్ణా! ఈ నా సందేహాన్ని సంపూర్ణంగా నివారించడానికి నీవే సమర్థుడవు; నీవు కాకుండా, తదితరులైన ఋషులు గాని దేవతలు గాని ఈ సంశయాన్ని తీర్చజాలరు. 39

*శ్రీ భగవానువాచ :*

**పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కళ్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40**

*పార్థ, న, ఏవ, ఇహ, న, అముత్ర, వినాశః, తస్య, విద్యతే,*
*న, హి, కళ్యాణ కృత్, కశ్చిత్, దుర్గతిమ్, తాత, గచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | న | = నరకప్రాప్తి మున్నగునవి కలుగవు; |
| ఉవాచ | = పలికెను; | తాత | = వత్సా; |
| పార్థ | = అర్జునా; | హి | = ఏమన; |
| తస్య | = వానికి, యోగభ్రష్టునికి; | కల్యాణకృత్ | = మంచి ఒనర్చువాడు; |
| ఇహ | = ఈ లోకంలో; | కశ్చిత్ | = ఎవ్వడూ; |
| వినాశః | = పాతిత్యం, శిష్టుల నింద; | దుర్గతిమ్ | = అధోగతిని; |
| న విద్యతే | = కలుగదు; | న గచ్ఛతి | = పొందడు. |
| అముత్ర ఏవ | = పరలోకంలో కూడా; | | |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* పార్థా! యోగభ్రష్టుడు వైదికకర్మలను త్యజించినవాడే అయినా, ఇహలోకంలో పాతిత్యాన్ని గాని నిందను గాని పొందడు. పరలోకంలో నరకాన్ని గాని హీనజన్మలను గాని పొందడు. ఎందుకంటే, నాయనా! శుభమొనర్చే వాడెన్నడూ కూడా దుర్గతిని పొందడు. 40

**ప్రాప్యపుణ్య కృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీస్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే ॥ 41**

*ప్రాప్య, పుణ్య కృతామ్, లోకాన్, ఉషిత్వా, శాశ్వతీః, సమాః,*
*శుచీనామ్, శ్రీమతామ్, గేహే, యోగభ్రష్టః, అభిజాయతే.*

| | | | |
|---|---|---|---|
| యోగభ్రష్టః | = యోగచ్యుతుడైనవాడు; | ఉషిత్వా | = అచ్చట నుండి; |
| పుణ్యకృతామ్ | = పుణ్యాత్ముల; | శుచీనామ్ | = సదాచారపరులూ; |
| లోకాన్ | = లోకాలను; | శ్రీమతామ్ | = ధనికులూ అయినవారి; |
| ప్రాప్య | = పొంది; | గేహే | = గృహంలో; |
| శాశ్వతీః | = పెక్కు; | అభిజాయతే | = పుడతాడు. |
| సమాః | = సంవత్సరాలు; | | |

**తా॥** యోగ భ్రష్టుడైనవాడు అశ్వమేధాది పుణ్యకర్మలను ఒనర్చేవారికి ప్రాప్యాలైన బ్రహ్మలోకాది శుభలోకాలను పొంది, అక్కడ చాలకాలం వసిస్తాడు; అనంతరం సదాచార సంపన్నులైన ధనికుల గృహంలో జన్మిస్తాడు. 41

**అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।**
**ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42**

*అథవా, యోగినామ్, ఏవ, కులే, భవతి, ధీమతామ్,*
*ఏతత్, హి, దుర్లభతరమ్, లోకే, జన్మ, యత్, ఈదృశమ్.*

| | | | |
|---|---|---|---|
| అథవా | = లేక; | ఈదృశమ్ | = ఇట్టిది; |
| ధీమతామ్ | = జ్ఞానులును; | యత్ జన్మ | = ఏ జన్మమున్నదో; |
| యోగినామ్ | = యోగులైన వారి; | ఏతద్ హి | = అది; |
| కులే ఏవ | = వంశంలోనే; | లోకే | = జగత్తులో; |
| భవతి | = జన్మిస్తాడు; | దుర్లభతరమ్ | = అత్యంతదుర్లభం. |

**తా॥** (కొద్దిగా అభ్యసించబడిన యోగం నుండి చ్యుతిచెందినవాని గతి చెప్పబడింది. ఇక చిరాభ్యస్తమైన యోగం నుండి భ్రష్టత పొందినవాని గతి చెప్పబడుతోంది.) లేక, యోగ భ్రష్టుడైన పురుషుడు జ్ఞానవంతులైన యోగుల వంశంలోనే జన్మిస్తాడు. ఇటువంటి జన్మ ఈ జగత్తులో అత్యంత దుర్లభం. 42

**తత్ర తం బుద్ధిసంయోగం లభ తే పౌర్వ దేహికమ్[1] ।**
**యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన ॥ 43**

*తత్ర, తమ్, బుద్ధి సంయోగమ్, లభ తే, పౌర్వదేహికమ్,*
*యతతే, చ, తతః, భూయః, సంసిద్ధౌ, కురునందన.*

కురునందన = అర్జునా;
తత్ర = ఆ జన్మములో;
పౌర్వదేహికమ్ = పుర్వజన్మలో పొందిన;
తమ్ = ఆ;
బుద్ధి సంయోగమ్ = మోక్షపరమైన బుద్ధిని;
లభతే = పొందుతాడు;
తతః = పూర్వజన్మలో ఒనర్చబడిన సాధన నుండి, పూర్వజన్మలో సంస్కారాల ప్రేరణతో;
సంసిద్ధౌ చ = సిద్ధిని పొందడానికి;
భూయః = అంతకంటే ఎక్కువగా;
యతతే = ప్రయత్నిస్తాడు.

**తా॥** (తరువాత యోగభ్రష్టుడు ఏం చేస్తాడంటావా?–) కురునందనా! యోగభ్రష్టుడు ఈ జన్మలో పూర్వజన్మ-సంస్కారాన్ని అనుసరించే బుద్ధిని పొంది, సిద్ధిని పొందుటకై మునుపటికంటె ఎక్కువగా ప్రయత్నం చేస్తాడు. 43

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44**

*పూర్వాభ్యాసేన, తేన, ఏవ, హ్రియతే, హి, అవశః, అపి, సః,*
*జిజ్ఞాసుః, అపి, యోగస్య, శబ్దబ్రహ్మ, అతివర్తతే.*

సః = అతడు;
అవశః అపి = తన వశం కాకయే,
తేన = ఆ;
పూర్వాభ్యాసేన ఏవ = పూర్వజన్మలో అభ్యాసంచే, యోగ సాధనచే;
హ్రియతే = ఆకర్షించబడతాడు;
యోగస్య = యోగస్వరూపాన్ని;
జిజ్ఞాసుః అపి = ఎరుగ కోరేవాడు కూడా;
శబ్ద బ్రహ్మ = వేదోక్తములైన కర్మలను అనుష్ఠిస్తే కలిగే ఫలాన్ని;
అతివర్తతే = అతిక్రమిస్తాడు.

**తా॥** అతడు పూర్వజన్మాభ్యాసం చేత తన వశం కాకయే, యోగసాధన వైపుకు ఆకర్షించబడుతున్నాడు. అదీ గాక, యోగస్వరూపాన్ని ఎరుగదలచినవాడు

1. పౌర్వదైహికమ్. – పాఠాంతరం.

కూడా, వేదోక్తములైన కర్మల ఫలాలను అతిక్రమించి, దానికంటే ఉన్నతమైన (జ్ఞాన) ఫలాన్ని పొంది ముక్తుడవుతున్నాడు. (గీత :4-33 చూ:) 44

**ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।**
**అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాఙ్గతిమ్ ॥ 45**

*ప్రయత్నాత్, యతమానః, తు, యోగీ, సంశుద్ధ కిల్బిషః,*
*అనేకజన్మ సంసిద్ధః, తతః, యాతి, పరామ్, గతిమ్.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | అనేక జన్మ సంసిద్ధః | = బహుజన్మ సాధనా ఫలంగా; |
| ప్రయత్నాత్ | = పూర్వజన్మకృతమైన యత్నం కంటే; | తతః | = అనంతరం; |
| యతమానః | = ఎక్కువగా ప్రయత్నిస్తూ; | పరాంగతిమ్ | = పరమగతిని, మోక్షాన్ని; |
| సంశుద్ధ కిల్బిషః | = నిష్పాపుడై; | యాతి | = పొందుతాడు. |
| యోగీ | = యోగి; | | |

**తా॥** యోగి పూర్వజన్మ కంటే ఎక్కువగా ప్రయత్నించి పాపం నుండి విడివడతాడు. అనంతరం పూర్వపూర్వములైన జన్మలలో సాధనాసంస్కారం చేత సిద్ధిని పొంది మోక్షాన్ని పొందుతున్నాడు. 45

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46**

*తపస్విభ్యః, అధికః, యోగీ, జ్ఞానిభ్యః, అపి, మతః, అధికః,*
*కర్మిభ్యః, చ, అధికః, యోగీ, తస్మాత్, యోగీ, భవ, అర్జున.*

| | | | |
|---|---|---|---|
| యోగీ | = ధ్యాననిష్ఠుడు, తత్త్వజ్ఞాని; | కర్మిభ్యః చ | = అగ్నిహోత్రాది కర్మలను అనుష్ఠించే వారికంటే; |
| తపస్విభ్యః | = కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సు ఒనర్చేవారి కంటే; | అధికః | = శ్రేష్ఠుడు; |
| అధికః | = శ్రేష్ఠుడు; | (అని) మతః | = తలపబడుచున్నాడు; |
| జ్ఞానిభ్యః అపి | = శాస్త్రార్థం ఎరిగిన పండితులు, శాస్త్రజ్ఞానుల కంటే; | తస్మాత్ | = కనుక; |
| | | అర్జున | = పార్థా; |
| అధికః | = శ్రేష్ఠుడు; | యోగీ | = తత్త్వజ్ఞానివి; |
| యోగీ | = తత్త్వజ్ఞాని; | భవ | = కమ్ము! |

**తా॥** యోగి (అంటే, తత్త్వజ్ఞాని, ధ్యాననిష్ఠుడు) కృచ్ఛ్ర చాంద్రాయణాది తపోనిష్ఠుల కంటే శ్రేష్ఠుడు, శాస్త్రజ్ఞులైన పండితుల కంటే కూడా అధికుడు. మరియు, అగ్నిహోత్రాది యజ్ఞపరాయణులైన కర్మఠుల కన్నా ఉన్నతుడు. కనుక, అర్జునా! నీవు యోగివి కమ్ము! 46

**యోగినామపి సర్వేషాం మద్గతేనాన్త రాత్మనా ।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ 47**

*యోగినామ్, అపి, సర్వేషామ్, మద్గతేన, అంతరాత్మనా,*
*శ్రద్ధావాన్, భజతే, యః, మామ్, సః, మే, యుక్తతమః, మతః.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | సర్వేషాం యోగినాం అపి | = రుద్రాదిత్యాది దేవతా ధ్యానపరులైన యోగులందరి కంటే; |
| శ్రద్ధావాన్ | = శ్రద్ధాయుక్తుడై; | యుక్తతమః | = సర్వశ్రేష్ఠుడైన; |
| మద్గతేన | = నాయందాసక్తమైన; | సః | = అతడు; |
| అంతరాత్మనా | = చిత్తంతో; | మే | = నాకు; |
| మామ్ | = నన్ను; | మతః | = సమ్మతుడు. |
| భజతే | = భజిస్తాడో; | | |

**తా॥** ఎవడు శ్రద్ధాళువై మద్గతచిత్తుడై నన్ను భజిస్తాడో అతడు రుద్రాదిత్యాది దేవతలను ధ్యానించే యోగుల కంటే కూడా శ్రేష్ఠుడు - నా కభిమతుడు. 47

**ఇతి శ్రీ మహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ధ్యానయోగో[1]నామః**
**షష్ఠోఽధ్యాయః**

శ్లోకసంఖ్య -47. మొదటి నుండి(233+47) 280.

1. ఈ అధ్యాయం అభ్యాసయోగం, ఆత్మసంయమయోగం, ఆత్మయోగం అని కూడా పేర్కొబడుతోంది.

**ఆత్మయోగ మవోచ ద్యో భక్తియోగ శిరోమణిః ।**
**తం వందే పరమానందం మాధవం భక్తశేవధిమ్ ॥**

తా॥ ఏ భక్తియోగ శిరోమణి (శ్రీకృష్ణుడు) ఆత్మయోగాన్ని (ధ్యానయోగాన్ని) చెప్పెనో; భక్తనిధియూ, పరమానందస్వరూపుడూ అయిన ఆ మాధవునికి వందనములను అర్పిస్తున్నాను.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## సప్తమోఽధ్యాయః - జ్ఞానవిజ్ఞాన యోగః

## (సప్తమాధ్యాయం - జ్ఞానవిజ్ఞాన యోగం)

విజ్ఞేయ మాత్మన స్తత్త్వం సంయోగం సముదాహృతమ్,
భజనీయ మ థేదానీ మీశ్వరం రూప మీర్యతే.[1]

*శ్రీ భగవానువాచ :*

**మయ్యాసక్త మనాః పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః ।**
**అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1**

*మయి, ఆసక్త మనాః, పార్థ, యోగమ్, యుంజన్, మదాశ్రయః,*
*అసంశయమ్, సమగ్రమ్, మామ్, యథా, జ్ఞాస్యసి, తత్, శృణు.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | సమగ్రమ్ | = ఐశ్వర్యాది సంపన్నమైన పూర్ణస్వరూపాన్ని; |
| మయి | = నాయందు; | అసంశయమ్ | = నిస్సంశయంగా; |
| ఆసక్త మనాః | = లగ్నచిత్తుడవూ; | యథా | = ఎట్లు; |
| మదాశ్రయః | =నా శరణాగతుడవూ అయి; | జ్ఞాస్యసి | = తెలిసికొనగలవో; |
| యోగమ్ | = యోగాన్ని; | తత్ | = దానిని; |
| యుంజన్ | = అభ్యసిస్తూ; | శృణు | = విను. |
| మామ్ | = నా; | | |

1. విశేషంగా తెలుసుకోదగిన ఆత్మతత్త్వం యోగంతోబాటు చెప్పబడింది; ఇక భజన విషయమైన ఈశ్వర స్వరూపం వర్ణింపబడుతోంది.

**తా॥** (పూర్వాధ్యాయాంతంలో 'మద్గతచిత్తుడై నన్ను భజించేవాడు యోగులందరిలోనూ శ్రేష్ఠుడు' అని చెప్పబడింది. భక్తిభాజనుడవైన నీ స్వరూపం ఎటువంటిది? అనే ప్రశ్నను అపేక్షించి, స్వస్వరూపాన్ని నిరూపిస్తూ-) శ్రీభగవానుడు పలికెను: పార్థా! సర్వవిధాల నా శరణాగతుడవై, (అగ్నిహోత్ర తపోదానాదుల ఫలాలను గ్రహించకుండా) నా యందు మనస్సును నిలిపి యోగాన్ని అభ్యసిస్తూ, విభూతి బలశక్త్యైశ్వర్యాది సంపన్నమైన నా పూర్ణస్వరూపాన్ని నిస్సంశయంగా తెలుసుకోగలిగే రీతిని విను. 1

**జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్యశేషతః ।**
**యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే ॥ 2**

జ్ఞానమ్, తే, అహమ్, సవిజ్ఞానమ్, ఇదమ్, వక్ష్యామి, అశేషతః,
యత్, జ్ఞాత్వా, న, ఇహ, భూయః, అన్యత్, జ్ఞాతవ్యమ్, అవశిష్యతే.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | న అవశిష్యతే | = కొఱవడి ఉండదో; |
| తే | = నీకు; | ఇదమ్ | = ఈ; |
| యత్ | = దేనిని; | సవిజ్ఞానమ్ | = విజ్ఞానంతోకూడిన, అనుభవోపాయంతో కూడిన; |
| జ్ఞాత్వా | = గ్రహిస్తే; | | |
| ఇహ | = ఈ శ్రేయోమార్గంలో; | జ్ఞానమ్ | = జ్ఞానాన్ని, బ్రహ్మతత్త్వాన్ని; |
| భూయః | = మళ్ళీ ఇక; | అశేషతః | = సంపూర్ణంగా; |
| అన్యత్ | = ఇంకొకటి; | వక్ష్యామి | = చెబుతున్నాను. |
| జ్ఞాతవ్యమ్ | =తెలుసుకోదగింది; | | |

**తా॥** నేను నీకు అనుభవోపాయంతో కూడిన బ్రహ్మ తత్త్వాన్ని సంపూర్ణంగా చెబుతున్నాను; దీనిని గ్రహిస్తే ఈ శ్రేయోమార్గంలో (ఇహ లోకంలో) మరి తెలుసుకోదగినది ఏదీ మిగలదు.[1] 2

---

1. (అ) కస్మిన్నుభగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి. - ముండకోపనిషత్తు 1-3.
దేనిని తెలుసుకుంటే ఇదంతా తెలియనగును?
(ఆ) 'యేనాశ్రుతగ్ం శ్రుతం భవత్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్' - ఛాందోగ్యోపనిషత్తు 6-1-3.
బ్రహ్మాన్ని తెలుసుకుంటే అశ్రుతం శ్రుతమూ, అమతం మతమూ, అవిజ్ఞాతం విజ్ఞాతమూ అవుతాయి.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3**

*మనుష్యాణామ్, సహస్రేషు, కశ్చిత్, యతతి, సిద్ధయే,*
*యతతామ్, అపి, సిద్ధానామ్, కశ్చిత్, మామ్, వేత్తి, తత్త్వతః.*

మనుష్యాణాం సహస్రేషు= వేల జనులలో;
కశ్చిత్ = ఒకానొకడు;
సిద్ధయే = సిద్ధికై, ఆత్మజ్ఞానం కోసం;
యతతి = ప్రయత్నిస్తాడు;
యతతామ్ = ఇలా ప్రయత్నించే;
సిద్ధానామ్ అపి = ముముక్షువులలో కూడా;
కశ్చిత్ = ఎవరో ఒక్కడే;
మామ్ = నన్ను;
తత్త్వతః = యథార్థంగా;
వేత్తి = తెలుసుకుంటున్నాడు.

**తా॥** (నాపై భక్తి లేకుంటే నా జ్ఞానం కలగడం దుర్లభం, మనుష్యేతరాలైన అసంఖ్యాక జీవులకు శ్రేయోమార్గ ప్రవృత్తియే లేదు. జ్ఞానయోగ్యులైన) మనుష్యులలో వేలల్లో ఏ ఒక్కడో ఆత్మజ్ఞానాన్ని పొందడానికి ప్రయత్నిస్తాడు. ఇలా ప్రయత్నించే ముముక్షువులలో కూడా ఎవరో ఒకడు అరుదుగా, నన్ను యథార్థంగా తెలుసుకోగలుగుతున్నాడు. (దుర్లభమైన ఇటువంటి ఆత్మతత్త్వాన్ని నీకు చెబుతున్నాను.) 3

**భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ 4**

*భూమిః, ఆపః, అనలః, వాయుః, ఖమ్, మనః, బుద్ధిః, ఏవ, చ,*
*అహఙ్కారః, ఇతి, ఇయమ్, మే, భిన్నా, ప్రకృతిః, అష్టధా.*

భూమిః = పృథ్వి;
ఆపః = నీరు;
అనలః = అగ్ని;
వాయుః = గాలి;
ఖమ్ = ఆకాశం;
మనః= సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు;
బుద్ధిః = నిశ్చయాత్మికమైన బుద్ధి;
అహఙ్కారః ఏవ చ = 'నేను' అనే అహంకారం;
ఇతి = అని;
ఇయమ్ = ఈ;
మే = నా;
ప్రకృతిః = మాయాశక్తి;
అష్టధా = ఎనిమిది విధాలుగ;
భిన్నా = విభక్తము.

**తా॥** (ఈవిధంగా శ్రోతయైన అర్జునుణ్ణి ఏకాగ్రచిత్తుణ్ణి చేసి, ప్రకృతి సహాయంతో సృష్టినొనర్చు ఈశ్వరతత్త్వాన్ని నిరూపింపగోరి, ముందుగా ప్రకృతిని వర్ణిస్తున్నాడు :) భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం అని ఎనిమిది విధాలుగా నా మాయాశక్తి విభజించబడింది.[1] 4

**అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।**
**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 5**

*అపరా, ఇయమ్, ఇతః, తు, అన్యామ్, ప్రకృతిమ్, విద్ధి, మే, పరామ్, జీవభూతామ్, మహాబాహో, యయా, ఇదమ్, ధార్యతే, జగత్.*

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా; | యయా | = దేని చేత; |
| ఇయమ్ | = ఈ పూర్వోక్తమైనది; | ఇదమ్ | = ఈ; |
| అపరా | = అపర ప్రకృతి (నికృష్టమైనది); | జగత్ | = జగత్తు; |
| తు | = కాని; | ధార్యతే | = ధరింపబడుతోందో; |
| ఇతః | = దీనికంటే; | (అట్టి) మే | = నా; |
| అన్యామ్ | = వేరైనదీ, | పరామ్ | = శ్రేష్ఠమైన; |
| జీవభూతామ్ | = క్షేత్రజ్ఞుడనబడేది, ప్రాణధారణకు నిమిత్తమైనది; | ప్రకృతిమ్ | = ప్రకృతిని; |
| | | విద్ధి | = తెలుసుకో. |

**తా॥** అర్జునా! అష్టవిధమైన ఈ ప్రకృతిని అపరం (నికృష్టం) అని గ్రహించు. (ఎందుకంటే, ఇది జడమూ, పదార్థమూ అయి ఉంది.) దీనికంటే వేరైన నా పరా ప్రకృతి (శ్రేష్ఠమైన చేతనా రూపమూ) జీవస్వరూపంగా ప్రకాశిస్తోంది. (జగత్తులో అంతఃప్రవిష్టమైన) ఈ జీవభూతమైన ప్రకృతే జగత్తును ధరిస్తోంది. 5

**ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ 6**

---

1. ఈ జగత్తు ఐదుభూతాల సమష్టి. ఈ పంచభూతాలు సూక్ష్మములూ, అపంచీకృతములూ అయిన పంచతన్మాత్రలను సూచిస్తున్నాయి. మనస్సు = మనస్సుకు కారణమైన అహంకారం, బుద్ధి = అహంకారానికి కారణమైన మహత్తత్త్వం, అహంకారం = అవిద్యాసంయుక్తమైన అవ్యక్తం. చతుర్వింశతి భేదభిన్నమైన ఈ ప్రకృతి, అష్టవిధభేదాంతర్గతమొనర్చబడి ఇక్కడ వర్ణింపబడింది.

(గీత : 13–5, 6 చూ; ఇటువంటి వర్ణనల నిమిత్తం శ్రీమద్భాగవతం : 11–22 చూ.)

*ఏతత్ యోనీని, భూతాని, సర్వాణి, ఇతి, ఉపధారయ,*
*అహమ్, కృత్స్నస్య, జగతః, ప్రభవః, ప్రళయః, తథా.*

| | | | |
|---|---|---|---|
| సర్వాణి భూతాని | = చేతనాచేతనాలైన సమస్త భూతాలనూ; | అహమ్ | = నేను; |
| ఏతత్ యోనీని | = ఉభయవిధాలైన ఈ ప్రకృతి నుండి కలిగినవి; | కృత్స్నస్యజగతః | = సమస్త జగత్తుకు; |
| ఇతి | = అని; | ప్రభవః | = ఉత్పత్తి స్థానాన్ని; |
| ఉపధారయ | = తెలుసుకో;(కనుక) | తథా | = అదే విధంగా; |
| | | ప్రలయః | = ప్రళయకారణాన్ని. |

**తా॥** (పర–అపర ప్రకృతులను వర్ణించి వాటి ద్వారా తన సృష్టి కారణాన్ని వర్ణిస్తున్నాడు:) ఈ నా ఉభయ విధ ప్రకృతి నుండి జడ–చేతనాత్మకాలైన (క్షేత్రక్షేత్రజ్ఞ రూపమైన) సర్వభూతాలు జనిస్తున్నాయి –అని గ్రహించు. (జడ ప్రకృతి దేహరూపంలో పరిణతమై క్షేత్రం అవుతోంది. నా అంశయైన చేతనప్రకృతి భోక్తృరూపంలో దేహంలో ప్రవిష్టమై, స్వకర్మ చేత దేహాన్ని ధరిస్తూ జీవుడు అని అనబడుతోంది. ఈ రెండు ప్రకృతులూ నా నుండి కలిగినవే. కనుక –) నేను సప్రకృతికమైన సమస్త జగత్తుకు సృష్టి ప్రళయాలకు కారణభూతుణ్ణి. 6

**మత్తః పరతరం నాన్యత్ కిఞ్చిదస్తి ధనఞ్జయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7**

*మత్తః, పరతరమ్, న, అన్యత్, కించిత్, అస్తి, ధనఞ్జయ,*
*మయి, సర్వమ్, ఇదమ్, ప్రోతమ్, సూత్రే, మణిగణాః, ఇవ.*

| | | | |
|---|---|---|---|
| ధనఞ్జయ | = అర్జునా; | సూత్రే | = దారానికి గుచ్చబడిన; |
| మత్తః | = నాకంటే; | మణిగణాః ఇవ | = మణుల వలె; |
| పరతరమ్ | = శ్రేష్ఠతరమైన కారణం; | ఇదమ్ | = ఈ; |
| అన్యత్ | = వేరొకటి; | సర్వమ్ | = జగత్తు; |
| కించిత్ | = ఏదీ కూడా; | మయి | = నాయందు; |
| న అస్తి | = లేదు; | ప్రోతమ్ | = ఆశ్రయించుకుని ఉంది. |

**తా॥** ధనంజయా! నాకంటె శ్రేష్ఠతరమైన జగత్కారణం వేరొకటి లేదు. దారానికి మణులవలె (తంతువుల పటమువలె) ఈ జగత్తంతా కూడా ఆత్మభూతుడనైన నా యందు అనుగతమై, నాచే ధరించబడుతోంది. 7

**రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశి సూర్యయోః ।**
**ప్రణవస్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥** **8**

*రసః, అహమ్, అప్సు, కౌన్తేయ, ప్రభా, అస్మి, శశిసూర్యయోః, ప్రణవః, సర్వ వేదేషు, శబ్దః, ఖే, పౌరుషమ్, నృషు.*

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = కుంతీపుత్రా; | ప్రణవః | = ఓంకారాన్ని; |
| అహమ్ | = నేను; | ఖే | = ఆకాశంలో; |
| అప్సు | = నీటిలో; | శబ్దః | = శబ్ద తన్మాత్రను; |
| రసః | = రసతన్మాత్రను; | నృషు | = మనుష్యులలో; |
| శశి సూర్యయోః | = చంద్రసూర్యులలో; | పౌరుషమ్ | = పురుషకారాన్ని; |
| ప్రభా | = జ్యోతిని; | అస్మి | = అయి ఉన్నాను. |
| సర్వవేదేషు | = నాలుగువేదాలలో; | | |

**తా॥** కౌంతేయా! నీటిలోని రస తన్మాత్ర,[1] చంద్రసూర్యులలో జ్యోతి, చతుర్వేదాలలో ఓంకారం, ఆకాశంలో శబ్దం, మనుష్యులలో పురుషకారం నేనే అయి ఉన్నాను.[2] 8

**పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।**
**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥** **9**

*పుణ్యః, గంధః, పృథివ్యామ్, చ, తేజః, అస్మి, విభావసౌ, జీవనమ్, సర్వభూతేషు, తపః, చ, అస్మి, తపస్విషు.*

| | | | |
|---|---|---|---|
| పృథివ్యామ్ | = భూమిలో; | తేజః | = దీప్తిని; |
| పుణ్యః | = పవిత్రమైన; | (నేనే) అస్మి | = అయి ఉన్నాను; |
| గంధః | = గంధతన్మాత్రను; | సర్వభూతేషు | = సర్వభూతాలలో; |
| విభావసౌ చ | = అగ్నిలో కూడా; | జీవనమ్ | = ప్రాణం(ఆయువును); |

1. నీటి సారం రసం; ఆ రసస్వరూపుడను నేనే, కనుక జలం నాలో అనుగతమై ఉంది. ఇదేవిధంగా మిగిలిన వానిపట్ల కూడా అన్వయించుకోవాలి. –శ్రీశంకరులు.

2. రసతన్మాత్ర అనే విభూతిని ఆశ్రయించి జలంలో నేనే వెలయుచూ, జలానికి ఆశ్రయం అవుతున్నాను. ఇదే విధంగా చంద్రసూర్యులలో కూడా ప్రకాశరూపమైన విభూతితో వెలయుచూ, వారికి ఆశ్రయం అవుతోంది నేనే. ఇదే విధంగా తక్కిన వాటిపట్ల కూడా. –శ్రీధరస్వామి.

| | | | |
|---|---|---|---|
| తపస్విషు చ | = తాపసులలో; | అస్మి | = అయి ఉన్నాను. |
| తపః | = తపస్సు (శీతోష్ణాది ద్వంద్వసహన సామర్థ్యాన్ని); | | |

**తా॥** నేను పృథివియందు పవిత్ర[1] గంధం గానూ, అగ్నియందు దీప్తి గానూ, జీవులందరిలోను ప్రాణవాయువు గానూ, వానప్రస్థాదులైన తపస్వులలో ద్వంద్వసహన రూపమైన తపశ్శక్తి గానూ విరాజిల్లుతున్నాను. 9

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।**
**బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినా మహమ్ ॥ 10**

*బీజమ్, మామ్, సర్వభూతానామ్, విద్ధి, పార్థ, సనాతనమ్,*
*బుద్ధిః, బుద్ధిమతామ్, అస్మి, తేజః, తేజస్వినామ్, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | బుద్ధిమతామ్ | = వివేకం గలవారి; |
| మామ్ | = నన్ను; | బుద్ధిః | = వివేకశక్తి; |
| సర్వభూతానామ్ | = స్థావరజంగమాలైన సకల భూతాలకు; | తేజస్వినామ్ | = తేజస్వంతుల, ప్రాగల్భ్యంతో నొప్పు వారి (ధీరుల); |
| సనాతనమ్ | = నిత్యమైన; | తేజః | = తేజస్సును; |
| బీజమ్ | = కారణంగా; | అహమ్ అస్మి | = నేనైవున్నాను. |
| విద్ధి | = తెలుసుకో; | | |

**తా॥** అర్జునా! నన్ను స్థావర-జంగమాలైన సకల భూతాలకు సనాతనమైన కారణంగా తెలుసుకో. నేను వివేకులైన వారిలో వివేకబుద్ధిని, తేజస్వంతులైన వారి తేజస్సును కూడా అయి ఉన్నాను. 10

**బలం బలవతామస్మి[2] కామరాగ వివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ 11**

*బలమ్, బలవతామ్, అస్మి, కామరాగ వివర్జితమ్,*
*ధర్మ అవిరుద్ధః, భూతేషు, కామః, అస్మి, భరతర్షభ.*

1. పృథివికి గల గంధం స్వాభావికంగా పవిత్రమే అయి ఉన్నది; అదే విధంగా రసాదులయందు కూడా. కాని, అపవిత్రత ప్రాణుల అధర్మాన్ని అపేక్షించి ఏర్పడుతోంది. -శ్రీ శంకరులు.
2. చాహమ్. - పాఠాంతరం.

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ | = అర్జునా; | భూతేషు | = జీవులలో ఉండే; |
| బలవతామ్ | = బలవంతుల; | ధర్మ అవిరుద్ధః | = శాస్త్ర విరుద్ధం కాని; |
| కామరాగ వివర్జితమ్ | = ఆశ, ప్రీతి లేని; | కామః | = అభిలాష; |
| బలమ్ | = సామర్థ్యం; | అస్మి | = అయి ఉన్నాను. |
| అస్మి | = అయి ఉన్నాను; | | |

**తా॥** భరత శ్రేష్ఠా! బలవంతులైన వారియందుండే కామరాగ[1] వివర్జితమైన స్వధర్మానుష్ఠాన సామర్థ్యాన్ని నేనే అయి ఉన్నాను. మరియు, జీవులలో ఉండే శాస్త్రవిరుద్ధం కాని (దేహధారణ నిమిత్తమైన ఆహారాది విషయమైన, లేక స్వదారయందు పుత్రోత్పాదన మాత్రోపయోగమైన) కామాన్ని నేనే.[2] 11

**యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12**

*యే, చ, ఏవ, సాత్త్వికాః, భావాః, రాజసాః, తామసాః, చ, యే,*
*మత్తః, ఏవ, ఇతి, తాన్, విద్ధి, న, తు, అహమ్, తేషు, తే, మయి.*

| | | | |
|---|---|---|---|
| యే చ ఏవ | = మరియు, సమస్తమైన ఏ; | ఇతి | = అని; |
| సాత్త్వికాః | = సాత్త్వికాలైన; | విద్ధి | = తెలుసుకో; |
| భావాః | = పదార్థాలూ; | తు | = కాని; |
| యే చ | = మరియు ఏ సమస్త; | అహమ్ | = నేను; |
| రాజసాః | = రాజసిక పదార్థాలూ; | న తేషు | = వాటి ఆధీనుడను కాను; |
| తామసాః | = తామసిక పదార్థాలూ; | తే | = అవి అన్నీ కూడా; |
| (కలవో); తాన్ | = వాటన్నిటినీ; | మయి | = నా ఆధీనాలు. |
| మత్తః ఏవ | = నా నుండే కలిగినవి; | | |

**తా॥** జీవులలో సాత్త్విక రాజసిక తామసికాలైన (శమదమాదులు, హర్షదర్పాలు, శోక మోహాలు అయిన) ఏయే భావాలు వారివారి కర్మల చేత

1. అప్రాప్త వస్తువును పొందడానికి కలిగే ఇచ్ఛ కామం. ప్రాప్త వస్తువు నశ్వరమే అయినా కూడా దానిని శాశ్వతమని నమ్ముతూ, దానిని ప్రేమించడమే రాగం. మొదటిది రజోగుణాత్మకం, రెండవది తామసం. ఇక స్వధర్మానుష్ఠాన సామర్థ్యం సాత్త్వికం.

2. ఇక్కడ జగత్-స్థితి హేతువులు పదునాల్గు పేర్కోబడ్డాయి.

కలుగుతున్నాయో, వాటిని నా నుండి కలిగిన వాటిగానే తెలుసుకో. అవి నా నుండే కలిగినా కూడా, నేను వాటికి ఆధీనుడను కాను, అవే నా ఆధీనంలో ఉన్నాయి.[1] 12

**త్రిభిర్గుణ మయైర్భావైః ఏభిః సర్వమిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ 13**

*త్రిభిః, గుణమయైః, భావైః, ఏభిః, సర్వమ్, ఇదమ్, జగత్,*
*మోహితమ్, న, అభిజానాతి, మామ్, ఏభ్యః, పరమ్, అవ్యయమ్.*

| | | | |
|---|---|---|---|
| ఏభిః | = ఈ; | సర్వం జగత్ | = ప్రాణి సమూహం; |
| త్రిభిః | = మూడు; | ఏభ్యః | = ఈ గుణజాతాలైన భావాల కంటే; |
| గుణమయైః | = గుణవికారాలైన; | పరమ్ | = వ్యతిరిక్తుడు(విలక్షణుడు); |
| భావైః | = రాగద్వేషమోహాది భావాలతో; | అవ్యయమ్ | = వినాశరహితుడూ అయిన; |
| మోహితమ్ | = వివేకశూన్యమై భ్రాంతిచెంది; | మామ్ | = నన్ను(పరమేశ్వరుని); |
| ఇదమ్ | = ఈ; | న అభిజానాతి | = తెలుసుకోలేకుంది. |

**తా॥** (ఇటువంటి ఈశ్వరుడవైన నిన్ను లోకం ఎందుకు తెలుసుకోలేకుంది? అంటావా :) త్రిగుణజాతమైన ఈ రాగద్వేషమోహాదుల చేత ప్రాణిసమూహం భ్రాంతి చెంది, ఈ భావాలకు అతీతమూ, అవ్యయమూ, నిరుపాధికమూ అయిన నా స్వరూపాన్ని గ్రహించలేక పోతోంది. (*గీత:* 3-5, 27, 29; 13-19, 21, 23; 14-5, 19, 23, 25; 18-41 చూ:) 13

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥ 14**

*దైవీ, హి, ఏషా, గుణమయీ, మమ, మాయా, దురత్యయా,*
*మామ్, ఏవ, యే, ప్రపద్యన్తే, మాయామ్, ఏతామ్, తరన్తి, తే.*

1. నేనే పరమార్థ సత్యాన్ని, అవి నాయందు కల్పితాలు. కల్పిత వస్తువు సత్త, అధిష్ఠానసత్తనే ఆశ్రయించుకొని ఉంటుంది. స్థాణువులో పురుష భ్రమ కలిగినట్లయితే, స్థాణువులో పురుషుడు కల్పించబడుతున్నాడు. కాని పురుషునిలో స్థాణువు కల్పించబడడం లేదు.

| | | | |
|---|---|---|---|
| హి | = ఏమన; | మాం ఏవ | = నన్నే; |
| ఏషా | = ఈ (అనుభవసిద్ధమైన); | ప్రపద్యన్తే | = శరణువేడుతున్నారో (ఆశ్రయిస్తున్నారో); |
| గుణమయీ | = త్రిగుణమయమైన; | తే | = వారు; |
| మమ | = నా; | ఏతామ్ | = ఈ; |
| దైవీమాయా | = అలౌకికమైన అవిద్య; | మాయామ్ | = మాయను; |
| దురత్యయా | = దురతిక్రమ్యం (దాట శక్యం కానిది); | తరన్తి | = దాటుచున్నారు. |
| యే | = ఎవరు; | | |

**తా॥** (మరి ఎవరు గ్రహించగలుగుతారు అని అంటావా? –) అలౌకికం అంటే అత్యద్భుతమూ త్రిగుణాత్మకమూ అయిన నా మాయను[1] అతిక్రమించడం అత్యంత కష్టం (అని ప్రసిద్ధి); కాని ఎవరు ఇతర సాధనలపై నిర్భరపడక నన్నే ఆశ్రయిస్తున్నారో (భజిస్తున్నారో) వారే దుస్తరమైన ఈ మాయను[2] అతిక్రమిస్తున్నారు. అంటే, నన్ను తెలుసుకుని, సంసారబంధం నుండి ముక్తులవుతున్నారు.
(*గీత* : 18–66 చూ :)[3] 14

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।**
**మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15**

న, మామ్, దుష్కృతినః, మూఢాః, ప్రపద్యంతే, నరాధమాః, మాయయా, అపహృతజ్ఞానాః, ఆసురమ్, భావమ్, ఆశ్రితాః.

| | | | |
|---|---|---|---|
| దుష్కృతినః | = దుష్కర్ములు (పాపులు); | అపహృత జ్ఞానాః | = నష్ట వివేకులు అయినవారు; |
| మూఢాః | = అజ్ఞులును; | ఆసురం భావమ్ | = రాక్షస స్వభావాన్ని; |
| నరాధమాః | = నీచులును; | ఆశ్రితాః | = ఆశ్రయించి; |
| మాయయా | = మాయచేత; | మామ్ | = నన్ను; |
| | | న ప్రపద్యంతే | = భజించరు. |

1. దీనిచేత సాంఖ్యోక్తమైన స్వతంత్ర-ప్రకృతి నిషిద్ధమవుతోంది.
2. ఈ మాయ అనుభవసిద్ధం. తటాలున దీనిని లేదనజాలం.
3. శ్వేతాశ్వతరోపనిషత్తు 1–10 చూ. దేవీ సప్తశతి. 1–55 చూ:

**తా॥** దుష్కర్ములూ, అజ్ఞులూ, నీచులూ అయిన వారి వివేకం మాయచేత కప్పబడిపోయి, వారు ఆసుర స్వభావాన్ని (దంభ, దర్ప, అభిమాన, క్రోధ, పారుష్యాలను) పొంది, నన్ను భజింపకున్నారు. (గీత : 16-20 చూ:) 15

**చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ ॥ 16**

*చతుర్విధాః, భజంతే, మామ్, జనాః, సుకృతినః, అర్జున,*
*ఆర్తః, జిజ్ఞాసుః, అర్థ అర్థీ, జ్ఞానీ, చ, భరతర్షభ.*

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ | = భరతశ్రేష్ఠా; | జిజ్ఞాసుః | = తత్త్వజ్ఞానార్థి; |
| అర్జున | = పార్థా; | అర్థ అర్థీ | = ఇహపరలోకాల ధనసుఖాలను కోరువాడు; |
| చతుర్విధాః | = నాలుగురీతులైన; | | |
| సుకృతినః | = పుణ్యాత్ములైన; | జ్ఞానీ చ | = జ్ఞాని (అనువారు) |
| జనాః | = జనులు; | మామ్ | = నన్ను; |
| ఆర్తః | = విపన్నుడు; | భజంతే | = భజిస్తున్నారు. |

**తా॥** భరతశ్రేష్ఠా! అర్జునా! విపన్నుడు, తత్త్వజిజ్ఞాసువు, అర్థకామి, తత్త్వజ్ఞాని అనే పుణ్యాత్ములు నలుగురు నన్ను భజిస్తున్నారు. 16

**తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏక భక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం స చ మమ ప్రియః ॥ 17**

*తేషామ్, జ్ఞానీ, నిత్యయుక్తః, ఏక భక్తిః, విశిష్యతే,*
*ప్రియః, హి, జ్ఞానినః, అత్యర్థమ్, అహమ్, సః, చ, మమ, ప్రియః.*

| | | | |
|---|---|---|---|
| తేషామ్ | = ఈ నలుగురిలో; | అహమ్ | = నేను; |
| నిత్యయుక్తః | = సర్వదా నాయందు సమాహితుడైనవాడూ; | జ్ఞానినః | = జ్ఞానికి; |
| | | అత్యర్థమ్ | = అత్యంతం; |
| ఏకభక్తిః | = ఏకనిష్ఠుడు(మన్నిష్ఠుడును); | ప్రియః | = ప్రియమైనవాణ్ణి; |
| జ్ఞానీ | = తత్త్వజ్ఞుడూ అయినవాడు; | స చ | = అతడు కూడా; |
| విశిష్యతే | = శ్రేష్ఠుడు; | మమ | = నాకు; |
| హి | = ఏమనన; | ప్రియః | = ప్రీతిపాత్రుడు. |

**తా॥** ఈ నలుగురు భక్తులలో నిత్యయుక్తుడూ, ఏక నిష్ఠుడూ అయిన తత్త్వజ్ఞానియే శ్రేష్ఠుడు; ఎందుకంటే నేను జ్ఞానికి అత్యంత ప్రియమైనవాణ్ణి, జ్ఞాని కూడా నాకు అత్యంత ప్రియమైనవాడు.[1] (శ్రీ వాసుదేవుడు జ్ఞాని యొక్క ఆత్మ అవడం చేత వాసుదేవుడు జ్ఞానికి ప్రియుడు. జ్ఞాని వాసుదేవుని ఆత్మ అవడం చేత, జ్ఞాని వాసుదేవునికి ప్రీతిపాత్రుడు.) 17

**ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।**
**ఆస్థిత స్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ 18**

ఉదారాః, సర్వే, ఏవ, ఏతే, జ్ఞానీ, తు, ఆత్మా, ఏవ, మే, మతమ్,
ఆస్థితః, సః, హి, యుక్తాత్మా, మామ్, ఏవ, అనుత్తమామ్, గతిమ్.

| | | | |
|---|---|---|---|
| ఏతే | = వీరు; | హి | = ఏమన; |
| సర్వేఏవ | = అందరూ కూడా; | సః | = ఆ; |
| ఉదారాః | = గొప్పవారే; | యుక్తాత్మా | = ఏకాగ్రచిత్తుడు; |
| తు | = కాని; | అనుత్తమామ్ | = అతిఉత్తమమైన; |
| జ్ఞానీ | = తత్త్వజ్ఞుడు; | గతిమ్ | = గతిగా (గమ్యంగా); |
| ఆత్మా ఏవ | = నా ఆత్మస్వరూపుడే; | మాం ఏవ | = నన్నే; |
| (అని) మే | = నా; | ఆస్థితః | = ఆశ్రయించుకొని ఉన్నాడు. |
| మతమ్ | = అభిప్రాయం; | | |

**తా॥** వీరందరూ గొప్పవారే, మరియు నాకు ప్రియమైనవారు కూడా. ఏ భక్తుడూ నాకు అప్రియుడు కాదు. కాని జ్ఞాని నాకు అత్యంత ప్రియమైనవాడు. ఏమన, జ్ఞాని నా ఆత్మ స్వరూపుడు – ఇది నా అభిప్రాయం. ఆత్మసమాహితుడైన ఈ జ్ఞాని నన్నే పరమగతిగా ఆశ్రయించుకుని ఉంటాడు. (అంటే, 'నేను భగవంతుడైన వాసుదేవుణ్ణి; స్వరూపంచేత నేను అన్యుణ్ణి కాను' అనే బుద్ధి జ్ఞానికి సర్వదా దృఢమై ఉంటుంది.) 18

---

1. ద్రౌపదీ గజేంద్రాదులు ఆర్తభక్తులు; ఉద్ధవుడు జిజ్ఞాసువు;
ధ్రువుడు అర్థకామి; ప్రహ్లాదుడు తత్త్వజ్ఞాని.

ఇందులో ఏకాంత భక్తి నిత్యయుక్తత్వాలు జ్ఞానికొక్కనికే కలుగ గలవు. ఏలయన, అతనికి దేహాభిమానం లేకుండుట చేత చిత్తవిక్షేపం కలుగదు.

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।**
**వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19**

*బహూనామ్, జన్మనామ్, అంతే, జ్ఞానవాన్, మామ్, ప్రపద్యతే, వాసుదేవః, సర్వమ్, ఇతి, సః, మహాత్మా, సుదుర్లభః.*

| | | | |
|---|---|---|---|
| బహూనామ్ | = పెక్కు; | వాసుదేవః | = వాసుదేవుడే; |
| జన్మనామ్ | = జన్మల; | ఇతి | = అని; |
| అంతే | = చివర (సాధనఫలంగా); | ప్రపద్యతే | = భజిస్తాడు; |
| జ్ఞానవాన్ | = ఈ తత్త్వజ్ఞాని; | (కనుక) సః | = ఇటువంటి; |
| మామ్ | = నన్ను; | మహాత్మా | = మహాత్ముడు; |
| సర్వమ్ | = చరాచర జగత్తంతా; | సుదుర్లభః | = మిక్కిలి అరుదు. |

**తా॥** బహుజన్మల సాధనా ఫలంగా (పెక్కుజన్మలలో కొంచెం కొంచెంగా ఒనర్చబడిన పుణ్యఫలంగా) చివరి జన్మలో తత్త్వజ్ఞాని 'ఈ జగత్తు వాసుదేవుడే' (బ్రహ్మమే)[1] అని గ్రహించి (సర్వాత్మ దృష్టియై) నన్ను భజిస్తాడు. కనుక, (అపరిచ్ఛిన్న దృష్టి గల) ఇలాంటి మహాపురుషుడు అత్యంత దుర్లభుడు. (*గీత:* 7–3 చూ.)19

**కామైస్తైస్తైర్హృత జ్ఞానాః ప్రపద్యన్తేఽన్య దేవతాః ।**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా ॥ 20**

*కామైః, తైః, తైః, హృత జ్ఞానాః, ప్రపద్యంతే, అన్య దేవతాః, తమ్, తమ్, నియమమ్, ఆస్థాయ, ప్రకృత్యా, నియతాః, స్వయా.*

| | | | |
|---|---|---|---|
| తైః తైః | = ఆయా; | ఆస్థాయ | = ఆచరించి; |
| కామైః | = పుత్రపశుస్వర్గాది విషయవాంఛలచే; | స్వయా | = తమ; |
| | | ప్రకృత్యా | = స్వభావం చేత; |
| హృత జ్ఞానాః | = నష్టవివేకులైనవారు; | నియతాః | = వశీకృతులై; |
| తం తమ్ | = ఆయా కోరికలకు తగిన; | అన్యదేవతాః | = వాసుదేవునికంటే ఇతరులైన దేవతలను; |
| నియమమ్ | = జప ఉపవాసాది నియమాలను; | ప్రపద్యంతే | = సేవిస్తున్నారు. |

1. (అ) సర్వభూతాదివాసం చ య ద్భూతేషు వస త్యపి ।
సర్వానుగ్రహకత్వేనతదస్మ్యహం వాసుదేవః ॥ – బ్రహ్మబిందూపనిషత్తు. 12
(ఆ) సర్వం ఖల్విదం బ్రహ్మ – ఛాందోగ్యోపనిషత్తు. 3–14–1.

**తా॥** [సకామకర్మపరులు కూడా పరమేశ్వరుణ్ణి భజించి కామాలను పొంది క్రమంగా ముక్తులవుతారని వెనుక (గీత : 3–10; 4–30) చెప్పబడింది. ఇప్పుడు, అత్యంత రజస్తమోభిభూతులైన వారి నడవడి చెప్పబడుతోంది:] పుత్ర-పశు-స్వర్గాది వాంఛల చేత నష్టవివేకులైన వారు జప-ఉపవాసాదులను ఆచరిస్తూ, తమ స్వభావానుగుణంగా వాసుదేవేతరాలను, అంటే పరమాత్మేతరాలైన భూత-ప్రేత-యక్షాది దేవతా విశేషాలను సేవిస్తున్నారు. 20

**యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥ 21**

*యః, యః, యామ్, యామ్, తనుమ్, భక్తః, శ్రద్ధయా, అర్చితుమ్, ఇచ్ఛతి, తస్య, తస్య, అచలామ్, శ్రద్ధామ్, తామ్, ఏవ, విదధామి, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| యః యః | = ఏయే; | తస్యతస్య | = ఆయాభక్తునికి; |
| భక్తః | = భక్తుడు; | తాం ఏవ | = ఆయా మూర్తులందే; |
| యాం యామ్ | = ఏయే; | అచలామ్ | = చలనం లేని |
| తనుమ్ | = దేవతామూర్తిని; | | (ఏకనిష్ఠయైన); |
| శ్రద్ధయా | = శ్రద్ధతో; | శ్రద్ధామ్ | = భక్తిని; |
| అర్చితుమ్ | = ఆరాధింప; | అహమ్ | = నేను; |
| ఇచ్ఛతి | = కోరునో; | విదధామి | = కలుగజేస్తున్నాను. |

**తా॥** (దేవతా విశేషాలను భజించే వారిలో) ఏయే భక్తులు ఏయే దేవతామూర్తులను (అంటే దేవతానురూపమైన మదీయమూర్తిని) శ్రద్ధతో అర్చింపపూనుతారో, (అంతర్యామినైన) నేను ఆయా భక్తులకు ఆయా దేవతా రూపాల యందు దృఢమైన భక్తిని కలుగజేస్తున్నాను. (గీత : 9–23 చూ :) 21

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ ॥ 22**

*సః, తయా, శ్రద్ధయా, యుక్తః, తస్య, ఆరాధనమ్, ఈహతే, లభతే, చ, తతః, కామాన్, మయా, ఏవ, విహితాన్, హి, తాన్.*

| | | | |
|---|---|---|---|
| సః | = ఆ భక్తుడు; | మయా ఏవ | = నా చేతనే; |
| తయా | = అటువంటి; | విహితాన్ | = విధింపబడిన; |
| శ్రద్ధయాయుక్తః | = శ్రద్ధాయుక్తుడై; | తాన్ | = ఆ; |
| తస్యాః ఆరాధనమ్ | = ఆ దేవతారాధనను; | కామాన్ | = విషయాలను; |
| ఈహతే | = ఒనర్చుతాడు; | లభతే హి | = పొందుతున్నాడు కదా. |
| తతః చ | = ఆ దేవత నుండి; | | |

**తా॥** (తరువాత, విశేష దేవతారాధకుడైన) ఆ భక్తుడు మత్ప్రసాద లబ్ధమైన శ్రద్ధతో ఆ దేవతను ఆరాధిస్తున్నాడు. మరియు, (తద్దేవతాంతర్యామినైన) నాచే నిర్ణయింపబడిన[1] ఆ కామ్యవిషయాలను (నాకు అధీనుడూ, నా రూపాంతరమూ అయిన) ఆ దేవత నుండి బడయుచున్నాడు. 22

**అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్ ।**
**దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మామపి ॥ 23**

*అంతవత్, తు, ఫలమ్, తేషామ్, తత్, భవతి, అల్పమేధసామ్,*
*దేవాన్, దేవయజః, యాంతి, మద్భక్తాః, యాంతి, మామ్, అపి.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | దేవయజః | = దేవోపాసకులు; |
| అల్పమేధసామ్ | = అల్పబుద్ధులైన; | దేవాన్ | = దేవతలను; |
| తేషామ్ | = వారి; | యాంతి | = పొందుతున్నారు; |
| తత్ఫలమ్ | = ఆ ఫలం; | మద్భక్తాః అపి | = నా భక్తులన్ననో; |
| అంతవత్ | = అంతం గలది (అశాశ్వతం); | మామ్ | = నన్ను; |
| భవతి | = అవుతోంది; | యాంతి | = పొందుతున్నారు. |

**తా॥** (ఈవిధంగా సర్వదేవతలును నా స్వరూపమే అయినా, వారి ఆరాధన నా ఆరాధనయే అయినా, ఫలప్రదాతను కూడా నేనే అయి ఉన్నా; వారికీ సాక్షాత్ నా భక్తులైన వారికీ ఫల వైషమ్యం ఉంది:) అల్పబుద్ధులైన వ్యక్తుల ఆరాధనా లబ్ధమైన ఆ ఫలం (నాచే ఒసగబడినదే అయినా) అశాశ్వతం. దేవతోపాసకులు (వినాశయుక్తులైన) దేవతలనే పొందుతున్నారు. మరి నా భక్తులు మాత్రం, అనాది, అనంతుడు, పరమానందరూపి అయిన నన్ను (భగవంతుని) పొందుతున్నారు. (గీత : 9-25 చూ:) 23

1. ఏకో బహూనాం యో విదధాతి కామాన్. – శ్వేతాశ్వతరోపనిషత్తు. 6-13.

**అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।**
**పరం భావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్ ॥ 24**

అవ్యక్తమ్, వ్యక్తిమ్, ఆపన్నమ్, మన్యంతే, మామ్, అబుద్ధయః,
పరమ్, భావమ్, అజానంతః, మమ, అవ్యయమ్, అనుత్తమమ్.

| | | | |
|---|---|---|---|
| అబుద్ధయః | = అవివేకులు; | అజానంతః | = ఎఱుగక; |
| మమ | = నా; | అవ్యక్తమ్ | = నామ రూపాతీతుడనైన; |
| అవ్యయమ్ | = అక్షయమూ; | మామ్ | = నన్ను; |
| అనుత్తమమ్ | = ఉత్కృష్టమూ; | వ్యక్తిమ్ | = రూపాదిని; |
| పరమ్ | = సర్వకారణరూపమూ, శ్రేష్ఠమూ అయిన; | ఆపన్నమ్ | = పొందిన వానిగా; |
| | | మన్యంతే | = తలచుతున్నారు. |
| భావమ్ | = స్వరూపాన్ని; | | |

**తా॥** (పరిశ్రమ సమానమే అయినా ఫలవైషమ్యం ఎక్కుగా తోస్తున్నందున, అందరూ కూడా అన్యదేవతలను విడిచి నిన్నే భజింపకున్నారేమి? అని అంటావా:) అల్పబుద్ధులైనవారు నిత్యమూ, సర్వోత్తమమూ అయిన నా స్వరూపాన్ని గ్రహించక, ప్రపంచాతీతుణ్ణి (విశుద్ధసత్త్వ ప్రధానమూర్తులను పెక్కింటిని జగద్రక్షణార్థం లీలగా పరిగ్రహించే వాణ్ణి) అయిన నన్ను దేహవిశిష్టునిగా (అంటే, మత్స్యకూర్మాది రూపాలలో వ్యక్తమైన దేవతాంతరంగా) భావిస్తున్నారు. (కనుక, నన్ను సేవించక ఇతర దేవతలను ఆరాధించి అంతవంతాలైన ఫలాలను పొందుతున్నారు)
(గీత : 9-11 చూ:) 24

**నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్ ॥ 25**

న, అహమ్, ప్రకాశః, సర్వస్య, యోగమాయా సమావృతః,
మూఢః, అయమ్, న, అభిజానాతి, లోకః, మామ్, అజమ్, అవ్యయమ్.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | న ప్రకాశః | = కనబడుటలేదు; |
| యోగ మాయా సమావృతః | = యోగమాయ చేత ఆవృతమవడం వల్ల; | (అందుచేత) అయమ్ | = ఈ; |
| | | మూఢః | = మోహాచ్ఛన్నమైన; |
| సర్వస్య | = అందరికీ; | లోకః | = జగత్తు; |

| | | | |
|---|---|---|---|
| అజమ్ | = జన్మరహితునిగా; | మామ్ | = నన్ను; |
| అవ్యయమ్ | = క్షయరహితునిగా; | న అభిజానాతి | = గ్రహింపజాలకుంది. |

**తా॥** (అల్పబుద్ధులైన వారి అజ్ఞానానికి కారణం) త్రిగుణాత్మకమైన మాయ[1] చేత ఆవృతుడనై నేనందరికీ గోచరింపకున్నాను -కేవలం నా భక్తునికే ప్రకాశితుడ నవుతున్నాను. కనుక, మోహాంధకారమైన ఈ జగత్తు నా జన్మ మృత్యు రహితమైన అవ్యయ (ఈశ్వరుని) స్వరూపాన్ని గ్రహింపజాలకున్నది. 25

**వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26**

*వేద, అహమ్, సమతీతాని, వర్తమానాని, చ, అర్జున,*
*భవిష్యాణి, చ, భూతాని, మామ్, తు, వేద, న, కశ్చన.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | అహమ్ | = నేను; |
| సమతీతాని | = గతించినవీ; | వేద | = ఎరుగుదును; |
| చ | = మరియూ; | తు | = కాని; |
| వర్తమానాని | = ఇప్పుడు ఉన్నవీ; | మామ్ | = నన్ను; |
| భవిష్యాణి చ | = మరి కలుగబోవునవీ అయిన; | కశ్చన | = ఎవరూ; |
| భూతాని | = ప్రాణులనన్నిటిని; | న వేద | = ఎరుగరు. |

**తా॥** (కాని, నేను సర్వోత్తముణ్ణి, నా జ్ఞానశక్తి అనావృతం) పార్థా! నేను త్రికాలజ్ఞుడను. భూతభవిష్యద్వర్తమాన విషయాలనన్నింటినీ ఎరుగుదును. కాని, నన్ను (నాశరణాగతుడైన భక్తుడు తప్ప) ఎవ్వరూ ఎరుగజాలరు.[2] 26

**ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత ।**
**సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప ॥ 27**

---

1. యోగమాయ
   - అనాది అనిర్వాచ్యమైన అజ్ఞానం. - ఆనందగిరి.
   - అచింత్య ప్రజ్ఞావిలాసినీ, అఘటనఘటనాపటీయసీ అయిన మాయా - శ్రీధరస్వామి.
   - ఆత్మసంకల్పానువిధాయిని అయిన మాయ. - మధుసూదన సరస్వతి.

2. శ్వేతశ్వతరోపనిషత్తు. 3–19 చూ.

ఇచ్ఛాద్వేష సముత్థేన, ద్వంద్వమోహేన, భారత,

సర్వభూతాని, సమ్మోహమ్, సర్గే, యాన్తి, పరన్తప.

| | | | |
|---|---|---|---|
| పరన్తప | = అర్జునా; | ద్వంద్వ మోహేన | = సుఖదుఃఖ నిమిత్తమైన బుద్ధిభ్రంశంలో; |
| భారత | = కౌంతేయా; | సర్వభూతాని | = ప్రాణులందరూ; |
| సర్గే | = జన్మముతోడనే; | సమ్మోహమ్ | = మోహాన్ని; |
| ఇచ్ఛా ద్వేష సముత్థేన | = ఇష్టానిష్టముల చేత కలిగే; | యాన్తి | = పొందుతున్నారు. |

**తా॥** పరంతపా! భారతా! ప్రాణుల స్థూలదేహం ఉత్పన్నమైన వెంటనే, ఇచ్ఛాద్వేషాల నుండి సుఖదుఃఖాది ద్వంద్వాలు కలిగి, జీవులను సమ్మోహితుల ఒనర్చుతున్నాయి. (కనుక, వారు నన్ను ఎరుగజాలకున్నారు; మరియు నన్ను భజించడం లేదు.) 27

**యేషాం త్వన్తగతం[1] పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వన్ద్వ మోహనిర్ముక్తాః భజన్తే మాం దృఢవ్రతాః ॥ 28**

యేషామ్, తు, అంతగతమ్, పాపమ్, జనానామ్, పుణ్యకర్మణామ్,

తే, ద్వంద్వ మోహనిర్ముక్తాః, భజన్తే, మామ్, దృఢవ్రతాః.

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | ద్వంద్వ మోహ నిర్ముక్తాః | = సుఖదుఃఖాది పరస్పర విరుద్ధాలైన ద్వంద్వ మోహాల నుండి విడివడిన; |
| యేషామ్ | = ఏ; | | |
| పుణ్యకర్మణామ్ | = పుణ్యశీలురగు; | | |
| జనానామ్ | = జనుల; | తే | = ఆ; |
| పాపమ్ | = పాపము; | దృఢవ్రతాః | = అస్ఖలితవ్రతులు; |
| అంతగతమ్ | = క్షీణించినదో, సమాప్తప్రాయమైనదో; | మామ్ | = నన్ను; |
| | | భజన్తే | = భజిస్తున్నారు. |

**తా॥** (కాని, కొందరు నిన్ను భజిస్తున్నారే? దానికి కారణం ఏమంటావా?) ఏ పుణ్యాత్ముల పాపం (ప్రతిబంధకం) క్షీణించిందో, వారు ద్వంద్వ మోహాల నుండి విడివడి, దృఢనిష్ఠతో[2] నన్ను భజిస్తున్నారు. 28

1. యేషామంతగతమ్ - పాఠాంతరం.
2. 'పరమార్థతత్త్వ మిట్టిది, అన్యవిధము కాదు' అనే దృఢనిశ్చయం.
 - బృహదారణ్యకోపనిషత్తు. 4-4-23 చూ.

**జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే ।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29**

*జరామరణ మోక్షాయ, మామ్, ఆశ్రిత్య, యతన్తి, యే,*
*తే, బ్రహ్మ, తత్, విదుః, కృత్స్నమ్, అధ్యాత్మమ్, కర్మ, చ, అఖిలమ్.*

జరా మరణ మోక్షాయ = ముదిమి, చావుల నుండి విడివడడానికి;
మామ్ = నన్ను(పరమేశ్వరుని);
ఆశ్రిత్య = ఆశ్రయించి;
యే = ఎవరు;
యతన్తి = సాధన చేస్తున్నారో;
తే = వారు;
తత్ = ఆ;
బ్రహ్మ = బ్రహ్మాన్ని;
కృత్స్నమ్ = సమగ్రంగా;
అధ్యాత్మమ్ = ప్రత్యగాత్మ విషయాన్ని;
అఖిలం చ = సమస్తాన్ని;
కర్మ = తత్సాధనభూతాలైన కర్మను;
విదుః = ఎరుగుతారు (తెలిసికొనగలరు).

**తా॥** (ఈ విధంగా వారు నన్ను భజిస్తూ, తెలిసికోదగిన దానిని అంతా తెలుసుకుని కృతార్థులవుతున్నారు.) జరామరణాల నుండి ముక్తులు కాగోరి ఎవరు నన్ను ఆశ్రయించి సాధన చేస్తున్నారో వారు పరబ్రహ్మాన్ని, (తత్ప్రాప్తికి తోడైన దేహాది వ్యతిరిక్తమూ శుద్ధమూ అయిన) ఆత్మను, (తత్సాధనభూతాలైన) కర్మలనన్నింటినీ (సరహస్యంగా) గ్రహించగలుగుతున్నారు. 29

**సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।**
**ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్త చేతసః ॥ 30**

*స అధిభూత అధిదైవమ్, మామ్, స అధియజ్ఞమ్, చ, యే, విదుః,*
*ప్రయాణకాలే, అపి, చ, మామ్, తే, విదుః, యుక్త చేతసః.*

యే చ = మరియు, ఎవరు;
మామ్ = నన్ను;
స అధిభూత అధిదైవమ్ = అధిభూత, అధిదైవాలతోనూ;
స అధియజ్ఞం చ = అధియజ్ఞములతోనూ;
విదుః = తెలుసుకుంటారో;
తే = ఆ;
యుక్త చేతసః = సమాహిత చిత్తులు;
ప్రయాణ కాలే అపి = మృత్యుకాలంలో కూడా;
మామ్ = నన్ను;
విదుః = ఎఱుగగలరు.

**తా॥** మరియు ఎవరు అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో కూడా నన్ను ప్రస్తుతం ఉపాసిస్తున్నారో, సమాహితచిత్తులైన వారు నన్ను మృత్యుకాలంలో కూడా - చిత్తవ్యాకులతను పొంది -విస్మరించరు.[1] (నా భక్తులు భ్రష్టులు కారు.) (గీత : 8-7, 14 చూ.) 30

**ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జునసంవాదే (జ్ఞాన) విజ్ఞానయోగో నామ**
**సప్తమోఽధ్యాయః॥**

శ్లోకసంఖ్య-30. మొదటినుండి (280+30=) 310.

**కృష్ణభక్త్యైవ యత్నేన బ్రహ్మజ్ఞాన మవాప్యతే,**
**ఇతి విజ్ఞానయోగాఖ్యే సప్తమే సంప్రకాశితమ్.**

**తా॥** కృష్ణభక్తియే యత్నంతో బ్రహ్మజ్ఞానాన్ని లభింపజేస్తుందని విజ్ఞానయోగం అనే ఈ సప్తమాధ్యాయంలో తెలుపబడింది.



1. ఈ చివరి రెండు శ్లోకాల వ్యాఖ్య గీత. 8 - 3,4 శ్లోకాలలో చూడగలరు.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## అష్టమో ఽధ్యాయః - అక్షర బ్రహ్మ యోగః

## (అష్టమాధ్యాయం - అక్షర బ్రహ్మ యోగం)

బ్రహ్మకర్మాధిభూతాని విదుః కృష్ణైకచేతసః ।
ఇత్యుక్తం బ్రహ్మకర్మాది స్పష్టమష్టమ ఉచ్యతే ॥[1]



అర్జున ఉవాచ :

**కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।**
**అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే ॥** 1

కిమ్, తత్, బ్రహ్మ, కిమ్, అధ్యాత్మమ్, కిమ్, కర్మ, పురుషోత్తమ,
అధిభూతమ్, చ, కిమ్, ప్రోక్తమ్, అధిదైవమ్, కిమ్, ఉచ్యతే.

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | కిం కర్మ | = కర్మస్వరూపమెట్టిది; |
| ఉవాచ | = పలికెను; | అధిభూతమ్ | = అధిభూతమని; |
| పురుషోత్తమ | = పురుషశ్రేష్ఠా; | కిం ప్రోక్తమ్ | = ఏది చెప్పబడింది; |
| తత్ బ్రహ్మ | = ఆ బ్రహ్మం; | కిమ్ చ | = మరియు ఏది; |
| కిమ్ | = ఏది; | అధిదైవమ్ | = అధిదైవమని; |
| అధ్యాత్మమ్ | = అధ్యాత్మం అంటే; | ఉచ్యతే | = చెప్పబడుతోంది? |
| కిమ్ | = ఏమి; (మరియు) | | |

1. శ్రీకృష్ణుణ్ణి ఆశ్రయించి ఏకాగ్రచిత్తంతో భజించేవారు బ్రహ్మకర్మాధిభూతాదులను ఎరుగగలరు - అని చెప్పబడింది. (గీత. 7-29, 30 చూ.) ఇప్పుడు ఆ బ్రహ్మకర్మాదులు వివరింపబడుతున్నాయి.

**తా॥** (పూర్వాధ్యాయాంతంలో భగవంతుడు తెలిపిన బ్రహ్మకర్మాది సప్తపదార్థాల విషయమై ప్రశ్నిస్తూ) అర్జునుడు పలికెను : పురుషోత్తమా![1] బ్రహ్మం అంటే ఏమిటి? అధ్యాత్మం అంటే ఏమిటి? కర్మ అంటే ఏమిటి? అధిభూత, అధిదైవములని అనబడేవి ఏవి? (ఐదు ప్రశ్నలు) 1

**అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2**

*అధియజ్ఞః, కథమ్, కః, అత్ర, దేహే, అస్మిన్, మధుసూదన,*
*ప్రయాణకాలే, చ, కథమ్, జ్ఞేయః, అసి, నియత ఆత్మభిః*

| | | | |
|---|---|---|---|
| మధుసూదన | = కృష్ణా; | (స్థితః | = వెలయుచున్నాడు) |
| అస్మిన్ | = ఈ; | ప్రయాణకాలే చ | = మరియు, మృత్యుసమయంలో; |
| దేహే | = శరీరంలో; | నియత ఆత్మభిః | = సంయతచిత్తులచేత; |
| అధియజ్ఞః కః | = అధిష్ఠాతయై వెలయువా డెవరు; | కథమ్ | = ఎట్లు; |
| అత్ర | = ఈ శరీరంలో; | (నీవు) జ్ఞేయః అసి | = తెలియదగిన వాడవవుతావు? |
| కథమ్ | = ఎట్లు; | | |

**తా॥** మధుసూదనా! (సమస్త కర్మకూ ఆధారమైన) ఈ శరీరాన్ని అధిష్ఠించి, నియమిస్తూ ఫలాలను ఒసగేదెవరు? అతడు ఏ విధంగా ఇందులో వెలయుచున్నాడు? అంతిమ సమయంలో నియతచిత్తులు ఏ ఉపాయంతో నిన్ను ఎరుగ గలుగుతున్నారు.? (మూడుప్రశ్నలు) 2

*శ్రీభగవానువాచ :*

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3**

*అక్షరమ్, బ్రహ్మ, పరమమ్, స్వభావః, అధ్యాత్మమ్, ఉచ్యతే,*
*భూత భావ ఉద్భవకరః, విసర్గః, కర్మసంజ్ఞితః.*

1. పూరుషః = పూర్ణమనేన సర్వమితి పూరుషః
ఈ విశ్వం ఎవరి చేత పూర్ణమై (వ్యాప్తమై) ఉందో అతడు పూరుషుడు.
పుంశయ నాద్వా పూరుషః = హృదయపురంలో శయనించేవాడు పురుషుడు.

| | | | |
|---|---|---|---|
| శ్రీభగవాన్ | = శ్రీకృష్ణుడు; | అధ్యాత్మమ్ | = అధ్యాత్మమని; |
| ఉవాచ | = పలికెను; | ఉచ్యతే | = చెప్పబడుతోంది; |
| అక్షరమ్ | = వినాశంలేనిది, మూలకారణమైనది; | భూత భావ ఉద్భవకరః | = జీవుల సృష్టి స్థితులకు కారణమైన; |
| పరమమ్ | = పరమమైన; | విసర్గః | = యజ్ఞంలో దేవతలను ఉద్దేశించి ద్రవ్యాదులను అర్పించడమే; |
| బ్రహ్మ | = బ్రహ్మం; | కర్మ సంజ్ఞితః | = కర్మమని చెప్పబడుతోంది. |
| స్వభావః | = అది ప్రతిదేహంలో ప్రత్యగాత్మ భావాన్ని పొందడమే; | | |

**తా॥** శ్రీభగవానుడు పలికెను : (నిత్యుడైన జీవుని కంటే) పరమమైన మూలకారణమే[1] బ్రహ్మం అనబడుతోంది. (ఇది అంశరూపంలో ప్రతిదేహంలో ప్రవేశించే) స్వభావమే[2] అంటే జీవుడే అధ్యాత్మం[3] అనబడుతున్నాడు. జీవుల జన్మ, స్థితులకు కారణమైన ద్రవ్యత్యాగ రూపమైన యజ్ఞమే కర్మ అనబడుతోంది.[4]
(మొదటి మూడు ప్రశ్నలకు ప్రత్యుత్తరం) 3

**అధిభూతం క్షరోభావః పురుషశ్చాధి దైవతమ్ ।**
**అధియజ్ఞోఽ హమేవాత్ర దేహే దేహభృతాం వర ॥ 4**

అధిభూతమ్, క్షరః, భావః, పురుషః, చ, అధి దైవతమ్,
అధియజ్ఞః, అహమ్, ఏవ, అత్ర, దేహే, దేహభృతామ్, వర.

| | | | |
|---|---|---|---|
| దేహభృతాం వర | = శరీరధారులందరిలోనూ శ్రేష్ఠుడవైన ఓ అర్జునా; | (దేహాదులైన) భావః | = పదార్థతతి; |
| క్షరః | = నశించేదైన; | అధి భూతమ్ | = అధిభూతం, ప్రతిజీవుణ్ణి అనుసరించి ఉండేదని చెప్పబడుతుంది; |

1. జీవుడు కూడా అక్షరుడు అనగా వినాశం లేనివాడే అయినా అతనికి కూడా పరమకారణమైనదే బ్రహ్మం. ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః
గార్గీ! ఈ అక్షరబ్రహ్మం యొక్క శాసనంతోనే సూర్యచంద్రులు ధరింపబడియున్నారు.
– బృహదారణ్యకోపనిషత్తు 3-8-9.
2. స్వస్యైవ బ్రహ్మణ ఏవ అంశతయా జీవరూపేణ భవనం స్వభావః
బ్రహ్మం యొక్క స్వాంశమే జీవభావాన్ని పొందడం స్వభావం. గీత: 15-7 చూ. – శ్రీధరస్వామి.
3. స ఏవ ఆత్మానం దేహం అధికృత్య భోక్తృత్వేన వర్తమానోఽ ధ్యాత్మశబ్దేనోచ్యతే
దేహానికి అధికారియై భోక్తృరూపంలో వెలయువాడే అధ్యాత్మం అనబడుతున్నాడు. – శ్రీధరస్వామి.
4. గీత. 3-14 చూ.

| | | | |
|---|---|---|---|
| పురుషః | = హిరణ్యగర్భుడు; | అహం ఏవ | = నేనే; |
| అధిదైవతమ్ | = అధిష్ఠాతయైన దేవత; | అధి యజ్ఞః | = విష్ణువనబడే |
| చ | = మరియు; | | యజ్ఞాధిష్ఠాన దేవతను, యజ్ఞప్రవర్తకుడనే, |
| అత్ర దేహే | = ఈ శరీరంలో; | | యజ్ఞఫలప్రదాతను. |

**తా॥** నరశ్రేష్ఠుడవైన అర్జునా! శరీరాది వినాశశీల పదార్థాలే అధిభూతం[1] అని చెప్పబడుతున్నాయి. పురుషుడు అంటే, నిజాంశ భూతులైన సర్వదేవతలకూ అధిపతీ, సూర్యమండల మధ్యవర్తీ అయిన వైరాజపురుషుడు (హిరణ్యగర్భుడు) అధిదైవతం[2] –సమస్త దేవతల అధిష్ఠాత. ఈ శరీరంలో[3] అంతర్యామి రూపంలో ప్రకాశిస్తున్న నేనే అధియజ్ఞాన్ని[4] –విష్ణువనబడే[5] యజ్ఞాధిష్ఠాన దేవతను, యజ్ఞ ప్రవర్తకుణ్ణి, యజ్ఞఫలదాతను. (*గీత:* 9–24 చూ.) 4

**అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ 5**

*అంతకాలే, చ, మామ్, ఏవ, స్మరన్, ముక్త్వా, కళేబరమ్,*
*యః, ప్రయాతి, సః, మత్ భావమ్, యాతి, న, అస్తి, అత్ర, సంశయః.*

---

1. *క్షరో వినశ్వరో, భావో దేహాదిపదార్థః, భూతం ప్రాణి మాత్ర మధికృత్య భవ తీతి అధిభూతం ఉచ్యతే*
దేహాదులు నశ్వర పదార్థాలు, అవి ప్రతి జీవుణ్ణి అనుసరించి ఉన్నాయి, వాటినే అధిభూతం అని అంటారు. *–శ్రీధరస్వామి.*

2. *పురుషో వైరాజః సూర్యమండలవర్తీ స్వాంశభూతసర్వదేవతా నామధిపతిః అధిదైవతం ఉచ్యతే*
సూర్యమండలంలో వెలయువాడూ, నిజాంశభూతులైన సర్వదేవతల అధిపతియూ అయిన విరాట్పురుషుడు అధిదైవతము(అధిష్ఠానదేవత).

యథా : స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే, ఆది కర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత.
అతడు ప్రథమ శరీరి. అతనినే పురుషుడంటారు సర్వభూతాలకూ ఆదికర్తయైన ఆ బ్రహ్మాయే మొదట ఉండెను. (*తైత్తిరీయ సంహితా* 1.7.4.3)

3. అసంగత్వాది గుణవిశిష్టుడూ, జీవవ్యతిరిక్తుడూ అయిన అంతర్యామి దేహాంతర్వర్తి అని శ్రుతి ప్రసిద్ధం. (ముండకోపనిషత్తు 3–1–1 చూ.) నీవు నరశ్రేష్ఠుడవవడం వల్ల ఇటువంటి అంతర్యామిని తెలుసుకోవడానికి తగినవాడివి – అని విశేష సంబోధన సూచిస్తోంది. *–శ్రీధరస్వామి.*

4. అస్మిన్దేహే స్థితః అహమేవ అధియజ్ఞః, యజ్ఞస్య అధిష్ఠాత్రీదేవతా,
యజ్ఞాదికర్మప్రవర్తకః తత్ఫలదాతా చ
ఈ శరీరంలో ప్రకాశిస్తున్న నేనే అధియజ్ఞుణ్ణి, యజ్ఞాధిష్ఠాన దేవతను, యజ్ఞాది కర్మప్రవర్తకుణ్ణి, తత్ఫలదాతను కూడా నేనే. *–శ్రీధరస్వామి.*

5. యజ్ఞో వై విష్ణుః – తైత్తిరీయ సంహితా. 1.7.4.

| | | | |
|---|---|---|---|
| అన్త కాలే చ | = మరియు, మృత్యుసమయంలో; | ప్రయాతి | = పోవునో; |
| | | సః | = అతడు; |
| మాం ఏవ | = నన్నే; | మత్ భావమ్ | = నా స్వరూపాన్ని; |
| స్మరన్ | = స్మరిస్తూ; | యాతి | = పొందును; |
| కలేబరమ్ | = శరీరాన్ని; | అత్ర | = ఈ విషయంలో; |
| ముక్త్వా | = త్యజించి; | సంశయః | = సందేహం; |
| యః | = ఎవడు; | న అస్తి | = లేదు. |

**తా॥** (నియతచిత్తులైనవారు అంత్యకాలంలో నిన్ను ఏ విధంగా ఎరుగగలరు? అనే ప్రశ్నకు ప్రత్యుత్తరంగా, ఆ ఎరిగే రీతిని తత్ఫలాన్నీ చెబుతున్నాడు:) అవసాన కాలంలో ఎవరు నన్ను (అంతర్యామిగా, పరమేశ్వరునిగా) స్మరిస్తూ, శరీరాన్ని విడిచి (అర్చిరాది మార్గంలో) ప్రయాణిస్తున్నాడో అతడు నా భావాన్నే (రూపాన్ని, ముక్తిని) పొందుతాడు - ఈ విషయంలో సందేహం లేదు.[1] 5

**యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।**
**తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావ భావితః ॥ 6**

యమ్, యమ్, వా, అపి, స్మరన్, భావమ్, త్యజతి, అన్తే, కళేబరమ్,
తమ్, తమ్, ఏవ, ఏతి, కౌన్తేయ, సదా, తత్ భావ భావితః.

| | | | |
|---|---|---|---|
| అన్తే | = మరణసమయంలో; | కౌంతేయ | = అర్జునా; |
| యం యం వా అపి | = ఏయే; | సదా | = ఎల్లప్పుడూ; |
| భావమ్ | = భావాన్ని, దేవతావిశేషాన్ని; | తత్ భావ భావితః | = ఆ దేవతాభావాన్ని పొందినవాడు; |
| స్మరన్ | = తలుస్తూ; | | |
| కలేబరమ్ | = శరీరాన్ని; | తం తం ఏవ | = ఆయాదేవతనే; |
| త్యజతి | = వదలుతున్నాడో; | ఏతి | = పొందుతాడు. |

**తా॥** కౌంతేయా! (అదీ గాక), అంత్యకాలంలో ఎవరెవరు ఏయే దేవతా భావాన్ని (లేక అన్యవిషయాలను) చింతన చేస్తూ శరీరాన్ని విడుస్తున్నాడో, అతడు ఆయా దేవతా భావాన్నే (లేక అన్యవిషయాలనే) పొందుతున్నాడు. 6

---

1. స్మరణం జ్ఞానోపాయము, మద్భావాపత్తి ఫలం అని అభిప్రాయం.

**తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః మామేవైష్య స్యసంశయః[1] ॥ 7**

తస్మాత్, సర్వేషు, కాలేషు, మామ్, అనుస్మర, యుధ్య, చ,
మయి, అర్పిత మనః బుద్ధిః, మామ్, ఏవ, ఏష్యసి, అసంశయమ్.

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = కనుక; | మయి | = నాయందు; |
| సర్వేషు కాలేషు | = అన్ని వేళలలో; | అర్పిత మనః బుద్ధిః | = మనోబుద్ధులను అర్పించినవాడవై; |
| మామ్ | = నన్ను; | | |
| అనుస్మర | = స్మరిస్తూ ఉండు; | అసంశయః | = నిస్సందేహంగా; |
| యుధ్య చ | = మరియు, యుద్ధం ఒనర్చు; | మాం ఏవ | = నన్నే; |
| | | ఏష్యసి | = పొందుతావు. |

**తా॥** (పూర్వవాసనలే అంత్యకాల స్మృతికి కారణం అవుతున్నాయి. అప్పుడు వివశుడైన జీవునికి స్మరణ ప్రయత్నం ఉండదు.) కనుక, నిరంతరం నీవు నన్ను గూర్చి తలపోస్తూ ఉండు; (ఈ నిరంతరస్మరణ చిత్తశుద్ధి లేకపోతే కలుగదు, కనుక చిత్తశుద్ధి నిమిత్తం స్వధర్మమైన) యుద్ధాన్ని కూడా చెయ్యి. నా యందు మనోబుద్ధులను అర్పిస్తే నిస్సందేహంగా నీవు నన్నే పొందుతావు. 7

**అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా ।[2]**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్ ॥ 8**

అభ్యాస యోగయుక్తేన, చేతసా, న, అన్యగామినా,
పరమమ్, పురుషమ్, దివ్యమ్, యాతి, పార్థ, అనుచింతయన్.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | అనుచింతయన్ | = స్మరిస్తున్న (యోగి); |
| అభ్యాస యోగ యుక్తేన | = అభ్యాసమనే ఉపాయంతో కూడినదీ; | పరమమ్ | = ఉత్తముడూ; |
| | | దివ్యమ్ | = జ్యోతిర్మయుడూ అయిన; |
| న అన్యగామినా | = ఇతర విషయాల వైపుకు పోనిదీ అయిన; | పురుషమ్ | = పరమేశ్వరుణ్ణి; |
| | | యాతి | = పొందుతాడు. |
| చేతసా | = చిత్తముతో; | | |

1. అసంశయః – పాఠాంతరం.
2. చేత సానన్యగామినా.

**తా॥** (నిరంతరస్మరణకు అభ్యాసమే అంతరంగ సాధనం అని సూచించ బడుతోంది-) పార్థా! అభ్యాస యోగంలో[1] నియమించబడి ఇతర విషయాలపైకి పోకుండా ఉండే చిత్తంతో జ్యోతిర్మయుడూ, పరమపురుషుడూ అయిన భగవంతుణ్ణి నిరంతరం ధ్యానిస్తున్నట్లయితే, అటువంటి యోగి తప్పక ఆ భగవంతుణ్ణే పొందగలడు. 8

**కవిం పురాణ మనుశాసితారమ్**
**అణోరణీయాంస మనుస్మరేద్యః ।**
**సర్వస్య ధాతార మచిన్త్య రూపమ్**
**ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥** **9**

కవిమ్, పురాణమ్, అనుశాసితారమ్, అణోః అణీయాంసమ్, అనుస్మరేత్, య, సర్వస్య, ధాతారమ్, అచింత్య రూపమ్, ఆదిత్యవర్ణమ్, తమసః, పరస్తాత్.

**ప్రయాణకాలే మనసాఽచలేన**
**భక్త్యా యుక్తో యోగ బలేన చైవ ।**
**భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్**
**స తం పరం పురుషముపైతి దివ్యమ్॥** **10**

ప్రయాణకాలే, మనసా, అచలేన, భక్త్యా, యుక్తః, యోగ బలేన, చ, ఏవ, భ్రువోః,మధ్యే, ప్రాణమ్, ఆవేశ్య, సమ్యక్, సః,తమ్, పరమ్, పురుషమ్, ఉపైతి, దివ్యమ్.

| | | | |
|---|---|---|---|
| ప్రయాణ కాలే | = మృత్యు సమయంలో; | సమ్యక్ | = సంపూర్ణంగా; |
| భక్త్యా యుక్తః | = భక్తి యుక్తుడై; | ఆవేశ్య | = నిలిపి (ధారణచేసి); |
| అచలేన మనసా | = ఏకాగ్ర చిత్తంతో; | యః | = ఎవరు; |
| యోగ బలేన | = ధ్యాన అభ్యాసలబ్ధమైన చిత్త స్థైర్యంతో; | సర్వస్య | = అందరి; |
| | | ధాతారమ్ | = కర్మఫల దాతను |
| భ్రువోః మధ్యే చ ఏవ | = భ్రూమధ్యంలోనే; | కవిమ్ | = సర్వజ్ఞుడను; |
| ప్రాణమ్ | = ప్రాణాన్ని; | పురాణమ్ | = ప్రాచీనుడు (అనాది); |

---

1. సజాతీయ ప్రత్యయ ప్రవాహం-విలక్షణ ప్రత్యయ రహితమైన తుల్యప్రత్యయం-మళ్ళీ మళ్ళీ ఆవృత్తమైతే అభ్యాసం అనబడుతుంది.

| | | | |
|---|---|---|---|
| అనుశాసితారమ్ | = విశ్వనియంతనూ; | అనుస్మరేత్ | = స్మరించునో; |
| అణోః | = సూక్ష్మమైన దానికంటే; | సః | = అతడు; |
| అణీయాంసమ్ | = సూక్ష్మతరుడును; | తమ్ | =ఆ; |
| అచిన్త్య రూపమ్ | = అచింత్య స్వరూపుడూ; | పరమ్ | = శ్రేష్ఠుడును; |
| | | దివ్యమ్ | = జ్యోతిర్మయుడైన; |
| ఆదిత్య వర్ణమ్ | = సూర్యునివలె స్వప్రకాశుడు, జ్యోతిష్మంతుడూ; | పురుషమ్ | = పురుషుణ్ణి (పరమేశ్వరుణ్ణి); |
| తమసః | = మోహాంధకారానికి; | ఉపైతి | = పొందును. |
| పరస్తాత్ | = ఆవలనుండేవాడూ; (అయిన పురుషుని) | | |

**తా॥** (అనుస్మరణీయుడైన పురుషుని స్వరూపం వర్ణించబడుతోంది-) సర్వవిద్యా నిర్మాతా, సనాతనుడూ, విశ్వనియంతా, సూక్ష్మమైన ఆకాశాదుల కంటే సూక్ష్మతరుడూ, మలినయుక్తాలైన మనోబుద్ధులకు అగోచరుడూ, సూర్యునివలే స్వప్రకాశ స్వరూపుడూ, అజ్ఞానాంధకారమైన ప్రకృతికి ఆవల ఉండేవాడూ, సర్వపోషకుడూ అయిన పరమేశ్వరుణ్ణి ఎవడు మృత్యుసమయంలో భక్తియుక్తుడై ఏకాగ్ర చిత్తంతో ధ్యానాభ్యాసలబ్ధమైన చిత్తస్థైర్యంతో, భ్రూమధ్యంలో ప్రాణాన్ని నిరోధించి, స్మరిస్తాడో; అతడు ఆ జ్యోతిర్మయుడైన పరమేశ్వరుణ్ణి పొందుతాడు.
9-10

**యదక్షరం వేదవిదో వదన్తి**
**విశన్తి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి**
**తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ 11**

*యత్, అక్షరమ్, వేదవిదః, వదంతి, విశంతి, యత్, యతయః, వీతరాగాః, యత్, ఇచ్ఛంతః, బ్రహ్మచర్యమ్, చరంతి, తత్, తే, పదమ్, సంగ్రహేణ, ప్రవక్ష్యే.*

| | | | |
|---|---|---|---|
| వేద విదః | = వేదజ్ఞులు; | వీత రాగాః | = విషయాసక్తిశూన్యులు, (నిస్పృహులైన); |
| యత్ | = దేనిని; | | |
| అక్షరమ్ | = అవినాశియైన పురుషుడని; | యతయః | = యతులు; |
| | | యత్ | = దేనియందు; |
| వదంతి | = చెప్పుచున్నారో; | విశన్తి | = ప్రవేశిస్తున్నారో; |

| | | | |
|---|---|---|---|
| యత్ | = దేనిని; | పదమ్ | = బ్రహ్మపదాన్ని; |
| ఇచ్ఛన్తః | = తెలిసికోగోరి; | తే | = నీకు; |
| బ్రహ్మచర్యమ్ | = బ్రహ్మచర్యాన్ని; | సంగ్రహేణ | = సంక్షిప్తంగా; |
| చరన్తి | = ఒనర్చుతున్నారో; | ప్రవక్ష్యే | = చెబుతాను. |
| తత్ | = ఆ; | | |

**తా॥** (ఓంకారాభ్యాస శ్రేష్ఠత్వం సూచించబడుతోంది-) వేదజ్ఞులు దేనిని అక్షరపురుషుడని వర్ణిస్తున్నారో, నిస్పృహులైన యతులు దేనిని పొందుతున్నారో జిజ్ఞాసువులు దేనిని పొందడానికి (గురు గృహంలో) బ్రహ్మచర్య వ్రతాన్ని పాలిస్తున్నారో, గమ్యమైన ఆ బ్రహ్మాన్ని గురించి నీకు సంక్షిప్తంగా చెబుతున్నాను. 11

(కఠోపనిషత్తు. 1-2-15 చూ:)

**సర్వ ద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥ 12**

*సర్వద్వారాణి, సంయమ్య, మనః, హృది, నిరుధ్య, చ,*
*మూర్ధ్ని, ఆధాయ, ఆత్మనః, ప్రాణమ్, ఆస్థితః, యోగధారణామ్.*

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 13**

*ఓమ్, ఇతి, ఏక అక్షరమ్, బ్రహ్మ, వ్యాహరన్, మామ్, అనుస్మరన్,*
*యః, ప్రయాతి, త్యజన్, దేహమ్, సః, యాతి, పరమామ్, గతిమ్.*

| | | | |
|---|---|---|---|
| సర్వ ద్వారాణి | = ఇంద్రియాలన్నింటినీ; | ఆస్థితః | = వెలయుచు; |
| సంయమ్య | = నియమించి; | ఓమ్ ఇతి | = ఓమ్ అనే; |
| మనః | = మనస్సును; | ఏక అక్షరం బ్రహ్మ | = ఏకాక్ష బ్రహ్మాన్ని; |
| హృది | = హృదయ పుండరీకంలో; | వ్యాహరన్ | = ఉచ్చరిస్తూ; |
| నిరుధ్య చ | = నిలిపి | మామ్ | = నన్ను; |
| ప్రాణమ్ | = ప్రాణాన్ని; | అనుస్మరన్ | = స్మరిస్తూ; |
| మూర్ధ్ని | = భ్రూయుగ మధ్యంలో; | దేహమ్ | = శరీరాన్ని; |
| ఆధాయ | = ఉంచి; | త్యజన్ | = వీడి; |
| ఆత్మనః యోగ ధారణామ్ | = ఆత్మయోగంలో; | యః | = ఎవడు; |

| | | | |
|---|---|---|---|
| ప్రయాతి | = ప్రయాణిస్తున్నాడో; | గతిమ్ | = గతిని, మోక్షాన్ని; |
| సః | = అతడు; | యాతి | = పొందుతున్నాడు. |
| పరమామ్ | = ఉత్తమమైన; | | |

**తా॥** ఇంద్రియాలన్నింటినీ నియమించి (అంటే, బాహ్యవిషయ గ్రహణం లేకుండా) మనస్సును హృదయంలో నిలిపి, (అంటే, బాహ్యవిషయ స్మరణను కూడా చేయకుండా) భ్రూమధ్యంలో ప్రాణాన్ని స్థాపించి[1], ఆత్మయోగంలో వెలయుచు బ్రహ్మప్రతీకమూ (బ్రహ్మవాచకం), ఏకాక్షరమూ అయిన ఓంకారాన్ని ఉచ్చరిస్తూ, నన్ను స్మరిస్తూ, శరీరాన్ని వదిలి (అర్చిరాది మార్గంలో) ప్రయాణం చేసినవాడు శ్రేష్ఠమైన గతిని పొందుతున్నాడు. (కఠోపనిషత్తు 2-6-16) 12-13.

**అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14**

*అనన్యచేతాః, సతతమ్, యః, మామ్, స్మరతి, నిత్యశః,*
*తస్య, అహమ్, సులభః, పార్థ, నిత్యయుక్తస్య, యోగినః.*

| | | | |
|---|---|---|---|
| అనన్య చేతః | = ఏకాగ్రచిత్తుడై; | పార్థ | = అర్జునా; |
| యః | = ఎవడు; | అహమ్ | = నేను; |
| మామ్ | = నన్ను; | తస్య | = ఆ; |
| నిత్యశః | = అనుదినం (యావజ్జీవం); | నిత్య యుక్తస్య | = సమాహితచిత్తుడైన; |
| సతతమ్ | = నిరంతరం; | యోగినః | = యోగికి; |
| స్మరతి | = స్మరిస్తాడో; | సులభః | = సులభుణ్ణి. |

**తా॥** ఎవడు అనన్యచిత్తుడై నన్ను యావజ్జీవితమూ నిరంతరం స్మరిస్తుంటాడో, సదా సమాహితచిత్తుడైన ఆ యోగికి నేను సహజలభ్యుడను.[2] 14

(గీత: 9-34 చూ:)

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।**
**నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 15**

---

1. 'మూర్ధ్ని' అనేచోట కొందరు వ్యాఖ్యాతలు సహస్రారమని వ్యాఖ్యానించారు.
2. స తు దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః. (యోగసూత్రమ్ 1-14).
ఆవృత్తిరసకృదుపదేశాత్. (వేదాంత సూత్రమ్ 4-1-1).
ఆప్రయాణాత్తత్రాపి దృష్టమ్ (వేదాంత సూత్రమ్ 4-1-12).

మామ్, ఉపేత్య, పునర్జన్మ, దుఃఖాలయమ్, అశాశ్వతమ్,

న, ఆప్నువంతి, మహాత్మానః, సంసిద్ధిమ్, పరమామ్, గతాః.

| | | | |
|---|---|---|---|
| పరమామ్ | = సర్వోత్తమమైన; | ఉపేత్య | = చేరి; |
| సంసిద్ధిమ్ | = సిద్ధిని (మోక్షాన్ని); | దుఃఖాలయమ్ | = దుఃఖస్థానమూ; |
| గతాః | = పొందిన; | అశాశ్వతమ్ | = అనిత్యమూ అయిన; |
| మహాత్మానః | = మహాత్ములైనవారు; | పునర్జన్మ | = పునర్జన్మను; |
| మామ్ | = నన్ను; | న ఆప్నువంతి | = పొందరు. |

**తా॥** (నీవు సులభుడవైన లాభమేమంటావా?) పరమ సిద్ధిని, అంటే మోక్షాన్ని పొందిన మహాత్ములు నన్ను చేరి, దుఃఖస్థానమూ అనిత్యమూ అయిన పునర్జన్మను (అంటే, పునర్జన్మకు ఆకరములైన ఇతర లోకాలను) పొందరు. 15

**ఆబ్రహ్మభువనా ల్లోకాః పున రావర్తినో౽ర్జున ।**

**మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ 16**

ఆబ్రహ్మభువనాత్, లోకాః, పున రావర్తినః, అర్జున,

మామ్, ఉపేత్య, తు, కౌంతేయ, పునర్జన్మ, న, విద్యతే.

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | కౌన్తేయ | = అర్జునా; |
| ఆబ్రహ్మ భువనాత్ | = భూలోకం నుండి బ్రహ్మలోకం వరకూ గల; | మామ్ | = నన్ను; |
| | | ఉపేత్య | = పొందిన; |
| లోకాః | = లోకాలన్నీ; | పునర్జన్మ | = మళ్ళీ జన్మ; |
| పునరావర్తినః | = పునరావృత్తితో కూడినవి; | న విద్యతే | = ఉండదు (కలుగదు). |
| తు | = కాని; | | |

**తా॥** అర్జునా! (భూలోకం నుండి) బ్రహ్మలోకం వరకూ గల[1] లోకాలన్నీ కూడా పునరావృత్తితో కూడుకొన్నవి. కాని, కౌంతేయా! నన్ను పొందినవారికి మళ్ళీ జన్మ లేదు.[2] (వేదాంత సూత్రమ్. 4-4-22 చూ; గీత: 9-3 చూ:) 16

1. భూః, భువః, స్వః, మహః, జనః, తపః, సత్య (బ్రహ్మ) అని లోకాలు. - శ్రీమద్భాగవతం, 11-14-11,12

2. సగుణబ్రహ్మోపాసనను మోక్షాకాంక్షతో చేసి, బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ జ్ఞానం లభించిన వారికే మోక్షం లభిస్తుంది- దీనిని క్రమముక్తి అంటారు. కాని, భోగేచ్ఛతో కర్మలను ఆచరించిన వారు అక్కడ నుండి తిరిగి వస్తున్నారు. కల్పాంత ప్రళయంలో మొదట పేర్కొబడ్డవారు బ్రహ్మతో పాటు ముక్తిని పొందుతున్నారు. కనుక, బ్రహ్మలోకం కూడా అనిత్యం, పునరావృత్తిశీలం అని గ్రహించాలి.

**సహస్ర యుగపర్యన్తం అహర్యద్బ్రహ్మణో విదుః ।**
**రాత్రిం యుగసహస్రాన్తాం తే-హోరాత్రవిదో జనాః ॥ 17**

*సహస్ర యుగపర్యంతమ్, అహః, యత్, బ్రహ్మణః, విదుః,*
*రాత్రిమ్, యుగ సహస్ర అంతామ్, తే, అహః రాత్ర విదః, జనాః.*

| | | | |
|---|---|---|---|
| అహః రాత్ర విదః | = దివారాత్రుల తత్త్వం ఎరిగినవారైన; | తత్ | = దానిని; |
| తే | = ఆ; | సహస్ర యుగ పర్యంతమ్ | = వేయియుగాల పరిమితిగలదానిగా; |
| జనాః | = యోగిజనులు; | రాత్రిమ్ | = రాత్రిని; |
| బ్రహ్మణః | = బ్రహ్మకు; | యుగ సహస్ర అంతామ్ | = సహస్రయుగ పరిమితిగలదానిగా; |
| యత్ | = ఏది; | | |
| అహ | = దినమో; | విదుః | = గ్రహిస్తారు. |

**తా॥** సహస్రయుగ నిడివి గల బ్రహ్మదేవుని పగలును,[1] అట్టిదే అయిన రాత్రిని ఎరిగిన యోగులే, దివారాత్రాల తత్త్వాన్ని గ్రహించినవారు. (చంద్ర సూర్యుల మానాన్ని బట్టి ఎరుగువారు కారు, వారు అల్పజ్ఞులు.) 17

**అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే ।**
**రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥ 18**

*అవ్యక్తాత్, వ్యక్తయః, సర్వాః, ప్రభవంతి, అహరాగమే,*
*రాత్ర్యాగమే, ప్రలీయన్తే, తత్ర, ఏవ, అవ్యక్త సంజ్ఞకే.*

| | | | |
|---|---|---|---|
| అహరాగమే | = బ్రహ్మయొక్క పగలు వచ్చినతోడనే; | సర్వాః వ్యక్తయః | = చరాచర వస్తువులన్నీ; |
| | | ప్రభవంతి | = జన్మిస్తున్నాయి; |
| అవ్యక్తాత్ | = అవ్యక్తం నుండి, కార్యం యొక్క అవ్యక్తరూపమైన కారణం నుండి; | రాత్ర్యాగమే | = బ్రహ్మయొక్క రాత్రి రావడంతోనే; |

1. చతుర్యుగ సహస్రం తు బ్రహ్మణో దినముచ్యతే. – విష్ణు పురాణమ్.

నాలుగు సహస్రయుగాలు బ్రహ్మకు ఒక దినం (పన్నెండు గంటలు) అవుతున్నాయి. రాత్రి ఇట్లే వేయుగ. ఇట్టి దివా-రాత్రి గణనను అనుసరించి బ్రహ్మ యొక్క ఆయువు శతవర్షము.
ఇక్కడ యుగశబ్దానికి సత్య, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగు అని అర్థం. – మను స్మృతి. 1-73

తత్ర ఏవ = దానియందే;
అవ్యక్తసంజ్ఞకే = అవ్యక్తమనబడే కారణంలోనే;
ప్రలీయంతే = విలీనమవుతున్నాయి.

**తా॥** బ్రహ్మయొక్క పగలు మొదలవగానే చర-అచరాలైన వస్తువులన్నీ అవ్యక్తం నుండి అభివ్యక్తం అవుతున్నాయి; రాత్రి అవగానే ఆ అవ్యక్తకారణంలోనే చరాచర వస్తుజాతమంతా లయమవుతోంది. 18

**భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।**
**రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే ॥ 19**

*భూతగ్రామః, సః, ఏవ, అయమ్, భూత్వా, భూత్వా, ప్రలీయతే, రాత్రి ఆగమే, అవశః, పార్థ, ప్రభవతి, అహరాగమే.*

పార్థ = అర్జునా;
సః ఏవ = పూర్వం ఉన్న;
అయమ్ = ఈ;
భూతగ్రామః = ప్రాణిసమూహమే;
భూత్వభూత్వా = మళ్ళీ మళ్ళీ పుట్టి;
రాత్రి ఆగమే = బ్రహ్మ యొక్క రాత్రి అయినప్పుడు;
ప్రలీయతే = లయమవుతోంది;
అహరాగమే = బ్రహ్మయొక్క పగలు అయినప్పుడు;
అవశః = తమ తమ కర్మలకు అధీనమై;
ప్రభవతి = ఉత్పన్నమవుతోంది.

**తా॥** పార్థా! (పూర్వకల్పంలో ఉన్న) ఆ భూతసమూహమే మళ్ళీ మళ్ళీ పుడుతూ బ్రహ్మ యొక్క రాత్రి అయిన వెంటనే లయమవుతున్నాయి; మరియు, బ్రహ్మ యొక్క పగలు మొదలవగానే తమ తమ కర్మలకు లోనై మళ్ళీ జన్మిస్తున్నాయి. (మను స్మృతిః. 1-52 చూ.) 19

**పరస్తస్మాత్తు భావోఽన్యో అవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః ।**
**యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20**

*పరః, తస్మాత్, తు, భావః, అన్యః, అవ్యక్తః, అవ్యక్తాత్, సనాతనః, యః, సః, సర్వేషు, భూతేషు, నశ్యత్సు, న, వినశ్యతి.*

తు = కాని;
తస్మాత్ = ఆ;
అవ్యక్తాత్ = ప్రజాపతి నిద్రా రూపమైన అవ్యక్తం కంటే;

| | | | |
|---|---|---|---|
| పరః | = వేరైన; | భావః | = బ్రహ్మస్వరూపం; |
| అన్యః | = మరొక; | (కలదో) సః | = అది; |
| అవ్యక్తః | = ఇంద్రియ అగోచరమూ; | సర్వేషు భూతేషు | = సమస్తభూతాలూ; |
| సనాతనః | = అనాదీ అయిన; | నశ్యత్సు | = వినష్టమైనప్పటికీ; |
| యః | = ఏ; | న వినశ్యతి | = వినాశం పొందదు. |

**తా॥** (అక్షరబ్రహ్మ యొక్క స్వరూపం ఈ రెండు శ్లోకాలలో వర్ణించబడుతోంది:) ప్రజాపతి నిద్రావస్థయైన అవ్యక్తం కంటే వేరైనదీ[1], చక్షురాది ఇంద్రియాలకు అగోచరమైనదీ, స్వతంత్రమైనదీ అయిన ఏ చేతనబ్రహ్మ స్వరూపం కలదో; అది స్థావరజంగమాదులైన సర్వభూతాలు నశించినా నశించదు. 20

**అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 21**

*అవ్యక్తః, అక్షరః, ఇతి, ఉక్తః, తమ్, ఆహుః, పరమామ్, గతిమ్,*
*యమ్, ప్రాప్య, న, నివర్తంతే, తత్, ధామ, పరమమ్, మమ.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఏది; | యమ్ | = ఏ అక్షరమును; |
| అవ్యక్తః | = ఇంద్రియ అగోచరమూ; | ప్రాప్య | = పొందిన; (జీవులు) |
| అక్షరః | = వినాశరహితమూ; | న నివర్తంతే | = తిరిగి రావడం లేదో; |
| ఇతి ఉక్తః | = అని చెప్పబడిందో; | తత్ | = అది; |
| తమ్ | = దానినే; | మమ | = నా(విష్ణుని); |
| పరమామ్ | = శ్రేష్ఠమైన; | పరమమ్ | = శ్రేష్ఠమైన; |
| గతిమ్ | = గతి అని; | ధామ | = పదం (స్వరూపం). |
| ఆహుః | = అంటారు; | | |

**తా॥** వినాశరహితుడు, ఇంద్రియాతీతుడు, అక్షరబ్రహ్మము – అని ఎవరిని గురించి శాస్త్రం వర్ణిస్తున్నదో,[2] అతనినే (జీవుని) శ్రేష్ఠగతి అనికూడా అంటారు.[3] ఏ అక్షరమును ఎరిగితే మళ్ళీ ఈ సంసారానికి తిరిగిరావడం అనేది లేదో, అదే నా (విష్ణుని) పరమపదము.[4] 21

1. పూర్వశ్లోకంలో ఈ స్థితి అవ్యక్తనామంతో పేర్కొనబడింది.
2. అక్షరాత్సంభవతీహ విశ్వమ్ – ముండకోపనిషత్తు 1-1-7.
3. పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః. – కఠోపనిషత్తు. 1-3.11.
4. తద్విష్ణోః పరమం పదమ్–పద్యతే గమ్యతే ఇతి పదమ్– ప్రాప్యవస్తువు విష్ణునిపదం–విష్ణువే పదం.

**పురుషః స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా ।**
**యస్యాన్తః స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22**

*పురుషః, సః, పరః, పార్థ, భక్త్యా, లభ్యః, తు, అనన్యయా,*
*యస్య, అన్తః స్థాని, భూతాని, యేన, సర్వమ్, ఇదమ్, తతమ్.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | తతం తు | = వ్యాప్తమై ఉందో; |
| భూతాని | = జీవులందరూ; | సః | = ఆ; |
| యస్య | = ఎవని; | పరః | = పరుడైన; |
| అన్తఃస్థాని | = లోపలవెలయుచున్నారో; | పురుషః | = పురుషుని(పరమేశ్వరుణ్ణి); |
| యేన | = ఎవని చేత; | అనన్యయా | = ఏకాంతమైన; |
| ఇదమ్ | = ఈ; | భక్త్యా | = భక్తిచేత; |
| సర్వమ్ | = జగత్తు అంతా; | లభ్యః | = పొంద సాధ్యము. |

**తా॥** పార్థా! సమస్తభూతాలూ ఎవ్వని యందు వెలయుచున్నాయో, (కారణభూతుడైన) ఎవ్వనిచే ఈ జగత్తంతా పరివ్యాప్తమై ఉందో, ఆ పరమేశ్వరుణ్ణి, అనన్యమైన భక్తి చేత పొందవచ్చు. (గీత: 11–54 చూ:) 22

**యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23**

*యత్ర, కాలే, తు, అనావృత్తిమ్, ఆవృత్తిమ్, చ, ఏవ, యోగినః,*
*ప్రయాతాః, యాన్తి, తమ్, కాలమ్, వక్ష్యామి, భరతర్షభ.*

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ | = భరతశ్రేష్ఠా; | ఆవృత్తిం చ | = పునర్జన్మను; |
| యత్ర కాలే | = ఏ కాలంలో (ఏ మార్గంలో); | యాన్తి ఏవ | = పొందుతారో; |
| ప్రయాతాః తు | = ప్రయాణిస్తే; | తమ్ | = ఆ; |
| యోగినః | = ఉపాసకులూ (కర్మిష్ఠులూ); (యథాక్రమంగా) | కాలమ్ | = కాలాన్ని గురించి; |
| | | వక్ష్యామి | = చెబుతాను. |
| అనావృత్తిమ్ | = ముక్తిని; | | |

**తా॥** ('పరమేశ్వరోపాసకులు తత్పదాన్ని పొంది, మళ్ళీ జన్మను పొందరు, ఇతరులు జన్మిస్తారు' – అని చెప్పబడింది. ఇక, ఏ మార్గంలో ప్రయాణించిన వారు జన్మిస్తారో, మరి ఏ మార్గాన్ని అనుసరిస్తే వారు జన్మించరో చెప్పబడుతోంది:)

భరతర్షభా! ఏ కాలంలో[1] మృతులైతే ఉపాసకులు (ధ్యానయోగులు) కర్మిష్ఠులు (సకామ కర్మమొనర్చే వారూ) యథాక్రమంగా మోక్షాన్ని, పునర్జన్మను పొందుతారో, ఆ కాలాన్ని గురించి చెబుతాను.[2] 23

**అగ్నిర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24**

*అగ్నిః, జ్యోతిః, అహః, శుక్లః, షణ్మాసాః, ఉత్తరాయణమ్,*
*తత్ర, ప్రయాతాః, గచ్ఛన్తి, బ్రహ్మ, బ్రహ్మవిదః, జనాః.*

| | | | |
|---|---|---|---|
| అగ్నిః | = అగ్ని; | ప్రయాతాః | = ప్రయాణిస్తే; |
| జ్యోతిః | = జ్యోతి; | బ్రహ్మవిదః | = సగుణబ్రహ్మోపాసకులు అయిన; |
| అహః | = దినము; | జనాః | = జనులు; |
| శుక్లః | = శుక్లపక్షము; | బ్రహ్మ | = బ్రహ్మాన్ని; |
| షణ్మాసాః ఉత్తరాయణమ్ | = ఆరు మాసాలు గల ఉత్తరాయణం గల; | గచ్ఛంతి | = పొందుతున్నారు. |
| తత్ర | = ఆ మార్గంలో; | | |

**తా॥** అగ్ని, జ్యోతి, దినం, శుక్లపక్షం, షణ్మాసయుక్తమైన ఉత్తరాయణం అనేవి గల దేవయాన మార్గంలో ప్రయాణిస్తే పరమేశ్వరోపాసకులు బ్రహ్మాన్ని పొందుతున్నారు[3] (మళ్ళీ తిరిగి రారు.) (బృహదారణ్యకోపనిషత్తు. 6-2-15; ఛాందోగ్యోపనిషత్తు. 4-15-1; 5-10-1 చూ:) 24

---

1. ఇచ్చట కాలశబ్దానికి మార్గమని అర్థం. – గీతోక్తమైన మార్గద్వయంలో ఇతర దేవతల కంటే, కాలాభిమాని దేవతల సంఖ్యయే ఎక్కువ. ఇదే కారణంగా అగ్ని, జ్యోతి కాలసంబంధాలు కాకపోయినా, కాలసూచకాలే అవుతున్నాయి. మామిడిచెట్లు ఎక్కువగా ఉంటే, మామిడితోట అనబడే విధంగా!

2. యోగినః ప్రతి స్మర్యతే స్మార్తేచైతే. – వేదాంత సూత్రమ్. 4-2-21.

3. **అగ్నిః, జ్యోతిః** = అర్చిరభిమానిదేవత; **అహః** = దివసాభిమానిదేవత; **శుక్లః** = శుక్లపక్షాభిమాని దేవత; **ఉత్తరాయణమ్** = ఉత్తరాయణాభిమానియైన దేవత; **ధూమః** = ధూమాభిమానియగు దేవత; **రాత్రి** = రాత్ర్యభిమాని దేవత; **కృష్ణః** = కృష్ణపక్షాభిమాని దేవత; **దక్షిణాయనం** = దక్షిణాయనాభిమాని దేవత.

**తా॥** దేవయానమార్గంలో జనిన యోగి అర్చి, రహ, శ్శుక్లపక్ష, ఉత్తరాయణ, సంవత్సర, దేవలోక, వాయు, సూర్య, చంద్ర, విద్యుత్, వరుణ, ఇంద్ర, ప్రజాపతులను చేరును. అమానవ పురుషుడు ప్రజాపతి లోకం నుండి విద్యుత్ లోకాని కేగి ఉపాసకుని ప్రజాపతిలోకానికి (బ్రహ్మలోకానికి) గొనిపోవును. ఆ ఉపాసకునికి మళ్ళీ జన్మ లేదు. (వేదాంత సూత్రమ్. 4-1-1, 3 చూ.) →

**ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25**

*ధూమః, రాత్రిః, తథా, కృష్ణః, షణ్మాసాః, దక్షిణాయనమ్,*
*తత్ర, చాన్ద్రమసమ్, జ్యోతిః, యోగీ, ప్రాప్య, నివర్తతే.*

| | | | |
|---|---|---|---|
| ధూమః | = ధూమం; | తత్ర | = ఆ మార్గంలో; |
| రాత్రిః | = రాత్రి; | యోగీ | = కర్మపరుడు; |
| తథా | = మరియు; | చాంద్రమసమ్ | = చంద్రుని; |
| కృష్ణః | = కృష్ణ పక్షం; | జ్యోతిః | = జ్యోతిని; |
| షణ్మాసాః దక్షిణాయనమ్ | = ఆరు మాసాలు గల దక్షిణాయనంలో గల; | ప్రాప్య | = పొంది; |
| | | నివర్తతే | = తిరిగి జన్మిస్తున్నాడు. |

**తా॥** ధూమం, రాత్రి, కృష్ణపక్షం, ఆరు మాసాలు గల దక్షిణాయనం అనే వానితో కూడిన పితృయాన మార్గంలో జనిన కర్మపరుడు చంద్రలోకానికి (స్వర్గం) పోయి, ఈ సంసారానికి తిరిగి[1] వస్తున్నాడు. 25

**శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే ।**
**ఏకయా యాత్యనావృత్తిం అన్యయాఽఽవర్తతే పునః ॥ 26**

*శుక్ల కృష్ణే, గతీ, హి, ఏతే, జగతః, శాశ్వతే, మతే,*
*ఏకయా, యాతి, అనావృత్తిమ్, అన్యయా, ఆవర్తతే, పునః.*

| | | | |
|---|---|---|---|
| హి | = ఏమన; | | దక్షిణమార్గం అనే); |
| జగతః | = జగత్తుకు; | ఏతే | = ఈ రెండూ; |
| శుక్ల | =శుక్లం (దేవయానం, ఉత్తరమార్గం); | గతీ | = దారులూ; |
| | | శాశ్వతే | = నిత్యాలు, అనాదులు అని; |
| కృష్ణే | = కృష్ణం (పిత్రుయానం, | మతే | = తలచబడుతున్నాయి; |

→ కర్మిష్ఠి, పితృయానమార్గంలో ధూమాన్ని, రాత్రిని, కృష్ణపక్షాన్ని, దక్షిణాయనాన్ని, పితృలోకాన్ని, దాటి చంద్రలోకాన్ని అంటే స్వర్గాన్ని పొందుతాడు. స్వర్గభోగాంతరం మళ్ళీ జన్మిస్తాడు.

– బృహదారణ్యకోపనిషత్తు 6-2-14 చూ.

ఆతివాహిక శరీరం, దేవతలను గుఱించి – వేదాంత సూత్రమ్. 4-3-4 చూ.

1. తిరిగి వచ్చే మార్గం – ఛాందోగ్యోపనిషత్తు. 5-10-5, 6 చూ.

| | | | |
|---|---|---|---|
| ఏకయా | = ఒకదానిచేత (శుక్లమార్గంలో); | అన్యయా | = మరొకదానిచేత (కృష్ణమార్గంలో); |
| అనావృత్తిమ్ | = అపునరావృత్తిని (మోక్షాన్ని); | పునః | = మరల; |
| యాతి | = పొందును; | ఆవర్తతే | = వచ్చి జన్మించును. |

**తా॥** జగత్తులో (జ్ఞానాధికారులకు, కర్మాధికారులకు) (ప్రకాశమయమైన) శుక్లగతియూ, (తమోమయమైన) కృష్ణగతియూ (సంసారం ప్రవాహరూపంలో నిత్యమవడం వల్ల) శాశ్వతాలని గ్రహించు. దేవయాన మార్గంలో ప్రయాణించిన వాడు (క్రమ) ముక్తి పొందుతున్నాడు. పిత్ృయాన మార్గంలో జనినవాడు తిరిగొచ్చి మళ్ళీ జన్మిస్తున్నాడు. (గీత : 9-21; వేదాంత సూత్రమ్. 3-1-8 చూ:)[1] 26

**నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।**
**తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ 27**

న, ఏతే, సృతీ, పార్థ, జానన్, యోగీ, ముహ్యతి, కశ్చన,
తస్మాత్, సర్వేషు, కాలేషు, యోగయుక్తః, భవ, అర్జున.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | న ముహ్యతి | = మోహాన్ని పొందదు; |
| ఏతే | = ఈ; | తస్మాత్ | = కనుక; |
| సృతీ | = రెండుమార్గాలను; | అర్జున | = పార్థా; |
| జానన్ | = ఎరిగిన; | సర్వేషు కాలేషు | = సర్వకాలములందు; |
| కశ్చన | = ఏ ఒక్క; | యోగ యుక్తః భవ | = సమాహితుడవు కమ్ము. |
| యోగీ | = ఉపాసకుడుగాని కర్మపరుడుగాని; | | |

**తా॥** ఈ గతుల (మార్గాల) రీతిని ఎరిగిన[2] ఉపాసకుడు గాని కర్మి గాని మోహగ్రస్తుడు కాడు. అంటే, అనిత్యాలూ దక్షిణమార్గ ప్రాపకాలూ అయిన ఉపాసనావర్జితాలైన కర్మల దెసకు పోడు - పరమేశ్వరనిష్ఠుడు అవుతాడు. కనుక, అర్జునా! నీవు సర్వదా సమాహిత చిత్తుడవు కమ్ము! 27

1. అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్ -వేదాంత సూత్రమ్ 3-3-31.

2. (అ) ఉపాసనాంగంగా ఉత్తరమార్గాన్ని ధ్యానించాలి. ఎప్పుడు మృతిచెందినా ఉపాసకుడు దేవయానాన్ని, కర్మి పితృయానాన్ని పొందుతున్నారు. ఉత్తరాయణంలో దివాసమయంలో మృతిచెందితే దేవయానగతి; →

**వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ**
**దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా**
**యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ 28**

వేదేషు, యజ్ఞేషు, తపస్సు, చ, ఏవ, దానేషు, యత్, పుణ్యఫలమ్, ప్రదిష్టమ్, అత్యేతి, తత్, సర్వమ్, ఇదమ్, విదిత్వా, యోగీ, పరమ్, స్థానమ్, ఉపైతి చ, ఆద్యమ్.

వేదేషు = వేదాలలో;
యజ్ఞేషు = యజ్ఞాలలో;
తపస్సు చైవ = తపస్సులలో;
దానేషు = దానాలలో;
యత్ = ఏ;
పుణ్యాఫలమ్ = పుణ్య ఫలంగా;
ప్రదిష్టమ్ = శాస్త్రాలలో చెప్పబడిందో;
ఇదమ్ = ఈ బ్రహ్మకర్మాది సప్తపదార్థ తత్త్వాన్ని, ఈ ఎనిమిది ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా చెప్పబడిన దీనిని;
విదిత్వా = గ్రహించిన (అనుష్ఠించిన);
యోగీ = సమాహిత చిత్తుడు; (జ్ఞానియై)
తత్ = ఆ;
సర్వమ్ = సర్వాన్ని;
అత్యేతి = అతిక్రమిస్తూ, దానికంటే ఉన్నతమైన యోగైశ్వర్యాన్ని పొందుతాడు;
చ = మరియు;
ఆద్యమ్ = జగన్మూలభూతమైన;
పరమ్ = శ్రేష్ఠమైన;
స్థానమ్ = విష్ణుపదాన్ని (బ్రహ్మపదాన్ని);
ఉపైతి = పొందుతాడు.

**తా॥** వేదాధ్యయనం, యజ్ఞానుష్ఠానం, తపస్సు, దానం - వీటికి ఏ పుణ్యఫలం శాస్త్రాలలో నిర్దిష్టమై ఉందో ఈ అధ్యాయంలో తెలుపబడిన దానిని గ్రహించి అనుష్ఠించే యోగి(జ్ఞానియై), దానిని అతిక్రమిస్తున్నాడు - అంతకంటే

→
దక్షిణాయనంలో రాత్రికాలంలో మరణించిన పిత్రుయానగతి -అనే సాధారణ విశ్వాసం సత్యం కాదు
- ఆనందగిరి.

రశ్మ్యనుసారీ (వేదాంత సూత్రమ్ 4-2-18) అతశ్చాయనేపి దక్షిణే(4-2-20) అనే సూత్రాలలో ఈ విషయమే తెలుపబడింది.

(ఆ) ఉపాసనా సహితాలైన నివృత్తి కర్మల చేత క్రమముక్తియూ, కామ్యకర్మల చేత స్వర్గ భోగానంతరం ఆవృత్తియూ, నిషిద్ధ కర్మ చేత నరక భోగానంతరం ఆవృత్తియూ, క్షుద్ర కర్ములైన వారికి ఇక్కడే మళ్ళీ మళ్ళీ జన్మ అనీ, జ్ఞానికి ఇక్కడే ముక్తి అని గ్రహించాలి.

శ్రేష్ఠమైన యోగైశ్వర్యాన్ని పొందుతున్నాడు. మరియు, జగన్మూలభూతమూ, శ్రేష్ఠమూ అయిన బ్రహ్మపదాన్ని పొందుతున్నాడు. 28

**ఇతి శ్రీమహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మయోగోనామ[1]**

**అష్టమోఽధ్యాయః**

శ్లోకసంఖ్య–28. మొదటినుండి– (310+28=) 338.

**అష్టమేష్టవిశిష్టేఽష్టసంపృష్టార్థవినిర్ణయైః ।**
**అక్లిష్టమష్టధాప్రాప్తిః స్పష్టతోష్టమవర్త్మనా ॥**

**తా॥** ఈ అష్టమాధ్యాయంలో అభిలషితాలను, విశేషంగా వర్ణితములూ అయిన ఎనిమిది ప్రశ్నల అర్థ నిర్ణయం ఒనర్చబడింది : ఈ అష్టమయోగంలో వీటిని గ్రహిస్తే అభిలషిత స్థానాన్ని పొందవచ్చునని స్పష్టంగా చెప్పబడింది.



1. ఈ అధ్యాయం మహాపురుషయోగం, బ్రహ్మాక్షరనిర్దేశ యోగం, అక్షరపరబ్రహ్మయోగం, అభ్యాసయోగం, తారకబ్రహ్మయోగం, ధారణాయోగం అని కూడా పేర్కొబడుతోంది.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## నవమోఽధ్యాయః
## రాజవిద్యా రాజగుహ్య యోగః
## (నవమాధ్యాయం - రాజవిద్యా రాజగుహ్య యోగం)

పరేశః ప్రాప్యతే శుద్ధభక్త్యేత స్థిత మష్టమే ।
నవమే తు త దైశ్వర్య మత్యాశ్చర్యం ప్రపంచ్యతే[1] ॥

*శ్రీభగవానువాచ :*

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ 1**

ఇదమ్, తు, తే, గుహ్యతమమ్, ప్రవక్ష్యామి, అనసూయవే,
జ్ఞానమ్, విజ్ఞానసహితమ్, యత్, జ్ఞాత్వా, మోక్ష్యసే, అశుభాత్.

| | | | |
|---|---|---|---|
| యత్ | = దేనిని; | విజ్ఞానసహితమ్ | = అనుభవ యుక్తమైనదీ; |
| జ్ఞాత్వా | = తెలుకుంటే; | (అయిన) జ్ఞానమ్ | = బ్రహ్మజ్ఞానాన్ని; |
| అశుభాత్ | = సంసారబంధం నుండి; | అనసూయవే[2] | = అసూయారహితుడవైన; |
| మోక్ష్యసే | = విడివడగలవో; | తే తు | = నీకే; |
| (అట్టి) ఇదమ్ | = ఈ; | ప్రవక్ష్యామి | = చెబుతున్నాను. |
| గుహ్యతమమ్ | = అత్యంత రహస్యమైనదీ; | | |

1. పరమ పురుషుడైన ఈశ్వరుడు శుద్ధభక్తి చేత లభ్యుడని అష్టమాధ్యాయంలో చెప్పబడింది; ఈ అధ్యాయంలో ఆ ఈశ్వరుని విస్మయకరమైన విభూతి వర్ణించబడుతోంది.

2. (అ) గుణాల దోషావిష్కరణే అసూయ; దోషాల గుణావిష్కరణే వాత్సల్యం.

(ఆ) న గుణాన్గుణినో హంతి స్తౌతి మందగుణానపి,
నాన్యదోషేషు రమతే సానసూయా ప్రకీర్తితా. – అత్రిస్మృతిః 34.

**తా॥** (అచింత్యమైన తన ఐశ్వర్యాన్ని, భక్తికి గల అసాధారణ ప్రభావాన్ని వర్ణిస్తూ–) *శ్రీభగవానుడు పలికెను :* (ధర్మజ్ఞానం గుహ్యమైనది, దానికంటే దేహాది వ్యతిరిక్తమైన ఆత్మజ్ఞానం గుహ్యతరమైనది, దానికంటే కూడా) గుహ్యతమమైన బ్రహ్మజ్ఞానాన్ని అనుభవ జ్ఞాన (ఉపాసనా) సహితంగా, (మళ్ళీ మళ్ళీ తన మాహాత్మ్యాన్నే వర్ణిస్తున్నాడే అనే) దోషదృష్టి లేని నీకు ఉపదేశిస్తున్నాను; దీనిని గ్రహిస్తే అశుభకరమైన సంసార బంధనం నుండి వెనువెంటనే ముక్తిని పొందగలవు.

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ 2**

*రాజవిద్యా, రాజగుహ్యమ్, పవిత్రమ్, ఇదమ్, ఉత్తమమ్,*
*ప్రత్యక్ష అవగమమ్, ధర్మ్యమ్, సుసుఖమ్, కర్తుమ్, అవ్యయమ్.*

ఇదమ్ = ఈ బ్రహ్మవిద్య; రాజవిద్యా = విద్యలన్నిటిలో శ్రేష్ఠమైనది; రాజగుహ్యమ్ = అతిగుహ్యం (అనధికారికి అప్రకాశ్యం); ఉత్తమమ్ = శ్రేష్ఠమైనది; పవిత్రమ్ = విశుద్ధమైనది; ప్రత్యక్ష అవగమమ్ = సాక్షాత్తుగా ఫలం ఒసగేది, సుఖాదులవలే ప్రత్యక్షబోధగమ్యం; ధర్మ్యమ్ = ధర్మ సంగతం; కర్తుమ్ = అనుష్ఠించడానికి; సు సుఖమ్ = మిక్కిలి తేలిక; చ = మరియు; అవ్యయమ్ = అక్షయఫలప్రదమైనదీ (అయి ఉంది.)

**తా॥** ఈ బ్రహ్మవిద్య అతిగుహ్యమూ, శ్రేష్ఠమూ, అనధికారికి అప్రకాశ్యమూ, సాక్షాత్తుగా ఫలాన్ని ఒసగేదీ, ధర్మసంగతమూ, సహజసాధ్యమూ, అక్షయ ఫలప్రదమూ అయి ఉంది. 2

**అశ్రద్దధానాః పురుషాః ధర్మస్యాస్య పరన్తప ।**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యు సంసారవర్త్మని ॥ 3**

*అశ్రద్దధానాః, పురుషాః, ధర్మస్య, అస్య, పరన్తప,*
*అప్రాప్య, మామ్, నివర్తన్తే, మృత్యు సంసారవర్త్మని.*

| | | | |
|---|---|---|---|
| పరన్తప | = అర్జునా; | మామ్ | = నన్ను; |
| అస్య | = ఈ; | అప్రాప్య | = పొందక; |
| ధర్మస్య | = బ్రహ్మజ్ఞానమనే ఈ ధర్మంలో; | మృత్యు సంసార వర్త్మని | = మృత్యు సంకులమైన సంసారపథానికి; |
| అశ్రద్దధానాః | = విశ్వాసరహితులైన; | నివర్తన్తే | = మరలుతున్నారు. |
| పురుషాః | = పురుషులు; | | |

**తా॥** అర్జునా! ఈ బ్రహ్మజ్ఞానమనే[1] ధర్మం యొక్క స్వరూప ఫలాల పట్ల శ్రద్ధాహీనులైన పురుషులు నన్ను పొందకుండా, మృత్యుమయమైన సంసార పథానికి మరలుతున్నారు. 3

**మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।**
**మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ 4**

మయా, తతమ్, ఇదమ్, సర్వమ్, జగత్, అవ్యక్తమూర్తినా,
మత్స్థాని, సర్వభూతాని, న, చ, అహమ్, తేషు, అవస్థితః.

| | | | |
|---|---|---|---|
| అవ్యక్త మూర్తినా | = అవ్యక్తమూర్తినైన, (ఇంద్రియాగోచరుడనగు); | సర్వభూతాని | = సర్వభూతాలు; |
| | | మత్స్థాని | = నాయందే ఉన్నాయి; |
| మయా | = నాచేత; | అహం చ | = మరి నేను; |
| ఇదమ్ | = ఈ; | తేషు | = వాటిపై; |
| సర్వం జగత్ | = జగత్తంతా; | న అవస్థితః | = ఆధారపడి; (ఉన్నవాడను కాదు). |
| తతమ్ | = వ్యాప్తమై ఉంది; | | |

**తా॥** అతీంద్రియ స్వరూపుణ్ణి, కారణభూతుణ్ణి అయిన నాచే ఈ విశ్వమంతా పరివ్యాప్తమై ఉంది.[2] కనుక, చరాచర భూతాలన్నీ (కారణ భూతుణ్ణైన) నాయందే వెలయుచున్నాయి. కాని, నేను (ఆకాశం వలే అసంగుణ్ణి అవడం వల్ల) వాటి యందు (స్వకార్యాలైన ఘటాదులలో మృత్తిక వలే) ఉండడం లేదు. 4

**న చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।**
**భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5**

---

1. భక్తిసహితమైన జ్ఞానం అని శ్రీధరుల వ్యాఖ్యానం.
2. తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్. – *తైత్తిరీయోపనిషత్తు 2-6.*

న, చ, మత్ స్థాని, భూతాని, పశ్య, మే, యోగమ్, ఐశ్వరమ్,
భూతభృత్, న, చ, భూతస్థః, మమ, ఆత్మా, భూతభావనః.

| | | | |
|---|---|---|---|
| భూతాని చ | = మరియు, భూతాలు; | మమ | = నా; |
| న మత్ స్థాని | = నాయందు ఉండుటలేదు; | ఆత్మా | = స్వరూపం; |
| మే | = నా; | భూత భృత్ | = భూతాలను భరించేదీ; |
| ఐశ్వరమ్‌యోగం | = ఈశ్వర సంబంధమైన యోగాన్ని; | భూత భావనః | = భూతాలను పోషించేదీ; |
| పశ్య | = చూడు; | (అయినప్పటికీ) న చ భూతస్థః | = వాటి యందు ఉండుట లేదు. |

**తా॥** ఐశ్వరమైన నా యోగాన్ని (అసాధారణమైన యోగ మాయా వైభవాన్ని) చూడు. భూతాలు (అసంగుడనైన) నాయందు ఉండడం లేదు. నా స్వరూపం భూతాలను ధరించునదీ, పాలించునదీ అయినప్పటికీ, నేను భూతాల యందు లేను. (జీవుడు శరీరాన్ని ధరించి పాలిస్తూ, అహంకారంతో తత్-సంశ్లిష్టుడై అందు వెలయుచున్నాడు. అదే విధంగా నేను భూతాలను ధరించి పాలిస్తున్నాను, అహంకార రహితుడనవడం వల్ల, వాటి యందు నేను ఉండడం లేదు.) 5

**యథాకాశ స్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్ ।**
**తథా సర్వాణి భూతాని మత్ స్థానీత్యుపధారయ ॥ 6**

యథా, ఆకాశ స్థితః, నిత్యమ్, వాయుః, స్సర్వత్రగః, మహాన్,
తథా, సర్వాణి, భూతాని, మత్ స్థాని, ఇతి, ఉపధారయ.

| | | | |
|---|---|---|---|
| యథా | =ఏ విధంగా అయితే; | తథా | = అదే విధంగా; |
| సర్వత్రగః | =అంతటా వ్యాపించే; | సర్వాణి భూతాని | = సకలభూతాలను; |
| మహాన్ | = గొప్పదైన; | మత్ స్థాని | = నాయందు వెలసివున్నాయి; |
| వాయుః | = వాయువు; | ఇతి | = అని; |
| నిత్యమ్ | = సదా; | ఉపధారయ | = గ్రహించు. |
| ఆకాశ స్థితః | = ఆకాశంలో వెలసియున్నదో; | | |

**తా॥** (అసంశ్లిష్టాలైన రెండు వస్తువుల ఆధారాధేయ భావాన్ని దృష్టాంత పూర్వకంగా తెలుపుతున్నాడు:) సర్వసంచారియైన మహావాయువు ఆకాశంలో నిత్యం వెలసి ఉండే రీతిగా, (ఆకాశం లేకపోతే వాయువు ఉండజాలదు; ఆకాశం

నిరవయవం అవడం వల్ల సంశ్లేషం లేదు.) సర్వభూతాలూ నా యందు వెలసి ఉన్నాయని గ్రహించు.[1] (గీత: 13-32; శ్రీమద్భాగవతమ్. 2-9-34) 6

**సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥** 7

*సర్వభూతాని, కౌన్తేయ, ప్రకృతిమ్, యాన్తి, మామికామ్,*
*కల్పక్షయే, పునః, తాని, కల్ప ఆదౌ, విసృజామి, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | పునః | = మళ్ళీ; |
| సర్వభూతాని | = సమస్తభూతాలూ; | కల్ప ఆదౌ | = సృష్టికాలంలో; |
| కల్పక్షయే | = ప్రళయకాలంలో; | తాని | = ఆ భూతాలనన్నింటిని; |
| మామికామ్ | = మదీయము (నా); | అహమ్ | = నేను |
| ప్రకృతిమ్ | = త్రిగుణాత్మికమైన మాయలో; | విసృజామి | = సృష్టిస్తున్నాను. |
| యాన్తి | = కలిసిపోతున్నాయి; | | |

**తా॥** [ఈ విధంగా అసంగుడైన భగవంతుడు యోగమాయ చేత స్థితిహేతువైన రీతి (5వ శ్లోకంలో) చెప్పబడింది; ఇక సృష్టి ప్రళయ హేతుత్వం చెప్పబడుతోంది:] కౌంతేయా! ప్రళయకాలంలో సర్వభూతాలూ త్రిగుణాత్మికమైన నా మాయ యందు లీనమవుతున్నాయి; మళ్ళీ, కల్పారంభంలో నేను వాటిని సృష్టిస్తున్నాను. (కుమార సంభవమ్, 2-4 చూ:) 7

**ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।**
**భూతగ్రామ మిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ॥** 8

*ప్రకృతిమ్, స్వామ్, అవష్టభ్య, విసృజామి, పునః, పునః,*
*భూతగ్రామమ్, ఇమమ్, కృత్స్నమ్, అవశమ్, ప్రకృతేః, వశాత్.*

| | | | |
|---|---|---|---|
| స్వామ్ | = నా; | అవష్టభ్య | = వశమొనర్చుకొని; |
| ప్రకృతిమ్ | = మాయను; | ప్రకృతేః వశాత్ | = పూర్వసంస్కారానుసారం; |

1. ఇక్కడ ఆధారమైన ఆకాశం భగవంతునితో పోల్చబడింది;
ఆధేయమైన వాయువుతో, భూతసమూహం పోల్చబడింది.

| | | | |
|---|---|---|---|
| అవశమ్ | = జనన మరణాలకు ఆధీనమైన; | కృత్స్నమ్ | = సమస్తాన్ని; |
| ఇమమ్ | = ఈ; | పునః పునః | = మళ్ళీ మళ్ళీ, |
| భూత గ్రామమ్ | = భూతసమూహాన్ని; | విసృజామి | = సృష్టిస్తున్నాను. |

**తా॥** (అసంగుడవును నిర్వికారుడవును అయిన నీవు సృజించడం ఎలా అని అంటే–) స్వీయమూ, స్వాధీనమూ, అవిద్యా రూపమూ అయిన మాయను అధిష్ఠించి, ప్రాక్తన సంస్కారవశంతో జన్మమృత్యువులకు అధీనమైన చతుర్విధ భూతాలను, మళ్ళీ మళ్ళీ సృష్టిస్తున్నాను. 7

**న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ।**
**ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు ॥ 9**

*న, చ, మామ్, తాని, కర్మాణి, నిబధ్నన్తి, ధనఞ్జయ,*
*ఉదాసీనవత్, ఆసీనమ్, అసక్తమ్, తేషు, కర్మసు.*

| | | | |
|---|---|---|---|
| ధనఞ్జయ | = అర్జునా; | ఆసీనమ్ | = నెలయు; |
| తేషు | = ఆ; | మామ్ | = నన్ను; |
| కర్మసు | = కర్మలయందు; | తాని | = ఆ; |
| అసక్తమ్ | = అనాసక్తుడనైన; | కర్మాణి | = కర్మలు; |
| ఉదాసీనవత్ చ | = తటస్థునిగా; | న నిబధ్నన్తి | = బంధించవు. |

**తా॥** (ఈ విధంగా నానావిధ కర్మలను ఆచరించే నీకు, జీవుని వలే, బంధం ఎందుకు కలగడం లేదు? అని అంటావా–) (ఆప్తకాముణ్ణి అవడం చేత) ఆ కర్మలలో నాకు ఆసక్తి లేదు. తటస్థుడనై ప్రకాశించే నన్ను అవి బంధింపజాలవు. (నా వలెనే ఇతరులు కూడా కర్తృత్వాభిమాన – ఫలాసక్తి శూన్యులైతే, కర్మల వల్ల బంధించబడరు.) 9

**మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।**
**హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే ॥ 10**

*మయా, అధ్యక్షేణ, ప్రకృతిః, సూయతే, స చర అచరమ్,*
*హేతునా, అనేన, కౌన్తేయ, జగత్, విపరివర్తతే.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | సూయతే | = సృష్టిస్తోంది; |
| అధ్యక్షేణ | = సాక్షినైన; | అనేన | = ఈ; |
| మయా | = నాచేత (నేను సాక్షినై ఉండుటచేత); | హేతునా | = కారణం చేత; |
| | | ఇదమ్ | = ఈ; |
| ప్రకృతిః | = త్రిగుణాత్మికమైన మాయ; | జగత్ | = వ్యక్త-అవ్యక్తమైన విశ్వం; |
| స చర అచరమ్ | = స్థావర జంగమాత్మకమైన జగత్తును; | విపరివర్తతే | = వివిధరూపాల పరివర్తనం పొందుతోంది. |

**తా॥** కౌంతేయా! నేను అధ్యక్షుడనై ఉండడం చేత (అంటే, అధిష్ఠాతనై నిమిత్తభూతుడనవడం చేత) త్రిగుణాత్మికమైన మాయ స్థావరజంగమాత్మకమైన ఈ విశ్వాన్ని సృష్టిస్తోంది; ఈ కారణంగానే వ్యక్తమూ, అవ్యక్తమూ అయిన జగత్తు వివిధరూపాలలో పరివర్తనం పొందుతోంది. (నా అధిష్ఠాతృత్వం సాన్నిధ్యమాత్రమే అవడం చేత, కర్తృత్వ ఉదాసీనత్వాలు పరస్పర విరుద్ధాలు కావు.) (శ్వేతాశ్వతర ఉపనిషత్తు 9-10 చూ:) 10

**అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।**
**పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥ 11**

అవజానన్తి, మామ్, మూఢాః, మానుషీమ్, తనుమ్, ఆశ్రితమ్,
పరమ్, భావమ్, అజానంతః, మమ, భూత మహా ఈశ్వరమ్.

| | | | |
|---|---|---|---|
| భూత మహా ఈశ్వరమ్ | = సర్వభూతేశ్వరుడనైన; | మూఢాః | = మూఢులు; |
| | | మానుషీం తనుమ్ | = మానవదేహాన్ని; |
| మమ | = నా; | ఆశ్రితమ్ | = ధరించిన; |
| పరంభావమ్ | = పరమతత్త్వాన్ని; | మామ్ | = నన్ను; |
| అజానన్తః | = ఎరుగకుండా; | అవజానన్తి | = అవజ్ఞను చూపుతున్నారు. |

**తా॥** నేను నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడనూ, సర్వాత్మ స్వరూపుడనూ, సర్వేశ్వరుడనూ; అయినప్పటికీ (భక్తానుగ్రహార్థం శుద్ధసత్త్వమయమైన) మనుష్య దేహాన్ని ధరిస్తున్నాను. నా పరమస్వరూపాన్ని ఎరుగని మూఢులు,[1] నా ఎడల అవజ్ఞతను చూపుతున్నారు. 11

1. శిశుపాల దుర్యోధనాదులు.

**మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12**

*మోఘ ఆశాః, మోఘకర్మాణః, మోఘజ్ఞానాః, విచేతసః,*
*రాక్షసీమ్, ఆసురీమ్, చ, ఏవ, ప్రకృతిమ్, మోహినీమ్, శ్రితాః.*

మోఘ ఆశాః = వ్యర్థకాములూ;
మోఘ కర్మాణః = విఫలకర్ములూ;
మోఘ జ్ఞానాః = నిష్ఫలజ్ఞానులూ;
విచేతసః = వివేకశూన్యులూ అయినవారు;
మోహినీమ్ = మోహకరమూ, దేహాత్మబుద్ధిని కలిగించేదీ;
రాక్షసీమ్ = రాక్షసమూ (తామసమూ);
ఆసురీం చ = ఆసురమూ (రాజసమూ) అయిన;
ప్రకృతిమ్ = స్వభావాన్ని;
శ్రితాః ఏవ **(సంతః మామ్ అవజానంతి)** = ఆశ్రయించినవారు (అగుచు నన్ను అవమానిస్తున్నారు.)

**తా॥** (అన్యదేవతలు శీఘ్రంగా ఫలాలను ఒసగుతారని తలిచే) వ్యర్థ కాములూ, (నా నుండి విముఖులైన) విఫల కర్ములూ,(నానా విధాలైన కుతర్కాలను ఆశ్రయించే) నిష్ఫల జ్ఞానులూ, (విక్షిప్త చిత్తులైన) వివేకశూన్యులూ, (హింసాది ప్రచురమైన) తామసాన్ని, (కామ దర్పాది బహుళమైన) రాజసాన్ని, బుద్ధి భ్రంశకరమూ అయిన స్వభావాన్ని ఆశ్రయించి, నన్ను అవమానిస్తున్నారు. 12

(గీత : 16-7, 21 చూ:)

**మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః ।**
**భజన్త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥ 13**

*మహాత్మానః, తు, మామ్, పార్థ, దైవీమ్, ప్రకృతిమ్, ఆశ్రితాః,*
*భజన్తి, అనన్య మనసః, జ్ఞాత్వా, భూతాదిమ్, అవ్యయమ్.*

పార్థ = అర్జునా;
తు = కాని;
మహాత్మానః = మహాత్ములైనవారు;
దైవీమ్ = దేవసులభము (సాత్త్వికమైన);
ప్రకృతిమ్ = స్వభావాన్ని;
ఆశ్రితాః = ఆశ్రయించి;
అనన్య మనసః = ఏకాగ్రచిత్తులై;
భూతాదిమ్ = భూతాలకు కారణమూ;
అవ్యయమ్ = అవినాశియు;
(అయిన) మామ్ = నన్ను;
జ్ఞాత్వా = తెలుసుకుని;
భజన్తి = భజిస్తున్నారు.

**తా॥** కాని, పార్థా! దైవీస్వభావాన్ని ఆశ్రయించిన మహాత్ములు (కామాదులకు లొంగక) అనన్య మనస్కులై (నా కంటే వేరుగా ఏమీ లేదని తలుస్తూ) నన్ను జగత్కారణంగా, నిత్యునిగా ఎరిగి భజిస్తున్నారు. (గీత: 16-1, 3 చూ:) 13

**సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।**
**నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14**

*సతతమ్, కీర్తయన్తః, మామ్, యతన్తః, చ, దృఢవ్రతాః,*
*నమస్యన్తః, చ, మామ్, భక్త్యా, నిత్యయుక్తాః, ఉపాసతే.*

| | | | |
|---|---|---|---|
| (వారు) సతతమ్ | = సదా; | నమస్యన్తః | = నమస్కరిస్తున్నవారూ; |
| మామ్ | = నన్ను; | నిత్య యుక్తాః చ | = సర్వదా సమాహితచిత్తులూ అయి; |
| కీర్తయంతః | = కీర్తించే వారూ; | మామ్ | = నన్ను; |
| దృఢవ్రతాః | = సడలని నిష్ఠగలవారూ; | ఉపాసతే | = ఉపాసిస్తారు. |
| యతన్తః చ | = ప్రయత్నశీలురూ; | | |
| భక్త్యా | = పరమప్రీతిచేత; | | |

**తా॥** (వారి భజన ప్రకారం చెప్పబడుతోంది:) ఆ మహాత్ములు నన్ను స్తోత్ర మంత్రాలతో కీర్తిస్తున్నారు. దృఢనియమం గలవారై ఈశ్వరజ్ఞానాన్ని పొంద ప్రయత్నిస్తున్నారు. పరమప్రీతిపూర్వకంగా ప్రణమిల్లుతున్నారు. అనవరతం అవహిత చిత్తులవుతూ నన్ను ఉపాసిస్తున్నారు. 14

**జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే ।**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ 15**

*జ్ఞానయజ్ఞేన, చ, అపి, అన్యే, యజన్త, మామ్, ఉపాసతే,*
*ఏకత్వేన, పృథక్త్వేన, బహుధా, విశ్వతః ముఖమ్.*

| | | | |
|---|---|---|---|
| అన్యే అపి చ | = మరియు, మరికొందరు; | మామ్ | = నన్ను; |
| జ్ఞాన యజ్ఞేన | = భగవత్ విషయకమైన జ్ఞానం అనే యజ్ఞం చేత; | ఉపాసతే | = ఉపాసిస్తారు; |
| యజన్తః | = పూజిస్తూ; | ఏకత్వేన | = బ్రహ్మాత్మైకత్వ రూపమైన పరమార్థ దర్శనం చేత; |

పృథక్త్వేన = భగవంతుడైన విష్ణువే చంద్రాదిత్యాదిరూపాలలో వేరు వేరుగా వెలయుచున్నాడు, అనే భావంతో;
విశ్వతః ముఖమ్ = విశ్వరూపుడనైన నన్ను;
బహుధా = బహువిధాల, రుద్రాదిత్యాది రూపాలలో; (మరికొందరు ఉపాసిస్తున్నారు).

**తా॥** ఇతరులు కొందరు (వాసుదేవుడే సర్వమూ) సర్వాత్మదర్శన రూపమైన జ్ఞానయజ్ఞం చేత నన్ను ఉపాసిస్తున్నారు. ఏకత్వ భావనతో (అంటే అభేద బుద్ధితో) కొందరూ, పృథక్త్వభావన (అంటే దాసోఽహం అనే భావం)తో కొందరూ ఉపాసిస్తున్నారు. మరికొందరు సర్వాత్మకుడనైన నన్ను బ్రహ్మరుద్రాది రూపాలలో ఉపాసిస్తున్నారు. 15

**అహం క్రతురహం యజ్ఞః స్వధాఽహమహ మౌషధమ్ ।**
**మంత్రోఽహ మహమేవాజ్యం అహమగ్ని రహం హుతమ్ ॥ 16**

అహమ్, క్రతుః, అహమ్, యజ్ఞః, స్వధా, అహమ్, అహమ్, ఔషధమ్, మంత్రః, అహమ్, అహమ్, ఏవ, ఆజ్యమ్, అహమ్, అగ్నిః, అహమ్, హుతమ్.

అహమ్ = నేను;
క్రతు = అగ్నిష్టోమాది శ్రౌతయజ్ఞాన్ని;
అహమ్ = నేను;
యజ్ఞః = పంచమహా యజ్ఞాదులైన స్మార్తయజ్ఞాన్ని;
అహమ్ = నేను;
స్వధా = పితృదేవతా సంబంధమైన శ్రాద్ధాన్ని;
అహమ్ = నేను;
ఔషధమ్ = ఔషధీప్రభవమైన అన్నమనే (భేషజమనే);
అహమ్ = నేను;
మన్త్రః = యజమాన పురోహితాదుల వాక్యమైన మంత్రమనే;
అహమ్ = నేను;
ఆజ్యమ్ = హోమసాధనమైన హవిస్సును;
అహమ్ ఏవ = నేనే;
అగ్నిః = హోమాగ్నిని;
అహమ్ = నేను;
హుతమ్ = వ్రేల్చబడు హోమమనే; (ఈ సర్వమును నేనే)

**తా॥** శ్రౌతయజ్ఞం, స్మార్తయజ్ఞం, శ్రాద్ధకర్మ, ఔషధం, మంత్రం, హోమఘృతం, హోమాగ్ని, హవన క్రియ - ఇవన్నీ కూడా నేనే. 16.

**పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్రమోఙ్కారః ఋక్సామ యజురేవ చ ॥ 17**

*పితా, అహమ్, అస్య, జగతః, మాతా, ధాతా, పితామహః,*
*వేద్యమ్, పవిత్రమ్, ఓంకారః, ఋక్, సామ, యజుః, ఏవ, చ.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ ఏవ | = నేనే; | పవిత్రమ్ | = శోధకాలైన ప్రాయశ్చిత్తాదుల్ని; |
| అస్య | = ఈ; | ఓఙ్కారః | = ప్రణవాన్ని; |
| జగతః | = జగత్తుకు; | ఋక్ | = ఋగ్వేదాన్ని; |
| పితా | = జనకుణ్ణి; | సామ | = సామవేదాన్ని; |
| మాతా | = తల్లిని; | యజుః చ | = యజుర్వేదాన్ని కూడా అయి ఉన్నాను. |
| ధాతా | = కర్మఫలదాతను; | | |
| పితామహః | = తాతను; | | |
| వేద్యమ్ | = జ్ఞేయాన్ని; | | |

**తా॥** నేనే ఈ జగత్తుకు తండ్రిని, తల్లిని, కర్మఫలదాతను, పితామహుడను, జ్ఞేయాన్ని, పరిశుద్ధి ప్రదాయకమైన వస్తువును అయి ఉన్నాను. ప్రణవం, ఋగ్వేదం, సామం, యజుస్సును కూడా నేనే. 17

**గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసః శరణం సుహృత్ ।**
**ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ 18**

*గతిః, భర్తా, ప్రభుః, సాక్షీ, నివాసః, శరణమ్, సుహృత్,*
*ప్రభవః, ప్రలయః, స్థానమ్, నిధానమ్, బీజమ్, అవ్యయమ్.*

| | | | |
|---|---|---|---|
| (నేను) గతిః | = కర్మఫలమూ; | ప్రభవః | = స్రష్టను; |
| భర్తా | = పోషకుణ్ణి; | ప్రలయః | = సంహర్తను; |
| ప్రభుః | = స్వామిని; | స్థానమ్ | = ఆధారమనే; |
| సాక్షీ | = ప్రాణుల శుభాశుభాలకు ద్రష్టను; | నిధానమ్ | = ప్రళయస్థానాన్ని; |
| నివాసః | = వాసస్థానమనే; | అవ్యయమ్ | = అక్షయమైన; |
| శరణమ్ | = ఆశ్రయుణ్ణి; | బీజమ్ | = కారణాన్ని; |
| సుహృత్ | = ప్రత్యుపకారాన్ని కోరకుండా హితాన్ని కూర్చేవాణ్ణి; | (అయి ఉన్నాను.) | |

**తా॥** నేను కర్మఫలమునూ, పోషకుడనూ, ప్రభువునూ, సర్వప్రాణుల శుభాశుభాల ద్రష్టనూ, వాస స్థానాన్ని, శరణాగతుల ఆర్తిని హరించేవాణ్ణి, ప్రత్యుపకారాన్ని కోరకుండా హితాన్ని కూర్చేవాణ్ణి, స్రష్టను, సంహర్తను, ఆధారమూ, ప్రళయస్థానమూ, అక్షయమైన జగత్కారణమూ అయి ఉన్నాను. 18

**తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున ॥ 19**

*తపామి, అహమ్, అహమ్, వర్షమ్, నిగృహ్ణామి, ఉత్సృజామి, చ,*
*అమృతమ్, చ, ఏవ, మృత్యుః, చ, సత్, అసత్, చ, అహమ్, అర్జున.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా; | అమృతమ్ చ ఏవ | = దేవతల అమృతాన్ని; |
| అహమ్ | = నేను; | మృత్యుః చ | = మర్త్యుల మృత్యువును కూడా; (నేనే) |
| తపామి | = వేడినొసగుతున్నాను; | అహమ్ | = నేను; |
| అహమ్ | = నేను; | సత్ | = స్థూలం, దృశ్యాన్ని; |
| వర్షమ్ | = వానను; | అసత్ చ | = సూక్ష్మం, అదృశ్యాన్ని కూడా; (అయి ఉన్నాను). |
| నిగృహ్ణామి | = బిగబట్టుతున్నాను; | | |
| ఉత్సృజామి చ | = విడుస్తున్నాను; | | |

**తా॥** సూర్యుని రూపంలో నేను వేడిని ఇస్తున్నాను; జలాన్ని ఆకర్షిస్తూ వర్షిస్తున్నాను. అమరుల అమృతాన్ని మర్త్యుల మృత్యువును స్థూలసూక్ష్మములైన వస్తువులు కూడా నేనే.[1] 19

**త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా**
**యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।**
**తే పుణ్యమాసాద్య సురేన్ద్ర లోకమ్**
**అశ్నన్తి దివ్యాన్ దివిదేవ భోగాన్ ॥ 20**

*త్రైవిద్యాః, మామ్, సోమపాః, పూతపాపాః, యజ్ఞైః, ఇష్ట్వా, స్వర్గతిమ్, ప్రార్థయన్తే, తే, పుణ్యమ్, ఆసాద్య, సురేన్ద్ర లోకమ్, అశ్నన్తి, దివ్యాన్, దివి, దేవ భోగాన్.*

---

1. ఇక్కడ భగవంతుని సర్వాత్మత్వాన్ని సూచించడానికి ముప్పై ఐదు విషయాలు చెప్పబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| త్రైవిద్యా | = త్రివేదజ్ఞులు; | తే | = వారు; |
| యజ్ఞైః | = యజ్ఞాల చేత; | పుణ్యమ్ | = పుణ్యఫలమైన; |
| మామ్ | = నన్ను; | సురేన్ద్ర లోకమ్ | = ఇంద్రలోకాన్ని; |
| ఇష్ట్వా | = పూజించి; | ఆసాద్య | = పొంది; |
| సోమ పాః | = యజ్ఞశేషంలో సోమరసాన్ని త్రాగి; | దివి | = స్వర్గంలో; |
| | | దివ్యాన్ | = అప్రాకృతాలు (మనుష్యదేహంతో పొందజాలని); |
| పూత-పాపాః | = పాప ముక్తులై; | దేవ భోగాన్ | = దేవభోగాలను; |
| స్వర్గతిమ్ | = స్వర్గ గమనాన్ని; | అశ్నన్తి | = భోగిస్తున్నారు. |
| ప్రార్థయంతే | = ప్రార్థిస్తున్నారు; | | |

**తా॥** [శీఘ్రంగా ఫలాన్ని పొందగోరి అన్యదేవతలను ఆశ్రయించే అభక్తుల విషయం (గీత:9-11,12) చెప్పబడింది. అదే విధంగా భక్తుల విషయం కూడా (గీత : 9-13) తెలుపబడింది. అందులో, ఏకత్వ-భావంతో గాని లేక పృథక్త్వ-భావనతో గాని భగవత్ భజన ఒనర్చని వానికి జన్మ-మృత్యు ప్రవాహం అనివార్యం అని తెలుపుతున్నాడు:] త్రివేదజ్ఞులైనవారు యజ్ఞానుష్ఠానం చేత నన్ను పూజించి, యజ్ఞాంతంలో సోమపానం ఒనర్చి పాపముక్తులై, స్వర్గగమనాన్ని ప్రార్థిస్తున్నారు; వారు పుణ్యఫలమైన ఇంద్రలోకాన్ని పొంది, అప్రాకృతాలైన దివ్యభోగాలను అనుభవిస్తున్నారు. 20

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।**
**ఏవం త్రయీధర్మమనుప్రపన్నా**
**గతాగతం కామకామా లభన్తే ॥ 21**

*తే, తమ్, భుక్త్వా, స్వర్గలోకమ్, విశాలమ్, క్షీణే, పుణ్యే, మర్త్యలోకమ్, విశంతి, ఏవమ్, త్రయీధర్మమ్, అనుప్రపన్నాః, గత ఆగతమ్, కామకామాః, లభన్తే.*

| | | | |
|---|---|---|---|
| తే | = వారు; | పుణ్యేక్షీణే | = పుణ్యక్షయం కాగా; |
| తమ్ | = ఆ; | మర్త్య లోకమ్ | = మనుష్యలోకంలో; |
| విశాలమ్ | = విపులమైన; | విశన్తి | = ప్రవేశిస్తున్నారు; |
| స్వర్గ లోకమ్ | = స్వర్గలోకంలో; | ఏవమ్ | = ఈ విధంగా; |
| భుక్త్వా | = భోగించి; | త్రయీ ధర్మమ్ | = వేదధర్మాన్ని; |

| | | | |
|---|---|---|---|
| అనుప్రపన్నాః | = ఆశ్రయించే; | గత ఆగతమ్ | = రాకపోకలను, (జనన-మరణాలను); |
| కామ కామాః | = భోగేచ్ఛాపరులు; | లభన్తే | = పొందుతున్నారు. |

**తా॥** అనంతరం, వారు విపులమైన ఆ స్వర్గలోకంలో భోగాలను అనుభవించి పుణ్యక్షయం కాగానే మర్త్యలోకానికి తిరిగివస్తున్నారు – ఈ విధంగా వేదోక్తధర్మాన్ని అనుసరించే భోగపరాయణులు సంసారంలో తిరుగాడుతున్నారు.
(శ్రీమద్భాగవతమ్. 11-10-23, 26 చూ.) 21

**అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22**

అనన్యాః, చిన్తయన్తః, మామ్, యే, జనాః, పరి ఉపాసతే,
తేషామ్, నిత్య అభియుక్తానామ్, యోగక్షేమమ్, వహామి, అహమ్.

| | | | |
|---|---|---|---|
| అనన్యాః | = అనన్యచిత్తంతో, (ఆత్మభావముతో); | నిత్య అభియుక్తానామ్ | = అనవరతమూ యోగయుక్తులైన; |
| మామ్ | = నన్ను (భగవంతుణ్ణి); | తేషామ్ | = వారి; |
| చిన్తయన్తః | = చింతిస్తూ; | యోగ క్షేమం | = పొందనిదాన్ని పొందడం, పొందినదాన్ని రక్షించడం అనే విషయాల్ని; |
| యే | = ఏ; | అహమ్ | = నేను; |
| జనాః | = జనులు; | వహామి | = వహిస్తున్నాను. |
| పరి ఉపాసతే | = భజిస్తున్నారో; | | |

**తా॥** (ఇక నా భక్తుల విషయానికి వస్తే, వారు నా ప్రసాదంతో కృతార్థులవుతున్నారు.) నన్ను ఆత్మభావంతో (అనన్యకాములవుతూ) చింతన చేస్తూ, ధ్యానించే (సేవించే) ఏకనిష్ఠుల యోగాన్ని (ధనాది లాభం), క్షేమాన్ని (తత్ రక్షణను, మోక్షాన్ని వారు ప్రార్థింపకపోయినా) నేనే వహిస్తున్నాను – పొందజేస్తున్నాను.[1] 22

**యేఽప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః ।**
**తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥ 23**

---

1. సామాన్యభక్తులు తమ యోగ క్షేమాలను తామే చూసుకుంటున్నారు; కాని, ఏకనిష్ఠులైనవారు భగవంతుని కంటే, ఇతరాన్ని చూడడంలేదు. కనుక, భగవంతుడే వీరి బాగోగులను చూస్తాడు. (గీత. 7-17, 19)

యే, అపి, అన్య దేవతా, భక్తాః, యజన్తే, శ్రద్ధయా, అన్వితాః,
తే, అపి, మామ్, ఏవ, కౌన్తేయ, యజన్తి, అవిధిపూర్వకమ్.

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా; | తే అపి | = వారు కూడా; |
| శ్రద్ధయా అన్వితాః | = శ్రద్ధతో (ఆస్తిక్య బుద్ధితో); | అవిధి పూర్వకమ్ | = అజ్ఞానపూర్వకంగా, (తమకు తెలియకుండా); |
| యే భక్తాః అపి | = ఏభక్తులు కూడా; | మామ్ ఏవ | = నన్నే; |
| అన్య దేవతాః | = ఇతర దేవతలను; | యజన్తి | = పూజిస్తున్నారు. |
| యజన్తే | = పూజిస్తున్నారో; | | |

**తా॥** (నీ కంటే వేరైన దేవత లేదు, కనుక ఇంద్రాది దేవతలను సేవించేవారు కూడా నీ భక్తులే –మరి వారు ఎలా తిరిగివస్తున్నారు? అంటావా:) కౌంతేయా! ఆస్తిక్యబుద్ధియుక్తులై అన్యదేవతలను పూజించేవారు కూడా నన్నే పూజిస్తున్నారు. కాని, వారు అజ్ఞానపూర్వకంగా,[1] (మోక్షప్రాపకమైన విధిరహితంగా) భజిస్తున్నారు. (కనుక, మళ్ళీ ఇహానికి వస్తున్నారు.) 23

**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।**
**న తు మామభిజానన్తి తత్త్వే నాతశ్చ్యవన్తి తే ॥ 24**

అహమ్, హి, సర్వయజ్ఞానామ్, భోక్తా, చ, ప్రభుః, ఏవ, చ,
న, తు, మామ్, అభిజానన్తి, తత్త్వేన, అతః, చ్యవన్తి, తే.

| | | | |
|---|---|---|---|
| సర్వ యజ్ఞానామ్ | = శ్రౌతస్మార్తాదులైన సర్వయజ్ఞాలకు; | తత్త్వేన | = ఉన్నరూపున; |
| అహమ్ హి | = నేనే; | మామ్ | = నన్ను; |
| భోక్తా చ | = దేవతాత్మారూపంలో భోక్తను; | న అభిజానన్తి | = ఎరుగరు, |
| ప్రభుః ఏవ చ | = ఫలదాతను కూడా; | అతః | = అందువల్ల; |
| తు | = కాని; | చ్యవన్తి | = చ్యుతినొందుతున్నారు (పునరావృత్తి పొందుతున్నారు). |
| తే | = వారు (అన్యదేవతాభక్తులు); | | |

**తా॥** నేను, శ్రౌతస్మార్తాది సర్వయజ్ఞాలకూ (ఆయా నిర్దిష్టదేవతాత్మ రూపంలో) భోక్తనూ, ఫలదాతనూ కూడా. కాని, అన్యదేవతా భక్తులు నా

1. భగవంతుడే అన్యదేవతారూపధారి అని తెలియకపోవడమే అజ్ఞానం.

స్వరూపాన్ని ఎరుగకపోవడం చేత మళ్ళీ వస్తున్నారు. (సర్వదేవతల యందూ అంతర్యామినైన నన్ను చూస్తూ, పూజించేవారు తిరిగి జన్మించరు) 24

**యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః ।**
**భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥ 25**

*యాన్తి, దేవవ్రతాః, దేవాన్, పితౄన్, యాన్తి, పితృవ్రతాః,*
*భూతాని, యాన్తి, భూత ఇజ్యాః, యాన్తి, మద్యాజినః, అపి, మామ్.*

| | | | |
|---|---|---|---|
| దేవ వ్రతాః | = దేవోపాసకులు; | భూత ఇజ్యాః | = భూతోపాసకులు; |
| దేవాన్ | = ఇంద్రాదిదేవతలను; | భూతాని | = వినాయకమాతృ గణాది భూతములను; |
| యాన్తి | = పొందుచున్నారు; | యాన్తి | = పొందుచున్నారు; |
| పితృ వ్రతాః | = శ్రాద్ధాదిక్రియా పరాయణులైన పితృపూజకులు; | మద్యాజినః | = నన్ను పూజించేవారు; |
| పితౄన్ | = అర్యమాదులైన పితృదేవతలను; | మామ్ అపి | = అక్షయ పరమానంద స్వరూపుడనైన నన్నే(నారాయణుని); |
| యాన్తి | = పొందుచున్నారు; | యాన్తి | = పొందుచున్నారు. |

**తా॥** దేవోపాసకులు (అనిత్యులైన ఇంద్రాది) దేవతలను పొందుతున్నారు. (శ్రాద్ధాది క్రియాపరాయణులైన) పితృభక్తులు (అర్యమాది) పితృగణాలను చేరుతున్నారు. భూతపూజకులు (వినాయకమాతృగణాది) భూతాలను పొందుతున్నారు; నన్ను పూజించేవారు (అక్షయ-పరమానంద స్వరూపుడనైన) నన్నే బడయుచున్నారు (మళ్ళీ జన్మించరు).

(*గీత.* : 7-23 చూ; *శ్రీమద్భాగవతమ్.* 11-21-26, 33 చూ.) 25

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥ 26**

*పత్రమ్, పుష్పమ్, ఫలమ్, తోయమ్, యః, మే, భక్త్యా, ప్రయచ్ఛతి,*
*తత్, అహమ్, భక్తి ఉపహృతమ్, అశ్నామి, ప్రయత ఆత్మనః.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | పత్రమ్ | = ఆకునో; |
| మే | = నాకు; | పుష్పమ్ | = పువ్వునో; |
| భక్త్యా | = భక్తితో; | ఫలమ్ | = పండునో; |

| | | | |
|---|---|---|---|
| తోయమ్ | = నీటినో; | భక్తి ఉపహృతమ్ | = భక్తితో సమర్పించిన; |
| ప్రయచ్ఛతి | = సమర్పించునో; | తత్ | = ఆ పత్రాదికం; |
| ప్రయత ఆత్మనః | = శుద్ధచిత్తుడైన ఆ నిష్కామ భక్తుని; | అహమ్ | = నేను; |
| | | అశ్నామి | = ఆరగిస్తున్నాను. |

**తా॥** (నా భక్తులు అనావృత్తిరూపమైన అనంతఫలాన్ని పొందుతున్నారు, మరియు నా ఆరాధన అత్యంత సహజం.) ఎవడు నాకు భక్తితో ఆకునో, పువ్వునో, పండునో, నీటినో, అర్పిస్తున్నాడో, శుద్ధచిత్తుడైన ఆ నిష్కామభక్తుడు భక్తితో ఒసగిన కానుకను ప్రీతితో గ్రహిస్తున్నాను. (క్షుద్రదేవతలు బహువిత్త సాధ్యాలైన యాగాదులతో తృప్తి చెందుతున్నారు; కాని, మహావిభూతిపతినైన నన్ను అలా తృప్తిపరచడం సాధ్యం కాదు. అయినప్పటికీ, భక్తుణ్ణి అనుగ్రహించ డానికి అతడు అర్పించే పత్రపుష్పాదులను గ్రహిస్తున్నాను.) 26

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27**

*యత్, కరోషి, యత్, అశ్నాసి, యత్, జుహోషి, దదాసి, యత్,*
*యత్, తపస్యసి, కౌన్తేయ, తత్, కురుష్వ, మదర్పణమ్.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | యత్ | = దేనిని; |
| యత్ | = దేనిని; | దదాసి | = దానమిస్తున్నావో; |
| కరోషి | = ఆచరిస్తున్నావో; | యత్ | = దేనిని; |
| యత్ | = దేనిని; | తపస్యసి | = తపమొనర్చుతున్నావో; |
| అశ్నాసి | = భుజిస్తున్నావో; | తత్ | = దానిని; |
| యత్ | = దేనిని; | మదర్పణమ్ | = నాకు అర్పితం; |
| జుహోషి | = హోమమొనర్చుతున్నావో; | కురుష్వ | = చేయి. |

**తా॥** (ఈ ఫలపుష్పాదులను కూడా, యజ్ఞద్రవ్యాలైన పశు సోమలతాదుల వలే కష్టంతో సంపాదించి సమర్పించనక్కర లేదు:) కౌంతేయా! నీవు ఆచరించే శాస్త్రసిద్ధములైన కర్మలను, వ్యావహారిక కర్మలను, నీవు భుజించే వాటిని, నీ తపోదానహోమాలను నాకు అర్పించు.[1] 27

1. అవశ్యం భావినాం కర్మణాం మయి పరమగురౌ సమర్పణమేవ మద్భజనం,
న తు తదర్థం పృథక్వ్యాపారః కశ్చిత్కర్తవ్య ఇత్యభిప్రాయః. (శ్రీమధుసూదన సరస్వతి).



**శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।**
**సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ 28**

శుభ అశుభ ఫలైః, ఏవమ్, మోక్ష్యసే, కర్మ బన్ధనైః,
సన్న్యాస యోగ యుక్త ఆత్మా, విముక్తః, మామ్, ఉప ఏష్యసి.

| | | | |
|---|---|---|---|
| ఏవమ్ | = ఇలా ఆచరించిన; | సన్న్యాస యోగ యుక్త ఆత్మా | = కర్మ సమర్పణ యోగయుక్తుడవై; |
| శుభ అశుభ ఫలైః | = ఇష్టానిష్టఫలవిశిష్టాలైన; | విముక్తః | = జీవితకాలంలోనే ముక్తి పొంది; |
| కర్మ బన్ధనైః | = కర్మబంధాల నుండి; | మామ్ | = నన్ను; |
| మోక్ష్యసే | = ముక్తుడవవుతావు; | ఉప ఏష్యసి | = దేహాంతాన పొందుతావు. |

**తా॥** ఈ విధంగా సమస్త కర్మలను నాకు అర్పిస్తే, నీవు ఇష్టానిష్టాలతో కూడిన కర్మబంధాల నుండి ముక్తుడవవుతావు. నాకు శుభాశుభాలైన కర్మలను అర్పించడం అనే (సన్న్యాస) యోగాన్ని[1] ఆశ్రయిస్తే, (ఇహజీవితంలోనే) ముక్తుడవు అవుతావు. (జీవన్ముక్తిని పొందుతావు:) దేహత్యాగానంతరం నన్ను పొందుతావు. మళ్ళీ జన్మించవు. 28

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ 29**

సమః, అహమ్, సర్వభూతేషు, న, మే, ద్వేష్యః, అస్తి, న, ప్రియః,
యే, భజన్తి, తు, మామ్, భక్త్యా, మయి, తే, తేషు, చ, అపి, అహమ్.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | న అస్తి | = లేదు; |
| సర్వభూతేషు | = సకలభూతాల యెడ; | ప్రియః | = ప్రియుడు కూడా; |
| సమః | = సమవర్తిని; | న అస్తి | = లేదు; |
| మే | = నాకు; | తు | = కాని; |
| ద్వేష్యః | = అప్రియుడు; | యే | = ఎవరు; |

→

అవశ్య కర్తవ్యాలైన కర్మలను పరమగురువైన పరమేశ్వరునికి సమర్పించడమే, నా భజన. దీని కోసం వేరే అనుష్ఠానం అవసరం లేదు. (శ్రీమద్భాగవతం. 11-19-23 ; ఛాందోగ్యోపనిషత్తు. 3-17-1,5)

1. సన్న్యాసం = కామ్య కర్మల త్యాగం;
యోగం = కర్మానుష్ఠానం అంటే కర్మఫలత్యాగరూపమైన కర్మను అనుష్ఠించడం.

| | | | |
|---|---|---|---|
| మామ్ | = నన్ను; | (ఉంటారు) చ | = మరియు; |
| భక్త్యా | = భక్తితో; | అహం అపి | = నేను కూడా; |
| భజన్తి | = భజిస్తున్నారో; | తేషు | = వారి యందు, |
| తే | = వారు; | (వారి హృదయంలో) (ఉంటాను). | |
| మయి | = నాయందు; | | |

**తా॥** (భక్తులకే నీవు మోక్షాన్ని ఇస్తున్నావు, అభక్తులకు కాదు; ఆ విధంగా నీకు రాగద్వేషాది కృతమైన వైషమ్యం ఉందా? అని అంటే :) జీవులందరూ నాకు సమానులే; నాకు ప్రియుడుగాని అప్రియుడుగాని లేదు. కాని, నన్ను భక్తిపూర్వకంగా భజించేవారు నా యందూ, వారి హృదయాలలో నేనూ ప్రకాశిస్తుంటాము.[1]

**అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30**

అపి, చేత్, సు దురాచారః, భజతే, మామ్, అనన్యభాక్,
సాధు, ఏవ, సః, మన్తవ్యః, సమ్యక్, వ్యవసితః, హి, సః.

| | | | |
|---|---|---|---|
| సు దురాచారః అపి | = అతిదుర్మార్గుడైనా; | మన్తవ్యః | = ఎన్నదగును; |
| అనన్యభాక్ | = ఏకాంతభక్తితో; | హి | = ఏమన; |
| మామ్ | = నన్ను; | సః | = వాడు; |
| భజతే చేత్ | = భజించిన ఎడల; | సమ్యక్ | = చక్కగా |
| సః | = వానిని; | (భగవద్భజనతో కృతార్థుడనవుతానని); | |
| సాధుః ఏవ | = సాధువనియే; | వ్యవసితః | = నిశ్చయించుకున్నాడు. |

**తా॥** (మరియు, నా భక్తికి గల అవితర్క్య ప్రభావం ఎటువంటిదంటే :) అత్యంత దుర్మార్గుడైనవాడు కూడా అనన్యచిత్తుడై నన్ను భజిస్తే, అతణ్ణి సాధువనియే పరిగణించవచ్చు. ఎందుకంటే, అతని సంకల్పం మిక్కిలి ఉత్తమమైనది. అతడు భగవద్భజన చేత కృతార్థుడ నవుతానని నిశ్చయించుకున్నాడు. 30

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31**

---

1. అగ్నిని ఉపయోగించే వారికే తమఃశీతాదిజనితమైన (చీకటి, చలి సంబంధిత) దుఃఖం తొలగుతోంది, దానిని ఉపయోగించని వారికి కాదు. అట్లే భగవంతుణ్ణి సేవించేవారు ముక్తులవుతున్నారు. భక్తికి గల మహిమ ఇట్టిది. కనుక అగ్నికి వైషమ్యం లేనట్లే, భగవంతునికి కూడా లేదు. – శ్రీధరస్వామి.

క్షిప్రమ్, భవతి, ధర్మ ఆత్మా, శశ్వత్, శాన్తిమ్, నిగచ్ఛతి,
కౌన్తేయ, ప్రతిజానీహి, న, మే, భక్తః, ప్రణశ్యతి.

| | | | |
|---|---|---|---|
| (సః | = అతడు;) | కౌన్తేయ | = అర్జునా; |
| క్షిప్రమ్ | = శీఘ్రంగా; | మే | = నా; |
| ధర్మ ఆత్మా | = ధర్మచిత్తుడు; | భక్తః | = ఉపాసకుడు; |
| భవతి | = అవుతాడు; | న ప్రణశ్యతి | = వినష్టుడుకాడు (తార్థుడగును); |
| శశ్వత్ | = నిత్యమైన; | | |
| శాన్తిమ్ | = శాన్తిని; | (ఇతి | = అని;) |
| నిగచ్ఛతి | = పొందుతాడు; | ప్రతిజానీహి | = నిశ్చియంగా గ్రహించు. |

**తా॥** ఆ దురాచారి నన్ను భజిస్తూ శీఘ్రంగా ధర్మ చిత్తుడవుతున్నాడు. పిదప, (చిత్తోపప్లవోపరమ రూపమూ, పరమేశ్వరనిష్ఠా రూపమూ అయిన) నిత్యశాంతిని పొందుతున్నాడు. కౌంతేయా! నా భక్తు డెన్నడును వినష్టుడు కాడు, కృతార్థుడే అవుతాడు. [1] (కుతార్కికులు ఈ విషయాన్ని నమ్మరు, నీవు సందేహింప పనిలేదు.) నీవు ఈ విషయాన్ని నిశ్చయంగా గ్రహించి, (వివాదసంకులమైన సభలలో కూడా) ప్రతిజ్ఞాపూర్వకంగా ప్రవచించు. 31

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యా స్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥ 32**

మామ్, హి, పార్థ, వ్యపాశ్రిత్య, యే, అపి, స్యుః, పాపయోనయః,
స్త్రియః, వైశ్యాః, తథా, శూద్రాః, తే, అపి, యాన్తి, పరామ్, గతిమ్.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | స్త్రియః | = స్త్రీలూ; |
| యే అపి పాపయోనయః | = ఏ అసత్కుల జాతులు; | శూద్రాః | = శూద్రులూ (కలరో); |
| | | తే అపి | = వారు కూడా; |
| స్యుః | = కలరో; | మామ్ | = నన్ను; |
| (ఏ అపి | = మరియూ;) | వ్యపాశ్రిత్య | = ఆశ్రయించి (సేవించి); |
| వైశ్యాః | = కేవలం కృష్యాదికం చేసే వైశ్యులూ; | పరామ్ | = పరమమైన; |
| | | గతిం హి | = గతిని (ముక్తినే); |
| తథా | = మఱియు; (అధ్యయన రహితులైన) | యాంతి | = పొందుతున్నారు. |

1. బిళ్వమంగళోపాఖ్యానం ఇక్కడ అనుసంధేయము.

**తా॥** (ఆచారభ్రష్టుడైన వాణ్ణి నా భక్తి పవిత్రం చేయడంలో విచిత్రమేమిటి? అసత్కుల జాతులూ, అనధికారులూ అయిన వారిని కూడా ముక్తులను చేయ గలదు:) పార్థా! నికృష్ట జన్ములైన అంత్యజులూ,[1] కృష్యాది నిరతులైన వైశ్యులూ,[2] అధ్యయన రహితులైన స్త్రీ[3] శూద్రులు[4] కూడా నన్ను సేవించి, మోక్షాన్ని తప్పక పొందుతున్నారు. (శ్రీమద్భాగవతమ్. 1-4-18; 11-12-3, 7 చూ:) 32

**కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయస్తథా ।**
**అనిత్యమసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33**

*కిమ్, పునః, బ్రాహ్మణాః, పుణ్యాః, భక్తాః, రాజర్షయః, తథా,*
*అనిత్యమ్, అసుఖమ్, లోకమ్, ఇమమ్, ప్రాప్య, భజస్వ, మామ్.*

| | | | |
|---|---|---|---|
| పుణ్యాః | = సత్కులోద్భవులైన; | అనిత్యమ్ | = అనిత్యమూ; |
| బ్రాహ్మణాః | = బ్రాహ్మణులను; (గురించీ) | అసుఖమ్ | = సుఖరహితమూ అయిన; |
| తథా | = మరియు; | ఇమమ్ | = ఈ; |
| భక్తాః | = భక్తులైన; | లోకమ్ | = మర్త్యలోకాన్ని, మనుష్యశరీరాన్ని; |
| రాజర్షయః | = రాజర్షులను; (గురించి) | | |
| కిం పునః | = ఏమి చెప్పనగును; (అంటే, వారు నన్ను ఆశ్రయించి, తప్పక మోక్షం పొందుతున్నారు) | ప్రాప్య | = పొంది; |
| | | మామ్ | = నన్ను; |
| | | భజస్వ | = భజించు. |
| అతః త్వం | = కాబట్టి నీవు; | | |

**తా॥** (అసత్కులజాతులూ అనధికారులూ అయినవారు కూడా నన్ను ఆశ్రయించి ముక్తిని పొందుతుంటే) పవిత్ర కులోద్భవులైన బ్రాహ్మణులూ, భక్తులైన క్షత్రియులూ అయిన వారి విషయంలో ఏం చెప్పాలి? (వారు నన్ను ఆశ్రయించి తప్పక మోక్షాన్ని పొందుతున్నారు) అనిత్యమూ, సుఖహీనమూ అయిన ఈ మర్త్య లోకాన్ని (మనుష్యదేహాన్ని) బడసి నన్ను భజించు. (ఇది అనిత్యమవడం వల్ల ఆలసించ వద్దు. సుఖరహితమవడం వల్ల సుఖప్రయత్నాన్ని త్యజించి, నన్నే భజించు.[5] 33

1. గుహుడు మున్నగువారు ఇక్కడ ఉదాహరింప తగినవారు.
2. సమాధి అనే వైశ్యుడు ముక్తిపొందడం దేవీసప్తశతిలో చూడవచ్చు.
3. శబరి, గోపికలు.
4. సంజయుడు మొదలైనవారు.

→

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః ॥ 34**

మన్మనాః, భవ, మద్భక్తః, మద్యాజీ, మామ్, నమస్కురు,
మామ్, ఏవ, ఏష్యసి, యుక్త్వా, ఏవమ్, ఆత్మానమ్, మత్పరాయణః.

| | | | |
|---|---|---|---|
| మన్మనాః | = మద్గతచిత్తుడవూ; | ఏవమ్ | = ఈ విధంగా; |
| మద్భక్తః | = నాభక్తుడవూ; | మత్పరాయణః | = నాశరణాగతుడవై; |
| మద్యాజీ | = నన్ను పూజించేవాడవూ; | ఆత్మానమ్ | = మనస్సు; |
| భవ | = కమ్ము; | యుక్త్వా | = నాయందు నిలిపి; |
| మామ్ | = నాకు; | మామ్ ఏవ | =నన్నే; |
| నమస్కురు | = నమస్కరించు; | ఏష్యసి | = పొందుతావు. |

**తా॥** (భజనప్రకారాన్ని తెలుపుతూ, అధ్యాయం ముగించబడుతోంది.) మనస్సును నాయందు నిలుపు, నా భక్తుడవు కమ్ము, నన్ను పూజించు, నాకు నమస్కృతి ఒనర్చు – ఇలా నా శరణాగతుడవై, మనస్సును నాయందు నిలిపితే నన్నే పొందెదవు. (శ్రీమద్భాగవతమ్. 11-23-61 చూ.) 34

**ఇతి శ్రీమద్భగవద్గీతా సూపినిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్యయోగో నామ**
**నవమోఽధ్యాయః**

శ్లోకసంఖ్య-34, మొదటినుండి (338+34=) 372.

**నిజ మైశ్వర్య మాశ్చర్యం భక్తే శ్చాద్భుతవైభవమ్ ।**
**నవమే రాజగుహ్యైఖ్యే కృప యావోచ దచ్యుతః ॥**

**తా॥** ఆశ్చర్యకరమైన తన ఐశ్వర్యాన్ని, అద్భుతమైన భక్తి వైభవాన్ని, రాజ గుహ్యాన్ని ఈ నవమాధ్యాయంలో కృపతో అచ్యుతుడు వచించాడు.



→ 5. తస్మా ద్దేహ మిమం లబ్ధ్వా జ్ఞానవిజ్ఞానసంభవమ్,
గుణసంగం వినిర్ధూయ మాం భజంతు విచక్షణాః. – శ్రీమద్భాగవతమ్. 11-25-33.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## దశమోఽధ్యాయః - విభూతి యోగః

## ( దశమాధ్యాయం - విభూతి యోగం)

ఉక్తాః సంక్షేపతః పూర్వం సప్తమాదౌ విభూతయః ।
దశమే తా వితన్యంతే సర్వ త్రేశ్వరదృష్టయే ॥[1]

---

*శ్రీ భగవానువాచ :*

**భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ 1**

భూయః, ఏవ, మహాబాహో, శృణు, మే, పరమమ్, వచః,
యత్, తే, అహమ్, ప్రీయమాణాయ, వక్ష్యామి, హితకామ్యయా.

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా; | తే | = నీకు; |
| భూయ ఏవ | = మళ్ళీ ఇంకా; | అహం | = నేను; |
| మే | = నా; | హితకామ్యయా | = మంచిని కోరి; |
| పరమం వచః | = శ్రేష్ఠమైన వచనాన్ని (తత్త్వవాక్యాన్ని); | యత్ | = దేనిని (ఏ తత్త్వవిషయాన్ని); |
| శృణు | = విను; | వక్ష్యామి | = చెబుతున్నానో; |
| ప్రీయమాణాయ | = సంప్రీతుడవైన; | (తత్ శృణు | = దానిని విను;) |

**తా॥** *శ్రీ భగవానుడు (పలికెను)* చెప్పెను : అర్జునా! నీవు నా వాక్యాలను

1. సప్తమ, అష్టమ, నవమ అధ్యాయాల వెనుక సంక్షేపంగా విభూతులు వర్ణింపబడ్డాయి. సర్వత్ర ఈశ్వరదృష్టి నిమిత్తం అంటే, ఉపాసనా సౌకర్యార్థం ఈ దశమాధ్యాయంలో ఈశ్వరుని విభూతులు విశదంగా వర్ణింపబడుతున్నాయి.

విని ఆనందిస్తున్నావు; కనుక, నేను నీ హితాన్ని కోరి మళ్ళీ శ్రేష్ఠమైన తత్త్వవాక్యాలను చెబుతున్నాను, ఆకర్ణించు. 1

**న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।**
**అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥ 2**

*న, మే, విదుః, సురగణాః, ప్రభవమ్, న, మహర్షయః,*
*అహమ్, ఆదిః, హి, దేవానామ్, మహర్షీణామ్, చ, సర్వశః.*

| | | | |
|---|---|---|---|
| సురగణాః | = దేవగణాలు; | అహమ్ | = నేను; |
| మహర్షయః | = మహర్షులు కూడా; | దేవానామ్ | = దేవతలకూ; |
| మే | = నా; | మహర్షీణాంచ | = మహర్షులకు కూడా; |
| ప్రభవమ్ | = ఉత్పత్తిని; | సర్వశః | = సర్వవిధాల; |
| న విదుః | = ఎరుగరు; | ఆదిః | = ఆదికారణాన్ని; |
| హి | = ఏమన; | | |

**తా॥** (మళ్ళీ చెప్పడానికి కారణమేమంటే, ఇది దుర్విజ్ఞేయం) ఇంద్రాది దేవతలూ, భృగ్వాది మహర్షులూ కూడా, నా ఉత్పత్తిని, (అంటే, జన్మరహితుడనైన నేను నానా విభూతులతో ఆవిర్భవించడాన్ని) ఎరుగరు. ఏమన, దేవతలకూ మహర్షులకూ కూడా సర్వవిధాలైన (ఉత్పాదకుడను, బుద్ధ్యాది ప్రవర్తకుడను అయిన) మూలకారణాన్ని నేనే. (కనుక, నా కృప లేకుంటే, నన్నెవ్వరూ ఎరుగజాలరు.) 2

**యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసంమూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3**

*యః, మామ్, అజమ్, అనాదిమ్, చ, వేత్తి, లోకమహేశ్వరమ్,*
*అసంమూఢః, సః, మర్త్యేషు, సర్వపాపైః, ప్రముచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవరు; | సః | = అతడు; |
| మామ్ | = నన్ను; | మర్త్యేషు | = మనుష్యులలో; |
| అనాదిమ్ | = కారణరహితునిగా; | అసంమూఢః | = మోహశూన్యుడై; |
| అజం చ | = జన్మ రహితునిగా; | సర్వపాపైః | = తెలిసిగాని తెలియకగాని చేసిన పాపాలన్నిటి నుండి; |
| లోక మహేశ్వరమ్ | = సర్వలోకేశ్వరునిగా; | | |
| వేత్తి | = తెలుసుకుంటాడో; | ప్రముచ్యతే | = విడివడతాడు. |

**తా॥** (దుర్విజ్ఞేయమైన ఈ ఆత్మజ్ఞానఫలం ఏమంటే–) ఎవడు నన్ను కారణర హితునిగానూ, జన్మవిహీనునిగానూ, సర్వలోకేశ్వరునిగానూ తెలుసు కుంటాడో, అతడు మనుష్యులలో మోహశూన్యుడై (జ్ఞాన–అజ్ఞాన పూర్వకంగా ఒనర్చిన) పాపాలన్నింటి నుండి విడివడుతున్నాడు. 3

**బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః ।**
**సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥ 4**

*బుద్ధిః, జ్ఞానమ్, అసమ్మోహః, క్షమా, సత్యమ్, దమః, శమః,*
*సుఖమ్, దుఃఖమ్, భవః, అభావః, భయమ్, చ, అభయమ్, ఏవ, చ.*

**అహింసా సమతా తుష్టిః తపోదానం యశోఽయశః ।**
**భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ 5**

*అహింసా, సమతా, తుష్టిః, తపః, దానమ్, యశః, అయశః,*
*భవన్తి, భావాః, భూతానామ్, మత్తః, ఏవ, పృథగ్విధాః.*

బుద్ధిః = సూక్ష్మవిషయ గ్రహణ సామర్థ్యం;
జ్ఞానమ్ = ఆత్మాది పదార్థాల అవబోధ;
అసంమోహః = ప్రత్యుత్పన్నమతిత్వం, (వ్యాకులతా భావం);
క్షమా = సహిష్ణుత;
సత్యమ్ = విన్నది విన్నట్లు, చూసింది చూసినట్లు వచించడం; (యథార్థభాషణం).
దమః = బాహ్యేంద్రియ సంయమం;
శమః = అంతరింద్రియ సంయమం;
సుఖమ్ = ఆహ్లాదం;
దుఃఖమ్ = సంతాపం;
భవః = ఉత్పత్తి;
అభావః = వినాశం;
భయం ఏవ చ = మరియు, భీతి;
అభయమ్ = భయరహితత్వం;
అహింసా = ప్రాణిపీడ నొనర్చకుండుట;
సమతా = సమ చిత్తత;
తుష్టిః = సంతోషం;
తపః = మనోవాక్కాయసంయమం;
దానమ్ = దానం;
యశః = ధర్మనిమిత్తమైన కీర్తి;
అయశః = అధర్మనిమిత్తమైన అపకీర్తి;
(ఏతే = ఇవి;)
భూతానామ్ = ప్రాణులకు;
పృథగ్విధాః =స్వకర్మానుసారం విభిన్నాలైన;
భావాః = భావాలు;
మత్తః ఏవ = నా నుండియే;
భవన్తి = ఉత్పన్నమౌతున్నాయి.

**తా॥** (సర్వలోక మహేశ్వరత్వం వివరించబడుతోంది:) సూక్ష్మవిషయ గ్రహణ సామర్థ్యం, ఆత్మాది పదార్థాల జ్ఞానం, ప్రత్యుత్పన్నమతిత్వం, సహిష్ణుత, సత్యం, బాహ్యాంతరింద్రియ సంయమం, సుఖం, దుఃఖం, జన్మ, మృతువు, భయం, అభయం, అహింస, సమచిత్తత, సంతోషం, తపస్సు, దానం, ధర్మనిమిత్తమైన కీర్తి, అధర్మనిమిత్తమైన అపకీర్తి, మొదలైన విభిన్న భావాలు ప్రాణులకు స్వకర్మానుసారంగా నా నుండే కలుగుతున్నాయి. 4-5

**మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6**

మహర్షయః, సప్త, పూర్వే, చత్వారః, మనవః, తథా,
మద్భావాః, మానసాః, జాతాః, యేషామ్, లోకే, ఇమాః, ప్రజాః.

| | | | |
|---|---|---|---|
| మహర్షయః సప్త | = భృగ్వాది మహర్షులు ఏడుగురూ; | మద్భావాః | = మద్గత చిత్తులు (నా ప్రభవాన్ని కలిగినవారు); |
| పూర్వే | = పూర్వకాలం వారైన; | మానసాః జాతాః | = హిరణ్యగర్భ (బ్రహ్మ) రూపుడనైన నా సంకల్పంతో పుట్టినవారు; |
| చత్వారః | = సనకాది మహర్షులు నలుగురూ; | లోకే | = ఈజగత్తులో; |
| తథా | = మరియు; | ఏషామ్ | = వీరి నుండియే; |
| మనవః | = స్వాయంభువాది మనువులు పదునల్గురూ; | ఇమాః | = ఈః; |
| | | ప్రజాః | = స్థావరజంగమాత్మక సంతతి (కలిగింది); |

**తా॥** భృగువు మున్నగు సప్తర్షులూ[1], వారికంటే పూర్వపువారైన సనకాది నలుగురు ఋషులూ[2]; స్వాయంభువాది చతుర్దశ మనువులూ[3]; [హిరణ్యగర్భ (బ్రహ్మ) రూపుడనైన] నా సంకల్పం నుండే ఉద్భవించారు; వారు నా మానస

---

1. భృగు, మరీచి, అత్రీ, పులహ, అంగిరః, క్రతు, పులస్త్యులు. (లేక) మరీచి, అంగిరః, అత్రీ, పులస్త్య, పులహ, క్రతు, వసిష్ఠులు.

2. సనక, సనందన, సనత్కుమార, సనాతనులు.

3. స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణులు.

పుత్రులు. మద్గతచిత్తులవడం వల్ల నా ప్రభావంతో ఒప్పుతున్నారు. వీరి నుండే, ఈ జగత్తులో స్థావరజంగమాత్మకమైన సంతతి కలిగింది. 6

**ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।**
**సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7**

*ఏతామ్, విభూతిమ్, యోగమ్, చ, మమ, యః, వేత్తి, తత్త్వతః,*
*సః, అవికమ్పేన, యోగేన, యుజ్యతే, న, అత్ర, సంశయః.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవరు; | సః | = అతడు; |
| మమ | = నా; | అవికమ్పేన | = చలనం లేని; |
| ఏతామ్ | = ఈ | యోగేన | = సమ్యగ్ దర్శనం చేత; |
| విభూతిమ్ | = విభూతిని; | యుజ్యతే | = యుక్తుడవుతాడు; |
| యోగం చ | = యోగాన్ని; | అత్ర | = ఈ విషయంలో; |
| తత్త్వతః | = యథార్థంగా; | సంశయః న | = సందేహం లేదు. |
| వేత్తి | = గ్రహిస్తాడో; | | |

**తా॥** ఎవరు నా ఈ విభూతిని[1], యోగాన్ని[2], యథార్థంగా గ్రహిస్తాడో, అతడు అచంచలమైన సమ్యగ్-దర్శనాన్ని పొందుతున్నాడు - ఈ విషయంలో సందేహం లేదు. 7

**అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥ 8**

*అహమ్, సర్వస్య, ప్రభవః, మత్తః, సర్వమ్, ప్రవర్తతే,*
*ఇతి, మత్వా, భజన్తే, మామ్, బుధాః, భావసమన్వితాః.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | మత్తః | = నా నుండియే; |
| సర్వస్య | = సమస్తానికి; | సర్వమ్ | = సమస్తమూ; |
| ప్రభవః | = ఉత్పత్తి స్థానాన్ని; | ప్రవర్తతే | = కలుగుతున్నది, నడుస్తున్నది; |

1. "వి (వివిధ రూప) భూతి(భవనం) - బుద్ధ్యాదుల ఉపాదాన రూపంలో సర్వాత్మకత్వం.
2. యోగం = నిమిత్తరూపంలో సామర్థ్య, సర్వజ్ఞత్వాదులను ప్రకటించడం.
ఈశ్వరుడే జగత్తుకు నిమిత్తోపాదాన కారణాలు.

| | | | |
|---|---|---|---|
| ఇతి | = అని; | భావసమన్వితాః | = భక్తి యుక్తులై; |
| మత్వా | = గ్రహించి; | మామ్ | = నన్ను; |
| బుధాః | = జ్ఞానులు; | భజంతి | = భజిస్తున్నారు. |

**తా॥** (విభూతిని, యోగాన్ని గ్రహించ గలిగే సమ్యక్-దర్శనక్రమం నిరూపించబడుతోంది-) నేను సమస్త జగత్తుకూ (భృగు మన్వాది విభూతి రూపంలో) ఉత్పత్తి స్థానాన్ని. నా నుండే [సూక్ష్మ గ్రహణ సామర్థ్యం మొదలుగా గల (గీత : 10 - 4,5)] సమస్తమూ కలుగుతున్నాయని ఎరిగి జ్ఞానులు నన్ను భక్తియుక్తులై భజిస్తున్నారు. 8

**మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥ 9**

*మచ్చిత్తా, మద్గత ప్రాణాః, బోధయన్తః, పరస్పరమ్,*
*కథయన్తః, చ, మామ్, నిత్యమ్, తుష్యన్తి, చ, రమన్తి, చ.*

| | | | |
|---|---|---|---|
| మచ్చిత్తాః | = మద్గత-చిత్తులూ; | బోధయన్తః | = బోధించుకుంటూ; |
| మద్గత ప్రాణాః | = మద్గత-జీవనులూ (ప్రాణం నాపై ఉంచినవారు); | నిత్యమ్ | = సర్వదా; |
| మామ్ | = జ్ఞాన, బల, వీర్యాది -విశిష్టుడనైన నన్ను; | కథయన్తః చ | = కథాప్రసంగం ఒనర్చుచు; |
| పరస్పరమ్ | = అన్యోన్యము; | తుష్యన్తి చ | = సంతోషిస్తున్నారు; |
| | | రమన్తి చ | = ఆనందిస్తున్నారు. |

**తా॥** ఎవరు మనఃప్రాణాలు నాకు నివేదించారో, ఎవరి ఇంద్రియాలు నా యందు ఉపసంహృతాలైనాయో వారు, అన్యోన్యం జ్ఞాన, బల, వీర్యాది యుతుడనైన నా కథా ప్రసంగమొనర్చుతూ (ఒకరికొకరు తెలుపుకుంటూ, సంకీర్తనాదిక మొనర్చుతూ) సంతోషాన్ని, ఆనందాన్ని పొందుతున్నారు. 9

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే ॥ 10**

*తేషామ్, సతతయుక్తానామ్, భజతామ్, ప్రీతి పూర్వకమ్,*
*దదామి, బుద్ధియోగమ్, తమ్, యేన, మామ్, ఉపయాన్తి, తే.*

| | | | |
|---|---|---|---|
| సతత యుక్తానామ్ | = నిత్యయుక్తులై; | దదామి | = ఒసగుతాను; |
| ప్రీతిపూర్వకమ్ | = ప్రీతితో; | యేన | = ఏ బుద్ధియోగంతో; |
| భజతామ్ | = భజించే; | తే | = వారు; |
| తేషామ్ | = వారికి; | మామ్ | = నన్ను(ఆత్మరూపంలో); |
| తమ్ | = ఆ; | ఉపయాన్తి | = పొందుతున్నారో. |
| బుద్ధి యోగమ్ | = తత్త్వ జ్ఞానాన్ని; | | |

**తా॥** ఎవరు నిత్యయుక్తులై ప్రీతిపూర్వకంగా, అన్యవాంఛలను పరిత్యజించి, నన్ను భజిస్తున్నారో, వారికి నేను తత్త్వవిషయకమైన సమ్యక్-జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాను; ఈ జ్ఞానం చేత వారు నన్ను (ఆత్మరూపంలో) పొందుచున్నారు. 10

**తేషామే వానుకంపార్థం అహమజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11**

తేషామ్, ఏవ, అనుకంపార్థమ్, అహమ్, అజ్ఞానజమ్, తమః,
నాశయామి, ఆత్మ భావస్థః, జ్ఞానదీపేన, భాస్వతా.

| | | | |
|---|---|---|---|
| తేషామ్ | = వారి; | జ్ఞాన దీపేన | = వివేక దీపం చేత; |
| అనుకమ్పార్థం ఏవ | = అనుగ్రహనిమిత్తమే; | అజ్ఞానజమ్ | = అవివేకజనితమైన; |
| అహమ్ | = నేను; | తమః | = మిథ్యాప్రత్యయ రూపమైన మోహాంధకారాన్ని; |
| ఆత్మ భావస్థః | = వారిబుద్ధి యందు నెలకొని; | నాశయామి | = వినాశమొనర్చుతున్నాను. |
| భాస్వతా | = సమ్యక్ దర్శనదీప్తితో కూడిన; | | |

**తా॥** ఈ భక్తులను అనుగ్రహించడానికి నేను వారి బుద్ధివృత్తి యందుండి సమ్యక్-దర్శనదీప్తితో ఉజ్జ్వలమైన వివేకదీపంతో అవివేకజనితమూ, మిథ్యాప్రత్యయ రూపమూ అయిన మోహాంధకారాన్ని పోగొడుతున్నాను. 11

అర్జున ఉవాచ :

**పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।**
**పురుషం శాశ్వతం దివ్యం ఆదిదేవ మజం విభుమ్ ॥ 12**

పరమ్, బ్రహ్మ, పరమ్, ధామ, పవిత్రమ్, పరమమ్, భవాన్,
పురుషమ్, శాశ్వతమ్, దివ్యమ్, ఆదిదేవమ్, అజమ్, విభుమ్.

**ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారద స్తథా ।**
**అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ 13**

ఆహుః, త్వామ్, ఋషయః, సర్వే, దేవర్షిః, నారదః, తథా,
అసితః, దేవలః, వ్యాసః, స్వయమ్, చ, ఏవ, బ్రవీషి, మే.

| | | | |
|---|---|---|---|
| భవాన్ | = నీవు; | వ్యాసః చ | = వ్యాసుడూ; |
| పరంబ్రహ్మ | = పరబ్రహ్మవు; | త్వామ్ | = నిన్ను; |
| పరంధామ | = పరమపదమవు; | శాశ్వతమ్ | = సనాతనుడవు; |
| పరమమ్ | = ప్రకృష్టంగా; | దివ్యం పురుషమ్ | = దివ్య పురుషుడవు; |
| పవిత్రమ్ | = పావనుడవు; | ఆది-దేవమ్ | = ఆదిదేవుడవు; |
| ఋషయః | = ఋషులు; | అజమ్ | = జన్మరహితుడవు; |
| సర్వే | = అందరూ; | విభుమ్ | = సర్వవ్యాపివి; |
| దేవర్షిః నారదః | = దేవర్షి నారదుడూ; | ఆహుః | = అని చెప్పుచున్నారు; |
| తథా | = మరియు; | స్వయం ఏవ చ | = నీవు కూడా; |
| అసితః | = అసితుడూ; | మే | = నాకు; |
| దేవలః | = దేవలుడూ; | బ్రవీషి | = చెప్పుచున్నావు. |

**తా॥** అర్జునుడు పలికెను : నీవు పరబ్రహ్మవు, పరమ పదానివి, పరమ పావనుడవు; నీవు సర్వవ్యాపివి, సనాతనుడవు, జన్మరహితుడవు, దివ్యపురుషుడవు, ఆది దేవుడవు, ఋషులందరూ, దేవర్షి నారదుడూ, అసితుడూ, దేవలుడూ[1], వ్యాసుడు కూడా నిన్ను ఈ విధంగానే వర్ణిస్తున్నారు. నీవు కూడా నాకు అలాగే చెబుతున్నావు. 12-13

**సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।**
**న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14**

సర్వమ్, ఏతత్, ఋతమ్, మన్యే, యత్, మామ్, వదసి, కేశవ,
న, హి, తే, భగవన్, వ్యక్తిమ్, విదుః, దేవాః, న, దానవాః

1. "వీ రిర్వురును పితాపుత్రులని కూర్మపురాణము తెల్పుచున్నది.

| | | | |
|---|---|---|---|
| కేశవ | = కృష్ణా; | హి | = ఏమన; |
| మామ్ | = నన్ను గూర్చి; | భగవన్ | = ఈశ్వరా; |
| యత్ | = దేనిని; | తే | = నీ; |
| వదసి | = చెప్పుచున్నాడవో; | వ్యక్తిమ్ | = ఆవిర్భావమును; |
| ఏతత్ | = ఈ; | దేవాః | = దేవతలు; |
| సర్వమ్ | = సమస్తమును; | దానవాః | = దానవులు; |
| ఋతమ్ | = సత్యమని; | న విదుః | = ఎఱుగరు. |
| మన్యే | = తలతును; | | |

**తా॥** కేశవా! నీవు నాకు [ఇంద్రాది దేవతలు కూడా ఎరుగరు, (గీత : 10-2) ఇత్యాదిగా] చెబుతున్న సమస్తమూ సత్యమనే విశ్వసిస్తున్నాను. దేవా! నీ ఆవిర్భావాన్ని దేవతలూ (అది తమ అనుగ్రహార్థమే అనీ) దానవులు కూడా (అది తమ నిగ్రహార్థమే అని) ఎరుగరు. 14

**స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।**
**భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15**

స్వయమ్, ఏవ, ఆత్మనా, ఆత్మానమ్, వేత్థ, త్వమ్, పురుష ఉత్తమ,
భూతభావన, భూత ఈశ, దేవదేవ, జగత్పతే.

| | | | |
|---|---|---|---|
| పురుష ఉత్తమ | = పురుషోత్తమా; | త్వమ్ | = నీవు; |
| భూత భావన | = భూతోత్పాదకా; | స్వయం ఏవ | = నీయంతట నీవే; |
| భూత-ఈశ | = జీవ నియామకా; | ఆత్మనా | = సాధనాంతరవ్యతీతంగా, (ఆత్మచేత); |
| దేవ దేవ | = ఆదిత్యాదిదేవతలను ప్రకాశింపజేయువాడా; | ఆత్మానమ్ | = నిన్ను; |
| జగత్-పతే | = విశ్వపాలకా; | వేత్థ | = తెలిసికుంటున్నావు. |

**తా॥** పురుషోత్తమా![1] భూతభావనా! భూతేశా! దేవదేవా! జగత్పతీ! నిరతిశయ జ్ఞానైశ్వర్యబల శక్తివిశిష్టుడవైన నిన్ను నీవే సాధనాంతరవ్యతీతంగా ఎరుగగలవు, ఇతరులు ఎరుగజాలరు. (కుమార సంభవమ్. 2-10 చూ:) 15

**వక్తుమర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః ।**
**యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16**

1. గీత . 15 - 18 చూ.

*వక్తుమ్, అర్హసి, అశేషేణ, దివ్యాః, హి, ఆత్మ విభూతయః,*
*యాభిః, విభూతిభిః, లోకాన్, ఇమాన్, త్వమ్, వ్యాప్య, తిష్ఠసి.*

| | | | |
|---|---|---|---|
| యాభిః | = ఏయే; | తిష్ఠసి | = ఉన్నావో; |
| విభూతిభిః | = విభూతుల చేత; | దివ్యాః | = అప్రాకృతాలైన; |
| త్వమ్ | = నీవు; | ఆత్మ విభూతయః | = నీ విభూతులను; |
| ఇమాన్ | = ఈ; | అశేషేణ హి | = సంపూర్ణంగా; |
| లోకాన్ | = లోకాలను; | వక్తుమ్ | = చెప్ప (నీవే); |
| వ్యాప్య | = వ్యాపించి; | అర్హసి | = తగుదువు. |

**తా॥** (నీ ఆవిర్భావాన్ని దేవాదులు కూడా ఎరుగరు కనుక,) నీవు ఏయే విభూతుల చేత ఈ లోకాలంతటా వ్యాపించి ఉన్నావో ఆయా దివ్యములైన ఆత్మ విభూతులను సంపూర్ణంగా వర్ణింప నీవే సమర్థుడవు. 16

**కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్ ।**
**కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥ 17**

*కథమ్, విద్యామ్, అహమ్, యోగిన్, త్వామ్, సదా, పరిచింతయన్,*
*కేషు, కేషు, చ, భావేషు, చింత్యః, అసి, భగవన్, మయా.*

| | | | |
|---|---|---|---|
| యోగిన్ | = యోగీశ్వరా; | విద్యామ్ | = ఎరుగ గలను; |
| సదా | = సర్వదా; | భగవన్ | = ఈశ్వరా; |
| పరిచింతయన్ | = చింతిస్తూ; | కేషు కేషు | = ఏ యే; |
| కథమ్ | = ఎట్లు; | భావేషు | = వస్తువుల; |
| త్వామ్ | = నిన్ను; | మయా | = నాచే; (నీవు) |
| అహమ్ | = నేను; | చిన్త్యః అసి | = ధ్యానింపబడదగిన వాడవగుతావు? |

**తా॥** (విభూతి భేదాల ప్రయోజనం సూచించబడుతోంది–) యోగేశ్వరా! ని న్నెట్లు నిరంతరం చింతించినా, నేను నిన్ను ఎరుగగలను? ఈశ్వరా! ఏయే వస్తువులలో నిన్ను నేను ధ్యానించ గలను? 17

**విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18**

*విస్తరేణ, ఆత్మనః, యోగమ్, విభూతిమ్, చ, జనార్దన,*

*భూయః, కథయ, తృప్తిః, హి, శృణ్వతః, న, అస్తి, మే, అమృతమ్.*

| | | | |
|---|---|---|---|
| జనార్దన | = కృష్ణా; | కథయ | = చెప్పు; |
| ఆత్మనః | = నీ; | హి | = ఏమన (నీ) ; |
| యోగమ్ | = సర్వజ్ఞత్వాదికమైన ఐశ్వర్యాన్ని; | అమృతమ్ | = వాక్యామృతాన్ని; |
| విభూతిమ్ చ | = వేరు వేరైన ధ్యేయ వస్తువులను; | శృణ్వతః | = వింటున్న; |
| | | మే | = నాకు; |
| విస్తరేణ | = వివరంగా; | తృప్తిః | = పరితృప్తి (చాలనే భావం); |
| భూయః | = మళ్ళీ; | న అస్తి | = లేదు (కలుగుట లేదు). |

**తా॥** (చిత్తం బహిర్ముఖమైనప్పటికీ విభూతిభేదాన్ని అనుసరించి ఆయా వస్తువులతో నిన్ను చింతింప వీలుగా, నీ విభూతులను విస్తరించి చెప్పు–) జనార్దనా! నీ యోగైశ్వర్యాన్ని విభూతులను మళ్ళీ విస్తరించి చెప్పు; ఏయే వస్తువుల ననుసరించి నిన్ను ధ్యానించ గలనో తెలియజెప్పు. నీ వాక్యామృతాన్ని వింటున్న నాకు తృప్తి అనేది కలగడం లేదు; ఇంకా వినవలెననే ఉంది. 18

*శ్రీ భగవానువాచ :*

**హన్త తే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః ।**

**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥ 19**

*హంత, తే, కథయిష్యామి, దివ్యాః, హి, ఆత్మ విభూతయః,*

*ప్రాధాన్యతః, కురుశ్రేష్ఠ, న, అస్తి, అంతః, విస్తరస్య, మే.*

| | | | |
|---|---|---|---|
| హంత | = అహో(అట్లయిన); | తే | = నీకు; |
| కురు శ్రేష్ఠ | = అర్జునా; | కథయిష్యామి | = చెబుతాను; |
| దివ్యాః | = అలౌకికాలైన; | హి | = ఏమన; |
| ఆత్మ విభూతయః | = మదీయములూ, ధ్యానావలంబనములూ అయిన వస్తువులను; | మే | = నా; |
| | | విస్తరస్య | = అవాంతర విభూతులకు; |
| | | అన్తః | = తుది; |
| ప్రాధాన్యతః | = యోగ్యతననుసరించి; | న అస్తి | = లేదు. |

**తా॥** *శ్రీభగవానుడు చెబుతున్నాడు :* కురుశ్రేష్ఠా! అట్లయితే అత్యంత ముఖ్యములూ, మదీయాలూ, దివ్యాలూ, ధ్యానావలంబన యోగ్యాలూ అయిన

వస్తుసమూహాలను నీకు చెబుతాను; నా అవాంతర విభూతులకు అంతం లేదు. (కనుక, ప్రధానమైన వాటిని కొన్నింటిని వర్ణిస్తాను.) 19

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥ 20**

*అహమ్, ఆత్మా, గుడాకేశ, సర్వభూత ఆశయస్థితః,*
*అహమ్, ఆదిః, చ, మధ్యమ్, చ, భూతానామ్, అంతః, ఏవ, చ.*

| | | | |
|---|---|---|---|
| గుడాకేశ | = అర్జునా; | అహమ్ ఏవ చ | = మరియు, నేనే; |
| అహమ్ | = నేను; | భూతానామ్ | = భూతాల; |
| సర్వభూత ఆశయస్థితః | = ప్రాణులందరి హృదయాలలో వెలయు; | ఆదిః చ | = ఉత్పత్తిని; |
| | | మధ్యం చ | = స్థితిని; |
| ఆత్మా | = ప్రత్యక్ చైతన్యాన్ని; | అన్తః | = ప్రళయాన్ని కూడా. |

**తా॥** గుడాకేశా! నేను ప్రాణుల హృదయాలలో ప్రకాశించే ప్రత్యగాత్మను,[1] నేను ప్రాణుల ఉత్పత్తి, స్థితి, ప్రళయ కారణాన్ని కూడా.
(ముండకోపనిషత్తు 3-1-7 చూ.) 20

**ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్ ।**
**మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥ 21**

*ఆదిత్యానామ్, అహమ్, విష్ణుః, జ్యోతిషామ్, రవిః, అంశుమాన్,*
*మరీచిః, మరుతామ్, అస్మి, నక్షత్రాణామ్, అహమ్, శశీ.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | మరుతామ్ | = మరుద్గణ సప్తకంలో; |
| ఆదిత్యానామ్ | = ద్వాదశాదిత్యులలో; | మరీచిః | = ఆవహనాముడనైన మరీచిని; |
| విష్ణుః | = విష్ణువనే ఆదిత్యుణ్ణి; | అస్మి | = అయి ఉన్నాను; |
| జ్యోతిషామ్ | = ప్రకాశాన్ని ఒసగే వానిలో; | నక్షత్రాణామ్ | = నక్షత్రములలో; |
| అంశుమాన్ | = కిరణాలు గల; | అహమ్ | = నేను; |
| రవిః | = సూర్యుణ్ణి; | శశీ | = చంద్రుణ్ణి. |

1. సర్వభూతహృదయస్థమైన ప్రత్యగాత్మరూపంలో నిత్యం నన్ను ధ్యానించాలి; అసమర్థుడవైతే ఉత్తరోత్తరంగా చెప్పబడే భావాలను గ్రహించవచ్చు. – శ్రీశంకరులు

**తా॥** నేను ద్వాదశాదిత్యులలో[1] విష్ణువనే ఆదిత్యుణ్ణి, జ్యోతులలో విశ్వవ్యాపి రశ్మియుక్తుడైన సూర్యుణ్ణి, మరుద్గణ సప్తకం[2]లో ఆవహనాముడనైన మరీచిని; నక్షత్రాలలో చంద్రుణ్ణి నేనే. 21

**వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।**
**ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22**

*వేదానామ్, సామవేదః, అస్మి, దేవానామ్, అస్మి, వాసవః,*
*ఇంద్రియాణామ్, మనః, చ, అస్మి, భూతానామ్, అస్మి, చేతనా.*

| | | | |
|---|---|---|---|
| వేదానామ్ | = చతుర్వేదాలలో; | మనః | = సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును; |
| సామ వేదః | = సామ వేదాన్ని; | అస్మి | = అయి ఉన్నాను; |
| అస్మి | = అయి ఉన్నాను; | భూతానాం చ | = ప్రాణుల శరీరంలో; |
| దేవానామ్ | = దేవతలలో; | చేతనా | = జ్ఞాన శక్తిని; |
| వాసవః | = ఇంద్రుడను; | అస్మి | = అయి ఉన్నాను. |
| అస్మి | = అయి ఉన్నాను; | | |
| ఇంద్రియాణామ్ | = ఏకాదశేంద్రియాలలో; | | |

**తా॥** వేదాలలో నేను సామ వేదాన్ని, త్రింశత్ కోటి దేవతలలో నేను ఇంద్రుణ్ణి, ఏకాదశేంద్రియాలలో సంకల్పవికల్పాత్మకమైన మనస్సుని, ప్రాణుల శరీరంనందు ఉండే జ్ఞానశక్తిని కూడా నేనే. 22

**రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।**
**వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణా మహమ్ ॥ 23**

*రుద్రాణామ్, శంకరః, చ, అస్మి, విత్త ఈశః, యక్షరక్షసామ్,*
*వసూనామ్, పావకః, చ, అస్మి, మేరుః, శిఖరిణామ్, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| రుద్రాణామ్ చ | = ఏకాదశ రుద్రులలో; | యక్ష రక్షసామ్ | = యక్ష రాక్షసులలో; |
| శంకరః | = శంకరుడను; | విత్త ఈశః | = కుబేరుణ్ణి; |
| అస్మి | = అయి ఉన్నాను; | వసూనాం చ | = అష్ట వసువులలో; |

1. ధాత, మిత్రుడు, అర్యముడు, రుద్రుడు, వరుణుడు, సూర్యుడు, భగుడు, వివస్వంతుడు, పూష, సవిత, త్వష్ట, విష్ణువు. – ఆది పర్వ. 65-15-16.

2. ఆవహ, ప్రవహ, వివహ, పరావహ, ఉద్వహ, సంవహ, పరివహనాములు సప్తమరుత్తులు.– శ్రీధరులు

| | | | |
|---|---|---|---|
| పావకః | = అగ్ని ని; | అహం | = నేను; |
| అస్మి | = అయి ఉన్నాను; | మేరుః | = మేరువును. |
| శిఖరిణామ్ | = శిఖరాలు గల కొండలలో; | | |

**తా॥** ఏకాదశ రుద్రులలో[1] శంకరుణ్ణి, యక్షరాక్షసులలో కుబేరుణ్ణి, అష్ట వసువులలో[2] అగ్నిని, శిఖరాలు గల పర్వతాలలో మేరువును అయి ఉన్నాను. 23

**పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।**
**సేనానీనామహం స్కన్దః సరసామస్మి సాగరః ॥ 24**

పురోధసామ్, చ, ముఖ్యమ్, మామ్, విద్ధి, పార్థ, బృహస్పతిమ్,
సేనానీనామ్, అహమ్, స్కందః, సరసామ్, అస్మి, సాగరః.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | అహమ్ | = నేను; |
| మామ్ | = నన్ను; | సేనానీనామ్ | = సేనాపతులలో; |
| పురోధసాం చ | = పురోహితులలో; | స్కందః | = కుమారస్వామిని; |
| ముఖ్యమ్ | = ప్రధానుడైన; | సరసామ్ | = సరస్సులలో; |
| బృహస్పతిమ్ | = బృహస్పతిగా; | సాగరః | = సముద్రుణ్ణి; |
| విద్ధి | = గ్రహించు; | అస్మి | = అయి ఉన్నాను. |

**తా॥** అర్జునా! నేను పురోహితులలో (దేవపురోహితుడగుట వలన) ముఖ్యుడైన బృహస్పతిని[3], సేనాపతులలో దేవసేనానాయకుడైన కుమారుడను[4], జలాశయాలలో సముద్రుణ్ణి. 24

**మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ 25**

---

1. అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, పినాకి, అపరాజితుడు, త్ర్యంబకుడు, మహేశ్వరుడు, వృషాకపి, శంభుడు, హరణుడు, ఈశ్వరుడు అనేవారు ఏకాదశరుద్రులు. – హరివంశమ్. 1-3-51, 52 చూ.

2. ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనేవారు అష్టవసువులు. – ఆది పర్వ 66-18.

3. ఈయన అంగిరోమహర్షి పుత్రుడు, స్వారోచిషమన్వంతరంలో సప్తర్షులలో ప్రధానుడు. (హరివంశమ్. 7-12; మత్స్య పురాణమ్ 9-8 చూ.) వామనావతారంలో భగవంతుడు ఈయన వద్ద విద్యను అభ్యసించాడు. – బృహద్ధర్మ పురాణమ్.

4. వన పర్వ. 223 చూ.

*మహర్షీణామ్, భృగుః, అహమ్, గిరామ్, అస్మి, ఏకమ్, అక్షరమ్,*

*యజ్ఞానామ్, జపయజ్ఞః, అస్మి, స్థావరాణామ్, హిమాలయః.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | యజ్ఞానాం | = శ్రౌతస్మార్తములైన యజ్ఞాలలో; |
| మహర్షీణామ్ | = మహర్షులలో; | | |
| భృగుః | = భృగువును; | జప యజ్ఞః | = జపరూప యజ్ఞాన్ని; |
| గిరామ్ | = వాక్యములలో; | అస్మి | = అయి ఉన్నాను; |
| ఏకం అక్షరమ్ | = ఏకాక్షరమైన ప్రణవాన్ని; | స్థావరాణాం | = స్థావర పదార్థాలలో; |
| అస్మి | = అయి ఉన్నాను; | హిమాలయః | = హిమాలయ పర్వతమును. |

**తా॥** మహర్షులలో నేను భృగువును[1], శబ్దసమూహమున ఏకాక్షరమూ బ్రహ్మవాచకమూ అయిన ఓంకారాన్ని, శ్రౌతస్మార్తాది యజ్ఞాలలో[2] జపరూపమైన యజ్ఞాన్ని, స్థావర పదార్థాలలో(పర్వతాలలో) హిమాలయాన్ని.[3] 25

**అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।**
**గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26**

*అశ్వత్థః, సర్వవృక్షాణామ్, దేవర్షీణామ్, చ, నారదః,*

*గంధర్వాణామ్, చిత్రరథః, సిద్ధానామ్, కపిలః, మునిః.*

| | | | |
|---|---|---|---|
| సర్వవృక్షాణామ్ | = వృక్షములన్నింట; | గంధర్వాణామ్ | = గంధర్వులలో; |
| అశ్వత్థః | = అశ్వత్థమును (రావిచెట్టును); | చిత్రరథః | = చిత్రరథుడను; |
| దేవర్షీణాం చ | = దేవర్షులలో; | సిద్ధానామ్ | = సిద్ధులలో; |
| నారదః | = నారదుణ్ణి; | కపిలః మునిః | = కపిల మునిని. |

**తా॥** నేను వృక్షాలలో అశ్వత్థమును[4], దేవర్షులలో నారదుణ్ణి[5],

1. భృగువు, మరీచి, అత్రి, అంగిరుడు, పులహుడు, క్రతువు, మనువు, దక్షుడు, వసిష్ఠుడు, పులస్త్యుడు.
– వాయు పురాణమ్ 59-89.

2. యే పాకయజ్ఞాశ్చ త్వారో విధియజ్ఞ సమన్వితాః,
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్. – మను స్మృతిః 2-86

3. కుమార సంభవమ్ చూ. 6-67

4. మూలే విష్ణుః స్థితో నిత్యం స్కంధే కేశవ ఏవ చ,
నారాయణస్తు శాఖాసు పత్రేషు భగవాన్ హరిః. – స్కాంద పురాణమ్; నాగర ఖండమ్ 247-41

5. నరనారాయణులు, వాలఖిల్యులు, కర్దమ పులహులు, పర్వత నారదులు అని దేవర్షులు.
– వాయు పురాణమ్ 61-83-85 చూ.

గంధర్వులలో చిత్రరథుణ్ణి[1], సిద్ధులలో[2] కపిలుణ్ణి అయి ఉన్నాను. 26

**ఉచ్చైఃశ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।**
**ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27**

*ఉచ్చైఃశ్రవసమ్, అశ్వానామ్, విద్ధి, మామ్, అమృత ఉద్భవమ్,*
*ఐరావతమ్, గజ ఇంద్రాణామ్, నరాణామ్, చ, నర అధిపమ్.*

| | | | |
|---|---|---|---|
| అశ్వానామ్ | = గుఱ్ఱాలలో; | ఐరావతమ్ | = ఐరావతంగాను; |
| అమృత ఉద్భవమ్ | = అమృతం నుండి పుట్టిన; | నరాణాంచ | = మనుష్యులలో; |
| | | నర అధిపమ్ | = రాజుగాను; |
| ఉచ్చైః శ్రవసమ్ | = ఉచ్చైశ్రవసమును; | మాం | = నన్ను; |
| గజ ఇంద్రాణామ్ | = శ్రేష్ఠమైన ఏనుగులలో; | విద్ధి | = ఎరుగు. |

**తా॥** నన్ను అశ్వాలలో (అమృతార్థం సముద్ర మంథనం ఒనర్చినప్పుడు ఉద్భవించిన) ఉచ్చైఃశ్రవంగా, శ్రేష్ఠమైన ఏనుగులలో ఐరావతంగా, మనుష్యులలో రాజుగా[3] తెలుసుకో. 27

**ఆయుధానా మహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।**
**ప్రజనశ్చాస్మి కన్దర్పః సర్పాణామస్మి వాసుకిః ॥ 28**

*ఆయుధానామ్, అహమ్, వజ్రమ్, ధేనూనామ్, అస్మి, కామధుక్,*
*ప్రజనః, చ, అస్మి, కందర్పః, సర్పాణామ్, అస్మి, వాసుకిః.*

| | | | |
|---|---|---|---|
| ఆయుధానామ్ | = ఆయుధాలలో; | వజ్రం | = (దధీచి వెన్నెముక వల్ల కలిగిన) వజ్రాయుధాన్ని; |
| అహం | = నేను; | | |

1. మనుష్య గంధర్వులు, దివ్య గంధర్వులు అని గంధర్వులు ద్వివిధులు. అందులో పుణ్యబలంతో కల్పాదిలో గంధర్వత్వాన్ని పొందినవారు మనుష్య గంధర్వులు. ఇక దేవగంధర్వులలో కశ్యపపత్ని అయిన మునికి జన్మించినవారు మౌనేయులని, ప్రధకు కల్గినవారు ప్రాధేయులు అని పిలవబడతారు. మౌనేయులు పదహారుగురు, ప్రాధేయులు పదునల్గురు. వీరందఱికిని చిత్రరథుడు అధిపతి. - ఆది పర్వ 65

2. జన్మతోనే ధర్మజ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాలను పొందిన వారు సిద్ధులు.
కపిలుని గురించి శ్రీమద్భాగవతమ్ 3-24. చూ.

3. 'నా విష్ణుః పృథివీపతిః' అనడం ప్రసిద్ధం కదా!

| | | | |
|---|---|---|---|
| ధేనూనామ్ | = గోవులలో; | కందర్పః చ | = మన్మథుడను కూడా; |
| కామ ధుక్ | = కామధేనువును; | అస్మి | = అయి ఉన్నాను; |
| అస్మి | = అయి ఉన్నాను (నేను); | సర్పాణామ్ వాసుకిః | = సర్పాలలో వాసుకి; |
| ప్రజనః | = సంతానోత్పాదకుడైన; | అస్మి | = అయి ఉన్నాను; |

**తా॥** ఆయుధాలలో (దధీచి[1] వెన్నెముక వలన కలిగిన) వజ్రాయుధాన్ని నేను, గోవులలో కామధేనువును; సంతానోత్పాదకుడైన మన్మథుణ్ణి కూడా నేను (కాని, కేవలం సంభోగమాత్ర ప్రధానమైన కామం అశాస్త్రీయమవడం వల్ల, నా విభూతి కాదు.[2]) సర్పాలలో వానికి అధిపతియైన వాసుకి కూడా నేనే. 28

**అనన్తాశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।**
**పితౄణామర్యమా చాస్మి యమ స్సంయమతామహమ్ ॥ 29**

*అనంతః, చ, అస్మి, నాగానామ్, వరుణః, యాదసామ్, అహమ్, పితౄణామ్, అర్యమా, చ, అస్మి, యమః, సంయమతామ్, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| నాగానామ్ | = పెక్కుతలలు గల నాగులలో; | పితౄణామ్ | = పితృదేవతలలో; |
| అనంతః | = శేషుడను; | అర్యమా | = అర్యముణ్ణి; |
| అస్మి | = అయి ఉన్నాను; | సంయమతాం చ | = శాసించే వారిలో; |
| యాదసాం చ | = జలదేవతలలో; | యమః | = యముడను; |
| అహమ్ | = నేను; | అహమ్ | = నేను; |
| వరుణః | = వారికి రాజైన వరుణుణ్ణి; | అస్మి | = అయి ఉన్నాను |

**తా॥** పెక్కుతలలు గల నాగులలో అనంతుణ్ణి, జల దేవతలలో వరుణుణ్ణి, పితృదేవతలలో అర్యముణ్ణి[3], శాసించే వారిలో యముణ్ణి నేను అయి ఉన్నాను. 29

**ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।**
**మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥ 30**

---

1. శ్రీమద్భాగవతమ్. 6-11; చూ; 2. శ్రీమద్భగవద్గీతా. 7-11 చూ.
3. కవ్యవాహ, అనల, సోమ, యమ, అర్యమ, అగ్నిష్వాత్త, బర్హిషత్తులు.
- శివ పురాణమ్; ధర్మ వైభవ ఖండమ్ 63-2.

ప్రహ్లాదః, చ, అస్మి, దైత్యానామ్, కాలః, కలయతామ్, అహమ్,
మృగాణామ్, చ, మృగ ఇంద్రః, అహమ్, వైనతేయః, చ, పక్షిణామ్.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | మృగాణాం చ | = మృగాలలో; |
| దైత్యానామ్ | = దితి సంతతిలో; | అహమ్ | = నేను; |
| ప్రహ్లాదః | = ప్రహ్లాదుణ్ణి; | మృగ ఇన్ద్రః | = మృగరాజైన సింహాన్ని; |
| అస్మి | = అయి ఉన్నాను; | అహమ్ | = నేను; |
| కలయతాం చ | = వశం చేసుకునే వారిలో (లెక్క పెట్టువారిలో); | పక్షిణాం చ | = పక్షులలో; |
| కాలః | = కాలాన్ని; | వైనతేయః | = వినతాసుతుడైన గరుడుడను. |

**తా॥** దైత్యులలో నేను ప్రహ్లాదుణ్ణి, గణకులలో కాలాన్ని, మృగాలలో సింహాన్ని, పక్షులలో వినతాసుతుడైన గరుడుణ్ణి. 30

**పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।**
**ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31**

పవనః, పవతామ్, అస్మి, రామః, శస్త్రభృతామ్, అహమ్,
ఝషాణామ్, మకరః, చ, అస్మి, స్రోతసామ్, అస్మి, జాహ్నవీ.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | ఝషాణామ్ | = మత్స్యాదులలో; |
| పవతామ్ | = పవిత్రమొనర్చేవానిలో, (వేగవంతములగువానిలో); | మకరః చ | = మొసలి అనే మత్స్య జాతి విశేషాన్ని; |
| పవనః | = వాయువును; | అస్మి | = అయి ఉన్నాను; |
| శస్త్ర భృతామ్ | = ఆయుధ ధారులలో; | స్రోతసామ్ | = నదులలో; |
| రామః | = శ్రీరాముణ్ణి; | జాహ్నవీ | = గంగను; |
| అస్మి | = అయి ఉన్నాను; | అస్మి | = అయి ఉన్నాను. |

**తా॥** పవిత్రమొనర్చే (వేగవంతములైన) వానిలో నేను వాయువును, ఆయుధ ధారులలో శ్రీరాముణ్ణి. మత్స్యాదులలో మొసలి అనే మత్స్యజాతి విశేషాన్ని. నదులలో గంగను. 31

**సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహ మర్జున ।**
**అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥ 32**

సర్గాణామ్, ఆదిః, అంతః, చ, మధ్యమ్, చ, ఏవ, అహమ్, అర్జున,
అధ్యాత్మ విద్యా, విద్యానామ్, వాదః, ప్రవదతామ్, అహమ్.

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | విద్యానామ్ | = విద్యలలో; |
| సర్గాణామ్ | = ఆకాశాది సృష్టి వస్తువుల; | అధ్యాత్మ విద్యా | = ఆత్మ విద్య (మోక్షప్రదమైన ఆత్మవిద్యను); |
| ఆదిః | = ఉత్పత్తి; | ప్రవదతామ్ | = తార్కికుల వాద, జల్ప, వితండాలలో; |
| అంతః చ | = ప్రళయమూ; | | |
| మధ్యం చ | = స్థితినీ; | అహమ్ | = నేను; |
| అహమ్ ఏవ | = నేనే; | వాదః | = వాదాన్ని; |

**తా॥** అర్జునా! నేను ఆకాశాది సృష్టవస్తువులన్నిటికీ ఉత్పత్తి, స్థితి, సంహారకుడనైన[1] కర్తను. విద్యలలో మోక్ష ప్రదమైన ఆధ్యాత్మ విద్యను. తార్కికుల వాద, జల్ప, వితండాలలో[2] వాదాన్ని. 32

**అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ ।**
**అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతో ముఖః ॥ 33**

అక్షరాణామ్, అకారః, అస్మి, ద్వంద్వః, సామాసికస్య, చ,
అహమ్, ఏవ, అక్షయః, కాలః, ధాతా, అహమ్, విశ్వతో ముఖః.

| | | | |
|---|---|---|---|
| అక్షరాణామ్ | = అక్షరాలలో; | అక్షయః | = ప్రవాహరూపమైన; |
| అకారః | = అకారాన్ని; | కాలః | = కాలాన్ని (కాలకాలుడైన పరమేశ్వరుణ్ణి); |
| అస్మి | = అయి ఉన్నాను; | | |
| సామాసికస్య చ | = సమాసాలలో; | అహమ్ | = నేను; |
| ద్వంద్వః | = ఉభయపద ప్రధానమైన ద్వంద్వ సమాసాన్ని; | విశ్వతోముఖః | = సర్వతో ముఖుడైన; |
| | | ధాతా | = కర్మ ఫలదాతను. |
| అహం ఏవ | = నేనే; | | |

**తా॥** అక్షరాలలో నేను అకారాన్ని[3], సమాసాలలో ఉభయపద ప్రధానమైన

---

1. సృష్టి, స్థితి, ప్రళయాలను ఈశ్వరుణ్ణి విభూతిగా ధ్యానించాలి.
2. వాదం = తత్త్వనిర్ణయార్థమై తర్కం; వితండం = పరపక్ష దూషణం; జల్పం = ఆత్మపక్ష సమర్థనం.
   – ఈ మూడిటిలో వాదమే తత్త్వనిర్ణయ సమర్థం కాబట్టి, భగవద్విభూతిగా చెప్పబడింది.
3. అకారో వై సర్వావాక్, సైషా స్పర్శోష్మభిర్వ్యజ్యమానా బహ్వీ నానారూపా భవతి.
   – ఐతరేయ బ్రాహ్మణమ్ 3-6.

ద్వంద్వాన్ని; ప్రవాహరూపమైన కాలాన్ని[1], సర్వతో ముఖుడైన కర్మఫలదాతను కూడా నేనే.

**మృత్యుస్సర్వ హరశ్చాహం ఉద్భవశ్చ భవిష్యతామ్ ।**
**కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34**

మృత్యుః, సర్వ హరః, చ, అహమ్, ఉద్భవః, చ, భవిష్యతామ్,
కీర్తిః, శ్రీః, వాక్, చ, నారీణామ్, స్మృతిః, మేధా, ధృతిః, క్షమా.

| | | | |
|---|---|---|---|
| అహం చ | = మఱియు, నేను; | నారీణామ్ | = స్త్రీలలో; |
| సర్వ హరః | = సర్వాన్ని సంహరించే; | | |
| మృత్యుః | = మృత్యువును; | కీర్తిః, శ్రీః, వాక్, స్మృతిః, మేధా, ధృతి, క్షమా చ | = (ధర్ముని సపత్నులైన) కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతిః, మేధా, ధృతి, క్షమ అయి ఉన్నాను. |
| భవిష్యతాం చ | = అభ్యుదయం గాంచగల వారి; | | |
| ఉద్భవః | = అభ్యుదయాన్ని; | | |

**తా॥** సంహారకులలో నేను సర్వసంహారకుడైన మృత్యువును. అభ్యుదయం గాంచచున్న వారి అభ్యుదయాన్ని; ధర్ముని సపత్నులైన కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమలు కూడా నేనే. 34

**బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్ ।**
**మాసానాం మార్గశీర్షో౽హం ఋతూనాం కుసుమాకరః ॥ 35**

బృహత్ సామ, తథా, సామ్నామ్, గాయత్రీ, ఛందసామ్, అహమ్,
మాసానామ్, మార్గశీర్షః, అహమ్, ఋతూనామ్, కుసుమాకరః.

| | | | |
|---|---|---|---|
| తథా | = అటులనే; | గాయత్రీ | = గాయత్రిని; |
| అహమ్ | = నేను; | మాసానామ్ | = మాసాలలో; |
| సామ్నామ్ | = సామ గీతములో; | అహమ్ | = నేను; |
| బృహత్ సామ | = (ఇంద్రుణ్ణి సర్వేశ్వరునిగా స్తుతించుటచే శ్రేష్ఠమైన) బృహత్సామాన్ని; | మార్గశీర్షః | = మార్గశీర్షమును; |
| | | ఋతూనామ్ | = ఋతువులలో; |
| ఛందసామ్ | = ఛందోవిశిష్టాలైన ఋక్కులలో; | కుసుమాకరః | = వసంతమును. |

1. 'కాలః కలయతామహామస్మి' అనేచోట కాలం ఆయుర్గణ నాత్మకం, పురుషాయుర్దాయాన్ని అనుసరించి. ఇచ్చట కాలం, అనంతమైన కాలం.

**తా॥** నేను రథంతరాది సామ సమూహంలో(ఇంద్రుని సర్వేశ్వరునిగా స్తుతించుటచే శ్రేష్ఠమైనదీ, మోక్ష ప్రతిపాదికమూ అయిన) బృహత్సామమును.[1] ఛందోవిశిష్టములైన ఋక్కులలో (ద్విజత్వాన్ని ఒసగేదీ, సోమలతను తెచ్చుటకు ప్రయోగింపబడేదీ, బ్రహ్మప్రాపకమూ అవడం వల్ల శ్రేష్ఠమైన) గాయత్రిని. మాసాలలో మార్గశీర్షమును.[2] ఋతువులలో వసంతాన్ని. 35

**ద్యూతం ఛలయతామస్మి తేజ స్తేజస్వినా మహమ్ ।**
**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥ 36**

*ద్యూతమ్, ఛలయతామ్, అస్మి, తేజః, తేజస్వినామ్, అహమ్,*
*జయః, అస్మి, వ్యవసాయః, అస్మి, సత్త్వమ్, సత్త్వవతామ్, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | అస్మి | = అయి ఉన్నాను; |
| ఛలయతామ్ | = వంచనపరులైనవారి; | (జేతౄణాం | = జయశీలురైన వారి;) |
| ద్యూతమ్ | = జూదాన్ని; | జయః | = విజయము; |
| తేజస్వినామ్ | = తేజశ్శాలులు; | అస్మి | = అయి ఉన్నాను; |
| తేజః | = ప్రభావాన్ని; | అహమ్ | = నేను; |
| అస్మి | = అయి ఉన్నాను; | సత్త్వవతామ్ | = సాత్త్వికుల; |
| (వ్యవసాయినాం | = ఉద్యమపరుల;) | సత్త్వమ్ | = సత్త్వగుణాన్ని. |
| వ్యవసాయః | = ఉద్యమాన్ని; | | |

**తా॥** నేను వంచనపరులైన వారి జూదాన్ని, ప్రభావశాలుర తేజాన్ని, జయశీలుర విజయాన్ని, ఉద్యమపరుల ఉద్యమాన్ని, సాత్త్వికుల సత్త్వగుణాన్ని అయి ఉన్నాను. 36

**వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనఞ్జయః ।**
**మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ 37**

*వృష్ణీనామ్, వాసుదేవః, అస్మి, పాండవానామ్, ధనంజయః,*
*మునీనామ్, అపి, అహమ్, వ్యాసః, కవీనామ్, ఉశనా, కవిః.*

---

1. త్వామిద్ధి హవామహే. - సామవేద సంహిత 1-134

2. మహాభారతకాలంలో వర్ష (సంవత్సర) గణనం మార్గశీర్షంతో ఆరంభింపబడెడిది. కనుక, దీని శ్రేష్ఠత్వం సూచింపబడింది. సమశీతోష్ణమగుటయే దీని శ్రేష్ఠత్వమని మధుసూదన సరస్వతి.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | మునీనామ్ | = సర్వపదార్థ జ్ఞానులలో; |
| వృష్ణీనామ్ | = వృష్ణి వంశీయులలో (యాదవులలో); | వ్యాసః | = వేదవ్యాసుణ్ణి; |
| వాసుదేవః | = కృష్ణుణ్ణి; | కవీనాం అపి | = సూక్ష్మార్థ వివేకం గలవారిలో; |
| అస్మి | = అయి ఉన్నాను; | కవిః ఉశనా | = శుక్రుడనే కవిని; |
| పాండవానామ్ | = పాండవులలో; | అస్మి | = అయి ఉన్నాను. |
| ధనఞ్జయః | = అర్జునుణ్ణి; | | |

**తా॥** యాదవులలో నేను శ్రీకృష్ణుణ్ణి, పాండవులలో అర్జునుణ్ణి, సర్వపదార్థజ్ఞానులు (వేదార్థ మననశీలురు) అయిన వారిలో వేదవ్యాసుణ్ణి, సూక్ష్మార్థ వివేకం గలవారిలో శుక్రుణ్ణి. 37

**దణ్డో దమయతా మస్మి నీతిరస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥ 38**

*దండః, దమయతామ్, అస్మి, నీతిః, అస్మి, జిగీషతామ్,*
*మౌనమ్, చ, ఏవ, అస్మి, గుహ్యానామ్, జ్ఞానమ్, జ్ఞానవతామ్, అహమ్.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | అస్మి | = అయి ఉన్నాను; |
| దమయతామ్ | = దమనమొనర్చేవారి (దండించేవారి); | గుహ్యానామ్ | = గోప్య విషయాలకు సంబంధించిన; |
| దండః | = దండ నీతిని; | మౌనం ఏవ చ | = మౌనం కూడా (నేనే); |
| అస్మి | = అయి ఉన్నాను; | జ్ఞానవతామ్ | = జ్ఞానుల; |
| జిగీషతామ్ | = జయింపగోరే వారి; | జ్ఞానమ్ | = తత్త్వ జ్ఞానాన్ని. |
| నీతిః | = రాజనీతిని; | | |

**తా॥** అసంయతులను శాసించి నియమించే వారి దండనీతి నా విభూతి అని గ్రహించు; జయింపగోరేవారి రాజనీతి నేనే. విషయాలను రహస్యంగా ఉంచే మౌనం కూడా నేనే. తత్త్వజ్ఞానుల యందు నా విభూతి జ్ఞానరూపంలో ప్రకాశిస్తోంది.[1] 38

1. 'అహమాత్మా గుడాకేశ' అనే శ్లోకం మొదలు 'జ్ఞానం జ్ఞానవతామహమ్' అనేంత వరకు చెప్పబడిన విభూతుల సంఖ్య 71 అని గ్రహించాలి.

ఇటువంటి విభూతుల వర్ణన నిమిత్తం శ్రీమద్భాగవతమ్ 11-16 చూ.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినా యత్స్యాన్మయాభూతం చరాచరమ్ ॥ 39**

*యత్, చ, అపి, సర్వభూతానామ్, బీజమ్, తత్, అహమ్, అర్జున,*
*న, తత్, అస్తి, వినా, యత్, స్యాత్, మయా, భూతమ్, చర అచరమ్.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | యత్ | = ఏది; |
| యత్ చ | = ఏది; | స్యాత్ | = కాగలదో; |
| సర్వభూతానామ్ | = సర్వభూతాలకు; | తత్ | = అట్టి; |
| బీజమ్ | = మూలకారణమో; | చర అచరమ్ | = స్థావర జంగమాత్మకమైన; |
| తత్ అపి | = అది కూడా; | | |
| అహమ్ | = నేను; | భూతమ్ | = వస్తువు; |
| మయా వినా | = నాతో కూడనట్టిది; | న అస్తి | = లేదు. |

**తా॥** అర్జునా! సర్వభూతాలకు మూలకారణమైనది ఏదో, అది నేనే. స్థావరజంగమాత్మకాలైన వస్తువులలో ఏ ఒక్కటి కూడా, నా శక్తి లేకుంటే నిలువబడగలిగేది లేదు. అన్నీ మదాత్మకాలు. 39

**నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।**
**ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40**

*న, అంతః, అస్తి, మమ, దివ్యానామ్, విభూతీనామ్, పరంతప,*
*ఏషః, తు, ఉద్దేశతః, ప్రోక్తః, విభూతేః, విస్తరః, మయా.*

| | | | |
|---|---|---|---|
| పరంతప | = అర్జునా; | ఏషః తు | = అయినా ఈ; |
| మమ | = నా; | విభూతేః | = విభూతుల; |
| దివ్యానామ్ | = దివ్యములైన; | విస్తారః | = వివరణ; |
| విభూతీనామ్ | = విభూతులకు; | మయా | = నాచే; |
| అంతః | = తుది; | ఉద్దేశతః | = సంక్షేపంగా; |
| న అస్తి | = లేదు; | ప్రోక్తః | = చెప్పబడింది. |

**తా॥** (ప్రకరణం ఉపసంహరించబడుతోంది-) అర్జునా! దివ్యములైన నా విభూతులకు పరిమితి లేదు; అయినప్పటికీ సంక్షేపంగా ఈ విభూతులను వర్ణించాను.

**యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీ మదూర్జిత మేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్ ॥ 41**

*యత్, యత్, విభూతిమత్, సత్త్వమ్, శ్రీమత్, ఊర్జితమ్, ఏవ, వా,*
*తత్, తత్, ఏవ, అవగచ్ఛ, త్వమ్, మమ, తేజః అంశ సంభవమ్.*

విభూతి మత్ = ఐశ్వర్యయుక్తమూ;
శ్రీ మత్ = లక్ష్మియుక్తమూ;
ఊర్జితం ఏవ వా = ఏదో ఒక విధమైన శ్రేష్ఠతతో ఒప్పారేది (ఉత్సాహయుతమూ, బలయుతమూ అయిన);
యత్ యత్ = ఏ యే;
సత్త్వమ్ = వస్తువు, ప్రాణి కలదో;
తత్ తత్ ఏవ = ఆ యా వస్తుజాతమంతా;
మమ = నా;
తేజః అంశ సంభవమ్ = శక్తి అంశం నుండి కలిగినదిగా;
త్వమ్ = నీవు;
అవగచ్ఛ = గ్రహించు.

**తా॥** (మరల గ్రహింపగోరే అర్జునునికి అన్యవిధంగా సమస్త విభూతుల విషయాన్ని చెబుతున్నాడు–) ఐశ్వర్యయుక్తమూ, శ్రీమంతమూ, సర్వశ్రేష్ఠమూ అయిన వస్తువు ఏదైనా కానిమ్ము, అది నా శక్తి అంశం నుండి కలిగినది అని నీవు గ్రహించు. 41

**అథ వా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్ ॥ 42**

*అథవా, బహునా, ఏతేన, కిమ్, జ్ఞాతేన, తవ, అర్జున,*
*విష్టభ్య, అహమ్, ఇదమ్, కృత్స్నమ్, ఏక అంశేన, స్థితః, జగత్.*

అథవా = లేక;
అర్జున = పార్థా;
ఏతేన = ఈ;
బహునా = ఎక్కువగా;
జ్ఞాతేన = గ్రహింపబడినదానిచేత;
తవ = నీకు;
కిమ్ = ఏమి లాభం?;
అహమ్ = నేను;
ఇదమ్ = ఈ;
కృత్స్నమ్ = సమస్తమైన;
జగత్ = విశ్వాన్ని;
ఏక అంశేన = సర్వభూతాత్మకమైన ఒక్క పాదం చేత;
విష్టభ్య = వ్యాపించి (ధరించి);
స్థితః = వెలయుచున్నాను.

**తా॥** లేక : (ఈ పరిచ్ఛిన్నములైన విభూతులను దర్శించడం ఎందుకు? సర్వత్ర నన్నే దర్శించు-) నా విభూతులను ఇంత ఎక్కువగా తెలిసికోవడం వల్ల నీకు కలిగే లాభమేమిటి? నా ఒక అంశం చేతనే సమస్త విశ్వాన్ని వ్యాపించి, ధరించి ఉన్నాను[1] - అని తెలుసుకో. 42

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతి యోగో నామ
దశమోఽధ్యాయః

శ్లోక సంఖ్య 42; మొదటి నుండి (372+42) 414.

ఇంద్రియద్వారతశ్చిత్తే బహిర్ధావతి సత్యపి ।
ఈశదృష్టివిధానాయ విభూతీర్దశమేఽబ్రవీత్ ॥

**తా॥** ఇంద్రియద్వారాలతో చిత్తం బయటకు పరుగెత్తినప్పటికీ, ఈశ్వర దృష్టిని అవలంబించడానికి దశమాధ్యాయంలో విభూతులు వివరించబడ్డాయి.



1. (అ) 'పాదోఽస్య విశ్వా భూతాని' (సర్వభూతాలు బ్రహ్మమున కొకపాదం.)
   - *ఋగ్వేద సంహితా.* 10-90-3; *తైత్తిరీయ ఆరణ్యకమ్* 30-12.

   (ఆ) 'ఏకైవాహం జగత్యత్ర ద్వితీయాకామమాపరా.' *దేవీ సప్తశతి.* 10-5.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## ఏకాదశోऽధ్యాయః - విశ్వరూప దర్శన యోగః

## ( ఏకాదశాధ్యాయం - విశ్వరూప దర్శన యోగం)

విభూతే ర్వైభవం ప్రోచ్య కృపయా పరయా హరిః ।
దిదృక్షో రర్జున స్యాథ విశ్వరూప మదర్శయత్ ॥[1]

అర్జున ఉవాచ :

**మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్ ।**
**యత్త్వయోక్తం వచస్తేన మోహోऽయం విగతో మమ ॥ 1**

*మదనుగ్రహాయ, పరమమ్, గుహ్యమ్, అధ్యాత్మ సంజ్ఞితమ్,*
*యత్, త్వయా, ఉక్తమ్, వచః, తేన, మోహః, అయమ్, విగతః, మమ.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునుడు; | వచః | = వాక్యం; |
| ఉవాచ | = పలికెను; | త్వయా | = నీచే; |
| మదనుగ్రహాయ | = నన్ను అనుగ్రహింప; | ఉక్తమ్ | = చెప్పబడిందో; |
| పరమమ్ | = ఉత్కృష్టమూ; | తేన | = దాని చేత; |
| గుహ్యమ్ | = అత్యంత రహస్యమూ; | మమ | = నా; |
| అధ్యాత్మ సంజ్ఞితమ్ | = ఆత్మానాత్మ వివేక విషయమూ, ఆధ్యాత్మమూ అయిన; | అయమ్ | = ఈ; |
| | | మోహః | = భ్రమ; |
| యత్ | = ఏ; | విగతః | = తొలగింది; |

1. పరమకృపతో హరి విభూతుల వైభవాన్ని వర్ణించాడు; అనంతరం, దర్శనాకాంక్షియైన అర్జునునికి తన విశ్వరూపాన్ని చూపించాడు.

**తా॥** ['నేను ఏకాంశం చేత సమస్త జగత్తును వ్యాపించి ధరిస్తున్నాను' (గీత.10-42) అనే భగవద్వాక్యాన్ని విని జగదాత్మకమైన ఈశ్వర రూపాన్ని చూడగోరి] అర్జునుడు పలికెను : భగవంతుడా! నన్ను అనుగ్రహించడానికి పరమమూ, అత్యంత రహస్యమూ, ఆత్మ-అనాత్మ వివేక విషయమూ, అధ్యాత్మ మనబడేదీ అయిన తత్త్వాన్ని[1] నాకు బోధించావు; దీనిచేత నా ఈ మోహం[2] తొలగింది. 1

**భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।**
**త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ 2**

భవ అప్యయౌ, హి, భూతానామ్, శ్రుతౌ, విస్తరశః, మయా,
త్వత్తః, కమలపత్ర అక్ష, మాహాత్మ్యమ్, అపి, చ, అవ్యయమ్.

| | | | |
|---|---|---|---|
| కమల పత్ర అక్ష | = తామర రేకుల వంటి కన్నులు గల (శ్రీకృష్ణా); | విస్తరశః హి | = విశదంగానే; |
| త్వత్తః | = నీ నుండి; | శ్రుతౌ | = వినబడినవి; |
| భూతానామ్ | = భూతాల యొక్క; | (నీ) అవ్యయమ్ | = అక్షయమైన; |
| భవ అప్యయౌ | = జనన మరణాలు రెండూ; | మాహాత్మ్యమ్ అపి చ | = (సర్వాత్మకత్వ, నిర్లేపత్వాదికమైన) మహిమను కూడా (విన్నాను). |
| మయా | = నా వలన; | | |

**తా॥** పద్మపత్రాక్షా! నీ నుండి విశదంగానే భూతాల ఉత్పత్తిప్రళయాలను,[3] (సర్వాత్మత్వ నిర్లేపత్వాది రూపమైన) అక్షయమైన నీ మహాత్మ్యాన్ని కూడా విన్నాను.[4] 2

**ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర ।**
**ద్రష్టుమిచ్ఛామి తే రూపం ఐశ్వరం పురుషోత్తమ ॥ 3**

---

1. 'అశోచ్యానన్వశోచస్త్వమ్' (గీత. 2-11) మొదలుగా షష్ఠాధ్యాయం వరకు.
2. నేను హంతను, వీరు చంపబడతారు అనే మోహం.
3. 'అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా' (గీత. 7-6 )
'అవ్యక్తంవ్యక్తి మాపన్నం మన్యం తే మామబుద్ధయః' (గీత. 7-24)
'మయా తతమిదం సర్వం' (9-4); 'న చ మాం తాని కర్మాణి' (9-9); 'సమోహం సర్వ భూతేషు' (9-29) అనేరీతిగా వర్ణింపబడిన నీ మాహాత్మ్యాన్ని విని, జీవుని పరతంత్రతను గ్రహించాను; నేను కర్తను అనే మోహం తొలగింది.

*ఏవమ్, ఏతత్, యథా, ఆత్థ, త్వమ్, ఆత్మానమ్, పరమేశ్వర,*
*ద్రష్టుమ్, ఇచ్ఛామి, తే, రూపమ్, ఐశ్వరమ్, పురుషోత్తమ.*

| | | | |
|---|---|---|---|
| పరమేశ్వర | = శ్రీకృష్ణా; | పురుషోత్తమ | = పురుష శ్రేష్ఠా; |
| యథా | = ఏరీతిగా; | తే | = నీ; |
| త్వమ్ | = నీవు; | ఐశ్వరమ్ | = జ్ఞానైశ్వర్య శక్తిబల వీర్యాది సంపన్నమైన (ఈశ్వరసంబంధమైన); |
| ఆత్మానమ్ | = ఆత్మ తత్త్వాన్ని; | రూపమ్ | = రూపాన్ని; |
| ఆత్థ | = చెప్పావో; | ద్రష్టుమ్ | = చూడ; |
| ఏతత్ | = అది; | ఇచ్ఛామి | = కోరుతున్నాను; |
| ఏవమ్ | = అట్లే; (అని విశ్వసిస్తున్నాను, సందేహం లేదు; అయినా) | | |

**తా॥** పరమేశ్వరా! నీవు ఏ ఆత్మతత్త్వాన్ని బోధించావో అది యథార్థం (అని విశ్వసిస్తున్నాను, సందేహం లేదు, అయినా-) పురుషోత్తమా! జ్ఞానైశ్వర్యశక్తి బల వీర్యాది సంపన్నమైన నీ ఈశ్వరీయ - రూపాన్ని సాక్షాత్కరింప జేయమని కోరుతున్నాను. 3

**మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।**
**యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ 4**

*మన్యసే, యది, తత్, శక్యమ్, మయా, ద్రష్టుమ్, ఇతి, ప్రభో,*
*యోగ ఈశ్వర, తతః, మే, త్వమ్, దర్శయ, ఆత్మానమ్, అవ్యయమ్.*

| | | | |
|---|---|---|---|
| ప్రభో | = ప్రభూ; | తతః | = ఇక; |
| తత్ | = ఆ విశ్వరూపాన్ని; | త్వమ్ | = నీవు; |
| మయా | = నాచే; | మే | = నాకు; |
| ద్రష్టుమ్ | = దర్శింప; | అవ్యయమ్ | = నిత్యమైన; |
| శక్యమ్ ఇతి | = సాధ్యం అని; | ఆత్మానమ్ | = జగదాత్మరూపాన్ని; |
| మన్యసే యది | = తలతువేని; | దర్శయ | = దర్శింప చేయి. |
| యోగ ఈశ్వర | = యోగేశ్వరా; | | |

**తా॥** (నాకు చూడాలని ఉంది కాబట్టి చూపమని కాదు,) ప్రభూ! నేను ఆ విశ్వరూపాన్ని చూడ యోగ్యుణ్ణని తలిస్తే, యోగేశ్వరా! నాకు అవ్యయమైన నీ జగదాత్మరూపాన్ని దర్శింపజేయి. 4

*శ్రీ భగవానువాచ :*

**పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।**
**నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ 5**

*పశ్య, మే, పార్థ, రూపాణి, శతశః, అథ, సహస్రశః,*
*నానావిధాని, దివ్యాని, నానావర్ణ ఆకృతీని, చ.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | శతశః | = వందలూ; |
| మే | = నా; | అథ | = ఇంకా; |
| దివ్యాని | = అలౌకికములును; | సహస్రశః | = వేలూ అయిన; |
| నానా విధాని | = బహు విధాలైన; | రూపాణి | = రూపాలను; |
| నానా వర్ణ ఆకృతీని చ | = వివిధ వర్ణాలతో, ఆకృతులతో ఒప్పుచున్నవీ; | పశ్య | = చూడు; |

**తా॥** (అత్యద్భుతమైన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తూ అర్జునుణ్ణి సావధానుణ్ణి చేస్తూ) శ్రీకృష్ణుడు పలికెను : పార్థా! నానావిధ వర్ణాలతో, ఆకృతులతో ఒప్పారుతున్న; అనేకాలూ[1], విభిన్నాలూ అయిన దివ్యరూపాలను దర్శించు. 5

**పశ్యాదిత్యాన్వసూన్రుద్రాన్ అశ్వినౌ మరుత స్తథా ।**
**బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6**

*పశ్య, ఆదిత్యాన్, వసూన్, రుద్రాన్, అశ్వినౌ, మరుతః, తథా,*
*బహూని, అదృష్టపూర్వాణి, పశ్య, ఆశ్చర్యాణి, భారత.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | తథా | = మరియు; |
| ఆదిత్యాన్ | = ద్వాదశాదిత్యులను; | అదృష్ట పూర్వాణి | = (నీవు గాని ఇతరులు గాని) ఇంతవరకూ చూడని; |
| వసూన్ | = అష్టవసువులను; | | |
| రుద్రాన్ | = ఏకాదశరుద్రులను; | ఆశ్చర్యాణి | = అద్భుతాలను; |
| అశ్వినౌ | = అశ్వినీకుమార ద్వయాన్ని; | బహూని | = పెక్కింటిని; |
| మరుతః | = మరుద్దేవతా గణాన్ని; | పశ్య | = చూడు. |

**తా॥** భారతా! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను,

1. రూపం ఒక్కటే అయినా నానావిధమగుట వలన బహువచనం.

అశ్వినీకుమార ద్వయాన్ని[1], మరుద్దేవతా సప్తకాన్ని చూడు. మరియు, నీవుగాని ఇతరులు గాని ఇంతవరకూ చూడని అద్భుతాలను (రూపాలను) పెక్కింటిని గాంచు ! 6

**ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టుమిచ్ఛసి ॥ 7**

*ఇహ, ఏకస్థమ్, జగత్, కృత్స్నమ్, పశ్య, అద్య, స చర అచరమ్.*
*మమ, దేహే, గుడాక ఈశ, యత్, చ, అన్యత్, ద్రష్టుమ్, ఇచ్ఛసి.*

| | | | |
|---|---|---|---|
| గుడాక ఈశ | = అర్జునా; | జగత్ | = విశ్వాన్ని; |
| ఇహ | = ఈ; | కృత్స్నమ్ | = సమస్తాన్ని; |
| మమ దేహే | = నా శరీరంలో; | అన్యత్ చ | = మరియు, ఇతరమైన; |
| ఏకస్థమ్ | = (శరీరావయవం వలె) ఒక్కచోటనే ఉన్న; | యత్ | = దేనిని; |
| | | ద్రష్టుమ్ ఇచ్ఛసి | = చూడ గోరుతున్నావో; |
| స చర అచరమ్ | = స్థావర జంగమ సహితమైన; | అద్య | = నేడు (దానినంతటిని కూడా); |
| | | పశ్య | = చూడు. |

**తా॥** అర్జునా! ఈ నా విరాట్ దేహంలో అవయవం వలె ఒక్కటే అయ్యి వెలయుచున్న స్థావరజంగమాత్మకమైన విశ్వాన్నంతటిని చూడు. మరియు, (జగదాశ్రయభూతమైన కారణస్వరూపమూ, జగత్తు యొక్క స్థితిగతులూ, జయాపజయాలూ మొదలుగా) నీవు చూడగోరే దానినంతటినీ దర్శించు.[2] 7

**న తు మాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్యమే యోగమైశ్వరమ్ ॥ 8**

*న, తు, మామ్, శక్యసే, ద్రష్టుమ్, అనేన, ఏవ, స్వ చక్షుషా,*
*దివ్యమ్, దదామి, తే, చక్షుః, పశ్య, మే, యోగమ్, ఐశ్వరమ్.*

| | | | |
|---|---|---|---|
| అనేన | = ఈ; | మామ్ | = నన్ను; |
| స్వ చక్షుషా ఏవ | = నీ మాంస చక్షువులతో; | ద్రష్టుం న శక్యసే తు | = చూడలేవు (కనుక); |
| | | తే | = నీకు; |

1. వీరు సూర్యపత్నియైన సంజ్ఞాదేవికి జన్మించారు. - విష్ణు పురాణమ్. 3-2-7 చూ.
2. 'యద్వా జయేమ యది వా నో జయేయుః' (గీతా 2-6 ) ఈ శంక తొలగగలదు.

| | | | |
|---|---|---|---|
| దివ్యమ్ | = అప్రాకృతం (అలౌకికమైన); | ఐశ్వరమ్ | = ఈశ్వరీయమైన (అసాధారణమైన); |
| చక్షుః | = జ్ఞాననేత్రాన్ని; | యోగమ్ | = సామర్థ్యాన్ని (శక్తిని); |
| దదామి | = ఒసగుచున్నాను; | పశ్య | = చూడు. |
| మే | = నా; | | |

**తా॥** ('చూడ యోగ్యుడనని తలిస్తే ఆ రూపాన్ని చూపించు' - అని అడిగావు:) నీవు ప్రాకృతమైన స్థూల నేత్రంతో నా విశ్వరూపాన్ని దర్శించలేవు. నీకు దివ్యమైన జ్ఞాననేత్రాన్ని ప్రసాదిస్తున్నాను; అసాధారణమైన నా యోగశక్తిని చూడు ! 8

*సఞ్జయ ఉవాచ :*

**ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।**
**దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ ॥** 9

*ఏవమ్, ఉక్త్వా, తతః, రాజన్, మహాయోగ ఈశ్వరః, హరిః,*
*దర్శయామాస, పార్థాయ, పరమమ్, రూపమ్, ఐశ్వరమ్.*

| | | | |
|---|---|---|---|
| సంజయః | = సంజయుడు; | ఉక్త్వా | = పలికి; |
| ఉవాచ | = పలికెను; | తతః | = అనంతరం; |
| రాజన్ | = ధృతరాష్ట్రా; | పార్థాయ | = అర్జునునికి; |
| మహాయోగ-ఈశ్వరః | =మహాయోగేశ్వరుడైన; | ఐశ్వరమ్ | = ఈశ్వరసంబంధమైన; |
| హరిః [1] | = నారాయణుడు; | పరమం రూపమ్ | = విశ్వరూపాన్ని; |
| ఏవమ్ | = ఈ రీతిగా; | దర్శయామాస | = చూపెను. |

**తా॥** *సంజయుడు పలికెను :* రాజా! మహాయోగేశ్వరుడైన నారాయణుడు ఈ విధంగా పలికి, అర్జునునికి దివ్యమైన తన విశ్వరూపాన్ని దర్శింపజేసాడు. 9

**అనేక వక్త్రనయనం అనేకాద్భుత దర్శనమ్ ।**
**అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥** 10

---

1. హరా మ్యఘం చ స్మ ర్తౄణాం హవిర్భాగం క్రతుష్వహం,
వర్ణ శ్చ మే హరి శ్వేతి తస్మా ద్ధరి రహం స్మృతః. – మహా భారతమ్.
స్మరించేవారి పాపాలను, క్రతువుల హవిర్భాగాన్ని గైకొనుటచేత, నా శరీరవర్ణాన్ని బట్టి, నన్ను హరి అంటారు.

*అనేక వక్త్ర నయనమ్, అనేక అద్భుత దర్శనమ్,*

*అనేక దివ్య ఆభరణమ్, దివ్య అనేక ఉద్యత ఆయుధమ్.*

అనేక వక్త్ర నయనమ్ = అనేకమైన ముఖ నేత్రాలు గలదీ;
అనేక అద్భుత దర్శనమ్ = బహువిధాలైన అద్భుతరూపాలతో కూడినదీ;
అనేక దివ్య ఆభరణమ్ = వివిధమైన దివ్యాలంకారాలతో కూడినదీ;
దివ్య అనేక ఉద్యత ఆయుధమ్ = వివిధమైన దివ్యాస్త్రాలను ధరించినదీ
(అయిన విశ్వరూపాన్ని చూపెను).

**తా॥** ఆ విశ్వరూపం అసంఖ్యాలైన ముఖనేత్రాల తోనూ, అనేకమైన అద్భుతాకృతులతో, నానా విధమైన దివ్యాలంకారాలతో ఒప్పుతోంది; పలు విధాలైన దివ్యాయుధాలను చేబూని ఉంది. 10

**దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖమ్ ॥ 11**

*దివ్య మాల్య అంబర ధరమ్, దివ్య గంధ అనులేపనమ్,*

*సర్వ ఆశ్చర్య మయమ్, దేవమ్, అనంతమ్, విశ్వతోముఖమ్.*

దివ్య మాల్య అంబర ధరమ్ = దివ్య మాలలను వస్త్రాలను ధరించినదీ;
దివ్య గంధ అనులేపనమ్ = దివ్యమగు గంధపు పూత కలదీ;
సర్వ ఆశ్చర్య మయమ్ = సర్వాశ్చర్య మయమూ;
దేవమ్ = దీప్తిమంతమూ;
అనంతమ్ = అపరిచ్ఛిన్నమూ;
విశ్వతోముఖం = సర్వత్ర ముఖాలుగలదీ
(అయిన విశ్వరూపాన్ని చూపెను.)

**తా॥** ఆ విశ్వరూపం దివ్యమాలావస్త్ర విభూషితమై, దివ్యగంధానులిప్తమై, అత్యంతాశ్చర్యమయమై, దీప్తిమంతమై, అపరిచ్ఛిన్నమై, విశ్వతోముఖమై ఒప్పారుతూ ఉంది. 11

**దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా ।**
**యదిభాస్సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః ॥ 12**

*దివి, సూర్య సహస్రస్య, భవేత్, యుగపత్, ఉత్థితా,*

*యది, భాః, సదృశీ, సా, స్యాత్, భాసః, తస్య, మహాత్మనః.*

| | | | |
|---|---|---|---|
| దివి | = ఆకాశంలో; | సా | = ఆ కాంతి; |
| సూర్య సహస్రస్య | = వేయిమంది సూర్యుల; | తస్య | = ఆ; |
| భాః | = ప్రభ; | మహాత్మనః | = విశ్వరూపుని; |
| యుగపత్ | = ఏక కాలంలో; | భాసః | = ప్రభకు; |
| ఉత్థితా | = సముదితం; | సదృశీ | = సాటి; |
| భవేద్యది | = అయిన యెడల; | స్యాత్ | = కావచ్చును. |

**తా॥** ఆకాశంలో ఒకే సమయంలో సహస్రసూర్యుల ప్రభోదయమైతే, ఆ జ్యోతి విశ్వరూపుని కాంతికి ఒకింత సరిపోతే సరిపోవచ్చు. 12

**తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।**
**అపశ్యద్దేవ దేవస్య శరీరే పాణ్డవ స్తదా ॥ 13**

*తత్ర, ఏకస్థమ్, జగత్, కృత్స్నమ్, ప్రవిభక్తమ్, అనేకధా,*
*అపశ్యత్, దేవ దేవస్య, శరీరే, పాండవః, తదా.*

| | | | |
|---|---|---|---|
| తదా | = అప్పుడు; | ప్రవిభక్తమ్ | = విభజింపబడిన; |
| పాణ్డవః | = అర్జునుడు; | జగత్ కృత్స్నమ్ | = విశ్వమునంతటిని; |
| తత్ర | = ఆ; | ఏకస్థమ్ | = అవయవమై ఒకచోట ఉండేదానినిగా; |
| దేవదేవస్య | = దేవదేవుని; | అపశ్యత్ | = చూసాడు. |
| శరీరే | = శరీరంలో; | | |
| అనేకధా | = దేవ, పితృ, మనుష్యాది నానా రూపాలను; | | |

**తా॥** అప్పుడు అర్జునుడు ఆ దేవ దేవుని శరీరంలో, దేవ పితృ మనుష్యాది నానా రూపాలుగా విభజింపబడిన జగత్తు నంతటిని చూసాడు; అది ఆ విశ్వ రూపంలో అవయవం వలే ఒక్కటే అయ్యి ప్రకాశిస్తోంది. 13

**తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః ।**
**ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత ॥ 14**

*తతః, సః, విస్మయ ఆవిష్టః, హృష్ట రోమా, ధనంజయః,*
*ప్రణమ్య, శిరసా, దేవమ్, కృత అంజలిః, అభాషత.*

| | | | |
|---|---|---|---|
| తతః | = అనంతరం; | దేవమ్ | = విశ్వరూపధారియైన భగవంతునికి; |
| సః | = ఆ; | శిరసా ప్రణమ్య | = శిరస్సుతో ప్రణమిల్లి; |
| ధనఞ్జయః | = అర్జునుడు; | కృత అఞ్జలిః | = కేల్మోడ్పు గీలించినవాడై; |
| విస్మయ ఆవిష్టః | = ఆశ్చర్యాన్వితుడూ; | అభాషత | = పలికెను. |
| హృష్ట రోమా | = పులకాంకితుడై; | | |

**తా॥** అనంతరం అర్జునుడు ఆశ్చర్యాన్వితుడూ, పులకితాంగుడూ అయ్యాడు; మరియు నతమస్తకుడై విశ్వరూపధరుండైన భగవంతునికి ప్రణమల్లి, కృతాంజలియై ఈ విధంగా పలికాడు. 14

అర్జున ఉవాచ :

**పశ్యామి దేవాంస్తవ దేవ దేహే**
**సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్ ।**
**బ్రహ్మాణ మీశం కమలాసనస్థం**
**ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15**

పశ్యామి, దేవాన్, తవ, దేవ, దేహే, సర్వాన్, తథా, భూతవిశేష సంఘాన్, బ్రహ్మాణమ్, ఈశమ్, కమల ఆసనస్థమ్, ఋషీన్, చ, సర్వాన్, ఉరగాన్, చ, దివ్యాన్.

| | | | |
|---|---|---|---|
| దేవ | = జ్యోతిస్స్వరూపా; | సర్వాన్ ఉరగాన్ చ | = తక్షకాదులైన సర్పాలనన్నిటిని; |
| తవ | = నీ; | కమల ఆసనస్థం చ | = పృథివీ పద్మకర్ణిక అనదగిన మేరువున లేక, నీ నాభిపద్మంలో వెలయు; |
| దేహే | = విశ్వరూపంలో; | ఈశమ్ | = సృష్టికర్తయైన; |
| దేవాన్ | = దేవతలను; | బ్రహ్మాణమ్ | = బ్రహ్మను; |
| సర్వాన్ | = అందరిని; | పశ్యామి | = చూస్తున్నాను. |
| తథా | = మరియు; | | |
| భూత విశేష సంఘాన్ | = స్థావర జంగమమైన భూతసమూహాలను; | | |
| దివ్యాన్ ఋషీన్ | = దివ్యులైన వసిష్ఠాది ఋషులను; | | |

**తా॥** అర్జునుడు పలికెను : దేవా! ఈ నీ విశ్వరూపంలో దేవతలనందరినీ, చరాచర జగత్తును, వసిష్ఠాది ఋషులను, తక్షకాది సర్ప సమూహాన్నీ, పృథివీ పద్మకర్ణిక అనదగిన మేరువుపై (లేక, నీ నాభిపద్మంలో) ఆసీనుడై ఉన్న సృష్టి కర్త అయిన బ్రహ్మను గాంచుతున్నాను. 15

అనేక బాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్త రూపమ్
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16

అనేక బాహు ఉదర వక్త్ర నేత్రమ్, పశ్యామి, త్వామ్, సర్వతః, అనంత రూపమ్, న, అంతమ్, న, మధ్యమ్, న, పునః, తవ, ఆదిమ్, పశ్యామి, విశ్వ ఈశ్వర, విశ్వరూప.

విశ్వ ఈశ్వరా = జగదీశ్వరా;
విశ్వ రూప = విరాడ్రూపధరా;
అనేక బాహు ఉదర వక్త్ర నేత్రం = అసంఖ్యాకమైన హస్త, ఉదర, ముఖ, నేత్రయుతుడవూ;
అనంత రూపమ్ = అనంతరూపధరుడవు అయిన;
త్వామ్ = నిన్ను;
సర్వతః = సర్వత్ర;
పశ్యామి = చూస్తున్నాను;
పునః = మరియు;
తవ = నీ;
అంతమ్ = తుదిని;
న పశ్యామి = చూడలేకున్నాను;
మధ్యం = మధ్యభాగాన్ని;
న పశ్యామి = చూడలేకున్నాను;
ఆదిమ్ = మొదలును కూడా;
న పశ్యామి = చూడజాలకున్నాను.

**తా॥** విశ్వేశ్వరా! సర్వత్ర అనంతమైన నీ రూపమే కనబడుతోంది; అసంఖ్యాలైన బాహూదర నయన వదనాలతో అది ఒప్పుతోంది. విశ్వరూపా! నీ ఆదిమధ్యాంతాలను చూడజాలకున్నాను. నీవు సర్వగతుడవు. 16

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాత్
దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్ ॥ 17

*కిరీటినమ్, గదినమ్, చక్రిణమ్, చ, తేజోరాశిమ్, సర్వతః, దీప్తిమంతమ్, పశ్యామి, త్వామ్, దుర్నిరీక్ష్యమ్, సమంతాత్, దీప్త అనల అర్క ద్యుతిమ్, అప్రమేయమ్.*

కిరీటినమ్ = కిరీటధరునిగా;
గదినమ్ = గదాధారిగా;
చక్రిణమ్ = చక్రహస్తునిగా;
సర్వతః = సర్వత్ర;
దీప్త మంతమ్ = ప్రకాశించువానిగా;
తేజోరాశిమ్ = ప్రభాపుంజంగా;

| | | | |
|---|---|---|---|
| దుర్నిరీక్ష్యమ్ | = దుర్దర్శనీయునిగా; | అప్రమేయమ్ | = అపరిచ్ఛిన్నునిగా; |
| దీప్త అనల అర్క ద్యుతిమ్ | = ఉజ్జ్వలులైన సూర్యాగ్నుల కాంతిని పోలిన కాంతి గలవానిగా; | త్వామ్ | = నిన్ను; |
| | | సమంతాత్ | = అన్ని యెడల; |
| | | పశ్యామి | = చూస్తున్నాను. |

**తా॥** కిరీటచక్రగదా ధరుడవూ, సర్వత్ర ప్రకాశమానుడవూ, ప్రభాపుంజ స్వరూపుడవూ, దుర్నిరీక్ష్యుడవూ, ప్రదీప్తాగ్ని సూర్యప్రభాకలితుడవూ, అప్రమేయ స్వరూపుడవూ అయిన నిన్ను అన్ని చోట్ల చూస్తున్నాను. 17

**త్వమక్షరం పరమం వేదితవ్యం**
**త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయః శాశ్వత ధర్మగోప్తా**
**సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18**

*త్వమ్, అక్షరమ్, పరమమ్, వేదితవ్యమ్, త్వమ్, అస్య, విశ్వస్య, పరమ్, నిధానమ్, త్వమ్, అవ్యయః, శాశ్వత ధర్మగోప్తా, సనాతనః, త్వమ్, పురుషః, మతః, మే.*

| | | | |
|---|---|---|---|
| త్వమ్ | = నీవు; | త్వమ్ | = నీవు; |
| అక్షరమ్ | = పరబ్రహ్మవు; | అవ్యయః | = నిత్యుడవు; |
| పరమమ్ | = శ్రేష్ఠమైన (ఏకమాత్రమైన); | శాశ్వత ధర్మ గోప్తా | = సనాతన ధర్మ రక్షకుడవు; |
| వేదితవ్యమ్ | = జ్ఞేయ వస్తువు; | త్వమ్ | = నీవు; |
| త్వమ్ | = నీవు; | సనాతనః పురుషః | = పురాణపురుషుడవు, (పరమాత్మవు) |
| అస్య | = ఈ; | (ఇతి | =అని;) |
| విశ్వస్య | = జగత్తుకు; | మే | = నా |
| పరమ్ | = పరమమైన; | మతః | = అభిప్రాయం. |
| నిధానమ్ | = ఆశ్రయుడవు; | | |

**తా॥** నీవు పరబ్రహ్మవివి. ఏకమాత్రమైన జ్ఞేయవస్తువవు. నీవు విశ్వానికి శ్రేష్ఠమైన ఆశ్రయుడవు. సనాతన ధర్మరక్షకుడవు, నిత్యుడవైన పరమాత్మవు - అని నా అభిప్రాయం. 18

**అనాదిమధ్యాన్త మనన్త వీర్యం**
**అనంతబాహుం శశిసూర్య నేత్రమ్ ।**

**పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం**
**స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ 19**

*అనాది మధ్య అంతమ్, అనంత వీర్యమ్, అనంతబాహుమ్, శశిసూర్య నేత్రమ్, పశ్యామి, త్వామ్, దీప్తహుతాశ వక్త్రమ్, స్వతేజసా, విశ్వమ్, ఇదమ్, తపంతమ్.*

| | | | |
|---|---|---|---|
| అనాది మధ్య అంతమ్ | = ఆదిమధ్యాంత రహితునిగా; | దీప్త హుతాశ వక్త్రం | = ప్రజ్వలితాగ్ని తుల్య ముఖవిశిష్టునిగా; |
| అనంత వీర్యమ్ | = అఖండ శక్తిశాలిగా; | స్వ తేజసా | = స్వీయప్రభ చేత; |
| అనంత బాహుమ్ | = అసంఖ్య హస్త విశిష్టునిగా; | ఇదమ్ | = ఈ; |
| | | విశ్వమ్ | = జగత్తును; |
| శశి సూర్య నేత్రం | = చంద్రసూర్య నయనునిగా; | తపన్తమ్ | = తపింపజేయువానిగా; |
| | | త్వామ్ | = నిన్ను; |
| | | పశ్యామి | = చూస్తున్నాను. |

**తా॥** నీవు ఆది-మధ్య-అంత రహితుడవు, అఖండ శక్తిశాలివి, అసంఖ్యాక బాహు విశిష్టుడవు; చంద్రసూర్యులు నీ నేత్రాలు, నీ ముఖమండలాన ప్రదీప్తాగ్ని జ్యోతి దీపిల్లుతోంది. నీ తేజంతో జగత్తునంతటిని తరింపజేస్తున్నావు – ఈ విధంగా నేను చూస్తున్నాను. 19

**ద్యావాపృథివ్యో రిదమన్తరం హి**
**వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం**
**లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20**

*ద్యావాపృథివ్యోః, ఇదమ్, అంతరమ్, హి, వ్యాప్తమ్, త్వయా, ఏకేన, దిశః, చ, సర్వాః, దృష్ట్వా, అద్భుతమ్, రూపమ్, ఉగ్రమ్, తవ, ఇదమ్, లోకత్రయమ్, ప్రవ్యథితమ్, మహాత్మన్.*

| | | | |
|---|---|---|---|
| మహాత్మన్ | = మహాత్మా; | ఏకేన హి | = ఒక్కని చేతనే; |
| ద్యావా పృథివ్యోః | = భూమి ఆకాశముల; | వ్యాప్తమ్ | = వ్యాపింపబడి ఉంది; |
| ఇదమ్ | = ఈ | దిశః | = దిక్కులు; |
| అన్తరమ్ | = మధ్య ప్రదేశం; | సర్వాః చ | = అన్ని కూడా; |
| త్వయా | = నీ; | (వ్యాప్తా | = వ్యాపింపబడి ఉన్నవి;) |

| | | | |
|---|---|---|---|
| తవ | = నీ; | రూపమ్ | = విశ్వరూపాన్ని; |
| ఇదమ్ | = ఈ; | దృష్ట్వా | = చూసి; |
| అద్భుతమ్ | = ఆశ్చర్యకరమూ (అదృష్ట పూర్వమూ); | లోక త్రయమ్ | = మూల్లోకాలు; |
| ఉగ్రమ్ | = ఘోరమూ అయిన; | ప్రవ్యథితమ్ | = భయపడుతున్నాయి. |

**తా॥** మహాత్మా! భూనభోంతరాలు, సకలదిశలు నీచే నిండింపబడి, అద్భుతమూ, ఉగ్రమూ అయి ఉన్న ఈ నీ విశ్వరూపాన్ని గాంచి ముల్లోకాలు భయపడుతున్నాయి. – ఇలా నేను గాంచుతున్నాను. 20

**అమీ హి త్వాం సురసంఘా[1] విశన్తి**
**కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।**
**స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః**
**స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21**

*అమీ, హి, త్వామ్, సురసంఘా, విశంతి, కేచిత్, భీతాః, ప్రాంజలయః, గృణంతి, స్వస్తి, ఇతి, ఉక్త్వా, మహర్షి సిద్ధసంఘాః, స్తువంతి, త్వామ్, స్తుతిభిః, పుష్కలాభిః.*

| | | | |
|---|---|---|---|
| అమీ | = ఈ (యుద్ధమొనర్చే); | మహర్షి సిద్ధ సంఘాః | = మహర్షులూ సిద్ధులూ; |
| సుర సంఘాః | = మనుష్య శరీర ధారులైన వసువు మున్నగు దేవతలు; | స్వస్తి | = జగత్తుకు శుభమగుగాక |
| త్వాహి | = నీయందే; | ఇతి | = అని; |
| విశన్తి | = ప్రవేశిస్తున్నారు; | ఉక్త్వా | = పలికి; |
| కేచిత్ | = కొందరు; | పుష్కలాభిః | = సంపూర్ణములైన; |
| భీతాః | = భయాన్ని పొంది; | స్తుతిభిః | = స్తోత్రాలతో; |
| ప్రాఞ్జలయః | = బద్ధాంజలులై; | త్వామ్ | = నిన్ను; |
| గృణన్తి | = స్తుతిస్తున్నారు; | స్తువన్తి | = పొగడుతున్నారు. |

**తా॥** యుద్ధమొనర్చే ఈ మనుష్య శరీరధారులైన వసువు మొదలుగా గల దేవతలు నీయందు ప్రవేశిస్తున్నారు. కొందరు భీతి చెంది, చేతులు జోడించి

1. త్వా+అసురసంఘాః– ఇలా విభజించి భూభారదాయకులైన దుర్యోధనాదులు అని అర్థం చేసుకోవాలి.

నిన్ను స్తుతిస్తున్నారు. మహర్షులూ, సిద్ధులూ, 'జగత్తునకు శుభమగు గాక!' అని పలికి శ్రేష్ఠములైన స్తోత్రాలతో నిన్ను పొగుడుతున్నారు. 21

**రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా**
**విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ,**
**గన్ధర్వయక్షా సురసిద్ధ సంఙ్ఘాః**
**వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22**

*రుద్ర ఆదిత్యాః, వసవః, యే, చ, సాధ్యాః, విశ్వే,అశ్వినౌ, మరుతః, చ, ఉష్మపాః, చ, గంధర్వయక్షా సురసిద్ధ సంఘాః, వీక్షంతే, త్వామ్, విస్మితాః, చ, ఏవ, సర్వే.*

రుద్ర ఆదిత్యాః = రుద్రులూ, ఆదిత్యులూ;
వసవః = వసువులూ;
యే చ = మరియు తదితరులైన;
సాధ్యాః = సాధ్యులూ;
విశ్వే = విశ్వేదేవతలూ;
అశ్వినౌ = అశ్వినీ కుమారద్వయమూ;
మరుతః చ = మరుద్దేవతలూ;
ఉష్మపాః = పితృదేవతలూ;
గన్ధర్వ యక్ష అసుర సిద్ధ సంఘాః చ = గంధర్వుల, యక్షుల, రాక్షసుల, సిద్ధుల సమూహమూ;
సర్వే ఏవ చ = అందరూ కూడా;
విస్మితాః = ఆశ్చర్యపడి;
త్వాం = నిన్ను;
వీక్షంతే = చూస్తున్నారు.

**తా॥** రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు[1], విశ్వే దేవతలు,[2] అశ్వినీ దేవతలు, మరుద్గణము, పితృదేవతలు[3], గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మున్నగువారు అందరూ కూడా విస్మితులై నిన్ను వీక్షిస్తున్నారు. 22

---

1. మన, అనుమంత, ప్రాణ, నర, యాన, చిత్త, మాయ, నయ, హంస, నారాయణ, ప్రభవ, విభులు.
- వాయు పురాణమ్ 66–15,16 చూ.

2. క్రతు, దక్ష, శ్రవ, సత్య, కాల, కామ, ధుని, కురువంత ప్రభవంత, రోచమానులు
- వాయు పురాణమ్ 66–31,32 చూ.

3. 'ఊష్మభోగా హి పితరః' – వేడివేడి అన్న పానాదులను గ్రహించేవారు పితరులు అని శ్రుతి.
యావదుష్ణం భవేదన్నం తావ దశ్నంతి వాగ్యతాః ।
తావన్నాశ్నంతి పితరో యావన్నోక్తా హవిర్గుణాః ॥ – మను స్మృతిః 3–137.

రూపం మహత్తే బహువక్త్ర నేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహు దంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాహమ్ ॥ 23

*రూపమ్, మహత్, తే, బహువక్త్ర నేత్రమ్, మహాబాహో, బహు బాహు ఊరు పాదమ్, బహు ఉదరమ్, బహు దంష్ట్రాకరాళమ్, దృష్ట్వా, లోకాః, ప్రవ్యథితాః, తథా, అహమ్.*

మహాబాహో = భగవంతుడా;
తే = నీ;
బహు వక్త్ర నేత్రమ్ = పెక్కు ముఖ నేత్రాలతో ;
బహు బాహు ఊరు పాదం = అనేక చేతులు, కాళ్ళు, తొడలతో;
బహు ఉదరమ్ = అనేక ఉదరాలతో;
బహు దంష్ట్రాకరాలమ్ = పెక్కు కోఱలతో భయంకరమైన;
మహత్ రూపమ్ = విశ్వరూపాన్ని;
దృష్ట్వా = చూసి;
లోకాః = జనులందరూ;
ప్రవ్యథితాః = భయపడుతున్నారు;
తథా = అలాగే;
అహమ్ = నేను (భయపడుతున్నాను).

**తా॥** ప్రభూ! అనేక ముఖ నేత్రాలతో, హస్త పాదాలతో, ఊరువులతో, ఉదరాలతో నీ విశ్వరూపం ఒప్పారుతోంది; అసంఖ్యాక దంష్ట్రాలతో భయంకరమై తోచుతోంది. ఈ రూపాన్ని గాంచి ప్రాణులందరూ, నేను కూడా భీతిగ్రస్తులం అవుతున్నాం. 23

నభః స్పృశం దీప్తమనేక వర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాల నేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్త రాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో[1] ॥ 24

*నభః స్పృశమ్, దీప్తమ్, అనేక వర్ణమ్, వ్యాత్త ఆననమ్, దీప్తవిశాల నేత్రమ్, దృష్ట్వా, హి, త్వామ్, ప్రవ్యథిత అంతరాత్మా, ధృతిమ్, న, విందామి, శమమ్, చ, విష్ణో.*

1. వ్యాప్తా మే రోదసీ పార్థ క్రాంతిశ్చాభ్యధికాస్థితా ।
క్రమ ణాచ్చాప్యహం పార్థ విష్ణురిత్యభిసంజ్ఞితః ॥ – మహా భారతమ్

| | | | |
|---|---|---|---|
| విష్ణో | = సర్వవ్యాపీ (కృష్ణా); | త్వామ్ | = నిన్ను; |
| నభః స్పృశమ్ | = ఆకాశాన్ని అంటుతూ; | దృష్ట్వా హి | = చూచుటచే; |
| దీప్తమ్ | = తేజోమయమై; | ప్రవ్యథిత అంతరాత్మా | = కలత పడిన మనస్సుతో (నేను); |
| అనేక వర్ణమ్ | = నానావర్ణ విశిష్టుడవై; | ధృతిమ్ | = ధైర్యాన్ని; |
| వ్యాత్త ఆననమ్ | = విస్ఫారవదనుడవై; | శమం చ | = శాంతిని; |
| దీప్త విశాల నేత్రమ్ | = ఉజ్జ్వలమూ, విశాలమూ అయిన నేత్రాలతో ఒప్పారుతున్న; | న విందామి | = పొందలేకున్నాను. |

**తా॥** సర్వవ్యాప్తమూ, గగనస్పర్శియూ, తేజోమయమూ, నానావర్ణ యుక్తమూ, విస్ఫార వదనమూ, ఉజ్జ్వల విశాలనేత్రమూ అయిన –నీ విశ్వరూపాన్ని గాంచి నా మనస్సు కలవరపడుతోంది; ధైర్యాన్ని, శాంతిని పొందజాలకున్నాను. 24

**దంష్ట్రా కరాళాని చ తే ముఖాని**
**దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।**
**దిశో న జానే న లభే చ శర్మ**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25**

*దంష్ట్రా కరాళాని, చ, తే, ముఖాని, దృష్ట్వా, ఏవ, కాల అనల సన్నిభాని, దిశః, న, జానే, న లభే, చ, శర్మ, ప్రసీద, దేవ ఈశ, జగత్ నివాస.*

| | | | |
|---|---|---|---|
| దేవ ఈశ | = దేవ దేవా; | దృష్ట్వా ఏవ | = చూడడం వల్లే; |
| జగత్ నివాస | = జగదాశ్రయా; | దిశః న జానే | = దిక్కులను తెలియజాలకున్నాను (దిగ్భ్రమ కలుగుతోంది); |
| దంష్ట్రాకరాలాని | = దంతివికృతాలూ; | | |
| కాల అనల సన్నిభాని చ | = ప్రళయాగ్ని సదృశాలూ అయిన; | శర్మ చ | = సుఖం కూడా; |
| తే | = నీ; | నలభే | = పొందజాలకున్నాను; |
| ముఖాని | = వదనాలను; | ప్రసీద | = ప్రసన్నుడవు కమ్ము. |

**తా॥** దేవ దేవా! భయంకరమైన కోఱలతో ఒప్పుతున్నవీ, ప్రళయాగ్ని సదృశాలూ అయిన నీ వదనాలను చూడగానే నాకు దిగ్భ్రమ కలుగుతోంది, నా శాంతి తొలగింది; జగన్నివాసా! ప్రసన్నుడవు కమ్ము. 25

**అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః**
**సర్వే సహైవావని పాలసఙ్ఘైః ।**
**భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ**
**సహాస్మదీయై రపి యోధముఖ్యైః ॥ 26**

*అమీ, చ, త్వామ్, ధృతరాష్ట్రస్య, పుత్రాః, సర్వే, సహ, ఏవ, అవని పాలసంఘైః, భీష్మః, ద్రోణః, సూతపుత్రః, తథా, అసౌ, సహ, అస్మదీయైః, అపి, యోధముఖ్యైః.*

**వక్త్రాణి తే త్వరమాణా విశన్తి**
**దంష్ట్రాకరాళాని భయానకాని ।**
**కేచిద్విలగ్నా దశనాన్తరేషు**
**సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః ॥ 27**

*వక్త్రాణి, తే, త్వరమాణా, విశంతి, దంష్ట్రాకరాళాని, భయానకాని, కేచిత్, విలగ్నాః, దశన అంతరేషు, సందృశ్యంతే, చూర్ణితైః, ఉత్తమాంగైః.*

| | | | |
|---|---|---|---|
| అవనిపాల సంఘైః సహ | = నృపతి మండలంతో గూడిన; | విశన్తి | = (వారందరూ) ప్రవేశిస్తున్నారు; |
| అమీ చ | = ఈ; | దంష్ట్రాకరాలాని | = దంత వికృతంతో; |
| ధృతరాష్ట్ర స్య | = ధృతరాష్ట్రుని; | భయానకాని | = భయంకరమైన; |
| పుత్రాః | = పుత్రులు; | తే | = నీ; |
| సర్వే ఏవ | = అందరూ కూడా; | వక్త్రాణి | = ముఖవివరముల; |
| తథా | = మరియు; | త్వరమాణాః | = తొందరపడుతూ; |
| భీష్మః | = భీష్ముడూ; | విశన్తి | = ప్రవేశిస్తున్నారు; |
| ద్రోణః | = ద్రోణుడూ; | కేచిత్ | = కొందరు; |
| అసౌ | = ఈ; | దశన అంతరేషు | = పండ్లసందులలో; |
| సూతపుత్రః | = కర్ణుడూ; | విలగ్నాః | = చిక్కుకొని; |
| అస్మదీయైః | = మన; | చూర్ణితైః | = చూర్ణం చేయబడిన; |
| సహయోధ ముఖ్యైః అపి | = ధృష్టద్యుమ్నాది ప్రధాన వీరులతో కూడా; | ఉత్తమాంగైః | = శిరస్సులతో; |
| త్వామ్ | = నీ యందు | సందృశ్యంతే | = కనబడుతున్నారు. |

**తా॥** ధృతరాష్ట్రుని పుత్రులు రాజన్యవర్గంతో నీ ముఖ వివరముల ప్రవేశిస్తున్నారు. భీష్మద్రోణులూ, కర్ణుడూ మన పక్షానికి చెందిన ధృష్టద్యుమ్నాది వీరులతో కూడా నీయందు ప్రవేశిస్తున్నారు. వారందరూ కరాళదంష్ట్రములూ భీషణములూ అయిన నీ ముఖ గహ్వరముల తొందరపడుతూ ప్రవేశిస్తున్నారు. కొందరు నీ దంతసందుల చిక్కుకొని చూర్ణిత శిరస్కులై ఉన్నారు. 26-27

**యథా నదీనాం బహవోఽమ్బువేగాః**
**సముద్రమేవాభిముఖా ద్రవన్తి ।**
**తథా తవామీ నరలోక వీరాః**
**విశన్తి వక్త్రాణ్యభి విజ్వలన్తి[1] ॥ 28**

*యథా, నదీనామ్, బహవః, అంబువేగాః, సముద్రమ్, ఏవ, అభిముఖాః, ద్రవంతి, తథా, తవ, అమీ, నరలోక వీరాః, విశంతి, వక్త్రాణి, అభివిజ్వలంతి.*

| | | | |
|---|---|---|---|
| యథా | = ఏ విధంగా; | తథా | = అదే విధంగా; |
| నదీనామ్ | = నదుల; | అమీ | = ఈ; |
| బహవః | = పెక్కులగు; | నరలోక వీరాః | = మనుష్యయోధులు; |
| అంబువేగాః | = నీటిధారలు; | అభివిజ్వలంతి | =సర్వత్రా ప్రకాశమానమైన; |
| సముద్రం అభిముఖాః ఏవ | = సముద్రం వైపుకే; | తవ | = నీ; |
| | | వక్త్రాణి | = నోళ్ళలో; |
| ద్రవన్తి | = ప్రవహిస్తున్నాయో; | విశంతి | = ప్రవేశిస్తున్నారు. |

**తా॥** అనేక నదీ ప్రవాహాలు సముద్రాభిముఖములై ప్రవహించి సముద్రం లోనే ప్రవేశించే విధంగా, ఈ వీర పురుషులందరూ సర్వత్ర దీప్యమానములైన నీ ముఖ-వివరముల ప్రవేశిస్తున్నారు. 28

**యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గాః**
**విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।**
**తథైవ నాశాయ విశన్తి లోకాః**
**తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29**

1. అభితో జ్వలంతి. - పాఠాంతరమ్.

*యథా, ప్రదీప్తమ్, జ్వలనమ్, పతంగాః, విశంతి, నాశాయ, సమృద్ధవేగాః,*
*తథా, ఏవ, నాశాయ, విశంతి, లోకాః, తవ, అపి, వక్త్రాణి, సమృద్ధవేగాః.*

| | | | |
|---|---|---|---|
| పతఙ్గాః | = మిడుతలు, | తథా | = అదే విధంగా; |
| సమృద్ధ వేగాః | = చాలా తొందరగా; | లోకాఃఅపి | = జనులు కూడా; |
| యథా | = ఏ విధంగా; | సమృద్ధవేగాః | = అతివేగంతో; |
| ప్రదీప్తమ్ | = మండుతున్న; | నాశాయ ఏవ | = మృతి చెందడానికే; |
| జ్వలనమ్ | = నిప్పులో; | తవ | = నీ; |
| నాశాయ | = మృతి చెందడానికి; | వక్త్రాణి | = నోళ్లు; |
| విశన్తి | = ప్రవేశిస్తున్నాయో; | విశంతి | = పడుచున్నారు. |

**తా॥** మిడుతలు వేగంగా పరుగెత్తి మండుతున్న నిప్పులలో పడడం చావు కొరకే అయిన రీతిగా, జనులందరూ కూడా మృతిచెందడానికి అతివేగంగా నీ ముఖవివరముల ప్రవేశిస్తున్నారు. 29

**లేలిహ్యసే గ్రసమానస్సమన్తాత్**
**లోకాన్ సమగ్రాన్వదనైర్జ్వలద్భిః ।**
**తేజోభిరాపూర్య జగత్సమగ్రం**
**భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥ 30**

*లేలిహ్యసే, గ్రసమానః, సమంతాత్, లోకాన్, సమగ్రాన్, వదనైః, జ్వలద్భిః,*
*తేజోభిః, ఆపూర్య, జగత్, సమగ్రమ్, భాసః, తవ, ఉగ్రాః, ప్రతపంతి, విష్ణో.*

| | | | |
|---|---|---|---|
| జ్వలద్భిః | = దీప్యమానమైన; | తవ | = నీ; |
| వదనైః | = ముఖాలతో; | ఉగ్రాః | = తీవ్రమైన; |
| లోకాన్ | = ఈ వీరులను; | భాసః | = ప్రభలు; |
| సమగ్రాన్ | = అందరిని; | తేజోభిః | = కాంతులతో; |
| గ్రసమానః | = మ్రింగుతూ; | ఆపూర్య | = నింపి; |
| సమన్తాత్ | = అన్నియెడల; | సమగ్రం జగత్ | = జగత్తు నంతటిని; |
| లేలిహ్యసే | = ఆస్వాదిస్తున్నావు; | ప్రతపన్తి | = తపింపజేయుచున్నవి. |
| విష్ణో | = భగవంతుడా; | | |

**తా॥** భగవంతుడా! దీప్యమానమైన వదనసమూహాలతో ఈ వీరుల నందరిని మ్రింగుతూ, అన్నివైపులకూ నాలుకలను చాపుతూ ఆస్వాదిస్తున్నావు. తీవ్రమైన నీ ప్రభలు కాంతులతో జగత్తునంతటినీ నింపి, తపింపజేస్తున్నాయి. 30

**ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో**
**నమోఽస్తు తే దేవవర ప్రసీద ।**
**విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం**
**న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31**

*ఆఖ్యాహి, మే, కః, భవాన్, ఉగ్రరూపః, నమః, అస్తు, తే, దేవవర, ప్రసీద, విజ్ఞాతుమ్, ఇచ్ఛామి, భవంతమ్, ఆద్యమ్, న, హి, ప్రజానామి, తవ, ప్రవృత్తిమ్.*

| | | | |
|---|---|---|---|
| ఉగ్రరూపః | = అతిక్రూరమైన ఆకారం గల; | ప్రసీద | = ప్రసన్నుడవుకమ్ము; |
| భవాన్ | = నీవు; | ఆద్యమ్ | = ఆదిపురుషుడవైన; |
| కః | = ఎవరో; | భవన్తమ్ | = నిన్ను; |
| మే | = నాకు; | విజ్ఞాతుమ్ | = తెలిసికొన; |
| ఆఖ్యాహి | = చెప్పు; | ఇచ్ఛామి | = కోరుతున్నాను; |
| తే | = నీకు; | హి | = ఏమన |
| నమః అస్తు | = నమస్కారం; | తవ | = నీ; |
| దేవవర | = దేవ శ్రేష్ఠా; | ప్రవృత్తిమ్ | = ప్రవర్తనను; |
| | | న ప్రజానామి | = తెలిసికోజాలకున్నాను. |

**తా॥** ఉగ్రమూర్తివైన నీ వెవరవో నాకు గ్రహింపజేయి. నీకు నమస్కారం. దేవశ్రేష్ఠా! ప్రసన్నుడవు కమ్ము ! ఆది పురుషుడవైన నిన్ను తెలుసుకో గోరుతున్నాను; నీ ఉద్దేశమేమిటో తెలియకున్నది. 31

*శ్రీభగవానువాచ :*

**కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో**
**లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః**
**ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే**
**యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32**

*కాలః, అస్మి, లోకక్షయకృత్, ప్రవృద్ధః, లోకాన్, సమాహర్తుమ్, ఇహ, ప్రవృత్తః, ఋతే, అపి, త్వామ్, న, భవిష్యంతి, సర్వే, యే, అవస్థితాః, ప్రత్యనీకేషు, యోధాః.*

| | | | |
|---|---|---|---|
| లోక క్షయ కృత్ | = లోకసంహారకుడనై; | ప్రవృత్తః | = మొదలిడితిని; |
| ప్రవృద్ధః | = విజృంభించిన; | త్వాం ఋతే అపి | = నీవు లేకున్నా; |
| కాలః | = కాలుడను; | ప్రత్యనీకేషు | = శత్రుపక్షంలోని; |
| అస్మి | = (నేను) అయి ఉన్నాను; | యే | = ఏ; |
| లోకాన్ | = ప్రాణులను; | యోధాః | = వీరులు; |
| సమాహర్తుమ్ | = | అవస్థితాః | = ఉన్నారో; |
| సంహరింప; | | సర్వే | = వారందరూ; |
| ఇహ | = ఇప్పుడు; | న భవిష్యంతి | = ఉండరు. |

**తా॥** *శ్రీభగవంతుడు పలికెను :* నేను లోక సంహారార్థం విజృంభించిన కాలుణ్ణి, ఇప్పుడు ప్రాణుల సంహరింపదలచాను, నీవు యుద్ధం చేయక పోయినా, శత్రుపక్షంలోని వీరులు జీవించరు. 32

**తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ**
**జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్।**
**మయైవైతే నిహతాః పూర్వమేవ**
**నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33**

తస్మాత్, త్వమ్, ఉత్తిష్ఠ, యశః, లభస్వ, జిత్వా, శత్రూన్, భుంక్ష్వ, రాజ్యమ్, సమృద్ధమ్, మయా, ఏవ, ఏతే, నిహతాః, పూర్వమ్, ఏవ, నిమిత్త మాత్రమ్, భవ, సవ్యసాచిన్.

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = కనుక; | భుంక్ష్వ | = భోగించు; |
| త్వమ్ | = నీవు; | మయా ఏవ | = నా చేతనే; |
| ఉత్తిష్ఠ | = లెమ్ము; | ఏతే | = వీరు; |
| యశః | = కీర్తిని; | పూర్వ ఏవ | = మునుపే; |
| లభస్వ | = పొందుము; | నిహతాః | = చంపబడ్డారు; |
| శత్రూన్ | = శత్రువులను; | సవ్య సాచిన్ [1] | = అర్జునా; |
| జిత్వా | = జయించి; | నిమిత్తమాత్రమ్ | = నిమిత్తమాత్రుడవు |
| సమృద్ధమ్ | = నిష్కంటకమైన; | | (ఉపలక్ష్యం); |
| రాజ్యమ్ | = రాజ్యాన్ని; | భవ | = కమ్ము. |

1. సవ్యసాచి : ఎడమచేతితో కూడా బాణాలను సంధించగలవాడు.

**తా॥** కనుక, నీవు యుద్ధమొనర్ప లెమ్ము, యశస్సును పొందు. శత్రువులను ఓడించి నిష్కంటకమైన రాజ్యాన్ని భోగించు. నాచే వీరు మునుపే చంపబడ్డారు. అర్జునా! నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము. 33

**ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ**
**కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।**
**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠాః**
**యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34**

*ద్రోణమ్, చ, భీష్మమ్, చ, జయద్రథమ్, చ, కర్ణమ్, తథా, అన్యాన్, అపి, యోధవీరాన్, మయా, హతాన్, త్వమ్, జహి, మా, వ్యథిష్ఠాః, యుధ్యస్వ, జేతాసి, రణే, సపత్నాన్.*

| | | | |
|---|---|---|---|
| మయా | = నాచే; | త్వమ్ | = నీవు; |
| హతాన్ | = చంపబడిన; | జహి | = చంపు; |
| ద్రోణం చ | = ద్రోణుణ్ణి; | మా వ్యథిష్ఠాః | = విచారపడకు (భయపడకు); |
| భీష్మం చ | = భీష్ముణ్ణి; | | |
| జయద్రథం చ | = జయద్రథుణ్ణి; | రణే | = యుద్ధంలో; |
| కర్ణమ్ | = కర్ణుణ్ణి; | సపత్నాన్ | = శత్రువులను; |
| తథా అన్యాన్ | = మఱియు ఇతర; | జేతాసి | = జయించగలవు; |
| యోధ వీరాన్ అపి | =యుద్ధవీరులను కూడా; | యుధ్యస్వ | = యుద్ధం చేయి. |

**తా॥** (ఎవరిని చంపడానికి నీవు శంకిస్తున్నావో ఆ) భీష్మ, ద్రోణ, కర్ణ, జయద్రథాదులను[1], తదితరులైన యోధులను నేను ఇదివరకే చంపి ఉన్నాను; మృతులైన వారినే నువ్వు వధించు. భయపడకు (విచారించకు), యుద్ధంలో శత్రువులను తప్పక గెలువగలవు. యుద్ధమొనర్చు. 34

సఞ్జయ ఉవాచ :

**ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య**
**కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ ।**

1. జయద్రథుడు = సింధురాజపుత్రుడు, ధృతరాష్ట్రుని పుత్రికయైన దుస్సల భర్త.

**నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం**
**సగద్గదం భీత భీతః ప్రణమ్య ॥ 35**

ఏతత్, శ్రుత్వా, వచనమ్, కేశవస్య, కృత అంజలిః, వేపమానః, కిరీటీ,
నమస్కృత్వా, భూయః, ఏవ, ఆహ, కృష్ణమ్, సగద్గదమ్, భీత భీతః, ప్రణమ్య.

| | | | |
|---|---|---|---|
| కేశవస్య | = శ్రీకృష్ణుని; | కృష్ణమ్ | = శ్రీకృష్ణునికి; |
| ఏతత్ | = ఈ; | నమస్కృత్వా | = నమస్కారించి; |
| వచనమ్ | = పలుకులను; | భీతభీతః | = చాలా భయపడుతూ; |
| శ్రుత్వా | = విని; | ప్రణమ్య | = ప్రణమిల్లి; |
| వేపమానః | = వణకుచున్న వాడై; | భూయః ఏవ | = మళ్ళీ; |
| కిరీటీ | = అర్జునుడు; | సగద్గదమ్ | = గద్గద స్వరంతో; |
| కృత అంజలిః | = చేతులు జోడించి; | ఆహ | = పలికాడు; |

**తా॥** సంజయుడు పలికెను : శ్రీకృష్ణుని ఈ పలుకులను విని కిరీటి[1] వణకుతూ చేతులు జోడించి నమస్కరించాడు; ఎంతో భయపడుతూ మళ్ళీ ప్రణమిల్లి, బాష్పగద్గద కంఠుడై ఇలా పలికాడు. 35

అర్జున ఉవాచ :

**స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా**
**జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ ।**
**రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి**
**సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥ 36**

స్థానే, హృషీకేశ, తవ, ప్రకీర్త్యా, జగత్, ప్రహృష్యతి, అనురజ్యతే, చ,
రక్షాంసి, భీతాని, దిశః, ద్రవంతి, సర్వే, నమస్యంతి, చ, సిద్ధసంఘాః.

| | | | |
|---|---|---|---|
| హృషీకేశ | = కృష్ణా, | జగత్ | = జగత్తు; |
| తవ | = నీ; | ప్రహృష్యతి | = ఆనందిస్తోంది; |
| ప్రకీర్త్యా | = మాహాత్మ్యకీర్తనంచేత; | చ | = మరియూ, |

1. పురా శక్రేణ మే దత్తం యుధ్యతో దానవర్షభైః,
కిరీటం మూర్ధ్ని సూర్యాభం తేనాహు ర్మాం కిరీటినమ్. – విరాట పర్వ 44-17

| | | | |
|---|---|---|---|
| అనురజ్యతే | = ప్రీతిని పొందుతోంది; | సిద్ధ సంఘాః సర్వేచ | = తపోయోగమంత్ర సిద్ధి పొందినవారందరూ కూడా; |
| రక్షాంసి | = రాక్షసులు; | నమస్యన్తి | = నమస్కరిస్తున్నారు; |
| భీతాని | = భయపడుతూ; | (ఇదంతా)స్థానే | = యుక్తియుక్తము, (తగియున్నది); |
| దిశః | = నలుదిక్కులకు; | | |
| ద్రవన్తి | = పరుగెడుతున్నారు; | | |

**తా॥** అర్జునుడు పలికెను : హృషీకేశా! నీ మాహాత్మ్య కీర్తనలో జగత్తంతా ఆనందిస్తూ, ప్రీతి పొందుతోంది. (నీ ప్రభావం అత్యద్భుతం, నీవు భక్తవత్సలుడవు) రాక్షసులు భీతులై నలుదిక్కులకూ పరుగెడుతున్నారు. తపో, యోగ, మంత్ర, సిద్ధులు నీకు నమస్కరిస్తున్నారు. ఇది అంతా తగియున్నది. 36

**కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్**
**గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।**
**అనన్త దేవేశ జగన్నివాస**
**త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ 37**

*కస్మాత్, చ, తే, న, నమేరన్, మహాత్మన్, గరీయసే, బ్రహ్మణః, అపి, ఆదికర్త్రే, అనంత, దేవేశ, జగత్ నివాస, త్వమ్, అక్షరమ్, సత్, అసత్, తత్ పరమ్, యత్.*

| | | | |
|---|---|---|---|
| మహాత్మన్ | = మహాత్మా; | న నమేరన్ | = నమస్కరింపకుంటారు?; |
| అనంత | = అనంతా; | సత్ | = వ్యక్తమూ; |
| దేవేశ | = దేవేశా; | అసత్ | = అవ్యక్తమూ; |
| జగత్ నివాస | = జగదాశ్రయా; | పరమ్ | = ఈ రెంటికీ అతీతమైన; |
| బ్రహ్మణః అపి | = బ్రహ్మ కంటే; | యత్ | = ఏ; |
| గరీయసే | = గొప్పదైన; | అక్షరమ్ | = పరబ్రహ్మం (కలదో); |
| ఆదికర్త్రే | = మూలకారణమైన; | తత్ చ | = అది కూడా; |
| తే | = నీకు, | త్వమ్ | = నీవే. |
| కస్మాత్ | = ఎలా (దేవతలు); | | |

**తా॥** మహాత్మా! అనంతా! దేవేశా! జగన్నివాసా! నీవు బ్రహ్మకు కూడా గురుడవు, ఆదికర్తవు. వ్యక్త–అవ్యక్తాలు రెండింటికీ అతీతమైన అక్షరము కూడా నీవే ! దేవతలు నీకు ఎలా నమస్కరించకుండా ఉంటారు? (ఈ తొమ్మిది కారణాల వల్ల నీవు అందరికీ నమస్యుడవు అని భావం.) 37

త్వ మాదిదేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప ॥ 38

త్వమ్, ఆదిదేవః, పురుషః, పురాణః, త్వమ్, అస్య, విశ్వస్య, పరమ్, నిధానమ్, వేత్తా, అసి, వేద్యమ్, చ, పరమ్, చ, ధామ, త్వయా, తతమ్, విశ్వమ్, అనంతరూప.

| | | | |
|---|---|---|---|
| అనంత రూప | = అనంతరూపా; | నిధానమ్ | = ఆశ్రయభూతుడవు; |
| త్వమ్ | = నీవు; | వేత్తా | = సర్వజ్ఞుడవు (జ్ఞాతవు); |
| ఆది దేవః | = దేవతలకు కూడా ఆదివి; | వేద్యం చ | = జ్ఞేయానివి; |
| పురాణః | = అనాదివి (సనాతనుడవైన); | పరంధామ చ | = శ్రేష్ఠ పదం; |
| పురుషః | = పురుషుడవు; | అసి | = అయి ఉన్నావు; |
| త్వమ్ | = నీవు; | త్వయా | = నీచే; |
| అస్య | = ఈ | విశ్వమ్ | = జగత్తు; |
| విశ్వస్య | = జగత్తుకు; | తతమ్ | = వ్యాప్తమై ఉంది. |
| పరమ్ | = ఏకమాత్రమైన; | | |

**తా॥** అనంతరూపా! నీవు ఆది దేవుడవు, పురాణపురుషుడవు, విశ్వలయ స్థానానివి, నీవే జ్ఞాతవు, జ్ఞేయానివి, పరంధాముడవు. నీవు ఈ విశ్వాన్నంతటినీ వ్యాపించి ఉన్నావు.(ఈ ఏడు కారణాల వల్ల నీవే నమస్కార యోగ్యుడవు) 39

వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాఙ్కః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
[1]పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39

వాయుః, యమః, అగ్నిః, వరుణః, శశాంకః, ప్రజాపతిః, త్వమ్, ప్రపితామహః, చ, నమః, నమః, తే, అస్తు, సహస్రకృత్వః, పునః, చ, భూయః, అపి, నమః, నమః, తే.

1. భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. – ఈశావాశ్యోపనిషత్తు 18

| | | | |
|---|---|---|---|
| త్వమ్ | = నీవు; | తే | = నీకు; |
| వాయుః | = వాయుదేవుడవు; | సహస్ర కృత్వః | = వేల సార్లు; |
| యమః | = యముడవు; | నమః అస్తు | = నమస్కరిస్తాను; |
| అగ్నిః | = అగ్ని దేవుడవు; | పునశ్చ | = మళ్ళీ; |
| వరుణః | = వరుణుడవు; | నమః | = నమస్కారం; |
| శశాంకః | = చంద్రుడవు; | భూయః అపి | = తిరిగి మళ్ళీ; |
| ప్రజాపతిః | = కశ్యపాది ప్రజాపతి రూపంలో లోకపితవు; | తే | = నీకు; |
| ప్రపితామహః చ | = బ్రహ్మకు కూడా జనకుడవు; | నమః నమః | = నమస్కారాలు. |

**తా॥** నీవు వాయుదేవుడవు, యముడవు, అగ్నివి, వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతి రూపంలో లోకానికి తండ్రివి (ప్రజాపతులకు తండ్రి, లోకపితామహుడూ అయిన బ్రహ్మవు). బ్రహ్మకు జనకుడైన ప్రపితామహుడవు కూడా నీవే. నీకు నమోవాక సహస్రములు. పదే పదే నీకు నమస్సులు, మళ్ళీ నీకు నమస్కరిస్తున్నాను. 39

**నమః పురస్తాదథ పృష్ఠతస్తే**
**నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**
**అనన్త వీర్యామిత విక్రమస్త్వం**
**సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ 40**

*నమః పురస్తాత్, అథ, పృష్ఠతః, తే, నమః, అస్తు, తే, సర్వతః, ఏవ, సర్వ, అనంత వీర్య, అమిత విక్రమః, త్వమ్, సర్వమ్, సమాప్నోషి, తతః, అసి, సర్వః.*

| | | | |
|---|---|---|---|
| సర్వ | = సర్వాత్మా; | నమః అస్తు | = నమస్కరిస్తున్నాను; |
| తే | = నీకు; | అనంత వీర్య | = అనంత శక్తీ; |
| పురస్తాత్ | = ఎదుటను; | త్వమ్ | = నీవు; |
| అథ | = మరియూ; | అమిత విక్రమః | = అమితవిక్రముడవు; |
| పృష్ఠతః | = వెనుక కూడా; | సర్వమ్ | = విశ్వాన్నంతటిని; |
| నమః | = నమస్కరిస్తున్నాను; | సమాప్నోషి | = వ్యాపించి ఉన్నావు; |
| తే | = నీకు; | తతః | = కనుక; |
| సర్వతః ఏవ | = అన్ని వైపుల; | సర్వః అపి | = సర్వ స్వరూపుడవు. |

**తా॥** సర్వాత్మా! నీకు ఎదురుగా, వెనుకగా, అన్నివైపులా నమస్కరిస్తున్నాను. నీ బలపరాక్రమాలకు అంతం లేదు, నీవు విశ్వాన్నంతటినీ వ్యాపించి ఉన్నావు, నీవు సర్వరూపుడవు. (ముండకోపనిషత్తు. 2-2-11 చూ.) 40

**సఖేతి మత్వా ప్రసభం యదుక్తం**
**హే కృష్ణ హే యాదవ హే సఖేతి ।**
**అజానతా మహిమానం తవేదం**
**మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥ 41**

సఖా, ఇతి, మత్వా, ప్రసభమ్, యత్, ఉక్తమ్, హేకృష్ణ, హేయాదవ, హేసఖా, ఇతి, అజానతా, మహిమానమ్, తవ, ఇదమ్, మయా, ప్రమాదాత్, ప్రణయేన, వా, అపి.

**యచ్చావహాసార్థ మసత్కృతోఽసి**
**విహార శయ్యాసన భోజనేషు ।**
**ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం**
**తత్క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42**

యత్, చ, అపహాస అర్థమ్, అసత్కృతః, అసి, విహార శయ్య ఆసన భోజననేషు, ఏకః, అథవా, అపి, అచ్యుత, తత్ సమక్షమ్, తత్,క్షామయే, త్వామ్, అహమ్, అప్రమేయమ్.

| | | | |
|---|---|---|---|
| తవ | = నీ; | హే సఖా | = ఓ సఖా; |
| మహిమానమ్ | = మాహాత్మ్యాన్ని; | ఇతి | = అని; |
| ఇదమ్ | = ఈ విశ్వరూపాన్ని; | ప్రసభమ్ | = తిరస్కారపూర్వకంగా; |
| అజానతా | = ఎరుగని; | యత్ | = ఏమి; |
| మయా | = నాచే; | ఉక్తమ్ | = వచింపబడినదో; |
| ప్రమాదాత్ | = చిత్త చాంచల్యంతో గాని; | అచ్యుత | = అచ్యుతా; |
| ప్రణయేన వా అపి | = స్నేహాధిక్యంతో గాని; | విహార శయ్య ఆసన భోజనేషు | = విహరిస్తున్నప్పుడూ, కూర్చున్నప్పుడూ, పరుండునప్పుడూ, భుజించునప్పుడూ - ఈ సమయాలలో; |
| సఖా | = స్నేహితుడవు; | | |
| ఇతి | = అని; | | |
| మత్వా | = భావించి; | | |
| హే కృష్ణ | = ఓ కృష్ణా; | అథవా | = లేక; |
| హే యాదవ | = ఓ యాదవా, | ఏకః | = ఒంటరిగా ఉన్నప్పుడు; |

| | | | |
|---|---|---|---|
| తత్ సమక్షం | = ఇతరుల ఎదుట; | అహమ్ | = నేను; |
| అవహాస అర్థమ్ | = పరిహాసార్థంగా; | అప్రమేయమ్ | = ప్రమాణాతీతుడవైన; |
| యత్ | = ఏ రీతిగా; | త్వామ్ | = నిన్ను; |
| అసత్కృతః | = అసమ్మానితుడవు; | తత్ | = దాని కొరకు; |
| అసి | = అయ్యావో; | క్షామయే | = క్షమింప ప్రార్థిస్తున్నాను; |

**తా॥** విశ్వరూపధారణాసమర్థమైన నీ మహిమను గుర్తింపజాలక, నిన్ను సఖుడవని ఎంచి పొరపాటున గాని, చనువుచే గాని, కృష్ణా! యాదవా! సఖా! అని వినయరహితంగా దేనిని వచించి ఉన్నానో; మరియు అచ్యుతా! విహార, శయన, ఆసన కాలాలలో గాని, నీ ఎదుట గాని వెనుక గాని, నీవు ఒక్కడవే ఉన్నప్పుడు గాని, లేక ఇతరులతో ఉన్నప్పుడు గాని, పరిహాసార్థం నీకు చేసిన అమర్యాదకు అప్రమేయుడవైన నీ వద్ద క్షమాప్రార్థన ఒనర్చుతున్నాను. 41-42

**పితాసి లోకస్య చరాచరస్య**
**త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్[1] ।**
**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో**
**లోకత్రయేఽప్యప్రతిమప్రభావ[2] ॥ 43**

*పితా, అసి, లోకస్య, చర అచరస్య, త్వమ్, అస్య, పూజ్యః, చ, గురుః, గరీయాన్, న, త్వత్, సమః, అస్తి, అభ్యధికః, కుతః, అన్యః, లోకత్రయే, అపి, అప్రతిమప్రభావ.*

| | | | |
|---|---|---|---|
| అప్రతిమ ప్రభావ | = అతులనీయ శక్తీ; | గరీయాన్ చ | = పెద్దవు; |
| త్వమ్ | = నీవు; | అసి | = అయి ఉన్నావు; |
| అస్య | = ఈ; | లోక త్రయే అపి | = ముల్లోకాలలో; |
| చర అచరస్య | = స్థావర జంగమాత్మకమైన; | త్వత్సమః | = నీకు సమానుడైన వాడు; |
| లోకస్య | = జగత్తుకి; | న అస్తి | = లేడు; |
| పితా | = స్రష్టవు; | అభ్యధికః | = నిన్ను మించినవాడు; |
| పూజ్యః | = పూజ్యనీయుడవు; | అన్యః | = మరొకడు; |
| గురుః | = గురుడవు; | కుతః | = ఎక్కడ? |

1. గురోర్గరీయాన్. - పాఠాంతరం.
2. అప్రతిసుప్రభావః. - పాఠాంతరం.

**తా॥** నిరుపమప్రభావా! స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తుకు నీవు స్రష్టవు, పూజ్యనీయుడవు, గురుడవు, పెద్దవు. త్రిభువనాలలో నీకు సమానులైన వారు లేరు, నీకంటే శ్రేష్ఠమైనవారు[1] ఇంకెక్కడ? 43

**తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః**
**ప్రియఃప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ 44**

*తస్మాత్, ప్రణమ్య, ప్రణిధాయ, కాయమ్, ప్రసాదయే, త్వామ్, అహమ్, ఈశమ్, ఈడ్యమ్, పితా, ఇవ, పుత్రస్య, సఖా, ఇవ, సఖ్యుః, ప్రియః, ప్రియాయాః, అర్హసి, దేవ, సోఢుమ్.*

దేవ = దేవా;
తస్మాత్ = కనుక;
అహమ్ = నేను;
కాయం = శరీరాన్ని;
ప్రణిధాయ = వంచి;
ప్రణమ్య = నమస్కరించి (దండప్రణామమొనర్చియనుట);
ఈడ్యమ్ = వందనీయుడవూ;
ఈశమ్ = ఈశ్వరుడవు అయిన;
త్వామ్ = నిన్ను;
ప్రసాదయే = ప్రసన్నం చేసుకున్నాను (అనుగ్రహింప వేడుకున్నాను);
పుత్రస్య = పుత్రుని;
పితా ఇవ = తండ్రి వలే;
సఖ్యుః = సఖుని;
సఖా ఇవ = స్నేహితుని వలే;
ప్రియాయాః = ప్రేయసిని;
ప్రియః ఇవ = ప్రియుని వలే (నా అపరాధాన్ని);
సోఢుమ్ = సహింప (క్షమింప);
అర్హసి = తగుదువు.

**తా॥** దేవా! కనుక, నీకు సాష్టాంగ ప్రణామం చేస్తున్నాను; పూజ్యుడవూ, ఈశ్వరుడవూ అయిన నిన్ను అనుగ్రహించమని వేడుతున్నాను. తండ్రి కొడుకు యొక్క, స్నేహితుడు స్నేహితుని యొక్క, ప్రియుడు ప్రేయసి యొక్క లోపాలను సహించే విధంగా నీవు నా అపరాధాన్ని క్షమించు. 44

**అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా**
**భయేన చ ప్రవ్యథితం మనో మే ।**

---

1. న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే.
అతనికి సముడైనవాడు కాని, అతని కంటే అధికుడైనవాడు కాని లేడు. – శ్వేతాశ్వతరోపనిషత్తు 6–8

**తదేవ మే దర్శయ దేవ రూపం**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥** **45**

అదృష్టపూర్వమ్, హృషితః, అస్మి, దృష్ట్వా, భయేన, చ, ప్రవ్యథితమ్, మనః, మే, తత్, ఏవ, మే, దర్శయ, దేవ రూపమ్, ప్రసీద, దేవేశ, జగన్నివాస.

| | | | |
|---|---|---|---|
| దేవ | = దేవా; | మనః | = మనస్సు; |
| అదృష్టపూర్వం | = పూర్వం చూడని (విశ్వరూపాన్ని); | ప్రవ్యథితమ్ | = బాధితమైనది; |
| | | దేవేశ | = దేవేశా; |
| దృష్ట్వా | = చూసి; | జగన్నివాస | = జగన్నివాసా; |
| హృషితః | = సంతుష్టుణ్ణి; | తత్ రూపం ఏవ | = పూర్వరూపంతో; |
| అస్మి | = అయ్యాను; | మే | = నాకు; |
| భయేన చ | = మరియు, భయంతో; | దర్శయ | = దర్శనమిచ్చి; |
| మే | = నా; | ప్రసీద | = ప్రసన్నుడవు కమ్ము. |

**తా॥** దేవా! నేనుగాని, ఇతరులు గాని ఇంతకుమునుపు చూడని విశ్వరూపాన్ని గాంచి, ఆనందాన్ని పొందాను; నా మనస్సు భయ వ్యాకులితమవుతోంది. దేవేశా! జగన్నినవాసా! ఆ నీ పూర్వరూపాన్నే దర్శింపజేసి, ప్రసన్నుడవు కమ్ము! 45

**కిరీటినం గదినం చక్రహస్తం**
**ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన**
**సహస్రబాహో భవవిశ్వమూర్తే ॥** **46**

కిరీటినమ్, గదినమ్, చక్రహస్తమ్, ఇచ్ఛామి, త్వామ్, ద్రష్టుమ్, అహమ్, తథా, ఏవ, తేన, ఏవ, రూపేణ, చతుర్భుజేన, సహస్రబాహో, భవ, విశ్వమూర్తే.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | ఇచ్ఛామి | = కోరుతున్నాను; |
| త్వామ్ | = నిన్ను; | సహస్ర బాహో | = సహస్రహస్తా; |
| తథా ఏవ | = పూర్వరీతిలో; | విశ్వ మూర్తే | = విశ్వమూర్తీ; |
| కిరీటినమ్ | = కిరీటధారిగా; | తేన | = ఆ; |
| గదినమ్ | = గదాధరునిగా; | చతుర్భుజేన | = చతుర్భుజయుక్తమైన; |
| చక్ర హస్తమ్ | = చక్రపాణిగా; | రూపేణ ఏవ | = రూపంతోడి వాడవే; |
| ద్రష్టుమ్ | = చూడ; | భవ | = అగుము. |

**తా॥** సహస్రహస్తా! నేను నిన్ను పూర్వరీతిగా కిరీట చక్ర గదాధరునిగా చూడ గోరుతున్నాను. దుర్నిరీక్ష్యమైన నీ విశ్వరూపాన్ని ఉపసంహరించు; విశ్వమూర్తీ! నీ ఆ చతుర్భుజ రూపాన్ని ధరించు.[1] 46

*శ్రీభగవానువాచ :*

**మయా ప్రసన్నేన తవార్జునేదం**
**రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।**
**తేజోమయం విశ్వమనన్త మాద్యం**
**యన్మే త్వదన్యేన న దృష్ట పూర్వమ్ ॥ 47**

మయా, ప్రసన్నేన, తవ అర్జున, ఇదమ్, రూపమ్, పరమ్, దర్శితమ్, ఆత్మయోగాత్, తేజోమయమ్, విశ్వమ్, అనంతమ్, ఆద్యమ్, యత్, మే, త్వత్ అన్యేన, న, దృష్ట పూర్వమ్.

| | | | |
|---|---|---|---|
| అర్జున | = అర్జునా; | అనంతమ్ | = అంతరహితమూ; |
| ప్రసన్నేన | = ప్రసన్నుడనగు; | ఆద్యం | = ఆది భూతమూ; |
| మయా | = నాచే; | పరమ్ | = ఉత్తమమూ అయిన; |
| ఆత్మయోగాత్ | = యోగమాయా సామర్థ్యం వల్ల, స్వీయ ఈశ్వర శక్తి వల్ల; | మే రూపమ్ | = విశ్వం రూపం; |
| | | దర్శితమ్ | = చూపించబడింది; |
| తవ | = నీకు; | యత్ | = ఏ (ఈ నా రూపం); |
| ఇదమ్ | = ఈ; | త్వత్ అన్యేన | = నీవుగాక మరి ఇతరులచే; |
| తేజోమయమ్ | = తేజః పూర్ణాన్ని; | న దృష్ట పూర్వమ్ | = ఇంతవరకూ చూడబడలేదు. |
| విశ్వమ్ | = సర్వవ్యాపకమూ; | | |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* అర్జునా! నేను ప్రసన్నుడనై నీకు, నా యోగశక్తి ప్రభావంతో తేజఃపూర్ణమూ, అనంతమూ, ఆద్యమూ అయిన విశ్వరూపాన్ని చూపించాను - నీవు గాక ఇతరులెవ్వరూ కూడా పూర్వం ఈ రూపాన్ని చూడలేదు. 47

**న వేద యజ్ఞాధ్యయనైర్న దానైః**
**న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।**

1. అర్జునునికి శ్రీకృష్ణుడు సర్వదా చతుర్భుజునిగా కనపడుచుండెనని తోచుచున్నది.
– శ్రీధరస్వామి; మధుసూదనసరస్వతి.

**ఏవం రూపః శక్య అహం నృలోకే**
**ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48**

న, వేద యజ్ఞ, అధ్యయనైః, న, దానైః, న, చ, క్రియాభిః, న, తపోభిః, ఉగ్రైః, ఏవమ్, రూపః, శక్యః, అహమ్, నృలోకే, ద్రష్టుమ్, త్వత్, అన్యేన, కురుప్రవీర.

కురు ప్రవీర = కురుశ్రేష్ఠా;
అహమ్ = నేను;
నృలోకే = మనుష్య లోకంలో;
త్వత్ అన్యేన = నీ కంటే అన్యులైనవారిచే;
ఏవంరూపః = ఈ రూపంలో;
ద్రష్టుమ్ = చూడ;
న శక్యః = సాధ్యుణ్ణి కాను;
వేద యజ్ఞ అధ్యయనైః = వేదాలను యజ్ఞ విద్యలను అభ్యసించుటచే;
న చ క్రియాభిః = అగ్నిహోత్రాది క్రియలచే (సాధ్యుణ్ణి కాలేదు);
న దానైః = దానాలచేత కూడా (సాధ్యుణ్ణి కాలేదు);
న ఉగ్రైః తపోభిః = చాంద్రాయణాది కృచ్ఛ్రవ్రతాలచేత కూడా (సాధ్యుణ్ణి కాలేదు, నీవు ఒక్కడివే నా ప్రసాదంతో, గాంచి ధన్యుడవైయ్యావు).

**తా॥** కురుశ్రేష్ఠా! వేదాలను, యజ్ఞవిద్యలను అధ్యయనం చేసినవారు ఈ విశ్వరూపాన్ని చూడలేదు. అగ్నిహోత్రాది శ్రౌతకర్మలను, తులాపురుషాది దానాలను, చాంద్రాయణాది కఠిన తపాలను ఆచరించినవారికి కూడా ఈ దర్శనం లభించలేదు; నీవు ఒక్కడవే నా అనుగ్రహంతో దర్శించి, ధన్యుడవైయ్యావు.

**మా తే వ్యథా మా చ విమూఢభావో**
**దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।**
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం**
**తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49**

మా, తే, వ్యథా, మా, చ, విమూఢభావః, దృష్ట్వా, రూపమ్, ఘోరమ్, ఈదృక్, మమ, ఇదమ్, వ్యపేతభీః, ప్రీతమనాః, పునః, త్వమ్, తత్, ఏవ, మే, రూపమ్, ఇదమ్, ప్రపశ్య.

ఈదృక్ = ఇట్టి;
మమ = నా;
ఘోరం = భయంకరమైన;
ఇదమ్ = ఈ;
రూపమ్ = విశ్వరూపాన్ని;
దృష్ట్వా = చూసి;

| | | | |
|---|---|---|---|
| తే | = నీకు; | పునః | = మళ్ళీ; |
| వ్యథా | = భయం; | త్వమ్ | = నీవు; |
| మా | = వలదు; | మే | = నా; |
| విమూఢభావః చ | = చిత్తవైకల్యం; | తత్ | = ఆ; |
| మా | = వలదు; | ఇదమ్ | = ఈ; |
| వ్యపేతభీః | = భయరహితుడవై; | రూపం ఏవ | = పూర్వరూపంలో; |
| ప్రీతమనాః | = సంతుష్టచిత్తుడవై; | ప్రపశ్య | = చూడు. |

**తా॥** భయంకరమైన నా ఈ విశ్వరూపాన్ని గాంచి నీవు భయాన్ని, చిత్తవైకల్యాన్ని పొందవద్దు. భయాన్ని వీడి, ప్రసన్నచిత్తంతో (శంఖ, చక్ర, గదా, పద్మ ధరమైన) నా చతుర్భుజ రూపాన్ని చూడు. 49

సఞ్జయ ఉవాచ :

**ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా**
**స్వకం రూపం దర్శయామాస భూయః ।**
**ఆశ్వాసయామాస చ భీతమేనం**
**భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా ॥ 50**

ఇతి, అర్జునమ్, వాసుదేవః, తథా, ఉక్త్వా, స్వకమ్, రూపమ్, దర్శయామాస, భూయః, ఆశ్వాసయామాస, చ, భీతమ్, ఏనమ్, భూత్వా, పునః, సౌమ్యవపుః, మహాత్మా.

| | | | |
|---|---|---|---|
| వాసుదేవః [1] | = శ్రీకృష్ణుడు; | తథా | = ఆ రీతిగానే; |
| అర్జునమ్ | = అర్జునునితో; | స్వకమ్ | = తన; |
| ఇతి | = ఇట్లు; | రూపమ్ | = చతుర్భుజమూర్తిని; |
| ఉక్త్వా | = పలికి; | దర్శయామాస | = చూపెను; |
| భూయః | = మళ్ళీ; | మహాత్మా | = విశ్వాత్ముడు; |

1. ఛాదయామి జగ త్సర్వం భూత్వా సూర్య ఇ వాంశుభిః,
సర్వభూతాదివాసశ్చ వాసుదేవ స్తతః స్మృతః.
వాసనా త్సర్వభూతానాం వసుత్వా ద్దేవయోనితః,
వాసుదేవ స్తతో జ్ఞేయో యోగిభి స్తత్త్వదర్శిభిః.

జగత్తునంతటిని సూర్యకిరణాల వలే ఆవరించి ఉండుటచేతా, సర్వభూతాలలో వెలయుట చేతా నన్ను వాసుదేవుడు అంటారు.

| | | | |
|---|---|---|---|
| సౌమ్య వపుః | = ప్రసన్నరూపుడు; | ఏనమ్ | = అర్జునుణ్ణి; |
| భూత్వా | = అయి; | ఆశ్వాసయామాస చ | = ఓదార్చెను. |
| భీతమ్ | = భీతి చెందిన; | | |

**తా॥** సంజయుడు పలికెను : వాసుదేవుడు అర్జునునితో ఇలా పలికి, మళ్ళీ తన పూర్వరూపాన్ని దర్శింపజేసాడు. విశ్వమూర్తి సౌమ్యమూర్తియై భీతుడైన అర్జునుని ఆశ్వాసించాడు. 50

*అర్జున ఉవాచ :*

**దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।**
**ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51**

*దృష్ట్వా, ఇదమ్, మానుషమ్, రూపమ్, తవ, సౌమ్యమ్, జనార్దన, ఇదానీమ్, అస్మి, సంవృత్తః, సచేతాః, ప్రకృతిమ్, గతః.*

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | దృష్ట్వా | = చూసి; |
| ఉవాచా | = పలికెను; | ఇదానీమ్ | = ఇప్పుడు; |
| జనార్దన | = శ్రీకృష్ణా; | (అహమ్ | = నేను;) |
| తవ | = నీ; | సచేతాః | = ప్రసన్నచిత్తుడను; |
| ఇదమ్ | = ఈ; | సంవృత్తః | = అయ్యాను; |
| సౌమ్యమ్ | = ప్రసన్నమగు; | ప్రకృతిమ్ | = స్వభావాన్ని(స్వస్థతను); |
| మానుషమ్ రూపమ్ | = మనుష్య రూపాన్ని; | గతః అస్మి | = పొందాను. |

**తా॥** అర్జునుడు పలికెను : జనార్దనా! సౌమ్యమైన ఈ నీ మనుష్య రూపాన్ని గాంచి నా చిత్తం ప్రసన్నత పొందింది, స్వస్థుడనయ్యాను. 51

*శ్రీభగవానువాచ :*

**సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ ।**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాఙ్క్షిణః ॥ 52**

*సుదుర్దర్శమ్, ఇదమ్, రూపమ్, దృష్టవాన్, అసి, యత్, మమ, దేవాః, అపి, అస్య, రూపస్య, నిత్యమ్, దర్శన కాంక్షిణః.*

| | | | |
|---|---|---|---|
| మమ | = నా; | సుదుర్దర్శమ్ | = అత్యంత దుర్దర్శమైన; |
| ఇదమ్ | = ఈ; | యత్ | = ఏ; |

| | | | |
|---|---|---|---|
| రూపమ్ | = విశ్వరూపాన్ని; | రూపస్య | = విశ్వరూపాన్ని; |
| దృష్టవాన్ అసి | = చూసావో; | నిత్యమ్ | = సర్వదా; |
| దేవాః అపి | = దేవతలు కూడా; | దర్శన-కాంక్షిణః | = చూడగోరతారు. |
| అస్య | = ఈ; | | |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* నీవు చూసిన ఈ విశ్వరూపాన్ని చూడడం అత్యంత దుర్లభం; దేవతలు కూడా నిత్యం ఈ రూపాన్ని దర్శింప ఆకాంక్షిస్తారు. 52

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53**

*న, అహమ్, వేదైః, న, తపసా, న, దానేన, న, చ, ఇజ్యయా,*
*శక్యః, ఏవం విధః, ద్రష్టుమ్, దృష్టవాన్, అసి, మామ్, యథా.*

| | | | |
|---|---|---|---|
| యథా | = ఏ రూపంలో; | తపసా | = తపస్సుచేత గాని; |
| మామ్ | = నన్ను; | దానేన | = దానంతో గాని; |
| దృష్టవాన్ అసి | = చూసావో; | ఇజ్యయా చ | = యజ్ఞంచేత గాని; |
| ఏవం విధః | = ఈ రూపంలో; | ద్రష్టుమ్ | = చూడ; |
| అహమ్ | = నేను; | న శక్యః | = సాధ్యుణ్ణి కాను. |
| వేదైః | = వేదాలచేత గాని; | | |

**తా॥** నీకు లభించిన ఈ విశ్వరూప దర్శనం, తపో దాన వేద యజ్ఞాల[1] వల్ల కూడా కలుగదు. 53

**భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప ॥ 54**

*భక్త్యా, తు, అనన్యయా, శక్యః, అహమ్, ఏవం విధః, అర్జున,*
*జ్ఞాతుమ్, ద్రష్టుమ్, చ, తత్త్వేన, ప్రవేష్టుమ్, చ, పరంతప.*

---

1. ఇక్కడ తపోదానవేదయజ్ఞములు నిందింపబడినవని, వాని ఆవశ్యకత లేదని తలచరాదు; ఈ శ్లోక తాత్పర్యం అనన్యభక్తి ప్రశంస. తపోదాన వేదయజ్ఞాదులు చిత్తశుద్ధిని కలిగించి భక్తి కలగడానికి సాహాయకాలు అవుతాయి. – శ్రీమద్భాగవతమ్ 11-14-20 చూ.

| | | | |
|---|---|---|---|
| పరన్తప | = శత్రుతాపనా; | జ్ఞాతుమ్ | = తెలుసుకోవడానికి; |
| అర్జున | = అర్జునా; | ద్రష్టుం చ | = సాక్షాత్కరించుకోవడానికి; |
| తు | = కేవలం; | ప్రవేష్టుం చ | = ప్రవేశించడానికి (ఐక్యమునందుటకు); |
| అనన్యయా | = అనన్యమైన; | | |
| భక్త్యా | = భక్తిచేతనే; | అహమ్ | = నేను; |
| ఏవం విధః | = ఈ రీతిగా; | శక్యః | = అలవియగుదును. |
| తత్త్వేన | = యథార్థంగా; | | |

**తా॥** అర్జునా! యథార్థంగా నన్ను గురించిన శాస్త్రజ్ఞానమూ, ప్రత్యక్ష సాక్షాత్కారమూ, తాదాత్మ్యమైన మోక్షమూ కేవలం అనన్యభక్తి[1] వల్లనే సంభవ మవుతుంది. పరంతపా! అనన్యభక్తి ఒక్కటే విశ్వరూపాన్ని దర్శింప జేయగలదు. 54

**మత్కర్మకృన్ మత్పరమః మద్భక్తస్సఙ్గవర్జితః ।**
**నిర్వైర స్సర్వ భూతేషు యస్స మామేతి పాణ్డవ ॥ 55**

*మత్ కర్మకృత్, మత్ పరమః, మద్భక్తః, సంగవర్జితః,*
*నిర్వైరః, సర్వ భూతేషు, యః, సః, మామ్, ఏతి, పాండవ.*

| | | | |
|---|---|---|---|
| పాండవ | = అర్జునా; | మత్ భక్తః | = నన్నే భజించువాడో; |
| యః | = ఎవడు; | సర్వభూతేషు | = సర్వజీవులయెడ; |
| మత్ కర్మకృత్ | = నా నిమిత్తం కర్మలను ఆచరిస్తాడో; | నిర్వైరః | = శత్రుభావం లేనివాడో; |
| | | సః | = అతడు; |
| మత్ పరమః | = నేనే పరమగతిగా కలవాడో; | మామ్ | = నన్ను; |
| సఙ్గ వర్జితః | = ధనమిత్రపుత్రాదులపై ఆసక్తి విడిచినవాడో; | ఏతి | = పొందుతాడు. |

**తా॥** పాండవా! నా నిమిత్తం మాత్రమే కర్మలను ఆచరిస్తూ, నన్నే పరమ పురుషార్థంగా తలుస్తూ, ధన మిత్ర పుత్రాదుల యందు ఆసక్తి లేక, నన్నే ఆశ్రయించుకుని, సర్వజీవుల యెడల (తనకు అత్యంత అపకారం ఒనర్చేవారి

1. ఈ భక్తి లభించిన ఇంద్రియాలకు వాసుదేవుడు గాక మరేదీ కూడా గోచరించదు. –శ్రీ శంకరులు.

యెడ కూడా) వైరభావం లేకుండే వాడు నన్ను పొందగలడు.

(శ్రీమద్భాగవతమ్ 11-14-16 చూ.) 55

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపదర్శన యోగో నామ**
**ఏకాదశోఽధ్యాయః**

శ్లోకసంఖ్య - 55; మొదటి నుండి (414+ 55) 469.

**దేవై రపి సుదుర్దర్శం తపోయజ్ఞాదికోటిభిః ।**
**భక్తాయ భగవా నేవం విశ్వరూప మదర్శయత్ ॥**

**తా॥** దేవతలకూ, తపోయజ్ఞాది కర్మలకు కూడా సాధ్యం కాని విశ్వరూపాన్ని భక్తుడైన అర్జునునికి భగవంతుడు దర్శింపజేసెను.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## ద్వాదశోఽధ్యాయః - భక్తి యోగః

## (ద్వాదశాధ్యాయం - భక్తి యోగం)

నిర్గుణోపాసన స్యేవం సగుణోపాసనస్య చ ।
శ్రేయః కతర ది త్యేత న్నిర్ణేతుం ద్వాదశోద్యమః ॥[1]

---

అర్జున ఉవాచ :

**ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే**
**యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ 1**

ఏవమ్, సతతయుక్తాః, యే, భక్తాః, త్వామ్, పర్యుపాసతే,
యే, చ, అపి, అక్షరమ్, అవ్యక్తమ్, తేషామ్, కే, యోగవిత్ తమాః.

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు; | పర్యుపాసతే | = ధ్యానిస్తున్నారో; |
| ఉవాచ | = పలికెను; | యే చ అపి | = మరియు (ఎవరు); |
| ఏవమ్ | = ఈ విధంగా (సర్వకర్మార్పణం చేస్తూ); | అవ్యక్తమ్ | = నిర్గుణము (నిర్విశేషమైన); |
| | | అక్షరమ్ | = బ్రహ్మన్ని (ధ్యానిస్తున్నారో); |
| సతత యుక్తాః | = నిరంతర నిష్ఠలవుతూ; | తేషామ్ | = వీరిలో; |
| యే భక్తాః | = ఏ భక్తులు; | యోగ విత్ తమాః | = యోగజ్ఞశ్రేష్ఠులు; |
| త్వామ్ | = నిన్ను(విశ్వరూపుని); | కే | = ఎవరు?; |

1. సగుణ, నిర్గుణోపాసనలలో ఏది శ్రేయస్కరమనే విషయం నిర్ణయింప ఈ ద్వాదశాధ్యాయం ఆరంభింపబడుతోంది.

**తా॥** [పూర్వాధ్యాయాంతంలో "నా కొరకు కర్మలను ఆచరించేవాడూ" (11-55) అనే శ్లోకంలోనూ, "కౌంతేయా! ప్రతిజ్ఞాపూర్వకంగా ప్రవచించు" (9-31) అనే శ్లోకంలోనూ భక్తినిష్ఠని శ్రేష్ఠత్వం చెప్పబడింది. ఇదేవిధంగా, "ఈ నలుగురు భక్తులలో నిత్యయుక్తుడూ, ఏకనిష్ఠుడూ అయిన జ్ఞానియే శ్రేష్ఠుడు" (7-17) అనే శ్లోకంలోనూ, "ఈ బ్రహ్మజ్ఞానమనే తెప్ప చేత ధర్మాధర్మాల నన్నిటిని దాటినవాడవు కాగలవు" (4-36) అనే శ్లోకంలోనూ జ్ఞాననిష్ఠ ప్రశంసించబడింది. ఇటువంటివే అయిన పెక్కు శ్లోకాలు భక్తినిష్ఠను, జ్ఞాననిష్ఠను ప్రశంసిస్తున్నాయి. వీటి ప్రాముఖ్యతకు సంబంధించిన ఇతర విశేషాలను తెలుసుకో గోరుతూ–] *అర్జునుడు పలికెను :* ఈ విధంగా సర్వ కర్మార్పణం చేస్తూ నిరంతరనిష్ఠులై విశ్వరూపాన్ని (సగుణ బ్రహ్మం) ఉపాసించే భక్తుల విశేషమేమి? మరియు, సమస్త వాసనలను కర్మలనూ పరిత్యజించి సర్వోపాధి రహితమూ, ఇంద్రియాతీతమూ అయిన అక్షర బ్రహ్మాన్ని (నిర్గుణ బ్రహ్మం) ఉపాసించే వారి వైశిష్ట్యమేమిటి? ఈ ఇరువురిలో శ్రేష్ఠుడైన యోగి ఎవరు ? 1

*శ్రీ భగవానువాచ :*

**మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**
**శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥** 2

*మయి, ఆవేశ్య, మనః, యే, మామ్, నిత్యయుక్తాః, ఉపాసతే,*
*శ్రద్ధయా, పరయా, ఉపేతాః, తే, మే, యుక్తతమాః, మతాః*

| | | | |
|---|---|---|---|
| యే | = ఎవరు; | మామ్ | = నన్ను; |
| మయి | = నాయందు; | ఉపాసతే | = ఉపాసిస్తున్నారో; |
| మనః ఆవేశ్య | = మనస్సును నిలిపి; | తే | = వారు; |
| నిత్య యుక్తాః | = ఏకనిష్ఠులై; | యుక్త తమాః | = శ్రేష్ఠులైన యోగులని; |
| పరయా | = ఉత్తమమైన; | మే | = నాచే; |
| శ్రద్ధయా ఉపేతాః | = శ్రద్ధతో గూడి; | మతాః | = తలంపబడినవారు. |

**తా॥** *శ్రీభగవానుడు పలికెను:* ఎవరు ఏకనిష్ఠులై పరమ శ్రద్ధతో నా విశ్వరూపంపై మనస్సును నిలిపి, సర్వజ్ఞుణ్ణి, పరమేశ్వరుణ్ణీ అయిన నన్ను భజిస్తున్నారో, వారు శ్రేష్ఠులైన యోగులని నా అభిప్రాయం. (గీత 6-47 చూ.)2

**యే త్వక్షరమనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ 3**

*యే, తు, అక్షరమ్, అనిర్దేశ్యమ్, అవ్యక్తమ్, పర్యుపాసతే,*
*సర్వత్రగమ్, అచింత్యమ్, చ, కూటస్థమ్, అచలమ్, ధ్రువమ్.*

**సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।**
**తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥ 4**

*సంనియమ్య, ఇంద్రియగ్రామమ్, సర్వత్ర, సమబుద్ధయః,*
*తే, ప్రాప్నువంతి, మామ్, ఏవ, సర్వభూతహితే, రతాః.*

తు = కాని;
యే = ఎవరు;
సర్వత్ర = అన్నింట;
సమ బుద్ధయః = సమబుద్ధికలిగి;
సర్వ భూత హితే రతాః = సకలప్రాణుల శ్రేయమందూ ఆసక్తులై;
ఇంద్రియ గ్రామమ్ = ఇంద్రియ సమూహాన్ని;
సంనియమ్య = నిగ్రహించి;
అ-నిర్దేశ్యమ్ = సూచింప వీలు కానిదీ;
అవ్యక్తమ్ = ప్రమాణాతీతమూ;
సర్వత్ర గమ్ = సర్వవ్యాపీ;
అచింత్యమ్ = మనస్సుకు అందనిదీ;
కూట స్థమ్ = మాయకు అధిష్ఠానమై వెలయునదీ;
అచలమ్ = స్థిరమూ;
ధ్రువమ్ చ = నిత్యమూ అయిన;
అక్షరమ్ = నిర్గుణబ్రహ్మాన్ని;
పర్యుపాసతే = ఉపాసిస్తున్నారో;
తే = వారు;
మామ్ ఏవ = నన్నే;
ప్రాప్నువంతి = పొందుతున్నారు.

**తా॥** కాని ఎవరు ఎల్లప్పుడూ ఇష్ట-అయిష్ట ప్రాప్తియందు కూడా సమబుద్ధులై, జగద్ధితమున నియుక్తులై ఇంద్రియనిగ్రహ పూర్వకంగా అనిర్వచనీయమూ, అప్రమేయమూ, ప్రమాణాతీతమూ, కూటస్థమూ[1], అచలమూ, నిత్యమూ, ఆకాశం వలే సర్వవ్యాపి అయిన నిర్గుణబ్రహ్మాన్ని[2] ఉపాసిస్తున్నారో, వారు నన్నే పొందుతారు. (*గీత* 7-18 *చూ:*) 3-4

---

1. కూటస్థమ్ = మాయామయమైన జగత్తుకు అధిష్ఠానమై, గిరిశృంగం వలె నిశ్చలంగా ఉండేది.
2. ఉపాసనం నామ యథా శాస్త్రం ఉపాస్యస్య అర్థస్య విషయీకరణేన సామీప్య ఉపగమ్య తైలధారావత్సమానప్రత్యయ ప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం, తదుపాసనం ఆచక్షతే. – శ్రీశంకరులు.

**క్లేశో౽ధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥** **5**

*క్లేశః, అధికతరః, తేషామ్, అవ్యక్త ఆసక్తచేతసామ్,*
*అవ్యక్తా, హి, గతిః, దుఃఖమ్, దేహవద్భిః, అవాప్యతే.*

| | | | |
|---|---|---|---|
| తేషామ్ | = ఆ; | దేహవద్భిః | = దేహాభిమానం కలవారిచే; |
| అవ్యక్త ఆసక్త చేతసామ్ | = నిర్గుణబ్రహ్మ నిష్ఠులైన యోగులకు; | అవ్యక్తా | = నిర్గుణబ్రహ్మ విషయమైన; |
| క్లేశః | = శ్రమ; | గతిః | = నిష్ఠ; |
| అధికతరః | = చాలా ఎక్కువ; | దుఃఖమ్ | = కష్టంతో; |
| హి | = ఏమన; | అవాప్యతే | = పొందబడుతోంది. |

**తా॥** ఎవరి చిత్తం నిర్గుణబ్రహ్మంపై ఆసక్తమవుతోందో వారి క్లేశం అధికతరం; ఎందుకంటే, దేహాభిమానులైన వారికి నిర్గుణబ్రహ్మ నిష్ఠ లభించడం అత్యంత కష్టతరం. ఇదియే నిర్గుణోపాసనలో విశేషం. (అధికారి అయితే ఇది శ్రేష్ఠమే). 5

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥** **6**

*యే, తు, సర్వాణి, కర్మాణి, మయి, సన్న్యస్య, మత్పరాః,*
*అనన్యేన, ఏవ, యోగేన, మామ్, ధ్యాయంతః, ఉపాసతే.*

**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్ ॥** **7**

*తేషామ్, అహమ్, సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్,*
*భవామి, న చిరాత్, పార్థ, మయి, ఆవేశిత చేతసామ్.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | సర్వాణి | = అన్నింటినీ; |
| తు | = కాని; | మయి | = నా యందు; |
| యే | = ఎవరు; | సన్న్యస్య | = అర్పించి; |
| కర్మాణి | = కర్మలను; | మత్పరాః | = నాయందాసక్తితో; |

అనన్యేన = ఐకాంతికమైన;
యోగేన ఏవ = భక్తియోగంతో;
మామ్ = నన్ను;
ధ్యాయంతః = ధ్యానిస్తూ;
ఉపాసతే = ఉపాసిస్తున్నారో;
తేషామ్ = అటువంటి;
మయి ఆవేశిత చేతసామ్ = నాయందు ఆవిష్టమైన చిత్తం గలవారిని;
మృత్యు సంసార సాగరాత్ = జనన మరణరూపమైన సంసార సముద్రం నుండి;
న చిరాత్ = శీఘ్రంగానే;
అహమ్ = నేను;
సముద్ధర్తా భవామి = ఉద్ధరించేవాణ్ణి అవుతాను;

**తా॥** (కాని, నా భక్తులు నా ప్రసాదంతో అనాయాసంగానే సిద్ధిని పొందుతున్నారు.) పార్థా ! ఎవరు సమస్తకర్మలనూ నాకు అర్పించి, నా యందు ఆసక్తితో, ఐకాంతికమైన భక్తియోగంతో[1] నన్ను ధ్యానిస్తూ[2] ఉపాసిస్తున్నారో, నా యందు ఆవిష్ట-చిత్తులైన అటువంటి వారిని శీఘ్రంగానే జననమరణరూపమైన సంసార సాగరం నుండి ఉద్ధరిస్తున్నాను.[3] 6-7

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8**

మయి, ఏవ, మనః, ఆధత్స్వ, మయి, బుద్ధిమ్, నివేశయ,
నివసిష్యసి, మయి, ఏవ, అతః, ఊర్ధ్వమ్, న, సంశయః.

మయి ఏవ = నా యందే;
మనః = చిత్తాన్ని;
ఆధత్స్వ = నెలకొల్పు;
మయి = నా యందు;
బుద్ధిమ్ = బుద్ధిని కూడా;
నివేశయ = నిలుపు;
అతః ఊర్ధ్వమ్ = ఇక మీదట (శరీర త్యాగానంతరం);
మయి ఏవ = నాయందే;
నివసిష్యసి = నివసించెదవు (ఈ విషయంలో);
న సంశయః = సందేహం లేదు.

---

1. సర్వాత్ముడూ, విశ్వరూపుడూ అయిన పరమేశ్వరుడు గాక, మరి ఇతర అవలంబనం లేని యోగం.

2. భగవంతుని సగుణ-జగదాత్మ రూపం గాని, లేక శ్రీకృష్ణ, రాఘవ, నృసింహ, ద్విభుజ, చతుర్భుజ రూపాలను గాని ధ్యానిస్తూ- - శ్రీమధుసూదన సరస్వతి

3. జ్ఞానీ, భక్తుడూ ఇద్దరూ భగవంతుణ్ణే పొందుతున్నారు. జ్ఞాని నా ఆత్మ అని భగవంతుడు చెప్పియే ఉన్నాడు. భగవంతుని రూపాలలో ఒకటి శ్రేష్ఠం మరొకటి నికృష్టం అని కాదు. కనుక, సగుణ-ఆరాధకులు కూడా ఉద్ధరింపబడతారు.

**తా॥** కనుక, నీవు నాయందు మనస్సును నిలుపు; నా యందే బుద్ధిని ఏకాగ్ర మొనర్చు. ఈ విధంగా చేస్తే, దేహాంతంలో నీవు నాయందే వసించగలవు. ఈ విషయంలో సందేహం లేదు. 8

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ ॥ 9**

*అథ, చిత్తమ్, సమాధాతుమ్, న, శక్నోషి, మయి, స్థిరమ్,*
*అభ్యాసయోగేన, తతః, మామ్, ఇచ్ఛ, ఆప్తుమ్, ధనంజయ.*

| | | | |
|---|---|---|---|
| ధనంజయ | = అర్జునా; | తతః | = మరి; |
| అథ | = ఇక; | అభ్యాస యోగేన | = అభ్యాసమనే ఉపాయాన్ని అవలంబించి; |
| మయి | = నా యందు; | మామ్ | = నన్ను; |
| చిత్తమ్ | = మనస్సును; | ఆప్తుమ్ | = పొంద; |
| స్థిరమ్ | = స్థిరంగా; | ఇచ్ఛ | = కోరుము. |
| సమాధాతుమ్ | = నిలపడానికి; | | |
| న శక్నోషి | = సమర్థుడవు కానిచో; | | |

**తా॥** ధనంజయా! నీవు నాయందు చిత్తాన్ని స్థిరంగా నిల్పజాలకపోతే, అభ్యాస-యోగంతో[1] నన్ను పొందడానికి ప్రయత్నించు. 9

**అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ 10**

*అభ్యాసే, అపి, అసమర్థః, అసి, మత్కర్మ పరమః, భవ,*
*మత్ అర్థమ్, అపి, కర్మాణి, కుర్వన్, సిద్ధిమ్, అవాప్స్యసి.*

| | | | |
|---|---|---|---|
| అభ్యాసే అపి | = ఈ అభ్యాసం చేయడానికి కూడా; | మత్ అర్థం | = నా నిమిత్తం; |
| అసమర్థః అసి | = సమర్థుడవు కాకపోతే; | కర్మాణి | = కర్మలను; |
| మత్కర్మ పరమః | = నా కర్మలను ఆచరించేవాడవు; | కుర్వన్ అపి | = ఆచరిస్తున్నా కూడా; |
| భవ | = కమ్ము; | సిద్ధిమ్ | = సిద్ధిని; |
| | | అవాప్స్యసి | = పొందుతావు. |

1. విషయాలన్నింటి నుండి మనస్సును మరల్చి, ఒకానొక దేవత యొక్క మానసమూర్తియందు గాని ప్రతిమయందు గాని మనస్సును నిల్పడానికి ఎడ తెగకుండా ఒనర్చే ప్రయత్నమే అభ్యాసం.

**తా॥** ఇలాంటి అభ్యాసం ఒనర్చడానికి కూడా నీవు సమర్థుడవు కాకపోతే, భగవత్ప్రీతికరమైన కర్మలను ఆచరించు; ఇటువంటి కర్మలను[1] ఆచరిస్తూ ఉన్నా నీవు సిద్ధిని పొందగలవు. 10

**అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11**

*అథ, ఏతత్, అపి, అశక్తః, అసి, కర్తుమ్, మద్ యోగమ్, ఆశ్రితః, సర్వకర్మ ఫలత్యాగమ్, తతః, కురు, యత్ ఆత్మవాన్.*

| | | | |
|---|---|---|---|
| అథ | = ఇక; | యత ఆత్మవాన్ | = సంయత చిత్తుడవై; |
| ఏతత్ అపి | = దీనిని కూడా; | మద్ యోగమ్ | = నా శరణాగతిని; |
| కర్తుమ్ | = ఆచరించడానికి; | ఆశ్రితః | = అవలంబించి; |
| అశక్తః | = అసమర్థుడవు; | సర్వకర్మ ఫలత్యాగమ్ కురు | = దృష్ట-అదృష్ట విషయ ఫలాలను, నిత్యకర్మల ఫలాలను త్యజించు. |
| అసి | = అయితే; | | |
| తతః | = మరి; | | |

**తా॥** (భగవద్ధర్మ నిష్ఠకు కూడా అత్యంత అసమర్థుడైన వానికి ఉపాయం చెప్పబడుతోంది-) ఈ విధంగా ఆచరించడానికి అసమర్థుడవైతే, నన్ను శరణు పొంది, చిత్తాన్ని నిగ్రహించి ("ఈశ్వరాజ్ఞా రూపమైన నిత్యనైమిత్తికాది కర్మలను అవశ్యం ఆచరించాలి, కాని ఫలాన్ని పరమేశ్వరార్పణ చేస్తున్నాను" అనే భావంతో) కర్మఫలాలను త్యజించు. (నా ప్రసాదంతో నీవు కృతార్థుడవు అవుతావు) 11

**శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానాత్కర్మ ఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనన్తరమ్ ॥ 12**

*శ్రేయః, హి, జ్ఞానమ్, అభ్యాసాత్, జ్ఞానాత్, ధ్యానమ్, విశిష్యతే, ధ్యానాత్, కర్మ ఫలత్యాగః, త్యాగాత్, శాంతిః, అనంతరమ్.*

| | | | |
|---|---|---|---|
| అభ్యాసాత్ | = వివేకరహితమైన అభ్యాసం కంటే; | శ్రేయః | = శ్రేష్ఠం; |
| జ్ఞానం హి | = జ్ఞానమే; | జ్ఞానాత్ | = యుక్తిపూర్వకమైన పరోక్ష జ్ఞానం కంటే; |

1. ఏకాదశీ-ఉపవాస, వ్రత, పూజా, నామసంకీర్తనాదికాలు.

| | | | |
|---|---|---|---|
| ధ్యానమ్ | = ధ్యానం; | త్యాగాత్ అనన్తరమ్ | = ఇట్టి త్యాగం చేసిన వెంటనే; |
| విశిష్యతే | = మంచిది; | శాంతిః | = సంసారోపరమరూపమైన శాంతి (లభిస్తుంది). |
| ధ్యానాత్ | = ఇట్టిధ్యానం కన్నా (అజ్ఞులైన వారికి); | | |
| కర్మఫలత్యాగః | = కర్మఫలత్యాగం (నిష్కామ కర్మ); | | |

**తా॥** (ఈ కర్మఫలత్యాగాన్నే స్తుతిస్తున్నాడు–) జ్ఞానరహితమైన అభ్యాసం కంటే, యుక్తిసహితంగా ఉపదేశింపబడే జ్ఞానం శ్రేష్ఠం. ఇటువంటి తత్త్వనిశ్చయం కన్నా (తత్త్వసాక్షాత్కార కారణమవడం వల్ల) ధ్యానం శ్రేష్ఠం. (ధ్యానాసమర్థుని పట్ల) ధ్యానం కన్నా ఆసక్తి–నివృత్తిని కలిగించే, కర్మఫలత్యాగం మంచిది. కర్మ ఫలాన్ని త్యజిస్తే వెంటనే సంసారోపరమరూపమైన శాంతి (చిత్తశుద్ధి ద్వారా) లభిస్తుంది. 12

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమ దుఃఖసుఖః క్షమీ ॥ 13**

*అద్వేష్టా, సర్వభూతానామ్, మైత్రః, కరుణ, ఏవ, చ,*
*నిర్మమః, నిరహంకారః, సమ దుఃఖ సుఖః, క్షమీ.*

**సన్తుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్త స్స మే ప్రియః ॥ 14**

*సంతుష్టః, సతతమ్, యోగీ, యతాత్మా, దృఢనిశ్చయః,*
*మయి, అర్పిత మనోబుద్ధిః, యః, మద్భక్తః, సః, మే, ప్రియః.*

| | | | |
|---|---|---|---|
| సర్వ భూతానాం | = సకల ప్రాణుల యందూ; | నిరహంకారః | = అహంకారం లేనివాడూ; |
| అద్వేష్టా | = ద్వేష భావం లేనివాడూ; | సమ దుఃఖ సుఖః | = సుఖదుఃఖాల పట్ల సమానబుద్ధి కలవాడూ; |
| మైత్రః | = మిత్ర భావం కలవాడూ; | క్షమీ | = క్షమాశీలుడూ; |
| కరుణః | = దయ కలవాడూ; | సతతమ్ | = ఎల్లప్పుడూ; |
| నిర్మమః ఏవ చ | = మమకారం లేనివాడూ; | సంతుష్టః | = సంతోషం కలవాడూ; |
| | | యోగీ | = సమాహిత చిత్తుడూ; |

| | | | |
|---|---|---|---|
| యతాత్మ | = సంయత స్వభావుడూ; | యః | = ఎవడో; |
| దృఢ నిశ్చయః | = దృఢ సంకల్పం కలవాడూ; | సః | = అతడు; |
| మయి అర్పిత మనః బుద్ధిః | = నా యందు మనస్సును, బుద్ధిని అర్పించినవాడూ; | మే | = నాకు; |
| | | ప్రియః | = ఇష్టుడు; |
| మద్భక్తః | = నా భక్తుడైన వాడు; | | |

**తా॥** ఏ ప్రాణిపైనా ద్వేషం లేనివాడూ, మిత్ర భావాపన్నుడూ, దయాళువూ, మమత్వబుద్ధి శూన్యుడూ, క్షమాశీలుడూ, సర్వదా సంతోషం కలిగి ఉండే వాడూ, సమాహిత చిత్తుడూ, సంయతస్వభావుడూ, తత్త్వవిషయాలలో ధృఢ నిశ్చయం గలవాడూ, మనోబుద్ధులను నాకు అర్పించినవాడూ అయిన భక్తుడు నాకు ప్రియతముడు. 13-14

**యస్మా న్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షామర్ష భయోద్వేగైః ముక్తో య స్స చ మే ప్రియః ॥ 15**

*యస్మాత్, న, ఉద్విజతే, లోకః, లోకాత్, న, ఉద్విజతే, చ, యః,*
*హర్ష అమర్ష భయ ఉద్వేగైః, ముక్తః, య, సః, చ, మే, ప్రియః.*

| | | | |
|---|---|---|---|
| యస్మాత్ | = ఎవరి నుండి; | హర్ష అమర్ష భయ ఉద్వేగైః ముక్తః | = ఆనందం నుండీ అసూయ నుండీ భయం నుండీ సంక్షోభం నుండీ విడివడినవాడో; |
| లోకః | = జనతతి; | | |
| న ఉద్విజతే | = భయం పొందదో; | | |
| యః చ | = మరియు, ఎవడు; | | |
| లోకాత్ | = జనతతి నుండి; | సః | = అతడు; |
| న ఉద్విజతే | = సంక్షోభం పొందడో; | మే | = నాకు; |
| యః చ | = మరియు, ఎవడు; | ప్రియః | = ఇష్టుడు. |

**తా॥** ఎవడు ఎవ్వరికి ఉద్వేగాన్ని కలిగింపకుంటాడో, ఎవడు ఎవ్వరి నుండీ ఉద్వేగాన్ని పొందడో, మరియు ఎవ్వడు ఆనంద, విషాద, భయ, సంక్షోభాల నుండి విడివడిన వాడో- అతడు నాకు ప్రియమైనవాడు.

(శ్రీమద్భాగవతమ్ 11-18-31 చూ:) 15

**అనపేక్ష శ్శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥ 16**

అనపేక్షః, శుచిః, దక్షః, ఉదాసీనః, గతవ్యథః,
సర్వ ఆరంభ పరిత్యాగీ, యః, మద్భక్తః, సః, మే, ప్రియః.

యః = ఏ;
మద్భక్తః = నా భక్తుడు;
అనపేక్షః = దేహేంద్రియ విషయాలపై కోర్కె లేనివాడో (యదృచ్ఛగా లభించిన విషయాలలో కూడా ఆశించడో);
శుచిః = బాహ్యాభ్యంతర పరిశుద్ధి గలవాడో;
దక్షః = యథాప్రాప్త కార్యాచరణ సమర్థుడో;
ఉదాసీనః = పక్షపాతశూన్యుడో;
గత వ్యథః = భయరహితుడో (మనోవైకల్య రహితుడో);
సర్వ ఆరంభ పరిత్యాగీ = సకామ కర్మానుష్ఠాన త్యాగియో;
సః = అతడు;
మే = నాకు;
ప్రియః = ఇష్టుడు.

**తా॥** నిస్పృహుడూ, బాహ్యాభ్యంతర శౌచసంపన్నుడూ, దక్షుడూ, పక్షపాత శూన్యుడూ, సర్వ సకామకర్మత్యాగీ అయిన భక్తుడు నాకు ఇష్టుడు. 16

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి ।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్య స్స మే ప్రియః ॥ 17**

యః, న, హృష్యతి, న, ద్వేష్టి, న, శోచతి, న, కాంక్షతి,
శుభ అశుభపరిత్యాగీ, భక్తిమాన్, యః, సః, మే, ప్రియః.

యః = ఏ;
భక్తిమాన్ = భక్తుడు;
న హృష్యతి = ఇష్టప్రాప్తికి సంతోషించడో;
న ద్వేష్టి = అనిష్టప్రాప్తిని ద్వేషించడో;
న శోచతి = ఇష్టవస్తువు నష్టమైతే శోకించడో;
న కాంక్షతి = అప్రాప్తాన్ని వాంఛించడో;
(మరియు),యః = ఎవడు;
శుభ అశుభ పరిత్యాగీ = శుభ అశుభ కర్మలను (పుణ్యాపాపాలను) పరిత్యజించిన వాడో;
సః = అతడు;
మే = నాకు;
ప్రియః = ఇష్టుడు.

**తా॥** శుభం చేకూరితే సంతోషపడదు, కీడు వాటిల్లితే ద్వేషాన్ని పొందదు, ఇష్టవియోగమైనా దుఃఖించదు, తనకు లేని వస్తువును కోరదు, పుణ్య పాపాలను ఇచ్చే కర్మలను ఆచరించదు - ఇలాంటి భక్తుణ్ణి నేను ప్రేమిస్తాను. 17

**సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సఙ్గ వివర్జితః ॥ 18**

సమః, శ్శత్రౌ, చ, మిత్రే, చ, తథా, మాన అవమానయోః,
శీత ఉష్ణ సుఖదుఃఖేషు, సమః, సంగ వివర్జితః.

**తుల్య నిందాస్తుతిర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ ।**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః ॥ 19**

తుల్య నిందా స్తుతిః, మౌనీ, సంతుష్టః, యేన, కేనచిత్,
అనికేతః, స్థిరమతిః, భక్తిమాన్, మే, ప్రియః, నరః.

| | | | |
|---|---|---|---|
| శత్రౌ చ మిత్రే చ | =శత్రుమిత్రుల పట్ల; | మౌనీ | = వాక్సంయమం కలవాడూ; |
| సమః | = సమభావం కలవాడూ; | యేన కేనచిత్ | = ఒకించుక ఏమి లభించినా; |
| తథా | = అదే విధంగా; | సంతుష్టః | = తృప్తిచెందే వాడూ; |
| మాన అవమానయోః | = పూజాపరాభవాల పట్ల; | అనికేతః | = నిర్దిష్టమైన వాసస్థానం లేనివాడూ; |
| శీత ఉష్ణ సుఖ దుఃఖేషు | = శీతోష్ణ సుఖ దుఃఖాల యెడనూ; | స్థిర మతిః | = నిశ్చల చిత్తుడూ; |
| సమః | = సమంగా భావించేవాడూ; | భక్తిమాన్ | = భక్తియుక్తుడూ అయిన; |
| తుల్య నిందా స్తుతిః | = ప్రశంసను,నిందను సమంగా గ్రహించేవాడూ; | నరః | = నరుడు; |
| | | మే | = నాకు; |
| సంగ వివర్జిత ః | = ఆసక్తిరహితుడూ; | ప్రియః | = ఇష్టుడు. |

**తా॥** శత్రుమిత్రులు, పూజాపరాభవాలు, శీతోష్ణ సుఖదుఃఖాలు, నిందా స్తుతులు - వీటి యెడ సమదృష్టి కలిగి, లభించిన ఏ కొద్ది తోడనో పరితృప్తిని పొందుతూ[1], మౌనియై, స్థిరనివాసం లేక, నిశ్చలచిత్తాన్నీ, భక్తినీ కలిగి ఉండే వ్యక్తి నాకు ప్రియమైనవాడు. 18-19

**యే తు ధర్మ్యామృత మిదం[2] యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ 20**

యే, తు, ధర్మ్యామృతమ్, ఇదమ్, యథా, ఉక్తమ్, పర్యుపాసతే,
శ్రద్ధధానాః, మత్పరమాః, భక్తాః, తే, అతీవ, మే, ప్రియాః.

---

1. యేనకేనచి దాచ్ఛన్నో యేనకేనచి దాశితః,
యత్రక్వచన శాయీ స్యా త్తం దేవాః బ్రాహ్మణం విదుః - శాంతి పర్వ. 245-12
2. ధర్మ్యామృతం. - పాఠాంతరం

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | ధర్మ్యామృతమ్ | = అమృతతుల్యమైన ధర్మాన్ని; |
| యే | = ఏ; | పర్యుపాసతే | = అనుష్ఠిస్తున్నారో (సేవిస్తున్నారో); |
| భక్తాః | = భక్తులు; | తే | = వారు; |
| శ్రద్దధానాః | = శ్రద్ధావంతులై; | మే | = నాకు; |
| మత్పరమాః | = నాయందాసక్తులై; | అతీవ ప్రియాః | = అత్యంత ఇష్టులు. |
| యథా-ఉక్తమ్ | = చెప్పబడిన రీతిని: | | |
| ఇదమ్ | = ఈ; | | |

**తా॥** కాని ఎవరు శ్రద్ధావంతులూ మత్పరాయణులూ అయ్యి ఈ అమృత తుల్యమైన ధర్మాన్ని[1] (అమృతత్వ సాధకమైన ధర్మాన్ని, ధర్మామృతాన్ని) చెప్పబడిన రీతిగా అనుష్ఠిస్తున్నారో, అట్టి భక్తులు నాకు అత్యంత[2] ప్రియమైనవారు. 20

**ఇతి శ్రీ మద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగో నామ**
**ద్వాదశోఽధ్యాయః**

శ్లోకసంఖ్య- 20; మొదటినుండి (469+20) 489

**దుఃఖ మవ్యక్తవ ర్త్మైత ద్బహువిఘ్న మతో బుధః ।**
**సుఖం కృష్ణపదాంభోజం భక్తిసత్పథవా న్భజేత్ ॥**

**తా॥** అవ్యక్తోపాసన కష్టతరం, విఘ్నబహుళం; కనుక భక్తి సత్పథాన్ని అవలంబించి బుధుడు సుఖంగా శ్రీకృష్ణ పదాంభోజాలను భజిస్తాడు గాక !



1. ధారణాద్ధర్మమిత్యాహుర్ధర్మో ధారయతే ప్రజాః ।
యత్స్యాద్ధారణ సంయుక్తం సధర్మ ఇతి నిశ్చయః ॥ – కర్ణ పర్వ 69-59.

2. ఇక్కడ భక్తునికి ఉండవలసిన నలభై రెండు కల్యాణగుణాలు వర్ణింపబడ్డాయి. పూర్వపూర్వశ్లోకాలలో కొన్ని గుణాలు చెప్పి, ఆయా గుణాలతో ఒప్పువాడు నాకు ప్రియుడు అని భగవంతుడు చెప్పాడు; కాని ఈ గుణాలన్నింటితో శోభిల్లువాడు నాకు అత్యంత ప్రియుడు అని భగవంతుని అభిప్రాయం – ఈ రీతిగా చమత్కరించుకోవచ్చు.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## త్రయోదశోఽ ధ్యాయః - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగః

## (త్రయోదశాధ్యాయం - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం)

భక్తానా మహ ముద్ధర్తా సంసారా ది త్య వాది యత్ ।
త్రయోదశేఽ థ త త్సిద్ధ్యై తత్త్వజ్ఞాన ముదీర్యతే ॥[1]

—❦—

అర్జున ఉవాచ :

**ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ ।**
**ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥[2]** 0

ప్రకృతిమ్, పురుషమ్, చ, ఏవ, క్షేత్రమ్, క్షేత్రజ్ఞమ్, ఏవ, చ,
ఏతత్, వేదితుమ్, ఇచ్ఛామి, జ్ఞానమ్, జ్ఞేయమ్, చ, కేశవ.

| | | | |
|---|---|---|---|
| కేశవ | = కృష్ణా; | జ్ఞానమ్ | = జ్ఞానాన్ని; |
| ప్రకృతిమ్ | = ప్రకృతిని; | జ్ఞేయమ్ ఏవ చ | = జ్ఞేయాన్ని; |
| పురుషం చ | = పురుషుణ్ణి; | ఏతత్ | = దీనిని (ఎల్ల); |
| క్షేత్రమ్ | = క్షేత్రాన్ని; | వేదితుమ్ | = తెలుసుకోవాలని; |
| క్షేత్రజ్ఞం ఏవ చ | = క్షేత్రజ్ఞుణ్ణి; | ఇచ్ఛామి | = కోరుతున్నాను; |

**తా॥** అర్జునుడు పలికెను : కేశవా! ప్రకృతి పురుషులు, క్షేత్రక్షేత్రజ్ఞులు, జ్ఞానజ్ఞేయాలు - అనే విషయాలను తెలుసుకో కోరుతున్నాను. 0

---

1. 'భక్తులను నేను సంసారం నుండి సముద్ధరింతును' అని భగవంతుడు పలికి ఉన్నాడు; దీనిని సిద్ధింపజేయడానికి తత్త్వజ్ఞానం ఈ అధ్యాయంలో చెప్పబడుతోంది.

2. ఈ శ్లోకం పెక్కు ప్రతులలో లేదు. శ్రీశంకర, శ్రీధరులు కూడా ఈ శ్లోకాన్ని గ్రహించలేదు. కనుక, లెక్కింపబడ లేదు.

*శ్రీభగవానువాచ :*

**ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 1**

*ఇదమ్, శరీరమ్, కౌంతేయ, క్షేత్రమ్, ఇతి, అభిధీయతే,*
*ఏతత్, యః, వేత్తి, తమ్, ప్రాహుః, క్షేత్రజ్ఞః, ఇతి, తద్విదః.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | ఏతత్ | = దీనిని; |
| ఇదమ్ | = ఈ; | వేత్తి | = తెలుసుకొంటున్నాడో; |
| శరీరమ్ | = భోగాయతనమైన దేహం; | తద్విదః | = క్షేత్రక్షేత్రజ్ఞ వేత్తలు; |
| క్షేత్రమ్ | = క్షేత్రం; | తమ్ | = వానిని; |
| ఇతి | = అని; | క్షేత్రజ్ఞః | = క్షేత్రజ్ఞుడు; |
| అభిధీయతే | = చెప్పబడుతుంది; | ఇతి | = అని; |
| యః | = ఎవడు; | ప్రాహుః | = అంటారు. |

**తా॥** [పూర్వం "వారిని నేను మృత్యుసంసారసాగరం నుండి సముద్ధరిస్తాను" (12-7) అని భగవంతుని ప్రతిజ్ఞ. జ్ఞానం లేకుంటే సంసారోద్ధరణం సంభవం కాదు. కాబట్టి, ఈ ప్రకృతి-పురుష వివేకాధ్యాయం ఆరంభించబడుతోంది. ఏడవ అధ్యాయంలో పర-అపరములనే ప్రకృతి ద్వయం పేర్కొనబడింది; దీనిని ఎరుగకపోవడం వల్లే, జీవభావాన్ని పొందిన చిత్-అంశకు సంసృతి ఏర్పడుతోంది. ఈ ప్రకృతుల నుండే జీవభోగార్థం, ఈశ్వరుడు సృష్టి యందు ప్రవర్తిల్లుతున్నాడు. క్షేత్ర-క్షేత్రజ్ఞులనబడే ఆ పరాపర ప్రకృతులు రెండూ వేరు. వాటి తత్త్వాన్ని నిరూపించడానికి-] *శ్రీభగవానుడు పలికెను :* అర్జునా! భోగాయతనమైన[1] ఈ శరీరాన్నే (సంసారోత్పత్తి భూమియగుట వల్ల) 'క్షేత్రం' అని అంటారు. ఎవడు ఈ శరీరాన్ని[2] (నేను నాది అని) తెలుసుకుంటున్నాడో, అంటే స్వాభావిక జ్ఞాన విషయంగా గాని ఔపదేశిక జ్ఞాన విషయంగా గాని ఒనర్చుచున్నాడో[3], అతనిని (కృషీవలుని వలే ఫలభోక్త అగుటచే) క్షేత్రక్షేత్రజ్ఞ వేత్తలు[4] 'క్షేత్రజ్ఞుడు' అని అంటున్నారు. 1

1. ప్రత్యక్షాది ప్రమాణములవలన ఉపలభ్యమగు దృశ్యము.

2. పురుషుని భోగాపవర్గాల నిమిత్తం, ఈశ్వరుని త్రిగుణాత్మిక ప్రకృతి దేహేంద్రియ ఆకారంగా పరిణమించిన సంఘాతమే శరీరం. ఈ శరీరం స్థూల సూక్ష్మ రూపాలలో ద్వివిధం. →

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥ 2**

*క్షేత్రజ్ఞమ్, చ, అపి, మామ్, విద్ధి, సర్వక్షేత్రేషు, భారత,*
*క్షేత్ర క్షేత్రజ్ఞయోః, జ్ఞానమ్, యత్, తత్, జ్ఞానమ్, మతమ్, మమ.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | జ్ఞానమ్ | = జ్ఞానం; |
| సర్వక్షేత్రేషు అపి | = సర్వశరీరాలలోను; | యత్ | = ఏదో; |
| మామ్ | = నన్ను; | తత్ | = అదియే; |
| క్షేత్రజ్ఞమ్ | = క్షేత్రజ్ఞునిగా; | జ్ఞానమ్ | = యథార్థమైన జ్ఞానమని; |
| విద్ధి | = తెలుసుకో; | మమ | = నా; |
| క్షేత్ర క్షేత్రజ్ఞయోః | = క్షేత్ర-క్షేత్రజ్ఞుల; | మతమ్ | = అభిప్రాయం. |

**తా॥** (జీవుని సంసారిత్వం సూచించబడింది; ఇక, పారమార్థికమైన అసంసారి స్వరూపం నిరూపించబడుతోంది.) భారతా! ఆబ్రహ్మస్తంబ పర్యంతం గల శరీరాలలో జీవ రూపంలో వెలయునది నేనే అని గ్రహించు. క్షేత్ర క్షేత్రజ్ఞులను గురించిన ఈ జ్ఞానమే (మోక్షహేతువు కాబట్టి) జ్ఞానమని నా అభిప్రాయం. (మిగిలినదంతా బంధహేతువైన వృథా పాండిత్యమే అని గ్రహించు.[1]) 2

**తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।**
**స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 3**

---

→

3. 'నేను మనుష్యుణ్ణి,' 'ఇది నా శరీరం' – ఇది స్వాభావిక జ్ఞానం.
ఘటాదుల వలే దృశ్యమే అవడం వల్ల స్థూల, సూక్ష్మ శరీరాలు ఆత్మ కావు – ఇది ఔపదేశికజ్ఞానం.

4. క్షేత్రం దృశ్యం, క్షేత్రజ్ఞుడు ద్రష్ట – అని గ్రహించినవారు.
క్షేత్రం = క్షిణోతి ఆత్మానం అవిద్యయా, త్రాతి తం (ఆత్మానం) విద్యయా.
– అవిద్య వల్ల ఆత్మను నాశనం చేసేదీ, విద్య వల్ల ఆత్మను రక్షించేదీ అని.
అవిద్య అంటే స్థూల, సూక్ష్మ శరీరాల పట్ల ఆత్మాభిమానం.
విద్య అంటే ఆత్మ శరీరం నుండి వేరు అనే వివేకం. – భాష్యోత్కర్ష దీపిక.

1. (అ) తత్కర్మయన్నబంధాయ సా విద్యా యా చ ముక్తయే,
ఆయాసా యాపరం కర్మ విద్యాన్యా శిల్పనైపుణమ్.
(అ) క్షేత్రం, క్షేత్రజ్ఞుడు, ఈశ్వరుని యాథాత్మ్యం ఇవి గాక జ్ఞానగోచరాలైన ఏవీ కూడా లేవు.
కనుక, ఇదియే సమ్యక్-జ్ఞానం.

*తత్, క్షేత్రమ్, యత్, చ, యాదృక్, చ, యత్ వికారి, యతః, చ, యత్, సః, చ, యః, యత్ ప్రభావః, చ, తత్, సమాసేన, మే, శృణు.*

| | | | |
|---|---|---|---|
| తత్ క్షేత్రం | = ఆ క్షేత్రం; | సః చ యః | = ఆ క్షేత్రజ్ఞుడు ఎవడో; |
| యత్ చ | = ఏదియో; | యత్ ప్రభావః చ | = ఎటువంటి మహిమ గలవాడో; |
| యాదృక్ చ | = ఎటువంటిదో; | | |
| యత్ వికారి | = ఎటువంటి వికారాలతో కూడిందో; | తత్ | = దానిని; |
| | | సమాసేన | = సంగ్రహంగా; |
| యతః చ | = దేని నుండి; | మే | = నా నుండి; |
| యత్ | = ఏ రీతిగా ఉత్పన్నమైందో; | శృణు | = విను. |

**తా॥** (చతుర్వింశతి భేధాలతో ఒప్పుతున్న ప్రకృతియే 'క్షేత్రం' అని అభిప్రాయమైనా, శరీరంగా మారిన దానియందే అహంభావ రూపంలో అవివేక స్ఫూర్తి అవుతోంది కాబట్టి, శరీరమే క్షేత్రమనబడింది. వివేకజ్ఞానం కొరకు దానినే వర్ణిస్తున్నాడు :) నేను పేర్కొన్న క్షేత్రం ఏ జడత్వ దృశ్యత్వాది స్వభావాలు కలిగి, ఎటువంటి ఇచ్ఛాది ధర్మాలతో కూడి, ఏ ఇంద్రియ వికారాలకు లోనై ఉందో; మరియు, ఏ ప్రకృతి-పురుష సంయోగం వల్ల కలిగి, ఏ స్థావరజంగమాది భేదాలతో ఒప్పుతోందో చెబుతున్నాను; మరియు, క్షేత్రజ్ఞుని స్వరూపాన్ని, అతని అచింత్య యోగైశ్వర్యప్రభావాన్ని కూడా సంగ్రహంగా వివరిస్తాను, విను. 3

**ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 4**

*ఋషిభిః, బహుధా, గీతమ్, ఛందోభిః, వివిధైః, పృథక్, బ్రహ్మసూత్రపదైః, చ, ఏవ, హేతుమద్భిః, వినిశ్చితైః.*

***(క్షేత్ర-క్షేత్రజ్ఞుల మాహాత్మ్యం)***

| | | | |
|---|---|---|---|
| ఋషిభిః | = ఋషులచే; | వినిశ్చితైః | = సంశయరహితాలైన; |
| వివిధైః ఛందోభిః | = విభిన్నమైన వేదమంత్రాలతో; | హేతుమద్భిః | = హేతువులతో కూడిన; |
| పృథక్ | = వేరుగా; | బ్రహ్మసూత్ర పదైః ఏవ చ | = బ్రహ్మసూచకాలైన ఉపనిషద్వాక్యాలతోనూ (వర్ణించబడింది). |
| బహుధా | = పెక్కురీతులగా; | | |
| గీతమ్ | = కొనియాడబడినదీ; | | |

**తా॥** (నీవు సంగ్రహంగా చెబుతున్నది, ఏ మహాత్ముల వాక్యసారం? అని అంటావా:) ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల మాహాత్మ్యం (వసిష్ఠాది) ఋషులచే (యోగశాస్త్రాల ధ్యాన, ధారణాది విషయమైన వైరాజాది రూపాలలో) నానా ప్రకారాలుగా నిరూపితమైయ్యింది. అసందిగ్ధములైన (ఉపక్రమ ఉపసంహారాలతో ఏకవాక్యతను కూర్చుకున్న) యుక్తులతో[1], నిత్యనైమిత్తిక కామ్యకర్మాది విషయకములైన వేదమంత్రాలతో వివిధ దేవతా రూపంలోనూ, బ్రహ్మ సూత్ర[2]-పదముల[3] చేతా వ్యాఖ్యానించబడింది. 4

[ఈవిధంగా సవిస్తారంగా చెప్పబడిన దానినే మళ్ళీ నీకు సంగ్రహంగా చెబుతున్నాను, విను!]

**మహాభూతా న్యహంకారో బుద్ధిరవ్యక్త మేవ చ ।**
**ఇన్ద్రియాణి దశైకం చ పంచ చేన్ద్రియగోచరాః ॥ 5**

*మహాభూతాని, అహంకారః, బుద్ధిః, అవ్యక్తమ్, ఏవ, చ,*
*ఇంద్రియాణి, దశ, ఏకమ్, చ, పంచ, చ, ఇంద్రియ గోచరాః.*

**ఇచ్ఛాద్వేషః సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥ 6**

---

1. సదేవ సౌమ్యేదమగ్రమాసీత్. - ఛాందోగ్యోపనిషత్తు. 6-2-1
కథమ సతః సజ్జాయతే. - ఛాందోగ్యోపనిషత్తు. 6-2-2
కో హ్యేవాన్యత్ కః ప్రాణ్యాత్ యదేవ ఆకాశ ఆనందో న స్యాత్. - తైత్తిరీయోపనిషత్తు. 2-7-1
- ఇత్యాదులైన యుక్తులు.

2. బ్రహ్మసూత్రాలు = బ్రహ్మసూచకాలైన వేదాంత వాక్యాలు.
బ్రహ్మసూత్ర్యతే (సూచ్యతే) ఏభిః ఇతి. యథా, యతో వా ఇమాని భూతాని జాయంతే (తైత్తిరీయోపనిషత్తు. 3-11) ఇత్యాదీని.
అంటే దేని నుండి ఈ సకల భూతజాతమూ ఉత్పన్నమవుతోందో, మొదలైనవి.

3. పదములు - బ్రహ్మపద్యతే (సాక్షాత్ జ్ఞాయతే) ఏభిః ఇతి పదాని. యథా, సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ (తైత్తిరీయోపనిషత్తు. 2-1-1) ఇత్యాదీని.
బ్రహ్మ సత్యస్వరూపం, జ్ఞానస్వరూపం, అనంతం (బ్రహ్మస్వరూపలక్షణం).
లేక, 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' ఇత్యాదులు బ్రహ్మసూత్రాలుగా పరిగ్రహించబడనగును. వీటి యందే బ్రహ్మం నిర్ణయించబడింది. ఇవి సహేతుకాలు, అని కూడా అర్థమొనర్చుకొననగును. ఇవి బాదరాయణ వ్యాసునిచే విరచింపబడి వేదాంతదర్శన సంజ్ఞతో ఒప్పుతున్నాయి.

ఇచ్ఛా, ద్వేషః, సుఖమ్, దుఃఖమ్, సంఘాతః, చేతనా, ధృతిః,
ఏతత్, క్షేత్రమ్, సమాసేన, సవికారమ్, ఉదాహృతమ్.

| | |
|---|---|
| మహాభూతాని = పంచతన్మాత్రలు (పంచసూక్ష్మ భూతాలు); | ఇచ్ఛా = సుఖ స్పృహా; |
| అహంకారః = మహాభూతాలకు కారణం (అహంప్రత్యయం ద్వారా లక్షితం) | ద్వేషః = అనిష్ట-ద్వేషమూ; |
| బుద్ధిః = అహంకార కారణం (అధ్యవసాయాత్మికమైన బుద్ధి); | సుఖమ్ = సుఖమూ; |
| అవ్యక్త ఏవ చ = బుద్ధికి కారణమైన మూలప్రకృతి (అవ్యాకృతమైన ఈశ్వరశక్తి); | దుఃఖమ్ = దుఃఖమూ; |
| దశ ఇంద్రియాణి = కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ పంచకాలు; | సంఘాతః = దేహేంద్రియ సంహతీ; |
| ఏకం చ = ఒక్కటియైన మనస్సు; | చేతనా = దానియందు అభివ్యక్తమైన బుద్ధి; |
| పంచఇంద్రియ గోచరాః చ = ఇంద్రియ విషయాలైన శబ్దాదులు ఐదూ; | ధృతిః = ధైర్యమూ అయిన; |
| | సవికారమ్ = వికారాలతో కూడిన; |
| | ఏతత్ = ఈ; |
| | క్షేత్రమ్ = క్షేత్రం (శరీరం); |
| | సమాసేన = సంగ్రహంగా; |
| | ఉదాహృతం = చెప్పబడింది. |

**తా॥** (క్షేత్రస్వరూపం వర్ణించబడుతోంది :) పంచ సూక్ష్మభూతాలు, మహాభూతాలకు కారణమైన అహంకారం, అహంకార కారణమైన బుద్ధి, బుద్ధికి కారణమైన మూలప్రకృతి (అవ్యాకృత బ్రహ్మశక్తి), దశేంద్రియాలు, మనస్సు, ఇంద్రియ విషయాలనే స్థూలభూతాలు[1] (శబ్దాదులు); ఇచ్ఛా, ద్వేషం, దుఃఖాలు, సంఘాతం (శరీరం), దానియందు తోచే చేతన, ధృతి కలసి[2] క్షేత్రం అని

1. ఇవి సాంఖ్యుల చతుర్వింశతి తత్త్వాలు; యోగులు కూడా వీటిని అంగీకరిస్తారు.

మూల ప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త,
షోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః - సాంఖ్య కారికా. 3

విశేషావి శేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి, - యోగ సూత్రమ్. 2-11

సాంఖ్యుల చతుర్వింశతి తత్త్వాలు, యోగుల దృశ్యాలు ఇక్కడ క్షేత్రం.

చూ : ధాత భాద్రపద భారతి (327-334 పుటలు : )
ప్రమాది మార్గశీర్ష భారతి (725-732 పుటలు).

2. ... ఇంద్రియాంతరవికారాః సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నాశ్చాత్మనో లింగాని. (వైశేషిక సూత్రమ్. 3-2-4) అని వైశేషికులచే ఆత్మ గుణాలుగా చెప్పబడేవి, ఆత్మగుణాలు కావు, క్షేత్రధర్మాలు అని అభిప్రాయం. ఏలయన, శ్రుతి వీటన్నింటినీ క్షేత్రాంతఃపాతియైన మనోధర్మాలుగానే చెప్పినది.

"కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాశ్రద్ధా ధృతిరధృతిః హ్రీః ధీః భీరి త్యేతత్ సర్వం మన ఏవ."
- బృహదారణ్యకోపనిషత్తు. 2-5-3.

అనబడుతున్నాయి. మహదాది (ఇంద్రియాది) వికారాలతో కూడిన క్షేత్రతత్త్వం సంగ్రహంగా చెప్పబడింది. (గీత : 7-4,14 చూ.) 5-6

**అమానిత్వ మదంభిత్వం అహింసా క్షాన్తి రార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥ 7**

*అమానిత్వమ్, అదంభిత్వమ్, అహింసా, క్షాంతిః, ఆర్జవమ్,*
*ఆచార్యోపాసనమ్, శౌచమ్, స్థైర్యమ్, ఆత్మవినిగ్రహః.*

| | | | |
|---|---|---|---|
| అమానిత్వమ్ | = తనను తాను పొగుడుకోకుండుట; | ఆర్జవమ్ | = సరళత (కుటిలత లేకపోవుట); |
| అదంభిత్వమ్ | = దంభం (కపటం) లేకుండడం; | ఆచార్య ఉపాసనమ్ | = గురు శుశ్రూష; |
| | | శౌచమ్ | = బాహ్యాభ్యంతర శౌచం; |
| అహింసా | = పరులను పీడింపకుండుట; | స్థైర్యమ్ | = సన్మార్గం నందు ఏకనిష్ఠ కలిగి ఉండడం; |
| క్షాంతిః | = క్షమ (ఇతరుల అపరాధాలకు మనస్సు వికృతినందక పోవుట); | ఆత్మ వినిగ్రహః | = స్వాభావిక ప్రవృత్తులను నియమించి సన్మార్గంలో ప్రవర్తింప చేయడం. |

**తా॥** (క్షేత్రాతిరిక్తుడూ, శుద్ధుడూ, జ్ఞేయుడూ అయిన క్షేత్రజ్ఞుణ్ణి వర్ణించ డానికి పూర్వం, తత్త్వజ్ఞాన సాధనలు చెప్పబడుతున్నాయి :) అమానిత్వం, దభం (కపటం) లేకుండడం, పరులను పీడించకుండడం, క్షమ, సరళత, గురుశుశ్రూష, బాహ్య-అభ్యంతర శౌచం[1], మోక్షమార్గంలో ఏకనిష్ఠ, ఆత్మనిగ్రహం- 7

**ఇన్ద్రియార్థేషు వైరాగ్యం అనహఙ్కార ఏవ చ ।**
**జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్ ॥ 8**

*ఇంద్రియ అర్థేషు, వైరాగ్యమ్, అనహంకారః, ఏవ, చ,*
*జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోష అనుదర్శనమ్.*

---

1. శౌచం చ ద్వివిధం ప్రోక్తం బాహ్య మాభ్యంతరం తథా ।
మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్త థాంతరమ్ ॥

| | | | |
|---|---|---|---|
| ఇన్ద్రియ అర్థేషు | = ఇంద్రియ విషయభోగాలపై; | జన్మ మృత్యు జరా వ్యాధి | = పుట్టుక, చావు, ముదిమి, జబ్బు; |
| వైరాగ్యమ్ | = అనాసక్తి (విరక్తి); | దుఃఖ దోష | |
| అనహఙ్కారః ఏవ చ | = అహంకారభావం, (అభిమానరాహిత్యం); | అనుదర్శనమ్ | = ఈ దుఃఖాలలో దోషాలను చూడడం. |

**తా॥** భోగ్యాలైన ఇంద్రియ విషయాలపై విరక్తి, అభిమాన రాహిత్యం, జన్మ-మృత్యు-జరా-వ్యాధులనే దుఃఖాలలో ఉండే దోషాలను పదేపదే చూడడం- 8

**అసక్తి రనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోపపత్తిషు ॥ 9**

*అసక్తిః, అనభిష్వంగః, పుత్రదార గృహాదిషు,*
*నిత్యమ్, చ, సమచిత్తత్వమ్, ఇష్ట అనిష్ట ఉపపత్తిషు.*

| | | | |
|---|---|---|---|
| పుత్ర దార గృహాదిషు | = పుత్రుడు, భార్య, గృహం మొదలైన వాటియందు; | ఇష్ట అనిష్ట ఉపపత్తిషు | = శుభ-అశుభాలు కలిగినప్పుడు; |
| అసక్తిః | = అనాసక్తి; | నిత్యం చ | = శాశ్వతమైన; |
| అనభిష్వఙ్గః | = అనన్యాత్మభావం (వారికి ఆపద కలిగితే తనకే కలిగిందని తలచకుండడం; | సమచిత్తత్వమ్ | = సమత్వభావం కలిగి ఉండడం. |

**తా॥** పుత్ర దార గృహాదుల యందు ఆసక్తి, మమత్వాలు లేకుండడం; శుభాశుభ ప్రాప్తులకు మనస్సు తొణకకుండడం - 9

**మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।**
**వివిక్త దేశ సేవిత్వం అరతి ర్జనసంసది ॥ 10**

*మయి, చ, అనన్యయోగేన, భక్తిః, అవ్యభిచారిణీ,*
*వివిక్త దేశ సేవిత్వమ్, అరతిః, జనసంసది.*

| | | | |
|---|---|---|---|
| మయి చ | = నా యందు; | వివిక్త దేశ సేవిత్వమ్ | = ఏకాంత ప్రదేశాలలో నివసించే వాడగుట; |
| అనన్య-యోగేన | = సర్వాత్మదృష్టితో; | జనసంసది | = అవినీతి పరుల సంసర్గం పట్ల; |
| అవ్యభిచారిణీ | = ఐకాంతికమగు; | అరతిః | = అనిచ్ఛ; |
| భక్తిః | = భక్తి; | | |

**తా॥** నాయందు సర్వాత్మదృష్టితో ఏకాంత భక్తి కలిగి ఉండడం, చిత్తప్రసాద కరాలైన ప్రదేశాలలో నివసించడం, ప్రాకృతజన సంసర్గ త్యాగం- 10

**అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏతత్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా ॥ 11**

అధ్యాత్మ జ్ఞాననిత్యత్వమ్, తత్త్వజ్ఞాన అర్థ దర్శనమ్,
ఏతత్, జ్ఞానమ్, ఇతి, ప్రోక్తమ్, అజ్ఞానమ్, యత్, అతః, అన్యథా.

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వమ్ = ఆత్మజ్ఞాన స్థైర్యం;
తత్త్వ జ్ఞాన అర్థ దర్శనమ్ = మోక్ష జ్ఞాన ప్రయోజనాన్ని చూడడం
(అమానిత్వమాదిగా తత్త్వజ్ఞానార్థం వరకూ గల)
ఏతత్ = ఇదంతా (జ్ఞాన సాధనలు, సహకారి కారణాలు అగుట వల్ల);
జ్ఞానమ్ = జ్ఞానం;
ఇతి = అని;
ప్రోక్తమ్ = చెప్పబడుతుంది;
యత్ = ఏది;
అతః అన్యథా = దీనికంటే వేరో (అ, మానిత్వ దంభాదులు);
అజ్ఞానమ్ = జ్ఞాన ప్రతిబంధకాలు.

**తా॥** ఆత్మజ్ఞాననిష్ఠ, మోక్షంపై సర్వోత్కృష్ట బుద్ధి, ఇదంతా (జ్ఞాన సాధనమూ, సహకారి కారణమూ అవడం వల్ల) జ్ఞానమని చెప్పబడుతోంది;[1] దీనికి విపరీతములైన మానిత్వ-దంభాదులు అజ్ఞానం, జ్ఞాన ప్రతిబంధకం అవడం వల్ల సర్వథా త్యాజ్యములు. 11

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 12**

జ్ఞేయమ్, యత్, తత్, ప్రవక్ష్యామి, యత్, జ్ఞాత్వా, అమృతమ్, అశ్నుతే,
అనాదిమత్, పరమ్, బ్రహ్మ, న, సత్, తత్, న, అసత్, ఉచ్యతే.

యత్ = ఏది;
జ్ఞేయమ్ = తెలిసికో దగినదో;
యత్ = దేనిని;
జ్ఞాత్వా = గ్రహిస్తే;
అమృతమ్ = అమరత్వం (మోక్షాన్ని);
అశ్నుతే = పొందునో;

1. ఇక్కడ ఇరవై జ్ఞానసాధనాలు చెప్పబడ్డాయి.

| | | | |
|---|---|---|---|
| తత్ | = దానిని; | న సత్ | = సత్ శబ్ద గోచరం కాదు; |
| ప్రవక్ష్యామి | = చెబుతున్నాను; | | |
| తత్ | = అది; | న అసత్ | = అసత్ ప్రత్యయ గోచరమూ కాదు (అని); |
| అనాది మత్ | = ఆది రహితం; | | |
| పరమ్ బ్రహ్మ | = పరబ్రహ్మం; | ఉచ్యతే | = చెప్పబడుతోంది; |

**తా॥** (ఇక జ్ఞేయం ఆరు శ్లోకాలలో వర్ణించబడుతోంది :) అర్జునా! ఏది జ్ఞేయమో, దేనిని తెలుసుకుంటే అమృతత్వం లభిస్తుందో దానిని చెబుతాను. ఆ ఆదిరహితమైన పరబ్రహ్మం సత్-ప్రత్యయానికీ, అసత్-ప్రత్యయానికీ కూడా అగోచరం; సత్-శబ్దానికీ, అసత్-శబ్దానికీ కూడా అలక్ష్యం. ఏలయన, ఇంద్రియ గోచరాలైన వస్తువులన్నీ సత్-అసత్ అని చెప్పజాలనివి, కాని బ్రహ్మం ఇంద్రియ గోచరం కాదు.[1] 12

**సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 13**

*సర్వతః, పాణిపాదమ్, తత్, సర్వతః, అక్షి శిరోముఖమ్,*
*సర్వతః, శ్రుతిమత్, లోకే, సర్వమ్, ఆవృత్య, తిష్ఠతి.*

| | | | |
|---|---|---|---|
| సర్వతః | = సర్వత్ర; | శ్రుతిమత్ | = చెవులు కలది; |
| పాణి పాదమ్ | = హస్తపాదాలు కలది; | తత్ | = అది (బ్రహ్మం); |
| సర్వతః | = సర్వత్ర; | లోకే | = లోకంలో; |
| అక్షి శిరః ముఖమ్ | = కన్నులు, తలలు, నోళ్ళు కలది; | సర్వమ్ | = సమస్తమూ; |
| | | ఆవృత్య | = వ్యాపించి; |
| సర్వతః | = సర్వత్ర; | తిష్ఠతి | = వెలయుచున్నది. |

**తా॥** (బ్రహ్మం సదసద్విలక్షణాన్ని, సర్వవ్యాపిత్వాన్ని వర్ణించే శ్రుతులతో విరోధిస్తుందే అనే ఆశంకను తొలగించడానికి, అచింత్యశక్తియైన బ్రహ్మం యొక్క సర్వాత్మకత్వం వర్ణింపబడుతోంది.) ఆ పరబ్రహ్మం ఈ విశ్వాన్నంతటనీ వ్యాపించి

---

1. (అ) దర్శయతి చాథ అపి స్మర్యతే. - వేదాంత సూత్రమ్. 3-2-17

(ఆ) వేద ప్రమాణాలైన విషయాలన్నీ కూడా విధిముఖమున గాని నిషేధముఖమున గాని వర్ణింపబడుతున్నాయి. మొదటివి సత్ శబ్దవాచ్యాలు, రెండవవి అసత్ శబ్దవాచ్యాలు. బ్రహ్మం ఉభయ విలక్షణం. బ్రహ్మం అవిషయం.

వెలయుచున్నది; సర్వత్ర దాని హస్త పాదాలు, సర్వత్ర దాని కర్ణ నయనాలు, సర్వత్ర దాని శిరోముఖాలు. (శ్వేతాశ్వతరోపనిషత్తు. 2-16 చూ:) 13

**సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14**

*సర్వ ఇంద్రియ గుణ అభాసమ్, సర్వ ఇంద్రియ వివర్జితమ్,*
*అసక్తమ్, సర్వభృత్, చ, ఏవ, నిర్గుణమ్, గుణభోక్తృ, చ.*

సర్వ ఇన్ద్రియ గుణ అభాసమ్ = (అది) ఇంద్రియ వ్యాపారాలన్నిటిలో ప్రకాశిస్తోంది (కాని);
సర్వ ఇన్ద్రియ వివర్జితమ్ = ఎటువంటి ఇంద్రియమూ లేనిది;
అసక్తమ్ = సంగరహితమూ;
సర్వ భృత్ = అన్నిటికీ ఆధారమూ;
నిర్గుణం చ ఏవ = త్రిగుణరహితమూ కూడా (అయ్యి);
గుణ భోక్తృ చ = గుణాలను పాలించునది.

**తా॥** అది సర్వేంద్రియ వ్యాపారాలలో ప్రకాశిస్తోంది, కాని అది ఇంద్రియ రహితమూ,[1] సంగరహితమూ కూడా అయి; (మరుభూమి మృగతృష్ణికకు వలే అది సర్వభూతాలకూ ఆస్పదమవుతోంది. అది త్రిగుణరహితం,[2] కాని గుణాలను పాలిస్తోంది.[3] (శ్వేతాశ్వతరోపనిషత్తు. 3-17 చూ:) 14

**బహిరన్తశ్చ భూతానాం అచరం చరమేవ చ ।**
**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ 15**

---

1. అపాణిపాదో జవనో గ్రహీతా, పశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః
- శ్వేతాశ్వతరోపనిషత్తు. 3-19; ముండకోపనిషత్తు 3-1-7,8 చూ.

2. సత్త్వరజస్తమో గుణాలు విషయాకారాన్ని ధరించి సుఖ, దుఃఖ, మోహాకారాలుగా పరిణమిస్తున్నాయి. బ్రహ్మం జీవరూపంలో భోక్త.

3. బ్రహ్మం సత్త కాదు, అసత్త కూడా కాదు అంటే నాస్తికత్వ ఆశంక కలుగవచ్చు. దానిని తొలగించడానికి, సర్వప్రాణి కారణోపాధి రూపంలో దాని అస్తిత్వం ప్రతిపాదించబడింది. క్షేత్ర-ఉపాధిని అనుసరించి క్షేత్రజ్ఞుడు అనబడుతోంది. క్షేత్రోపాది ధర్మాల మిథ్యారోపం క్షేత్రజ్ఞునికి కలుగుతోంది; దానిని తొలగించి సదసద్విలక్షణంగా పేర్కొనబడింది. క్షేత్రధర్మాలు మిథ్యయే అయినా, బ్రహ్మ-అస్తిత్వ ప్రమాణం కొరకు బ్రహ్మధర్మాలుగా కల్పింపబడి, "సర్వత్ర దాని హస్తపాదాలు' అని వర్ణన. కనుక సాకారరూపం గౌణం, ముఖ్యం కాదు.

బహిః, అంతః, చ, భూతానామ్, అచరమ్, చరమ్, ఏవ, చ,
సూక్ష్మత్వాత్, తత్, అవిజ్ఞేయమ్, దూరస్థమ్, చ, అన్తికే, చ, తత్.

తత్ చ = మరియు, అది;
భూతానామ్ = చరాచరభూతాల;
బహిః అంతః చ = బయటా, లోపలా కూడా (ఉంది);
అచరమ్ = స్థావరమూ;
చరమ్ ఏవ చ = జంగమం కూడా (అవుతోంది);
సూక్ష్మత్వాత్ = సూక్ష్మమవడం వల్ల;
తత్ = అది;
అవిజ్ఞేయం = తెలియబడకుంది;
దూరస్థమ్ = విషయ బద్ధులకు దూరంగా ఉంది;
చ అంతి కే = మరియు, శుద్ధచిత్తులకు దగ్గరే ఉంది.

**తా॥** అది స్వకార్యాలైన చరాచరాల వెలుపలా లోపలా కూడా (స్వర్ణం ఆభరణాలలో, నీరు తరంగాలలో ఉండే విధంగా) ఉంది. (కార్యాలు కారణాత్మకాలు అవడం వల్ల) అది స్థావర జంగమాత్మకం.[1] అది అత్యంత సూక్ష్మం అంటే, రూపాది విహీనమవడం వల్ల అవిజ్ఞేయం. (ప్రకృతి కంటే పరంగా) విషయ బుద్ధులకు అతి దూరంలో (ప్రత్యగాత్మ రూపంలో) శుద్ధ చిత్తులకు అత్యంత సమీపంలో ప్రకాశిస్తోంది.[2] 15

**అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।**
**భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16**

అవిభక్తమ్, చ, భూతేషు, విభక్తమ్, ఇవ, చ, స్థితమ్,
భూతభర్తృ, చ, తత్, జ్ఞేయమ్, గ్రసిష్ణు, ప్రభవిష్ణు, చ.

తత్ = ఆ;
జ్ఞేయమ్ = బ్రహ్మం;
భూతేషు = సర్వభూతాలలో;
అవిభక్తం చ = కారణస్వరూపంలో అభిన్నమే అయినా;
విభక్తం ఇవ చ = కార్యస్వరూపంలో భిన్నమైన దానివలె;
స్థితమ్ = వెలయుచున్నది;
భూతభర్తృ చ = మరియు, అది భూతాలను పాలిస్తోంది;
గ్రసిష్ణు = సంహర్త;
ప్రభవిష్ణు చ = సృష్టికర్త కూడా;

1. స్థావర జంగమ శరీరాల వెలుపలా, లోపలా కూడా బ్రహ్మమే;
స్థావరజంగమాల శరీరాలు కూడా బ్రహ్మమే.

2. తెలియకపోవడం వల్ల అజ్ఞానులకు దూరం, జ్ఞానులకు ఆత్మస్వరూపం అవడం వల్ల సమీపం.
'త దేజతి త న్నైజతి త ద్దూరే తదన్తికే.' – ఈశావాస్యోపనిషత్తు. 5

**తా॥** ఈ బ్రహ్మం సర్వభూతాలలో కారణరూపంలో అభిన్నంగానూ, కార్యరూపంలో (సముద్రజాతాలైన ఫేన బుద్బుదాదులు సముద్రం కంటే వేరు కాకపోయినా, వేరైనట్లు తోచే విధంగా) భిన్నంగానూ ప్రతీతమవుతోంది. ఇదియే భూతాలనన్నింటినీ స్థితికాలంలో పోషిస్తోంది, ప్రళయకాలంలో సంహరిస్తున్నది, సృష్టికాలంలో ప్రసవిస్తోంది. 16

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్[1] ॥ 17**

*జ్యోతిషామ్, అపి, తత్, జ్యోతిః, తమసః, పరమ్, ఉచ్యతే.*
*జ్ఞానమ్, జ్ఞేయమ్, జ్ఞానగమ్యమ్, హృది, సర్వస్య, ధిష్ఠితమ్.*

| | | | |
|---|---|---|---|
| తత్ | = ఆ బ్రహ్మం; | జ్ఞేయమ్ | = రూపాదుల ఆకారంలో తెలియబడేది; |
| జ్యోతిషామ్ అపి | = సూర్యచంద్రాది జ్యోతులకు కూడా; | జ్ఞానగమ్యమ్ | = అమానిత్వాది సాధనలచే తెలియబడేది; |
| జ్యోతిః | = ప్రకాశకమైనది; | సర్వస్య | = అందరి; |
| తమసః | = అజ్ఞానాంధకారానికి; | హృది | = హృదయంలో; |
| పరమ్ | = అవ్వలిది (అని); | ధిష్ఠితం | = అంతర్యామిగా వెలయునది. |
| ఉచ్యతే | = చెప్పబడుతోంది (ఇదే); | | |
| జ్ఞానమ్ | = బుద్ధి వృత్తులలో అభివ్యక్తమయ్యే జ్ఞానం; | | |

**తా॥** (ప్రకాశిస్తున్నప్పటికీ తోచకపోవడం వల్ల ఇది తమో రూపమా? అనే ఆశంక తొలగింపబడుతోంది-) ఇది ఆదిత్యాది[2] జ్యోతిస్సమూహాన్ని కూడా ప్రకాశింపజేస్తోంది; అజ్ఞానాంధకారంచే అసంస్పృష్టం[3]. ఇదియే బుద్ధివృత్తులలో అభివ్యక్తమైయ్యే జ్ఞానం, రూపాది ఆకారాలలో తెలియబడే జ్ఞేయం, అమానిత్వాది

1. విష్ఠితం – పాఠాంతరం.
2. (అ) యేన సూర్య స్తపతి తేజసాఇద్ధః – మహానారాయణోపనిషత్తు. 1-3
తమేవ భాంతమనుభాతి సర్వం, తస్య భాసా సర్వమిదం విభాతి – కఠోపనిషత్తు 5-5
(ఆ) యదాదిత్యగతం తేజః – గీత. 15-12
3. (అ) ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ – శ్వేతాశ్వతరోపనిషత్తు. 3-8.
(ఆ) ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ – గీత : 8-9.

సాధనలచే తెలియబడేది.[1] ఇది, అందరి హృదయాలలో అంతర్యామిగా ప్రకాశిస్తోంది.[2] 17

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।**
**మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 18**

*ఇతి, క్షేత్రమ్, తథా, జ్ఞానమ్, జ్ఞేయమ్, చ, ఉక్తమ్, సమాసతః, మద్భక్తః, ఏతత్, విజ్ఞాయ, మద్భావాయ, ఉపపద్యతే.*

| | | | |
|---|---|---|---|
| ఇతి | = ఈ విధంగా; | మద్భక్తః | = నా భక్తుడు; |
| క్షేత్రమ్ | = క్షేత్రం; | ఏతత్ | = ఈ తత్త్వత్రయాన్ని; |
| తథా జ్ఞానమ్ | = జ్ఞానం; | విజ్ఞాయ | = గ్రహించి; |
| జ్ఞేయమ్ చ | = జ్ఞేయాన్ని; | మద్భావాయ | = నా స్వరూపాన్ని (బ్రహ్మన్ని పొంది); |
| సమాసతః | = సంక్షేపంగా; | | |
| ఉక్తమ్ | = చెప్పబడింది; | ఉప పద్యతే | = సమర్థుడవుతాడు. |

**తా॥** (అధికారిని, ఫలాన్ని పేర్కొని క్షేత్ర ప్రసంగాన్ని ముగిస్తున్నాడు :) ఈ విధంగా నీకు క్షేత్రం,[3] జ్ఞానం,[4] జ్ఞేయం[5] సంక్షేపంగా చెప్పబడ్డాయి. నా భక్తుడు ఈ మూడింటినీ తెలుసుకుని, బ్రహ్మభావాన్ని పొందడానికి యోగ్యుడు అవుతాడు.[6] 18

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 19**

---

1. లేక, గీత 13-7-11 శ్లోకాలలో చెప్పబడింది జ్ఞానంగానూ; 13-12-17 శ్లోకాలలో చెప్పబడింది జ్ఞేయంగానూ గ్రహించవలెను. జ్ఞానగమ్యం = జ్ఞేయబ్రహ్మం జ్ఞాతమైతే జ్ఞానగమ్యం అనబడుతుంది.

2. బ్రహ్మజ్ఞానం పొంద వీలుకానిది అని తలచి అవసాదం పొందినవారికి చెప్పబడుతోంది - అది అందరి హృదయాలలో ఉంది. జ్ఞానం అసంభవం అని తలచవద్దు.

3. గీత. 13-5,6 చూ.

4. గీత. 13-7-11 చూ.

5. గీత. 13-12-17 చూ.

6. చూస్తున్నది, వింటున్నది, తాకుతున్నది ఇతర విధాల అనుభూతమైనది - అంతా భగవంతుడే అనే బుద్ధి గలవాడు భక్తుడు.

ప్రకృతిమ్, పురుషమ్, చ, ఏవ, విద్ధి, అనాదీ, ఉభౌ, అపి,
వికారాన్, చ, గుణాన్, చ, ఏవ, విద్ధి, ప్రకృతిసంభవాన్.

| | | | |
|---|---|---|---|
| ప్రకృతిమ్ | = ప్రకృతిని; | వికారాన్ చ | = వికారాలు; |
| పురుషమ్ | = పురుషుని; | గుణాన్ ఏవ చ | = గుణాలు కూడా; |
| ఉభౌ అపి ఏవ చ | = ఈ రెండింటినీ కూడా; | ప్రకృతి సంభవాన్ | = ప్రకృతి వల్ల కలిగేవి (మాయికములు అని); |
| అనాదీ | = ఆదిరహితులు అని; | | |
| విద్ధి | = గ్రహించు; | విద్ధి | = గ్రహించు. |

**తా॥** (క్షేత్రం అంటే ఏమిటో, అది ఎటువంటిదో చెప్పబడింది; ఇక దాని వికారాలను, దాని ఉత్పత్తిని, పురుషుని ప్రభావాన్నీ చెబుతున్నాడు :) ప్రకృతి పురుషులు ఉభయులూ కూడా అనాదులని గ్రహించు. (అనాదియైన ఈశ్వరుని శక్తి అవడం వల్ల ప్రకృతి అనాది, పురుషుడు కూడా తదంశం అవడం వల్ల అనాది[1]) శరీర ఇంద్రియ రూపాలైన వికారాలూ, సుఖదుఃఖమోహాది గుణ పరిణామాలు ప్రకృతి నుండి కలిగినవి అని గ్రహించు. 19

**కార్యకారణ కర్తృత్వే[2] హేతుః ప్రకృతి రుచ్యతే ।**
**పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥ 20**

కార్యకారణ కర్తృత్వే, హేతుః, ప్రకృతిః, ఉచ్యతే,
పురుషః, సుఖదుఃఖానామ్, భోక్తృత్వే, హేతుః, ఉచ్యతే.

| | | | |
|---|---|---|---|
| కార్య కరణ కర్తృత్వే | = కార్య కారణ రూపాలైన శరీరేంద్రియాలను ఉత్పాదన మొనర్చే విషయంలో; | పురుషః | = పురుషుడు (జీవుడు); |
| ప్రకృతిః | = ఈశ్వరుని త్రిగుణాత్మికమైన మాయాశక్తి; | సుఖ దుఃఖానామ్ | = సుఖదుఃఖ సమూహాల; |
| హేతుః | = కారణమని; | భోక్తృత్వే | = భోగవిషయంలో; |
| ఉచ్యతే | = చెప్పబడుతోంది; | హేతుః | = కారణమని; |
| | | ఉచ్యతే | = చెప్పబడుతోంది. |

1. ఈశ్వరుడు అనాది అగుట వల్ల ప్రకృతిద్వయం అనాది, ఏలయన ఈశ్వరుడు సర్వదా ప్రకృతిద్వయ-యుక్తుడు.

2. కారణకర్తృత్వే – పాఠాంతరం.

**తా॥** ఈశ్వరుని త్రిగుణాత్మికమైన మాయాశక్తి (ప్రకృతి) దేహేంద్రియాలను[1] సృష్టిస్తోంది; జీవుడు సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు – అని చెప్పబడుతోంది. 20

**పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్ ।**
**కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు ॥ 21**

*పురుషః, ప్రకృతిస్థః, హి, భుంక్తే, ప్రకృతిజాన్, గుణాన్,*
*కారణమ్, గుణసంగః, అస్య, సత్ అసత్ యోని జన్మసు.*

హి = ఏమన;
పురుషః = భోక్త (జీవుడు);
ప్రకృతిస్థః = ప్రకృతి యందు వెలయుచు;
ప్రకృతి జాన్ గుణాన్ = సుఖ, దుఃఖ, మోహ రూపాలైన ప్రకృతిజాత గుణాలను;
భుఙ్క్తే = అనుభవిస్తాడు;
అస్య = ఈ జీవుని;
సత్ అసత్ యోనిజన్మసు = దేవతాది సత్ జన్మలు, పశ్వాది అసత్ జన్మలు, ఉభయ విధమైన మనుష్య జన్మకూ;
గుణ సంఙ్గః = గుణముల ఆసక్తియే;
కారణమ్ = హేతువు.

**తా॥** భోక్త అయిన పురుషుడు ప్రకృతి యందు వెలయుచూ[2] సుఖ, దుఃఖ, మోహ ఆకారాలలో అభివ్యక్తాలైన గుణసమూహాలను అనుభవిస్తున్నాడు. ఈ గుణశక్తియే జీవుణ్ణి దేవ, మనుష్య, పశు జన్మలను గ్రహించేలా చేస్తోంది.[3] (గీత : 14-18 చూ:) 21

**ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22**

*ఉపద్రష్టా, అనుమంతా, చ, భర్తా, భోక్తా, మహేశ్వరః,*
*పరమాత్మా, ఇతి, చ, అపి, ఉక్తః, దేహే, అస్మిన్, పురుషః, పరః.*

---

1. కార్యము = శరీరం, కరణము = దేహస్థములైన పది ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ప్రాణం, శరీర శబ్దంతో తదారంభకాలైన భూతాలు, విషయాలు గ్రహింపబడ్డాయి. ఇవి అన్నీ ప్రకృతి వికారాలు. కరణ శబ్దంతో సుఖ-దుఃఖ-మోహాత్మకాలైన ప్రకృతి జాతగుణాలు గ్రహించబడ్డాయి.

2. దాని యందు వెలయుట అంటే – కార్యకారణరూపంగా పరిణమించిన ప్రకృతి యందు ఆత్మ బుద్ధియే.

3. అచేతనమైన ప్రకృతికి స్వతః కర్తృత్వం లేదు, అవికారియైన పురుషునికి భోక్తృత్వం లేదు. అయినా పురుష సాన్నిధ్యం వల్ల ప్రకృతికి కర్తృత్వాన్ని, ప్రకృతి సాన్నిధ్యం వల్ల పురుషునికి భోక్తృత్వాన్ని చెప్పబడుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| అస్మిన్ | = ఈ; | భర్తా | = పాలకుడు; |
| దేహే | = శరీరంలో; | భోక్తా | = అనుభవించేవాడు; |
| పురుషః | = పరమపురుషుడు; | మహేశ్వరః | = పరమేశ్వరుడు; |
| పరః | = స్వతంత్రుడు; | పరమాత్మా చ | = పరమాత్మ, |
| ఉపద్రష్టా | = సాక్షి; | ఇతి అపి | = అనియూ; |
| అనుమన్తా చ | = అనుమోదకుడు (అనుగ్రాహకుడు); | ఉక్తః | = చెప్పబడును. |

**తా॥** (ఇలా, అవివేకం వల్లే పురుషునికి సంసారం, వాస్తవానికి-) అతడు ప్రకృతి కార్యమైన ఈ శరీరంలో వెలయుచున్నప్పటికీ స్వతంత్రుడు - గుణాలతో కట్టువడడు. ఏలయన అతడు సాక్షి,[1] అనుగ్రాహకుడు,[2] భర్త,[3] భోక్త,[4] మహేశ్వరుడు,[5] పరమాత్మ[6] అని (శ్రుతిచే) చెప్పబడుతున్నాడు. (గీత : 13-2; 15-18) 22

**యఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభి జాయతే ॥ 23**

*యః, ఏవమ్, వేత్తి, పురుషమ్, ప్రకృతిమ్, చ, గుణైః, సహ,*
*సర్వథా, వర్తమానః, అపి, న, సః, భూయః, అభిజాయతే.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | గుణైః సహ | = వికారాలతో కూడిన; |
| ఏవమ్ | = ఇలా, సాక్షాత్తు ఆత్మభావంలో; | ప్రకృతించ | = ప్రకృతిని (అవిద్యను); |
| పురుషమ్ | = పరమ పురుషుని (పరమాత్మను); | వేత్తి | = గ్రహిస్తాడో; |
| | | సః | = అతడు; |

1. శరీరేంద్రియ వ్యాపారాల సంసర్గం లేకున్నప్పటికీ, వాటి నుండి వేరైననూ సామీప్య స్థితి వల్ల ఆ వ్యాపారాలను చూసేవాడు.

2. స్వయంప్రవృత్తి లేకున్నా, శరీరేంద్రియ వ్యాపారాలలో ప్రవర్తిల్లునట్లు, వాటికి అనుకూలంగా తోచువాడు. 'సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ' - శ్వేతాశ్వతరోపనిషత్తు. 6-11.

3. చిదాభాసతో కూడిన దేహేంద్రియాది స్వరూపాన్ని ధరించినది చైతన్యాత్మయే - కనుక, ఈశ్వర రూపంలో భర్త.

4. సుఖ దుఃఖ మోహాత్మకాలైన బుద్ధిప్రత్యయాలు, నిత్యచైతన్య స్వరూపమైన ఆత్మ చేత కబళింపబడి పుట్టువాని వలే తోచుతున్నాయి - కనుక భోక్త.

5. సర్వాత్మకుడు, స్వతంత్రుడు.

6. అవిద్య చేత ప్రత్యగాత్మ రూపాన్ని కల్పింపబడిన శారీరాదుల నుండి బుద్ధి వరకూ గల అన్నింటికీ అంతరాత్మ. 'ఏష సర్వేశ్వర ఏషః భూతాధిపతి రేష లోకపాలః' - బృహదారణ్యకోపనిషత్తు. 4-4-22.

| | | | |
|---|---|---|---|
| సర్వథా | = సర్వవిధాల; | భూయః | = మళ్ళీ; |
| వర్తమానః అపి | = వర్తిస్తున్నప్పటికీ; | న అభిజాయతే | = జన్మించడు. |

**తా॥** (ప్రకృతి-పురుష వివేకజ్ఞానిని స్తుతిస్తున్నాడు :) ఎవడు పురుషుణ్ణి (బ్రహ్మాన్నీ) సాక్షాత్తుగా ఆత్మభావంతో (అయం అహం అస్మి అని) తెలుసుకుంటున్నాడో, మరియు వికారయుక్తమైన అవిద్యారూప ప్రకృతిని (మిథ్య అని) కూడా గ్రహిస్తున్నాడో, అతడు సర్వభావాలలో, సర్వావస్థలలో వెలయుచున్నప్పటికీ, (వేదవిధిని అతిక్రమించినా) మళ్ళీ జన్మించడు. 23

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 24**

ధ్యానేన, ఆత్మని, పశ్యంతి, కేచిత్, ఆత్మానమ్, ఆత్మనా,
అన్యే, సాంఖ్యేన, యోగేన, కర్మయోగేన, చ, అపరే.

| | | | |
|---|---|---|---|
| కేచిత్ | = కొందరు; | పశ్యంతి | = ధరిస్తున్నారు; |
| ధ్యానేన | = ధ్యానం చేత;[1] | అన్యే | = ఇతరులు; |
| ఆత్మని | = బుద్ధి యందు; | సాంఖ్యేన యోగేన | = జ్ఞానయోగం చేతా;[2] |
| ఆత్మనా | = ధ్యాన సంస్కృతమైన శుద్ధ అంతఃకరణం చేత; | అపరే చ | = తదితరులు; |
| | | కర్మయోగేన | = కర్మయోగం చేతా (దర్శిస్తున్నారు.) |
| ఆత్మానమ్ | = ప్రత్యక్-చైతన్యాన్ని; | | |

**తా॥** కొందరు మనస్సును ధ్యాన ప్రవృత్తమొనర్చి స్వదేహంలోనే, మరికొందరు ప్రకృతి-పురుష భేదపర్యాలోచనమైన సాంఖ్యయోగాన్ని అవలంబించి, ఇతరులు అష్టాంగయోగాన్ని అవలంబించి, తదితరులు నిష్కామ కర్మయోగాన్ని అవలంబించి ఆత్మను దర్శిస్తున్నారు.[3] 24[4]

---

1. ధ్యానం = శబ్దాది విషయాల నుండి శ్రోత్రాదులైన ఇంద్రియాలను మరల్చి, మనస్సు ఉపసంహరించి, మనస్సుతో ధ్యేయవస్తువును, తైలధార వలే అవిచ్ఛిన్నంగా చింతన చేయడం.

2. జ్ఞానం = సత్త్వరజస్తమోగుణాలు నా దృశ్యాలు, నేను ద్రష్టను సాక్షిని, నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్తాత్మను అను దృఢనిశ్చయం.

3. ఇది వికల్పోక్తి కాదు, క్రమసముచ్చయం.

4. ఈ శ్లోకానికి తాత్పర్య అన్వయంలో చూపినట్లు గాక మరొక రీతిగా వ్రాయబడింది.

**అన్యేత్వేవ మజానన్తః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 25**

*అన్యే, తు, ఏవమ్, అజానంతః, శ్రుత్వా, అన్యేభ్యః, ఉపాసతే,*
*తే, అపి, చ, అతితరన్తి, ఏవ, మృత్యుమ్, శ్రుతిపరాయణాః.*

| | | | |
|---|---|---|---|
| అన్యేతు | = మరికొందరు; | ఉపాసతే | = ఉపాసిస్తున్నారు; |
| ఏవమ్ | = ఇలా, యథార్థరీతిగా (ఆత్మను); | తే అపి చ | = వీరు కూడా; |
| | | శ్రుతి పరాయణాః | = గురూపదేశంలో నిష్ఠులై; |
| అజానన్తః | = ఎరుగని వారైనప్పటికీ; | | |
| అన్యేభ్యః | = ఇతరుల నుండి (గురువు నుండి); | మృత్యుం | = మృత్యుమయమైన సంసారాన్ని; |
| శ్రుత్వా | = విని; | అతి తరంతి ఏవ | = అతిక్రమిస్తున్నారు. |

**తా॥** కొందరు ఈ ఆత్మ తత్త్వాన్ని ఎరుగజాలక, ఆచార్యోపదేశాన్ని పొంది ఉపాసిస్తున్నారు; ఉపదేశ-నిష్ఠులైన వీరు కూడా మృత్యుమయమైన సంసారాన్ని క్రమంగా అతిక్రమిస్తున్నారు. 25

**యావత్సఞ్జాయతే కిఞ్చిత్ సత్త్వం స్థావరజఙ్గమమ్ ।**
**క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥ 26**

*యావత్, సంజాయతే, కించిత్, సత్త్వమ్, స్థావరజంగమమ్,*
*క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్, తత్, విద్ధి, భరత ఋషభ.*

| | | | |
|---|---|---|---|
| భరత ఋషభ | = అర్జునా; | తత్ | = అది; |
| స్థావర జఙ్గమమ్ | = స్థిరచర రూపమైన; | క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్ | = క్షేత్ర, క్షేత్రజ్ఞుల సంయోగం వల్ల ; |
| సత్త్వమ్ | = పదార్థం (వస్తువు); | | |
| యావత్ కిఞ్చిత్ | = ఏ కొంచెం (ఏదైనా); | (అని) విద్ధి | = గ్రహించు; |
| సంజాయతే | = పుడుతోందో; | | |

**తా॥** అర్జునా! స్థావర-జంగమ రూపమైన పదార్థాల సృష్టి, క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగం వల్లే[1] (అవివేక కృతమైన తాదాత్మ్య-అధ్యాస వల్లే) అని గ్రహించు. 26

1. రజ్జువు, మరుభూమి, శుక్తి-వీటిని గురించిన వివేకజ్ఞానం లేకపోవడం వల్ల సర్ప, మరీచికా, రజత సంయోగం ఒనర్చబడుతోంది. అలాగే, క్షేత్ర క్షేత్రజ్ఞుల వివేకజ్ఞానం లేకపోవడం వల్ల పరస్పర ధర్మా ధ్యాస కలుగుతోంది. ఈ సంయోగం మిథ్యాజ్ఞానం.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్య త్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 27**

సమమ్, సర్వేషు, భూతేషు, తిష్ఠంతమ్, పరమేశ్వరమ్,
వినశ్యత్సు, అవినశ్యంతమ్, యః, పశ్యతి, సః, పశ్యతి.

| | | | |
|---|---|---|---|
| సర్వేషు భూతేషు | = సర్వభూతాలలో; | పరమేశ్వరమ్ | = పరమేశ్వరుణ్ణి (బ్రహ్మాన్ని); |
| సమమ్ | = సమానంగా (ఒకే రీతిగా); | యః | = ఎవడు; |
| తిష్ఠన్తమ్ | = వెలయుచున్నవాడూ; | పశ్యతి | = చూస్తాడో; |
| వినశ్యత్సు | = నశ్వరమైన వస్తువులలో; | సః | = అతడు; |
| అవినశ్యన్తమ్ | = నశించకుండా వెలయువాడూ అయిన; | పశ్యతి | = యథార్థదర్శి. |

తా॥ (సంసారోద్భవం అవివేక కృతమని పూర్వశ్లోకంలో చెప్పబడింది; ఆ అవివేకాన్ని నివారించడానికి, అసంగాత్మ విషయకమైన సమ్యగ్దర్శనం వర్ణించబడుతోంది :) స్థావర-జంగమాత్మకాలైన సర్వభూతాలలో సమభావంలో (సద్రూపంలో) ప్రకాశించేదీ, నశ్వరవస్తువులలో కూడా నశించకుండా ప్రకాశించేదీ అయిన పరమాత్మను దర్శించేవాడే యథార్థదర్శి. (గీత : 8-20 చూ:) 27

**సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ 28**

సమమ్, పశ్యన్, హి, సర్వత్ర, సమవస్థితమ్, ఈశ్వరమ్,
న, హినస్తి, ఆత్మనా, ఆత్మానమ్, తతః, యాతి, పరామ్, గతిమ్.

| | | | |
|---|---|---|---|
| హి | = ఏలయన; | ఆత్మానమ్ | = తన్ను; |
| సర్వత్ర | = అంతటా; | ఆత్మా నా | = తన చేత; |
| సమమ్ | = సమానంగా; | న హినస్తి | = హింసించుకోడు; |
| సమవస్థితమ్ | = వెలయుచున్న; | తతః | = కనుక; |
| ఈశ్వరమ్ | = పరమాత్మను; | పరాంగతిమ్ | = మోక్షాన్ని; |
| పశ్యన్ | = చూస్తున్న (వాడు); | యాతి | = పొందుతాడు. |

**తా॥** (దీనిని సమ్యక్- దర్శనం అనడం ఎందుకు? అంటే-) సర్వత్ర సమానంగా ప్రకాశించే పరమాత్మను దర్శించే వ్యక్తి తనను తాను హింసించుకోడు.

(అంటే, అవిద్య చేత సచ్చిదానందరూపమైన ఆత్మను వినాశమొనర్చడం లేదు.) కనుక అతడు మోక్షాన్ని పొందుతాడు. (ఇలా చూడనివాడు దేహాత్మదర్శి, అతడు శరీరంతో ఆత్మను హింసిస్తున్నాడు.[1]) (ఈశావాస్యోపనిషత్తు 3 చూ:) 28

**ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।**
**యః పశ్యతి తథాత్మానం అకర్తారం స పశ్యతి ॥ 29**

*ప్రకృత్యా, ఏవ, చ, కర్మాణి, క్రియమాణాని, సర్వశః,*
*యః, పశ్యతి, తథా, ఆత్మానమ్, అకర్తారమ్, సః, పశ్యతి.*

| | | | |
|---|---|---|---|
| యః చ | = మరియు ఎవడు; | (అని) తథా | = అలాగే; |
| కర్మాణి | = మనోవాక్కాయ కృతాలైన కర్మలన్నింటిని; | ఆత్మానమ్ | = తనను; |
| ప్రకృత్యా ఏవ | = మహదాదులైన కార్యకారణ ఆకారంగా పరిణమించిన మాయాశక్తి చేతనే; | అకర్తారమ్ | = కర్తృత్వరహితునిగా (సర్వోపాధి వర్జితునిగా); |
| సర్వశః | = సర్వవిధాల; | పశ్యతి | = చూస్తాడో; |
| క్రియ మాణాని | = ఒనర్చబడుతున్నాయి, | సః | = అతడు; |
| | | పశ్యతి | = యథార్థదర్శనం ఒనర్చుతున్నాడు. |

**తా॥** మనోవాక్కాయ కృతాలైన కర్మల నన్నింటిని, దేహేంద్రియ ఆకారంగా పరిణమించిన ప్రకృతియే సర్వవిధాలా ఒనర్చుతోందనీ, ఆత్మ సర్వోపాధి వర్జితం అనీ (దేహాభిమానం చేతనే కర్తృత్వ భ్రాంతి అనీ) గ్రహించే వ్యక్తి, సమ్యక్-దర్శి. (గీత. 3-27; సాంఖ్య కారికా 62 చూ.) 29

**యదా భూత పృథగ్భావం ఏకస్థ మనుపశ్యతి ।**
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30**

*యదా, భూత పృథక్ భావమ్, ఏకస్థమ్, అనుపశ్యతి,*
*తతః, ఏవ, చ, విస్తారమ్, బ్రహ్మ, సంపద్యతే, తదా.*

---

1. అజ్ఞానికి ఆత్మ అవృతం; అతడు దేహాన్నే ఆత్మగా గ్రహించి, దాని మృతినే తన మృతిగా భావించి, పదే పదే హతుడవుతున్నట్లు ఉన్నాడు. అవిద్య చేత ఆత్మస్వరూపం ఆవృతమై హతమైనట్లే అతనికి తోస్తున్నది. ఆత్మసత్త ఫలం అతనికి కలగడం లేదు.

| | |
|---|---|
| యదా = ఎప్పుడు; | విస్తారమ్ = ఉత్పత్తిని (నానాత్వమును); |
| భూత పృథక్ భావం = భూతసమూహాల పార్థక్యం, బహుత్వం, నానాత్వం; | అను పశ్యతి = శాస్త్రాచార్యోపదేశాన్ని అనుసరించి దర్శిస్తాడో; |
| ఏకస్థమ్ = ఒక్క ఆత్మ యందే నెలకొని ఉండడాన్ని; | తదా = అప్పుడు; |
| తతః ఏవ చ = దాని నుండే (ఆ ఆత్మ నుండే); | బ్రహ్మ సంపద్యతే = బ్రహ్మస్వరూపుడు అవుతాడు. |

**తా॥** యోగి ఎప్పుడు వివిధ భూతాల ఉనికిని ఆత్మయందు[1] దర్శిస్తాడో, మరియు ఆ ఆత్మ నుండే భూతాల ఉత్పత్తియని గ్రహిస్తాడో, అప్పుడతడు బ్రహ్మ స్వరూపుడవుతాడు. (గీత : 6-29,30;18-20 చూ:)

[లేక] యోగి ఎప్పుడు, 'ఈ భేదసృష్టి అంతా ప్రళయకాలంలో ఏకమై ఈశ్వరశక్తియైన ప్రకృతియందు లయించి, మళ్ళీ సృష్టి సమయంలో వెలికి వస్తున్నది – ఇదంతా కూడా దాని విస్తృతియే' అని గ్రహిస్తాడో, అప్పుడు ఈ అభేద దర్శన ఫలంగా అతడు బ్రహ్మమే అవుతాడు. (గీత : 6-7 చూ:) 30

**అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః ।**
**శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥ 31**

అనాదిత్వాత్, నిర్గుణత్వాత్, పరమాత్మా, అయమ్, అవ్యయః, శరీరస్థః, అపి, కౌంతేయ, న, కరోతి, న, లిప్యతే.

| | |
|---|---|
| కౌన్తేయ = అర్జునా; | పరమాత్మా = పరమాత్మ; |
| అనాదిత్వాత్ = ఆదిరహితమైనందు వల్ల; | శరీరస్థః అపి = శరీరంలో వెలయుచున్నప్పటికీ; |
| నిర్గుణత్వాత్ = త్రిగుణ సంబంధ శూన్యమవడం వల్ల; | న కరోతి = కర్తృత్వాన్ని పొందడు; |
| అయం = ఈ; | న లిప్యతే = కర్మఫలంచే లిప్తుడు కాడు. |
| అవ్యయః = అక్షయమైన; | |

**తా॥** (సంసారస్థితిలో శరీర నిమిత్తములైన కర్మలు, కర్మ ఫలాలు, సుఖ దుఃఖాలు కలుగుతుండగా సమదర్శనం ఎలా, అంటావా?) అర్జునా! ఈ పరమాత్మ

1. ఆత్మా ఏవ ఇదగ్ంం సర్వం (ఛాందోగ్యోపనిషత్తు. 7-25-2) – ఆత్మయే ఇదంతా కూడా.
ఆత్మతః ప్రాణః ఆత్మతః ఆశా (అందే. 7-26-1) – ఈ ఆత్మ నుండే ప్రాణం, ఆశ మొదలైనవి.

అనాది, ఉత్పత్తి రహితం, నిర్గుణం, గుణ సంగం లేనిది (ఉత్పత్తి ఉన్నా వినాశమూ, గుణ సంగం ఉన్నా గుణవ్యయమూ -ఇవి లేవు కనుక) అవ్యయం. అవికారియైన ఈ పరమాత్మ, శరీరంలో ప్రకాశిస్తున్నప్పటికీ, ఏమీ కూడా ఒనర్చడంలేదు. కాబట్టి, దానికి కర్మఫల సంగం కూడా లేదు. (కనుక, పరమాత్మే శరీర స్థితుడై మిథ్యయైన జీవభావాన్ని పొందాదు.) 31

**యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥ 32**

*యథా, సర్వగతమ్, సౌక్ష్మ్యాత్, ఆకాశమ్, న, ఉపలిప్యతే.*
*సర్వత్ర, అవస్థితః, దేహే, తథా, ఆత్మా, న, ఉపలిప్యతే.*

| | | | |
|---|---|---|---|
| సర్వగతమ్ | = సర్వవ్యాపియైన; | తథా | = అలాగే; |
| ఆకాశమ్ | = ఆకాశం; | సర్వత్రదేహే | = సర్వశరీరాలలో; |
| సౌక్ష్మాత్ | = సూక్ష్మమవడం వల్ల; | అవస్థితః | = వెలయుచున్నప్పటికీ; |
| యథా | = ఏ రీతిగా; | ఆత్మా | = ఆత్మ; |
| న ఉపలిప్యతే | = అంటబడదో; | న ఉపలిప్యతే | = లిప్తుడు కాడు. |

**తా॥** సర్వవ్యాపి అయిన ఆకాశం సూక్ష్మమవడం వల్ల, దేని చేతా కూడా అంటబడని విధంగా, సకలశరీరాలలో ప్రకాశించేది అయినప్పటికీ ఆ ఆత్మ, ఆయా శరీరాల గుణదోషాల చేత తాకబడడం లేదు.

(శ్రీమద్భాగవతమ్. 10-28-26 చూ:) 32

**యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 33**

*యథా, ప్రకాశయతి, ఏకః, కృత్స్నమ్, లోకమ్, ఇమమ్, రవిః,*
*క్షేత్రమ్, క్షేత్రీ, తథా, కృత్స్నమ్, ప్రకాశయతి, భారత.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | కృత్స్నమ్ | = సమస్తమైన; |
| ఏకః | = ఒక్కడే అయిన; | లోకమ్ | = జగత్తును; |
| రవిః | = సూర్యుడు; | యథా | = ఏ రీతిగ; |
| ఇమమ్ | = ఈ; | ప్రకాశయతి | = ప్రకాశింపజేస్తున్నాడో; |

| | | | |
|---|---|---|---|
| తథా | = అదే విధంగా; | క్షేత్రమ్ | = శరీరం (మహాభూతాల నుండి ధృతి వరకు గల అజ్ఞాన-జగత్తును); |
| క్షేత్రీ | = దేహి (పరమాత్మ); | ప్రకాశయతి | = ప్రకాశింపజేస్తున్నాడు. |
| కృత్స్నమ్ | = సమస్తమైన; | | |

**తా॥** (ఆత్మకు సంగం లేదని ఆకాశదృష్టాంతంలో తెలుపబడింది; ఆత్మ అంతటిని ప్రకాశింపజేసేదే అయినా, ప్రకాశ్య పదార్థాల ధర్మం దానికి లేదు; దాని స్వప్రకాశత్వ ధర్మం అంటే 'అదే అన్నింటిని ప్రకాశింపజేస్తోంది, దానిని ప్రకాశింపజేసే వారెవ్వరూ లేరు' అని సూర్యుని దృష్టాంతం చేత నిరూపించ బడుతోంది.) భారతా! సూర్యుడొక్కడే ఈ జగత్తు నంతటినీ ప్రకాశింపజేస్తున్నట్లు, క్షేత్రి (పరమాత్మ) క్షేత్రాలనన్నింటినీ అంటే మహా భూతాల నుండి ధృతి వరకు గల అజ్ఞాన జగత్తునంతటినీ (గీత : 13-5,6 చూ.) ప్రకాశింపజేస్తున్నాడు. (అయినా కూడా ఆత్మకు ప్రకాశ్యధర్మం లేదు; దాని నిర్లేపత్వం అటువంటిది!) 33

**క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం అన్తరం జ్ఞానచక్షుషా ।**
**భూతప్రకృతి మోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్ ॥ 34**

*క్షేత్రక్షేత్రజ్ఞయోః, ఏవమ్, అంతరమ్, జ్ఞానచక్షుషా,*
*భూతప్రకృతి మోక్షమ్, చ, యే, విదుః, యాంతి, తే, పరమ్.*

| | | | |
|---|---|---|---|
| యే | = ఎవరు; | జ్ఞాన చక్షుషా | = జ్ఞాన నేత్రంతో; |
| ఏవమ్ | = ఈ రీతిగ; | విదుః | = గ్రహిస్తారో; |
| క్షేత్ర-క్షేత్రజ్ఞయోః | = క్షేత్రక్షేత్రజ్ఞుల; | తే | = వారు; |
| అన్తరమ్ | = భేదమును; | పరమ్ | = పరబ్రహ్మాన్ని; |
| భూత ప్రకృతి మోక్షం చ | = మరియు, భూత సమూహపు మిథ్యాత్వాన్ని, ప్రకృతికి గల మిథ్యాత్వాన్ని; | యాంతి | = పొందుతున్నారు. |

**తా॥** ఈ విధంగా ఎవరు క్షేత్ర-క్షేత్రజ్ఞుల జడ-చైతన్య రూపభేదాన్ని (శాస్త్ర, ఆచార్య ఉపదేశ జనితమైన) 'జ్ఞాన నేత్రం'తో గాంచుతున్నారో; మరియు (పరమార్థమైన ఆత్మవిద్య చేత, మాయ అనబడే) అవిద్యా రూప ప్రకృతి 'మిథ్య' అని గ్రహిస్తున్నారో వారు పరబ్రహ్మాన్ని పొందుతున్నారు, మళ్ళీ జన్మించరు.[1] 34

1. దృగ్-దృశ్యౌ ద్వౌ పదార్థౌ స్తః పరస్పరవిలక్షణౌ,
దృగ్ బ్రహ్మదృశ్యం మాయేతి సర్వవేదాంతడిండిమః. - దృగ్ దృశ్య వివేకమ్. →

ఇతి శ్రీ మద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగోనామ
త్రయోదశోఽధ్యాయః

శ్లోకసంఖ్య 34; మొదటినుండి (489+34) 523

వివిక్తౌ యేన తత్త్వేన మిశ్రౌ ప్రకృతిపూరుషౌ ।
తం వందే పరమానందం నందనందన మీశ్వరమ్ ॥

**తా॥** వాస్తవానికి వేరైనా, అధ్యాస చేత కలిసిపోయిన, ప్రకృతి-పురుషుల తత్త్వాన్ని నిరూపించిన శ్రీకృష్ణునికి నమస్కారం.



 ఒకదాని నుండి మరొకటిగా వేరైన, దృగ్ దృశ్యములనే పదార్థాలు రెండు ఉన్నాయి. దృక్కు అనగా ద్రష్ట, బ్రహ్మం; దృశ్యం అంటే జగత్తు, మాయ – ఇది సర్వ వేదాంతసార తత్త్వం.

దృక్, ద్రష్ట, క్షేత్రజ్ఞుడు = చైతన్య స్వరూపుడైన విజ్ఞాత, ప్రకాశకమైన బ్రహ్మం.

దృశ్యం, క్షేత్రం, జగత్తు = జడం, విషయం.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## చతుర్దశోఽధ్యాయః - గుణత్రయ విభాగ యోగః

## ( చతుర్దశాధ్యాయం - గుణత్రయ విభాగ యోగం)

పుంప్రకృత్యోః స్వతంత్రత్వం వారయ న్గుణసంగతః ।
ప్రాహ సంసారవైచిత్ర్యం విస్తరేణ చతుర్దశే ॥[1]

*శ్రీభగవానువాచ :*

**పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।**
**యజ్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1**

*పరమ్, భూయః, ప్రవక్ష్యామి, జ్ఞానానామ్, జ్ఞానమ్, ఉత్తమమ్, యత్, జ్ఞాత్వా, మునయః, సర్వే, పరామ్, సిద్ధిమ్, ఇతః, గతాః.*

| | | | |
|---|---|---|---|
| జ్ఞానానామ్ | = జ్ఞానాలన్నింటిలో; | సర్వే | = అందరూ; |
| ఉత్తమమ్ | = శ్రేష్ఠమూ; | ఇతః | = ఈ శరీర బంధం నుండి (విడివడి); |
| పరమ్ | = పరమార్థ విషయమూ అయిన; | పరాం సిద్ధిమ్ | = మోక్షరూపమైన సిద్ధిని; |
| జ్ఞానమ్ | = జ్ఞానాన్ని; | గతాః | = పొందారో (దాన్ని); |
| యత్ జ్ఞాత్వా | = దేనిని గ్రహించి; | భూయః | = మళ్ళీ; |
| మునయః | = మునులు; | ప్రవక్ష్యామి | = చెబుతున్నాను. |

1. ప్రకృతి, పురుషుల స్వాతంత్ర్యాన్ని నివారిస్తూ, గుణాల చేత కలిగే సంసార వైచిత్ర్యాన్ని విశదంగా వర్ణిస్తున్నాడు.

**తా॥** ['క్షేత్ర-క్షేత్రజ్ఞుల సంయోగం చేతనే సృష్టి' (13-26) అని శ్రీభగవానుడు బోధించి ఉన్నాడు. ఈ సృష్టి నిరీశ్వర సాంఖ్యులు చెప్పే విధంగా స్వతంత్రం కాదు; ఈశ్వరేచ్ఛ చేతనే సంభవిస్తోంది అని నిరూపించడానికి పూర్వం 'సత్ అసత్ -యోని జన్మలకు గుణ సంగమే కారణం' (13-21) అని చెప్పబడిన సత్త్వాది గుణాలు కూర్చే సృష్టి వైచిత్ర్యాన్ని వివరింపబూని, ఈ విషయాన్నే ప్రశంసిస్తూ] శ్రీభగవానుడు పలికెను : సర్వోత్తమమూ, పరమాత్మ విషయకమూ అయిన జ్ఞానాన్ని నీకు మళ్ళీ చెబుతాను. ఈ జ్ఞానాన్ని పొందిన మునులు దేహబంధం నుండి విడివడి, పరమసిద్ధి అయిన మోక్షాన్ని పొందారు. 1

**ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ।**
**సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥ 2**

*ఇదమ్, జ్ఞానమ్, ఉపాశ్రిత్య, మమ, సాధర్మ్యమ్, ఆగతాః,*
*సర్గే, అపి, న, ఉపజాయంతే, ప్రళయే, న, వ్యథంతి, చ.*

| | | | |
|---|---|---|---|
| ఇదమ్ | = ఈ; | ఆగతాః | = పొందినవారు; |
| జ్ఞానమ్ | = జ్ఞానాన్ని; | సర్గే అపి | = సృష్టి కాలంలో కూడా; |
| ఉపాశ్రిత్య | = ఆశ్రయించి; | న ఉపజాయంతే | = జన్మించరు; |
| మమ | = నా; | ప్రలయే చ | = ప్రళయకాలంలో కూడా; |
| సాధర్మ్యమ్ | = స్వరూపాన్ని; | న వ్యథన్తి | = దుఃఖాన్ని పొందరు. |

**తా॥** ఈ జ్ఞానాన్ని ఆశ్రయించి, మునులు నా స్వరూపాన్ని[1] పొందారు; వారు సృష్టికాలంలో జన్మించరు, ప్రళయకాలంలో దుఃఖించరు. 2

[ఇలా జ్ఞానాన్ని ప్రశంసించి, శ్రోత దృష్టిని ఆకర్షించి, పరమేశ్వర ఆధీనులైన ప్రకృతి పురుషుల నుండియే సృష్టియని తాను చెప్పదలచుకొన్న విషయాన్ని వివరిస్తున్నాడు :]

**మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।**
**సంభవ స్సర్వ భూతానాం తతో భవతి భారత ॥ 3**

1. ఇచ్చటి సాధర్మ్య పదమూ, (13-18) శ్లోకంలో 'మద్భావాయ' అనే పదమూ, (13-19) శ్లోకంలో 'మద్భావం' అనే పదమూ సమానార్థకములు.

*మమ, యోనిః, మహత్, బ్రహ్మ, తస్మిన్, గర్భమ్, దధామి, అహమ్,*
*సంభవః, సర్వ భూతానామ్, తతః, భవతి, భారత.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | గర్భమ్ | = సృష్టి బీజాన్ని; |
| మహద్బ్రహ్మ | = త్రిగుణాత్మకమైన ప్రకృతి; | దధామి | = ఉంచుతున్నాను; |
| మమ | = నాకు; | తతః | = దాని నుండి; |
| యోనిః | = గర్భస్థానం; | సర్వభూతానామ్ | = సర్వభూతాల; |
| తస్మిన్ | = దాని యందు; | సంభవః | = ఉత్పత్తి; |
| అహమ్ | = నేను; | భవతి | = జరుగుతోంది. |

**తా॥** అర్జునా! త్రిగుణాత్మిక అయిన ప్రకృతి నాకు యోనిస్థానం. (అది దేశ కాలాలను అతిక్రమించినదీ, స్వకార్య రూపంలో వృద్ధి చెందేదీ అవడం వల్ల 'మహత్–బ్రహ్మ' అనబడుతుంది.) అందులో నేను సృష్టి బీజాన్ని (చిదాభాసను) ఉంచుతాను.[1] అనంతరం (సంభవించిన హిరణ్యగర్భుని నుండే) సర్వభూతాలు సృష్టించబడుతున్నాయి. 3

**సర్వయోనిషు కౌన్తేయ మూర్తయ స్సంభవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥** 4

*సర్వయోనిషు, కౌంతేయ, మూర్తయః, సంభవన్తి, యాః,*
*తాసామ్, బ్రహ్మ, మహత్, యోనిః, అహమ్, బీజప్రదః, పితా.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా; | యోనిః | = జనని (ఉపాదానకారణం); |
| సర్వయోనిషు | = దేవ, పితృ, మనుష్య, పశు యోనులలో; | మహత్ బ్రహ్మ | = త్రిగుణాత్మకమైన ప్రకృతి; |
| యాః | = ఏ; | అహమ్ | = నేను; |
| మూర్తయః | = దేహాలు; | బీజప్రదః | = బీజాన్ని ఒసగే; |
| సంభవన్తి | = కలుగుతున్నాయో; | పితా | = జనకుణ్ణి, నిమిత్తకారణాన్ని. |
| తాసామ్ | = వాటికి; | | |

1. క్షేత్ర–క్షేత్రజ్ఞులనే ప్రకృతిద్వయం ఈశ్వరుని శక్తులు. అవిద్యా కామకర్మ రూపమైన ఉపాధిని అనుసరించే క్షేత్రజ్ఞుని (జీవుని) క్షేత్రం (శరీరం)తో ఈశ్వరుడు సంయోజితు నొనర్చుచున్నాడు. ప్రళయకాలంలో తన యందు లీనుడైన క్షేత్రజ్ఞుని క్షేత్రంతో సృష్టి కాలంలో సంయోజిస్తున్నాడు. (అవిద్య నుండి కామం, కామం నుండి కర్మ కలుగుతున్నాయి.)

**తా॥** (కేవలం సృష్ట్యారంభంలోనే నా ఆధీనాలైన ప్రకృతి పురుషుల నుండి ఇలా భూతోత్పత్తి అని తలచకు, సర్వదా ఇలాగే జరుగుతోంది :) కౌంతేయా! దేవ, పితృ, మనుష్య, పశ్వాది యోనుల నుండి ఉత్పన్నమైన దేహాలన్నింటికీ ప్రకృతి జనని; బీజప్రదాతనైన నేను జనకుణ్ణి. 4

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥ 5**

*సత్త్వమ్, రజః, తమః, ఇతి, గుణాః, ప్రకృతి సంభవాః,*
*నిబధ్నంతి, మహాబాహో, దేహే, దేహినమ్, అవ్యయమ్.*

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా; | గుణాః | = త్రిగుణాలు; |
| సత్త్వమ్ | = సత్త్వం; | అవ్యయమ్ | = నాశరహితమైన; |
| రజః | = రజస్సు; | దేహినమ్ | = ఆత్మను; |
| తమః | = తమస్సు; | దేహే | = శరీరంలో; |
| ఇతి | = అని; | నిబధ్నన్తి | = బంధిస్తున్నాయి. |
| ప్రకృతి సంభవాః | = మాయాజాతాలైన; | | |

**తా॥** (పరమేశ్వరాధీనమైన ప్రకృతి పురుషుల నుండి సర్వభూతోత్పత్తి – అని నిరూపించబడింది; ఇక ప్రకృతి సంగం వల్ల పురుషునికి కలిగే సంసారం వచింపబడుతోంది :) అర్జునా! ప్రకృతి నుండి సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు సంభవించాయి;[1] ఇవియే నిర్వికారమైన ఆత్మను శరీరంలో బంధిస్తున్నాయి. 5

**తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్ ।**
**సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ॥ 6**

*తత్ర, సత్త్వమ్, నిర్మలత్వాత్, ప్రకాశకమ్, అనామయమ్,*
*సుఖసంగేన, బధ్నాతి, జ్ఞానసంగేన, చ, అనఘ.*

| | | | |
|---|---|---|---|
| అనఘ | = పాపరహితుడా; | నిర్మలత్వాత్ | = స్వచ్ఛత వల్ల; |
| తత్ర | = ఈ మూడింటిలో; | సత్త్వమ్ | = సత్త్వగుణం; |

1. మూల ప్రకృతి యందు.

| | | | |
|---|---|---|---|
| అనామయమ్ | = ఉపద్రవరహిత సుఖాన్ని అభివ్యక్తీకరిస్తోంది; | సుఖ సఙ్గేన | = సుఖాసక్తి చేతా; |
| ప్రకాశకమ్ | = చైతన్యాన్ని కూడా అభివ్యక్తం చేస్తోంది; | జ్ఞాన సంగేన చ | = జ్ఞానాసక్తిచేతా; |
| | | (ఆత్మను)బధ్నాతి | = బంధిస్తోంది. |

**తా॥** (సత్త్వగుణ లక్షణం, అది బంధించే రీతి –తెలుపబడుతున్నాయి :) అనఘా! వీటిలో సత్త్వగుణం (స్ఫటికమణి వలె) నిర్మలమూ, శాంతమూ, ప్రకాశ స్వభావమూ అయి ఉంది; ఇది జ్ఞానాసక్తిని, సుఖాసక్తిని కలిగించి ఆత్మను బంధిస్తోంది. 6

**రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గ సముద్భవమ్ ।**
**తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్ ॥** **7**

*రజః, రాగ ఆత్మకమ్, విద్ధి, తృష్ణాసంగ సముద్భవమ్.*

*తత్, నిబధ్నాతి, కౌంతేయ, కర్మసంగేన, దేహినమ్.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా; | తత్ | = అది (రజోగుణం); |
| రజః | = రజో గుణం; | కర్మ సఙ్గేన | = దృష్ట-అదృష్ట ఫలహేతువులైన కర్మలయందు ఆసక్తిని కలిగించి; |
| రాగ ఆత్మకం | = రాగ రూపంగానూ; | | |
| తృష్ణాసఙ్గ సముద్భవం | = తృష్ణ నుండి (ఆసక్తి నుండి కలిగినదిగానూ); | దేహినమ్ | = ఆత్మను; |
| విద్ధి | = గ్రహించు; | నిబధ్నాతి | = బంధిస్తుంది. |

**తా॥** రజోగుణం రాగాత్మకం, తృష్ణ నుండి ఉత్పన్నమవుతోంది. ఇది జీవునికి వివిధ కర్మల యందు రాగాన్ని కలిగించి, వివిధ ఫలాలను పొందవలెననే ఆశను పురికొల్పి బంధిస్తోంది. 7

**తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్య నిద్రాభిః తన్నిబధ్నాతి భారత ॥** **8**

*తమః, తు, అజ్ఞానజమ్, విద్ధి, మోహనమ్, సర్వదేహినామ్,*

*ప్రమాద ఆలస్య నిద్రాభిః, తత్, నిబధ్నాతి, భారత.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | మోహనమ్ | = మోహాన్ని కలిగించేది; |
| తు | = కాని; | విద్ధి | = (అని) గ్రహించు; |
| తమః | = తమోగుణం; | తత్ | = అది (తమోగుణం); |
| అజ్ఞానజమ్ | = ఆవరణశక్తి ప్రధానమైన ప్రకృతి అంశం నుండి కలిగింది; | ప్రమాద ఆలస్య నిద్రాభిః | = మరపు, సోమరితనం, నిద్ర - వీటిచే (ఆత్మను); |
| సర్వదేహినామ్ | = శరీరాన్ని ధరించిన వారందరికీ; | నిబధ్నాతి | = బంధిస్తోంది. |

**తా॥** (తమోగుణ లక్షణం, అది బంధించే రీతి తెలుపబడుతున్నాయి:) భారతా! తమోగుణం ఆవరణశక్తి ప్రధానమైన ప్రకృతి అంశం నుండి ఉత్పన్నమై, దేహధారులందరికీ మోహాన్ని కలిగిస్తోంది - అని గ్రహించు. ఇది మరపు, మత్తు, నిద్ర మొదలైన వాటిచేత ఆత్మను శరీరంలో బంధించేదిగా ఉంది. 8

**సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత ।**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత ॥ 9**

*సత్త్వమ్, సుఖే, సంజయతి, రజః, కర్మణి, భారత,*
*జ్ఞానమ్, ఆవృత్య, తు, తమః, ప్రమాదే, సంజయతి, ఉత.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | ఉత | = మరి; |
| సత్త్వమ్ | = సత్త్వగుణం (జీవుణ్ణి); | తమః | = తమోగుణం; |
| సుఖే | = సుఖంలో; | జ్ఞానమ్ | = జ్ఞానాన్ని; |
| సఞ్జయతి | = తగుల్కొల్పును; | ఆవృత్య | = ఆవరించి; |
| రజః | = రజోగుణం; | ప్రమాదే | = అనవధానత యందు; |
| కర్మణి | = కర్మలో (తగుల్పుతుంది); | సఞ్జయతి | = చిక్కించును. |
| తు | = కాని; | | |

**తా॥** (గుణాల యొక్క విశేష సామర్థ్యం చెప్పబడుతోంది :) అర్జునా! సత్త్వగుణం, దుఃఖశోకాది కారణాలు ఉన్నప్పటికీ, జీవునికి సుఖాన్ని చేకూర్చు తోంది. ఇదేవిధంగా దుఃఖశోకాలు ఉన్నప్పటికీ, రజోగుణం కర్మలను ఆచరించేలా చేస్తోంది. తమోగుణం, మహాత్ముల వద్ద విన్న సత్యోపదేశాన్ని (జ్ఞానాన్ని) మరుగు పరిచి, విస్మృతి కలుగజేస్తోంది. 9

**రజ స్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।**
**రజ స్సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥ 10**

*రజః, తమః, చ, అభిభూయ, సత్త్వమ్, భవతి, భారత,*
*రజః, సత్త్వమ్, తమః, చ, ఏవ, తమః, సత్త్వమ్, రజః, తథా.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | సత్త్వమ్ | = సత్త్వగుణాన్ని; |
| రజః | = రజోగుణాన్ని; | తమః ఏవ చ | = తమోగుణాన్ని; |
| తమః | = తమో గుణాన్ని; | తథా | = అదేవిధంగా; |
| అభిభూయ | = అణచి; | తమః | = తమోగుణం; |
| సత్త్వమ్ | = సత్త్వగుణం; | సత్త్వమ్ | = సత్త్వగుణాన్ని; |
| భవతి | = కలుగుతోంది; | రజః | = రజోగుణాన్ని |
| రజః | = రజోగుణం; | | (అణచిపెట్టి, కలుగుతున్నాయి); |

**తా॥** భారతా! సత్త్వగుణం రజస్తమములను ఆక్రమించి ప్రబలమవుతోంది; రజోగుణం సత్త్వ, తమములను తిరస్కరించి ప్రాధాన్యం పొందుతోంది; తమోగుణం సత్త్వ, రజములను పరాభవించి పైకి వస్తోంది.[1] 10

**సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11**

*సర్వద్వారేషు, దేహే, అస్మిన్, ప్రకాశః, ఉపజాయతే,*
*జ్ఞానమ్, యదా, తదా, విద్యాత్, వివృద్ధమ్, సత్త్వమ్, ఇతి, ఉత.*

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడు; | జ్ఞానమ్ | = జ్ఞానరూపమైన |
| అస్మిన్ | = ఈ; | | (బుద్ధివృత్తిరూపమైన); |
| దేహే | = శరీరంలో; | ప్రకాశః | = ప్రకాశం;[2] |
| సర్వద్వారేషు | = సమస్త ఇంద్రియ | ఉపజాయతే | = పుడుతోందో; |
| | ద్వారాలలో వాటిని ప్రకాశింపజేయు; | తదా ఉత | = అప్పుడే; |

1. మానవదేహంలో కఫ వాత పిత్తాలకు సంగ్రామం జరుగుతున్నట్లుగానే, నిరంతరం ఈ గుణాలు ఒకదానిని ఒకటి అతిక్రమించిపోవడానికి యత్నిస్తుంటాయి. జయించిన గుణం ముందుకొచ్చి ప్రకాశిస్తుంది.

2. ప్రకాశం = బుద్ధివృత్తి విషయాకారంగా పరిణమించడం.
ప్రదీపం వలే సత్త్వ గుణం స్వవిషయంలో ఆవరణవిరోధి.

| | | | |
|---|---|---|---|
| సత్త్వమ్ | = సత్త్వగుణం; | ఇతి | = అని; |
| వివృద్ధం | = వృద్ధి చెందింది; | విద్యాత్ | = తెలిసికోవాలి. |

**తా॥** (ఇక వృద్ధి చెందిన గుణాల చిహ్నాలు చెప్పబడుతున్నాయి :) ఈ శరీరం ఆత్మకు భోగాయతనం; ఎప్పుడు ఈ శరీరద్వారాలైన శ్రోత్రాదుల యందు శబ్దాది జ్ఞానాత్మకమైన ప్రకాశం కలుగుతోందో, లేక ఆ శబ్దాదుల సుఖం పరిలక్షిత మవుతోందో, అప్పుడు సత్త్వగుణం వృద్ధి చెందింది అని తెలుసుకోవాలి.[1] 11

**లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా ।**
**రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ॥ 12**

*లోభః, ప్రవృత్తిః, ఆరంభః, కర్మణామ్, అశమః, స్పృహా,*
*రజసి, ఏతాని, జాయంతే, వివృద్ధే, భరత ఋషభ.*

| | | | |
|---|---|---|---|
| భరత ఋషభః | = భరతశ్రేష్ఠా; | అశమః | = అశాంతి; |
| రజసి | = రజోగుణం; | స్పృహా | = కర్మాకాంక్ష; |
| వివృద్ధే | = వృద్ధి పొందినప్పుడు; | ఏతాని | = ఇవి; |
| లోభః ప్రవృత్తిః | = లోభాన్నీ, పూనికనూ; | జాయన్తే | = పుడుతున్నాయి; |
| కర్మణామ్ ఆరంభః | = పనులను మొదలుపెట్టడమూ; | | |

**తా॥** అర్జునా! ధనం పెక్కురీతులలో లభిస్తున్నప్పటికీ ఇంకా కావాలనే అభిలాష (లోభం) ఎల్లప్పుడూ ఏదో ఒక పని చేయడం (ప్రవృత్తి), పెద్దవైన మేడలను మిద్దెలను కట్టుకునే ప్రయత్నాలు (కర్మలను ఆరంభించడం), 'ఈ పనిని ముగించి ఆ పనిని మొదలుపెడతాను' – ఇటువంటి సంకల్ప వికల్పాలు శాంతింపకుండడం (అశాంతి), ఏ వస్తువునైనా చూసిన వెంటనే కోరడం (స్పృహ), అనేవి రజోగుణం వృద్ధి చెందితే కలుగుతున్నాయి; ఈ చిహ్నాలు ఉన్న యెడల రజోగుణం ప్రబలమైంది అని గ్రహించు. 12

**అప్రకాశోఽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన ॥ 13**

---

1. ఇంద్రియాల చేతనం, జ్ఞానం, వివేకశక్తి : ఈ మూడూ సత్త్వగుణ సూచకాలు అని సంక్షేపం.

అప్రకాశః, అప్రవృత్తిః, చ, ప్రమాదః, మోహః, ఏవ, చ,
తమసి, ఏతాని, జాయంతే, వివృద్ధే, కురునందన.

| | | | |
|---|---|---|---|
| కురునన్దన | = అర్జునా; | ఏతాని | = ఇవి; |
| అప్రకాశః | = అవివేకం; | తమసి | = తమోగుణం; |
| అప్రవృత్తిః చ | = ప్రయత్న శూన్యత; | వివృద్ధే | = వృద్ధి చెందితే; |
| ప్రమాదః | = కర్తవ్యాల పట్ల ఔదాసీన్యం; | జాయన్తే | = కలుగుతున్నాయి. |
| మోహః ఏవ చ | = మూఢత్వం; | | |

**తా॥** కురునందనా! అవివేకం, ప్రయత్న శూన్యత, కర్తవ్య-ఔదాసీన్యం, మిథ్యాభినివేశం (మూఢత్వం) - అనేవి తమోగుణం ప్రాధాన్యం పొందితే పుడుతున్నాయి; ఇవి తమోవృద్ధి సూచకాలు అని గ్రహించు. 13

**యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।**
**తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే ॥ 14**

యదా, సత్త్వే, ప్రవృద్ధే, తు, ప్రళయమ్, యాతి, దేహభృత్,
తదా, ఉత్తమవిదామ్, లోకాన్, అమలాన్, ప్రతిపద్యతే.

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | తదా | = అప్పుడు; |
| యదా | = ఎప్పుడు; | ఉత్తమ విదామ్ | = శ్రేష్ఠులైన ఉపాసకులకు లభించే; |
| సత్త్వే | = సత్త్వగుణం; | | |
| ప్రవృద్ధే | = వృద్ధి చెందితే; | అమలాన్ | = నిర్మలమైన (సుఖభోగ స్థానాలైన); |
| దేహ భృత్ | = శరీరధారి (మనుష్యుడు); | | |
| ప్రలయమ్ | = మృత్యువును; | లోకాన్ | = లోకాలను; |
| యాతి | = పొందుతాడో; | ప్రతిపద్యతే | = పొందుతాడు. |

**తా॥** (మరణ సమయంలో వృద్ధి చెందిన సత్త్వాది గుణాల ఫలం చెప్పబడుతోంది :) సత్త్వ వృద్ధి కాలంలో దేహత్యాగం చేసిన మనుష్యుడు, ఉపాసకులకు లభించే ప్రకాశమయ హిరణ్యగర్భాది లోకాలను పొందుతున్నాడు. 14

**రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే ।**
**తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15**

*రజసి, ప్రళయమ్, గత్వా, కర్మసంగిషు, జాయతే,*
*తథా, ప్రలీనః, తమసి, మూఢయోనిషు, జాయతే.*

| | | | |
|---|---|---|---|
| రజసి | = రజోగుణం వృద్ధి చెందినప్పుడు; | తథా | = అదేవిధంగా; |
| ప్రలయం గత్వా | = మృతి చెందితే; | తమసి | = తమోగుణ వృద్ధికాలంలో; |
| కర్మసంగిషు | = కర్మాసక్తులైన మనుష్యులలో; | ప్రలీనః | = మరణిస్తే; |
| | | మూఢయోనిషు | =పశుపక్ష్యాది యోనులలో; |
| జాయతే | = జన్మిస్తాడు; | జాయతే | = జన్మిస్తాడు. |

**తా॥** రజోగుణం ప్రబలమైన స్థితిలో మరణిస్తే, కర్మాసక్తమైన మనుష్యలోకంలో జన్మిస్తున్నాడు; అదే విధంగా, తమోగుణం వృద్ధి చెందినప్పుడు చనిపోయిన యెడల పశుపక్ష్యాది మూఢయోనులలో పుడుతున్నాడు. 15

**కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।**
**రజసస్తు ఫలం దుఃఖం అజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16**

*కర్మణః, సుకృతస్య, ఆహుః, సాత్త్వికమ్, నిర్మలమ్, ఫలమ్,*
*రజసః, తు, ఫలమ్, దుఃఖమ్, అజ్ఞానమ్, తమసః, ఫలమ్.*

| | | | |
|---|---|---|---|
| సుకృతమ్ | = సత్త్వగుణ సంభవమైన; | రజసః తు | = రాజసిక కర్మకు; |
| | | ఫలమ్ | = ఫలం; |
| కర్మణః | = కర్మకు; | దుఃఖము | = దుఃఖం; |
| నిర్మలమ్ | = నిర్మలమూ; | తమసః | = తామసిక కర్మకు, (అధర్మానికి); |
| సాత్త్వికమ్ | = సత్త్వప్రధానమైన; | | |
| ఫలమ్ | = ఫలమని (శిష్టులు); | ఫలమ్ | = ఫలం; |
| ఆహుః | = చెబుతారు; | అజ్ఞానమ్ | = మోహం (అని చెబుతారు). |

**తా॥** (సత్త్వాది గుణాలకు స్వాభావికమైన కర్మల యొక్క ఫలభేదం చెప్పబడుతోంది-) సాత్త్విక కర్మల ఫలం నిర్మల సుఖమనీ, రాజసిక కర్మల ఫలం దుఃఖమనీ, తామసిక కర్మల ఫలం అజ్ఞానమనీ శిష్టులు చెబుతున్నారు.
(గీత : 18-23, 24, 25 చూ :) 16

**సత్త్వాత్ సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ ॥ 17**

*సత్త్వాత్, సంజాయతే, జ్ఞానమ్, రజసః, లోభః, ఏవ, చ,*
*ప్రమాదమోహౌ, తమసః, భవతః, అజ్ఞానమ్, ఏవ, చ.*

| | | | |
|---|---|---|---|
| సత్త్వాత్ | = సత్త్వగుణం నుండి; | తమసః చ | = మరి, తమస్సు నుండి; |
| జ్ఞానమ్ | = జ్ఞానం; | అజ్ఞానమ్ | = అవివేకం; |
| సఞ్జాయతే | = కలుగుతోంది; | ప్రమాద మోహౌ ఏవ చ | = విస్మృతి, విమూఢత్వమూ; |
| రజసః | = రజోగుణం నుండి; | | |
| లోభః ఏవ | = లోభమే (కలుగును); | భవతః | = కలుగుతున్నాయి. |

**తా॥** (ఈ ఫలభేదానికి కారణం ఏమంటే-) సత్త్వగుణం నుండి జ్ఞానం కలుగుతోంది. (కనుక, సాత్త్వికి కర్మ వల్ల ప్రకాశబహుళమైన సుఖం లభిస్తోంది) రజోగుణం నుండి లోభం కలుగుతోంది. (ఇది దుఃఖ హేతువవడం వల్ల, ఈ కర్మల ఫలం కూడా దుఃఖమే) తమస్సు నుండి అవివేకం, అనవధానత, విమూఢత్వం కలుగుతున్నాయి (కాబట్టి తామసిక కర్మలకు అంటే, అధర్మాచరణానికి ఫలం మోహం). 17

**ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।**
**జఘన్య గుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥ 18**

*ఊర్ధ్వమ్, గచ్ఛంతి, సత్త్వస్థాః, మధ్యే, తిష్ఠంతి, రాజసాః,*
*జఘన్య గుణవృత్తిస్థాః, అధః, గచ్ఛంతి, తామసాః.*

| | | | |
|---|---|---|---|
| సత్త్వస్థా | = సాత్త్వికులు; | జఘన్య గుణ వృత్తిస్థాః | = నీచగుణ వృత్తులందున్న; |
| ఊర్ధ్వమ్ | = దేవ లోకాలకు; | | |
| గచ్ఛన్తి | = పోవుచున్నారు; | తామసాః | = తామసికులు; |
| రాజసాః | = రాజసికులు; | అధః | = నిమ్న లోకాలకు; |
| మధ్యే | = మనుష్యలోకంలో; | గచ్ఛన్తి | = వెళుతున్నారు. |
| తిష్ఠన్తి | = ఉంటారు; | | |

**తా॥** (సత్త్వాది వృత్తిశీలుర ఫలభేదం చెప్పబడుతోంది.) సాత్త్వికులు మనుష్య-గంధర్వ లోకం నుండి సత్య లోకం వరకూ గల ఊర్ధ్వ లోకాలకు పోతున్నారు. రాజసికులు మనుష్య లోకంలోనే జన్మిస్తున్నారు. ఆలస్య నిద్రాది

యుతులైన తామసికులు తామిస్రాది నరకాలలో (పశ్వాది యోనులలో) పడుతున్నారు.[1] 18

**నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19**

*న, అన్యమ్, గుణేభ్యః, కర్తారమ్, యదా, ద్రష్టా, అనుపశ్యతి,*
*గుణేభ్యః, చ, పరమ్, వేత్తి, మద్భావమ్, సః, అధిగచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| యదా | = ఎప్పుడైతే; | గుణేభ్యః చ | = త్రిగుణాలకు; |
| ద్రష్టా | = దర్శకుడు (వివేకియైనజీవుడు); | పరమ్ | = అతీతుడైన సాక్షిని; |
| గుణేభ్యః | = గుణాల నుండి; | వేత్తి | = తెలుసుకుంటాడో; |
| అన్యమ్ | = వేరైన; | (తదా | = అప్పుడు;) |
| కర్తారమ్ | = కర్తను; | సః | = అతడు; |
| న అనుపశ్యతి | = చూడడం లేదో; (చూడడో) | మద్భావమ్ | = నా స్వరూపాన్ని; |
| | | అధిగచ్ఛతి | = పొందుతాడు. |

**తా॥** (ఇంతవరకూ గుణ సంగ-కృతమైన సంసారం వర్ణింపబడింది; ఇక తద్వ్యతిరిక్తమైన మోక్షాన్ని ప్రదర్శిస్తున్నాడు -) ద్రష్టయైన జీవుడెప్పుడు వివేకాన్ని గణించి, (బుద్ధ్యాద్య ఆకారంగా పరిణమించిన) గుణాల కంటే వేరైన కర్తను చూడడో (గుణాలే కర్మలను ఒనర్చుతున్నాయని చూస్తాడో) మరియు; ఈ గుణ వ్యాపారాలకు అతీతుడై సాక్షిగా ఉన్న ఆత్మను దర్శిస్తాడో, అప్పుడతడు నా భావాన్ని (అంటే బ్రహ్మ స్వరూపాన్ని) పొందుతాడు. 19

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్**
**జన్మ మృత్యు జరా దుఃఖైః విముక్తోఽమృత మశ్నుతే ॥ 20**

*గుణాన్, ఏతాన్, అతీత్య, త్రీన్, దేహీ, దేహసముద్భవాన్,*
*జన్మ మృత్యు జరా దుఃఖైః, విముక్తః, అమృతమ్, అశ్నుతే.*

1. ఊర్ధ్వమ్ = ఊర్ధ్వ లోకం, ఉన్నతి, బుద్ధి;
మధ్యే = భూలోకం, మధ్యస్థితి, కర్మేంద్రియస్థితి;
అధః = పాతాళం, నీచస్థితి, పశుప్రవృత్తి.

| | |
|---|---|
| దేహసముద్భవాన్ = దేహోత్పత్తికి కారణమైన; | జన్మ మృత్యు జరా దుఃఖైః = పుట్టుక, చావు, ముదిమి, అను దుఃఖాల చేత; |
| ఏతాన్ = ఈ; | విముక్తః = విడివడిన; |
| త్రీన్ = మూడు; | దేహీ = జీవుడు; |
| గుణాన్ = గుణాలను; | అమృతమ్ = అమృతత్వాన్ని; |
| అతీత్య = దాటి; | అశ్నుతే = పొందుతాడు. |

**తా॥** (ఇటువంటి జ్ఞానం ప్రసాదించి, సర్వానర్థ నివృత్తిని, కృతకృత్యతను తెలుపుతున్నాడు–) దేహోత్పత్తికి కారణమైన (దేహాది ఆకారంగా పరిణమించిన) ఈ గుణత్రయాన్ని అతిక్రమించిన జీవుడు, జనన మరణ జరా దుఃఖాల నుండి విడివడి, అమృతత్వాన్ని పొందుతున్నాడు. 20

అర్జున ఉవాచ :

**కైర్లిఙ్గైః త్రీన్‌గుణా నేతానతీతో భవతి ప్రభో ।**
**కిమాచారః కథం చైతాన్ త్రీన్గుణానతివర్తతే ॥ 21**

*కైః, లింగైః, త్రీన్, గుణాన్, ఏతాన్, అతీతః, భవతి, ప్రభో,*
*కిమాచారః, కథమ్, చ, ఏతాన్, త్రీన్, గుణాన్, అతివర్తతే.*

| | |
|---|---|
| ప్రభో = భగవంతుడా; | కిమాచారః = ఎటువంటి ఆచారం కలిగి; |
| ఏతాన్ = ఈ; | భవతి = ఉంటాడు; |
| త్రీన్ = మూడు; | కథం చ = ఏ ఉపాయంతో; |
| గుణాన్ = గుణాలకు; | ఏతాన్ = ఈ; |
| అతీతః = అతీతుడు (ముక్తుడు); | త్రీన్ గుణాన్ = గుణత్రయాన్ని; |
| కైః లింగైః = ఏ లక్షణాలతో కూడినవాడిగా; | అతివర్తతే = అతిక్రమిస్తున్నాడు. |

**తా॥** (జీవితకాలంలోనే గుణాలను అతిక్రమించి, అమృతత్వాన్ని పొందుతాడని చెప్పబడింది; ఆ గుణాతీతుని గురించి లెస్సగా తెలుసుకో గోరుచూ) అర్జునుడు ప్రశ్నించెను : ప్రభూ! గుణాతీత పురుషుని లక్షణాలు ఏవి? అతని ఆచరణ ఏ విధంగా ఉంటుంది? ఈ గుణాలను అతిక్రమించడం ఎలా? (మూడు ప్రశ్నలు). 21

శ్రీ భగవానువాచ :

**ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ ।**
**న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ॥ 22**

ప్రకాశమ్, చ, ప్రవృత్తిమ్, చ, మోహమ్, ఏవ, చ, పాండవ,
న, ద్వేష్టి, సంప్రవృత్తాని, న, నివృత్తాని, కాంక్షతి.

| | | | |
|---|---|---|---|
| పాండవ | = అర్జునా; | (యః | = ఎవడు;) |
| సంప్రవృత్తాని | = ఆవిర్భవించినట్టి; | న ద్వేష్టి | = ద్వేషించకుంటాడో; |
| ప్రకాశం చ | = సత్త్వగుణ ధర్మాన్ని; | నివృత్తాని | = నివృత్తమైన వాటిని; |
| ప్రవృత్తిం చ | = రజోగుణ ధర్మాన్ని; | న కాంక్షతి | = కోరకుండా ఉంటాడో |
| మోహమ్ ఏవ చ | = తమోగుణ ధర్మాన్ని; | (అతడు గుణాతీతుడని చెప్పబడును). | |

**తా॥** (గుణాతీతుని స్వసంవేద్య లక్షణాన్ని) శ్రీకృష్ణుడు చెబుతున్నాడు : పాండవా! ప్రకాశం, ప్రవృత్తి, మోహం అను సత్త్వరజస్తమః కార్యాలు వాటంతట అవియే ఆవిర్భవించినా గుణాతీత పురుషుడు (వాటిని దుఃఖాలుగా భావించి) ద్వేషించడు;[1] అవి నివృత్తములైనప్పుడు (సుఖాలుగా భావించి) ఆకాంక్షించడు.[2] 22

**ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే**
**గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥ 23**

ఉదాసీనవత్, ఆసీనః, గుణైః, యః, న, విచాల్యతే,
గుణాః, వర్తంతే, ఇతి, ఏవ, యః, అవతిష్ఠతి, న, ఇంగతే.

| | |
|---|---|
| ఉదాసీనవత్ = తటస్థునివలె; | యః = ఎవడు; |
| ఆసీనః = ఉన్నవాడై; | గుణైః = గుణములచేత; |

1. 'తమఃప్రత్యయం ఉత్పన్నమయింది – నేను మూఢుడను; రాజసిక ప్రత్యయం ఉత్పన్నమయింది – స్వరూపప్రచ్యుతి కలిగింది; సత్త్వగుణ ప్రత్యయం ఉత్పన్నమయింది – సుఖాసక్తిని కలిగిస్తోంది'. – అసమ్యక్ దర్శి ఈ విధంగా ద్వేషిస్తాడు; గుణాతీత పురుషుడు ద్వేషించడు.

2. గుణకార్యాలలో తనకు అనుకూలమైన వాటిని అసమ్యక్ దర్శి కాంక్షిస్తాడు, ప్రతికూలములైన వాటిని నిరాకరిస్తాడు. కాని, సమ్యక్ దర్శి వీటితో ఆత్మకు ఏ సంబంధమూ లేదని గ్రహించి, అనుకూల ప్రతికూల దృష్టి వహించడు; ప్రవృత్తిని గాని నివృత్తిని గాని కోరడు.

| | | | |
|---|---|---|---|
| న విచాల్యతే | = కదల్పబడడో; | ఏవమ్ | = ఇలా (గ్రహించి); |
| గుణాః | = గుణాలు; | యః | = ఎవడు; |
| వర్తంతే | = స్వకార్యాలలో వర్తిల్లుతున్నాయి; | అవతిష్ఠతి | = వెలయుచుండునో (మరి); |
| ఇతి | = అని; | న ఇఙ్గతే | = చలింపడో (అతడు గుణాతీతుడు); |

**తా॥** (గుణాతీతుని పరసంవేద్య లక్షణాన్నీ, ఆచారాన్నీ చెప్పబడుతున్నాయి:) ఎవడు ఉదాసీనుని వలే సాక్షీభూతుడై వెలయుచు, గుణకార్యాలైన సుఖః దుఃఖాల చేత చలించకుండా, స్వరూపప్రచ్యుతినొందక, గుణాలు స్వకార్యాలలో ప్రవర్తిల్లుతున్నాయి,[1] వీటితో నాకు సంబంధం లేదు అనే వివేకజ్ఞానంతో తూష్ణీంభూతుడై ఒప్పుచు చలించకుండా ఉంటాడో – అతడు గుణాతీత పురుషుడు.

(గీత : 3–28 చూ.) 23

**సమ దుఃఖ సుఖః స్వస్థః సమలోష్టాశ్మ కాఞ్చనః ।**
**తుల్య ప్రియాప్రియో ధీరః తుల్య నిన్దాత్మ సంస్తుతిః ॥ 24**

*సమ దుఃఖ సుఖః, స్వస్థః, సమ లోష్ట అశ్మ కాంచనః,*
*తుల్య ప్రియ అప్రియః, ధీరః, తుల్య నింద ఆత్మ సంస్తుతిః.*

| | | | |
|---|---|---|---|
| (యః | = ఎవడు;) | తుల్య ప్రియ అప్రియః | = ఇష్ట అయిష్టాలను ఒకే రీతిగా చూస్తాడో; |
| సమదుఃఖసుఖః | = సుఖదుఃఖాలలో సమజ్ఞానియో; | తుల్య నింద ఆత్మ సంస్తుతిః | = నిందా స్తుతులలో సమబుద్ధియో; |
| స్వ స్థః | = ఆత్మ స్వరూపంలో వెలయుచుండునో; | ధీరః | = ధీరుడో (అతడు గుణాతీతుడు). |
| సమ లోష్ట అశ్మ కాంచనః | = మట్టిపెళ్ల, రాతిపెంకు, బంగారాలను సమానంగా చూస్తాడో; | | |

**తా॥** సుఖదుఃఖాలలో సమబుద్ధి,[2] ఆత్మస్వరూప స్థితుడు, శిలామృత్పిండ

---

1. ఇంద్రియాకారంగా పరిణతములైన గుణాలు, విషయాకారంగా పరిణతములైన గుణాలలో వర్తిల్లుతున్నాయి. ప్రవృత్తి ఇంద్రియాలకే కాని ఆత్మకు కాదు. ఇంద్రియాదులకు వ్యతిరిక్తమైనది ఆత్మ – అని గ్రహించి, 'ఆత్మ కూటస్థం' అనే దృష్టిని గుణాతీతుడు త్యజించకుండా ఉంటాడు.

2. సుఖదుఃఖాల రాగద్వేషాలు అతనికి ఉండకపోవడానికి కారణం : అతడు వీటిని స్వకీయంగా భావించనే భావించడు.

సువర్ణాలలో సమదృష్టి, ప్రియాప్రియాలలో తుల్యజ్ఞాని,[1] నిందాప్రశంసలను ఒకేరీతిగా గ్రహించేవాడు అయిన ధీరుడు గుణాతీతుడు. 24

**మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారి పక్షయోః ।**
**సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥ 25**

*మాన అవమానయోః, తుల్యః, తుల్యః, మిత్ర, అరి పక్షయోః,*
*సర్వ ఆరంభ పరిత్యాగీ, గుణ అతీతః, సః, ఉచ్యతే.*

(యః = ఎవడు;)
మాన అవమానయోః = సమ్మాన తిరస్కారాలలో;
తుల్యః = సముడో;
మిత్ర అరి పక్షయోః = మిత్ర శత్రుల పక్షాలలో;
తుల్యః = సమబుద్ధియో;
సర్వ ఆరంభ పరిత్యాగీ = పుణ్యాపాపాలను ఒసగే సర్వకర్మలను త్యజించాడో;
సః = అతడు;
గుణ అతీతః = గుణాతీతుడని;
ఉచ్యతే = చెప్పబడును.

**తా॥** మానావమానాల యెడను, శత్రుమిత్రుల యెడను సమబుద్ధితో ఉండేవాడూ; దృష్టాదృష్ట ఫలదాయకాలైన కర్మలను అన్నింటిని త్యజించినవాడూ, (కేవలం దేహధారణ నిమిత్తం ప్రయోజనమైన కర్మలను ఆచరించేవాడూ) అయిన పురుషుడు త్రిగుణాతీతుడని చెప్పబడును.[2] 25

**మాం చ యోఽ వ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26**

*మామ్, చ, యః, అవ్యభిచారేణ, భక్తియోగేన, సేవతే,*
*సః, గుణాన్, సమతీత్య, ఏతాన్, బ్రహ్మభూయాయ, కల్పతే.*

యః చ = ఎవడు;
మామ్ = నన్ను (సర్వభూత హృదయస్థునిగా నారాయణునిగా);
అవ్యభిచారేణ = ఐకాంతికమైన;
భక్తియోగేన = భక్తియోగం చేత;
సేవతే = సేవిస్తాడో (ఉపాసిస్తాడో);

---

1. గుణాతీతుడైన జ్ఞానిదృష్టిలో ప్రియాప్రియాలు లేకున్నప్పటికీ, లోకదృష్టిని అవలంబించి ప్రియాప్రియాలని చెప్పబడినది.

2. గీత : 2-55,56,57,71; 5-3,18,19,20; 6-7,8,9,32; 12-13,19; 13-7,11 చూ.

| | | | |
|---|---|---|---|
| సః | = అతడు; | సమతీత్య | = అతిక్రమించి; |
| ఏతాన్ | = ఈ; | బ్రహ్మభూయాయ | = బ్రహ్మత్వానికి; |
| గుణాన్ | = గుణాలను; | కల్పతే | = సమర్థుడవుతున్నాడు. |

**తా॥** (ఇక గుణాలను అతిక్రమించే ఉపాయం చెప్పబడుతోంది :) ఎవడు, ఐకాంతికమైన భక్తితో సర్వభూత హృదయస్థితునిగా నన్ను (నారాయణుని) ఉపాసిస్తున్నాడో (సేవిస్తున్నాడో) అతడు గుణాలను అతిక్రమించి, బ్రహ్మభావాన్ని పొందడానికి సమర్థుడవుతున్నాడు.[1] (శ్రీమద్భాగవతమ్. 23-9-13 చూ :) 26

**బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం అమృతస్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తి కస్య చ ॥ 27**

*బ్రహ్మణః, హి, ప్రతిష్ఠా, అహమ్, అమృతస్య, అవ్యయస్య, చ,*
*శాశ్వతస్య, చ, ధర్మస్య, సుఖస్య, ఐకాంతి కస్య, చ.*

| | | | |
|---|---|---|---|
| హి | = ఏలయన; | ధర్మస్య చ | = జ్ఞానయోగ ధర్మప్రాప్యమూ; |
| అహమ్ | = నేను; | ఐకాంతికస్య సుఖస్య చ | = అవ్యభిచార సుఖస్వరూపమూ అయిన; |
| అవ్యయస్య | = వికారరహితమూ; | | |
| అమృతస్య | = వినాశరహితమూ; | బ్రహ్మణః | = బ్రహ్మానికి; |
| శాశ్వతస్య | = నిత్యమూ; | ప్రతిష్ఠా | = ఆశ్రయుణ్ణి. |

మరొక అన్వయం :

**హి అహం అవ్యయస్య అమృతస్య చ బ్రహ్మణః ప్రతిష్ఠా ।**
**శాశ్వతస్య ధర్మస్య చ, ఐకాంతికస్య సుఖస్య చ (ప్రతిష్ఠా) ॥**

**తా॥** (నన్ను సేవిస్తే గుణాలను అతిక్రమించడానికి కారణం ఏమంటావా:) నేను బ్రహ్మం యొక్క ప్రతిష్ఠను - ఘనీభూతమైన బ్రహ్మప్రతిమను. (ఘనీభూతమైన

---

1. 2వ అధ్యాయంలో చెప్పబడిన స్థితప్రజ్ఞుడు, 6వ అధ్యాయంలో చెప్పబడిన యోగి, 12వ అధ్యాయంలో చెప్పబడిన భక్తుడు, 13వ అధ్యాయంలో చెప్పబడిన జ్ఞాని, ఈ 14వ అధ్యాయంలో చెప్పబడిన గుణాతీత పురుషుడనే పేరుకు మాత్రమే వేరు; కాని వారు పొందే ఫలం ఒక్కటే. ఈ స్థితినే మహాభారతం బ్రాహణత్వం అని, బౌద్ధ గ్రంథాలు అర్హతత్వమని, తంత్ర గ్రంథాలు సిద్ధావస్థ అని పేర్కొంటున్నాయి.

ప్రకాశమే సూర్యమండలమైనట్లుగా) నిత్యమైన మోక్షానికి, తత్సాధనమైన సనాతన ధర్మానికి, (తత్ఫలమైన) అఖండ సుఖానికి నేనే ఆశ్రయుణ్ణి కాబట్టి నా భక్తులు బ్రహ్మ భావాన్ని పొందుతారు. (శ్రీమద్భాగవతమ్. 11-13-19 చూ :) 27

[లేక]

నేను (ప్రత్యగాత్మను) అవ్యయమూ, అమృతమూ, సనాతనమూ, అఖండ సుఖస్వరూపమూ అయిన బ్రహ్మానికి (పరమాత్మకు) ఆశ్రయుణ్ణి[1] (అంటే సమ్యక్-జ్ఞానం చేత ప్రత్యగాత్మ[2] పరమాత్మగా నిశ్చయింపబడుతోంది; ఇదే బ్రహ్మత్వ లాభం). ఎందుకంటే, ఏ బ్రహ్మశక్తి[3] భక్తానుగ్రహాది ప్రయోజనాలను అనుసరించి ప్రవర్తిల్లుతోందో, అది కూడా నేనే.

[లేక]

నేను (నిర్వికల్పక బ్రహ్మన్ని[4]) అమృతమూ, అవ్యయమూ అయిన సవికల్పక[5] బ్రహ్మానికి ఆశ్రయమూ; మరియు, జ్ఞాననిష్ఠ అనే సనాతన ధర్మానికీ, తత్ఫలమైన అఖండ సుఖానికీ ఆశ్రయమును.

**ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ విభాగ యోగోనామ చతర్దశోఽధ్యాయః ॥**

శ్లోక సంఖ్య 27; మొదటినుండి (523+27) 550

1. ప్రతిష్ఠ తే అస్మిన్ ఇతి ప్రతిష్ఠా - ఎందు వెలయునో అది.
2. అంతరాత్మ.
3. శక్తి, శక్తిమంతులకు అభేదం.
4. నిరుపాధికం, నిర్గుణం.
5. సోపాధికం, సగుణం.

**కృష్ణాధీనగుణాసంగ ప్రసక్తితభవాంబుధిమ్ ।**
**సుఖం తరతి తద్భక్త ఇ త్య భాషి చతుర్దశే ॥**[1]

**తా॥** కృష్ణాధీనమైన గుణాలయందు ఉండే ఆసక్తి వల్ల సత్యాన్వృత రూపంగా తోచే భవసాగరాన్ని తద్భక్తుడు అనాయాసంగా దాటతాడు అని చతుర్దశాధ్యాయంలో చెప్పబడింది.



1. ఈ గుణాలను గురించి ఇంకా తెలుసుకో గోరితే శ్రీమద్భాగవతమ్ 11-25 చూ.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## పంచదశోఽధ్యాయః - పురుషోత్తమ యోగః

## (పంచదశాధ్యాయం - పురుషోత్తమ యోగం)

వైరాగ్యేణ వినా జ్ఞానం న చ భక్తిరతః స్ఫుటమ్ ।
వైరాగ్యోపస్కృతం జ్ఞానమీశః పంచదశేఽదిశత్ ॥ [1]

---

*శ్రీ భగవానువాచ:*

**ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।**
**ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 1**

*ఊర్ధ్వమూలమ్, అధః శాఖమ్, అశ్వత్థమ్, ప్రాహుః, అవ్యయమ్, ఛందాంసి, యస్య, పర్ణాని, యః, తమ్, వేద, సః, వేదవిత్.*

(వేదపురాణాది శాస్త్రాలు)
ఊర్ధ్వమూలమ్ = వేళ్లు పైనగలది (అవ్యక్తమైన మాయా శక్తితో కూడిన బ్రహ్మమే మూలంగా గలదీ);
అధః శాఖమ్ = క్రింద కొమ్మలు గలది (మహదహంకార తన్మాత్రాదులు అనే శాఖలు క్రిందుగా గలదీ అయిన, ఆ);
అవ్యయమ్ = అనాది;
అశ్వత్థమ్ = క్షణికమైన సంసారాన్ని (మాయా వృక్షమని);
ప్రాహుః = చెబుతున్నాయి;
ఛందాంసి = కర్మకాండ రూపమైన వేదసమూహాలు;
యస్య = దేనికి;
పర్ణాని = పత్రాలో;

---

1. వైరాగ్యం లేకపోతే, జ్ఞానమూ, భక్తీ కలుగవనడం విశదమే. కనుక, భగవానుడు ఈ అధ్యాయంలో వైరాగ్యపూర్వకమైన జ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాడు.

| | | | |
|---|---|---|---|
| తమ్ | = దానిని (సమూలమైన సంసార వృక్షాన్ని); | వేద | = తెలుసుకుంటాడో; |
| | | సః | = అతడు; |
| యః | = ఎవడు; | వేదవిత్ | = వేదజ్ఞుడు. |

**తా॥** [పూర్వాధ్యాయాంతంలో 'ఎవడు ఐకాంతిక భక్తితో నన్ను సేవిస్తాడో'. (14-27) ఇత్యాది, పరమేశ్వరుని ఏకాంత భక్తితో ఉపాసించే వారికి, తత్ప్రసాదలబ్ధ జ్ఞానంతో బ్రహ్మ భావం కలుగుతుంది అని చెప్పబడింది - ఈ భక్తి గాని జ్ఞానం గాని అవిరక్తునికి కలుగవు; కనుక, వైరాగ్యపూర్వమైన జ్ఞానాన్ని ఉపదేశింపదలచి, సంసారరూపమైన వృక్షాన్ని రూపకాలంకారంలో వర్ణిస్తూ-] *శ్రీభగవానుడు పలికెను:* ఈ సంసార వృక్షానికి, మూలం (కారణం)[1] ఊర్ధ్వంలో ఉంది; దీని శాఖలు (హిరణ్యగర్భుడు మొదలైన వారు)[2] క్రిందుగా ఉన్నాయి. కర్మకాండ రూపమైన వేదాలు దీని పత్రాలు.[3] అనాదియూ,[4] క్షణికమూ అయిన ఈ సంసారం వేదశాస్త్ర పురాణాలలో మాయామయ వృక్షం అని చెప్పబడి ఉంది.[5] ఇట్టి సంసారవృక్షాన్ని తెలుసుకున్నవాడే వేదజ్ఞుడు.[6] 1

**అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖాః**
**గుణప్రవృద్ధా విషయప్రవాళాః ।**

---

1. అవ్యక్తమైన మాయాశక్తితో కూడిన బ్రహ్మం. -శ్రీశంకరులు
క్షర-అక్షరాతీతుడైన పురుషోత్తముడు = కారణోపాధి. -శ్రీధరులు

2. కార్యోపాధులైన హిరణ్యగర్భాదులు.

3. ధర్మాధర్మాలను ప్రతిపాదిస్తూ, తత్ఫలాను ప్రదర్శిస్తూ, సర్వజీవులకు ఆశ్రయణీయములైన వేదాలు, ఈ సంసారవృక్షంలో ఛాయను ఒసగి రక్షించే పత్రాల వలే ఉన్నాయి.

4. ఆది లేనివీ, అనంతములూ అయిన దేహప్రవాహాలకు ఆశ్రయం; ఆత్మజ్ఞానమువినా అనుచ్ఛేద్యము.

5. (అ) అ+శ్వః+స్థః = అశ్వత్థము. రేపటి వరకు, ప్రభాతమైయ్యే వరకు ఉంటుందని చెప్పబడజాలనిది; క్షణప్రధ్వంసి - విశ్వాసానర్హము.
(ఆ) ఊర్ధ్వమూలః అవాక్ శాఖ ఏషోఽ శ్వత్థః సనాతనః - కఠోపనిషత్తు. 6-1
(ఇ) బ్రహ్మవృక్షః సనాతనః - అశ్వమేధ పర్వ. 47-12
(ఈ) శ్రీమద్భాగవతమ్. 11-12-21-24 చూ :

6. సంసారవృక్షానికి మూలం ఈశ్వరుడు, తదంశాలైన బ్రహ్మాదులు శాఖలు; ఇది వినశ్వరం, కాని ప్రవాహరూపంలో నిత్యం. ఈ వృక్షపత్రస్థానీయాలైన వేదాలు విధించే కర్మలచే ఇది సేవింపబడదగి ఉంది. ఇదే వేదార్థం; దీనిని ఎరిగినవాడు వేదజ్ఞుడు.

**అధశ్చ మూలా న్యనుసన్తతాని**
**కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ 2**

*అధః, చ, ఊర్ధ్వమ్, ప్రసృతాః, తస్య, శాఖాః, గుణప్రవృద్ధాః, విషయప్రవాళాః, అధః, చ, మూలాని, అనుసంతతాని, కర్మ అనుబంధీని, మనుష్యలోకే.*

తస్య = ఈ సంసారవృక్షానికి;
శాఖాః = శాఖాసమూహాలు (వారివారి భావనలకూ, కర్మలకూ ఫలితాలని అనదగిన జనులు);
గుణప్రవృద్ధాః = గుణత్రయం వల్ల పరిపుష్టములవుతున్నాయి;
విషయ ప్రవాళాః = విషయాలే వీటి చివుళ్లు;
అధః = క్రిందకూ,
ఊర్ధ్వం చ = మీదకూ (ఇవి);
ప్రసృతాః =వ్యాపించి ఉన్నాయి;
మనుష్యలోకే = మనుష్యలోకంలో;
కర్మ అనుబన్ధీని = ధర్మాధర్మ జనకాలైన;
మూలాని = మూలాలు;
అధః చ = క్రిందుగా;
అనుసన్తతాని = పాదుకొని ఉన్నాయి.

**తా॥** ఈ సంసార - వృక్షం యొక్క శాఖాసమూహాలు[1] (జీవులు) గుణత్రయం వల్ల (జలసేచనం చేసిన వాటివలే) పరిపుష్టి పొందుతూ,[2] (శాఖాగ్ర స్థానీయాలైన ఇంద్రియ వృత్తులతో సంయుక్తాలైన) రూపరసాది విషయ పల్లవాలతో కూడి, ఊర్ధ్వ అధో దేశాలలో[3] వ్యాపించి ఉన్నాయి: కాని, మనుష్య లోకంలోనే[4] ధర్మ–అధర్మ జనకాలైన దీని మూలసమూహాలు,[5] క్రిందుగా పాదుకొని ఉన్నాయి.[6] 2

---

1. శాఖలు = భావన, కర్మల ఫలాలైన జీవులు; ఈ శాఖలకు త్రిగుణాలే ఉపాదానాలు.

2. సుకృతులైన దేవయోనులలో = మనుష్యుల నుండి బ్రహ్మ వరకు గల జీవులలో జన్మించడం.

3. పశ్వాది యోనులయందు = మనుష్యులనుండి స్థావరపర్యంతముగల నిమ్నయోనుల జన్మించడం.

4. వైదిక కర్మలపై కేవలం మనుష్యులకే అధికారం ఉండడం వల్ల, స్వర్గాది లోకాల ఫలభోగమైన పిదప మళ్ళీ ఇక్కడకే వచ్చి ప్రవృత్తి అనుసారం కర్మలను ఆచరించవలసి ఉండడం వల్ల 'మనుష్య లోకంలోనే' అని చెప్పబడింది.

5. ప్రథమ శ్లోకంలో సంసారవృక్షానికి ఉపాదానమైన పరమ మూలకారణం చెప్పబడింది, ఇక్కడ కర్మఫల జనితాలూ, ధర్మాధర్మ ప్రవృత్తులకు కారణాలూ అయిన రాగద్వేషాది వాసనలు అవాంతర మూలాలుగా పరిగ్రహింపబడ్డాయి.

6. ప్రాణులందరి లింగదేహాలలో వాసనా రూపమైన మూలాలు అనుప్రవిష్టం (అను–సంతతం, అను–గతం) అయి ఉన్నాయి; లింగ దేహం వాసనలకు ఆశ్రయం.

న రూపమస్యేహ తథోప లభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థ మేనం సువిరూఢమూలం
అసఙ్గ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ 3

న, రూపమ్, అస్య, ఇహ, తథా, ఉపలభ్యతే, న,అంతః, న, చ, ఆదిః, న, చ, సంప్రతిష్ఠా, అశ్వత్థమ్, ఏనమ్, సువిరూఢమూలమ్, అసంగ శస్త్రేణ, దృఢేన, ఛిత్త్వా.

| | | | |
|---|---|---|---|
| ఇహ | = ఈ సంసారంలో; | (న ఉపలభ్యతే | = తెలిసికోబడడం లేదు;) |
| అస్య | = దీని; | ఏనమ్ | = ఈ; |
| రూపమ్ | = స్వరూపం; | సువిరూఢ మూలమ్ | = పాతుకున్న మొదళ్లు గల; |
| తథా | = చెప్పబడినట్లు; | | |
| న ఉపలభ్యతే | = గ్రహింపబడడం లేదు; | అశ్వత్థమ్ | = సంసారరూపమైన అశ్వత్థాన్ని; |
| (అస్య | = దీని;) | దృఢేన | = దృఢమైన; |
| అన్తః | = తుది కాని; | అసఙ్గ శస్త్రేణ | = విరక్తి (అనాసక్తి) అనే శస్త్రంతో; |
| ఆదిః చ | = మొదలు కాని; | | |
| సంప్రతిష్ఠా చ | = మధ్యం కాని, స్థితి కాని; | ఛిత్త్వా | = త్రుంచి. |

**తా॥** ఇహలోకంలో (అంటే ఈ సంసారంలో ఉన్న) ప్రాణులు, ఈ సంసార రూపమైన అశ్వత్థపు స్వరూపాన్ని ఇంతకుముందు చెప్పిన రీతిగా తెలుసుకోజాలకున్నారు. (ఎందుకంటే, ఇది స్వప్నం వలే, మరీచిక వలే దృష్ట-నష్ట స్వరూపం) దీనికి ఆరంభం లేదు, అనాది. దీనికి (బ్రహ్మజ్ఞానం లేకుండా) అంతం లేదు. దీని స్థితిని గాని, ఇది ఇలా ఉంటుందని గాని తెలుసుకోలేం. ఇది ప్రామాణ్యం కాదు, ప్రతీతిమాత్రం.[1] బద్ధమూలమైన ఈ సంసార-అశ్వత్థాన్ని, 'తీవ్రవైరాగ్యం' అనే దృఢశస్త్రంతో[2] ఛేదించి[3]- 3

1. ప్రతీతి (తోచుట) ప్రమాణం కాజాలదు, యథా : రజ్జుసర్ప - ప్రతీతి.

2. పుత్ర విత్త లోకేషణ త్యాగమే 'వైరాగ్య శస్త్రం'; పరమాత్మాభిముఖ్యమే దృఢత్వం; మళ్ళీ మళ్ళీ వివేక, శమాదులను అభ్యసించడం చేత ఈ శస్త్రం నిశితమవుతోంది.

3. (అ) The axe must be laid to the root of the tree, that being separated and freed from the restless desires of nature and self we may possess our souls in the peace of God.
- *Imitation of Christ.*

(ఆ) ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ. - వేదాంత సూత్రమ్. 2-1-6.

**తతః పదం తత్పరిమార్గితవ్యం**
**యస్మిన్ గతా న నివర్తన్తి భూయః।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే**
**యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ।। 4**

*తతః, పదమ్; తత్, పరిమార్గితవ్యమ్, యస్మిన్, గతాః, న, నివర్తంతి, భూయః, తమ్, ఏవ, చ, ఆద్యమ్, పురుషమ్, ప్రపద్యే, యతః, ప్రవృత్తిః, ప్రసృతా, పురాణీ.*

| | | | |
|---|---|---|---|
| తతః | = పిదప; | (ఏషా | = ఈ;) |
| యస్మిన్ | = ఎక్కడకు; | పురాణీ | = అనాదియైన; |
| గతాః | = చేరుకుంటే; | ప్రవృత్తిః | = సంసారప్రవాహం; |
| భూయః | = మళ్ళీ; | ప్రసృతా | = వెలువడిందో; |
| న నివర్తన్తి | = తిరిగి రారో; | తమ్ | = ఆ; |
| తత్పదమ్ | = ఆ బ్రహ్మపదం; | ఆద్యమ్ | = ఆద్యుడైన; |
| పరిమార్గితవ్యమ్ | = అన్వేషింప తగింది; | పురుషం ఏవచ | = పరమ పురుషుణ్ణే; |
| యతః | = ఎవరి నుండి, | ప్రపద్యే | = ఆశ్రయిస్తున్నాను. |

**తా।।** పిదప, దేనిని పొందితే మళ్ళీ ఈ సంసారానికి తిరిగి రావడమనేది లేదో, ఆ పరమపదాన్ని అన్వేషించాలి. ఎవరి నుండి అనాదియైన ఈ సంసార ప్రవాహం నిర్గతమైనదో, నేను, ఆ ఆది పురుషుణ్ణి శరణు[1] జొచ్చుతున్నాను. 4

**నిర్మాన మోహా జితసఙ్గదోషాః**
**అధ్యాత్మ నిత్యా వినివృత్తకామాః ।**
**ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః**
**గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ ।। 5**

*నిర్మాన మోహాః, జితసంగదోషాః, అధ్యాత్మ నిత్యాః, వినివృత్తకామాః, ద్వంద్వైః, విముక్తాః, సుఖదుఃఖసంజ్ఞైః, గచ్ఛంతి, అమూఢాః, పదమ్, అవ్యయమ్, తత్.*

1. శరణాగతియే పరమపదాన్వేషణం.

నిర్మాన మోహాః = అహంకారం, అవివేకం - ఈ రెండూ లేనివారూ;
జిత సఙ్గ దోషాః = ఆసక్తియనే దోషాన్ని జయించినవారూ;
అధ్యాత్మ నిత్యాః = పరమాత్మ జ్ఞాననిష్ఠులూ;
వినివృత్త కామాః = నిష్కాములూ;
సుఖ దుఃఖ సంజ్ఞైః, ద్వంద్వైః = సుఖ దుఃఖాలనే ద్వంద్వాల నుండి;
విముక్తాః = విడివడిన వారూ అయిన;
అమూఢాః = జ్ఞానులు;
అవ్యయమ్ = అక్షయమైన;
తత్ = ఆ;
పదమ్ = స్థానాన్ని;
గచ్ఛన్తి = పొందుతున్నారు.

**తా॥** (సాధనాంతరములు ప్రదర్శింపబడుతున్నాయి :) అహంకారం (అభిమానం) అవివేకం (అజ్ఞానం) లేనివారూ, ఆసక్తి అనే దోషాన్ని జయించిన వారూ, పరమార్థజ్ఞాన నిష్ఠులూ, సుఖదుఃఖాలనే ద్వంద్వాలకు అతీతులైన వారూ అయిన జ్ఞానులు ఆ పరమపదాన్ని పొందుతున్నారు.[1] 5

**న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।**
**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥** 6

*న, తత్, భాసయతే, సూర్యః, న, శశ అంకః, న, పావకః,*
*యత్, గత్వా, న, నివర్తంతే, తత్, ధామ, పరమమ్, మమ.*

యత్ = ఏ పదాన్ని;
గత్వా = పొందితే;
న నివర్తన్తే = తిరిగి రారో;
తత్ = అది;
మమ = నా;
పరమమ్ = శ్రేష్ఠమైన;
ధామ = పదం (స్వరూపం);
తత్ = దానిని;
సూర్యః = రవి;
న భాసయతే = ప్రకాశింపజేయజాలడు;
శశ అంకః = చంద్రుడు గాని;
న = ప్రకాశింపజేయలేడు;
పావకః = అగ్ని;
న = ప్రకాశింపజేయజాలడు.

1. ఈ మోక్షప్రయత్నం జీవునిది. వాస్తవానికి జీవుడు బ్రహ్మాంశం. నీటిలో సూర్యుడు ప్రతిబింబించినప్పుడు ఆ నీటిని తొలగిస్తే, సూర్యాంశమైన జలసూర్యుడు సూర్యుణ్ణే పొందే విధంగా; మహాకాశపు అభిన్నాంశం అయిన ఘటాకాశం, ఘటం వినష్టమైతే మహాకాశాన్ని పొందే విధంగా; బ్రహ్మాంశమైన జీవుడు అవిద్యాకృతమైన ఉపాధి తొలగితే, బ్రహ్మాన్ని పొందుతున్నాడు. జల సూర్య ఘటాకాశాలకు ప్రత్యాగమనం లేని విధంగా, జీవునికి పునరావృత్తి లేదు. ఏలయన, జీవుడు బ్రహ్మమే. జీవత్వం మాయికము, కల్పితము.

**తా॥** (గంతవ్యమైన ఆ పదం వివరించబడుతోంది :) దేనిని పొందితే మళ్ళీ సంసారానికి తిరిగి రావడమనేది లేదో, దేనిని సూర్యచంద్రాగ్నులు ప్రకాశింప జేయజాలరో, అదే నా పరమపదం.

(గీత : 15-12 చూ : ముండకోపనిషత్తు. 2-2-10 చూ :).[1] 6

**మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।**
**మనః షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7**

*మమ, ఏవ, అంశః, జీవలోకే, జీవభూతః, సనాతనః,*
*మనః షష్ఠాని, ఇంద్రియాణి, ప్రకృతిస్థాని, కర్షతి.*

| | |
|---|---|
| (ఏమన) సనాతనః = పురాతనమైన; | ప్రకృతి స్థాని = ప్రకృతియందు అంటే కర్ణశష్కుల్యాది స్థానాలలో వెలయు; |
| మమ ఏవఅంశః = నా అవయవమే (ఏకదేశం); | మనః షష్ఠాని = మనస్సుతో గలసి ఆరు; |
| జీవ లోకే = సంసారంలో; | ఇన్ద్రియాణి = ఇంద్రియాలను; |
| జీవ భూతః = కర్త, భోక్తయని ప్రసిద్ధి చెంది జీవుడైనదీ; | కర్షతి = ఆకర్షిస్తుంది. |

**తా॥** (తదీయ ధామప్రాప్తి పొందినవారు తిరిగి రారు అని చెప్పబడింది; సుషుప్తి ప్రళయాలలో తత్ప్రాప్తి అందరికీ కలుగుతోందని వినికిడి.[2] అలాగైతే మరి సంసారి ఎవడు? అని ఆశంకించి సంసారిని చూపుతున్నాడు :) నా అవిద్యా కల్పితాంశమే లోకంలో కర్తయూ భోక్తయూ అయిన జీవుడని ప్రసిద్ధి.[3] ఇతడే సుషుప్తి ప్రళయ కాలాలలో ప్రకృతియందు లీనములైన ఇంద్రియ పంచకాన్ని, మనస్సును[4] మళ్ళీ సంసారోప భోగార్థం ఆకర్షిస్తున్నాడు. [సుషుప్తి, ప్రళయాలలో

1. అపి చ స్మర్యతే, - వేదాంత సూత్రమ్ 1-3-23
2. సతి సంపద్య న విదుః సతి సంపద్యామహే. - ఛాందోగ్యోపనిషత్తు 6-9-2.
3. ఇక్కడ జీవుడు బ్రహ్మాంశమని చెప్పబడింది. సప్తమాధ్యాయ-పంచమశ్లోకంలో జీవుడు బ్రహ్మం యొక్క పరాప్రకృతి అంటే, శక్తియని చెప్పబడింది. దీని సమంజసత్వం ఎలా అంటే : అగ్నికణం అగ్ని అంశమైనట్లు, జీవుడు బ్రహ్మాంశం కాదు, శక్తి అనే అభిప్రాయం తోడనే అంశ శబ్దం వ్యవహరింపబడింది. కనుక, జీవుడు బ్రహ్మమే.
4. కర్మేంద్రియాలూ, ప్రాణమూ అని భావం.
5. అపి చ స్మర్యతే. - వేదాంత సూత్రమ్ 2-3-45

నా అంశమైన జీవుడు నన్నే పొందుతన్నప్పటికీ, సప్రకృతికుడైన నా యందు లీనుడవుతాడు. ఇటువంటి వారు 'అవ్యక్తం నుండి మళ్ళీ ప్రభవిస్తున్నారు' (8-18) అని చెప్పబడింది. కనుక, అవిద్వాంసుడు మళ్ళీ సంసారానికి వెలువడుతూ, ప్రకృతి యందు లీనములై ఉన్న స్వోపాధిభూతములైన ఇంద్రియాలను ఆకర్షిస్తున్నాడు. శుద్ధస్వరూప ప్రాప్తి పొందిన విద్వాంసుడు, బ్రహ్మపద ప్రాప్తియే పునర్జన్మ నాశకమని చెప్పిన రీతిగా, తిరిగి రాడు.] 7

**శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధాని వాశయాత్ ॥ 8**

*శరీరమ్, యత్, అవాప్నోతి, యత్, చ, అపి, ఉత్క్రామతి, ఈశ్వరః, గృహీత్వా, ఏతాని, సంయాతి, వాయుః, గంధాన్, ఇవ, ఆశయాత్.*

| | | | |
|---|---|---|---|
| ఈశ్వరః | = దేహాది సంఘాతానికి స్వామి అంటే జీవుడు; | ఆశయాత్ | = ఆధారం నుండి (పుష్పాదులకోశం నుండి); |
| యత్ | = ఎప్పుడు; | గన్ధాన్ ఇవ | = సుగంధాన్ని గ్రహించే విధంగా; |
| శరీరమ్ | = దేహాన్ని; | | |
| అవాప్నోతి | = పొందుతున్నాడో; | ఏతాని | = ఈ ఇంద్రియాలను; |
| యత్ చ అపి | = మరియు, ఎప్పుడు; | గృహీత్వా | = గ్రహించి; |
| ఉత్క్రామతి | = త్యజిస్తాడో (అప్పుడు); | సంయాతి | = వెలువడుతున్నాడు; |
| వాయుః | = వాయువు; | | |

**తా॥** (ఆకర్షించిన పిదప, ఏం చేస్తున్నాడు? - చెప్పబడుతోంది :) వాయువు పుష్పాదుల ఆధారకోశం నుండి గంధాన్ని ఆహరించే విధంగా, జీవుడు కర్మవశాన శరీరాంతరమును పొందేటప్పుడు,[1] పూర్వశరీరం నుండి మనస్సును ఇంద్రియాలను తన వెంట తీసుకుపోతున్నాడు.[2] అంటే, పూర్వదేహంలోని ఇంద్రియాదులే నూతన శరీరంలో ప్రవేశిస్తున్నాయి. 8

---

1. (అ) ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః - కఠోపనిషత్తు 1-3-4.
(ఆ) యోనిమన్యే ప్రపద్యం తే శరీరత్వాయ దేహినః,
స్థాణుమన్యేఽనుసంయంతి యథా కర్మ యథా శ్రుతమ్. - కఠోపనిషత్తు 2-2-7.
2. ఈ విషయం అంతా బృహదారణ్యకోపనిషత్తు 4-4లో చక్కగా వివరించబడింది.

**శ్రోత్రం చక్షుః స్పర్శనం చ  రసనం ఘ్రాణమేవ చ ।**
**అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ 9**

శ్రోత్రమ్, చక్షుః, స్పర్శనమ్, చ, రసనమ్, ఘ్రాణమ్, ఏవ, చ,
అధిష్ఠాయ, మనః, చ, అయమ్, విషయాన్, ఉపసేవతే.

| | | | |
|---|---|---|---|
| అయమ్ | = ఈ దేహి (జీవాత్మ); | ఘ్రాణం ఏవ చ | = నాసికను; |
| శ్రోత్రమ్ | = కర్ణమును; | మనః చ | = మనస్సును; |
| చక్షుః | = నేత్రాన్ని; | అధిష్ఠాయ | = అధిష్ఠించి (ఆశ్రయించి); |
| స్పర్శనం | = త్వక్కును; | విషయాన్ | = రూప రసాది విషయాలను; |
| రసనం చ | = జిహ్వను; | ఉపసేవతే | = ఆస్వాదిస్తున్నాడు. |

**తా॥** (ఆ ఇంద్రియాలను పేర్కొంటూ, వాటి ప్రయోజనం చెప్పబడుతోంది:) జీవాత్మ (దేహంలో) శ్రోత్ర-త్వక్-చక్షు-జిహ్వా-ఘ్రాణ ఇంద్రియాలను ఆశ్రయించి, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలనే విషయ పంచకాన్ని మనస్సు సహాయంతో భోగిస్తున్నాడు. 9

**ఉత్క్రామన్తం స్థితం వాఽపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।**
**విమూఢా నానుపశ్యన్తి  పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10**

ఉత్క్రామంతమ్, స్థితమ్, వా, అపి, భుంజానమ్, వా, గుణాన్వితమ్,
విమూఢాః, న, అనుపశ్యంతి, పశ్యంతి, జ్ఞానచక్షుషః.

| | | | |
|---|---|---|---|
| ఉత్క్రామన్తమ్ | = దేహాంతరాన్ని పొందుతున్నవాడూ; | విమూఢాః | = మూఢులు; |
| స్థితమ్ | = శరీరంలో వెలయుచున్నవాడూ; | న అనుపశ్యంతి | = చూడజాలరు; |
| భుఞ్జానం వా | = విషయాలను అనుభవిస్తున్నవాడూ; | జ్ఞాన చక్షుషః | =జ్ఞానదృష్టి కలవారు; |
| గుణాన్వితమ్ వా అపి | = గుణాలను కలిగినవాడూ అయిన (జీవుణ్ణి); | పశ్యన్తి | = చూడగలరు. |

**తా॥** (శరీర వ్యతిరిక్తుడైన జీవుణ్ణి అందరూ కనుగొనజాలకున్నారేమిటి? అని అంటే :) దేహాంతరాన్ని పొందుతున్నవాడూ, శరీరంలో వెలయువాడూ,

విషయాలను భోగించేవాడూ, త్రిగుణ పరిణామములైన సుఖ దుఃఖ మోహాన్వితుడూ అయిన జీవాత్మను మూఢులు ఎరుగ జాలకున్నారు;[1] ఎందుకంటే, వారి మనస్సు విషయాకర్షణ చేత బహిర్ముఖంగా ఉంది. కాని, అంతర్ముఖులైన వారు[2] జ్ఞాన చక్షువుతో ఆ జీవాత్మను దర్శిస్తున్నారు. 10

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్ ।**
**యతన్తోఽప్య కృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ 11**

*యతంతః, యోగినః, చ, ఏనమ్, పశ్యంతి, ఆత్మని, అవస్థితమ్,*
*యతంతః, అపి, అకృత ఆత్మానః, న, ఏనమ్, పశ్యంతి, అచేతసః.*

| | | | |
|---|---|---|---|
| యతన్తః | = సమాహితచిత్తులైన; | పశ్యన్తి | = చూస్తున్నారు; |
| యోగినః | = యోగులు; | యతన్తః అపి | = ప్రయత్నిస్తున్నప్పటికీ; |
| ఏనమ్ | = ఈ ఆత్మను; | అకృత ఆత్మానః | = అశుద్ధ చిత్తులైన; |
| ఆత్మని | = స్వీయ బుద్ధిలో; | అచేత సః | = అవివేకులు; |
| అవస్థితమ్ | = సాక్షి రూపంలో వెలయువానిని; | ఏనమ్ | = ఈ ఆత్మను; |
| | | న పశ్యన్తి | = దర్శింపజాలరు. |

**తా॥** (అందరకీ ఈ దర్శనం సాధ్యం కాదు, వివేకం గలవారి యందు కూడా కొందరే చూడగలుగుతున్నారు.) ధ్యానాభ్యాసరతులైన యోగులు స్వీయ బుద్ధి యందు సాక్షిరూపంలో ఉన్న ఈ ఆత్మను చూస్తున్నారు; కాని, శాస్త్రాదులను అభ్యసిస్తున్నప్పటికీ అశుద్ధ చిత్తులైన మందమతులు ఈ ఆత్మను దర్శింపజాలరు.[3] 11

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।**
**యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12**

*యత్, ఆదిత్యగతమ్, తేజః, జగత్, భాసయతే, అఖిలమ్,*
*యత్, చంద్రమసి, యత్, చ, అగ్నౌ, తత్, తేజః, విద్ధి, మామకమ్.*

1. దేహాత్మవాదులైన నాస్తికులు.
2. 'ఆత్మానాత్మ వివేకం' అనే సాధనసంపత్తి గల ముముక్షువులు.
3. శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్. – గీత : 2-29.

| | | | |
|---|---|---|---|
| ఆదిత్యగతమ్ | = సూర్యుని యందుండే; | అగ్నౌచ | = అగ్నిలో కూడా; |
| యత్ | = ఏ; | యత్ | = ఏ తేజం ఉందో; |
| తేజః | = తేజస్సు; | తత్ | = ఆ; |
| అఖిలమ్ జగత్ | = విశ్వాన్నంతటనీ; | తేజః | = జ్యోతిని; |
| భాసయతే | = ప్రకాశింపజేస్తున్నదో; | మామకమ్ | = నాదిగా; |
| చన్ద్రమసి చ | = మరియు, చంద్రునిలో; | విద్ధి | = తెలుసుకో. |
| యత్ | = ఏ తేజం ఉందో; | | |

**తా॥** (పరమ పదాన్ని, దాన్ని పొందే ఉపాయాన్నీ, తత్ఫలమైన అపునరావృత్తినీ, సంసారి స్వరూపాన్ని వర్ణింపబడ్డాయి; ఇక పరమేశ్వరుణ్ణి అనంత శక్తియుతునిగా నిరూపిస్తున్నాడు :) సూర్యచంద్రాగ్నుల యందు ఉండి జగత్తు నంతటినీ ప్రకాశింపజేస్తున్న తేజం నాదే అని గ్రహించు.

(ముండకోపనిషత్తు 2-2-10 చూ:). 12

**గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా ।**
**పుష్ణామి చౌషధీస్సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥ 13**

*గామ్, ఆవిశ్య, చ, భూతాని, ధారయామి, అహమ్, ఓజసా,*
*పుష్ణామి, చ, ఓషధీః, సర్వాః, సోమః, భూత్వా, రస ఆత్మకః.*

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | చ | = మరియు; |
| ఓజసా | = ఐశ్వర్యమైన శక్తితో; | రస ఆత్మకః | = రస స్వరూపినైన; |
| గామ్ | = పృథివిలో; | సోమః భూత్వా | = చంద్రుడనై; |
| ఆవిశ్య | = ప్రవేశించి; | సర్వాః ఓషధీః | = వ్రీహియ వాదులైన ఓషధులను; |
| భూతాని = చర-అచరాలైన భూతాలను; | | | |
| ధారయామి | = ధరిస్తున్నాను; | పుష్ణామి | = పోషిస్తున్నాను. |

**తా॥** నేను ఈశ్వర శక్తిచేత పృథివియందు ప్రవేశించి చరాచర భూతాల నన్నింటిని ధరిస్తున్నాను; మరియు, రసమయుడైన చంద్రుణ్ణై వ్రీహియవాదులైన ఓషధులను[1] పోషిస్తున్నాను. (గీత : 13-17 చూ.) 13

1. పంటనిచ్చి ఎండిపోయేవి.

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14**

*అహమ్, వైశ్వానరః, భూత్వా, ప్రాణినామ్, దేహమ్, ఆశ్రితః,*
*ప్రాణ అపాన సమాయుక్తః, పచామి, అన్నమ్, చతుర్విధమ్.*

అహమ్ = నేను;
వైశ్వానరః భూత్వా = జఠరాగ్నినై;
ప్రాణినామ్ = జీవుల;
దేహమ్ = శరీరాన్ని;
ఆశ్రితః = ఆశ్రయించి;
ప్రాణ అపాన సమాయుక్తః = ప్రాణాపాన వాయువులతో కూడి;
చతుర్విధమ్ = భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములనే నాలుగు విధాలైన;
అన్నమ్ = అన్నాన్ని;
పచామి = పచనం చేస్తున్నాను.

**తా॥** నేను జఠరాగ్ని రూపంలో ప్రాణుల దేహాన్ని సమాశ్రయించి ప్రాణ అపాన వాయువులతో కూడి, వారు భుజించే భక్ష్య, భోజ్య లేహ్య, చోష్యములనే[1] చతుర్విధ ఆహారాలను పచనం చేస్తున్నాను.

(బృహదారణ్యకోపనిషత్తు 7-9-1 చూ:) 14

**సర్వస్య చాహం హృది సన్నివిష్టో**
**మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ ।**
**వేదైశ్చ సర్వై రహమేవవేద్యో**
**వేదాన్తకృద్వేదవి దేవ చాహమ్ ॥ 15**

*సర్వస్య, చ, అహమ్, హృది, సన్నివిష్టః, మత్తః, స్మృతిః, జ్ఞానమ్, అపోహనమ్, చ, వేదైః, చ, సర్వైః, అహమ్, ఏవ, వేద్యః, వేద అంతకృత్, వేదవిత్, ఏవ, చ, అహమ్.*

---

1. పళ్లతో కొరికి తినబడే అపూపాదులు భక్ష్యములు.
నాలుక చేతనే గ్రహింపబడి మ్రింగబడు పాయసాదులు భోజ్యములు.
నాలుక మీద వేసికొని, రసాస్వాదనం ఒనర్చుతూ క్రమంగా ద్రవం ఒనర్చబడి, మ్రింగబడే బెల్లం మొదలైనవి లేహ్యములు.
పళ్లతో నమిలి రసాంశాన్ని గ్రహించి, పిప్పిని పారవేయబడే చెఱకు మొదలైనవి చోష్యములు.
ఇవియే చవ్య, పేయ, లేహ్య, చోష్యములని కూడా చెప్పబడుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | సర్వైః వేదైః చ | = వేదాలు నాలిగింటితో; |
| సర్వస్య చ | = ఆ బ్రహ్మస్తంబ పర్యంతం గల ప్రాణులందరి; | అహమ్ ఏవ | = నేనే; |
| హృది | = హృదయంలో; | వేద్యః | = తెలుసుకోబడ దగినవాణ్ణి; |
| సన్ని విష్టః | = ప్రవిష్టుడను; | వేద అంత కృత్ | = వేదాంత సంప్రదాయ ప్రవర్తకుణ్ణి; |
| మత్తః | = నా నుండి; | వేద విత్ చ | = వేదార్థవేత్తను కూడా; |
| స్మృతిః | = జ్ఞప్తి; | అహమ్ ఏవ | = నేనే. |
| జ్ఞానమ్ | = జ్ఞానం; | | |
| అపోహనమ్ చ | = ఈ రెంటి విస్మృతి (కలుగుతున్నాయి); | | |

**తా॥** నేను ఆబ్రహ్మస్తంబ పర్యంతం గల ప్రాణుల హృదయాలలో (అంతర్యామి రూపంగా) ప్రకాశిస్తున్నాను, నా నుండే[1] (పూర్వానుభూతార్థ విషయాల) స్మృతి,[2] (విషయేంద్రియ సంయోగ జనితమైన) జ్ఞానం, వీటి విస్మృతి కూడా కలుగుతున్నాయి. వేద చతుష్టయం చేత (ఆయా దేవతా రూపాలలో) తెలియబడేది నేనే. వేదాంత సంప్రదాయ ప్రవర్తకుణ్ణైన జ్ఞానగురువును, వేదాంతవేత్తను కూడా నేనే అని గ్రహించు.

(గీత : 13-17; కఠోపనిషత్తు 1-2-15 చూ :) 15

**ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽ_క్షర ఉచ్యతే ॥** **16**

ద్వౌ, ఇమౌ, పురుషౌ, లోకే, క్షరః, చ, అక్షరః, ఏవ, చ,
క్షరః, సర్వాణి, భూతాని, కూటస్థః, అక్షరః, ఉచ్యతే.

| | | | |
|---|---|---|---|
| క్షరః | = క్షరుడు; | ద్వౌ | = ఇరువురు; |
| అక్షరః చ | = అక్షరుడు; | పురుషౌ ఏవ చ | = పురుషులే; |
| ఇమౌ | = అనే ఈ; | లోకే | = జగత్తున (ప్రసిద్ధులు); |

1. నేను సర్వకర్మాధ్యక్షుడనని భావము.

2. స్మృతి ఈ జన్మకు, పూర్వజన్మకు సంబంధించింది. దేశకాలాల చేత వ్యవహితాలు (దూరస్థములు), అవ్యవహితాలు (నికటస్థములు) అయిన వస్తువులను గూర్చిన జ్ఞానం. ఈ స్మృతి, జ్ఞానాలు, వాటి విలోపమూ ధర్మాధర్మముల చేత కలుగుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| క్షరః | = వినాశియైన పురుషుడే; | కూటస్థః | = కూటరూపంలో, (మాయారూపంలో) స్థితుడు అని; |
| సర్వాణి భూతాని | = సమస్తభూతాలనీ; | ఉచ్యతే | = చెప్పబడుతోంది. |
| అక్షరః | = అవినాశియైన పురుషుడు; | | |

**తా॥** (శ్లోక చతుష్టయంలో విశిష్టోపాధికృతమైన భగవద్విభూతి సంక్షేపంగా వర్ణించబడింది. ఇక, క్షర-అక్షరోపాధి విభాగమొనర్చి, తదతీతమైన నిరుపాధి స్వరూపం వ్యాఖ్యాతమవుతోంది :) ఈ జగత్తులో క్షర-అక్షరులనే పురుషులు ఇరువురు[1] ప్రసిద్ధులై ఉన్నారు. (బ్రహ్మాది స్థావరాంతములైన జడ శరీరాలు) వినాశశీలమైన రూపజాతమంతా కూడా క్షర-పురుషుడు. (నిర్వికారుడైన చేతన భోక్త) మాయా శక్తియే కూటస్థుడైన అక్షర-పురుషుడు.[2] 16

**ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।**
**యో లోకత్రయ మావిశ్య బిభర్త్య వ్యయ ఈశ్వరః ॥ 17**

*ఉత్తమః, పురుషః, తు, అన్యః, పరమాత్మా, ఇతి, ఉదాహృతః,*
*యః, లోకత్రయమ్, ఆవిశ్య, బిభర్తి, అవ్యయః, ఈశ్వరః.*

| | | | |
|---|---|---|---|
| అన్యః తు | = క్షరాక్షరుల కంటే వేరైన; | ఈశ్వరః | = పాలకుడు; |
| ఉత్తమః పురుషః | = పురుషోత్తముడు, (బ్రహ్మం); | లోక త్రయమ్ | = భూర్భువస్సువర్లోకాలను అంటే విశ్వాన్నంతటిని; |
| పరమాత్మా ఇతి | = పరమాత్మ అని; | ఆవిశ్య | = (తన మాయాశక్తిచేత) ప్రవేశించి (స్వరూపసత్తను అనుగ్రహిస్తూ); |
| ఉదాహృతః | = చెప్పబడును; | బిభర్తి | = పాలిస్తున్నాడు. |
| యః | = ఎవడో (అతడు); | | |
| అవ్యయః | = అక్షయుడు; | | |

**తా॥** ఈ క్షరాక్షరుల కంటే వేరైన పరమాత్మ[3] ఉత్తమ పురుషుడు

1. బ్రహ్మపురుషుని ఉపాధులవడం వల్ల పురుషులు అనబడుతున్నారు.

2. (అ) భగవంతుని మాయాశక్తి; క్షరపురుషుని ఉత్పత్తికి బీజం - సంసార బీజం అనంతమవడం చేత అక్షరసంజ్ఞ.

(ఆ) ఇక్కడ అక్షరశబ్దానికి శ్రీశంకరులు మాయ అనీ, శ్రీధరులు జీవుడనీ అర్థం చెప్పారు; కాని 8వ అధ్యాయంలో అక్షరశబ్దం బ్రహ్మవాచకం, ఇక్కడ పురుషోత్తముడు. అక్కడ స్వభావ, అధ్యాత్మ శబ్దాలు ఇక్కడ అక్షరపురుషుడు అని గమనించాలి.

3. అచేతనుడైన క్షరుని కంటే విలక్షణమైన ఆత్మ అవడం వల్ల, చేతనుడైన జీవుని కంటే పరమవడం వల్ల పరమాత్మ.

(పురుషోత్తముడు) అనబడుతున్నాడు; అక్షయమైన ఈ బ్రహ్మమే విశ్వంలో (తన మాయాశక్తి వల్ల) ప్రవేశించి, (అన్నిటికీ స్వరూపసత్తను అనుగ్రహిస్తూ) పరిపాలిస్తోంది. (శ్రీమద్భాగవతమ్. 11-6-15 చూ.) 17

**యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18**

*యస్మాత్, క్షరమ్, అతీతః, అహమ్, అక్షరాత్, అపి, చ, ఉత్తమః, అతః, అస్మి, లోకే, వేదే, చ, ప్రథితః, పురుషోత్తమః.*

| | | | |
|---|---|---|---|
| యస్మాత్ | = ఎందువల్ల; | అతః | = అందువల్ల; |
| అహమ్ | = నేను; | లోకే | = లోకంలోనూ; |
| క్షరమ్ అతీతః | = క్షరానికి (అశ్వత్థమనబడే సంసార మాయావృక్షానికి) అతీతుణ్ణో; | వేదే చ | = వేదంలోనూ; |
| అక్షరాత్ అపి చ | = అక్షరం కంటే, సంసార బీజభూతమైన శక్తికంటే కూడా; | పురుషోత్తమః | = పురుషోత్తముణ్ణని; |
| ఉత్తమః | = శ్రేష్ఠుడనో; | ప్రథితః | = ప్రసిద్ధుణ్ణి; |
| | | అస్మి | = అయ్యాను. |

**తా॥** నేను క్షర[1] అక్షర[2]ములు రెండింటికీ కూడా అతీతుణ్ణి (ప్రపంచాతీతుణ్ణి) అవడం వల్ల వేదాలు, లోకాలూ[3] నన్ను పురుషోత్తముడు[4] అంటున్నాయి. 18

**యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥ 19**

---

1. క్షరం = అశ్వత్థమనబడే సంసార-మాయా వృక్షం.
2. అక్షరం = క్షరమునకు బీజభూతమైన మాయాశక్తి.
3. కావ్యములు, భక్తులు.
4. (అ) దివ్యః హ్యమూర్తః పురుషః అక్షరాత్పరతః పరః. - ముండకోపనిషత్తు 2-1-2.
(ఆ) ఏవ మేవ ఏషః సంప్రసాదః అస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే స ఉత్తమః పురుషః. - ఛాందోగ్యోపనిషత్తు. 8-12-3.
(ఇ) మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః, పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః - కఠోపనిషత్తు. 1-3-11.

యః, మామ్, ఏవమ్, అసమ్మూఢః, జానాతి, పురుషోత్తమమ్,
సః, సర్వవిత్, భజతి, మామ్, సర్వభావేన, భారత.

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | సః | = అతడు; |
| ఏవమ్ | = ఈ విధంగా; | సర్వభావేన | = సర్వాత్మనా; |
| యః | = ఎవడు; | మామ్ | = నన్ను; |
| అసంమూఢః | = అభిమాన రహితుడై; | భజతి | = భజిస్తాడు (పిదప); |
| పురుషోత్తమమ్ | = పరబ్రహ్మమునగు; | సర్వవిత్ | = సర్వజ్ఞుడు, |
| మామ్ | = నన్ను; | (భవతి | = అవుతాడు.) |
| జానాతి | = గ్రహిస్తాడో; | | |

**తా॥** భారత! ఎవడు ఈ రీతిగా (స్థూలసూక్ష్మకారణ శరీరాలపై) అభిమానాన్ని వీడి, పురుషోత్తముణ్ణైన నన్ను (ఆత్మరూపంలో) ఎరుగుతున్నాడో, అతడు నాయందు అనురక్తుడై సర్వభావాలలో నన్నే భజిస్తున్నాడు; పిదప సర్వజ్ఞత్వాన్ని పొందుతున్నాడు. 19

**ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయాఽనఘ ।**
**ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ 20**

ఇతి, గుహ్యతమమ్, శాస్త్రమ్, ఇదమ్, ఉక్తమ్, మయా, అనఘ,
ఏతత్, బుద్ధ్వా, బుద్ధిమాన్, స్యాత్, కృతకృత్యః, చ, భారత.

| | | | |
|---|---|---|---|
| అనఘ | = పాపరహితా; | భారత | = అర్జునా; |
| ఇతి | = ఇలా; | ఏతత్ | = దీనిని; |
| ఇదమ్ | = ఈ; | బుద్ధ్వా | = తెలుసుకున్న; |
| గుహ్యతమమ్ | = అత్యంత రహస్యమైన; | బుద్ధిమాన్ | = జ్ఞాని; |
| శాస్త్రమ్ | = శాస్త్రం; | కృతకృత్యః చ | = కృతార్థుడు; |
| మయా | = నా చేత; | స్యాత్ | = అవుతాడు; |
| ఉక్తమ్ | = చెప్పబడింది; | | |

**తా॥** అనఘా! నేను నీకు ఈ గుహ్యతమమైన శాస్త్రాన్ని[1] బోధించాను;

1. శాస్త్రం = పంచదశాధ్యాయం. శాస్త్రశబ్దం సమస్త గీతాశాస్త్ర పరమయినప్పటికీ, ఈ అధ్యాయం వేదార్థనిహితమూ, గీతాసారమూ అవడం వల్ల శాస్త్రసంజ్ఞ.

భారతా! ఈ తత్త్వాన్ని గ్రహించిన యోగి బుద్ధిమంతుడూ[1] (జ్ఞాని), కృతకృత్యుడూ[2] అవుతాడు. 20

**ఇతి శ్రీ మద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే పురుషోత్తమ యోగో నామ**
**పంచదశోఽధ్యాయః**

శ్లోక సంఖ్య 20 . మొదటి నుండి (550+20) 570 .

**సంసారశాఖినం ఛిత్వా స్పష్టం పంచదశే విభుః,**
**పురుషోత్తమయోగాఖ్యే పరంపద ముపాదిశత్.**

**తా॥** సంసారవృక్షాన్ని ఛేదించి భగవంతుడు స్పష్టంగా ఈ అధ్యాయంలో పరమపదాన్ని గురించి ఉపదేశించాడు.



---

1. బుద్ధి అంటే బ్రహ్మబుద్ధి మాత్రమే కాని, విషయబుద్ధి కాదు. బ్రహ్మం ఎరుగబడితేనే సర్వం ఎఱుంగబడుతుంది, ఇక తెలుసుకోదగింది ఏదీ మిగలదు; బ్రహ్మజ్ఞుడు సర్వజ్ఞుడు.

'కస్మిన్నుభగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి' – ముండకోపనిషత్తు. 1-1-3.

'భగవంతుడా, దేనిని ఎరిగితే సమస్తమూ జ్ఞాతమవుతుంది?' అని ప్రశ్న.

'బ్రహ్మమును ఎరిగితే సర్వజ్ఞుడవుతాడు' –అని సమాధానం.

2. (అ) అర్జునుడు భగవంతుని వద్ద పరమార్థతత్త్వాన్ని వినడం వల్ల కృతార్థుడైయ్యాడు. ఏలయన, ఇదే పురుషార్థానికి సమాప్తి. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' (గీత. 4-33).

(ఆ) తదాత్మతత్త్వం ప్రసమీక్ష్యదేహీ ।
ఏకః కృతార్థో భవతే వీతశోకః ॥ – శ్వేతాశ్వతరోపనిషత్తు. 2-14.

॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## షోడశోఽధ్యాయః - దైవాసుర సంపద్విభాగ యోగః

## (షోడశాధ్యాయం - దైవాసుర సంపద్విభాగ యోగం)

ఆసురీం సంపదం త్యక్త్వా దైవీ మే వాశ్రితా నరాః ।
ముచ్యంత ఇతి నిర్ణేతుం తద్వివేకోఽథ షోడశే ॥[1]



*శ్రీభగవానువాచ :*

**అభయం సత్త్వ సంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥** **1**

అభయమ్, సత్త్వ సంశుద్ధిః, జ్ఞానయోగ వ్యవస్థితిః,
దానమ్, దమః, చ, యజ్ఞః, చ, స్వాధ్యాయః, తపః, ఆర్జవమ్.

| | | | |
|---|---|---|---|
| అభయమ్ | = భయం లేకుండుట; | దమః చ | = బాహ్యేంద్రియ సంయమం; |
| సత్త్వ సంశుద్ధిః | = త్రికరణశుద్ధి; | యజ్ఞః చ | = యజ్ఞం; |
| జ్ఞానయోగ వ్యవస్థితిః | = జ్ఞాననిష్ఠ (యోగనిష్ఠ); | స్వాధ్యాయః | = బ్రహ్మయజ్ఞం; |
| | | తపః | = తపస్సు; |
| దానమ్ | = దానం; | ఆర్జవమ్ | = ఋజుప్రవర్తనం (సరళత); |

1. ఆసురీసంపదను విడచి దైవీసంపదను గ్రహించిన వారికే ముక్తి; కనుక ఈ అధ్యాయంలో అవి వర్ణించబడ్డాయి.

**తా॥** [పూర్వాధ్యాయాంతంలో దీనిని గ్రహించినవాడు, జ్ఞానియై ముక్తిని పొందుతాడు (15-20) అని చెప్పబడింది. మరి ఈ తత్త్వాన్ని ఎటువంటి వ్యక్తి గ్రహించగలడు? అనే సందేహం కలగడం సహజం. కనుక అధికారిని అనధికారిని నిర్ణయించడానికి, అధికారికి విశేషణములైన దైవీసంపదను వర్ణిస్తూ-] శ్రీ *భగవానుడు పలికెను :* భయరహితత్వం, భావశుద్ధి,[1] జ్ఞానయోగ నిష్ఠ,[2] దానం, బాహ్యేంద్రియ సంయమం, అధికారాన్ని అనుసరించి దర్శపూర్ణమాసాది యజ్ఞాలను ఆచరించడం, బ్రహ్మయజ్ఞం, తపస్సు, ఋజుప్రవర్తనం- 1

**అహింసా సత్య మక్రోధః త్యాగ శ్శాంతి రపైశునమ్ ।**
**దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥** 2

*అహింసా, సత్యమ్, అక్రోధః, త్యాగః, శాంతిః, అపైశునమ్,*
*దయా, భూతేషు, అలోలుప్త్వమ్, మార్దవమ్, హ్రీః, అచాపలమ్.*

అహింసా = ప్రాణులను పీడింపకుండడం; సత్యమ్ = అప్రియాన్ని, అనృతాన్ని విడిచి నిజమైన దాన్ని చెప్పడం; అక్రోధః = వివిధ కారణాల వల్ల కలిగే కోపాన్ని అణుచుకోవడం; త్యాగః = సన్న్యాసం; శాంతిః = చిత్తోపరతి; అపైశునమ్ = ఇతరుల దోషాలను వెల్లడి చేయకుండడం; భూతేషు దయా = ప్రాణుల యెడ దయ; అలోలుప్త్వమ్ = విషయాలు ఎదుటే ఉన్నా చలింపకుండడం; మార్దవమ్ = మృదుత్వం (అక్రౌర్యం); హ్రీః = కుకార్యాలు, కుచింతాల పట్ల సిగ్గు; అచాపలమ్ = వ్యర్థకార్యాలను ఒనర్చకపోవడం;

**తా॥** ప్రాణులను పీడింపకుండడం, అప్రియమూ అనృతమూ విడచి నిజమైన దానిని వచించడం, వివిధ కారణాల వల్ల కలిగే కోపాన్ని అణచుకోవడం,

1. చెప్పేదీ, చేసేదీ ఒకటిగా ఉండడం.
2. జ్ఞానం = శాస్త్రాచార్యోపదేశాన్ని అనుసరించి బ్రహ్మాత్మాదులను ఎఱుగుట
యోగం = ఇంద్రియసంయమం, ఏకాగ్రత వల్ల పూర్వోక్తరీతిగా గ్రహించిన వస్తువును సాక్షాత్కరించుకునే ప్రయత్నం.
వ్యవస్థితి = ఈ రెంటియందు నెలకొని ఉండే నిష్ఠ.
అభయం, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగ వ్యవస్థితి - ఈ మూడూ ప్రధానమైన దైవీసంపదలు.

సన్న్యాసం,[1] చిత్తోపరతి, ఇతరుల దోషాలను వెల్లడిచేయకపోవడం, ప్రాణులయెడ దయ, విషయాలు ఎదుటే ఉన్నప్పటికీ చలించకుండడం, మృదుత్వం, కుకార్యాలు కుచింతల పట్ల సిగ్గు, వ్యర్థకార్యాలను ఒనర్చకపోవడం- 2

**తేజః క్షమా ధృతి శ్శౌచం అద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సంపదం దైవీం అభిజాతస్య భారత ॥** 3

*తేజః, క్షమా, ధృతిః, శౌచమ్, అద్రోహః, న, అతిమానితా,*
*భవంతి, సంపదమ్, దైవీమ్, అభిజాతస్య, భారత.*

తేజః = ప్రతిభ;
క్షమా = పరాభవం కలిగినా కోపం రాకుండడం;
ధృతిః = దుఃఖాలలో అవసాదాన్ని పొందకుండా ధైర్యాన్ని వహించడం;
శౌచమ్ = బాహ్యాభ్యంతర శుద్ధి;
అద్రోహః = వైరభావం లేకుండడం;
న అతిమానితా = అత్యంత పూజనీయుడనే భావం లేకుండడం;
(అనేవి)భారత = అర్జునా;
దైవీమ్ = దేవతాయోగ్యమైన (సాత్త్వికమైన);
సంపదమ్ = స్థితికి;
అభిజాతస్య = అర్హుడై పుట్టినవానికి;
భవన్తి = కలుగుతున్నాయి.

**తా॥** ప్రతిభ, పరాభవం కలిగినా కోపం రాకుండడం, దుఃఖాలలో అవసాదాన్ని పొందక ధైర్యాన్ని వహించడం, బాహ్యాభ్యంతర శుద్ధి, వైరభావం లేకుండడం, ఎక్కువగా పూజింపదగిన వాడననే భావం లేకుండడం అనే గుణాలు[2] భారతా! దేవయోగ్యమైన సాత్త్విక స్థితిని పొందే యోగ్యతతో జన్మించిన వారికి కలుగుతున్నాయి. 3

**దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్ ॥** 4

*దంభః, దర్పః, అభిమానః, చ, క్రోధః, పారుష్యమ్, ఏవ, చ,*
*అజ్ఞానమ్, చ, అభిజాతస్య, పార్థ, సంపదమ్, ఆసురీమ్.*

---

1. దానాన్ని గురించి మొదటి శ్లోకంలోనే చెప్పి ఉండడం వల్ల, ఇక్కడ త్యాగ శబ్దానికి సన్న్యాసం అనే అర్థం చెప్పడం యుక్తమైనది. - శ్రీశంకరులు.

2. ఇరవై ఆరు సుగుణాలు.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | పారుష్యం ఏవ చ | = నిష్ఠురత్వం; |
| దమ్భః | = కపట ధర్మాచరణం (ధర్మధ్వజిత్వం); | అజ్ఞానం చ | = మరియు, కర్తవ్య-అకర్తవ్య అవివేకం; |
| దర్పః | = విద్యా-ధన-జన నిమిత్తమైన గర్వం; | ఆసురీమ్ | = రాక్షసమైన; |
| | | సంపదమ్ | = స్థితికి; |
| అభిమానః చ | = అతి పూజ్యత్వాభిమానం (అహంకారం); | అభి జాతస్య | = అర్హులై పుట్టిన వారికే; |
| | | (భవన్తి | = కలుగుతున్నాయి;) |
| క్రోధః | = కోపం; | | |

**తా॥** పార్థా! రాక్షసమైన స్థితిని పొందడానికి జన్మించినవారి యందు కపటమైన ధర్మాచరణం (ధర్మధ్వజత్వం), విద్యా-ధన-జన నిమిత్తమైన గర్వం, అతి పూజ్యత్వాభిమానం (అహంకారం); కోపం, నిష్ఠురత్వం, కర్తవ్య-అకర్తవ్యాల పట్ల అవివేకం కలుగుతున్నాయి. 4

**దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।**
**మా శుచ స్సంపదం దైవీం అభిజాతోఽసి పాణ్డవ ॥ 5**

*దైవీ, సంపత్, విమోక్షాయ, నిబంధాయ, ఆసురీ, మతా,*
*మా, శుచః, సంపదమ్, దైవీమ్, అభిజాతః, అసి, పాండవ.*

| | | | |
|---|---|---|---|
| పాణ్డవ | = అర్జునా; | నిబంధాయ | = బంధం కొరకు అనీ; |
| దైవీసంపద్ | = దేవయోగ్యమైన సాత్త్వికసంపద; | మతా | = తలంపబడ్డాయి; |
| | | మా శుచః | = శోకించకు; |
| విమోక్షాయ | = ముక్తి కొరకు అనీ; | దైవీం సంపదమ్ | = దైవీసంపదకు; |
| ఆసురీ | = అసుర సంపద; | అభిజాతః అసి | =యోగ్యుడవై జన్మించావు. |

**తా॥** (ఈ రెండిటి కార్యాన్నీ ప్రదర్శింపబడుతోంది:) దైవసంపద సంసార బంధం నుండి విడివడడానికీ, అసుర సంపద సంసార బంధంలో చిక్కువడడానికీ కారణాలని చెప్పబడుతున్నాయి. అర్జునా! శోకించకు; నీవు దైవీసంపదకు యోగ్యుడవై జన్మించావు. 5

**ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।**
**దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థ మే శృణు ॥ 6**

ద్వౌ, భూతసర్గౌ, లోకే, అస్మిన్, దైవః, ఆసురః, ఏవ, చ,
దైవః, విస్తరశః, ప్రోక్తః, ఆసురమ్, పార్థ, మే, శృణు.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | భూత సర్గౌ | = మనుష్య సృష్టి (అయింది); |
| అస్మిన్ | = ఈ; | దైవః | = దైవ-సృష్టి; |
| లోకే | = జగత్తులో; | విస్తరశః | = విస్తారంగా; |
| దైవః | = దైవ స్వభావమూ; | ప్రోక్తః | = చెప్పబడింది; |
| ఆసురః ఏవ చ | = ఆసుర స్వభావమూ గల; | ఆసురమ్ | = ఆసుర సృష్టిని; |
| | | మే | = నా నుండి; |
| ద్వౌ | = రెండు విధాలైన; | శృణు | = విను. |

**తా॥** (ఆసుర సంపదను సర్వాత్మనా వర్జించాలి; కనుక అది వివరింపబడుతోంది :) అర్జునా! ఈ జగత్తులో దైవస్వభావ సంపన్నులు, ఆసురస్వభావ యుక్తులు - అని రెండు విధాలుగా మనుష్యులు సృష్టింపబడి ఉన్నారు.[1] దైవీ స్వభావ సంపన్నుల విషయం విశదంగానే బోధించాను. ఇక, ఆసురస్వభావ యుక్తులైన వారి గురించి చెబుతాను, విను. (గీత : 9-12,13; 7-15 చూ) 6

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7**

ప్రవృత్తిమ్, చ, నివృత్తిమ్, చ, జనాః, న, విదుః, ఆసురాః,
న, శౌచమ్, న, అపి, చ, ఆచారః, న, సత్యమ్, తేషు, విద్యతే.

| | | | |
|---|---|---|---|
| ఆసురాః | = అసుర స్వభావం గల; | తేషు | = వారి యందు; |
| జనాః | = జనులు; | శౌచమ్ | = శుచిత్వం కాని; |
| ప్రవృత్తిం చ | = ధర్మప్రవృత్తిని; | ఆచారః | = ఆచారం కాని; |
| నివృత్తిం చ | = అధర్మనివృత్తిని; | సత్యమ్ చ | = సత్యం కాని; |
| న విదుః | = ఎరుగరు; | న విద్యతే | = లేదు. |

**తా॥** అసురస్వభావం గలవారికి ధర్మ ప్రవృత్తి కలుగదు; అధర్మం నుండి వారు నివృత్తులు కారు. వారికి శౌచ-సత్య-సదాచారాలు ఉండవు. 7

1. ద్వయా హ వై ప్రాజాపత్యా దేవాశ్చ అసురాశ్చ. - బృహదారణ్యకోపనిషత్తు 1-3-1.

**అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్ ।**
**అపరస్పర సంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ॥** 8

*అసత్యమ్, అప్రతిష్ఠమ్, తే, జగత్, ఆహుః, అనీశ్వరమ్,*
*అపరస్పర సంభూతమ్, కిమ్, అన్యత్, కామహైతుకమ్.*

| | | | |
|---|---|---|---|
| తే | = వారు; | కామ హైతుకమ్ | = కామం వల్ల కల్గింది; |
| జగత్ | = జగత్తు; | అపరస్పర సంభూతమ్ | = స్త్రీ పురుష సంభూతం కానిది; |
| అసత్యమ్ | = వేదపురాణాది ప్రమాణ రహితం; | కిం అన్యత్ | = వేరే ఏది ఉండగలదు? అని; |
| అప్రతిష్ఠమ్ | = ధర్మ-అధర్మ వ్యవస్థా రహితం; | ఆహుః | = పలికారు. |
| అనీశ్వరమ్ | = కర్తృ రహితం; | | |

**తా॥** వారు ఈ జగత్తును, వేదపురాణాది ప్రమాణ శూన్యమనీ (అసత్యం), ధర్మాధర్మ వ్యవస్థా శూన్యమనీ (ప్రతిష్ఠా రహితం), కర్తయూ ఫలదాతయూ అయిన ఈశ్వరుడు లేడనీ (అనీశ్వరం), కామవశంతో స్త్రీ-పురుష సంయోగం వల్ల ఉత్పన్నమైనదనీ, మరి దీనికి ఇతర కారణాలేవీ లేవనీ చెబుతారు. 8

**ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।**
**ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥** 9

*ఏతామ్, దృష్టిమ్, అవష్టభ్య, నష్ట ఆత్మానః, అల్పబుద్ధయః,*
*ప్రభవంతి, ఉగ్రకర్మాణః, క్షయాయ, జగతః, అహితాః.*

| | | | |
|---|---|---|---|
| ఏతామ్ | = ఈ; | అల్ప బుద్ధయః | = నీచమతులూ అయిన వారు; |
| దృష్టిమ్ | = మతాన్ని; | | |
| అవష్టభ్య | = ఆశ్రయించి; | జగతః | = జగత్తు యొక్క; |
| నష్ట ఆత్మానః | = సాధనచ్యుతులు; | క్షయాయ | = వినాశం కొరకు; |
| ఉగ్ర కర్మాణః | = క్రూరకర్ములు; | ప్రభవన్తి | = పుడుతున్నారు. |
| అహితాః | = కీడు కలిగించే వారు; | | |

**తా॥** ఇటువంటి నాస్తిక దృష్టిని అవలంబించి, పరలోక సాధన చ్యుతులు, క్రూరకర్ములు, అపకారులు, అల్పబుద్ధులు అయిన వారు ప్రపంచ వినాశం కొరకే పుడుతున్నారు. 9

**కామమాశ్రిత్య దుష్పూరం దమ్భ మాన మదాన్వితాః ।**
**మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ 10**

*కామమ్, ఆశ్రిత్య, దుష్పూరమ్, దంభ మాన మదాన్వితాః,*
*మోహాత్, గృహీత్వా, అసద్ గ్రాహాన్, ప్రవర్తంతే, అశుచివ్రతాః.*

దుష్పూరమ్[1] = నిండింపబడరాని (అంతులేని);
కామమ్ = కామాన్ని;
ఆశ్రిత్య = ఆశ్రయించి;
దమ్భ మాన మదాన్వితాః = దంభ-అభిమాన-మద యుక్తులై;
మోహాత్ = అవివేకంతో;
అసద్ గ్రాహాన్ = అశుభ నిశ్చయాలను;
గృహీత్వా = గ్రహించి;
అశుచి వ్రతాః = అశుద్ధములైన వ్రతాలను పూని;
ప్రవర్తన్తే = ప్రవర్తిల్లుతున్నారు.

**తా॥** దంభ-అభిమాన-మద యుక్తులై, అపరిమితమైన కామాన్ని ఆశ్రయించి, అవివేకంతో (ఈ మంత్రంతో ఆ దేవతను ఆరాధించి మహానిధులను పొందుతాను అని) అశుభ నిశ్చయాలు గలవారై (మద్యమాంసాది పూర్వకంగా క్షుద్రదేవతలను ఆరాధిస్తూ) అపవిత్రములైన వ్రతాలను ఆచరిస్తున్నారు. 10

**చిన్తా మపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః ।**
**కామోపభోగపరమాః ఏతావదితి నిశ్చితాః ॥ 11**

*చింతామ్, అపరిమేయామ్, చ, ప్రలయ అంతామ్, ఉపాశ్రితాః,*
*కామ ఉపభోగ పరమాః, ఏతావత్, ఇతి, నిశ్చితాః.*

ప్రలయ అన్తామ్ = మృతిచెందే వరకు;
అపరిమేయాం చ = పరిమితి లేని;
చిన్తామ్ = చింతను;
ఉపాశ్రితాః = ఆశ్రయించి;
కామ ఉప భోగ పరమాః = కామభోగ పరాయణులై;
ఏతావత్ = ఇదే పరమపురుషార్థం;
ఇతి = అని;
నిశ్చితాః = నిశ్చయించినవారు;

**తా॥** వారు మృతిచెందే వరకు ఎనలేని చింతలను పొందుతూ, కామ

1. మహాశనో మహాపాప్మా - గీత. 3-37 చూ.

భోగమే పరమపురుషార్థం అనీ దానికి మించినదేమీ లేదనీ నమ్ముతారు.[1] 11

**ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః ।**
**ఈహన్తే కామభోగార్థం అన్యాయే నార్థసన్చయాన్ ॥ 12**

*ఆశాపాశ శతైః, బద్ధాః, కామక్రోధ పరాయణాః,*
*ఈహంతే, కామభోగ అర్థమ్, అన్యాయేన, అర్థసంచయాన్.*

| | | | |
|---|---|---|---|
| ఆశా పాశ శతైః | = పరశ్శతములైన ఆశాపాశాలతో; | కామ భోగ అర్థమ్ | = విషయాలను భోగింప; |
| బద్ధాః | = బంధింపబడి; | అన్యాయేన | = చెడు ఉపాయాల; |
| కామ క్రోధ పరాయణాః | = కామక్రోధాలకు అధీనులై; | అర్థ సంచయాన్ | = ధన రాశులను; |
| | | ఈహన్తే | = కోరుతున్నారు. |

**తా॥** వారు అసంఖ్యాకాలైన ఆశాపాశాలకు బద్ధులై కామక్రోధాలకు లోబడి, విషయభోగాలను అనుభవించడానికి (చౌర్యాది) అసత్ ఉపాయాలను అవలంబించైనా ధనాన్ని కూడబెట్ట యత్నిస్తారు. 12

**ఇదమద్య మయా లబ్ధం ఇదం[2] ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ 13**

ఇదమ్, అద్య, మయా, లబ్ధమ్, ఇదమ్, ప్రాప్స్యే, మనోరథమ్,
ఇదమ్, అస్తి, ఇదమ్, అపి, మే, భవిష్యతి, పునః, ధనమ్.

| | | | |
|---|---|---|---|
| అద్య | = నేడు; | ఇదమ్ | = ఈధనం; |
| మయా | = నా చేత; | అస్తి | = ఉంది; |
| ఇదమ్ | = ఇది; | పునః | = మళ్ళీ; |
| లబ్ధమ్ | = సంపాదింపబడింది; | మే | = నాకు; |
| ఇదమ్ | = ఈ; | ఇదమ్ | = ఈ; |
| మనోరథమ్ | = కోరికను; | ధనం అపి | = ధనం కూడా; |
| ప్రాప్స్యే | = పొందగలను; | భవిష్యతి | = రాగలదు. |

1. కామ ఏవైకః పురుషార్థః (కామం ఒక్కటే పురుషార్థం).
చైతన్యవిశిష్టః కాయః పురుషః (చేతనతో కూడిన శరీరమే పురుషుడు).
– బార్హస్పత్యసూత్రమ్, శ్రీధరధృతము.

2. ఇమమ్. - పాఠాంతరం

**తా॥** (వారి మనోరాజ్యాన్ని వర్ణించి, నరకప్రాప్తిని చెబుతున్నాడు-) 'నేడు నాకిది లభించింది, ఈ మనోరథం ముందు చేకూరగలదు, ఈ ధనం నాకు ఉంది, ఇంకా ఇంత ధనం రాగలదు; 13

**అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరానపి ।**
**ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥14**

*అసౌ, మయా, హతః, శత్రుః, హనిష్యే, చ, అపరాన్, అపి,*
*ఈశ్వరః, అహమ్, అహమ్, భోగీ, సిద్ధః, అహమ్, బలవాన్, సుఖీ.*

| | | | |
|---|---|---|---|
| అసౌ | = ఈ; | ఈశ్వరః | = శక్తిమంతుణ్ణి; |
| శత్రుః | = విరోధి; | అహమ్ | = నేను; |
| మయా | = నాచే; | భోగీ | = భోగిని; |
| హతః | = చంపబడ్డాడు; | అహమ్ | = నేను; |
| అపరాన్ అపి చ | = మిగిలినవారిని కూడా; | సిద్ధః | = పురుషార్థ సంపన్నుణ్ణి; |
| హనిష్యే | = చంపుతాను; | బలవాన్ | = బలవంతుణ్ణి; |
| అహమ్ | = నేను; | సుఖీ | = సుఖవంతుణ్ణి. |

**తా॥** 'ఈ శత్రువును చంపాను, మిగిలిన వారిని కూడా చంపుతాను, నేను ప్రభువుని, భోగిని, పురుషార్థసంపన్నుణ్ణి. బలవంతుణ్ణి, సుఖవంతుణ్ణి; 14

**ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।**
**యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః ॥ 15**

*ఆఢ్యః, అభిజనవాన్, అస్మి, కః, అన్యః, అస్తి, సదృశః, మయా,*
*యక్ష్యే, దాస్యామి, మోదిష్యే, ఇతి, అజ్ఞాన విమోహితాః.*

| | | | |
|---|---|---|---|
| ఆఢ్యః | = ధనవంతుణ్ణి; | అస్తి | = కలడు?; |
| అభిజనవాన్ | = కులీనుణ్ణి; | యక్ష్యే | = యజ్ఞాన్ని చేస్తాను; |
| అస్మి | = అయి ఉన్నాను; | దాస్యామి | = దానాన్ని ఇస్తాను; |
| మయా సదృశః | = నాతో సముడైన; | మోదిష్యే | = ఆనందిస్తాను; |
| అన్యః | = ఇతరుడు; | ఇతి | = ఈ రీతిగా; |
| కః | = ఎవడు; | అజ్ఞానవిమోహితాః | = అవివేక ముగ్ధులై; |

**తా॥** వారు అసంఖ్యాలైన ఆశాపాశాలలో బద్ధులై, 'నేను ధనవంతుణ్ణి, సత్కుల జాతుడను, నాకు సముడెవ్వడు?' యజ్ఞం చేస్తాను, దానం ఇస్తాను, ఆనందిస్తాను,' అని అవివేకమోహితులై 15

**అనేక చిత్త విభ్రాంతాః మోహజాల సమావృతాః ।**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽ శుచౌ ॥ 16**

*అనేక చిత్త విభ్రాంతాః, మోహజాల సమావృతాః,*
*ప్రసక్తాః, కామభోగేషు, పతంతి, నరకే, అశుచౌ.*

| | |
|---|---|
| అనేక చిత్త విభ్రాంతాః = పెక్కు సంకల్పాల చేత విక్షిప్తచిత్తం గలవారై; | ప్రసక్తాః = ఆసక్తులై; |
| మోహ జాల సమావృతాః = మోహజాలం చేత ఆవృతులై; | అశుచౌ = మలినమైన; |
| కామ భోగేషు = విషయభోగాలలో; | నరకే = నరకంలో; |
| | పతన్తి = పడుతున్నారు. |

**తా॥** పెక్కు సంకల్పాలతో చిత్తం విక్షిప్తం చెంది, మోహజాలంలో తగుల్కొని, విషయ భోగాలయందు ఆసక్తులై అపవిత్రమైన నరకాలలో పడుతున్నారు. 16

**ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమాన మదాన్వితాః ।**
**యజన్తే నామయజ్ఞైస్తే దమ్భే నావిధి పూర్వకమ్ ॥ 17**

*ఆత్మసంభావితాః, స్తబ్ధాః, ధనమాన మదాన్వితాః,*
*యజంతే, నామయజ్ఞై, తే, దంభేన, అవిధి పూర్వకమ్.*

| | |
|---|---|
| ఆత్మ సంభావితాః = ఆత్మశ్లాఘులై, తమ గొప్పతనాన్ని తామే చెప్పుకుంటూ; | దమ్భేన = కపటంతో; |
| స్తబ్ధాః = వినయరహితులై; | నామయజ్ఞైః = పేరుకు మాత్రమే అయిన యజ్ఞాల చేత; |
| ధన మాన మదాన్వితాః = ధనం వల్ల కలిగే అభిమాన గర్వాలతో కూడినవారై; | అవిధి పూర్వకమ్ = విధిరహితంగా (శాస్త్రవిధిని ఉల్లంఘిస్తూ); |
| తే = వారు (ఆ అసుర పురుషులు) | యజన్తే = యజ్ఞం చేస్తారు. |

**తా॥** వారు ఆత్మశ్లాఘులై, ఐశ్వర్యమదగర్వంతో, దంభంతో శాస్త్రవిధిని ఉల్లంఘిస్తూ, పేరుకు మాత్రమే అయిన యజ్ఞాలను[1] ఒనర్చుతున్నారు. 17

1. విహితములైన అంగాలు, ఇతికర్తవ్యత లేనివి; ఈయన సోమయాజి అని చయనులు అని పేరు →

**అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ 18**

*అహంకారమ్, బలమ్, దర్పమ్, కామమ్, క్రోధమ్, చ, సంశ్రితాః,*
*మామ్, ఆత్మ పరదేహేషు, ప్రద్విషన్తః, అభ్యసూయకాః.*

(వారు) అహంకారమ్ = సర్వానర్థాలకూ మూలమైన అభిమానాన్ని;
బలమ్ = పరపీడాదాయకమైన శక్తిని;
దర్పమ్ = ధర్మోల్లంఘన కారణమైన గర్వాన్ని;
కామమ్ = స్త్రీ విషయమైన రతిని;
క్రోధం చ = ఇచ్ఛ ప్రతిహతం కాగా కలిగే కోపాన్ని;
సంశ్రితాః = ఆశ్రయించి;
ఆత్మ పర దేహేషు = స్వదేహంలోనూ, పరదేహంలోనూ ఉన్న;
మామ్ = నన్ను (ఈశ్వరుణ్ణి);
ప్రద్విషంతః = ద్వేషిస్తూ;
అభ్యసూయ కాః = సన్మార్గవర్తులగువారి గుణాలను నిందించేవారు అవుతున్నారు;

**తా॥** వారు సర్వానర్థాలకూ, సర్వదోషాలకూ మూలమైన అహంకారాన్ని, పరపీడాకరమైన బలాన్ని, ధర్మోల్లంఘన కారణమైన దర్పాన్ని, స్త్రీ విషయమైన కామాన్ని, ఇచ్ఛ ప్రతిహతం అవడం వల్ల కలిగే కోపాన్ని ఆశ్రయించి; తమ శరీరంలోనూ, ఇతరుల శరీరాలలోనూ (బుద్ధికి, కర్మలకూ సాక్షినై) వెలయుచున్న నన్ను (ఈశ్వరుణ్ణి) ద్వేషిస్తున్నారు – నా శాసనాన్ని అతిక్రమిస్తున్నారు; మరియు, సన్మార్గవర్తులైన వారి గుణాలను నిందిస్తున్నారు. 18

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్ర మశుభాన్ ఆసురీష్వేవ యోనిషు ॥ 19**

*తాన్, అహమ్, ద్విషతః, క్రూరాన్, సంసారేషు, నర అధమాన్,*
*క్షిపామి, అజస్రమ్, అశుభాన్, ఆసురీషు, ఏవ, యోనిషు.*

అహమ్ = నేను;
ద్విషతః = విద్వేషులును;
క్రూరాన్ = క్రూరులును;
నర-అధమాన్ = నరాధములను;

---

→ పొందడానికి చేసేవి. ఇక్కడ నిందింపబడినవి 'నామ యజ్ఞాలే' అని గుర్తించుకోవాలి. 3వ అధ్యాయంలో యజ్ఞాలు ప్రశంసించబడే ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| అశుభాన్ | = అమంగళకరులూ అయిన (వారిని); | యోనిషు ఏవ | = యోనులయందే (వంశాలలోనే); |
| సంసారేషు | = జన్మ-మృత్యు మార్గాలలో; | అజస్రమ్ | = మళ్ళీ మళ్ళీ; |
| ఆసురీషు | = ఆసురములైన; | క్షిపామి | = ఉంచుతున్నాను. |

**తా॥** విద్వేషులూ, క్రూరులూ, కుకర్ములూ అయిన వారికి మళ్ళీ మళ్ళీ (వారి పాప కర్మలకు ఫలితంగా వ్యాఘ్రసర్పాదికమైన) అసుర జన్మలనే కలుగజేస్తున్నాను. 19

**ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాంత్యధమాం గతిమ్ ॥ 20**

*ఆసురీమ్, యోనిమ్, ఆపన్నాః, మూఢాః, జన్మని, జన్మని,*
*మామ్, అప్రాప్య, ఏవ, కౌంతేయ, తతః, యాంతి, అధమామ్, గతిమ్.*

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా; | మామ్ | = నన్ను; |
| మూఢాః | = మూఢులు; | అప్రాప్య ఏవ | = పొందకయే; |
| జన్మని జన్మని | = ప్రతిజన్మలోనూ; | తతః | = అంత కంటే; |
| ఆసురీ | = అసురమైన; | అధమాంగతిమ్ | = అధోగతిని; |
| యోనిమ్ | = శరీరాన్ని; | యాన్తి | = పొందుతున్నారు. |
| ఆపన్నాః | = పొంది; | | |

**తా॥** అర్జునా! ఇట్టి మూఢులు ప్రతిజన్మలో ఆసురమైన శరీరాన్నే పొందుతూ, నన్ను పొందకుండానే సన్మార్గ విముఖులై క్రమంగా అధోగతిని (క్రిమికీటకాది జన్మలను) పొందుతున్నారు. 20

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।**
**కామః క్రోధ స్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 21**

*త్రివిధమ్, నరకస్య, ఇదమ్, ద్వారమ్, నాశనమ్, ఆత్మనః,*
*కామః, క్రోధః, తథా, లోభః, తస్మాత్, ఏతత్, త్రయమ్, త్యజేత్.*

| | | | |
|---|---|---|---|
| కామః | = కామం; | తథా | = అలాగే (మరియు); |
| క్రోధః | = క్రోధం; | లోభః | = లోభం; |

| | | | |
|---|---|---|---|
| ఇదమ్ | = ఈ ఆసురభావం; | ఆత్మనః | = జీవునికి; |
| త్రివిధమ్ | = మూడు విధాలు; | నాశనమ్ | = అధోగతిదాయకం; |
| నరకస్య | = నరకానికి; | ఏతత్ | = ఈ; |
| ద్వారమ్ | = ద్వారం వంటిది; | త్రయమ్ | = మూడింటినీ; |
| తస్మాత్ | = కనుక; | త్యజేత్ | = త్యజించాలి. |

**తా॥** కామక్రోధలోభాలు మూడూ నరక ద్వారాలు; ఇవి ఆత్మను అధోగతి పాలుజేస్తున్నాయి. ఆత్మవినాశకరాలైన ఈ ద్వారాలలో ప్రవేశించిన మనుష్యుడు పురుషార్థానికి అయోగ్యుడవుతాడు. కనుక, ఈ మూడింటిని త్యజించడం మంచిది. 21

**ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైః త్రిభిర్నరః ।**
**ఆచరత్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిమ్ ॥ 22**

*ఏతైః, విముక్తః, కౌంతేయ, తమోద్వారైః, త్రిభిః, నరః,*
*ఆచరతి, ఆత్మనః, శ్రేయః, తతః, యాతి, పరామ్, గతిమ్.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = కుంతీపుత్రా; | ఆత్మనః | = తన; |
| ఏతైః | = ఈ; | శ్రేయః | = శుభాన్ని; |
| త్రిభిః | = మూడు; | ఆచరతి | = చేకూర్చుకుంటాడు; |
| తమోద్వారైః | = నరకద్వారాల నుండి; | తతః | = ఆ శుభానుష్ఠానం వల్ల; |
| విముక్తః | = విడివడి; | పరాంగతిమ్ | = మోక్షాన్ని; |
| నరః | = మనుష్యుడు; | యాతి | = పొందుతాడు. |

**తా॥** కౌంతేయా! ఈ నరక ద్వారాల నుండి వెలువడిన మనుజుడు స్వీయ కల్యాణ - సాధనాలను (తపోయోగాది కర్మలను) ఆచరించి, తత్ఫలంగా మోక్షాన్ని పొందుతున్నాడు. 22

**యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః[1] ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥23**

*యః, శాస్త్రవిధిమ్, ఉత్సృజ్య, వర్తతే, కామకారతః,*
*న, సః, సిద్ధిమ్, అవాప్నోతి, న, సుఖమ్, న, పరామ్, గతిమ్.*

1. కామచారతః - పాఠాంతరం.

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | సః | = అతడు; |
| శాస్త్ర విధిమ్ | = కర్తవ్యాకర్తవ్యాలను ఉపదేశించే శాస్త్రీయ విధినిషేధాలను; | సిద్ధిమ్ | = పురుషార్థ లాభాన్ని; |
| | | న అవాప్నోతి | = పొందడు; |
| ఉత్సృజ్య | = ఉల్లంఘించి; | సుఖమ్ | = ఐహిక సుఖాన్ని; |
| కామకారతః | = యథేచ్ఛాచారియై; | పరాంగతిమ్ | = శ్రేష్ఠగతియైన మోక్షాన్ని; |
| వర్తతే | = కర్మలను ఒనర్చుతున్నాడో; | న | = పొందడు. |

**తా॥** (ఆసురీ సంపదను త్యజించి, శ్రేయస్కరమైన స్వధర్మాన్ని ఆచరించడం కేవలం శాస్త్రనిర్దేశం చేతనే సంభవమవుతుంది.) ఎవడు వేదవిహిత ధర్మమైన విధినిషేధాలను పాలించకుండా యథేచ్ఛగా ప్రవర్తిల్లుతాడో, అతడు తత్త్వజ్ఞానాన్ని గాని, శాంతిని గాని, మోక్షాన్ని గాని పొందడు. 23

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ 24**

తస్మాత్, శాస్త్రమ్, ప్రమాణమ్, తే, కార్య అకార్య వ్యవస్థితౌ,
జ్ఞాత్వా, శాస్త్ర విధాన ఉక్తమ్, కర్మ, కర్తుమ్, ఇహ, అర్హసి.

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = కనుక; | (కనుక) ఇహ | = ఈ లోకంలో; |
| కార్య అకార్య వ్యవస్థితౌ | = కర్తవ్య-అకర్తవ్య నిర్ణయ విషయంలో; | శాస్త్ర విధాన ఉక్తమ్ | = శాస్త్ర నియమ విహితాన్ని; |
| శాస్త్రమ్ | = శాస్త్రం; | జ్ఞాత్వా | = గ్రహించి; |
| తే | = నీకు; | కర్మకర్తుమ్ | = కర్మను చేయడానికి; |
| ప్రమాణమ్ | = ప్రమాణం; | అర్హసి | = యోగ్యుడవవుతావు. |

**తా॥** కనుక, కర్తవ్య-అకర్తవ్య విషయ నిర్ధారణం చేయడానికి నీకు శాస్త్రం[1] ఒక్కటే ఉపదేష్ట, కాని, స్వకల్పనలు కావు. అందువల్ల శాస్త్రీయాలైన విధి నిషేధాల స్వరూపాన్ని గ్రహించి, కర్మాధికారివియైన నీవు యథాధికారం కర్మను ఒనర్చడానికి అర్హుడవవుతావు. (అంటే, నిషిద్ధాలను పరిత్యజించి విహితాలను అనుష్ఠించు. చిత్తశుద్ధికి, జ్ఞానానికి, ముక్తికి మూలం కర్మ.) 24

1. శాస్త్రం = వేదాలు (వేదమూలకాలు, వేదానుగతాలు అయిన) స్మృతి, పురాణ, తంత్రాది శాస్త్రాలు.

## ఇతి శ్రీ మద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మావిద్యాయాంయోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర సంపద్విభాగ యోగోనామ షోడశోఽధ్యాయః

శ్లోక సంఖ్య 24; మొదటి నుండి (570+24) 594.

దేవద్వై తేయసంపత్తి సంవిభాగేన షోడశే ।
తత్త్వజ్ఞానేఽధికారస్తు సాత్త్విక స్యేతి దర్శితమ్ ॥

**తా॥** దైవాసుర సంపద్విభాగం చేత సాత్త్వికునకే తత్త్వజ్ఞానాధికారం అని ప్రదర్శించబడింది.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## సప్తదశోఽ ధ్యాయః - శ్రద్ధాత్రయ విభాగ యోగః

## ( సప్తదశాధ్యాయం - శ్రద్ధాత్రయ విభాగ యోగం)

ఉక్తాధికారహేతూనాం శ్రద్ధా ముఖ్యా చ సాత్త్వికీ ।
ఇతి సప్తదశే గౌణశ్రద్ధాభేదస్త్రిధోచ్యతే ॥[1]

అర్జున ఉవాచ :

**యే శాస్త్ర విధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥** 1

యే, శాస్త్ర విధిమ్, ఉత్సృజ్య, యజంతే, శ్రద్ధయా, అన్వితాః,
తేషామ్, నిష్ఠా, తు, కా, కృష్ణ, సత్త్వమ్, అహో, రజః, తమః.

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = శ్రీకృష్ణా; | తేషామ్ | = వారి; |
| యే | = ఎవరు; | నిష్ఠా | = నిష్ఠ; |
| శాస్త్ర విధిమ్ | = శృతిస్మృతుల విధానాన్ని; | కా | = ఎట్టిది; |
| ఉత్సృజ్య | = పరిత్యజించినవారై; | సత్త్వమ్ | = సత్త్వమా; |
| తు | = కాని; | రజః | = రాజసికమా?; |
| శ్రద్ధయా అన్వితాః | = శ్రద్ధాయుక్తులై; | అహో | = లేక; |
| యజన్తే | = దేవతలను అర్చిస్తున్నారో; | తమః | = తామసికమా?; |

1. జ్ఞానాధికారికి శాస్త్రప్రమాణంపై విశ్వాసం ఉండడమే ముఖ్యం; అది ముఖ్యమైన శ్రద్ధ; తదితరాలైనవి గౌణ-శ్రద్ధలు. ఇవి వివరించబడుతున్నాయి.

**తా॥** [పూర్వాధ్యాయాంతంలో 'శాస్త్రవిధిని ఉల్లంఘించి కామచారియైన వాడికి తత్త్వజ్ఞానాధికారం లేదు' (16-23) అని చెప్పబడింది; కాని, యథేష్టాచారి కాక శ్రద్ధాయుక్తుడైన వాడికి అధికారం ఉన్నదో లేదో తెలుసుకో గోరుతూ-] అర్జునుడు ప్రశ్నించెను : కృష్ణా! శాస్త్రనిర్దిష్టాలైన విధినిషేధాలను కష్టకరాలని తలచి గాని, లేక ఔదాసీన్యాన్ని వహించి గాని, తెలిసికో ప్రయత్నించకుండా, ఆస్తిక్య బుద్ధితో ప్రాచీనుల ఆచారాలను, పరంపరాగతాలైన వాటిని అనుసరిస్తూ దేవతాదులను అర్చించే వారి ప్రవృత్తి ఎటువంటిది? సాత్త్వికమా, రాజసికమా, లేక తామసికమా?[1] 1

*శ్రీభగవానువాచ :*

**త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥** **2**

*త్రివిధా, భవతి, శ్రద్ధా, దేహినామ్, సా, స్వభావజా,*
*సాత్త్వికీ, రాజసీ, చ, ఏవ, తామసీ, చ, ఇతి, తామ్, శృణు.*

| | | | |
|---|---|---|---|
| దేహినామ్ | = మనుష్యులకు; | భవతి | = కలుగుతోంది; |
| సాత్త్వికీ | = సత్త్వగుణ ప్రధానం; | సా చ | = ఆ శ్రద్ధ; |
| రాజసీ చ ఏవ | = రజోగుణ ప్రధానం; | స్వభావ జా | = పూర్వజన్మలో ధర్మ-అధర్మ సంస్కారాన్ని అనుసరించి ఉత్పన్నమవుతుంది; |
| తామసీ చ | = తమోగుణ ప్రధానమూ; | | |
| ఇతి | = అని; | | |
| త్రివిధా ఏవ | = మూడు విధాలుగానే; | తామ్ | = వాటిని గురించి; |
| శ్రద్ధా | = శ్రద్ధ; | శృణు | = విను. |

**తా॥** *శ్రీకృష్ణుడు పలికెను :* [శాస్త్రతత్త్వజ్ఞులైన వారికి పరమేశ్వర విషయమూ, ఏకవిధమూ అయిన సాత్త్విక శ్రద్ధ కలుగుతోంది (2-41). కాని లోకాచారాన్ని అనుసరించి ప్రవర్తిల్లే-] మనుష్యులకు దేవపూజా విషయమైన సాత్త్విక శ్రద్ధయూ, యక్ష రాక్షస పూజాసంబంధమైన రాజసిక శ్రద్ధయూ, భూతప్రేత పూజావిషయమైన

1. వీరు సాత్త్వికులైతే తత్త్వజ్ఞానాధికారం (అర్హత) ఉంది; సాత్త్వికులు కాకపోతే తత్త్వ జ్ఞానాధికారం లేదు కనుక, ఈ శ్రద్ధ ఎటువంటిది అని భావం.

తామసిక శ్రద్ధయూ కలుగుతున్నాయి. ఈ శ్రద్ధలు మూడూ పూర్వజన్మ కృత్యాలైన ధర్మ-అధర్మాల సంస్కారాన్ని అనుసరించే కలుగుతాయి. ఈ విషయాన్ని విను. 2

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః ॥ 3**

*సత్త్వ అనురూపా, సర్వస్య, శ్రద్ధా, భవతి, భారత,*
*శ్రద్ధామయః, అయమ్, పురుషః, యః, యత్ శ్రద్ధః, సః, ఏవ, సః.*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | శ్రద్ధామయః | = శ్రద్ధాస్వరూపుడు; |
| సర్వస్య | = ప్రతిమనుజుని; | యః | = ఎవడు; |
| శ్రద్ధా | = శ్రద్ధయు; | యత్ శ్రద్ధః | = పూర్వజన్మలో ఎటువంటి శ్రద్ధ కలిగి ఉన్నాడో; |
| సత్త్వ అనురూపా | = విశిష్టసంస్కార యుక్తమైన అంతఃకరణానికి అనుగుణమై; | సః | = అతడు; |
| భవతి | = కలుగుతోంది; | సః ఏవ | = ఇప్పుడు కూడా అటువంటి నిష్ఠనే గ్రహిస్తున్నాడు; |
| అయమ్ | = ఈ; | | |
| పురుషః | = జీవుడు; | | |

**తా॥** అర్జునా! మనుష్యులందరికీ వారివారి అంతఃకరణ సంస్కారాన్ని అనుసరించే శ్రద్ధ కలుగుతోంది. మనిషి శ్రద్ధామయుడు. పూర్వజన్మలో ఎవరికి ఎటువంటి శ్రద్ధ ఉందో, అతడు వర్తమాన జన్మలో కూడా అటువంటి స్వభావాన్నే (నిష్ఠనే) పరిగ్రహిస్తున్నాడు. (శ్రీమద్భాగవతమ్. 11-14-9 చూ.) 3

**యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।**
**ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః ॥ 4**

*యజంతే, సాత్త్వికాః, దేవాన్, యక్షరక్షాంసి, రాజసాః,*
*ప్రేతాన్, భూతగణాన్, చ, అన్యే, యజంతే, తామసాః, జనాః.*

| | | | |
|---|---|---|---|
| సాత్త్వికాః | = సాత్త్వికులు; | అన్యే | = ఇతరులైన; |
| దేవాన్ | = దేవతలను; | తామసాః జనాః | = తామసికులు; |
| యజన్తే | = పూజిస్తున్నారు; | ప్రేతాన్ | = ప్రేతాలను; |
| రాజసాః | = రాజసికులు; | భూతగణాన్ చ | = భూతాలను; |
| యక్ష రక్షాంసి | = యక్షులను, రాక్షసులను (పూజిస్తున్నారు); | యజన్తే | = పూజిస్తున్నారు; |

**తా॥** సాత్త్వికులు దేవతలను, రాజసికులు యక్షరాక్షసులను, తామసికులు భూతప్రేతాలను పూజిస్తున్నారు. (పూజా రుచిని అనుసరించి పూజ చేసేవారి స్వభావాన్ని గ్రహించవచ్చు.) 4

**అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।**
**దమ్భాహఙ్కార సంయుక్తాః కామ రాగ బలాన్వితాః ॥ 5**

*అశాస్త్రవిహితమ్, ఘోరమ్, తప్యంతే, యే, తపః, జనాః,*
*దంభ అహంకార సంయుక్తాః, కామరాగ బల అన్వితాః.*

**కర్శయన్త[1] శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః ।**
**మాం చై వాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్ ॥ 6**

*కర్శయంతః, శరీరస్థమ్, భూతగ్రామమ్, అచేతసః,*
*మామ్, చ, ఏవ, అంతః శరీరస్థమ్, తాన్, విద్ధి, ఆసుర నిశ్చయాన్.*

| | | | |
|---|---|---|---|
| దంభ అహంకార సంయుక్తాః | = దంభం, అహంకారం కలవారు; | మాం చ | = ఆత్మస్వరూపుడనైన నన్ను; |
| కామ రాగ బల అన్వితాః | = కామం, ఆసక్తి, పట్టుదల కలవారూ; | కర్శయన్తః | = కష్టపెడుతూ; |
| యే | = ఏ; | అశాస్త్ర విహితమ్ | = శాస్త్రం విధించని; |
| అచేత సః | = అవివేకులైన; | ఘోరమ్ | = తమకూ ఇతరులకూ పీడాప్రదమైన; |
| జనాః | = జనులు; | తపః | = తపస్సును; |
| శరీరస్థమ్ | = శరీరంలో; | తప్యం తే | = అనుష్ఠిస్తున్నారో; |
| భూతగ్రామమ్ | = ఇంద్రియ సమూహాన్ని; | తాన్ | = వారిని; |
| అంతఃశరీరస్థమ్ | = బుద్ధికి సాక్షిగా ఉన్న; | ఆసుర నిశ్చయాన్ | = అసురస్వభావం గలవారిగా; |
| | | విద్ధి | = తెలుసుకో. |

**తా॥** (సాత్త్వికాది భేదాలూ, తత్కార్య భేదాలూ ప్రదర్శించబడ్డాయి; రజస్తమో గుణయుతుల విశేషాంతరాన్ని తెలుపుతున్నాడు-) దంభాహంకార యుక్తులూ, కామరాగ బలాన్వితులూ అయిన ఏ అవివేకులు దేహంలోని పంచ భూతాలనూ, అంతర్యామిగా ఉన్న నన్నూ (వ్యర్థములైన ఉపవాసాదుల చేత)

1. కర్షయంతః. - పాఠాంతరం.

కష్టపెడుతూ, తమకూ ఇతరులకూ కూడా పీడాప్రదమైన తపస్సును చేస్తున్నారో వారిని, ఆసుర స్వభావులని గ్రహించు.[1] 5-6

**ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।**
**యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు ॥ 7**

*ఆహారః, తు, అపి, సర్వస్య, త్రివిధః, భవతి, ప్రియః,*
*యజ్ఞః, తపః, తథా, దానమ్, తేషామ్, భేదమ్, ఇమమ్, శృణు.*

ఆహారః తు అపి = ఆహారం కూడా; సర్వస్య = ఈ త్రివిధ జనులకు; త్రివిధః = మూడు రకాలైనది; ప్రియః = ప్రీతికరం; భవతి = అవుతోంది; తథా = అదే విధంగా; యజ్ఞః = యజ్ఞం; తపః = తపస్సు; దానమ్ = దానాలు కూడా (మూడు విధాలైనవి ప్రియమవుతున్నాయి); తేషామ్ = వాటి; ఇమమ్ = ఈ; భేదమ్ = భేదాన్ని; శృణు = విను.

**తా॥** ఈ ముగ్గురికీ ఆహారం కూడా సత్త్వాది గుణభేదాన్ని అనుసరించి మూడు విధాలైనది ప్రియమవుతోంది. అదేవిధంగా యజ్ఞ దాన తపాలు కూడా మూడు విధాలవుతున్నాయి. వాటి భేదాన్ని విను. 7

**ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యాః ఆహారా స్సాత్త్విక ప్రియాః ॥ 8**

*ఆయుః, సత్త్వ బల ఆరోగ్య సుఖప్రీతి వివర్ధనాః,*
*రస్యాః, స్నిగ్ధాః, స్థిరాః, హృద్యాః, ఆహారాః, సాత్త్విక ప్రియాః.*

ఆయుః-సత్త్వ-బల-ఆరోగ్య-సుఖ-ప్రీతి-వివర్ధనాః = ఆయువును, ఉత్సాహాన్ని, శక్తిని, ఆరోగ్యాన్ని, చిత్తప్రసాదాన్ని, సంతోషాన్ని వృద్ధి చేసేవీ; రస్యాః = రసవంతాలూ; స్నిగ్ధాః = నేతితో కూడినవీ; స్థిరాః = చెడిపోనివీ; హృద్యాః = మనోహరమైనవీ అయిన; ఆహారాః = ఆహారాలు; సాత్త్వికప్రియాః = సాత్త్వికులకు ఇష్టం.

1. శాస్త్రవిధిని ఎరుగకున్నప్పటికీ పూర్వపుణ్య సంస్కారాన్ని అనుసరించి ఉత్తములైన వారు కొందరు సాత్త్వికులవుతున్నారు; మధ్యమములైన కొందరు రాజసికులవుతున్నారు; అధములు తామసులవుతున్నారు.

**తా॥** ఆయువును, ఉత్సాహాన్నీ, శక్తిని, ఆరోగ్యాన్నీ, చిత్తప్రసాదాన్నీ, సంతోషాన్నీ విశేషంగా వృద్ధి చేసేవీ; రసవంతాలూ, నేతితో కూడినవీ, చెడకుండా ఉండేవీ, మనోహరమైనవీ అయిన భక్ష్యభోజ్యాలు సాత్త్వికులకు ఇష్టమైనవి. 8

**కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః ।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకా మయప్రదాః ॥ 9**

*కట్వ అమ్ల లవణ అతిఉష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః,*
*ఆహారాః, రాజసస్య, ఇష్టాః, దుఃఖశోక ఆమయప్రదాః.*

| | |
|---|---|
| కటు-అమ్ల-లవణ-అతి[1] -ఉష్ణ-తీక్ష్ణ-రూక్ష-విదాహినః = మిక్కిలి చేదు-పులుపు-ఉప్పు-వేడి-కారం, మిక్కిలి ఎండినవీ, మంటపెట్టేవీ అయిన; | దుఃఖ-శోక-ఆమయ-ప్రదాః = దుఃఖాన్నీ, శోకాన్నీ, రోగాన్నీ కలిగించేవీ; |
| ఆహారాః = ఆహారవస్తువులు; | రాజసస్య = రాజసులకు; |
| | ఇష్టాః = ప్రియములు. |

**తా॥** మిక్కిలి చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారంగా ఉండేవీ, మిక్కిలి ఎండినవీ, మంట కలిగించేవీ అయిన ఆహారాలు రాజసులకు ప్రియమైనవిగా ఉన్నాయి; ఇవి రోగ, శోక, దుఃఖాలను ఒసగుతున్నాయి. 9

**యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10**

*యాతయామమ్, గతరసమ్, పూతి, పర్యుషితమ్, చ, యత్,*
*ఉచ్ఛిష్టమ్, అపి, చ, అమేధ్యమ్, భోజనమ్, తామసప్రియమ్.*

| | |
|---|---|
| యత్ = ఏ; | పర్యుషితమ్ చ = క్రిందటి దినముదో; |
| భోజనమ్ = ఆహారం; | ఉచ్ఛిష్టమ్ అపి చ = ఎంగిలిదో; |
| యాత-యామమ్ = జాముసేపు దాటినదో; | అమేధ్యమ్ = అపవిత్రమో; |
| గత-రసమ్ = శుష్కమో; | (తత్ = అది;) |
| పూతి = దుర్గంధమయమో; | తామసప్రియమ్ = తామసులకు ఇష్టం; |

1. 'అతి' శబ్దం ఈ పదాలన్నిటికీ అనువర్తిస్తుంది.

**తా॥** ఒక జాము నిలువ ఉండి చల్లపడిపోయినవీ, రసం లేక పిప్పిగా ఉండేవీ, పాసిపోయి దుర్గంధమయమైనవీ, దినాంతరపక్వములై చద్దిగా మారినవీ, ఇతరులు తినగా మిగిలినవీ, అపవిత్రమైనవీ అయిన ఆహారాలు తామసులకు ప్రియమైనవి. 10

**అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదిష్టో[1] య ఇజ్యతే ।**
**యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥ 11**

*అఫల ఆకాంక్షిభిః, యజ్ఞః, విధి దిష్టః, యః, ఇజ్యతే,*
*యష్టవ్యమ్, ఏవ, ఇతి, మనః, సమాధాయ, సః, సాత్త్వికః.*

| | | | |
|---|---|---|---|
| అఫల ఆకాంక్షిభిః | = నిష్కాములచే; | విధి దిష్టః | = శాస్త్రవిహితమైన; |
| యష్టవ్యం ఏవ | = యజ్ఞం చేయవలసిందే; | యజ్ఞః | = యజ్ఞం; |
| ఇతి | = అని; | ఇజ్యతే | = చేయబడుతోందో; |
| మనః | = మనస్సును; | సః | = ఆ యజ్ఞం; |
| సమాధాయ | = స్థిరపరచుకొని; | సాత్త్వికః | = సాత్త్వికమైనది. |
| యః | = ఏ; | | |

**తా॥** ఫలాకాంక్ష రహితులైన పురుషులు యజ్ఞానుష్ఠానమే కర్తవ్యం అని నిశ్చయించుకుని, వారు ఆచరించే శాస్త్రవిధి సమ్మతమైన యజ్ఞమే సాత్త్వికం అనబడుతోంది. 11

**అభిసంధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12**

*అభిసంధాయ, తు, ఫలమ్, దంభార్థమ్, అపి, చ, ఏవ, యత్,*
*ఇజ్యతే, భరతశ్రేష్ఠ, తమ్, యజ్ఞమ్, విద్ధి, రాజసమ్.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | దమ్భార్థం అపి చ ఏవ | = తన మహత్త్వ ప్రకటన కొరకే; |
| ఫలమ్ | = స్వర్గాది ఫలాన్ని; | | |
| అభిసంధాయ | = అపేక్షించి; | యత్ | = ఏ యజ్ఞం; |

1. విధిదృష్టో – పాఠాంతరం

| | | | |
|---|---|---|---|
| ఇజ్యతే | = ఒనర్చబడుతోందో; | యజ్ఞమ్ | = యజ్ఞాన్ని; |
| భరత శ్రేష్ఠ | = అర్జునా; | రాజసమ్ | = రాజసికమని; |
| తమ్ | = ఆ; | విద్ధి | = గ్రహించు. |

**తా॥** అర్జునా! ఫలకాంక్ష తోనూ తన మహత్త్వాన్ని ప్రకటించుకోవడానికి ఒనర్చబడే యజ్ఞం రాజసమని గ్రహించు. 12

**విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్ ।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13**

*విధిహీనమ్, అసృష్ట అన్నమ్, మంత్రహీనమ్, అదక్షిణమ్,*
*శ్రద్ధావిరహితమ్, యజ్ఞమ్, తామసమ్, పరిచక్షతే.*

| | | | |
|---|---|---|---|
| విధిహీనమ్ | = శాస్త్రవిధి శూన్యమును; | శ్రద్ధావిరహితమ్ | = శ్రద్ధాహీనమూ అయిన; |
| అసృష్ట అన్నమ్ | = అన్నదాన రహితమూ; | యజ్ఞమ్ | = యజ్ఞాన్ని; |
| మన్త్రహీనమ్ | = మంత్రవర్జితమూ; | తామసమ్ | = తామసమని; |
| అదక్షిణమ్ | = దక్షిణారహితమూ; | పరిచక్షతే | = చెబుతున్నారు. |

**తా॥** శాస్త్రవిధి, అన్నదానం, మంత్రం,[1] దక్షిణ, శ్రద్ధ – ఇవి లేని యజ్ఞాన్ని తామస యజ్ఞం అని చెబుతున్నారు. 13

**దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ ।**
**బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14**

*దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనమ్, శౌచమ్, ఆర్జవమ్,*
*బ్రహ్మచర్యమ్, అహింసా, చ, శారీరమ్, తపః, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| దేవ-ద్విజ-గురు-ప్రాజ్ఞ-పూజనమ్ | = దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం; | బ్రహ్మచర్యమ్ | = బ్రహ్మచర్యం; |
| శౌచమ్ | = శుచిత్వం; | అహింసా చ | = అహింస; |
| ఆర్జవమ్ | = ఋజుత్వం; | శారీరమ్ | = శారీరకమైన; |
| | | తపః | = తపస్సు అని; |
| | | ఉచ్యతే | = చెప్పబడుతోంది. |

1. శుద్ధమైన మంత్రోచ్చారణం.

**తా॥** (ఆహార, యజ్ఞాలలో సాత్త్వికాది భేదాలు ప్రదర్శించబడ్డాయి; ఇక తపస్సులలో భేదాన్ని నిర్ణయించడానికి పూర్వం తపస్స్వరూపం తెలుపబడుతోంది:) దేవతలను-బ్రాహ్మణులను- గురువులను- తత్త్వవేత్తలను పూజించడం, శుచిత్వం, సత్ప్రవర్తన, బ్రహ్మచర్యం, అహింస అనేవి శరీరంతో ఒనర్చబడే తపస్సు అని చెబుతారు. 14

**అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।**
**స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15**

*అనుద్వేగకరమ్, వాక్యమ్, సత్యమ్, ప్రియహితమ్, చ, యత్,*
*స్వాధ్యాయ అభ్యసనమ్, చ, ఏవ, వాఙ్మయమ్, తపః, ఉచ్యతే.*

యత్ వాక్యమ్ = ఏ వాక్యం;
అనుద్వేగకరమ్ = ప్రాణులకు దుఃఖాన్ని కలిగించనిదో;
సత్యమ్ = యథార్థమో;
ప్రియ హితం చ = ప్రియకరమూ, హితకరమో;
(తత్) చ = (అదీ) మరియు;
స్వాధ్యాయ అభ్యసనమ్ ఏవ = స్వశాఖా వేదాధ్యయనమూ, శాస్త్రాభ్యాసమూ;
వాఙ్మయమ్ = వాచికమైన;
తపః = తపస్సు అని;
ఉచ్యతే = చెప్పబడును;

**తా॥** ఇతరులకు భయాన్ని, కష్టాన్ని కలిగించనిదీ, వినడానికి ఇంపుగా ఉండి సుఖాన్ని చేకూర్చేదీ, సత్య వాక్యమూ, వేదాభ్యాసమూ -వీటిని వాచిక తపస్సు అని అంటున్నారు. 15

**మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః ।**
**భావసంశుద్ధి రిత్యేతత్ తపో మానస ముచ్యతే ॥ 16**

*మనః ప్రసాదః, సౌమ్యత్వమ్, మౌనమ్, ఆత్మ వినిగ్రహః,*
*భావసంశుద్ధిః, ఇతి, ఏతత్, తపః, మానసమ్, ఉచ్యతే.*

మనః ప్రసాదః = చిత్తనైర్మల్యం;
సౌమ్యత్వమ్ = కనికరం;
మౌనమ్ = వాఙ్నియమం;
ఆత్మ వినిగ్రహః = మనోనిరోధం;

| | | | |
|---|---|---|---|
| భావ సంశుద్ధిః | = అంతఃకరణ శుద్ధి; | తపః | = తపస్సు అని; |
| ఇతి ఏతత్ | = ఇదియే; | ఉచ్యతే | = చెప్పబడుతుంది. |
| మానసమ్ | = మానసికమైన; | | |

**తా॥** చిత్తశుద్ధి, కనికరం, వాఙ్నియమం, మనో నిరోధం, అంతఃకరణశుద్ధి –అనేవి మనస్సుతో నిర్వర్తింపదగిన తపస్సు అని అంటారు. 16

**శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।**
**అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17**

*శ్రద్ధయా, పరయా, తప్తమ్, తపః, తత్, త్రివిధమ్, నరైః,*
*అఫలాకాంక్షిభిః, యుక్తైః, సాత్త్వికమ్, పరిచక్షతే.*

| | | | |
|---|---|---|---|
| అఫలాకాంక్షిభిః | = ఫలాకాంక్ష లేనివారూ; | త్రివిధమ్ | = మనోవాక్కాయ సంబంధించిన; |
| యుక్తైః | = ఏకాగ్రచిత్తులూ అయిన; | | |
| నరైః | = మనుష్యులచే; | తపః | = తపస్సును; |
| పరయా శ్రద్ధయా | = పరమ శ్రద్ధతో; | సాత్త్వికమ్ | = సాత్త్వికం అని; |
| తప్తమ్ | = అనుష్ఠింపబడే; | పరిచక్షతే | = చెబుతారు; |
| తత్ | = పూర్వోక్తమైన; | | |

**తా॥** ఫలాకాంక్షా రహితులూ, ఏకాగ్రచిత్తులూ, అయినవారు విశేషమైన శ్రద్ధను పూని, పూర్వోక్తమైన వాఙ్మనఃకాయ సంబంధమైన తపస్సును ఆచరిస్తే, అది సాత్త్వికం అనబడుతోంది. 17

**సత్కార మాన పూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్ ॥ 18**

*సత్కార మాన పూజ అర్థమ్, తపః, దంభేన, చ, ఏవ, యత్,*
*క్రియతే, తత్, ఇహ, ప్రోక్తమ్, రాజసమ్, చలమ్, అధ్రువమ్.*

| | | | |
|---|---|---|---|
| సత్కార-మాన -పూజ-అర్థమ్ | = సత్కారం, గౌరవం, పూజను పొందడానికి; | దంభేన ఏవ చ | = దంభంతో; |
| | | యత్ | = ఏ; |
| | | తపః | = తపస్సు;

| | | | |
|---|---|---|---|
| క్రియతే | = ఆచరింపబడుతోందో; | అధ్రువమ్ | = అనిశ్చితమనీ; |
| తత్ | = అది; | రాజసమ్ | = రాజసమనీ; |
| ఇహ | = ఈ లోకంలో; | ప్రోక్తమ్ | = చెప్పబడింది; |
| చలమ్ | = అల్పకాలం ఉండేదనీ; | | |

**తా॥** ఇతరులచే 'ఇతడు తపస్వి, సాధువు' అని ప్రశంసింపబడడానికీ, నమస్కారాదులను పొందడానికీ, ధనాదికమును పొందడానికీ, దంభంతో అనుష్ఠించబడే తపస్సును రాజసికం అంటారు; ఇది అనిత్యం, క్షణికం. 18

**మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।**
**పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥ 19**

*మూఢగ్రాహేణ, ఆత్మనః, యత్, పీడయా, క్రియతే, తపః,*
*పరస్య, ఉత్సాదన అర్థమ్, వా, తత్, తామసమ్, ఉదాహృతమ్.*

| | | | |
|---|---|---|---|
| మూఢ గ్రాహేణ | = మూర్ఖ పట్టుదలతో; | యత్ | = ఏ; |
| ఆత్మనః | = తనకు; | తపః | = తపస్సు; |
| పీడయా | = పీడను కలిగించుకోవడం చేతనో; | క్రియతే | = ఒనర్చబడుతోందో; |
| వా | = లేక; | తత్ | = అది; |
| పరస్య | = ఇతరుల; | తామసమ్ | = తామసికం అని; |
| ఉత్సాదన అర్థమ్ | = వినాశానికో; | ఉదాహృతమ్ | = చెప్పబడింది. |

**తా॥** దురాకాంక్షతో దేహేంద్రియాలను కష్టపెడుతూ గాని, ఇతరులను వినాశం చేయడానికి గాని ఒనర్చబడే తపస్సును తామసికం అనబడుతుంది. 19

**దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20**

*దాతవ్యమ్, ఇతి, యత్, దానమ్, దీయతే, అనుపకారిణే,*
*దేశే, కాలే, చ, పాత్రే, చ, తత్, దానమ్, సాత్త్వికమ్, స్మృతమ్.*

| | | | |
|---|---|---|---|
| దేశే | = తీర్థాది యోగ్యస్థానము; | పాత్రే చ | = విద్యా తపస్సంపన్నులైన బ్రాహ్మణులకు; |
| కాలే చ | = పుణ్య కాలాలో; | | |

| | | | |
|---|---|---|---|
| దాతవ్యమ్ | = దానమివ్వడం కర్తవ్యం; | దీయతే | = ఒసగబడుతోందో; |
| ఇతి | = అనే భావంతో; | తత్ దానమ్ | = ఆ దానం; |
| అనుపకారిణే | = ప్రత్యుపకారం ఆశించకుండా; | సాత్త్వికమ్ | = సాత్త్వికం అని; |
| యత్ దానమ్ | = ఏ దానం; | స్మృతమ్ | = తలంపబడింది; |

**తా॥** (దానభేదాలు వివరింపబడుతున్నాయి :) 'దానం ఇవ్వడం కర్తవ్యం' అనే భావంతో, ప్రత్యుపకారాన్ని ఆశించకుండా కురుక్షేత్రాది పుణ్యప్రదేశాలలో, గ్రహణాది పుణ్యకాలాలలో విద్యా తపస్సంపన్నులైన బ్రాహ్మణులకు అర్పించబడే దానాన్ని సాత్త్వికం అంటారు. 20

**య త్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21**

*యత్, తు, ప్రత్యుపకార అర్థమ్, ఫలమ్, ఉద్దిశ్య, వా, పునః,*
*దీయతే, చ, పరిక్లిష్టమ్, తత్, దానమ్, రాజసమ్, స్మృతమ్.*

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | పునః | = మరియు; |
| యత్ | = ఏ దానం; | పరిక్లిష్టమ్ | = మనః క్లేశంతో; |
| ప్రత్యుపకార అర్థమ్ | = ప్రత్యుపకారాన్ని పొందడానికో; | దీయతే | = ఒసగబడుతున్నదో; |
| వా | = లేక; | తత్ దానమ్ | = ఆ దానం; |
| ఫలం చ | = ఆముష్మిక ఫలాన్ని; | రాజసమ్ | = రాజసికం అని; |
| ఉద్దిశ్య | = పొందగోరి గాని; | స్మృతమ్ | = తలంపబడింది. |

**తా॥** ప్రత్యుపకారాన్ని ఆశించి గాని, లేక ఆముష్మిక ఫలాన్ని అభిలషించి గాని, లేక అనిచ్ఛాపూర్వకంగా గాని ఇయ్యబడే దానాన్ని రాజసికం అంటారు. 21

**అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్ ॥ 22**

*అదేశకాలే, యత్, దానమ్, అపాత్రేభ్యః, చ, దీయతే,*
*అసత్కృతమ్, అవజ్ఞాతమ్, తత్, తామసమ్, ఉదాహృతమ్.*

| | | | |
|---|---|---|---|
| అదేశకాలే | = అపవిత్రస్థానాలలో (అశౌచాదిస్థితులలో); | అవజ్ఞాతమ్ | = తిరస్కార భావంతో; |
| అపాత్రేభ్యః చ | = అనుపయుక్తులైన వారికి (విటనటాదులకు); | యత్ దానమ్ | = ఏ దానం; |
| అసత్కృతమ్ | = పాదప్రక్షాళన, ప్రియవచనాది సత్కారం లేక; | దీయతే | = ఒసగబడుతోందో; |
| | | తత్ | = ఆ దానం; |
| | | తామసమ్ | = తామసం అని; |
| | | ఉదాహృతమ్ | = చెప్పబడింది. |

**తా॥** అపవిత్రస్థానాలలో గాని, అశౌచాది స్థితులలో గాని, విటనటాదులైన అయోగ్యులకు గాని, పాదప్రక్షాళన ప్రియవచనాది సత్కారాలను ఒనర్చకుండా తిరస్కార భావంతో చేసేది అయిన దానాన్ని[1] తామసికం అంటారు. 22

**ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణాస్తేన[2] వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23**

*ఓమ్, తత్, సత్, ఇతి, నిర్దేశః, బ్రహ్మణః, త్రివిధః, స్మృతః, బ్రాహ్మణాః, తేన, వేదాః, చ, యజ్ఞాః, చ, విహితాః, పురా.*

| | | | |
|---|---|---|---|
| ఓం తత్ సత్ | = ఓం తత్ సత్; | తేన | = దీని చేత; |
| ఇతి | = అని; | బ్రాహ్మణాః | = బ్రాహ్మణులూ; |
| బ్రహ్మణః | = బ్రహ్మానికి; | వేదాః చ | = వేదాలూ; |
| త్రివిధః | = మూడు విధాలైన; | యజ్ఞాః చ | = యజ్ఞాలూ; |
| నిర్దేశః | = నిర్దేశం; | పురా | = ప్రాచీన కాలంలో; |
| స్మృతః | = చెప్పబడింది; | విహితాః | = నిర్మించబడ్డాయి. |

**తా॥** (ప్రాయికంగా క్రియాకలాపం అంతా కూడా రజస్తమో మయమవడం చేత, ఈ వైగుణ్యాన్ని నిరాకరించి, సాద్గుణ్యం చేయడానికి ఉపదేశం ఇవ్వబడుతోంది) ఓం తత్ సత్ అనే వాక్యంలో బ్రహ్మం యొక్క త్రివిధ నామాలు నిర్దేశించబడ్డాయి;[3]

---

1. త్యాగము.
2. బ్రహ్మణా – పాఠాంతరం.
3. (అ) ఓమితి త్రివృద్బ్రహ్మ – తైత్తిరీయోపనిషత్తు 1-8-1.
   అజ్ఞానులకు పరోక్షమవడం వల్ల 'తత్' అని నిర్దేశించబడింది.
   (ఆ) సదేవసోమ్యే దమగ్ర ఆసీత్. – ఛాందోగ్యోపనిషత్తు 6-2-1.

ఈ త్రివిధ నిర్దేశంచేతనే పూర్వం బ్రాహ్మణులూ, వేదాలూ, యజ్ఞాలూ నిర్మించ బడ్డాయి.[1] 23

**తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః ।**
**ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24**

*తస్మాత్, ఓమ్, ఇతి, ఉదాహృత్య, యజ్ఞ దాన తపః క్రియాః,*
*ప్రవర్తంతే, విధాన ఉక్తాః, సతతమ్, బ్రహ్మవాదినామ్.*

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = అందువల్ల; | యజ్ఞ దాన తపః క్రియా | = యజ్ఞ దాన తపః క్రియలు; |
| ఓం ఇతి | = ఓం అని; | సతతమ్ | = ఎల్లప్పుడూ; |
| ఉదాహృత్య | = ఉచ్చరించి; | ప్రవర్తన్తే | = ప్రవర్తిల్లుతున్నాయి. |
| బ్రహ్మ వాదినాం | = వేదవాదుల; | | |
| విధాన ఉక్తాః | = శాస్త్ర విహితాలైన; | | |

**తా॥** (ఓంకారాదుల ప్రాశస్త్యాన్ని వేరువేరుగా చెప్పదలచి, ముందుగా ఓంకార మాహాత్మ్యాన్ని చెబుతున్నాడు :) కనుకనే, బ్రహ్మవాచకమైన ఓంకారాన్ని ఉచ్చరించి, వేదవాదులు శాస్త్రోక్తాలైన యజ్ఞ దాన తపః క్రియలను అనుష్ఠిస్తున్నారు. (అవి అంగవికలాలైనప్పటికీ సగుణాలు అంటే సాత్త్వికాలు అవుతున్నాయి.)24

**తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః ।**
**దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥ 25**

*తత్, ఇతి, అనభిసంధాయ, ఫలమ్, యజ్ఞ తపః క్రియాః,*
*దానక్రియాః, చ, వివిధాః, క్రియంతే, మోక్షకాంక్షిభిః.*

| | | | |
|---|---|---|---|
| తత్ ఇతి | = తత్ అనే బ్రహ్మ వాచక శబ్దాన్ని ఉచ్చరించి; | వివిధాః | = నానా విధాలైన; |
| ఫలమ్ | = ఫలాన్ని; | యజ్ఞ తపః క్రియాః | = యజ్ఞ తపః కర్మలూ; |
| అనభిసంధాయ | = ఆకాంక్షించకుండా; | దాన క్రియాః చ | = దానకర్మలూ; |
| మోక్ష కాంక్షిభిః | = ముముక్షువులచే; | క్రియన్తే | = ఒనర్చబడుతున్నాయి. |

1. కాబట్టి ఈ నిర్దేశం చాలా ప్రశస్తమైనది అని స్తుతి.

**తా॥** (ద్వితీయనిర్దేశాన్ని స్తుతిస్తున్నాడు :) 'తత్' అనే బ్రహ్మావాచకాన్ని ఉచ్చరించి ముముక్షువులు నిష్కాములై యజ్ఞ దాన తపః క్రియలను ఆచరిస్తున్నారు. (చిత్తశుద్ధిని ముముక్షుత్వాన్ని ప్రసాదించేదవడం చేత 'తత్' శబ్ద నిర్దేశం ప్రశస్తమైంది.) 25

**సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥ 26**

*సద్భావే, సాధుభావే, చ, సత్, ఇతి, ఏతత్, ప్రయుజ్యతే,*
*ప్రశస్తే, కర్మణి, తథా, సత్, శబ్దః, పార్థ, యుజ్యతే.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | తథా | = మరియు; |
| సద్భావే | = సత్త అనే అర్థంలోనూ; | ప్రశస్తే | = శుభమైన; |
| సాధుభావే చ | = 'మంచిది' అనే అర్థంలోనూ; | కర్మణి | = కర్మకు కూడా; |
| | | సత్ శబ్దః | = సత్ అనే నిర్దేశం; |
| సత్ ఇతి ఏతత్ | = సత్ అనేది; | యుజ్యతే | = వాడబడుతోంది. |
| ప్రయుజ్యతే | = ప్రయోగింపబడుతోంది; | | |

**తా॥** (సత్-శబ్దాన్ని ప్రశంసిస్తున్నాడు :) పార్థా! అస్తిత్వాన్ని, శ్రేష్ఠత్వాన్ని సూచించడానికి 'సత్' శబ్దం వాడబడుతోంది; శుభకర్మలకు కూడా ఇదే ప్రయోగించబడుతుంది. 26

**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27**

*యజ్ఞే, తపసి, దానే, చ, స్థితిః, సత్, ఇతి, చ, ఉచ్యతే,*
*కర్మ, చ, ఏవ, తత్ అర్థీయమ్, సత్, ఇతి, ఏవ, అభిధీయతే.*

| | | | |
|---|---|---|---|
| యజ్ఞే | = యజ్ఞంలోనూ; | సత్ ఇతి | = సత్ అనే శబ్దంతో; |
| తపసి | = తపస్సులోనూ; | ఉచ్యతే | = చెప్పబడుతోంది; |
| దానే చ | = దానంలోనూ; | తత్ అర్థీయం చ | = భగవత్ప్రీతి నిమిత్తమైన; |
| స్థితిః | = నిష్ఠ; | | |

| | | | |
|---|---|---|---|
| కర్మ చ ఏవ | = కర్మ కూడా; | అభిధీయతే | = చెప్పబడుతోంది. |
| సత్ ఇతి ఏవ | = సత్ శబ్దంతోనే; | | |

**తా॥** యజ్ఞం, తపం, దానం - ఈ మూడింటికీ సంబంధించిన నిష్ఠ కూడా 'సత్' - శబ్దం తోనే నిర్దేశించబడుతోంది; ఈశ్వర ప్రీత్యర్థం ఒనర్చబడే కర్మలన్నీ కూడా 'సత్' అనియే చెప్పబడుతున్నాయి. (కాబట్టి, ఇటువంటి మహిమ గల శబ్దత్రయంతో ఒప్పుతున్న 'ఓం తత్ సత్' అనే వాక్యమహిమ అత్యంత అధికం). 27

**అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్**
**అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28**

*అశ్రద్ధయా, హుతమ్, దత్తమ్, తపః, తప్తమ్, కృతమ్, చ, యత్,*
*అసత్, ఇతి, ఉచ్యతే, పార్థ, న, చ, తత్, ప్రేత్య, నో, ఇహ.*

| | | | |
|---|---|---|---|
| అశ్రద్ధయా | = అశ్రద్ధతో; | ఉచ్యతే | = చెప్పబడుతోంది; |
| హుతమ్ | = అనుష్ఠితమైన యజ్ఞం; | పార్థ | = అర్జునా; |
| దత్తమ్ | = ఒసగబడిన దానం; | తత్ | = అది; |
| తప్తమ్ | = చేయబడిన; | న చ ప్రేత్య | = (వైగుణ్యమవడం వల్ల) మరణానంతరం గాని; |
| తపః | = తపస్సు; | | |
| యత్ చ | = మరియు ఇంకా ఏది; | న ఇహ | = (అయశస్కరం అవడం వల్ల) ఇహంలో కూడా (ఫలప్రదం కాదు). |
| కృతమ్ | = ఒనర్చబడిందో (అదంతా;) | | |
| అసత్ ఇతి | = అసత్తు అని; | | |

**తా॥** (కర్మలనన్నింటినీ శ్రద్ధతో ఒనర్చవలెననడానికి గాను, అశ్రద్ధను నిందిస్తున్నాడు :) పార్థా! అశ్రద్ధాపూర్వకంగా అనుష్ఠించబడిన యజ్ఞ దాన తపములూ, తదితరములైన క్రియలు కూడా 'అసత్' అని చెప్పబడుతున్నాయి, అవి (వైగుణ్య యుక్తాలవడం చేత) పరలోకంలో (అయశస్కరం అవడం చేత) ఇహలోకంలో కూడా నిష్ఫలాలవుతున్నాయి.[1] 28

---

1. శ్రద్ధయాదేయమ్. అశ్రద్ధయాదేయమ్. - తైత్తిరీయోపనిషత్తు. 1-11.

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగోనామ
సప్తదశోఽధ్యాయః

శ్లోకసంఖ్య 28; మొదటి నుండి (594+28) 622

**రజస్తమోమయీం త్యక్త్వా శ్రద్ధాం సత్త్వమయీం శ్రితః ।**
**తత్త్వజ్ఞానేఽధికారీ స్యా దితి సప్తదశే స్థితమ్ ॥**

**తా॥** రజస్తమోమయములైన శ్రద్ధలను త్యజించి, సాత్త్విక శ్రద్ధను ఆశ్రయించిన వాడు తత్త్వజ్ఞానాధికారి అవుతాడని సప్తదశాధ్యాయంలో తెలపబడింది.



॥ ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ ॥

# శ్రీమద్భగవద్గీత

## అష్టాదశోఽధ్యాయః - మోక్షసన్న్యాస యోగః

## ( అష్టాదశాధ్యాయం - మోక్షసన్న్యాస యోగం)

న్యాసత్యాగవిభాగేన సర్వగీతార్థ సంగ్రహమ్ ।
స్పష్ట మష్టాదశే ప్రాహ పరమార్థవినిర్ణయే ॥ [1]

---

అర్జున ఉవాచ :

**సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।**
**త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశి నిషూదన ॥** 1

సన్న్యాసస్య, మహాబాహో, తత్త్వమ్, ఇచ్ఛామి, వేదితుమ్,
త్యాగస్య, చ, హృషీకేశ, పృథక్, కేశి నిషూదన.

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = శ్రీకృష్ణా; | తత్త్వమ్ | = యాథాత్మ్యమును; |
| హృషీ కేశ | = హృషీ కేశా; | పృథక్ | = వేరు వేరుగా; |
| కేశి నిషూదన | = కేశి వినాశకా; | వేదితుమ్ | = ఎరుగవలెనని; |
| సన్న్యాసస్య | = సన్న్యాసం యొక్క; | ఇచ్ఛామి | = కోరుతున్నాను; |
| త్యాగస్య చ | = త్యాగం యొక్క; | | |

**తా॥** ['జితేంద్రియుడైన వాడు కర్మలనన్నింటిని వివేకబుద్ధితో త్యజించి సుఖంగా ఉంటాడు' (5-13) 'సన్న్యాస యోగయుక్తాత్ముడవై విముక్తి పొంది

---

1. పరమార్థ నిర్ణయం కొరకు భగవానుడు న్యాసత్యాగ విభాగమొనర్చి గీతా సారాంశం ఈ అధ్యాయంలో స్పష్టంగా బోధించాడు.

నన్ను పొందుతావు' (9-28) మొదలైన శ్లోకాలలో కర్మసన్న్యాసం ఉపదేశించబడింది. అలాగే, కర్మఫలత్యాగి కర్మప్రవృత్తుడు అయినప్పటికీ ఏమీ ఒనర్చనివాడే అవుతాడు' (4-20) 'ఇంద్రియ నిగ్రహమొనర్చి సర్వకర్మఫలాలనూ త్యజించు' (12-11) అనే శ్లోకాలలో ఫలత్యాగపూర్వకమైన కర్మానుష్ఠానం ఉపదేశించబడింది. పరస్పర విరుద్ధాలైన వాటిని సర్వజ్ఞుడైన శ్రీభగవానుడు ఉపదేశించడు కదా! కాబట్టి, కర్మసన్న్యాసాన్నీ, కర్మానుష్ఠానాన్నీ అవిరోధమైన రీతిగా తెలుసుకోగోరుతూ-] *అర్జునుడు పలికెను :* శ్రీకృష్ణా! కర్మసన్న్యాస, కర్మఫల త్యాగాల తత్త్వాన్ని వేర్వేరుగా తెలుసుకో గోరుతున్నాను.[1] 1

*శ్రీభగవానువాచ :*

**కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥** 2

కామ్యానామ్, కర్మణామ్, న్యాసమ్, సన్న్యాసమ్, కవయః, విదుః,
సర్వకర్మ ఫలత్యాగమ్, ప్రాహుః, త్యాగమ్, విచక్షణాః.

కవయః = పండితులు;
కామ్యానాంకర్మణామ్ = స్వర్గాది ఫలాలను ఇచ్చే అశ్వమేధాది కామ్యకర్మల;
న్యాసమ్ = పరిత్యాగాన్ని;
సన్న్యాసమ్ = సన్న్యాసమని;
విదుః = తెలిసికొని ఉన్నారు;
విచక్షణాః = జ్ఞానులు;
సర్వ కర్మ ఫలత్యాగమ్ = నిత్య నైమిత్తిక సమస్త కర్మల ఫలాన్ని త్యజించడం;
త్యాగమ్ = త్యాగమని;
ప్రాహుః = చెబుతారు.

**తా॥** *శ్రీభగవానుడు పలికెను :* స్వర్గాదిఫలాలను ఒసగే కామ్యకర్మల

---

1. సన్న్యాసం ముఖ్య, గౌణ అని ద్వివిధం.

ముఖ్య సన్న్యాసికి ఎటువంటి కర్మ విహితం కాదు. ముఖ్యసన్న్యాసం మళ్ళీ వివిదిషా, విద్వత్ అని ద్వివిధం. (6-1) ఇక జ్ఞానలాభం నిమిత్తం కామ్యాది కర్మలను త్యజించి గ్రహింపబడేది వివిదిషు సన్న్యాసం. (18-49) జ్ఞాన లాభానంతరం కర్మలను త్యజించి గ్రహింపబడేది విద్వత్సన్న్యాసం(3-17). ఈ రెండూ ఆశ్రమ సన్న్యాసములు అనబడుతున్నాయి.

గౌణసన్న్యాసంలో సాత్త్విక, రాజస, తామసములని త్రివిధ భేదాలు ఉన్నాయి; దీనినే సాధారణంగా త్యాగం అంటారు - వీటి లక్షణాలు (18-7,8,9) శ్లోకాలలో చెప్పబడ్డాయి. - బ్రహ్మానందగిరి.

పరిత్యాగాన్నే పండితులు సన్న్యాసం అంటారు; అనుష్ఠేయమైన నిత్య నైమిత్తికాలైన[1] సమస్త కర్మల ఫలత్యాగాన్ని జ్ఞానులు త్యాగం అంటారు. 2

**త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।**
**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3**

*త్యాజ్యమ్, దోషవత్, ఇతి, ఏకే, కర్మ, ప్రాహుః, మనీషిణః,*
*యజ్ఞ దాన తపః కర్మ, న, త్యాజ్యమ్, ఇతి, చ, అపరే.*

| | | | |
|---|---|---|---|
| ఏకే | = కొందరు; | (అని)ప్రాహుః | = అన్నారు; |
| మనీషిణః | = పండితులు (సాంఖ్యులు); | అపరేచ | = మరికొందరు (మీమాంసకులు); |
| కర్మ | = కర్మ; | | |
| దోషవత్ | = దోషయుక్తం (బంధకారణం); | యజ్ఞ-దాన-తపః-కర్మ | = యజ్ఞ దాన తపోరూప కర్మ; |
| ఇతి | = కనుక; | న త్యాజ్యమ్ | = త్యజింపరానిది; |
| త్యాజ్యమ్ | = త్యజింపదగినది; | ఇతి | = అని (అన్నారు); |

**తా॥** (అజ్ఞాని అయిన వాడు ఒనర్చే ఫలత్యాగమే త్యాగం; కర్మత్యాగం త్యాగం కాదు. ఈ విషయాన్నే దృఢపరుస్తున్నాడు–) సాంఖ్యులు కర్మే బంధకారణం,

1. నిత్య నైమిత్తిక క్రియలకు ఫలం లేదనే గురుమతం గ్రాహ్యం కాదు. (18–12) శ్లోకాన్ని బట్టి చూస్తే ఫలం ఉన్నదనే గ్రహించవచ్చు. మరి, ఫలత్యాగం ఒనర్చితే, కర్మలు నిష్ఫలాలే అవుతున్నాయే, ఇలాంటి కర్మలను ఎవ్వరాచరిస్తారు అంటే : వీటిని చిత్తశుద్ధి కోసం, వివిదిషార్థానికి అనుష్ఠించవచ్చు. వివిదిష అంటే తత్త్వజ్ఞానేచ్ఛ; ఇది కలిగితే కర్మలు వాటంతట అవే నివృత్తమవుతాయి. 'ప్రత్యక్ప్రవణతాంబుద్ధేః కర్మాణ్యుత్పాద్య శుద్ధితః । కృతార్థో న్యస్తమాయాంతి ప్రావృడంతే ఘనాః ఇవ ॥' (నైష్కర్మ్య సిద్ధిః 1–49) బుద్ధి ప్రత్యక్ – ప్రవణమైన చిత్తశుద్ధి నిమిత్తం కర్మల ప్రయోజనం ముగుస్తుంది. అప్పుడవి, వర్షాంత మేఘాల వలే లయమయిపోతాయి. 'న కర్మాణి త్యజేద్యోగీ కర్మభిస్త్యజ్యతే హ్యసౌ । కర్మణో మూలభూతస్య సంకల్పస్యైవ నాశతః ॥' (యోగవాసిష్ఠమ్) యోగి కర్మలను త్యజింపనక్కర లేదు, కర్మలకు మూలమైన సంకల్పం తొలగినప్పుడు అవే యోగిని త్యజిస్తాయి. 'తావత్కర్మాణికుర్వీత న నిర్విద్యేత యావతా । మత్కథా శ్రవణాదౌవా శ్రద్ధాయావన్న జాయతే ॥' (శ్రీమద్భాగవతమ్. 11–20–9) 'జ్ఞాననిష్ఠో విరక్తో వా మద్భక్తో వానపేక్షకః । సలింగానాశ్రమాం స్త్యక్త్వా చరేదవిధిగోచరః ॥' (శ్రీమద్భాగవతమ్. 11–18–28) వైరాగ్యం కలుగనంత వరకు, కథాశ్రవణ శ్రద్ధ లభించనంత వరకు కర్మలను ఆచరించాలి. జ్ఞాననిష్ఠులు, విరక్తులు, అనపేక్షులు, భక్తులు అయినవారు సలింగాశ్రమాలను అంటే సంసారాన్ని త్యజించి, విధికి అతీతులై మసలవచ్చు. వీరు విధిపరతంత్రులు కారు. కనుక, అజ్ఞానికే ఫలత్యాగరూపమైన కర్మ ఉపదేశింపబడింది. ఇదే త్యాగం.

– శ్రీధరస్వామి.

కాబట్టి కర్మనంతా పరిత్యజించాలి అని చెబుతున్నారు. కాని మీమాంసకులు యజ్ఞ దాన తపోరూపమైన కర్మను త్యజించడం అనుచితం అని అంటున్నారు. 3

**నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః ॥ 4**

*నిశ్చయమ్, శృణు, మే, తత్ర, త్యాగే, భరతసత్తమ,*
*త్యాగః, హి, పురుషవ్యాఘ్ర, త్రివిధః, సంప్రకీర్తితః.*

| | | | |
|---|---|---|---|
| భరత సత్తమ | = భరత శ్రేష్ఠా; | పురుష వ్యాఘ్ర | = పురుషప్రవరా; |
| తత్ర | = ఆ; | త్యాగః హి | = త్యాగమే; |
| త్యాగే | = త్యాగవిషయంలో; | త్రివిధం | = సత్త్వాదిగుణ భేదాలచే మూడు విధాలని; |
| మే | = నా; | సంప్రకీర్తితః | = చెప్పబడింది. |
| నిశ్చయమ్ | = సిద్ధాంతాన్ని; | | |
| శృణు | = విను; | | |

**తా॥** (మతభేదాన్ని తెలిపిన పిదప తన అభిప్రాయాన్ని తెలుపుతున్నాడు:) భరతశ్రేష్ఠా! ఈ త్యాగ (గౌణ సన్న్యాసం) విషయంలో నా సిద్ధాంతాన్ని విను. పురుషప్రవరా! తత్త్వవేత్తలు త్యాగాన్ని మూడు విధాలుగా వర్ణిస్తున్నారు. 4

**యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5**

*యజ్ఞ దాన తపః కర్మ, న, త్యాజ్యమ్, కార్యమ్, ఏవ, తత్,*
*యజ్ఞః, దానమ్, తపః, చ, ఏవ, పావనాని, మనీషిణామ్.*

| | | | |
|---|---|---|---|
| యజ్ఞ-దాన -తపః-కర్మ | = యజ్ఞ దాన తపోరూప కర్మను; | యజ్ఞః | = యజ్ఞం; |
| | | దానమ్ | = దానం; |
| | | తపః ఏవ చ | = తపస్సును కూడా; |
| న త్యాజ్యమ్ | = త్యజించకూడదు; | మనీషిణామ్ | = ఫలాభిసంధి లేని బుద్ధిమంతులకు; |
| తత్ | = అది; | | |
| కార్యం ఏవ | = ఒనర్చబడవలసిందే; | పావనాని | = చిత్తశుద్ధికరములు; |

**తా॥** (మొదట తన అభిప్రాయాన్ని తెలుపుతున్నాడు :) యజ్ఞ దాన

తపోరూపమైన కర్మను త్యజించకూడదు.[1] వీటిని ఆచరించవలసిందే. ఏలన, ఫలాకాంక్షను వీడిన బుద్ధిమంతులకు ఇవి చిత్తశుద్ధిని ఒసగుతున్నాయి.
(గీత : 5-11 చూ.) 5

**ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥ 6**

*ఏతాని, అపి, తు, కర్మాణి, సంగమ్, త్యక్త్వా, ఫలాని, చ,*
*కర్తవ్యాని, ఇతి, మే, పార్థ, నిశ్చితమ్, మతమ్, ఉత్తమమ్.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | కర్తవ్యాని | = చేయదగినవి; |
| తు | = కాని; | ఇతి | = అని; |
| ఏతాని | = ఈ; | మే | = నా; |
| కర్మాణి అపి | = కర్మలనే;[1] | నిశ్చితమ్ | = స్థిరమొనర్పబడిన; |
| సఙ్గమ్ | = ఆసక్తిని; | ఉత్తమమ్ | = శ్రేష్ఠమైగు; |
| ఫలాని చ | = ఫలాలను; | మతమ్ | = అభిప్రాయం. |
| త్యక్త్వా | = త్యజించి; | | |

**తా॥** పార్థా! ఆసక్తిని (కర్తృత్వాభిమానాన్ని) ఫలాభి సంధిని విడిచి, ఈ యజ్ఞ దాన తపః కర్మలను (ఈశ్వరారాధన బుద్ధితో) ఆచరించవలెనని నా సిద్ధాంతం; ఇదియే శ్రేష్ఠమైన అభిప్రాయం. 6

**నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।**
**మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః ॥ 7**

*నియతస్య, తు, సంన్యాసః, కర్మణః, న, ఉపపద్యతే,*
*మోహాత్, తస్య, పరిత్యాగః, తామసః, పరికీర్తితః.*

---

1. త మేత మాత్మానం వేదానువచ నేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తప సానాశకేన.
– బృహదారణ్యకోపనిషత్తు 4-4-21.

2. ఆసక్తితోనూ ఫలాకాంక్షతోనూ అనుష్ఠించబడిన, ఈ కర్మలు బంధకారణాలే అవుతాయి; అయినా ఆసక్తిని ఫలాకాంక్షను త్యజించి ముముక్షువుకు ఈ కర్మలను ఆచరించడం అవశ్యకర్తవ్యం. ఏమనిన, ఈ విధంగా ఆచరించబడ్డ కర్మలు బంధకాలు కావు. ఇదే 'అపి' శబ్దానికి అర్థం.
(యోగః కర్మసు కౌశలమ్. – గీత. 2-50)

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | తస్య | = దానిని; |
| నియతస్య కర్మణః | = విహితకర్మను; | పరిత్యాగః | = త్యజించడం; |
| సన్న్యాసః | = త్యజించడం; | తామసః | = తామసమని; |
| న ఉపపద్యతే | = యుక్తం కాదు; | పరికీర్తితః | = చెప్పబడింది. |
| మోహాత్ | = అవివేకంతో; | | |

**తా॥** (ఇక, త్యాగత్రైవిధ్యం ప్రదర్శించబడుతోంది : కామ్యకర్మలు బంధ కారణాలవడం వల్ల వాటిని సన్న్యసించడం యుక్తమే) కాని, నిత్యకర్మల త్యాగం (అవి చిత్తశుద్ధిని కలిగించి మోక్షాన్ని చేకూర్చేవవడం వల్ల) యుక్తం కాదు. అవివేకం వల్ల (ఉపాదేయాలైన) ఈ కర్మలను త్యజించడం తామసం అని అనబడుతోంది. (ఇది త్రివిధగౌణ-సన్న్యాసాలలో ఒకటి). 7

**దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్ త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8**

*దుఃఖమ్, ఇతి, ఏవ, యత్, కర్మ, కాయక్లేశ భయాత్, త్యజేత్,*
*సః, కృత్వా, రాజసమ్, త్యాగమ్, న, ఏవ, త్యాగఫలమ్, లభేత్.*

| | | | |
|---|---|---|---|
| యత్ [1] | = ఎవడు; | సః | = అతడు; |
| కర్మ | = కర్మను; | రాజసమ్ | = రాజసమైన; |
| దుఃఖమ్ ఏవ | = కష్టకరమే; | త్యాగమ్ | = త్యాగాన్ని; |
| ఇతి | = అని (తలచి); | కృత్వా | = చేసి; |
| కాయ క్లేశ భయాత్ | = శరీరం నొచ్చుననే భీతితో; | త్యాగ ఫలమ్ | = మోక్షాన్ని; |
| | | న లభేత్ ఏవ | = పొందనే పొందడు; |
| త్యజేత్ | = త్యజిస్తాడో; | | |

**తా॥** (ఆత్మజ్ఞానాన్ని పొందకుండానే) నిత్యకర్మలు శరీరాయాస భయంతో దుఃఖకరాలని తలచి త్యజించబడితే, ఆ త్యాగం రాజసం అనబడుతుంది; ఇటువంటి త్యాగం ఒనర్చిన రాజసిక పురుషుడు త్యాగఫలాన్ని (జ్ఞాన నిష్ఠను) పొందడు. (ఇది రెండవ రకమైన గౌణసన్న్యాసం) 8

1. యత్-అవ్యయ శబ్దం; కాని ఇక్కడ 'ఎవడు' అనియే అర్థం. - భాష్యోత్కర్షదీపిక.

**కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున ।**
**సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥ 9**

*కార్యమ్, ఇతి, ఏవ, యత్, కర్మ, నియతమ్, క్రియతే, అర్జున,*
*సంగమ్, త్యక్త్వా, ఫలమ్, చ, ఏవ, సః, త్యాగః, సాత్త్వికః, మతః.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | నియతం కర్మ | = నిత్యకర్మ; |
| సఙ్గమ్ | = ఆసక్తిని; | క్రియతే | = అనుష్ఠింపబడుతోందో; |
| ఫలం చ ఏవ | = ఫలాన్ని కూడా; | సః | = ఆ; |
| త్యక్త్వా | = త్యజించి; | త్యాగః | = ఆసక్తి ఫలాల త్యాగమే; |
| కార్యమ్ | = కర్తవ్యము; | సాత్త్వికః | = సాత్త్వికమని; |
| ఇతి ఏవ | = అనియే; | మతః | = నిశ్చితం. |
| యత్ | = ఏ; | | |

**తా॥** అర్జునా! ఆసక్తిని, ఫలాకాంక్షను వీడి కర్తవ్య బుద్ధితో విహితకర్మలను అనుష్ఠించిన యెడల, ఈ త్యాగమే సాత్త్వికం అనబడుతుంది. (ఇది మూడవ రకమైన గౌణసన్న్యాసం.) 9

**న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।**
**త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10**

*న, ద్వేష్టి, అకుశలమ్, కర్మ, కుశలే, న, అనుషజ్జతే,*
*త్యాగీ, సత్త్వసమావిష్టః, మేధావీ, ఛిన్నసంశయః.*

| | | | |
|---|---|---|---|
| సత్త్వ సమావిష్టః | = సత్త్వగుణవిశిష్టుడూ; | అకుశలమ్ | = అశుభమూ, కామ్యమూ అయిన; |
| ఛిన్న సంశయః | = అవిద్యాకృతములైన సంశయాలు లేనివాడూ; | కర్మ | = కర్మను; |
| మేధావీ | = ఆత్మజ్ఞానీ; | న ద్వేష్టి | = ద్వేషించడు; |
| త్యాగీ | = ఆసక్తిని, ఫలాన్ని త్యజించినవాడూ అయిన వ్యక్తి; | కుశలే | = శుభమైన నిత్యకర్మలో; |
| | | న అనుషజ్జతే | = ఆసక్తుడు కాడు. |

**తా॥** (గౌణసన్న్యాస ఫలమైన ముఖ్యసన్న్యాసం సూచించబడుతోంది :) ఆసక్తిని, ఫలాలను త్యజించి నిష్కామ కర్మానుష్ఠానం ఒనర్చేవాడు, సత్త్వగుణ యుక్తుడై ఆత్మ జ్ఞానాన్ని పొంది, అవిద్యాకృతాలైన సంశయాలన్నింటి నుండీ

ముక్తుడైనప్పుడు, కామ్యకర్మలను సంసార కారణాలను ద్వేషించడు, మోక్షకారణాలని నిత్యకర్మలపై ప్రీతినిగొనడు.[1] (నైష్కర్మ్య లక్షణమైన జ్ఞాననిష్ఠలో ఉంటాడు;) ఇదియే పూర్వోక్తమైన కర్మయోగ ఫలం. (గీత : 5-13 చూ. ) 10

**న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।**
**యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥ 11**

*న, హి, దేహభృతా, శక్యమ్, త్యక్తుమ్, కర్మాణి, అశేషతః,*
*యః, తు, కర్మఫలత్యాగీ, సః, త్యాగీ, ఇతి, అభిధీయతే.*

| | | | |
|---|---|---|---|
| దేహ భృతా | = దేహధారి చేత; | యః తు | = ఎవడు; |
| అశేషతః | = సంపూర్ణంగా; | కర్మఫల త్యాగీ | = కర్మఫలత్యాగియో; |
| కర్మాణి | = కర్మలను; | సః | = అతడు; |
| త్యక్తుమ్ | = త్యజించడానికి; | త్యాగీ ఇతి | = త్యాగియని; |
| న శక్యమ్ | = సాధ్యం కాదు; | అభిధీయతే | = చెప్పబడును. |
| హి | = కనుక; | | |

**తా॥** (అయితే, కర్మఫల త్యాగం కంటే సర్వకర్మ త్యాగమే శ్రేష్ఠం, జ్ఞాననిష్ఠకు అనుకూలం. కాబట్టి కర్మత్యాగమే చేస్తానంటావా:) (నీవంటి) దేహాభిమానులకు సంపూర్ణంగా కర్మను త్యజించడం శక్యం కాదు. కనుక, కర్మఫల త్యాగియే (ముఖ్యుడు అంటే, సాత్త్వికుడైన) త్యాగి అని గ్రహించు. (గీత : 3-8 చూ.) 11

**అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।**
**భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12**

*అనిష్టమ్, ఇష్టమ్, మిశ్రమ్, చ, త్రివిధమ్, కర్మణః, ఫలమ్,*
*భవతి, అత్యాగినామ్, ప్రేత్య, న, తు, సన్న్యాసినామ్, క్వచిత్.*

---

1. సాత్త్విక త్యాగి శీతకాలంలో ప్రాతఃస్నానం చేయడం వంటి కర్మలను ద్వేషించడు, గ్రీష్మకాలంలో చన్నీళ్ళ స్నానం చేయడానికి సంతోషించడు, స్థిరబుద్ధి అవడం వల్ల పరపరిభవాది దుఃఖాలను సహిస్తాడు, స్వర్గాది సుఖాలను త్యజిస్తాడు. ఇక, తాత్కాలిక సుఖేచ్ఛ ఏమి ఉండగలదు? అతనికి మిథ్యాజ్ఞానం తొలగింది. సుఖాన్ని పొందడానికి యత్నించడు, దుఃఖాన్ని పరిహరింప గోరడు. – శ్రీధరస్వామి.

| | | | |
|---|---|---|---|
| అనిష్టమ్ | = పశ్వాది యోనులజన్మ; | అత్యాగినామ్ | = ఫలత్యాగం చేయనివారికి; |
| ఇష్టమ్ | = దేవాది యోనులజన్మ; | ప్రేత్య | = మరణానంతరం; |
| మిశ్రం చ | = మనుష్య జన్మ; | భవతి | = కలుగుతున్నది; |
| త్రివిధమ్ | = మూడువిధాలుగా; | తు | = కాని; |
| కర్మణః | = ధర్మాధర్మాలైన కర్మల; | సన్న్యాసినామ్ | = ఫలసంగ త్యాగులకు; |
| ఫలమ్ | = ఫలం; | న క్వచిత్ | = ఎచ్చటనూ కలుగదు. |

**తా॥** (ఈ కర్మఫలత్యాగ విశేషమేమంటే :) ధర్మాధర్మ రూపాలైన కర్మలకు ఫలంగా మరణానంతరం సకాములైన అజ్ఞులకు స్వర్గ నరక మనుష్య లోకాలు లభిస్తున్నాయి; కాని కర్మఫల త్యాగులకు[1] (జ్ఞాన నిష్ఠులైన సన్న్యాసులకు[2]) ఇవి ఏవీ కూడా ఎన్నడూ కలుగవు. 12

**పంచేమాని[3] మహాబాహో కారణాని నిబోధ మే ।**
**సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13**

పంచ, ఇమాని, మహాబాహో, కారణాని, నిబోధ, మే,
సాంఖ్యే, కృత అంతే, ప్రోక్తాని, సిద్ధయే, సర్వకర్మణామ్.

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా; | ఇమాని | = ఈ; |
| సాంఖ్యే | = వేదాంత; | పంచ | = ఐదు; |
| కృత అంతే | = సిద్ధాంతంలో; | కారణాని | = కారణాలను; |
| సర్వకర్మణామ్ | = సమస్తకర్మల; | మే | = నా వల్ల; |
| సిద్ధయే | = సిద్ధికై; | నిబోధ | = తెలుసుకో. |
| ప్రోక్తాని | = చెప్పబడిన; | | |

1. సన్న్యాసులకూ త్యాగులకూ కర్మఫల త్యాగ – సామ్యం ఉంది. కనుక, 'అనాశ్రితః కర్మఫలమ్' (గీత : 6–1) అనే శ్లోకం సన్న్యాసి శబ్దం త్యాగులనే సూచించే రీతిగా, ఇక్కడ కూడా త్యాగులనే సూచిస్తోంది. వీరు సాత్త్వికులవడం వల్ల పాపం చేయరు, పుణ్యాన్ని ఈశ్వరార్పణ చేస్తారు. కనుక, ఇష్టానిష్టమిశ్ర ఫలప్రసక్తి లేదు. – శ్రీధరస్వామి.

2. సర్వాత్మదృష్టులైన సన్న్యాసులకు కర్మప్రసక్తియే లేదు, ఇక ఫలం మాట ఏమి? త్యాగులు చిత్తశుద్ధి ద్వారంలో సన్న్యాస నిష్ఠను పొందుతున్నారు కనుక, వారికిని ఈ ఫలాలు లేవు. ఇక ఇవి, అజ్ఞులైన వారికే అని గ్రహించాలి.

3. పంచైతాని – పాఠాంతరం.

**తా॥** (కర్మ ఒనర్చుతున్నప్పటికీ, కర్మఫలం ఎలా లభించకుండా ఉండ గలదు? అని ఆశంకించి, త్యాగశీలుడైన నిరహంకారికి కర్మలేపం లేదని ఉపపాదిస్తున్నాడు:) అర్జునా! వేదాంత సిద్ధాంతంలో కర్మలను అన్నింటి నిష్పత్తి కొరకు ఈ ఐదు కారణాలు నిరూపింపబడ్డాయి. వాటిని నా ద్వారా తెలుసుకో. 13

**అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**
**వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్ ॥ 14**

*అధిష్ఠానమ్, తథా, కర్తా, కరణమ్, చ, పృథక్ విధమ్,*
*వివిధాః, చ, పృథక్, చేష్టాః, దైవమ్, చ, ఏవ, అత్ర, పంచమమ్.*

అధిష్ఠానమ్ = శరీరం;
తథా = మరియు;
కర్తా = అహంకారం;
పృథక్ విధం చ = వివిధ వ్యాపార యుక్తమైన;
కరణమ్ = మనోబుద్ధులతో కూడిన ఇంద్రియదశకాన్ని;
వివిధాః చ = నానా విధాలైన;
పృథక్ చేష్టాః = ప్రాణాదుల విభిన్న కార్యాలను;
అత్ర = వీటి యందు;
పంచమమ్ = ఐదవది అయిన;
దైవమ్ ఏవ చ = ఇంద్రియాదుల అధిష్ఠాతలైన ఆదిత్యాది దేవతలును.

**తా॥** శరీరం, అహంకారం, మనోబుద్ధులతో కూడిన ఇంద్రియాలు, ప్రాణాదుల వివిధ కార్యాలు, చక్షురాది ఇంద్రియాలకు అధిష్ఠాతలైన ఆదిత్యాది దేవతలు (=అంతర్యామి) - అనే ఈ ఐదూ సమస్త కర్మలకూ కారణాలు. 14

**శరీర వాఙ్మనోభిః యత్కర్మ ప్రారభతే నరః ।**
**న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః ॥ 15**

*శరీర వాక్ మనోభిః, యత్, కర్మ, ప్రారభతే, నరః,*
*న్యాయ్యమ్, వా, విపరీతమ్, వా, పంచ, ఏతే, తస్య, హేతవః.*

నరః = మనుష్యుడు;
శరీర వాక్ మనోభిః = త్రికరణాలతో;
యత్ = ఏ,
న్యాయ్యమ్ వా = ధర్మయుక్తమూ, శాస్త్రీయమూ అయినది గాని;
విపరీతమ్ వా = అన్యాయమైనది గాని;

| | | | |
|---|---|---|---|
| కర్మ | = కర్మను; | పంచ | = ఐదూ; |
| ప్రారభతే | = ఆరంభిస్తాడో; | తస్య | = ఆ కర్మకు; |
| ఏ తే | = ఈ; | హేతవః | = హేతువులు. |

**తా॥** త్రికరణాలతో మనుష్యుడు ఆరంభించే ధర్మాధర్మ కర్మలన్నిటికీ ఈ ఐదూ హేతువులని గ్రహించు. 15

**తత్రైవం సతి కర్తారం ఆత్మానం కేవలం తు యః ।**
**పశ్య త్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥ 16**

*తత్ర, ఏవమ్, సతి, కర్తారమ్, ఆత్మానమ్, కేవలమ్, తు, యః,*
*పశ్యతి, అకృతబుద్ధిత్వాత్, న, సః, పశ్యతి, దుర్మతిః.*

| | | | |
|---|---|---|---|
| తత్ర | = ఈ కర్మవిషయం; | పశ్యతి | = చూస్తాడో; |
| ఏవమ్ సతి | = ఇలా ఉండగా; | అకృత బుద్ధిత్వాత్ | = అవివేకం వల్ల; |
| యః తు | = ఎవడు; | సః | = ఆ; |
| ఆత్మానమ్ | = తనను; | దుర్మతిః | = అవివేకి; |
| కేవలమ్ | = ఒక్కడినే; | న పశ్యతి | = సమ్యక్ దర్శనం చేయడం లేదు. |
| కర్తారమ్ | = కర్తగా; | | |

**తా॥** ఇలా కర్మలన్నీ ఈ ఐదు హేతువులతో సాధింపబడుతుంటే తనను మాత్రమే కర్తగా తలచుకునే దుర్మతి సమ్యగ్-దర్శి కాలేదు; అతని బుద్ధి శాస్త్ర, ఆచార్యుల ఉపదేశాల వల్ల సంస్కరింపబడలేదు; అతనికి అవివేకం వల్లనే ఈ విధంగా అవుతోంది. 16

**యస్య నాహంకృతో భావః బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాపి స ఇమాన్ లోకాన్ న హన్తి న నిబధ్యతే ॥ 17**

*యస్య, న, అహం కృతః, భావః, బుద్ధిః, యస్య, న, లిప్యతే,*
*హత్వా, అపి, సః, ఇమాన్, లోకాన్, న, హంతి, న, నిబధ్యతే.*

| | | | |
|---|---|---|---|
| యస్య | = ఎవరికి; | న | = లేదో; |
| అహంకృతః | = నేను కర్తను అనే; | యస్య | = ఎవని; |
| భావః | = భావం; | బుద్ధిః | = బుద్ధి; |

| | | | |
|---|---|---|---|
| న లిప్యతే | = నిస్సంగమో; | హత్వా అపి | = వధించినప్పటికీ; |
| సః | = అతడు; | న హన్తి | = వధించుట లేదు; |
| ఇమాన్ | = ఈ; | (ఈ నిమిత్తం)న నిబధ్యతే | = హత్యా ఫలమైన అధర్మంలో బద్ధుడు కాడు. |
| లోకాన్ | = జగత్తునందు ప్రాణులందరినీ; | | |

**తా॥** ఎవనికి 'నేను కర్తను' అనే అభిమానం (అహంభావం, కర్తృత్వాభినివేశం) లేదో, ఎవని బుద్ధి కర్మ ఫలాలతో లిప్తమవడం లేదో, అతడు జగత్తులోని ప్రాణులనందరినీ (లోక దృష్టిలో) హత మొనర్చినప్పటికీ, (తత్త్వ దృష్టి చేత) హతమొనర్చడం లేదు. మరియూ అతడు హత్యా ఫలమైన అధర్మానికి బద్ధుడు కాడు. (*గీత:* 2-21; 3-27; 13-29 చూ.) 17

**జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ 18**

*జ్ఞానమ్, జ్ఞేయమ్, పరిజ్ఞాతా, త్రివిధా, కర్మచోదనా,*
*కరణమ్, కర్మ, కర్తా, ఇతి, త్రివిధః, కర్మసంగ్రహః*

| | | | |
|---|---|---|---|
| కర్మ చోదనా | = కర్మప్రేరకమైనది; | కరణమ్ | = ఇంద్రియం; |
| జ్ఞానమ్ | = జ్ఞానం; | కర్మ | = క్రియ; |
| జ్ఞేయమ్ | = తెలిసికోదగినది; | కర్తా | = చేసేవాడు; |
| పరిజ్ఞాతా | = తెలుసుకునేవాడు; | ఇతి | = అని; |
| (అని) త్రివిధాః | = మూడు విధాలు; | త్రివిధః | = మూడు విధాలు. |
| కర్మ సంగ్రహః | = కర్మకు ఆశ్రయం; | | |

**తా॥** (పూర్వశ్లోకార్థాన్ని వివరించడానికి కర్మ ప్రవృత్తి హేతువులు, కర్మాశ్రయాలు, కర్మ ఫలాలూ గుణాత్మకాలవడం వల్ల నిర్గుణాత్మకు వీటితో సంబంధం లేదనే అభిప్రాయంతో కర్మచోదనను, కర్మాశ్రయాన్ని ముందుగా తెలుపుతున్నాడు-) జ్ఞానం (ఇష్ట సాధన విషయమైన జ్ఞానం), జ్ఞేయం (ఇష్ట సాధనకు సంబంధించిన కర్మ), జ్ఞాత (తెలుసుకోబడే వాడు) - ఈ మూడూ కర్మ ప్రవృత్తి హేతువులు. కరణం(ఇంద్రియాలు), కర్మ, కర్త అనేవి కర్మాచరణానికి మూలాలు. (కర్మ ప్రయోజనాలైన గ్రహణ-త్యాగాల అవసరం పూర్ణమైన ఆత్మకు లేదు. కాబట్టి కర్మ అక్కరలేదు, ఆత్మ నిష్క్రియం.) 18

**జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19**

*జ్ఞానమ్, కర్మ, చ, కర్తా, చ, త్రిధా, ఏవ, గుణభేదతః,*
*ప్రోచ్యతే, గుణసంఖ్యానే, యథావత్, శృణు, తాని, అపి.*

| | | | |
|---|---|---|---|
| గుణసంఖ్యానే | = సాంఖ్యశాస్త్రంలో; | త్రిధా ఏవ | = మూడు రీతులుగానే; |
| జ్ఞానమ్ | = జ్ఞానం; | ప్రోచ్యతే | = చెప్పబడుతోంది; |
| కర్మ చ | = క్రియ; | తాని అపి | = వాటినన్నింటినీ కూడా; |
| కర్తా చ | = కర్త అనే; | యథావత్ | = ఉన్నవాటిని ఉన్నట్లు; |
| గుణభేదతః | = సాత్త్వికాది గుణభేదాల; | శృణు | = విను. |

**తా॥** సాంఖ్యశాస్త్రంలో[1] జ్ఞానాన్ని, క్రియలను, ఫలాలను కూడా సత్త్వరజస్తమో భేదాలతో నిర్వచించబడి ఉన్నాయి; వాటి స్వరూపాన్ని విను.[2] 19

**సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20**

*సర్వభూతేషు, యేన, ఏకమ్, భావమ్, అవ్యయమ్, ఈక్షతే,*
*అవిభక్తమ్, విభక్తేషు, తత్, జ్ఞానమ్, విద్ధి, సాత్త్వికమ్.*

| | | | |
|---|---|---|---|
| యేన | = దేనిచేత (ఏ జ్ఞానం చేత); | ఏకమ్ | = అద్వితీయమూ; |
| విభక్తేషు | = విభిన్నములైన; | అవ్యయమ్ | = అక్షయమూ అయిన; |
| సర్వభూతేషు | = సమస్తప్రాణులయందూ; | భావమ్ | = ఆత్మవస్తువును; |
| అవిభక్తమ్ | = అభిన్న భావంతో వెలయుచున్న; | (నరః = మనుష్యుడు;) | |
| | | ఈక్షతే | = దర్శిస్తున్నాడో; |

1. సాంఖ్యదర్శనం అంతా ప్రమాణం కాకపోయినా, గుణ విషయంలో ప్రమాణం. కనుక, సాంఖ్యమతం ఇక్కడ ఉదాహరింపబడింది.

2. 'తత్ర సత్త్వమ్ నిర్మలత్వాత్' (14-6) ఇత్యాదిగా గుణాల బంధకత్వ ప్రకారం నిరూపించబడింది. 17వ అధ్యాయంలో గుణ కృత్యాలైన వివిధ స్వభావాలను ప్రదర్శించి, రజస్తమములను పరిత్యజించి సాత్త్వికాహారాదుల వల్ల సాత్త్వికభావాన్ని సంపాదించుకోవాలని ఆదేశించబడింది. ఇక ఇక్కడ, క్రియాకారక ఫలాలు గుణాత్మకాలు, వాటికి ఆత్మ సంబంధం లేదు– అని తెలుపబడుతోంది.

| | | | |
|---|---|---|---|
| తత్ | = ఆ; | సాత్త్వికమ్ | = సాత్త్వికమని; |
| జ్ఞానమ్ | = అద్వైతాత్మ దర్శనరూపమైన జ్ఞానం; | విద్ధి | = గ్రహించు. |

**తా॥** (జ్ఞానంలో సాత్త్వికాది భేదాలు తెల్పబడుతున్నాయి-) అవ్యక్తం నుండి స్థావరాల వరకూ గల భూతాలన్నిటి యందూ అద్వితీయమూ, అవిభక్తమూ, అక్షయమూ అయిన ఆత్మవస్తువు ఏ జ్ఞానం చేత చూడబడుతోందో, ఆ అద్వైతాత్మ దర్శన-జ్ఞానాన్ని సాత్త్వికమని గ్రహించు.[1] 20

**పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానా భావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21**

పృథక్త్వేన, తు, యత్, జ్ఞానమ్, నానా భావాన్, పృథగ్విధాన్,
వేత్తి, సర్వేషు, భూతేషు, తత్, జ్ఞానమ్, విద్ధి, రాజసమ్.

| | | | |
|---|---|---|---|
| తు | = కాని; | నానాభావాన్ | = పెక్కు ఆత్మలను; |
| యత్ | = ఏ; | వేత్తి | = గ్రహిస్తాడో; |
| జ్ఞానమ్ | = జ్ఞానం; | తత్ | = ఆ; |
| పృథక్త్వేన | = వేరుగా; | జ్ఞానమ్ | = జ్ఞానం; |
| సర్వేషు భూతేషు | = సమస్త భూతాలలో ఉండే; | రాజసమ్ | = రాజసమని; |
| పృథక్ విధాన్ | = విభిన్నమైన; | విద్ధి | = తెలుసుకో. |

**తా॥** కాని, ఏ జ్ఞానం చేత సమస్త భూతాలలో వేరు వేరుగా ఉండే ఆత్మలను అనేకాలని గ్రహించబడుతుందో, ఆ జ్ఞానం రాజసికమని గ్రహించు. 21

**యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్ ।**
**అతత్త్వార్థ వదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22**

యత్, తు, కృత్స్నవత్, ఏకస్మిన్, కార్యే, సక్తమ్, అహైతుకమ్,
అతత్త్వార్థవత్, అల్పమ్, చ, తత్, తామసమ్, ఉదాహృతమ్.

---

1. ఈ జ్ఞానం సంసారోచ్ఛేదానికి కారణం, రాజసిక తామసిక జ్ఞానాలు కావు. కనుక, ఇక చెప్పబోయే విషయాలన్నింటిలో రాజస తామసములను త్యజించి, సాత్త్వికాన్ని గ్రహించాలి.

| | | | |
|---|---|---|---|
| తు | = మరి; | అహైతుకమ్ | = యుక్తియుక్తం కానిదీ; |
| యత్ | = ఏ జ్ఞానం; | అతత్త్వార్థవత్ | = అయథార్థమూ; |
| ఏకస్మిన్ కార్యే | = ఒకానొక శరీరంలో (ప్రతిమలో); | అల్పం చ | = తుచ్ఛమూ అయిన; |
| | | తత్ | = ఆ జ్ఞానం; |
| కృత్స్నవత్ | = అదే అంతా అని (సమస్తమూ అని); | తామసమ్ | = తామసమని; |
| | | ఉదాహృతమ్ | = చెప్పబడుతుంది; |
| సక్తమ్ | = ఆసక్తమౌతుందో; | | |

**తా॥** మరి, ఏ జ్ఞానం చేత ఒక శరీరంలోనో, ప్రతిమలోనో సంపూర్ణమైన ఆత్మ ఉనికి, ఈశ్వరుని ఉనికి[1] - అనే అభినివేశం కలుగుతోందో, ఆ జ్ఞానాన్నే తామసికమంటారు. ఇది యుక్తియుక్తం కాదు; అయథార్థము, తుచ్ఛము. 22

**నియతం సంగరహితం అరాగద్వేషతః కృతమ్ ।**
**అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే ॥ 23**

*నియతమ్, సంగరహితమ్, అరాగద్వేషతః, కృతమ్,*
*అఫలప్రేప్సునా, కర్మ, యత్, తత్, సాత్త్వికమ్, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| అరాగద్వేషతః | = రాగద్వేషాలను వర్జించి; | యత్ | = ఏ; |
| అఫల ప్రేప్సునా | = ఫలాభిలాష లేనివానిచే; | కర్మ | = కర్మ కలదో; |
| సఙ్గ రహితమ్ | = ఆసక్తి లేక; | తత్ | = అది; |
| కృతమ్ | = అనుష్ఠితమైన; | సాత్త్వికమ్ | = సాత్త్వికమని; |
| నియతమ్ | = నిత్యమైన యాగ హోమ దానాదులైన; | ఉచ్యతే | = చెప్పబడును. |

**తా॥** (కర్మలో త్రివిధ భేదాలు చెప్పబడుతున్నాయి-) ఫలాకాంక్ష లేని వ్యక్తి, రాగ ద్వేషాలను వర్జించి[2] ఆసక్తి రహితుడై అనుష్ఠించే నిత్యకర్మాచరణమే సాత్త్విక కర్మ అనబడుతుంది. 23

1. ఆత్మ దేహపరిమాణ మాత్రమే, సర్వవ్యాపి కాదు; ఈశ్వరుడు విగ్రహంలోనే ఉన్నాడు, మరి బయట లేడు అని తలచడం.

2. మిత్రులయందు ఉండే ప్రీతిని, శత్రువులయందు ఉండే ద్వేషాన్నీ త్యజించి.

**యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ ॥** 24

*యత్, తు, కామేప్సునా, కర్మ, సాహంకారేణ, వా, పునః,*
*క్రియతే, బహుళ ఆయాసమ్, తత్, రాజసమ్, ఉదాహృతమ్.*

| | | | |
|---|---|---|---|
| పునః | = మళ్ళీ; | యత్ | = ఏ; |
| కామేప్సునా | = ఫలాపేక్ష కలవాడితోనో; | కర్మ | = యాగాది కర్మ; |
| | | క్రియతే | = అనుష్ఠింపబడునో; |
| సాహంకారేణ వా | = అహంకారం కలవాడితోనో; | తత్ | = అది; |
| | | రాజసమ్ | = రాజసమని; |
| బహుల ఆయాసమ్ | = బహుకష్ట సాధ్యమైన; | ఉదాహృతమ్ | = చెప్పబడుతుంది; |

**తా॥** మరి, ఫలాకాంక్షతోనో లేక అహంకారంతోనో అనుష్ఠించేదీ, బహుకష్టసాధ్యమూ అయిన కర్మ రాజసికం అనబడుతుంది. 24

**అనుబన్ధం క్షయం హింసాం అనపేక్ష్య చ పౌరుషం ।**
**మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥** 25

*అనుబంధమ్, క్షయమ్, హింసామ్, అనపేక్ష్య చ, పౌరుషమ్,*
*మోహాత్, ఆరభ్యతే, కర్మ, యత్, తత్, తామసమ్, ఉచ్యతే.*

| | | | |
|---|---|---|---|
| అనుబంధమ్ | = పర్యవసానములైన శుభాశుభాలను; | యత్ | = ఏ; |
| | | కర్మ | = కర్మ; |
| క్షయమ్ | = శక్తి క్షయమూ; | ఆరభ్యతే | = ఆరంభించబడుతోందో; |
| హింసామ్ | = హింసను; | తత్ | = అది; |
| పౌరుషం చ | = సామర్థ్యాన్ని; | తామసమ్ | = తామసికమని; |
| అనపేక్ష్య | = విచారించకుండా; | ఉచ్యతే | = చెప్పబడుతుంది; |
| మోహాత్ | = అవివేకంతో; | | |

**తా॥** పర్యవసానాలైన శుభాశుభాలను; శక్తి క్షయాన్ని, పరపీడను, స్వసామర్థ్యాన్నీ - విచారించకుండా, అవివేకంతో ఏ కర్మలు అనుష్ఠించబడుతున్నాయో, అవి తామసికం అనబడుతున్నాయి. 25

**ముక్తసఙ్గోఽ నహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః ।**
**సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26**

ముక్తసంగః, అనహంవాదీ, ధృతి ఉత్సాహ సమన్వితః,
సిద్ధి అసిద్ధ్యః, నిర్వికారః, కర్తా, సాత్త్వికః, ఉచ్యతే.

| | | | |
|---|---|---|---|
| ముక్త సఙ్గః | = ఫలాసక్తి రహితుడూ; | నిర్వికారః | = హర్షవిషాద రహితుడూ అయిన; |
| అనహంవాదీ | = అహంకార శూన్యుడు; | కర్తా | = కర్త; |
| ధృతి ఉత్సాహ సమన్వితః | = ధైర్యోత్సాహ యుక్తుడు; | సాత్త్వికః | = సాత్త్వికుడని; |
| సిద్ధి అసిద్ధ్యో | = లాభ నష్టాలలో; | ఉచ్యతే | = చెప్పబడును. |

**తా॥** (త్రివిధ కర్తలను చెబుతున్నాడు–) అనాసక్తుడూ, గర్వోక్తి రహితుడూ, ధైర్యోత్సాహ సమన్వితుడూ, లాభనష్టాలలో హర్షవిషాదాలను పొందనివాడూ అయిన కర్త సాత్త్వికుడు అని చెప్పబడును. 26

**రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽ శుచిః ।**
**హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27**

రాగీ, కర్మఫలప్రేప్సుః, లుబ్ధః, హింసాత్మకః, అశుచిః,
హర్షశోక అన్వితః, కర్తా, రాజసః, పరికీర్తితః.

| | | | |
|---|---|---|---|
| రాగీ | = నిషిద్ధాలను కోరేవాడూ; | హర్ష శోక అన్వితః | = ఇష్టప్రాప్తికి సంతోషాన్ని, ఇష్టవియోగానికి దుఃఖాన్ని పొందేవాడూ అయిన; |
| కర్మ ఫల ప్రేప్సుః | = కర్మఫలాకాంక్షీ; | కర్తా | = కర్త; |
| లుబ్ధః | = పరద్రవ్యాసక్తుడు (స్వధన దానాసమర్థుడూ); | రాజసః | = రాజసికుడని; |
| హింసాత్మకః | = పరులను పీడించే స్వభావం కలవాడూ; | పరికీర్తితః | = చెప్పబడుతున్నాడు; |
| అశుచిః | = అపవిత్రుడూ; | | |

**తా॥** వాసనాకులచిత్తుడూ, కర్మఫలాకాంక్షీ, పరద్రవ్యాసక్తుడూ, స్వధన దానాసమర్థుడూ, పరులను పీడించే స్వభావం కలవాడూ, అపవిత్రుడూ, ఇష్టప్రాప్తికి హర్షాన్ని, అనిష్టప్రాప్తికి శోకాన్నీ పొందే కర్త రాజసికుడు. 27

**అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః[1] ।**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28**

*అయుక్తః, ప్రాకృతః, స్తబ్ధః, శఠః, నైష్కృతికః, అలసః,*
*విషాదీ, దీర్ఘసూత్రీ, చ, కర్తా, తామసః, ఉచ్యతే.*

అయుక్తః = ఏకాగ్రత లేనివాడూ;
ప్రాకృతః = బాలునిలా అత్యంత అసంస్కృత బుద్ధికలవాడూ;
స్తబ్ధః = వినయం లేనివాడూ;
శఠః = మాయావి (వంచకుడూ);
నైష్కృతికః = స్వార్థపరుడై పరుల వ్యాపారాలను పాడుచేసేవాడూ (పరులను అవమానించేవాడూ);
అలసః = ఉత్సాహ రహితుడూ;
విషాదీ = శోకించేవాడూ;
దీర్ఘసూత్రీ చ = నేడో రేపో చేయాల్సిన పనిని ఒక మాసంలోనైనా చేయకుండా కాలయాపన చేసేవాడూ (చిరకారి అయిన);
కర్తా = కర్త;
తామసః = తామసికుడని;
ఉచ్యతే = చెప్పబడును.

**తా॥** ఏకాగ్రత లేనివాడూ, బాలునివలే అత్యంత అసంస్కృతమైన బుద్ధి కలవాడూ (అవివేకి), వినయం లేనివాడూ, వంచకుడూ, స్వార్థపరుడై పరుల వ్యాపారాలను పాడుచేసేవాడూ, (లేక ఇతరులను అవమానించేవాడూ) ఉత్సాహ రహితుడూ, శోకించేవాడూ, నేడో రేపో చేయదగిన పనిని ఒక మాసంలోనైనా చేయకుండా కాలయాపన చేసేవాడూ, అయిన కర్తను తామసికుడంటారు.[2] 28

**బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।**
**ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ ॥ 29**

*బుద్ధేః, భేదమ్, ధృతేః, చ, ఏవ, గుణతః, త్రివిధమ్, శృణు,*
*ప్రోచ్యమానమ్, అశేషేణ, పృథక్త్వేన, ధనంజయ.*

ధనఞ్జయ = అర్జునా;
బుద్ధేః = బుద్ధియొక్క;
ధృతేః చ = ధృతియొక్క;
గుణతః ఏవ = గుణాలను అనుసరించునవే అయిన;
త్రివిధమ్ = మూడు విధాలైన;

---

1. నైకృతికో. – పాఠాంతరం.

2. కర్త వలెనే జ్ఞాతయొక్క, కర్మ వలెనే జ్ఞేయం యొక్క త్రివిధ భేదాలను గ్రహించవచ్చు.

| | | | |
|---|---|---|---|
| భేదమ్ | = భేదాన్ని; | ప్రోచ్యమానమ్ | = చెప్పబడే దానిని; |
| పృథ క్త్వేన | = వేరు వేరుగానూ; | శృణు | = విను. |
| అశేషేణ | = సంపూర్ణంగానూ; | | |

**తా॥** అర్జునా! సత్త్వరజస్తమోగుణాలను అనుసరించి బుద్ధి,[1] ధృతి కూడా మూడు విధాలుగా ఉన్నాయి; వీటిని గురించి వేరువేరుగా, సంపూర్ణంగా వివరిస్తాను, విను. 29

**ప్రవృత్తించ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30**

*ప్రవృత్తిమ్, చ, నివృత్తిమ్, చ, కార్య అకార్యే, భయ అభయే,*
*బంధమ్, మోక్షమ్, చ, యా, వేత్తి, బుద్ధిః, సా, పార్థ, సాత్త్వికీ.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | మోక్షం చ | = మోక్షాన్ని; |
| ప్రవృత్తిం చ | = ప్రవృత్తి మార్గాన్ని; | యా | = ఏ బుద్ధి; |
| నివృత్తిం చ | = నివృత్తి మార్గాన్ని; | వేత్తి | = గ్రహిస్తుందో; |
| కార్య అకార్యే | = కర్తవ్యాకర్తవ్యాలను; | సా | = ఆ; |
| భయ అభయే | = భయ-అభయాలను; | బుద్ధి | = బుద్ధి; |
| బంధమ్ | = బంధాన్ని; | సాత్త్వికీ | = సాత్త్వికము. |

**తా॥** పార్థా! ప్రవృత్తి-నివృత్తి మార్గాలను,[2] కర్తవ్య-అకర్తవ్యాలను,[3](విహిత, నిషిద్ధాలను) భయాన్ని (గర్భవాసాదీ దుఃఖాలను), అభయాన్ని[4] (దుఃఖ అభావాన్ని), బంధాన్ని (కర్తృత్వాది అభిమానాలను), మోక్షాన్ని (అజ్ఞాన నాశనాన్ని) గ్రహించే బుద్ధియే సాత్త్వికము. 30

**యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।**
**అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥ 31**

1. బుద్ధి త్రైవిధ్యమును అనుసరించి కరణమును కూడా తెలుసుకోవాలి.
2. లేక, ధర్మ-అధర్మములను.
3. ఎప్పుడు, ఎక్కడ దేనిని ఆచరించాలో, ఆచరింపకూడదో ఆ విషయాలను.
4. భయ-అభయాలు = కార్య-అకార్యాల ఫలితాలైన అర్థానర్థములు.

యయా, ధర్మమ్, అధర్మమ్, చ, కార్యమ్, చ, అకార్యమ్, ఏవ, చ,
అయథావత్, ప్రజానాతి, బుద్ధిః, సా, పార్థ, రాజసీ.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | అయథావత్ | = నిర్ణయించబడినట్లు కాక మరొక రీతిగా (సందిగ్ధంగా); |
| యయా | = ఏ బుద్ధి చేత; | ప్రజానాతి | = తెలుసుకొనునో; |
| ధర్మమ్ | = శాస్త్రవిహిత కర్మను; | సా | = ఆ; |
| అధర్మం చ | = శాస్త్రవిరుద్ధ కర్మను; | బుద్ధిః | = బుద్ధి; |
| కార్యం చ | = కర్తవ్యాన్ని; | రాజసీ | = రాజసికము. |
| అకార్యం ఏవ చ | = అకర్తవ్యాన్ని; | | |

**తా॥** పార్థా! ఏ బుద్ధిచేత శాస్త్రవిహితమూ శాస్త్ర ప్రతిషిద్ధమూ అయిన కర్మలను, కర్తవ్య-అకర్తవ్యాలను నిర్ణయింపబడినట్లు కాకుండా మరొక రీతిగా తెలుసుకోబడుతున్నాయో ఆ బుద్ధి రాజసికము. 31

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।**
**సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ ॥ 32**

అధర్మమ్, ధర్మమ్, ఇతి, యా, మన్యతే, తమసా, ఆవృతా,
సర్వ అర్థాన్, విపరీతాన్, చ, బుద్ధిః, సా, పార్థ, తామసీ.

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | విపరీతాన్ | = విపరీతంగా (గ్రహిస్తుందో); |
| యా | = ఏ బుద్ధి; | తమసా | = తమోగుణం చేత; |
| అధర్మమ్ | = అధర్మాన్ని; | ఆవృతా | = ఆవరింపబడ్డ; |
| ధర్మమ్ ఇతి | = ధర్మం అని; | సా బుద్ధిః | = ఆ బుద్ధి; |
| మన్యతే | = ఎంచునో; | తామసీ | = తామసికము. |
| సర్వ అర్థాన్ చ | = జ్ఞేయ పదార్థాలనన్నిటిని; | | |

**తా॥** పార్థా! ఏ బుద్ధి తమోగుణంతో కప్పబడి అధర్మాన్ని ధర్మమని గ్రహిస్తోందో, మరియు సమస్త విషయాలను విపరీతంగా తెలుసుకుంటోందో, అది తామసికము. 32

**ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః ।**
**యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ ॥ 33**

*ధృత్యా, యయా, ధారయతే, మనః ప్రాణ ఇంద్రియక్రియాః,*
*యోగేన, అవ్యభిచారిణ్యా, ధృతిః, సా, పార్థ, సాత్త్వికీ.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | మనః ప్రాణ ఇంద్రియ క్రియాః | = మనస్సు, ప్రాణం, ఇంద్రియాల క్రియలు; |
| యోగేన | = ఏకాగ్ర చిత్తంతో; | ధారయతే | = శాస్త్రమార్గంలో నియమింపబడుతున్నాయో; |
| యయా | = ఏ; | సా ధృతిః | = ఆ ధృతి; |
| అవ్యభిచారిణ్యా | = ఐకాంతికమైన (స్థిరమైన); | సాత్త్వికీ | = సాత్త్వికము. |
| ధృత్యా | = ధృతి చేత; | | |

**తా॥** పార్థా! ఏకాగ్రచిత్తంతో విషయాంతరవ్యావృత్తి లేని ఏ ధృతిచేత, మనఃప్రాణాల క్రియలు, ఇంద్రియాల క్రియలు శాస్త్రమార్గంలో నియమింపబడుతున్నాయో, అది సాత్త్విక ధృతి.[1] 33

**యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।**
**ప్రసజ్గేన ఫలాకాజ్క్షీ ధృతి స్సా పార్థ రాజసీ ॥ 34**

*యయా, తు, ధర్మకామ అర్థాన్, ధృత్యా, ధారయతే, అర్జున,*
*ప్రసంగేన, ఫలాకాంక్షీ, ధృతిః, సా, పార్థ, రాజసీ.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | ధర్మ కామ అర్థాన్ | = ధర్మార్థకామాలను; |
| తు | = కాని; | ధారయతే | = నిత్యకర్తవ్యాలుగా గ్రహిస్తాడో; |
| ప్రసజ్గేన | = ఆసక్తి చేత; | | |
| ఫలాకాంక్షీ | = ఫలాన్ని కోరేవాడు; | సా | = ఆ; |
| యయా | = ఏ; | ధృతిః | = ధృతి; |
| ధృత్యా | = ధృతి చేత; | రాజసీ | = రాజసికము. |

**తా॥** పార్థా! మనుష్యుడు ఏ ధృతిచేత ధర్మార్థకామాలనే ప్రధానంగా గ్రహిస్తాడో (మోక్షాన్ని గ్రహించడో) మరియు, కర్తృత్వాది అభినివేశంలో ఫలాన్ని ఆకాంక్షిస్తాడో, అది రాజసిక ధృతి. 34

---

1. 'జిహ్వోపస్థజయో ధృతిః' – శ్రీమద్భాగవతమ్ 11-19-33.

**యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।**
**న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ ॥ 35**

*యయా, స్వప్నమ్, భయమ్, శోకమ్, విషాదమ్, మదమ్, ఏవ, చ, న, విముంచతి, దుర్మేధాః, ధృతిః, సా, పార్థ, తామసీ.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | విషాదమ్ | = విషాదాన్ని; |
| దుర్మేధాః | = దుర్బుద్ధియైనవాడు; | మదం ఏవ చ | = విషయసేవ వల్ల కలిగే మత్తును; |
| యయా | = ఏ ధృతి చేత; | | |
| స్వప్నమ్ | = నిద్రను; | న విముంచతి | = పరిత్యజించడో; |
| భయమ్ | = భయాన్ని; | సా ధృతిః | = ఆ ధృతి; |
| శోకమ్ | = సంతాపాన్ని; | తామసీ | = తామసికము. |

**తా॥** పార్థా! అత్యంత అవివేకి అయిన వ్యక్తి ఏ ధృతిచేత నిద్ర, భయ, శోక, విషాద, మదములను త్యజించకుండా ఉంటాడో, (మళ్ళీ మళ్ళీ పొందుతాడో) అది తామసికధృతి. 35

**సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।**
**అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36**

*సుఖమ్, తు, ఇదానీమ్, త్రివిధమ్, శృణు, మే, భరత ఋషభ, అభ్యాసాత్, రమతే, యత్ర, దుఃఖ అన్తమ్, చ, నిగచ్ఛతి.*

**యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్ ॥ 37**

*యత్, తత్, అగ్రే, విషమ్, ఇవ, పరిణామే, అమృత ఉపమమ్, తత్, సుఖమ్, సాత్త్వికమ్, ప్రోక్తమ్, ఆత్మబుద్ధి ప్రసాదజమ్.*

| | | | |
|---|---|---|---|
| భరత ఋషభ | = భరతశ్రేష్ఠా; | సుఖమ్ | = సుఖాలను; |
| తు | = కాని; | మే | = నా ద్వారా; |
| ఇదానీమ్ | = ఇప్పుడు; | శృణు | = విను; |
| త్రివిధమ్ | = మూడు విధాలైన; | యత్ర | = ఏ సుఖంలో; |

అభ్యాసాత్ = మళ్ళీ మళ్ళీ అనుశీలించడం వల్ల (మనుష్యుడు);
రమతే = ప్రీతిని పొందుతాడో;
చ = మరియూ;
దుఃఖఅంతమ్ = దుఃఖ నాశాన్ని;
నిగచ్ఛతి = పొందుతాడో;
యత్ తత్ = ఏ సుఖం;
అగ్రే = ఆరంభ దశలో;
విషం ఇవ = విషం వలే (కష్ట దాయకమో);
పరిణామే = అంతంలో;
అమృత ఉపమం = అమృత తుల్యమో;
ఆత్మ బుద్ధి ప్రసాద జం = ఆత్మనిష్ఠమైన బుద్ధినిర్మలత నుండి కలుగుతోందో;
తత్ = ఆ;
సుఖమ్ = సుఖం;
సాత్త్వికమ్ = సాత్త్వికమని;
ప్రోక్తమ్ = చెప్పబడింది.

**తా॥** అర్జునా! ఇక త్రివిధ సుఖాలను గురించి విను. ఏ సుఖంలో (విషయ సుఖం వలే వెనువెంటనే కాకుండా) దీర్ఘాభ్యాసం వల్ల క్రమంగా మనుష్యుడు ప్రీతిని పరితృప్తిని పొందుతాడో, సంసార దుఃఖం నుండి విడివడతాడో, మరియు ఏ సుఖం మొదట విషం వలే కష్టదాయకమో,[1] కాని తుదకు అమృతతుల్యం అవుతుందో, మరియు ఏది ఆత్మనిష్ఠమగు బుద్ధినిర్మలత నుండి ఉత్పన్నమవుతోందో, అదియే సాత్త్విక[2] సుఖం అనబడుతుంది. 36-37

**విషయేన్ద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38**

*విషయ ఇంద్రియ సంయోగాత్, యత్, తత్, అగ్రే, అమృతోపమమ్, పరిణామే, విషమ్, ఇవ, తత్, సుఖమ్, రాజసమ్, స్మృతమ్.*

విషయ ఇంద్రియ సంయోగాత్ = విషయాలు ఇంద్రియాల కూడికవల్ల;
యత్ తత్ = ఏ సుఖం;
అగ్రే = మొదట(అనుభవిస్తున్నప్పుడు);
అమృతోపమం = అమృతం వలే;
పరిణామే = చివరకు (భోగాంతంలో);
విషం ఇవ = విషతుల్యంగా (అగునో);
తత్ సుఖమ్ = ఆ సుఖం;
రాజసమ్ = రాజసికమని;
స్మృతమ్ = చెప్పబడుతుంది.

1. జ్ఞాన వైరాగ్య ధ్యాన సమాధులు అత్యంత పరిశ్రమసాధ్యాలవడం చేతా, విషయభోగాల నుండి మనస్సును మరలించేటప్పుడు కష్టం అనిపించడం చేతా విషం వలే దుఃఖదాయకం.

2. జ్ఞానవైరాగ్యాదుల పరిపాకంతో లభించే సుఖం అమృతతుల్యమనడమే కాదు, అమృతమైన బ్రహ్మమే.

**తా॥** శబ్దాది విషయాల, శ్రోత్రాది ఇంద్రియాల కూడిక నుండి కలిగే సుఖం మొదట అనుభవిస్తున్నప్పుడు అమృతం వలే తోచుచు, తుదకు భోగాంతంలో విషతుల్యం[1] అంటే దుఃఖహేతువు అవుతుంది. (స్త్రీ సంసర్గాది) ఈ సుఖం రాజసికం అని అనబడుతుంది. 38

**యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః ।**
**నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్ ॥ 39**

*యత్, అగ్రే, చ, అనుబంధే, చ, సుఖమ్, మోహనమ్, ఆత్మనః,*
*నిద్ర ఆలస్య ప్రమాద ఉత్థమ్, తత్, తామసమ్, ఉదాహృతమ్.*

| | | | |
|---|---|---|---|
| యత్ | = మరి, ఏ; | నిద్ర ఆలస్య ప్రమాద ఉత్థమ్ | = నిద్ర, సోమరితనం, మరుపు - వీటి వల్ల కలుగుతోందో; |
| సుఖమ్ | = సుఖం; | తత్ | = అది; |
| అగ్రే | = మొదటనూ; | తామసమ్ | = తామసికమని; |
| అనుబంధే చ | = తుదకునూ; | ఉదాహృతమ్ | = చెప్పబడును. |
| ఆత్మనః | = ఆత్మకు; | | |
| మోహనమ్ | = మోహకరమో; | | |

**తా॥** మొదటనూ, తుదకునూ కూడా ఆత్మకు మోహాన్ని కలిగించేదీ, నిద్రాలస్యప్రమాదాల నుండి (అంటే, కర్తవ్యం విస్మృతమైన మనోరాజ్యం నుండి) కలిగేదీ అయిన సుఖం తామసికం[2] అనబడుతుంది. 39

**న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।**
**సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః ॥ 40**

*న, తత్, అస్తి, పృథివ్యామ్, వా, దివి, దేవేషు, వా, పునః,*
*సత్త్వమ్, ప్రకృతిజైః, ముక్తమ్, యత్, ఏభిః, స్యాత్, త్రిభిః, గుణైః.*

| | | | |
|---|---|---|---|
| పృథివ్యామ్ | = భూలోకంలో గాని; | దేవేషు వా పునః | = లేక దేవతలలో గాని; |
| దివి వా | = స్వర్గంలో గాని; | యత్ | = ఏది; |

1. బల వీర్య రూప ప్రజ్ఞా మేధా ధనోత్సాహాలను పాడుచేస్తుంది కాబట్టి విషతుల్యం.

2. సాత్త్వికసుఖం ఆత్మబుద్ధి ప్రసాదం నుండి, రాజసిక సుఖం విషయేంద్రియ సంయోగం నుండి, తామసిక సుఖం నిద్రాలస్యప్రమాదాల నుండి కలుగుతున్నాయని గమనించాలి.

| | | | |
|---|---|---|---|
| ఏభిః | = ఈ; | ముక్తమ్ స్యాత్ | = విడివడిందో; |
| ప్రకృతిజైః | = మాయాజాతాలైన; | తత్ సత్త్వమ్ | = అటువంటి ప్రాణి; |
| త్రిభిః గుణైః | = బంధకారణాలైన త్రిగుణాల చేత; | న అస్తి | = లేదు. |

**తా॥** (గుణభేదాన్ని అనుసరించి చాలా విషయాలు చెప్పబడ్డాయి; ఇక అనుక్త విషయాలను కూడా సంగ్రహంగా సూచించి, ఈ ప్రసంగాన్ని ముగిస్తు న్నాడు-) స్వర్గంలో గాని మర్త్యంలో గాని, ప్రకృతిజాతాలైన గుణాల నుండి విడివడిన ప్రాణి ఏదీ లేదు; దేవతలలో కూడా లేదు.[1] 40

**బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥ 41**

*బ్రాహ్మణ క్షత్రియ విశామ్, శూద్రాణామ్, చ, పరంతప,*
*కర్మాణి, ప్రవిభక్తాని, స్వభావ ప్రభవైః, గుణైః.*

| | | | |
|---|---|---|---|
| పరంతప | = అర్జునా; | కర్మాణి | = కర్మలు; |
| బ్రాహ్మణ క్షత్రియ విశామ్ | = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకూ; | స్వభావ ప్రభవైః | = ప్రకృతిజాతములైన; |
| | | గుణైః | = గుణాల చేత; |
| శూద్రాణామ్ చ | = శూద్రులకూ; | ప్రవిభక్తాని | = విభక్తములైనవి. |

**తా॥** (అయితే, క్రియాకారక ఫలాలను, ప్రాణులన్నీ త్రిగుణాత్మికాలే అవుతున్నాయి. మరి జీవునికి మోక్షం ఎలా లభిస్తుంది? అని అంటే : స్వాధికార విహితాలైన కర్మలతో పరమేశ్వరుణ్ణి ఆరాధించడానికి, తత్ప్రసాదలబ్ధమైన జ్ఞానం చేతనే లభించగలదు, - అనే సర్వగీతార్థసారం ప్రదర్శించబడుతోంది.) బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల, శూద్రుల కర్మసమూహాలు ప్రకృతి జాతాలైన[2] గుణాలను అనుసరించే విభజించబడ్డాయి. 41

---

1. సత్త్వరజస్తమో గుణాల సామ్యావస్థయే ప్రకృతి. ఈ గుణత్రయం వైషమ్యావస్థను పొందినప్పుడు, ప్రకృతిజాతాలు అని అనబడతాయి.

2. ప్రకృతిజాతాలు అంటే స్వభావజాతాలు. స్వభావం అంటే ఈశ్వరుని ప్రకృతి అయిన త్రిగుణాత్మిక - మాయ లేక వర్తమాన జన్మలో కార్యాభిముఖమైన పూర్వజన్మ సంస్కారం. స్వభావజాతాలైన గుణత్రయం చేతనే బ్రాహ్మణాదుల కర్తవ్యాలు విభజించబడుతున్నాయి.

**శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవ చ ।**
**జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥ 42**

*శమః, దమః, తపః, శౌచమ్, క్షాంతిః, ఆర్జవమ్, ఏవ, చ,*
*జ్ఞానమ్, విజ్ఞానమ్, ఆస్తిక్యమ్, బ్రహ్మకర్మ స్వభావజమ్.*

| | | | |
|---|---|---|---|
| శమః | = అంతరింద్రియ నిగ్రహం; | జ్ఞానమ్ | = శాస్త్రజ్ఞానం; |
| దమః | = బహిరింద్రియ నిగ్రహం; | విజ్ఞానమ్ | = అనుభూతి; |
| తపః | = తపస్సు; | ఆస్తిక్యం ఏవచ | = శాస్త్రంపై, భగవంతునిపై విశ్వాసం; |
| శౌచమ్ | = బహిరంతరశౌచం; | బ్రహ్మకర్మ స్వభావజమ్ | = స్వభావ జాతాలైన బ్రాహ్మణధర్మాలు. |
| క్షాంతిః | = క్షమ; | | |
| ఆర్జవమ్ | = ఋజుత్వం; | | |

**తా॥** చిత్తోపరమం, బహిరిన్ద్రియ నిగ్రహం, తపస్సు, శౌచం, క్షమ, ఋజుత్వం, శాస్త్రజ్ఞానం, తత్త్వానుభూతి; పరలోకం, శాస్త్రం, భగవంతుడు : వీటిపై విశ్వాసం - ఇవి బ్రాహ్మణులకు స్వభావజాతాలైన కర్మలు.
(మను స్మృతిః 1-88, 91 చూ.) 42

**శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।**
**దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43**

*శౌర్యమ్, తేజః, ధృతిః, దాక్ష్యమ్, యుద్ధే, చ, అపి, అపలాయనమ్,*
*దానమ్, ఈశ్వరభావః, చ, క్షాత్రమ్, కర్మ, స్వభావజమ్.*

| | | | |
|---|---|---|---|
| శౌర్యమ్ | = పరాక్రమం; | అపలాయనమ్ అపి | = పారిపోకుండా ఉండడమూ; |
| తేజః | = తేజస్సు; | దానమ్ | = దానం; |
| ధృతిః | = ధైర్యం; | ఈశ్వరభావః చ | = శాసించే శక్తి; |
| దాక్ష్యమ్ | = కార్యదక్షత; | క్షాత్రంకర్మ స్వభావజమ్ | = స్వాభావికాలైన క్షత్రియకర్మలు; |
| యుద్ధే చ | = మరియు యుద్ధంలో; | | |

**తా॥** పరాక్రమం, తేజస్సు, ధృతి, కర్మకౌశలం, యుద్ధంలో పారిపోకుండా ఉండడం, ఔదార్యం, శాసించగల శక్తి - ఇవి క్షత్రియుని స్వాభావిక లక్షణాలు. 43

**కృషిగౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।**
**పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44**

కృషిగౌరక్ష వాణిజ్యమ్, వైశ్యకర్మ స్వభావజమ్,
పరిచర్య ఆత్మకమ్, కర్మ, శూద్రస్య, అపి, స్వభావజమ్.

| | |
|---|---|
| కృషి గౌరక్ష్య వాణిజ్యమ్ = కృషి, గోరక్షణ, వాణిజ్యాలు; | శూద్రస్య అపి = శూద్రునికి అన్ననో; |
| స్వభావజమ్ వైశ్య కర్మ = స్వాభావికాలైన వైశ్యకర్మలు; | పరిచర్య ఆత్మకమ్ = సేవా రూపమైన; |
| | కర్మ = కర్మ; |
| | స్వభావజమ్ = స్వభావ సిద్ధం; |

**తా॥** కృషి, గోరక్షణం, వాణిజ్యం వైశ్యస్వభావ సులభములైన కర్మలు; (త్రైవర్ణిక) సేవారూపమైన కర్మ శూద్రులకు స్వభావజాతమైనది. 44

**స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।**
**స్వకర్మ నిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥ 45**

స్వే, స్వే, కర్మణి, అభిరతః, సంసిద్ధిమ్, లభతే, నరః,
స్వకర్మ నిరతః, సిద్ధిమ్, యథా, విందతి, తత్, శృణు.

| | |
|---|---|
| స్వేస్వే = తన తన; | స్వకర్మనిరతః = స్వీయకర్మలో తత్పరుడైన వాడు; |
| కర్మణి = వర్ణానికి, ఆశ్రమానికి చెందిన కర్మలో; | యథా = ఏ రీతిగా; |
| అభిరతః = నిరతుడైన; | సిద్ధిమ్ = సిద్ధిని; |
| నరః = మనుష్యుడు; | విన్దతి = పొందుతాడో; |
| సంసిద్ధిమ్ = సిద్ధిని; | తత్ = దానిని; |
| లభతే = పొందుతాడు; | శృణు = విను. |

**తా॥** (ఈ కర్మల జ్ఞానహేతుత్వం చెప్పబడుతోంది :) తమ తమ అధికారం విధించే కర్మలలో పరినిష్ఠితుడైన వాడు సిద్ధిని అంటే జ్ఞానయోగ్యతను పొందుతాడు. ఈ కర్మలు జ్ఞానప్రాప్తికరాలు; స్వకర్మ నిరతుడైన వాడు తత్త్వజ్ఞానాన్ని పొందే రీతిని విను.[1] 45

1. విహితకర్మానుష్ఠానానికి ఫలం స్వర్గం; కాని నిష్కామ బుద్ధితో ఆచరిస్తే, కర్మలు చిత్తశుద్ధి ద్వారంలో →

**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 46**

*యతః, ప్రవృత్తిః, భూతానామ్, యేన, సర్వమ్, ఇదమ్, తతమ్, స్వకర్మణా, తమ్, అభ్యర్చ్య, సిద్ధిమ్, విందతి, మానవః.*

| | | | |
|---|---|---|---|
| యతః | = ఎవరి నుండి; | మానవః | = మనుష్యుడు; |
| భూతానామ్ | = ప్రాణుల; | స్వకర్మణా | = తన వర్ణం, ఆశ్రమం విధించే కర్మ చేత; |
| ప్రవృత్తిః | = ఉత్పత్తి (కర్మ ప్రయత్నం కలుగుతోందో); | తమ్ | = ఆ సర్వాంతర్యామి అయిన పరమేశ్వరుణ్ణి; |
| యేన | = ఎవరి చేత; | | |
| ఇదమ్ | = ఈ; | అభ్యర్చ్య | = అర్చించి; |
| సర్వమ్ | = జగత్తంతా; | సిద్ధిమ్ | = సిద్ధిని; |
| తతమ్ | = వ్యాప్తమో; | విన్దతి | = పొందుతాడు. |

**తా॥** ఏ సర్వాంతర్యామి అయిన పరమేశ్వరుని నుండి ప్రాణుల ఉత్పత్తి కర్మ ప్రయత్నమూ సంభవిస్తున్నాయో, మరియు ఎవ్వరు విశ్వాన్ని అంతటిని వ్యాపించి ఉన్నాడో, అతనిని మనుష్యుడు స్వీయ వర్ణాశ్రమ కర్మతో అర్చించి సిద్ధిని పొందగలడు.[1]

(శ్రీమద్భాగవతమ్11-17-44; విష్ణుపురాణమ్. 3-7-20 ) 46

→
తత్త్వజ్ఞానాన్ని కలుగజేస్తున్నాయి.

వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫలమనుభూయ తవః శేషేణ ।
విశిష్ట-దేశ-జాతి-కుల-ధర్మ-ఆయుః-శ్రుత-విత్త-వృత్త-సుఖ-మేధసో జన్మ ప్రతిపద్యంతే ॥

– గౌతమ ధర్మ సూత్రమ్. 11-29

స్వకర్మ నిష్ఠులైన వర్ణులు, ఆశ్రములు మరణానంతరం స్వర్గంలో పుణ్యాన్ని అనుభవించి మిగిలిన సంచితకర్మానుసారం జన్మిస్తున్నారు అని ప్రసిద్ధం. ఇక ఇవి సిద్ధిని కలిగించే విధాన్ని చెప్పబడతాయి.

1. కేవలం వర్ణాశ్రమ కర్మాచరణ చేతనే సిద్ధి లభిస్తుంది, వర్ణాశ్రమ విహీనులకు లభించదని కాదు. ఇక్కడ కర్మప్రశంస ప్రస్తుతమవడం చేత వర్ణాశ్రమాలు స్తుతింపబడ్డాయి. అర్యులు-అనార్యులు, స్త్రీ-పురుషులు అనే భేదం లేకుండా, అందరికీ ఆత్మజ్ఞానానికి అధికారం ఉంది. రైక్వసంవర్తులు, వాచక్నవి మొదలైనవారు వర్ణాశ్రమ రహితులయినప్పటికీ సిద్ధిని పొందారు. జన్మాంతర సంచితమైన సంస్కారంతో కూడా సిద్ధి →

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।**
**స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47**

*శ్రేయాన్, స్వధర్మః, విగుణః, పరధర్మాత్, సు అనుష్ఠితాత్,*
*స్వభావనియతమ్, కర్మ, కుర్వన్, న, ఆప్నోతి, కిల్బిషమ్.*

| | | | |
|---|---|---|---|
| విగుణః (అపి) | = అసంపూర్ణంగా, అంగహీనంగా అనుష్ఠితమైన; | శ్రేయాన్ | = శ్రేష్ఠం; |
| స్వధర్మః | = స్వీయ వర్ణాశ్రమధర్మం; | స్వభావ నియతమ్ | = స్వభావజాతమైన; |
| సు అనుష్ఠితాత్ | = చక్కగా ఆచరింపబడిన; | కర్మ | = కార్యాన్ని; |
| | | కుర్వన్ | = చేస్తున్నప్పటికీ; |
| | | కిల్బిషమ్ | = పాపాన్ని; |
| పరధర్మాత్ | = పరధర్మం కంటే; | న ఆప్నోతి | = పొందడు. |

**తా॥** చక్కగా ఆచరింపబడిన పరధర్మం కంటే తన వర్ణం, ఆశ్రమం విధించే ధర్మం అంగహీనంగా అనుష్ఠించబడినా శ్రేష్ఠమే అవుతోంది. ఎందుకంటే, స్వభావజాతమైన కర్మలను ఆచరించేవాడు పాపాన్ని పొందడు. (కనుక, బంధు వధాది దోషాలతో కూడినదే అయినా, నీ ధర్మమైన యుద్ధం పరధర్మమైన భిక్షాటనం కంటే శ్రేష్ఠమే అవుతోంది.) 47

**సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్ ।**
**సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48**

*సహజమ్, కర్మ, కౌంతేయ, సదోషమ్, అపి, న, త్యజేత్,*
*సర్వ ఆరంభాః, హి, దోషేణ, ధూమేన, అగ్నిః, ఇవ, ఆవృతాః.*


లభించగలదు. కాని వర్ణాశ్రమధర్మాలను అనుష్ఠించే వారి పథం నిష్కంటకం. (గీత. 6-45. వేదాంత సూత్రమ్ 3-4-36,39 చూ. )

ధృతి, క్షమా దమోఽ స్తేయం శౌచ మింద్రియనిగ్రహః,
ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్. – మను స్మృతిః 692

ధృతి, క్షమ, దమ, అస్తేయం, శౌచం, ఇంద్రియ సంయమం, బుద్ధి (అంటే జ్ఞానం), ప్రతిపక్షాన్ని సంశయాన్ని నిరాకరించే శక్తి, విద్య, (ఆత్మజ్ఞానం), సత్యం, అక్రోధం – అనే ఈ పది అందరికీ ఆచరణీయమైన ధర్మాలు. ఈ ధర్మాచరణలో అందరూ శ్రేయాన్ని పొందగలరు. (మేధాతిథి.)

– శ్రీమద్భాగవతమ్ : 11-17-34-35 చూ.

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా; | సర్వ ఆరంభాః | = కర్మలన్నీ; |
| సదోషమ్ అపి | = దోషయుక్తమైనా; | అగ్నిః | = నిప్పు; |
| సహజమ్ కర్మ | = స్వధర్మనిర్దిష్టమైన కర్మ; | ధూమేన ఇవ | = పొగచేత కప్పబడేటట్లు; |
| న త్యజేత్ | = త్యజించకూడదు; | దోషేణ | = దోషం చేత; |
| హి | = ఏమన; | ఆవృతాః | = ఆవరింపబడి ఉన్నాయి. |

**తా॥** కుంతీపుత్రా! దోషయుక్తమైనప్పటికీ, స్వధర్మాన్ని త్యజించడం ఉచితం కాదు; అగ్ని ధూమంచేత ఆవృతమై ఉండేవిధంగా కర్మలన్నీ కూడా ఏదో ఒక దోషంతో కూడి ఉన్నాయి. [పొగను విడిచి అగ్నిని తమఃశీతాది నివృత్తి కొరకు ఉపయోగించుకొనే విధంగా, కర్మలో దోషాన్ని చూడకుండా (కర్మను) సేవిస్తే, అందలి గుణాంశం చిత్తశుద్ధిని ఒసగగలదు.] 48

**అసక్త బుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49**

*అసక్త బుద్ధిః, సర్వత్ర, జితాత్మా, విగతస్పృహః,*
*నైష్కర్మ్య సిద్ధిమ్, పరమామ్, సన్న్యాసేన, అధిగచ్ఛతి.*

| | | | |
|---|---|---|---|
| సర్వత్ర | = అన్ని విషయాలలో; | సన్న్యాసేన | = సమ్యక్ దర్శనపూర్వమైన సర్వకర్మ సన్న్యాసం చేత; |
| అసక్త బుద్ధిః | = ఆసక్తి లేని వాడూ; | | |
| జితాత్మా | = సంయత చిత్తుడూ; | పరమాం నైష్కర్మ్య సిద్ధిమ్ | = నిష్క్రియ ఆత్మస్వరూపాన్ని పొందడమనే సిద్ధిని; |
| విగత స్పృహః | = భోగాకాంక్ష లేనివాడూ (అయిన నరుడు); | అధిగచ్ఛతి | = పొందుతాడు. |

**తా॥** (కర్మాచరణలో దోషాంశాన్ని ఏ విధంగా పరిత్యజించాలో, గుణాంశం ఎలా సంపాదింపబడుతోందో తెలుపబడుతోంది-) సర్వవిషయాలలో అనాసక్తుడూ, నిరహంకారీ, ఫలస్పృహ లేనివాడూ అయిన నరుడు సాత్త్విక త్యాగం (సన్న్యాసం) చేత సర్వకర్మ నివృత్తి రూపమైన నైష్కర్మ్యసిద్ధిని అంటే బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు.[1]

(గీత :8-9, 5-8,11; 5-13 బృహదారణ్యకోపనిషత్తు. 3-5-1 చూ.) 49

1. సత్త్వశుద్ధిని పొందుతాడు అనే ఈ శ్లోక ముఖ్యాభిప్రాయం. పిదప, జ్ఞానం లభించే రీతి వర్ణింపబడుతోంది. →

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50**

సిద్ధిమ్, ప్రాప్తః, యథా, బ్రహ్మ, తథా, ఆప్నోతి, నిబోధ, మే,
సమాసేన, ఏవ, కౌంతేయ, నిష్ఠా, జ్ఞానస్య, యా, పరా.

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా; | జ్ఞానస్య | = జ్ఞానం యొక్క; |
| సిద్ధిమ్ ప్రాప్తః | = సిద్ధిని పొందిన వ్యక్తి; | పరానిష్ఠా | = పరిసమాప్తియో; |
| యథా | = ఏ రీతిగా (ఏ జ్ఞాన నిష్ఠను అనుసరించి); | తథా | = ఆ జ్ఞాననిష్ఠా క్రమాన్ని; |
| | | సమాసేన ఏవ | = సంక్షేపంగా; |
| బ్రహ్మ | = పరమాత్మను; | మే | = నా నుండి; |
| ఆప్నోతి | = పొందుతాడో; | నిబోధ | = తెలుసుకో. |
| యా | = ఏది; | | |

**తా॥** కౌంతేయా! ఈ విధంగా సిద్ధిని పొందినవాడు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో ఎవరైనా) ఏ జ్ఞాననిష్ఠను అనుసరించి పరమాత్మను పొందుతున్నాడో, ఏది జ్ఞాన పరిసమాప్తియో, ఆ జ్ఞాననిష్ఠాప్రాప్తి క్రమాన్ని సంక్షేపంగా నా నుండి తెలుసుకో. 50



"ఎవరికైనా శుద్ధసత్త్వ(గుణ)ము లభిస్తే, అతడు కేవలం ఈశ్వరుని గురించి మాత్రమే చింతిస్తాడు. అతనికి మరేమీ రుచించదు. ఒకానొకడు ప్రారబ్ధబలం వల్ల జన్మాదిగనే శుద్ధసత్త్వాన్ని కలిగి ఉంటాడు. కామనాశూన్యుడై కర్మను ఆచరించడానికి ప్రయత్నిస్తే, చివరకు శుద్ధసత్త్వం లభించగలదు. రజోమిశ్రిత సత్త్వగుణం ఉంటే, మనస్సు క్రమంగా వివిధవిషయాలను అనుసరిస్తుంది, అప్పుడు 'జగత్తుకు ఉపకారం ఒనరుస్తా'ననే అభిమానం కలుగుతుంది. ఈ సామాన్య జీవుడు జగత్తుకు ఉపకారం ఒనర్చడం చాలా కష్టం. అయినా, ఎవరైనా పరోపకారార్థం కర్మను ఆచరిస్తే దోషం లేదు – దీనినే నిష్కామకర్మ అంటారు. ఇటువంటి కర్మను ఆచరింప ప్రయత్నించడం చాలా మంచిది. కాని అందరూ చేయలేరు. చాలా కఠినం.

"అందరూ కర్మను ఆచరించాల్సినవారే; ఎవరో ఒకరిద్దరు మాత్రమే కర్మను త్యజించగలరు. శుద్ధసత్త్వం గలవారిని ఎక్కడో ఒకరిద్దరిని మాత్రమే చూడగలం. ఈ నిష్కామకర్మను ఆచరిస్తూ ఉంటే రజోమిశ్రిత సత్త్వగుణం క్రమంగా శుద్ధసత్త్వంగా మారగలదు. శుద్ధసత్త్వం ఈశ్వరలాభాన్ని చేకూరుస్తుంది. సాధారణులు ఈ శుద్ధసత్త్వావస్థను గ్రహించలేరు. హేముడు నాతో ఇలా అన్నాడు : 'భట్టాచార్యమహాశయా! జగత్తులో పరువుప్రతిష్ఠలను నిల్పుకోవడమే మనుష్యుని జీవితాదర్శం. ఏమంటారు?'

– శ్రీరామకృష్ణ పరమహంస.

**బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51**

*బుద్ధ్యా, విశుద్ధయా, యుక్తః, ధృత్యా, ఆత్మానమ్, నియమ్య, చ,*
*శబ్ద ఆదీన్, విషయాన్, త్యక్త్వా, రాగద్వేషౌ, వ్యుదస్య, చ.*

విశుద్ధయా బుద్ధ్యా = ఆత్మను బ్రహ్మంగా నిశ్చయించడం వల్ల సంశయ విపర్యయాలు లేని బుద్ధితో;
యుక్తః = కూడి;
ధృత్యా = ధైర్యం చేత;
ఆత్మానమ్ = శరీరేంద్రియ సంఘాతాన్ని;
నియమ్య = సంయతమొనర్చి;
శబ్ద ఆదీన్ చ విషయాన్ = శబ్దాది విషయాలను;
త్యక్త్వా = త్యజించి;
రాగ ద్వేషౌ చ = శరీరధారణకు ఉపయోగపడే విషయాలలో ఆసక్తి, ద్వేషాలను కూడా;
వ్యుదస్య = పరిత్యజించి.

**తా॥** ఆత్మను బ్రహ్మమని నిశ్చయించుకోవడం వల్ల సంశయ విపర్యయాలు తొలగిన బుద్ధితో ధైర్యాన్ని అవలంబించి శరీరేంద్రియాలను వశమొనర్చుకొని, శరీరస్థితికి ప్రయోజనమైన వాటినిగాక మిగిలిన శబ్దాది విషయాలను అన్నిటిని పరిత్యజించి, శరీరస్థితికి ప్రయోజనమైన విషయాలలో రాగ ద్వేషాలను కూడా పరిత్యజించి– 51

**వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 52**

*వివిక్తసేవీ, లఘు ఆశీ, యత వాక్ కాయ మానసః,*
*ధ్యానయోగపరః, నిత్యమ్, వైరాగ్యమ్, సముపాశ్రితః.*

వివిక్త సేవీ = నిర్జనస్థానవాసి;
లఘు ఆశీ = మిత భోజి;
యతవాక్ కాయ మానసః = మనోవాక్కాయాలను నియమించుకున్న వాడూ;
నిత్యమ్ = ఎల్లప్పుడూ;
ధ్యానయోగపరః = ధ్యానయోగ పరాయణుడూ;
వైరాగ్యమ్ = దృష్ట-అదృష్ట విషయ వైరాగ్యాన్ని;
సముపాశ్రితః = అవలంబించినవాడూ.

**తా॥** నిర్జనస్థానవాసియూ, మితభోజియూ, త్రికరణాలను నియమించి నిత్యం[1] ధ్యానాన్ని[2] యోగాన్ని[3] అభ్యసిస్తూ, ఐహికాముష్మిక విషయాలన్నిటి యందూ వైరాగ్యాన్ని పూని, - 52

**అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53**

*అహంకారమ్, బలమ్, దర్పమ్, కామమ్, క్రోధమ్, పరిగ్రహమ్, విముచ్య, నిర్మమః, శాంతః, బ్రహ్మభూయాయ, కల్పతే.*

| | | | |
|---|---|---|---|
| అహంకారమ్ | = దేహేంద్రియాల యందు ఆత్మబుద్ధిని; | పరిగ్రహమ్ | = స్వీకరించడాన్ని; |
| బలమ్ | = మొండిపట్టును; | విముచ్య | = వదలి; |
| దర్పమ్ | = యోగబలగర్వంతో కుమార్గాన్ని అనుసరించడమూ; | నిర్మమః | = శరీర-జీవితాలపై మమత్వం లేకుండా; |
| (ప్రారబ్ధవశంతో లభించే విషయాలపై); | | శాన్తః | = చిత్త విక్షేపరహితుడైన వ్యక్తి; |
| కామమ్ | = కోర్కెను; | బ్రహ్మభూయాయ | = బ్రహ్మత్వం పొందడానికి; |
| క్రోధమ్ | = కోపాన్ని; | కల్పతే | = సమర్థుడవుతాడు. |

**తా॥** దేహేంద్రియాల యందు ఆత్మబుద్ధిని, మొండిపట్టును, యోగబల గర్వాన్ని, ప్రారబ్ధవశంతో లభించే విషయాలపై కోర్కెను, కోపాన్ని, పరిగ్రహాన్ని[4] వదలి, శరీరంపైనా జీవితంపైనా అభిమానం లేకుండా చిత్త ఉపరతిని పొందిన వాడు ఇహజీవనంలోనే బ్రహ్మజ్ఞానాన్ని పొందడానికి సమర్థుడు అవుతాడు. 53

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి ।**
**సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54**

---

1. నిత్యం అనే శబ్దం, మరి ఇతర కర్తవ్యాలు ఏమీ లేవని సూచిస్తోంది.

2. ఆత్మస్వరూప చింతన.

3. ఆత్మవిషయంలో మనస్సును ఏకాగ్రం ఒనర్చడం.

4. ఇంద్రియాలు, మనస్సు దోషరహితాలే అయినప్పటికీ శరీరస్థితి ధర్మానుష్ఠానాల కొరకు ఇతరులర్పించే విషయాలను గ్రహించకుండడం.

బ్రహ్మభూతః, ప్రసన్న ఆత్మా, న, శోచతి, న, కాంక్షతి,
సమః, సర్వేషు, భూతేషు, మద్భక్తిమ్, లభతే, పరామ్.

| | |
|---|---|
| **బ్రహ్మభూతః** = బ్రహ్మజ్ఞానాన్ని పొందడానికి సమర్థుడు (బ్రహ్మజ్ఞాన నిష్ఠుడు); | **న కాఙ్క్షతి** = అప్రాప్త వస్తువునను కోరడు; |
| **ప్రసన్న ఆత్మా** = ఆత్మ ప్రసాదాన్ని పొంది; | **సర్వేషు భూతేషు** = సర్వభూతాల యందు; |
| **న శోచతి** = ప్రాప్తవస్తువు నాశమైనా శోకించడు; | **సమః** = సముడైన (యతి); |
| | **పరాం మద్భక్తిమ్** = జ్ఞానలక్షణమూ, మత్సంబంధమూ అయిన పరభక్తిని; |
| | **లభతే** = పొందుతాడు. |

**తా॥** ఈ క్రమాన్ని అనుసరించి బ్రహ్మస్వరూపాన్ని పొందడానికి సమర్థుడైన వాడూ, కర్తృత్వాది విముక్తుడూ, లబ్ధాత్మా ప్రసాదుడూ, జ్ఞాననిష్ఠుడూ అయిన యతి ఏ విషయాన్ని గురించి కూడా శోకించడు. మరియు దేనినీ ఆకాంక్షించడు. అతనికి సర్వ భూతాల సుఖదుఃఖాలూ తన సుఖ దుఃఖాలే.[1] మరియు, జ్ఞాన రూపము, మత్సంబంధము అయిన ఉత్తమ భక్తిని అతడు పొందుతాడు.[2]

– భాష్యోత్కర్ష దీపిక. 54

**భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥ 55**

భక్త్యా, మామ్, అభిజానాతి, యావాన్, యః, చ, అస్మి, తత్త్వతః,
తతః, మామ్, తత్త్వతః, జ్ఞాత్వా, విశతే, తదనంతరమ్.

| | |
|---|---|
| **(యతి) భక్త్యా** = జ్ఞానలక్షణమైన భక్తితో; | **మామ్** = నన్ను; |
| **యావాన్** = ఏ ఏ ఉపాధుల వల్ల భేదవైశిష్ట్యాలను (సవిశేషరూపాలను); | **తత్త్వతః** = యథార్థంగా; |
| **యః చ** = మరియు, సర్వోపాధిశూన్యం (నిర్విశేషం); | **అభిజానాతి** = ఆత్మరూపంలో గ్రహిస్తాడు; |
| **అస్మి** = నేను అవుతున్నానో (ఆ రూపాలలో); | **తతః** = ఈ సాక్షాత్కారం వల్ల; |
| | **మామ్** = నన్ను; |
| | **తత్త్వతః** = యథార్థరూపంలో; |
| | **జ్ఞాత్వా** = తెలుసుకుని; |

1. గీత : 6-32 చూ.
2. గీత : 7-16 చూ.

| | | | |
|---|---|---|---|
| తదనన్తరమ్ | = వెనువెంటనే; | విశతే | = ప్రవేశిస్తాడు |
| (నాయందు) | | (జీవత్కాలంలోనే మత్స్వరూపస్థితిని పొందుతాడు). | |

**తా॥** ఈ జ్ఞానరూపమైన భక్తిచేత నా సవిశేష నిర్విశేష స్వరూపాల తత్త్వాన్ని గ్రహించి, యతి, అద్వైతచిన్మాత్రుడనైన నన్ను ఆత్మరూపంలో సాక్షాత్కరించు కుంటున్నాడు. ఈ సాక్షాత్కారం చేతనే నా యథార్థస్వరూపాన్ని తెలుసుకుంటాడు; వెనువెంటనే[1] నా యందు ప్రవేశిస్తాడు.[2] అంటే, జీవితకాలంలోనే మత్స్వరూపంలో అవస్థితుడవుతాడు.[3] (గీత : 13–3 చూ.) – భాష్యోత్కర్షదీపిక. 55

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ 56**

*సర్వకర్మాణి, అపి, సదా, కుర్వాణః, మద్వ్యపాశ్రయః,*
*మత్ ప్రసాదాత్, అవాప్నోతి, శాశ్వతమ్, పదమ్, అవ్యయమ్.*

| | | | |
|---|---|---|---|
| సదా | = ఎల్లప్పుడూ; | మత్ ప్రసాదాత్ | = నా అనుగ్రహంతో; |
| సర్వకర్మాణి | = సమస్త కర్మలను; | శాశ్వతమ్ | = సనాతనమూ; |
| కుర్వాణః అపి | = చేస్తున్నప్పటికీ; | అవ్యయమ్ | = అక్షయమూ అయిన; |
| మద్వ్యపాశ్రయః | = నన్ను శరణు పొందిన భక్తుడు; | పదమ్ | = స్థానాన్ని; |
| | | అవాప్నోతి | = పొందుతాడు; |

**తా॥** (స్వకర్మ ద్వారా పరమేశ్వరారాధన చేయడం వల్ల మోక్షం లభించే క్రమం చెప్పబడింది; అది ఉపసంహరింపబడుతోంది :) పూర్వోక్తరీతిని అనుసరించి, నిత్యనైమిత్తిక కర్మలను అన్నింటినీ స్వర్గాది ఫలాలను అపేక్షించకుండా, నన్నే ఆశ్రయించి, అనుష్ఠించేవాడు నా అనుగ్రహంతో, సనాతనమూ అక్షయమూ అయిన స్థానాన్ని (మోక్షాన్ని) పొందగలడు. 56

---

1. జ్ఞానక్రియ, ప్రవేశక్రియలకు మధ్య వ్యవధానం లేదు.

2. ఇక్కడ ప్రవేశక్రియ జ్ఞానక్రియలు ఏకార్థాలు.

3. పిదప, ఆ పరభక్తితో నా సర్వవ్యాపిత్వ, సచ్చిదానంద ఘనత్వాల స్వరూపాన్ని గ్రహించిన వాడు, నా స్వరూపాన్ని యథార్థంగా గ్రహించి, అనంతరం పరమానందస్వరూపుడు అవుతున్నాడు. – శ్రీధరస్వామి.
ఇక్కడ అనంతర శబ్దానికి అర్థం 'బ్రహ్మనిర్గుణ భావాన్ని గ్రహించిన పిదప' అని కూడా గ్రహించవచ్చు.
– బ్రహ్మానందగిరి.

**చేతసా సర్వకర్మాణి మయి సంన్న్యస్య మత్పరః ।**
**బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ 57**

చేతసా, సర్వకర్మాణి, మయి, సన్న్యస్య, మత్పరః,
బుద్ధియోగమ్, ఉపాశ్రిత్య, మచ్చిత్తః, సతతమ్, భవ.

| | | | |
|---|---|---|---|
| చేతసా | = వివేకబుద్ధితో; | బుద్ధియోగం ఉపాశ్రిత్య | = బుద్ధిని ఏకాగ్రం చేసి; |
| సర్వ కర్మాణి | = ఐహికాముష్మిక విషయాలైన కర్మలన్నింటిని; | సతతమ్ | = నిరంతరం; |
| మయి | = నా యందు; | మచ్చిత్తః | = మద్గత చిత్తుడవు; |
| సన్న్యస్య | = సమర్పించి; | భవ | = కమ్ము. |
| మత్పరః | = నాపై ఆసక్తితో; | | |

**తా॥** కనుక, నీవు కర్మలను అన్నింటిని నాకు అర్పించి, నన్నే పరమ పురుషార్థంగా గ్రహించి, బుద్ధిని ఏకాగ్రం చేసి,[1] కర్మానుష్ఠాన కాలంలో కూడా నా యందు చిత్తాన్ని సమాహితం చేసి;[2] అనన్య శరణాగతుడవై నన్ను శరణువేడు. 57

**మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ ప్రసాదాత్ తరిష్యసి ।**
**అథ చేత్ త్వమహంకారాత్ న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58**

మచ్చిత్తః, సర్వదుర్గాణి, మత్ ప్రసాదాత్, తరిష్యసి,
అథ, చేత్, త్వమ్, అహంకారాత్, న, శ్రోష్యసి, వినంక్ష్యసి.

| | | | |
|---|---|---|---|
| మచ్చిత్తః | = మద్గతచిత్తుడవై; | అథ | = మరి; |
| మత్ప్రసాదాత్ | = నా అనుగ్రహం వల్ల; | త్వమ్ | = నీవు; |
| సర్వదుర్గాణి | = దుస్తరమైన సంసార హేతువులను అన్నింటిని; | అహంకారాత్ | = పాండిత్యాభిమానంతో; |
| | | న శ్రోష్యసిచేత్ | = నేను చెప్పింది వినకుంటే; |
| తరిష్యసి | = అతిక్రమించగలవు; | వినంక్ష్యసి | = పురుషార్థ భ్రష్టుడవవుతావు. |

**తా॥** ఈ విధంగా నీవు చిత్తాన్ని నాపై నిలిపినట్లయితే, నా అనుగ్రహంతో దుస్తరమైన సంసారాన్ని, సంసార హేతువులను అతిక్రమించగలవు. ఇలా కాకుండా పాండిత్యాభిమానంతో నేను చెప్పింది వినకపోతే నీవు పురుషార్థ భ్రష్టుడవవుతావు.

---

1. గీత : 2-41 చూ.
2. గీత : 4-24, 9-27 చూ.

**యద హఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।**
**మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59**

*యత్, అహంకారమ్, ఆశ్రిత్య, న, యోత్స్యే, ఇతి, మన్యసే,*
*మిథ్యా, ఏషః, వ్యవసాయః, తే, ప్రకృతిః, త్వామ్, నియోక్ష్యతి.*

| | | | |
|---|---|---|---|
| అహంకారమ్ | = అహంకారాన్ని; | ఏషః | = ఈ; |
| ఆశ్రిత్య | = ఆశ్రయించి; | వ్యవసాయః | = నిశ్చయం; |
| న యోత్స్యే | = యుద్ధం చేయను; | మిథ్యా | = భ్రమమూలకం (వ్యర్థం); |
| ఇతి | = అని; | ప్రకృతిః | = క్షత్రియస్వభావం; |
| యత్ | = దేనిని; | త్వామ్ | = నిన్ను; |
| మన్యసే | = తలస్తున్నావో; | నియోక్ష్యతి | = నియోగింపగలదు. |
| తే | = నీ; | | |

**తా॥** (మంచిది, వినష్టుణ్ణే అవుతాను, బంధువులతో యుద్ధం చేయనని అంటావా :) అహంకారాన్ని ఆశ్రయించి 'యుద్ధం చేయను' అని నీవు తలుస్తున్నది భ్రమమూలకమే; నీ ప్రయత్నం వ్యర్థమే అవుతుంది. (రజఃప్రధానమైన) క్షత్రియ స్వభావం నిన్ను యుద్ధంలో నియోగింపగలదు. 59

**స్వభావజేన కౌన్తేయ నిబద్ధః స్వేన కర్మణా ।**
**కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60**

*స్వభావజేన, కౌంతేయ, నిబద్ధః, స్వేన, కర్మణా,*
*కర్తుమ్, న, ఇచ్ఛసి, యత్, మోహాత్, కరిష్యసి, అవశః, అపి, తత్.*

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా; | స్వేన | = నీ (క్షత్రియోచితమైన); |
| మోహాత్ | = అవివేకంతో; | కర్మణా | = కర్మ చేత; |
| యత్ | = దేనిని; | నిబద్ధః | = బద్ధుడవై; |
| కర్తుమ్ | = చేయ; | అవశః | = నీ ఇష్టానికి వ్యతిరేకంగానే; |
| న ఇచ్ఛసి | = ఇచ్ఛగించవో; | తత్ అపి | = దానిని; |
| స్వభావజేన | = స్వభావజాతమైన; | కరిష్యసి | = చేస్తావు. |

**తా॥** కౌంతేయా! మోహంలో నీవు దేనిని చేయడానికి ఇచ్ఛగింపకున్నావో

దానిని, పూర్వజన్మసంస్కారం వల్ల కలిగే శౌర్యాదులచే నియమింపబడి అవశుడవై నీవు ఒనర్చే తీరతావు. 60

**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**
**భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥ 61**

*ఈశ్వరః, సర్వభూతానామ్, హృద్దేశే, అర్జున, తిష్ఠతి,*
*భ్రామయన్, సర్వభూతాని, యంత్ర అరూఢాని, మాయయా.*

| | | | |
|---|---|---|---|
| అర్జున | = పార్థా; | యంత్ర అరూఢాని (ఇవ) | = యంత్రంతో ఉన్న బొమ్మల వలే; |
| ఈశ్వరః | = అంతర్యామి; | భ్రామయన్ | = త్రిప్పుతూ (నియమిస్తూ); |
| మాయయా | = మాయ చేత; | సర్వభూతానామ్ | = జీవులందరి; |
| సర్వభూతాని | = దేహాభిమానులైన జీవులందరిని; | హృద్దేశే | = హృదయంలో; |
| | | తిష్ఠతి | = వెలయుచున్నాడు. |

**తా॥** (పై రెండు శ్లోకాలలో సాంఖ్యమతానుసారం, ప్రకృతి-స్వభావ-కర్మ పారతంత్ర్యాలు చెప్పబడ్డాయి. ఇప్పుడు స్వాభిప్రాయాన్ని చెబుతున్నాడు :) అర్జునా! అంతర్యామియైన నారాయణుడు సర్వజీవుల హృదయాలను అధిష్ఠించి, యంత్రపాంచాలికల వలే మాయతో వాటిని (దేహాభిమానులైన జీవులను) నియమిస్తున్నాడు.[1] 61

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।**
**తత్ప్రసాదాత్ పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62**

*తమ్, ఏవ, శరణమ్, గచ్ఛ, సర్వభావేన, భారత,*
*తత్ ప్రసాదాత్, పరామ్, శాంతిమ్, స్థానమ్, ప్రాప్స్యసి, శాశ్వతమ్.*

---

1. (అ) ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మ,
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ. - శ్వేతాశ్వతరోపనిషత్తు. 6-11.
(ఆ) య ఆత్మని తిష్ఠన్ ఆత్మానం, అంతరోయమయతి,
యం ఆత్మా న వేద, యస్య ఆత్మా శరీరం, ఏష తే ఆత్మా అంతర్యామ్య మృతః
- బృహదారణ్యకోపనిషత్తు , మధ్యందినపాఠః 3-7-22.
(ఇ) స్మృతేశ్చ. - వేదాంత సూత్రమ్. 1-2-6.

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా; | తత్ ప్రసాదాత్ | = ఆయన కృపవల్ల; |
| సర్వభావేన | = సర్వాత్మ భావంతో; | పరాం శాన్తిమ్ | = పరమశాంతిని; |
| తం ఏవ | = ఆ ఈశ్వరుణ్ణే; | శాశ్వతం స్థానమ్ | = మోక్షాన్ని; |
| శరణం గచ్ఛ | = శరణుపొందు; | ప్రాప్స్యసి | = పొందుతావు. |

**తా॥** (ఇలా జీవులందరూ పరమేశ్వర పరతంత్రులవడం వల్ల, అహంకారాన్ని పరిత్యజించి–) భారతా! సంసారార్తి నాశనం కొరకు నీవు సర్వాత్మ భావంతో ఈశ్వరుణ్ణే శరణుపొందు; ఆయన కృప వల్ల నీవు పరమశాంతిని (మోక్షాన్ని) పొందగలవు. 62

**ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యై తదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ 63**

ఇతి, తే, జ్ఞానమ్, ఆఖ్యాతమ్, గుహ్యాత్, గుహ్యతరమ్, మయా,
విమృశ్య, ఏతత్, అశేషేణ, యథా, ఇచ్ఛసి, తథా, కురు.

| | | | |
|---|---|---|---|
| ఇతి | = ఈ; | అశేషేణ | = సంపూర్ణంగా; |
| గుహ్యాత్ గుహ్యతరమ్ | = రహస్యం కంటే అత్యంత రహస్యమైన; | ఏతత్ | = దీనిని; |
| | | విమృశ్య | = వివేచన చేసి; |
| జ్ఞానమ్ | = గీతా తత్త్వం; | యథా | = ఏ విధంగా; |
| తే | = నీకు; | ఇచ్ఛసి | = కోరుతావో; |
| మయా | = నా చేత; | తథా | = ఆ విధంగానే; |
| ఆఖ్యాతమ్ | = చెప్పబడింది; | కురు | = చేయి. |

**తా॥** రహస్యమైన మంత్రయోగాల కంటే గుహ్యమైన ఈ గీతా–తత్త్వాన్ని నీకు చెప్పాను. దీనినంతటినీ బాగా ఆలోచించి, నీకు మంచిదని తోచినట్లుగా ఆచరించు. (ఇలా ఆలోచిస్తే నీ మోహం తొలుగుతుంది.) 63

**సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసి మే దృఢమితి[1] తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64**

---

1. దృఢమతిః – పాఠాంతరం

సర్వగుహ్యతమమ్, భూయః, శృణు, మే, పరమమ్, వచః,
ఇష్టః, అసి, మే, దృఢమ్, ఇతి, తతః, వక్ష్యామి, తే, హితమ్.

| | | | |
|---|---|---|---|
| సర్వ గుహ్యతమమ్ | = పరమరహస్యమైన; | ఇష్టః | = ప్రియతముడవు; |
| మే | = నా; | అసి | = అవుతావు; |
| పరమమ్ | = శ్రేష్ఠమైన; | ఇతి తతః | = ఈ కారణం వల్ల; |
| వచః | = వాక్యాన్ని; | తే | = నీకు; |
| భూయః | = మళ్ళీ; | హితం | = హితాన్ని (పురుషార్థ ప్రాప్తి ఉపాయాన్ని); |
| శృణు | = విను; | వక్ష్యామి | = చెబుతున్నాను. |
| మే | = నాకు; | | |
| దృఢమ్ | = నిశ్చయంగా; | | |

**తా॥** (అతిగంభీరమైన గీతాశాస్త్రాన్ని తానే సంగ్రహం చేసి చెబుతున్నాడు.) సర్వ గుహ్యతమమైన నా వాక్యాల్ని విను; నీవు నాకు అత్యంత ప్రీతి పాత్రుడవని, నీ హితాన్ని (పురుషార్థ-ప్రాప్తి ఉపాయాన్ని, సర్వప్రమాణోపేతమైన దానిని నిశ్చయించి) చెబుతున్నాను. 64

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65**

మన్మనాః, భవ, మద్భక్తః, మద్యాజీ, మామ్, నమస్కురు,
మామ్, ఏవ, ఏష్యసి, సత్యమ్, తే, ప్రతిజానే, ప్రియః, అసి, మే.

| | | | |
|---|---|---|---|
| (నీవు) మన్మనాః | = మద్గత చిత్తుడవూ; | (నేను) తే | = నీకు; |
| మద్భక్తః | = నా భక్తుడవూ; | సత్యమ్ | = సత్యాన్ని; |
| మద్యాజీ | = నన్ను పూజించేవాడవూ; | ప్రతిజానే | = ప్రతిజ్ఞా పూర్వకంగా చెబుతున్నాను; |
| భవ | = కమ్ము; | | |
| మామ్ | = నాకు; | (ఏలనన, నీవు) | |
| నమస్కురు | = నమస్కరించు; | మే | = నాకు; |
| మామ్ ఏవ | = నన్నే; | ప్రియః | = ప్రియమైనవాడవు; |
| ఏష్యసి | = పొందుతావు; | అసి | = అయి ఉన్నావు. |

**తా॥** నీవు మనస్సును నాయందు నిలుపు,[1] నా భక్తుడవుకమ్ము,[2] నన్ను పూజించు,[3] నాకు నమస్కరించు,[4] నీవు నాకు అత్యంత ప్రీతిపాత్రుడవు, కనుక నేను సత్యప్రతిజ్ఞా పూర్వకంగా చెబుతున్నాను, ఈ రీతిగా నీవు నన్ను పొంద గలవు.[5] 65

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66**

సర్వధర్మాన్, పరిత్యజ్య, మామ్, ఏకమ్, శరణమ్, వ్రజ,
అహమ్, త్వా, సర్వపాపేభ్యః, మోక్షయిష్యామి, మా, శుచః.

| | | | |
|---|---|---|---|
| సర్వధర్మాన్ | = ధర్మాధర్మ అనుష్ఠానాల నన్నింటిని; | శరణం వ్రజ | = ఆత్మరూపంలో ఆశ్రయించు; |
| పరిత్యజ్య | = త్యజించి; | అహమ్ | = నేను; |
| మామ్ | = గర్భ-జన్మ-జరా-మృత్యు వర్జితుణ్ణి, సర్వాత్ముణ్ణి, పరమేశ్వరుణ్ణి అయిన నన్ను; | త్వా | = (ఇలా నిశ్చిత బుద్ధివైన) నిన్ను; |
| | | సర్వపాపేభ్యః | = ధర్మాధర్మబంధ రూప పుణ్యాపాపాల నుండి; |
| ఏకమ్ | = ఒక్కనినే; | మోక్షయిష్యామి | = ముక్తుణ్ణి చేస్తాను; |
| | | మా శుచః | = శోకించకు. |

1. ఎందుకంటే– స్మర్తవ్యః సతతం విష్ణుర్విస్మర్తవ్యో న జాతుచిత్ ।
సర్వే విధినిషేధాః స్యురేతయో రేవ కింకరాః ॥
భగవంతుణ్ణి నిరంతరం స్మరించవచ్చు; విధినిషేధాలన్నీ దీని కింకరులే!
– భక్తి రసామృత సింధుః.

2. భక్తుడవైన ఫలమేమిటి అని అంటే–
నిత్యోత్సవో భవేత్తేషాం నిత్యశ్రీర్నిత్యమంగళమ్,
యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనమ్ హరిః. – ప్రపన్న గీత. *44*

3. నిన్నే పూజించడం ఏందుకు అంటావా :
ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః
ఇదమేవం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా. – ప్రపన్న గీత. *73*

4. నమస్కార ఫలం :
ఏకోఽ పి కృష్ణస్య కృతః ప్రణామో, దశాశ్వమేధావభృథేన తుల్యః,
దశాశ్వమేధీ పునరేతి జన్మ, కృష్ణ ప్రణామీ న పునర్భవాయ. – ప్రపన్న గీత. *13*

5. ఏ విధంగా అంటే :
కృష్ణేరతాః కృష్ణమనుస్మరంతి, రాత్రౌ చ కృష్ణం పునరుత్థితా యే,
తే భిన్న దేహాః ప్రవిశంతి కృష్ణం, హవిర్యథా మంత్ర హుతం హుతాశే. – ప్రపన్న గీత. *11*

**తా॥** సమస్త ధర్మ-అధర్మాల[1] అనుష్ఠానాన్ని పరిత్యజించి, గర్భ-జన్మ జరా-మృత్యు వర్జితుణ్ణి, సర్వాత్మణ్ణి, పరమేశ్వరుణ్ణి అయిన నన్ను ఒక్కణ్ణే ఆత్మరూపంలో ఆశ్రయించు; నేను కాకుండా మరేదీ లేదనే దృఢ నిశ్చయుడవు కమ్ము. ఇటువంటి నిశ్చితబుద్ధి గల నీకు నేను, నా స్వరూపాన్ని ప్రకటించి ధర్మాధర్మ బంధనాలైన పుణ్య పాపాల నుండి[2] నిన్ను ముక్తుణ్ణి చేస్తాను. కనుక, శోకించకు.[3]

(*గీత.* 10-11, 4-36; *శ్రీమద్భాగవతమ్.* 11-12-14,15 చూ.) 66

**ఇదం తే నాతపస్కాయ నా భక్తాయ కదాచన ।**
**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥ 67**

*ఇదమ్, తే, న, అతపస్కాయ, న, అభక్తాయ, కదాచన,*
*న, చ, అశుశ్రూషవే, వాచ్యమ్, న, చ, మామ్, యః, అభ్యసూయతి.*

| | | | |
|---|---|---|---|
| ఇదమ్ | = ఈ గీతాశాస్త్రం; | మామ్ | = నన్ను (మనుష్యునిగా తలచి); |
| అతపస్కాయ | = తపోరహితునికి; | అభ్యసూయతి | = ద్వేషిస్తాడో వాడికి; |
| అభక్తాయ | = భక్తుడు కానివాడికి; | తే | = నీకు (నీ చేత); |
| అశుశ్రూషవే చ | = వినగోరని వాడికి; | కదాచన | = ఎప్పుడూ; |
| యః | = ఎవడు; | న వాచ్యం | = చెప్పబడదగింది కాదు. |

1. (అ) ధర్మాలు = వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు, సామాన్యధర్మాలు. - మధుసూదన సరస్వతి.
(ఆ) అధర్మం = నావిరతో దుశ్చరితాన్నా శాంతో నాసమాహితః।
నాశాంతమానసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్॥ - కఠోపనిషత్తు. 1-2-24
(ఇ) ధర్మ-అధర్మాల అభిమానం ఉన్న వాడికి కూడా ఈ జ్ఞానం లభించదు.
2. పాపం బంధం అయిన విధంగానే, పుణ్యం కూడా ఆత్మకు బంధమే.
3. (అ) సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వదా తస్మై దదా మ్యేతద్వ్రతం మమ॥ - రామాయణమ్.
(ఆ) ఆనుకూలస్య సంకల్పః ప్రాతికూల్య వివర్జితమ్।
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వే వరణం తథా।
తత్రిక్రయావిని క్షేపః షడ్విధాశరణాగతిః॥ - హరిభక్తి విలాసమ్. *11.*
(ఇ) త వా స్మీతి భజ త్యేక స్త్వ మే వా స్మీతి చాపరః।
ఇతి కించిద్ విశేషే పి పరిణామః సమో ద్వయోః॥ - బోధసారః. 32-23
(ఈ) తస్యై వాహం మ మై వాసౌ స ఏ వాహ మితి త్రిధా।
భగవచ్ఛరణత్వం స్యాత్ సాధనాభ్యాస పాకతః॥ - భక్తిరసాయనమ్.

**తా॥** (శాస్త్రసంప్రదాయ ప్రవర్తనా నియమం ఏమంటే :) సంసారశాంతికై నీకు ఉపదేశించిన ఈ గీతాశాస్త్రాన్ని తపోరహితునికి చెప్పకూడదు. తపస్వియే అయినప్పటికీ గురుభక్తి, ఈశ్వరభక్తి లేకపోతే చెప్పవద్దు. భక్తుడూ తపస్వి అయినా వినగోరకపోతే చెప్పకు. వాసుదేవుడనైన నన్ను సామాన్యమానవునిగా తలచి, నా ఈశ్వరత్వాన్ని అంగీకరించని వాడికి కూడా చెప్పవద్దు. భగవద్ద్వేష శూన్యుడూ, తపస్వి, భక్తుడూ, శ్రవణాసక్తుడూ అయిన వాడికి మాత్రమే చెప్పవలెను. 67

**యఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్య త్యసంశయః ॥ 68**

*యః, ఇమమ్, పరమమ్, గుహ్యమ్, మద్భక్తేషు, అభిధాస్యతి,*
*భక్తిమ్, మయి, పరామ్, కృత్వా, మామ్, ఏవ, ఏష్యతి, అసంశయః.*

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు; | మయి | = నా యందు; |
| ఇమమ్ | = యథోక్తమైన; | పరాంభక్తిమ్ | = పరమ భక్తిని; |
| పరమంగుహ్యమ్ | = అతిరహస్యమైన గీతాశాస్త్రాన్ని; | కృత్వా | = చేసి; |
| | | అసంశయః | = సందేహరహితుడై; |
| మద్భక్తేషు | = నా భక్తులకు; | మామ్ ఏవ | = నన్నే; |
| అభిధాస్యతి | = వివరించి చెప్పునో; | ఏష్యతి | = పొందుతాడు. |
| (సః | = అతడు;) | | |

**తా॥** (యథోక్తుడైన అధికారికి గీతను ఉపదేశిస్తే ఫలమేమిటి అని అంటే:) (ఈ గీతాపఠన పాఠనాల వల్ల నేను భగవంతుణ్ణే సేవిస్తున్నాను అనే బుద్ధితో) ఎవరు ఈ గీతాశాస్త్రాన్ని నా భక్తులకు[1] వివరించి చెబుతాడో అతడు పరమభక్తిని పొంది, నిస్సంశయుడై నన్ను చేరుతాడు. 68

**న చ తస్మాత్ మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి ॥ 69**

---

1. భక్తి శబ్దం మళ్ళీ ప్రయోగింపబడడం వల్ల, భక్తి యొక్కటి ఉన్న గీతాశాస్త్ర–సంప్రదానానికి కర్తుడవుతాడు అని గ్రహించాలి.

2. యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితాహ్యర్థా ప్రకాశంతే మహాత్మనః ॥ – శ్వేతాశ్వతరోపనిషత్తు 6–23.

న, చ, తస్మాత్, మనుష్యేషు, కశ్చిత్, మే, ప్రియకృత్తమః,

భవితా, న, చ, మే, తస్మాత్, అన్యః, ప్రియతరః, భువి.

| | | | |
|---|---|---|---|
| మనుష్యేషు | = మనుష్యులలో; | కశ్చిత్ | = ఎవరూ కూడా; |
| తస్మాత్ చ | = అతని కంటే (గీతా వ్యాఖ్యాత కంటే); | న | = లేడు; |
| | | తస్మాత్ | = అతని కంటే; |
| భువి | = జగత్తులో; | అన్యః | = మరి ఇతరులెవరూ; |
| మే | = నాకు; | మే | = నాకు; |
| ప్రియకృత్తమః | = అధికంగా ప్రియం చేకూర్చే వాడు; | ప్రియతరః చ | = ప్రియతరుడు; |
| | | న భవితా | = ఉండబోడు. |

**తా॥** ఈ విధంగా గీతోపదేశం ఒనర్చేవాడి కంటే ప్రియతముడు నాకు ఈ జగత్తులో లేడు; అతని కంటే ప్రియమైన వాడు ఇకముందు కూడా ఉండబోడు.

**అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।**
**జ్ఞానయజ్ఞేన తేనాహం ఇష్టఃస్యామితి మే మతిః ॥ 70**

*అధ్యేష్యతే, చ, యః, ఇమమ్, ధర్మ్యమ్, సంవాదమ్, ఆవయోః,*

*జ్ఞానయజ్ఞేన, తేన, అహమ్, ఇష్టః, స్యామ్, ఇతి, మే, మతిః.*

| | | | |
|---|---|---|---|
| యః చ | = మరియూ ఎవడు; | అహమ్ | = నేను; |
| ఆవయోః | = మన ఇరువురి; | జ్ఞాన యజ్ఞేన | = జ్ఞానయజ్ఞం చేత; |
| ఇమమ్ | = ఈ; | ఇష్టః | = పూజితుణ్ణి; |
| ధర్మ్యమ్ | = ధర్మ విషయమైన; | స్యామ్ | = అవుతాను; |
| సంవాదమ్ | = సంవాదాన్ని; | ఇతి | = అని; |
| అధ్యేష్య తే | = అధ్యయనం ఒనర్చునో; | మే | = నా; |
| తేన | = అతని చేత; | మతిః | = నిశ్చయం. |

**తా॥** మరియు, ఎవరు మన ఈ ధర్మసంవాదాన్ని జపరూపంలో పఠిస్తున్నాడో, అతడు నన్ను సర్వయజ్ఞాలలో శ్రేష్ఠమైన జ్ఞాన-యజ్ఞం[1] చేత అర్చిస్తున్నాడు అని నా అభిప్రాయం. 70

1. విధి-జప-ఉపాంశు-మానసం అని యజ్ఞం నాలుగు విధాలు. విధి-యజ్ఞం వేదాలు విధించే యజ్ఞకర్మ; ఇతరులకు వినబడేటట్లు ఒనర్చబడే మంత్రోచ్చారణ జపయజ్ఞం. ఉపాంశువు, కేవలం స్వశ్రవణ గోచరమైనది. మానసమైనది జ్ఞానయజ్ఞం; కనుక ఇదే శ్రేష్ఠం.

**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్॥ 71**

*శ్రద్ధావాన్, అనసూయః, చ, శృణుయాత్, అపి, యః, నరః,*
*సః, అపి, ముక్తః, శుభాన్, లోకాన్, ప్రాప్నుయాత్, పుణ్యకర్మణామ్.*

| | | | |
|---|---|---|---|
| శ్రద్ధావాన్ | = శ్రద్ధాయుక్తుడూ; | సః అపి | = అతను కూడా; |
| అనసూయః చ | = అసూయా రహితుడూ; | ముక్తః | = ముక్తుడై; |
| యః | = ఏ; | పుణ్య కర్మణామ్ | = అగ్నిహోత్రాది పుణ్యకర్మలు ఒనర్చేవారి; |
| నరః | = మనుష్యుడు; | శుభాన్ లోకాన్ | = పుణ్యలోకాలను; |
| శృణుయాత్ అపి | = అర్థజ్ఞానం లేకపోయినా కేవలం వింటాడో; | ప్రాప్నుయాత్ | = పొందుతాడు. |

**తా॥** (తాను స్వయంగా పఠించలేకపోయినా, ఇతరులు పఠించే దానిని అర్థం తెలియకపోయినా, ఎందుకు ఇంత బిగ్గరగా కష్టపడి ఆపకుండా చదువుచున్నాడు అని-) విద్వేషించకుండా శ్రద్ధాన్వితుడై గీతను వినేవాడు కూడా, (అశ్వమేధాది) పుణ్యకర్మలు ఒనర్చేవారికి ప్రాప్యములైన శుభలోకాలను (స్వర్గాన్ని) పొందుతాడు.[1] 71

**కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చిదజ్ఞానసంమోహః ప్రనష్టస్తే ధనఞ్జయ ॥ 72**

*కచ్చిత్, ఏతత్, శ్రుతమ్, పార్థ, త్వయా, ఏకాగ్రేణ, చేతసా,*
*కచ్చిత్, అజ్ఞానసంమోహః, ప్రణష్టః, తే, ధనంజయ.*

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా; | ఏతత్ | = ఇది; |
| త్వయా | = నీ చేత; | శ్రుతం కచ్చిత్ | = వినబడిందా; |
| ఏకాగ్రేణ చేతసా | = నిశ్చల మనస్సుతో; | ధనఞ్జయా | = అర్జునా; |

1. పఠించే వానికి, వినే వానికి అర్థం తెలియకపోయినా, వారు భక్తితో నన్నే తలుస్తున్నారు. లోకంలో ఎవరైనా ఒకరిని పేరుపెట్టి పిలిస్తే, అతడు పిలిచినవాడి వద్దకు వెళుతున్నాడు. అలాగే నేను కూడా, అజామీళ ధ్రువాదులు నా నామాన్ని ఉచ్చరించినంతనే ప్రసన్నుడనైన రీతిగా, వీరికి కూడా ప్రసన్నుడను అవుతానని భావం. – శ్రీధరస్వామి.

| | | | |
|---|---|---|---|
| తే | = నీ; | ప్రనష్టః కచ్చిత్ | = తొలగిందా. |
| అజ్ఞాన సమ్మోహః | = అజ్ఞాన జనిత మోహం; | | |

**తా॥** (విన్నది చక్కగా గ్రహిస్తున్నాడా? లేదా? అని ప్రశ్నిస్తున్నాడు; తెలియకపోతే మళ్ళీ ఉపదేశిస్తానని భావం. ఇలా మళ్ళీ మళ్ళీ ఉపదేశించి శిష్యుణ్ణి కృతార్థుణ్ణి చేయడం ఆచారధర్మం అని సూచన.) పార్థా! దీనిని నీవు ఏకాగ్రచిత్తంతో విన్నావు కదా? అజ్ఞాన జనితమైన నీ మోహం వినష్టమైనదా? అలా కాకుంటే మళ్ళీ చెబుతాను. 72

*అర్జున ఉవాచ :*

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।**
**స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ ॥ 73**

*నష్టః, మోహః, స్మృతిః, లబ్ధా, త్వత్ ప్రసాదాత్, మయా, అచ్యుత, స్థితః, అస్మి, గత సందేహః, కరిష్యే, వచనమ్, తవ.*

| | | | |
|---|---|---|---|
| అచ్యుత | = కృష్ణా; | లబ్ధా | = పొందబడింది; |
| త్వత్ ప్రసాదాత్ | = నీ కృప వల్ల; | గత సందేహః | = సంశయరహితుడనై; |
| మోహః | = అజ్ఞానం; | స్థితః అస్మి | = ఉన్నాను; |
| నష్టః | = తొలగింది; | తవ | = నీ; |
| మయా | = నా చేత; | వచనం | = ఉపదేశాన్ని; |
| స్మృతిః | = ఆత్మతత్త్వ విషయ స్మృతి; | కరిష్యే | = పాటిస్తాను. |

**తా॥** (కృతార్థుడై) అర్జునుడు పలికెను : అచ్యుతా! నీ కృప వల్ల నా మోహం వినష్టమైంది. పరమాత్మ విషయకమైన స్మృతి[1] లభించింది. సందేహ రహితుడనైయ్యాను.[2] నీ ఉపదేశాన్ని పాటిస్తాను.[3] (యుద్ధం చేస్తాను) 73

---

1. ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః స్మృతి లంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః
– ఛాందోగ్యోపనిషత్తు. 7-26-2.

ఆహారశుద్ధివలన సత్త్వశుద్ధియును దీనివలన ధ్రువస్మృతియును కలుగును, ఈ స్మృతివలన హృదయగ్రంథులు (సందేహములు) అన్నియును ఛిన్నములగును.

2. సందేహ రాహిత్యమూ, భయ రాహిత్యమూ ముక్తపురుషుని ముఖ్యలక్షణాలు. ఈ విషయాన్నే →

సఞ్జయ ఉవాచ :

**ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।**
**సంవాదమిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్ ॥ 74**

ఇతి, అహమ్, వాసుదేవస్య, పార్థస్య, చ, మహాత్మనః,
సంవాదమ్, ఇమమ్, అశ్రౌషమ్, అద్భుతమ్, రోమహర్షణమ్.

| | | | |
|---|---|---|---|
| అహమ్ | = నేను; | ఇమమ్ | = ఈ; |
| ఇతి | = ఇలా; | రోమ హర్షణమ్ | = రోమాంచకరమూ; |
| మహాత్మనః | = మహాత్ముడైన; | అద్భుతమ్ | = విస్మయకరమూ అయిన; |
| వాసుదేవస్య | = వాసుదేవుని యొక్క; | సంవాదమ్ | = సంభాషణను; |
| పార్థస్య చ | = అర్జునుని యొక్క; | అశ్రౌషమ్ | = విన్నాను; |

**తా॥** (ధృతరాష్ట్రునికి శ్రీకృష్ణార్జున సంవాదాన్ని వినిపించి, దానిని ఉపసంహరిస్తూ) *సంజయుడు పలికెను :* విస్మయకరమూ, రోమహర్షణకరమూ అయిన శ్రీకృష్ణార్జునుల సంవాదాన్ని నేను ఇలా విన్నాను- 74

**వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యా మహం పరమ్ ।**
**యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్కథయతః స్వయమ్ ॥ 75**

వ్యాసప్రసాదాత్, శ్రుతవాన్, ఏతత్, గుహ్యమ్, అహమ్, పరమ్,
యోగమ్, యోగేశ్వరాత్, కృష్ణాత్, సాక్షాత్, కథయతః, స్వయమ్.



ఉపనిషత్తులు 'భిద్యంతే సర్వసంశయాః' (ముండకోపనిషత్తు2-28) అని, 'అభయంవై జనకప్రాప్తోసి' (బృహదారణ్యకోపనిషత్తు 4-2-4) అని ఘోషిస్తున్నాయి. సందేహరహితుడైన వాడు అభయస్థితిని పొందగలడనే సంగతి, భయగ్రస్తుడై యుద్ధం చేయడానికి నిరాకరించిన అర్జునుడు 'కరిష్యే వచనం తవ' అని యుద్ధం ఒనర్చినందు వల్ల తెలుస్తుంది.

3. దీనితో గీతాశాస్త్రం పూర్తి అయ్యింది. మిగిలినది మహాభారత కథతో గీతకు గల సంబంధాన్ని ప్రదర్శిస్తోంది.

శంకరమతంలో జ్ఞానం ఉపేయం, భక్తి ఉపాయం; శ్రీధరస్వామి జ్ఞానాన్ని భక్తి యొక్క అవాంతర వ్యాపారంగా గ్రహించారు. ఇది కేవలం శాబ్దికమైన భేదమే. వాస్తవానికి శుద్ధజ్ఞానం, శుద్ధ భక్తి రెండూ ఒక్కటే అని శ్రీరామకృష్ణ పరమహంస పరశ్శతంగా చెప్పి ఉన్నారు.

